సమీక్షలు 5.

"కవి సమ్రాట్"

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, ఎమ్. ఏ., సంఖ్య..........

(ప్రిన్సిపలు, కరీంనగరు కళాశాల) తేదీ....................

'రామాయణ కల్పవృక్షము, ఆంధ్ర ప్రశస్తి, వేయిపడగలు' ఇత్యాది కావ్యకర్త.

"*Kavi Samrat*"

Sri Viswanadha Satyanarayana Garu, M. A.

Principal, Karimnagar College.

Author of 'Ramayana Kalpa Vruksha', etc.

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు రచించిన రామాయణ బాలకాండము చదివి ఆనందించితిని. ఇందు శ్రీరామజననము మొదలు సీతాకల్యాణము వఱకు గల కథ వర్ణింపబడినది. మొదటి ఆశ్వాసమున "మానిషాద" శ్లోకమునకు చేయబడిన వ్యాఖ్యానము రమ్యముగా నున్నది. విశ్వామిత్రయాగసంరక్షణము, అహల్యా శాపవిమోచనము, శివధనుర్భంగము, పరశురామగర్వము మొదలైన ఘట్టములు రసవంతములై మనోహరముగా నున్నవి. ఆశ్వాసాంతములం దాచార్యులుగారు సంప్రదాయమునకు భిన్నముగా బహు పద్యములు వ్రాసిరి. వీనిలో వారి భక్తి సర్వతోముఖముగా గోచరించుచున్నది. ఆచార్యులుగారి శైలి ప్రసన్నమై, మధురమై, సర్వజనసుబోధకముగా నున్నది. శిష్టకాండములనుకూడ వారచిరకాలముననే రచించి ప్రకటింతురుగాక.

కరీంనగరము, 25–2–60. —విశ్వనాథ సత్యనారాయణ

---

(24 వ పేజీ తరువాయి)

యపూర్వానుభూతిని గలిగించుచున్నవి ఆత్మాశ్రయములైన యా పద్యము లందచందములలో "దాశరథీశతక" పద్యముల కెనవచ్చుచున్నవి.

ఆచార్యులవారి శైలి మృదుమధురమైనది. వారు రసౌచిత్యములకొఱకే కాని పాండితీప్రదర్శనముకొఱ కెక్కడను యత్నింపరు. అందుచేఁ బద్యము లన్నియు నతిసహజములై నిసర్గభారాకోమలములై ముద్దు లొలుకుచున్నవి. భక్తితత్త్వము, జ్యోతిషము, మున్నగు విషయములు ప్రసక్తానుప్రసక్తముగా నుచితరీతి ప్రపంచింపఁబడినవి. వారి భాషయు భావములును బ్రసన్నములైనవి. ఈ సీతారామము పఠించిన తరువాత బాలోత్తరకాండముల నడిమి రామాయణ కథ నాచార్యోక్తము నెప్పుడు చదువుదుమా యని పాఠకు లువ్విళ్ళూరుట సహజము. శ్రీమదాచార్యులవారు వారి ఆ ఆత్రము నచిరకాలమునఁ దీర్తురుగాక.

హైదరాబాదు, 5–2–60. —దివాకర్ల వేంకటావధాని.

## సమీక్షలు 6.

శ్రీ సన్నిధానము సూర్య
నారాయణశాస్త్రిగారు, పి. ఓ. యల్.
( సంస్కృతాంధ్రాధ్యాపకులు )
రాజాబహద్దూర్ వెంకట రామరెడ్డి
స్త్రీ కళాశాల, హైదరాబాదు.
(జాతక కథాగుచ్ఛము, కథా కదంబము, రామదానం, త్రికము, తత్సమ చంద్రిక ఇత్యాది సంస్కృతాంధ్ర గ్రంథకర్తలు.)

**Sri Sannidhanam Surya narayana Sastrygaru,**
P. O. L.
( Telugu and Sanskrit Lecturer )
Raja Bahadur Venkatarama Reddy Women's College,
(Author of Jataka Kadha guchhamu-Tachama chandrica etc. in Telugu and Sanskrit.)

పూజ్యమిత్రులు ఆత్మకూరి గోవిందాచార్యులవారు రచించిన గోవింద రామాయణము(సీతారామం) నామూలాగ్రముగాఁ బరికించితిని. ఇది రసవత్కావ్యమన్న నొక్కమాట చాలును.

ఏఘట్టముచదివినను రసముచిప్పిలుచున్నది. ధార గంగాలహరివలె స్వచ్ఛము వేగవంతమునై యున్నది. అభ్యాసమున నున్న యుత్పల చంపకాదుల వలెనే మాఱుమూల నున్న వృత్తములును గుంటువడకుండ నడచినవి. చేయి బాగుగాఁ దిరిగినది. కావ్యశిల్పమున సిద్ధహస్తుఁడు.

ఈకవి దేశభక్తుఁడు; రామభక్తుఁడు; భాషా భక్తుఁడు. దేశభక్తుఁడై యద్వితీయమగు దేశసేవ సేసినాఁడు. రాజకీయము లగు పెక్కు గ్రంథములను రచించి రాజ్యతంత్రవేత్తల మెప్పు

## సమీక్షలు 7.

డాక్టరు బి. రామరాజుగారు,
ఎమ్. ఏ. పిహెచ్. డి.
రీడరు, ఆంధ్రశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము
'జానపదగేయములు' ఇత్యాది గ్రంథకర్త.

**Dr. B. Ramaraju Garu,**
M. A., Ph. D.,
Reader in Telugu Department,
Osmania University.
Author of 'Janapada Geyamulu' etc.

మీరు దయతో పంపిన రామాయణమును భక్తితో చదువుకొన్నాను. మీ కంటె అన్ని విధముల చిన్నవాడనైన నేను మీ రచనలను గూర్చి అభిప్రాయమును వెలిబుచ్చుట కనర్హుడను. మీ కోరికను ఆజ్ఞగా శిరసావహించుచున్నాను. మీది ఋషితుల్యమైన రచనము; భక్తిరస సంభరితము. ధారాశుద్ధియు, సరళసుందర భాషయు మీ రచనకు ప్రత్యేక సంపదలు.

9-2-1960. —బి. రామరాజు

---

వహించినాఁడు. ఇప్పుడు సర్వాంగ సుందరమైన రామాయణము రచించి, యుత్తమకవిగాఁ బండితుల మన్ననలను వహించినాఁడు. ఎల్లవిధములఁ దనజీవితమును ధన్యము గావించుకొనినాడు.

శ్రీరామచంద్రుఁ డీ కవి కాయురారోగ్య భాగ్యముల నొసగి మరియు భాషాసేవ సేయునవకాశముఁ గలిగింపఁ గోరుదును.

సికింద్రాబాదు, —సన్నిధానము
15-2-60. సూర్యనారాయణశాస్త్రి

సమీక్షలు 8.

శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు,
దేవాదాయ, ధర్మాదాయ, సహకార
శాఖామాత్యులు, ఆంధ్రప్రదేశ్.
'రామాయణ సుధాలహరి', 'ప్రాచీన భారతీయ వైభవం', 'వేదామృతం' ఇత్యాది సద్గ్రంథకర్త.

**Sri Kalluri Chandramouli Garu,**
Minister for Religious and Charitable Endowments, and Co-operation, Andhra Pradesh.

AUTHOR OF :
'Ramayana Sudhalahari', 'Prachina Bharatiya Vaibhavam', 'Vedamrutam' etc.

ఎవ రెన్ని విధముల సీతారాముల గాథను రచియించినను నది మధురముగనే యుండును. తన సహజ వికాసమును విదిలించుచునే యుండును. మిత్రులు, శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులచే రచియింపబడిన 'సీతారామమ్' అను పద్యకావ్యము భాషా సరళతను, భావ సౌష్ఠవమును వెలార్చుచున్నది. మధుర రసమును స్రవించుచు పాఠకుల కానందమును గూర్చు యీ గ్రంథ మమూల్యము. పద్యముల నడక సహజము.

అహల్యా శాపవిమోచనము, సీతా కళ్యాణము మున్నగు ఘట్టములను పాఠకులు చదివి తరించవలసినదే. ఇందు ముఖ్యముగా పాత్రపోషణము, కథాగమనము, పవిత్ర వాతావరణమును సృష్టించి, పాఠకుల నోలలాడించుచుండును. ఇట్టి చక్కని పద్యకావ్యమును ఆంధ్రలోకమున కందించిన శ్రీ గోవిందాచార్యులుగారి జీవితము ధన్యము.

ఆంధ్రులీ గ్రంథము నభిమానముతో పఠించి, ఆదరింతురు గాక !

హైద్రాబాదు,
22-2-1960. —కల్లూరి చంద్రమౌళి

సమీక్షలు 9.

ఆచార్య
శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు
తృణకంకణం, కష్టకమల, రమ్యాలోకం, లలిత. ఇత్యాది కావ్యకర్త.

**Prof. R. Subbarao Garu**
Truna Kankanam, Kashta Kamala, Ramyalokam, Lalitha. etc.

శ్రీమాన్ గోవిందాచార్యులవారి రచనలమీద అభిప్రాయాలు వ్రాయడం అవివేకమో అహంకారమో అవుతుందని నా భావము. తిరుపతి దివ్యక్షేత్ర మన్నట్లూ-ఒంగోలు ఆవులు పాలభాన లన్నట్లూ ఉంటుంది ఆ పని. అయినా నేడు ఇది నాగరకలాంఛన మయింది.

గోవిందాచార్యులవారు సుప్రసిద్ధ రచయితగా ప్రకాశించారు. దేశారాధకుడుగా కృతకృత్యుడయినాడు. వారి రచనలు భాషలో బాగా పరిచితములైనవి. వాఙ్మయంగా నిలిచినవి. నిలుస్తవి. అయితే, ఆనాడు ఆర్థిక తంత్రాలను, రాజనీతి సూత్రాలను తెనుగులో తేటగా ప్రసారించారు. నేడు రామాయణమును రమ్యాక్షరపరాయణంగా రచించారు. ఆదాయ వ్యవహారాలకు సంబంధించిన ప్రక్రియా విజ్ఞానం వేఱు. ఆనందంకోసం జరిపే సారస్వత సవనం వేఱు. మొదటిదానిలో మేధాచయనం, రెండవదానిలో రసోపాసన

(మిగతా 28 వ పేజీలో చూడుడు.)

ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు,
( ఆంధ్ర సారస్వత శాఖాధ్యక్షులు )
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.
'ఆంధ్ర సాహిత్య చరిత్రము', 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' ఇత్యాది గ్రంథకర్తలు.

Sri Khandavalli Lashkmiranjanam Garu, M. A.
( Head of the Telugu Department )
Osmania University, HYDERABAD.
Author of : Andhra Sahitya Charitra; Andhra History etc.

దేశభక్తాగ్రేసరులుగ కీర్తి గాంచి, నేడు భక్తాగ్రేసరులుగ శేషజీవితమును గడుపుచున్న శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు వ్రాసిన గోవింద రామాయణము 'బాలకాండ'ను చదివి పుణ్యవంతుడనైతిని. వీరు తిరిగి రామాయణము వ్రాయు శ్రమ కేల పాల్పడిరని ప్రశ్నించుట రామాయణముచే ప్రభావితులు కానివారు చేయవలసిన పని. వాల్మీకి మహర్షిచే సవిస్తారముగ గానము చేయబడిన రామకథా కల్లోలినిలోనికి మనము దిగవచ్చునా యని కాళిదాసాదులకే సందేహము జనించినది. ఆ మహాకవి ఎట్లో సమాధానము చెప్పుకున్నాడు "అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్పూర్వసూరిభిః । మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః". నిర్వచనోత్తరరామాయణమును రచింప బూనిన తిక్కనామాత్యునకును ఈ ప్రశ్నయే కలిగినది. రామాయణ కల్పవృక్షము వ్రాయదలచిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ముందు కూడ ఈ శంకయే తలయెత్తినది. రామాయణమహత్వ మెట్టిదో కాని వీరిలో నొక్కరును సంశయాత్ములై తమ ప్రయత్నములనుండి విరమింపలేదు. గోవిందాచారిగారిని కూడ ఈ ప్రశ్న వెంటాడకపోలేదు. దీనికి వారు సవిస్తరముగ సమాధానమును నివేదించిరి. రామాయణపునారచనముచే తాము వాల్మీకిభాస్కరాదిమహాకవులను మించిపోగల మను అహంకృతిచే కాదనియు, రామకథాసుధారస పానముచే తాము తరింపదలచితి మనియు ఆచార్యుల వారు హృదయభారముతో సెలవిచ్చియున్నారు.

---

(27 వ పేజీ తరువాయి)

కావాలె. ఈ రెండూ కూలంకషంగా ఉన్న కోవిదుడు గోవిందాచార్యుల వారు. అందువల్ల ఉభయతారక మయింది వారి జీవితప్రవాహం. ఆ దరిన సస్యశ్యామలమయితే ఈ దరిన పవిత్రతీర్థస్థాన మయిందిగదా గంగ.

—రాయప్రోలు సుబ్బారావు
లలితా కుటీర్, నెహ్రూనగర్,
సికింద్రాబాదు, 16–2–1960.

"భవబంధమ్ములఁ ద్రెంపి, యైహిక మనోభావంబులం జంపి లో
కవిశిష్టం బగు నిత్యసత్యపదవిం గర్మాత్ములం జేయు రా
ఘవు చారిత్రమె; యద్ది భక్తిరసయుక్తంబైన నద్దాన మా
నవలోకంబున కందరాని ఘనపుణ్యం బుండునే కోరుకోఁ"

కావున రామకథను వినుటకు భక్తు లగు మానవులకు విసువును లేదు. భక్తులగు కవులకు చర్వితచర్వణ చింతయును లేదు. రామాయణకథ ఆయా కవుల రచనలయందు వారి వారి భావవర్ణరంజిత మై క్రొంగ్రొత్త రూపముల నందుచునే యున్నది. దేవతలు శ్రీ మహావిష్ణువు నిట్లు స్తుతించి రని రఘువంశములో కలదు "రసాంతరా ణ్యేకరసం యథా దివ్యం పయోఽశ్నుతే । దేశే దేశే గుణే ష్వేవ మవస్థాస్త్వ మవిక్రియః". శ్రీరామకథ రసాంతరముల పొంద వచ్చును. కాని అది అవిక్రియము.

అయినచో "గోవింద" రామాయణమునందు రామకథ పొందిన జిలుగు రంగు లేమి?యని పరిశీలింపదగును. దీనిని వ్రాయుటలో కవియొక్క ప్రధాన లక్ష్య మేమి ? కవియే సమాధానించుచున్నాడు.

కవిజనమ్ములఁ బేరెక్కు కాంక్షగాదు
కాదు తృత్కథా రచనకుఁ గారణమ్ము
నీకుఁగా భక్తిమై వ్రాసి నేఁ దరింతుఁ
జదివి లోకులు దరియింత్రు జానకీశ !

ఆత్మోద్ధరణమునకును లోకకల్యాణమునకును ఉద్దేశింపబడిన రచన యిది యనుట తథ్యము. శ్రీరామచంద్రుని జీవిత మింతవఱకును కర్మయోగవ్యాఖ్యానముగ గాన్పించుచున్న దనియు, రామకథను తాము భక్తియోగవ్యాఖ్యానముగ సంతరింతు మనియు, ఆచార్యులవారి దీక్ష. ముఖ్యముగ విశిష్టాద్వైతధర్మము లయిన శరణాగతి, ప్రపత్తి, మున్నగు భక్తిద్వారములను రామాయణమునందు తెఱచి చూపించవలెనని గోవిందాచార్యులవారి ఆశయము. ఈ భావములను స్ఫురింపజేయుటకై వీరు విశ్వామిత్రయాగసంరక్షణ ఘట్టమునకు 'శరణాగతా శ్వాసము' అను పే రిడిరి.

శ్రీరాముని వృత్తాంతము ఆదర్శవీరుని సద్వృత్తముగా వాల్మీకి సంభావించెను. శ్రీరాముని దివ్యత్వమునుగూర్చి వాల్మీకమునందుగల కొన్ని కల్పనలు ప్రక్షిప్తము లని విజ్ఞులు చెప్పుదురు. ప్రాచేతసమహర్షి తరువాత శ్రీరాముని దివ్యేతరునిగ సందర్శించుటకు ఎవరికిని శక్తి చాలలేదు. కాళిదాసు నుండియు శ్రీరాముడు అవతారస్వరూపమే. పోయిన కొలదియు రామాయణమునందలి ఆదర్శమానవచిత్రణము వెనుకబడి, దివ్యత్వకల్పనము, ఆధ్యాత్మ చింతాప్రచ్ఛాదనము పుష్టిని చేకూర్చుకున్నవి. గోవిందాచార్యులుగారు

రామాయణకథను ఆధ్యాత్మప్రతీకగ సందర్శించినారు. సీతారాముల వియోగము, ఆత్మ పరమాత్మనుండి విశ్లేషము పొందుట వంటిది. క్రౌంచపక్షులకు నిషాదుని మూలమున గలిగిన వియోగము కూడ దీనినే యుపలక్షించు నని ఆచార్యులవా రన్వయించిరి. తన యంశ మైన యాత్మ తననుండి వేరయి ప్రకృతి మోహమున బడుటకు పరమాత్మయు చింతించునట. ఇదియే సీతా విషయక మైన శ్రీరాముని శోకము.

స్త్రీ యనెడి యాత్మ ప్రకృతి సంచితము కతన
జననమరణవిచారమ్ము గనఁగ పరుఁడు
దానఁబరిత ప్తుఁడై కృప నూను పగిది
గడకు పురుషుండు గుందు నీ కావ్యమందు.

ఇతివృత్తమునందు చెప్పదగిన మార్పులేవియు లేవు. వాల్మీకిభిన్నము లైన యొకటి రెండంశములను పురాణాంతరములనుండి గ్రహించి కాబోలు వీరిందు చొప్పించిరి. రావణకుంభకర్ణులకు చేదోడువాదోడుగ లోకమున ఐరావణమైరావణకథలు వ్యాప్తము లై యున్నవి. ఐరావణమైరావణులు, విష్ణుద్వారపాలకు లైన జయవిజయులచే శపింపబడిన అశ్వినీదేవత లను కథ యిందు చేర్పబడినది.

గోవిందరామాయణము రెండు కవితారీతుల సంగమముగా రూపొందుట యొక విశేషము. ఆశ్వాసారంభములందును ఆశ్వాసాంతములందును ఆత్మాశ్రయకవిత్వరీతి విపులముగ సంతరింపబడినది. రామకథాపరముగ కావ్యరీతిని, ఆత్మనివేదనమునకై శతక కవితారీతిని కవిగా రిందు జోడించిరి. భాస్కరాదుల కావ్యమార్గమును, భక్తశిఖామణి యైన కంచెర్ల గోపన్నగారి శతకమార్గమును తమ హృదయమునందు వీరు ప్రత్యక్షీకరించుకొనిరి. కానుల పురుషోత్తమకవి 'ఆంధ్రనాయక శతకము'నందువలె మనోజ్ఞమైన వ్యాజస్తుతి పద్యములను గోవిందాచార్యులుగారు తమ హృదయవేదన ప్రకటించుటకై రచించుకొనిరి.

"కావుము 'రామ! రామ!' యని గాత్రము చీలఁగఁ గీ ర్తిచేసినన్
బ్రోవవ? యెట్టివారికిని పుట్టెను పుట్టిన పుండు మానునే,
నీవ ఘనుండవా యనుచు, నిన్నెదిరించిన వారిఁ బ్రోచెదో
దేవర కేది పథ్యమొ యదే యొనరించెద నేటినుండియున్.

అని కవి శ్రీరాముని భంగించి, వెంటనే అనుతప్తు డై యిట్లు వేడుకొనెను.

ఏవేవో యనినాఁడ వేసరిలి న న్నేమందువో దేవరా
నీవే దక్షుడ వయ్య! భక్తతతి నెంతేఁ బ్రీతిఁ బ్రోవంగ, రా

సమీక్షలు 11.

శ్రీ కాటూరి
వేంకటేశ్వరరావుగారు,
తొలకరి, సౌందరనందము, పౌలస్త్య
హృదయము, గుడిగంటలు
ఇత్యాది కావ్యకర్తలు.

Sri Katuri
Venkateswararaogaru.
Author of Tolakari, Soundara-
Nandam, Poulastyahrudayam etc.

శ్రీ దేవులపల్లి వేంకట
కృష్ణశాస్త్రిగారు, బి. ఎ.,
ప్రొడ్యూసరు, ఎ.ఐ.ఆర్., హైదరాబాదు.
కృష్ణపక్షము. ప్రవాసము, వివిధగేయములు,
నాటికలు ఇత్యాది కావ్యకర్త.

Sri Devulapalli
Krishna Sastrygaru, B. A.
Producer, A. I. R., Hyderabad.
Author of
Krishna Paksham, Pravasam, songs etc.

శ్రీ గోవిందాచార్యులవారికి,

"ఎయ్యది సమానమగున్ రఘునాథు గాథకున్" అన్నారు మీరు. నిజమే. "నీకుగా భక్తిమై వ్రాసి నేదరింతు జానకీశ" అన్నారు. అదీ నిజమే. కాని మీ రామాయణగ్రంథం చదివినమీదట ఒక్కటే అసత్యవచనం కనిపించింది మీ మాటలలో. ఏమిటంటారా, "కవిజనమ్ముల బేరెక్కు కాంక్ష గాదు, త్వత్కథా రచనకు గారణమ్ము" అన్నారు. "వాల్మీకి హృదయంబునందు జొచ్చి" రచించిన మీ రామాయణంపట్ల ఆ మాట లగించదు. మీకు కాంక్ష ఉన్నా లేకున్నా కావ్యగుణం ప్రశస్తి కెక్కక తీరదు. అడుగడుగునా మీ రసభావపరతంత్రత కనిపిస్తూనే ఉంది. సరళ సుందరమైన వాల్మీకి రచనమందలి సౌలభ్యాన్ని పుడికి పుచ్చుకొన్నది మీ రామాయణం. ఆంధ్రరామాయణ శ్రేణిలో శ్రీ గోవింద రామాయణం సర్వవిధాల మన్నన కెక్కుతుంది. "రాఘవ దయా సుధాబ్ధియం దొక్క కణం చిల్కితే చాలు" నన్నారు మీరు. అదేమి మాట! రాఘవుల పరిపూర్ణానుగ్రహం మీయందు ప్రసరించింది. మీరు ధన్యులు.

హైదరాబాదు, —కాటూరి వేంకటేశ్వరరావు

8—3—1960. ——దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

---

(30 వ పేజీ తరువాయి)

మా! వాత్సల్యమునన్ గృపాపరుఁడవై ఆర్తున్ దయన్ జూడవే!
నీ వేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపంగదే రాఘవా!

శ్రీ గోవిందాచార్యులవారి శైలి నిజముగనే ద్రాక్షాపాకమై సహృదయుల నాకర్షింపగలిగి యున్నది. భవజలధిని దాటుటకు రామనామమను మహానౌక నధిరోహించి, ప్రపన్నులైన యితరులను రండో! రండో! యని ఉద్ఘోషించుచున్న ఆత్మకూరి గోవిందాచార్యకవి నిక్కముగా ధన్యుడుగదా!

విద్యానగర్, హైదరాబాదు, 16—2—1960. ——ఖండవల్లి లక్ష్మీరంజనం

సమీక్షలు 12.

'కవిసార్వభౌమ', 'మహోపాధ్యాయ', 'సాహిత్య సమ్రాట్',
'సాహిత్యాచార్య', 'కవీంద్ర'



శివ శంకరస్వామిగారు, బహుకావ్యకర్త

*Kavi Sarva Bhouma, Mahopadhyaya, Sahitya Samrat, Sahityacharya, Kavindra*

## Sri Siva Sankara Swamigaru

Author of many Poetical works

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారు పూర్వాచార్యసంప్రదాయసిద్ధమైన కుటుంబములోని వారు. వీరు చక్రవర్తి 'తిరుమఘునార్' తిరువారాధనమును నిత్యనియమముతో నెఱపువారు. శ్రీ సీతారామభక్తియుక్తమైన హృదయముతో శ్రీమద్రామాయణమును రచించిన వారు పూర్వమే 'గోవిందరామాయణ'మను పేర ఉత్తర కాండమును రచించి ప్రకటించి పలువుర మన్ననలకు పాత్రమైన వారు. ఇట్టివారు రామాయణరచనకు దొరకొనుటలో ఆశ్చర్యములేదు. రామనామస్మరణమున పుణ్యమూర్తి యగు వాల్మీకిని స్తుతించి 'దాసోఽహ' మన్నారు. భక్తాగ్రగణ్యు లగు పోతరాజు, గోపరాజు, త్యాగరాజులు తనను దీవింతురుగాక అని అభిలషించినారు. గీర్వాణాంధ్ర భాషలలో జానకీజాని చరిత్రను రచించిన సకల కవులను భక్తిపూర్వకముగా ప్రస్తుతింతు నన్నారు.

మరల రామాయణమా? అను ప్రశ్న బయలుదేరుట సహజము, కవి సమాధానము చెప్పుటయు సహజమే! ఆచార్యులవారు కూడ అట్టి ప్రశ్న నుద్ఘాటించి సమాధానము చెప్పినారు. పూర్వ కవీంద్రుల వలె వ్రాయగల నని కాని కీర్తికొఱకు గాని కాక భక్తితో పవిత్రకథారచన చేసి భవబంధమును బాపుకొని మోక్ష ప్రాప్తికి అర్హత కలుగునట్లు రామాయణ రచనా రూపమైన కైంకర్యమును చేసినారు. ఇతఃపూర్వము లౌకిక విషయములను గూర్చిన మహాగ్రంథములను రచించి మనశ్శాంతి నొందక ఈ కృతికి ఉపక్రమించినారు. తమ వినయ సంపద వెలిబుచ్చుచు, "వివిధ శాస్త్రార్థ సంస్కార విదుడ కాను" అనియు, భక్తితోడనే వాల్మీకి హృదయమున ప్రవేశించుటకై ప్రయత్నింతు ననియు వక్కాణించినారు. ఇంతకును వీరు మోక్షకాములై ఈ కావ్యమునకు పూను కొన్నట్లు స్పష్టము.

విద్యాధిదేవతను వినుతించుచు తమకు ద్రాక్షాపాకమును దయచేయమని కోరి సఫల ప్రయత్నులైనారు.

సర్వధర్మమ్ములను వీడి శరణమంటి
అన్యథా శరణం నాస్తి యంచు నిన్నె
శరణమంటి స్వయంకృషి సమసెనంటి
ఇదిగో దాసోఽహ మంటి న న్నేలు మంటి !

అని గ్రంథకర్త శరణాగతి చేయుటచే ఈ కావ్యము శరణాగతి ప్రధాన మైన దని ఎల్లరును ఊహింపవచ్చును.

సామాన్యముగా విభీషణ శరణాగతి ఉత్తమోత్తమ మని యందురు. కాని ఈ కావ్యమున ఆదినుండి తుదివఱకును ప్రధాన పాత్ర లన్నియు శరణాగతములే అని కవి నిరూపించినారు. దశరథుడు, కౌసల్య, లక్ష్మణుడు, విశ్వామిత్రుడు, జనకుడు, సీత, పరశురాముడు — వీరు వారన నేల — ఎల్లరును రాముని తలచుకొన్నంతనే శరణాగతులైనట్లు తెలుపుటలో ఆచార్యులవారు అత్యంత రామభక్తి భరితు లని స్పష్టమగుచున్నది. వాస్తవముగా రామ తత్త్వమును గ్రహించుట కష్టమైన పని.

గ్రంథ రచనలో ఒక్కొక్క కవి ఒక్కొక్క దృష్టితో కృషి చేయుచుండును. పరినిష్ఠిత బుద్ధితో కూడిన దృక్కోణము నుండి కవి హృదయమును గ్రహించి కావ్యమును పఠించుట కర్తవ్యము. ఇందు రామాయణ శ్లోకరత్నములుగా ప్రసిద్ధములైన వానిలోని భావములు చక్కగా కానవచ్చుచున్నవి. రామాయణ వ్యాఖ్యలను పరిశీలించి అందలి విశేషములను గ్రహించి ఆయా స్థలములందు ప్రతిపాదించిరి.

ఈ బాలకాండము వివిధవృత్త విలసితమై, ధారాశుద్ధి కలిగి, ద్రాక్షా పాకమున అలరారుచున్నది. భక్తి యోగులు ఈ కావ్యమును పఠించి ఆనంద తన్మయు లగుదురు గాక !

ఇతిశమ్ !

*సాహితీ సమితి,*
రేపల్లె, 1-2-1960. —*శివ*

సమీక్షలు 13.

శ్రీ చెలమచెర్ల రంగాచార్యులుగారు,
ప్రతాపరుద్ర యశోభూషణము ఇత్యాది గ్రంథకర్తలు
తెలుగు అధ్యాపకులు - ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

Sri Chelamacherla Rangacharyulu Garu
Telugu Lecturer Osmania University
Author of Prataparudra Yasobhushanamu etc.

శ్రీరామాయనమః

"—చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్—"

అట్టిది రామ కథా మాహాత్మ్యము! "—పరమపురుషుఁడు శ్రీరాముఁడై యవతరించెను. వేదము శ్రీమద్రామాయణముగా ఆవిర్భవించెను—" ఇట్టిది యార్యుల విశ్వాసము! రామలీల వెన్నెలలు సోకని భారతీయ వాఙ్మయము లేదు. ఆంధ్రములోను రామ గాథాంకిత శాఖ బహువిస్తృతమై యున్నది. నేఁటికిని క్రొత్తరెమ్మలు వేయుచు సాగుచునే యున్నది. వానిలో శ్రీ గోవింద రామాయణ మొకటి. పదునెనిమి దేండ్ల క్రిందట 20-6-1942 నాఁడు శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారు తాము రచించిన ఉత్తర రామాయణమును తామే చదివి వినిపింప విను భాగ్యము కలిగినది. నేఁటి కిది మఱియొక కర్ణపర్వము.

చర్వితచర్వణమా!

రామాయణ గాథ యెవ్వరు వ్రాయఁ బూనినను గలుగు ప్రశ్నమే ఆచార్యులవారికిని కలిగినది. అందఱివలెనే సమాధానము చెప్పికొనవలసియు వచ్చినది. ఉత్తర రామాయణములోనే

"ఒప్పుగ వ్రాసినారు గవు లుత్తమ రామచరిత్ర మెందఱో
యిప్పుడు నీవు గూడ నదియే రచియింప విశేష మేమి?...."

అను ప్రశ్నమునకు సమాధానముగా

'రామప్ప చరిత్రమే తగు నిహమ్ము పరమ్ము లభింపఁ జేయఁగన్-'

అన్నారు. ఈబాలకాండ కథ వ్రాయునప్పుడును ప్రశ్నమదియేగాని సమాధానము మాత్రము కొంత దీర్ఘమై నాలుగు పద్యములు పట్టినది. సారాంశ మదియే.

'ఎయ్యది సమానమగు నీ రఘునాథు గాథకున్-' 'కవియున్ ధన్యతగాంచి నిక్కముగ మోక్షప్రాప్తి కర్హుండగున్-' అను వాక్యాలలో ఇతివృత్త భోగ్యతయు, పరమప్రయోజనమును నిరూపితములైనవి. '-కవి జనంబులఁ బేరెక్కు కాంక్ష గాదు—' '—పరి దరిఁజేరియో కృతి నిచ్చు నర్థకాంక్ష గాదు—' మఱి దేనికీ రచన? 'నీ సమర్చ కుపాధిగా నే రచింతు—' ఈ వాక్యాలలోఁ గావ్యకళను రక్తిసరణినుండి భక్తిసరణికిఁ ద్రిప్పిన తిక్కన, పోతన మున్నైన మహాకవుల భావముల సంవాదము గోచరించుచున్నది.

## కావ్యారంభము

వింత ప్రకృతి వీరి దనిపించును. జాతీయ రణరంగములో వీరవిహారము సల్పిన కేవల లౌకికుఁడొక వైపు - తారకము జపించు భక్తుఁడొక వైపు; శ్రీ వైష్ణవుఁ డాతఁడు - శ్రీ బాలోపాసకుఁ డాతఁడు - సమన్వయ మేమి? సర్వకర్మఫలత్యాగి లౌకికుఁడైన నేమి? 'సమే యుక్తతమోమతః—' అని కదా గీత! 'ఏకం సద్విప్రా బహుధా వదంతి'- పరతత్త్వమొక్కటియే. నామరూపాదు లనంతములు, సాధకానుకూల్యసంపాదకములు-అని యెఱింగిన విజ్ఞాని. కాదు-

'యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోపి మామ్-'

అను గీతావాక్యము ననుసరించి మోక్షప్రాప్తికి పరమపురుషోపాసనమే కావింపవలెనందురా అట్లయినను ఈ బాలాస్తోత్రము సమర్థనీయమే. తత్తద్దేవతానుగ్రహమున బుద్ధి నైర్మల్యాదులు, వాగ్వైభవము కలుగుటయు, అవి పరమపురుషోపాసనమునకు సాధనములగుటయు స్పష్టము. ఇంతకును ఆచార్యులగారు తాము కావ్యారంభమున ఇష్టదేవతను ప్రార్థించినదియు నిదియే కదా!

'—బాల నామానసమందు నిల్చి యభిమానముతో సుకవిత్వ మిచ్చుతన్—'
'...మదంబ ప్రోచుత రసప్లుత సత్కవితా ప్రదాత్రియై'

దీనిని గుర్తించిన నిఁక నీ కావ్యారంభ జిజ్ఞాసాసంరంభములతోఁ బని యుండదు.

## సాధన సంపత్తి

అటునుండి రమ్మన్నట్లు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములలో వీరు బాల్యము నుండియు అవధానములుచేసి యున్న వారగుటచేఁ గవితాభ్యాసము చాలినంత

యున్నదనవలెను. దానికి వీరి కావ్యములోఁ గనఁబడు ధారాశుద్ధియే తార్కాణము.

## ప్రతిభాస్ఫూర్తి

*1.* వర్ణనములు : గోవిందాచార్య కవి వర్ణనములు హృద్యములు. సీతారాముల కల్యాణ మొక మహాధ్వరము. మిథిలానగరమెల్ల పెద్ద పెండ్లి యిల్లు. అచ్చటి కైసేఁతలసేర్పులు—కైతలలో వెలసినవి. ముక్తపదగ్రస్తము లయు, ఉత్ప్రేక్షలయు శోభలతో, సుందరభావపరిమళములతో ఆ నగరలక్ష్మి వలెనే యాచార్యుల కవితావధూటియు నింపెసలారినది. ఆ కల్యాణాధ్వరమును సేవించుట శ్రేయఃప్రాప్తిహేతువని మునులు, జానపదులు, పౌరులే కాదు సురలు సైతము మిథిలకు వచ్చిచేరినారు. పిలువని పేరంటముగనే వచ్చినారన్న యీ వర్ణనము హృదయాభిరామమై 'అనాహూతోధ్వరం గచ్ఛేత్-' అను ధర్మాను గృహీతమై యొప్పుచున్నది

*2.* పెండ్లికూతురు సీతమ్మ : ఇది ముచ్చటైన వర్ణనము. అసాధారణ చమత్కార విలసితము. కవి ప్రౌఢతనము పదపదమునను తొంగిచూచును.

'ఫాత్రిజావక్త్రమల్ల విధాతృపదము
శిష్టవక్షఃస్థలము సదా శివపదమ్ము
విమలమధ్యము శ్రీలసద్విష్ణుపదము
నాతిధమ్మిల్ల మది సుమనఃపదమ్ము'
'అధర మరుణ ధరమ్మునై యలరు వధువు
వాణి మధురాపురమ్ము, జవ్వని నితంబ
సీమ కాంచీప్రదీప్తమ్ము సిరులపేటి
అంగన శరీరమెల్ల శ్రీరంగభూమి.'

అనువిధముగా సాగిన సీతావర్ణనము రమ్యతమము. శిల్ప నైపుణ్యమునకు మేలి చిన్నె. సీత జగన్మాత. ఆదిలక్ష్మి. 'ఓం బ్రహ్మవిష్ణు శివాత్మికాయైనమః' అను లక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్రములోని వాక్యమున కిందలి మొదటి పద్యము మంజుల వివరణము. రెండవదానిలో తత్తద్ధర్మ విశేషములతో బాటు అరుణాచలము, మధుర, కాంచి, శ్రీరంగము' అను క్షేత్రరాజముల పదసామ్యముతో అమ్మవారి సకలావయవగత పావనత్వము గమ్యమై ప్రకరణ మును మాధురీమహితము గావించినది. సహృదయుల సానందతుందిలులం జేయఁజాలుచున్నది. ఇట్టి చమత్కృతులఁ బరిశీలింపఁగా ఆచార్యులవారు

కేవలము 'అడియేన్‌దాసు' కవి కారనియు, వలయుచో ప్రౌఢిమ వెలయింప వలంతులనియు గట్టిపడుచున్నది.

*3. భావావేశము :* కొన్ని ఘట్టములలో వారు పరితలమూఁగించునట్లుందురు. అట్టి పట్టుల వీరికవిత పొంగి పొరలినట్లుండును. కల్యాణ ఘట్టమది! ఆ దంపతులకుఁ బెండ్లి! జగజ్జనని సీతమ్మను జగత్పితకు రామదేవునకు ధారాపూర్వకముగా దానము చేయుచున్నాఁడు. ధన్యుఁడు జనకమహారాజు! ఆనందాశ్రువులు జాలువాఱ, పలుకులు తొలుక అన్నాఁడు. 'ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ। ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిగృహ్ణీష్వ పాణినా॥' - 'పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా -' దీనిపై వాల్మీకి హృదయ గవేషణమును పూర్వసూరులు పుష్కలముగాఁ గావించియున్నారు. వానిసారమును జీర్ణించికొనియున్నవారగుటచేతను, తత్సుందర సన్నివేశమును భావించి భావించి యనుభవించుటచేతను గాబోలు శ్రీ ఆచార్యులవారావేశపరులై కవిత చెప్పినారు. 'ఇది సుమ సీత నాదుసుత' అని మొదలిడి 'పృథివిని బుట్టియుంటఁ బృథివీతల సద్గుణజాలమెల్ల ఈ సుదతికి సంక్రమించె' ననుచు హుటాహుటి పద్యముపై పద్యమును దొర్లించినారు. 'పృథివిని బుట్టియుంట...' అను పద్యము మొదలు 'పదిలముచేసి పెంచిన విభాసుర దివ్య సువర్ణ రేఖ' అను పద్యమువఱకును అన్నింట 'గ్రహియింపుము పాణిఁ బాణిచే' అను మకుటమును గూర్చినారు. పలుసొబగులను జేర్చినారు. ఆలోచనామృతముగాఁ దీర్చినారు. ఇట విరిసినవన్నియు చంపకములే! మకుటముగలయవియు సప్త సంఖ్యాకములగుట కాకతాళీయమో! సప్తపద తంత్రమునకానుగుణ్య సంపాదనమో! 'గ్రహియింపుము పాణిఁబాణిచే' అనునీయసకృదావృత్తి అనునయించుచు, అర్థించుచు, ఆసగొలుపుచు, పలుతీరుల న్యాయముఁ జూపుచు జనకమహారాజు తన దుహితను స్వామికర్పించి ధన్యుడు కాగోరు ఉదాత్తభావము ధ్వనితమై ప్రకరణమును ఘుమఘుమ లాడించినది.

*4. కల్పనా చమత్కృతి :* వాల్మీకిమహర్షి చేయని కొన్ని కల్పన లిందుఁ బొడగట్టుచున్నవి. శ్రీ లీలాకృపాశ్వాసములో నట్టిదొకటి. ముద్దులు మూటగట్టు పిట్టలలో మగపిట్టను గొట్టినబోయను దిట్టుటకుగా గుండెలు నెట్టుకొని వచ్చినది పుట్ట పుట్టువు నోట 'మానిషాదాది....' వాక్యము. దీనిపై వాల్మీకి శిష్యులుచేసిన చర్చ గోవిందోపజ్ఞమే. పదునైదు పద్యములలో నడచిన యీ

మానిషాదచర్చలో ఉపనిషత్సారథములు మలయుచున్నట్లున్నవి. గీతికలతో వెలయుట, తత్త్వ ప్రతిపాదకమగుట ఇదియు నొకగీతనాఁ దగుచున్నది.

నిండుచూలాలైన కౌసల్యకు స్వప్నమున గరుడవాహనారూఢుఁడైన శ్రీమన్నారాయణుఁడు దర్శనమొసగుట; శివుఁడు పార్వతికి శ్రీరామగాథ చెప్పుట; జయవిజయులను రాక్షసులు కండని అశ్వినీదేవతలుశపించుట వారిచేఁ, బ్రతిశప్తులై యశ్వినీదేవతలు పాతాళమున ఐరావణ మైరావణులుగాఁ బుట్టుట; సరయూతీరమున నిద్రితులై యున్న రామలక్ష్మణుల మంగళమూర్తులను చూడ్కులునిండఁ దీఱని తృప్తితోఁ గాంచుచున్న విశ్వామిత్రునకు వింతగా వారిస్థానమున మొదట ఒక జ్యోతిగాను, పిమ్మట అదియే శ్రీమన్నారాయణ మూర్తిగాను ప్రత్యక్షమగుట - ఇట్టి కల్పనలో గొన్నింటికి వాసిష్ఠ రామాయణము, అధ్యాత్మరామాయణము మున్నైనవి మూలములు. కేవల స్వీయములును గలవు. వీనినన్నింటిని మూలగాథకు వన్నెవెట్టునట్లుగా గ్రథించినారు.

## శరణాగతి

రామాయణమును దీర్ఘశరణాగతి యందురు. ఆచార్యులుగారు తమ కావ్యమును శరణాగతి ప్రధానముగాఁ దీర్చిదిద్దుట వారి సంప్రదాయజ్ఞతకు గుర్తు. తొలుత దేవతలు, పిమ్మట వరుసగా కౌసల్యా దశరథులు, విశ్వామిత్ర మహర్షి, అహల్య, జనకుఁడు మున్నైనవారు గావించిన శరణాగతి వర్ణిత మైనది. కావ్యశ్రీకి తిలకముగా పరశురాము శరణాగతి యలంకరింపఁబడినది. శ్రీరామునియందు పరతత్త్వమును గుర్తించిన పరశురాముఁడనును—

'బాహోబాహి రణమ్మికేల ? నిను గెల్వం జాలితిన్నేఁడె నా
కాహా యోటమి లేదులే దిటుల నిన్నాద్యున్గనన్ వేచితిన్
దేహిన్ సర్వసమర్పణంబిదె, కృప న్నీవే గ్రహింపంగదే
యోహో రామ రఘూద్వహా ! శరణ మోహో సర్వలోకేశ్వరా !'

అధునాతన రచనలలో శరణాగతినిష్ఠ నింత సమగ్రముగా, సొగసుగా నిబద్ధించిన కావ్యము లెన్నియో లేవు.

## వృత్తాది సంపత్తి

మానిని, తోటకము, రథోద్ధతము, నర్కుటము, వృషభగతిరగడ, దండకాదులగు వివిధవృత్తములతోను, కరుణ వీరాదిరసములతోను, ఉపమోత్ప్రేక్షా

సమీక్షలు 14.

శ్రీ బి. యస్. మూర్తిగారు, *బి. ఎ., బి. ఎల్.,*
కేంద్ర కమ్యూనిటీ డెవలప్‌మెంటు, సహకారోద్యమముల డిప్యూటీ మంత్రి,
న్యూఢిల్లీ.

## Sri B. S. Moorty Garu, B. A., B. L.
**Deputy Minister for Community Development and Co-operation, Government of India, NEW DELHI.**

శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులుగారిని యెఱుగనివా రాంధ్రదేశంలో అరుదు. పూజ్య బాపూజీ శంఖా నినాదాన్ని ఆలకించడంతోనే స్వాతంత్ర్య సమరంలో దూకిన యోధానుయోధుల్లో ఆయన ఒకరు. ప్రగాఢమైన దేశ భక్తితో, నిష్కామమైన సేవా దీక్షతో, ఆయన ఆంధ్ర రాజకీయరంగంలో పేరెన్నికగాంచిన పెద్ద.

(తరువాయి 40 వ పేజీ)

---

రూపకాద్యలంకారములతోను, వైదర్భీరీతిలోను విలసిల్లు నీకావ్యము మధుర మధురమై నవ్యవసంతోద్యానమువలెఁ గమ్మతావు లెగఁజిమ్ముచుఁ బాఠకులకు హృదయానంద సంధాయక మగుచున్నది.

తుది కొకమాట, కావ్యమంతయు ఒకయెత్తు - దీనిలోని ఆశ్వాసాంత పద్యము లొకయెత్తు. అవి వేఱువేఱు పరిణితమైన ప్రపత్తికావ్యాలు. కవిగారి కొన్ని స్వీయవిషయాలను కుండలీకరించినచో ఆపద్యములు ప్రతిభక్తుఁడును పారాయణము గావింపఁదగినంత మహత్తగలవిగా నున్నవి. ఇంత సమర్థముగా శ్రీరామగాథను గావ్యముగా నిబద్ధింపఁ గల్గినందులకు శ్రీమాన్ గోవిందా చార్యులవారు ప్రశంసార్హులు. ఈ మధురకావ్య ముఖమున వారిచ్చిన మహి తోపదేశమిది.

వినుమీ విను శ్రీరఘువీర కథన్
కనుమీ కను జానకి కర్మగతిన్
మనుమీ మను మాత్మసమర్పణతోన్
జననాథుని రాముని సంస్మరణన్.

'మంగళం కోసలేంద్రాయ'

హైద్రాబాదు, 25—2—1960. —చెలమచెర్ల రంగాచార్యులు

Sri Dr. Puttaparti Srinivasacharyulugaru, *M. A., Ph. D.*
Ex. Principal, S. R. R. College, Vijayawada;
Ex. Director, Archaeological Department, Andhra Pradesh Government
The Head of the Department of History, Osmania University;

The Ramayana, which is the adikavya, has acquired great sanctity due to the inherent purity of its hero and heroine who in their deified character have ever represented the ideals of Indian conju-

శ్రీ డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు, ఎం.ఎ.,పిహెచ్.డి.
లోగడ ప్రిన్సిపల్, ఎస్. ఆర్. ఆర్. కాలేజి, విజయవాడ.
డైరెక్టరు, పురాతత్వశాఖ, ఆంధ్రప్రదేశ్.
ఉస్మానియా విశ్వవిద్యాలయ చరిత్రశాఖాధ్యక్షులు.

శ్రీమద్రామాయణము ఉత్తమ ప్రశస్తిగన్న ఆదికావ్యము. ఇందలి నాయికా నాయకుల, ఔత్కృష్ట్య మూ బాలగోపాలముచే నాకర్షింపబడుటయు యుందలి. భారతీయ దాంపత్య ధర్మ విశిష్టతయు, యీ కావ్య మాది

(39 వ పేజీ తరువాయి)

ఆంధ్ర కాంగ్రెసు నిర్మాణ కార్యకర్తగా, కాంగ్రెసు సంఘ సైనికుడుగా, శాసనసభా సభ్యుడుగా, విశ్వకళా పరిషత్తు సభ్యుడుగా శ్రీ గోవిందాచార్యులు గారు ఆంధ్రలోకానికి చేసిన సేవ అమోఘం. ఆయన త్యాగజీవి.

అయితే ఆయన కేవలం రాజకీయ జంఝాటంలోనే చిక్కుకొని తికమక కాలేదు. తీరిక చిక్కినపుడెల్ల ఆర్థిక సాంఘిక విషయాలపై గ్రంథాలు రచించి ఆంధ్రదేశానికి అందజేస్తూ వచ్చారు. వారు రచించిన 'భారత ఆర్థిక శాస్త్రం' ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి మన్ననకు పాత్రమైన విషయం అందఱెఱిగినదే!

ఇప్పుడు వారు రచించిన 'గోవింద రామాయణం' వారి సాహిత్య కృషికి మరొక నిదర్శనం. ఆచార్యులవారు ఆజన్మ రామ భక్తులు. వారు ఆ నాటి పోతనామాత్యుడు భావించినట్లే—

"పలికెడిది భాగవతమట
పలికించెడి వాడు రామ భద్రుండట నే
పలికిన భవహర మగునట
............"

అంటూ గోవింద రామాయణాన్ని ప్రారంభించి బాలకాండను పూర్తిజేసి ఆంధ్ర ప్రజానీకానికి అందజేసి ధన్యు లగుచున్నారు. సరళశైలిలో, పండిత పామర జనరంజకముగా వున్న యీ గ్రంథం ఆంధ్ర భాషామతల్లికి మరొక్క భూషణం కాగలదని నా విశ్వాసం.

న్యూఢిల్లీ, 4—3—60. —బి. యస్. మూర్తి

gal love and faithfulness. Its popularity is testified to by not only the dramatists of the classic period, but also writers in the medieval Indian languages many of whom have borrowed their plots from Ramayana.

The Balakanda deals with the early history of Rama interspersed with a number of accounts relating to other important persons like, for example, the Ṛishyasringa legend, the stories woven around the sages Vasistha and Visvamitra and the story of the descent of the Ganga from Heaven.

Sri A. Govindacharyulu has taken up the Balakanda for his central theme and composed an excellent Kavya in chaste and classical style in three Aśvasas called 1. శ్రీలీలాకృపాశ్వాసము, 2. శ్రీ అవతారాశ్వాసము, and 3. శ్రీ శరణాగతాశ్వాసము. He is a careful student of Valmiki and the excellent commentary on it by the illustrious Govindaraja, but his aim is not to give a faithful rendering of Valmiki or any particular version in Telugu but to put in words the ardent feeling of a true devotee of Ramayana who regards it as something more than a mere high class Kavya. A large section of Hindus consider it as శరణాగతి వేద although this aspect has not been stressed very much in the extant

నుండి, యుగయుగములుగ నేటివరకు భారతీయ విజ్ఞాన మకుటముగా విరాజిల్లుచుండుటకు ముఖ్యకారణములు - ఈ నాయికానాయకుల ఐహికాతీతమగు ప్రేమానుబంధము అనాదిగ నాటక కవులను, తదుపరి గ్రంథకర్తలను కడుంగడునాకర్షించి, వారి వారి మహాకవితకు సాంప్రదాయికమగు, నితివృత్తముగా ప్రకాశించుచున్నది.

ఈ బాలకాండములో ఋష్యశృంగుని గాథ, వశిష్ఠ విశ్వామిత్రుల గాథ, గంగావతరణము మొదలగు, నుపాఖ్యానము లున్నవి. ఈ గోవింద రామాయణమున శ్రీ గోవిందాచార్యులుగారు ఉపాఖ్యానములను విసర్జించి, ముఖ్య గాథనే యితివృత్తముగ స్వీకరించిరి. ఈ కావ్యమున, లీలాకృపాశ్వాసము - అవతారాశ్వాసము - శరణాగతాశ్వాసము అను మూడు ఆశ్వాసము లున్నవి. ఈ మూడాశ్వాసములతో కూడిన - ఇది పరిశుద్ధ గ్రాంథికశైలిలో గల ఒక ఉత్తమ కావ్యము. శ్రీ గోవిందాచార్యులుగారు, వాల్మీకి రామాయణమును - దానిపై గల గోవిందరాజీయ వ్యాఖ్యానమును- జాగరూకతతో చదివినవారు. కాని, వాల్మీకి రామాయణమునకు సరియగు తర్జుమా చేయుట వీరి సంకల్పము గాదు. వీరి దృష్టిలో రామాయణ మొక ఉత్తమోత్తమ కావ్యము మాత్రమే కాదు. అంతకంటెను మహోత్కృష్టమైన, దివ్యగ్రంథము. ఈ దృష్టితోనే, ఒక నిశ్చలమైన భక్తునివలె గోవిందాచార్యులు

Telugu versions of Ramayana. Sri Govindacharyulu has taken up this rather formidable task and achieved a great measure of success without sacrificing any of the truly poetic elements in his work.

Rama is a living presence to many in distress in India even to-day and to them who are not essentially sophisticated the Ramayana is a great guide through life's travail which shows up the path of rectitude in times of mental confusion and affords consolation to the righteous who are unreasonably faced with adversity. The outpourings of the heart of Sri Govindacharyulu are found in the ఆశ్వాసాంత పద్యములు but in fact the entire work is a testimony to his vision of Rama and his interpretation of Ramayana.

If philosophy is the essential tenet of all life and activity, the crux of Hindu philosophy is the attainment of peace and harmony by the individual by Bhara Nyasa and Niskama Karma. The path of Prapatti and Saranagati is undoubtedly the most satisfying and practicable path for one and all and it is this path which has been chosen by Sri A. Govindacharyulu in his life and in his Kavya which is a veritable mirror held up to his life.

It is but natural therefore that he deals with the Saranagati of

గారీ కావ్యమును వ్రాసిరి. చాలమంది హిందువు లీ రామాయణమును, "శరణాగతి" వేదముగ పరిగణింతురు. అయినను, యీ దృక్పథమును తెలుగు నందలి యుతర రామాయణ కావ్య కర్త లంతగ పరిగణింపరైరి. శ్రీ గోవిందాచార్యులుగారు మాత్ర మీ దృక్పథము నే,యది కష్టతమమైన కృషి యయ్యు, స్వీకరించిరి. కావ్యలక్షణము లను కవితావిలాసములను, రవ్వంతయు పరిత్యజించక యే, శ్రీ గోవిందాచార్యులుగారు వారి కావ్య మునం దీ కృషిలో విశేషముగ కృత కృత్యులైరి

నేటికిని హిందూదేశమున సంతాప హృదయులకు శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమగు సజీవమూర్తియే. రామాయణ భక్తులకు తమ తమ జీవితము లందు సీతారాముడే నిత్య ఉత్తమ మార్గదర్శి. సంక్షుభిత మానసిక వృత్తిలో సంతాపసమయమున ఉత్తము లకు సీతారాముడే; శాంతిప్రదాత. శ్రీ గోవిందాచార్యులుగారి ఆశ్వాసాంత పద్యములలో, వారిహృదయ వేదనా స్రవంతి ఉబికి, వెల్లువగా ప్రవహించినది. అంతియే కాదు. ఈ కావ్యమంతయు రామాయణ వ్యాఖ్యానమునందు వీరి సమర్థతకును - శ్రీరామచంద్రుని వీరు దర్శించు రీతి కిని యొక యోగ్యతా పత్రము. వేదాంతమే జీవిత సారాంశమయితే, వ్యక్తికి జీవితమార్గమున శాంతి మాధుర్యములు లభ్యము లగుటయే హిందూ వేదాంత మూలము. భర

Ahalya and Parasurama but goes further and interprets the part played by Visvamitra as an instance of his Saranagati. Even the conferring of the special powers and mantras of *bala* and *atibala* as also the gift of many rare and invaluable *astras* and *sastras* is seen to be the surrender of all wordly and other possessions by a prapanna and saranagata.

Numerous instances abound of Sri Govindacharyulu's knowledge of Sampradaya, Tattva-jijnasa and Tatparata. But it is needless to amplify when the author has already stated his views as follows:

"పరతత్త్వార్థమునే తలంచుచు
కృపాపారీణ నిన్ జూడగా
శరణంబందును నీకె నేనిక
సదా సద్భక్తి గేల్ మోడ్చి:"

It is a matter for great satisfaction that even in these days of bhava-kavitva and materialistic attitude towards life Sri Govindacharyulu has been able to produce and place before the public such an invaluable piece of literature as this kavya.

10-3-60. — *P. Srinivasachar*

*

న్యాస నిష్కామకర్మములే యిందుల కాధారములు. ప్రపత్తి, శరణాగతి మార్గమే వ్యక్తులకును - అందఱకును - నిశ్చయమగు, సంతృప్తికరమగు, ఆచరణయోగ్యమగు సాధన సంపత్తి. ఈ సాధన సంపత్తి మార్గమునే శ్రీ గోవిందాచార్యులుగారు తమ జీవిత పథమున ప్రత్యేకముగ స్వీకరించిరి. అంతియే కాదు. వారి యీ గోవింద రామాయణ కావ్యము గూడ వారి యీ జీవితానుభవమగు త్రోవకే, ఒక ప్రస్ఫుటమగు అద్దముగనున్నది. అందువల్లనే శ్రీ ఆచార్యులుగారు అహల్యా పరశురామ శరణాగతులను గురించి వ్రాయుటయే కాక విశ్వామిత్రుని గాథ కూడ, విశ్వామిత్ర శరణాగతిగా వ్యాఖ్యానించిరి. బల, అతిబల మంత్రములను మిగిలిన ప్రత్యేక మంత్రశక్తులను, అస్త్రశస్త్రశక్తులను శ్రీరామునకు విశ్వామిత్రు డిచ్చుటయు గూడ, విశ్వామిత్రుని శరణాగతి తత్వభాగమనిరి. ప్రపన్నుడు, శరణాగతుడు తన ఐహిక భోగభాగ్యము లన్నియు సర్వేశ్వరునకు సర్వ సమర్పణ మొనరించు కార్యకలాప భాగముగ విశ్వామిత్రుని కార్యక్రమమును ఆచార్యులుగారు నిర్వచించిరి. ఈయనకుగల సాంప్రదాయిక పరిజ్ఞానము, తత్వజిజ్ఞాస, తత్పరతలే యిందలి బహువిషయములు - ఈ కావ్యకర్త ఎచ్చటెచ్చట యీ విషయములను పొందుపరచెనో విస్తరించి పలుకనవసరములేదు.

(53 వ పేజీ చూడుడు.)

## డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ అధ్యక్షులు

రివిన్యూ - సివిల్ వ్యయములమంత్రి

భారతప్రభుత్వము

## Dr. B. GopalaReddy Garu

President, Sahitya Academy (A. P.)

Minister for Revenue and Civil expenditure, Govt. of India.

ఆత్మకూరు గోవిందాచార్యులవారు ఆంధ్రదేశమునకు చిరపరిచితులు. కాంగ్రెసునందు వారు చేసిన సేవలు త్యాగములు సత్యాగ్రహదినములలో అందరికిని విదితమైయున్నవి. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో, ఆంధ్రా యూనివర్సిటీ సెనేట్‌లో కూడ వారు సభ్యులుగా నుండిరి. అంతేకాక గ్రంథకర్తలుగాకవులుగాకూడఆంధ్రభాషకు సేవ నొనర్చిరి. ఒనర్చుచున్నారు.

ఆంధ్రభాషలో ననేకమంది రామ కథను కీర్తించియున్నారు. కొన్ని కేవలము అనువాదములు. పెక్కు స్వతంత్రరచనలుగనే గణింపవచ్చును. తనివితీరని రామకథారసము శ్రీ గోవిందాచార్యులవారును 'శ్రీగోవింద రామాయణము' 'సీతారామమ్' అను శీర్షికతో రచించి ప్రచురించియుండుట ఎంతయు ముదావహము. సరళమైన భాష, చక్కని సొంపైనశైలిలో ఆంధ్రులకు అందజేయుచున్నారు. పండితులకును పామరులకును ఆనందమును శాంతిని కొల్పు నీ గ్రంథరాజము ఆంధ్రుల ఆదరాభిమానములకు పాత్రమగుగాత.

## శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావుగారు, బి.ఏ., బి. యల్.

(ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు)

## Sri S. B. P. Pattabhi Rama Rao Garu, B.A., B.L

Minister for Education (A. P.)

సుప్రసిద్ధ దేశభక్తుడు శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులుగారి గోవింద రామాయణం "గోదావరీపావనోదార వాఃపూరమువలె" తియ్యగా కమ్మగా తెనుగుప్రజల హృదయసీమలలో ప్రవహిస్తున్నట్లు ఉంటుంది. కఠినపద భూయిష్ఠమైన సమాసాడంబరము లేకుండా ద్రాక్షాపాకములోని వారి శైలి సామాన్య పాఠకుల హృదయాలను సైతం చూరగొంటుంది. కవితా శైలి కవి యొక్క వ్యక్తిత్వాన్ని స్ఫురింపచేయగలుగుతుందా? దానికి ఆశక్తి ఉన్నదనిఅంగీకరిస్తే శ్రీ గోవిందాచార్యులుగారు చాలా నిరాడంబరుడనీ, మధుర వాక్శీలుడనీ ఆయన పద్యం చదివిన వెంటనే చెప్పవచ్చు. శ్రీ గోవింద రామాయణం ప్రథమభాగం మాత్రమే ప్రకటించబడింది. మృదుమధురమైన ద్వితీయభాగం కొరకు అశేష ఆంధ్ర ప్రజానీకం ఎదురు చూస్తున్నారు.

—ఎస్. బి. పి. పట్టాభిరామారావు

18-3-1960, హైదరాబాదు.

★

---

మిత్రులు గోవిందాచార్యులవారికి నాహృదయపూర్వక అభినందనములు.

—బెజవాడ గోపాలరెడ్డి

# ఉపోద్ఘాతము

## డాక్టరు బూరుగుల రామకృష్ణారావుగారు

పండితరాజ పంచామృతము - విష్ణుశతకము - సారస్వత వ్యాసావళి ఇత్యాది గ్రంథకర్తలు

కేరళరాష్ట్ర గవర్నరుగారు

## INTRODUCTION

*By*

## Dr. B. Ramakrishna Rao garu

Governor - Kerala

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు, దేశ స్వాతంత్ర్య సమరాంగణ ధీరులుగను, అతిశయ శ్రద్ధాన్వితులగు గాంధేయులుగను, అర్థ శాస్త్ర పండిత ప్రకాండులుగను, భారతీయార్థశాస్త్ర గ్రంథ నిర్మాతలుగను, అఖిలాంధ్రావనికి సుపరిచితులైన దేశభక్తులు. ఐనను వారు రామభక్తాగ్రేసరు లగు మధురకవులని నేనింతకుమున్నెఱుంగను. ఇటీవలనే వారి రచనలనుఁ జూచుభాగ్యము లభించినది. అంతియేగాక దమ యవ్యాజప్రేమను ప్రకటించుచు వారు తమ 'సీతారామ' మను నీ నూతన రామాయణ కావ్యమునకుపోద్ఘాతము వ్రాయమని నన్ను కోరిరి. ఈ గౌరవమున కర్హుడను కాకపోయినను, వారు భక్తులును కవులు నని తెలిసికొనిన నాలో వారియెడ నినుమడించిన శ్రద్ధా భక్తులే నేనందుల కియ్యకొనుటకు ముఖ్యకారణములు.

శ్రీమద్రామాయణము 'రామరామ' యను మధురాక్షరములనుఁ బలుకు 'కవితాశాఖ' నెక్కిన 'వాల్మీకి కోకిల' యొక్క సుధాలాపము. క్రౌంచమిథున దుఃఖారంభమునుండి రామకథాంతమువరకు కరుణరస ప్రాభవముచే నిండియున్న మహాకావ్యము. ప్రతిసహస్రశ్లోక గాయత్రీ మంత్ర వర్ణ పరిపూతమై సనాతనాచారులకు చతుర్విధ పురుషార్థ సాధనమగు పారాయణగ్రంథము. భక్తసంతతికి కల్పవృక్షము. ముముక్షువులకు భవ తారకము. మేధావులగు చరిత్రకారులకు ప్రాచీన భారతీయ సంస్కృతీ వైభవ ద్యోతకమగు మూలగ్రంథము. తత్త్వజ్ఞులకు జీవాత్మ పరమాత్మల వియోగ సంయోగ సత్కథనము, ఉన్నతోన్నతములగు నైతికాదర్శములను ప్రతిబింబించి, జీవితాదర్శములను రూపొందించి, యనాదినుండి భారతీయు లకు సన్మార్గదర్శకమై విలసిల్లిన యద్భుత దర్శనము. 'రామోద్విర్నాభి

భాషతే' యను సత్యదీక్షకుఁ దావలమై, 'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చయాచతే' యను సూక్తి ననుసరించి శరణాగత రక్షణ బిరుదాంకితుడైన రామచంద్రుని సంతతానందదాయకమైన కథ ఏ రచయిత నాకర్షింపదు? భాస, కాళిదాస, భవభూతి, క్షేమేంద్రాది ప్రాచీన మహాకవులుఁ దామప్రతిమ ప్రతిభాశాలురయ్యు, రామకథావస్తువునే తమ మహాకావ్యముల కితివృత్తములుగా గైకొనిరి. తరువాతి సంస్కృతకవులును వివిధ ప్రాదేశిక భాషా కవులును, సాహిత్యకారులును, నవరసమాధురీధురి యగు రామకథనే యాశ్రయించిరి. ప్రతిభాశాలురగు కవులకు పవిత్రమగు రామకథాకథనము భవతారకమగు నావయేఁగాక రసాత్మక కావ్య మహోదధియుఁగూడనై యుపకరించెను. భక్తిభావ ప్రేరితులగు నేటి కవులకునుఁ దమ ప్రతిభావ్యుత్పత్తులఁ బ్రకటించుటకును తరించుటకును సాధనముగుచు విరాజిల్లుచున్నది.

రామాయణమునకు తెలుగు సాహిత్యమునం దత్యంత ప్రాముఖ్యత కలదు. కావ్య, పురాణ, ప్రబంధ, ద్విపద, శతక, వచన, యక్షగాన, దండక, పద, గేయ సంకీర్తనాది సాహిత్య విభాగముల నన్నింటి యందును, మహాకావ్యములు మొదలుకొని స్త్రీ బాల జానపద గేయములు, పాటలవరకు రామకథ రచింపబడినది. ఇవన్నియు కలిసి నాలుగువందల రచనలవరకు వెలువడినట్లుఁ దోచుచున్నది. తెలుగులో రామాయణసాహిత్యము క్రీ. శ. 13 వ శతాబ్దమునుండి వర్ధిల్లుచు నీ ఏడువందల సంవత్సరములలో వెలువడిన వాఙ్మయను ముఖ్యముగా దాశరథీ రామతారకము మున్నగు శతకములును, త్యాగరాజ రామదాసాది మహాభక్తుల కీర్తనలును, రామభక్తిని దక్షిణదేశమందంతటను ప్రసరింపజేయుటకు గొప్ప సాధనములుగా నుపకరించినవనుట నిర్వివాదాంశము.

చంపుకావ్యములలో మంత్రిభాస్కరుని 'భాస్కర రామాయణము' క్రీ. శ. 13 వ శతాబ్దారంభములో రచింపబడినది. అదే యుపలబ్ధ గ్రంథములలో మొదటిదిగా పరిగణింపబడుచున్నది గోన బుద్ధారెడ్డి రచించిన రంగనాథ రామాయణము (ద్విపద) క్రీ. శ. 1270-1280 మధ్యకాలమునకుఁ జెందినది. ఇది ముఖ్యమైన రెండవకావ్యము. తాళ్ళపాక అన్నమాచార్యులు (క్రీ. 1408-1503) తమ తాతగారగు ప్రథమ సంకీర్తనాచార్యులగు నన్నమయ్యగా రొక ద్విపదరామాయణమును రచించిరని వ్రాసిరి, కాని యది సంపూర్ణముగా దొరకలేదు. ఎఱ్ఱాప్రగడ రామాయణము (క్రీ. శ. 1310)

లక్షణగ్రంథములలో నుదహరింపబడినదేకాని లభింపలేదు. చిత్రకవి, అనంత కవి రచించిన పూర్ణరామాయణమును లభింపలేదు. అయ్యలరాజు రామభద్ర కవి రచితమగు 'రామాభ్యుదయము' సుప్రసిద్ధమగు నుత్తమ కావ్యము. ద్విపద కావ్యములలో కట్టా వరదరాజు (క్రీ. శ. 1650) రచితమగు శ్రీరామాయణము (మద్రాసుప్రభుత్వముచే ప్రకటితము) అధ్యాత్మరామాయణము, గోపీనాథ రామాయణము, మొల్లరామాయణము మున్నగు ననేక సుప్రసిద్ధ గ్రంథములు రామాయణ వాఙ్మయ సమృద్ధిని చాటుచున్నవి. ఆధునిక కాలమున కీ. శే. ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారును, కీ. శే. జనమంచి శేషాద్రిశర్మగారును. సుప్రసిద్ధాంధ్రాస్థానకవులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, వేంకట పార్వతీశ్వరకవులును వ్రాసిన రామాయణములు గలవు. శ్రీ కె. అశ్వద్ధనారాయణరావుగారును శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు మున్నగు మరికొందరు, దమ తమ యుదాత్తమైన ఫక్కిలో రామాయణమును రచించిరి. వీరిలో పలువురు యథా మాతృకగా రచింపఁ బ్రయత్నించిరి. ఇతరులు స్వేచ్ఛాగతిని రచనను సాగించిరి. సాహిత్య దృష్టిచేఁ నన్నియు నొకే స్థాయికిఁ జెందినవి కాకపోయినను, వీని కన్నింటికిని ప్రేరకమగునది రామకథాకథనము తరణోపాయమను విశ్వాసమే గాని వేరొండు కాదు. కొందఱు కవులు నవవిధ భక్తిభావోద్రిక్తులై చిత్తము పులకరింప, చిగిరించి పుష్పించిన కావ్య సుమములచేఁ సీతారాముల బూజించిరి. ఈ కావ్యమును నట్టిదే. సహృదయ హృదయస్పందియగు నీ కావ్యము సర్వ సమాదరణీయమే యగును.

కావ్యకర్తలు 'మరల రామాయణమా' యను శీర్షిక క్రింద పది పద్యములలోఁ దమ రామాయణ కావ్యరచనకు కారణములనుఁ జూపించిరి.

ఉ. వ్రాసిరి మున్ను రామకథ భాస్కర ముఖ్య మహాకవీశ్వరుల్
చేసిరి రామ గానమును జెల్వుగ వాల్మికి వ్రాసినట్లు నీ
వాసరి వత్తువా ? యటుల వ్రాయగ రాఘవు దివ్యగాథలన్
వేసరిపోదె లోకము కవీ! "యికఁ జాలను" వారలుండరే ?

యను నాశంకకు "భక్తిమై చిందులు ద్రొక్కఁగాఁగలుగు చిత్తము రామపదాబ్జ భృంగమై, యిందున విందుసేయును జుమీ! నవభక్తిరసామృతమ్ము, నానందమయమ్ముగాఁ గన వినఁగా విసువుండ దలౌక్య సద్రతిఁగా" అని సమాధానమొసంగిరి. 'శ్రీరామ నీనామ మెంత రుచిరా' యని రామదాసు పాడలేదా?

'భవబంధములఁ ద్రెంపి, ఐహిక మనోభావములఁ జంపి, లోక విశిష్టమగు నిత్య సత్య పదవిని గర్మాత్ములనుఁ జేయు రాఘవు చారిత్ర' కథనమునందు పునరుక్తి దోషముగాని, విసువుగాని జనింపదుగదా! ఇష్టదేవతాప్రార్థన మొనరించు నెడ,

తే. జానకిని రాఘవుఁడు వీడు చరిత నాఁడు
భక్తతతి కంటఁబడి పెట్ట వ్రాసినాఁడ
జానకిని రాఘవుఁడు గూడు చరిత నేఁడు
భక్తతతి సంతసింపంగ వ్రాయువాఁడ.

నని మఱియొక కారణమును గూడ జూపించినారు. మొదట కరుణరస ప్రధానమగు నుత్తర రామచరిత్రను కవనించి పిదప మంగళాత్మకమగు సీతారామ వివాహఘట్టముగల బాలకాండవైపు దృష్టి మరల్చిరి.

ఆచార్యులవారు తమ స్వీయచరిత్రమునుఁ గొంతవరకు 'శ్రీలీలా కృపాశ్వాసము' న నాశ్వాసాంత పద్యములందు వివరించియున్నారు. వారు గాంధీ మహోద్యమమున దాదాపు నలువది సంవత్సరముల క్రితమే కాలిడి "యా గురువర్యుని పథానఁ నంధునిబోలి లోకగతి నారయ" కుండ జరించిరి. త్యాగమే మహాబంధముగాగ దుర్భర విపత్తులకు పాత్రులైరి. "జీవితవిలాసములఁ ద్యజియించి, తాతతండ్రుల ధనధాన్య సంపదల దుల్లగఁజేసి, స్వదేశ సేవబందెల వసియించి, గాంధి గురుదేవుని యాజ్ఞఁ జరించి" యరువదేండ్ల ప్రాయమున రుగ్మతలచేతనుఁ గష్టపరంపరలవల్లను పీడితులై యలసిన దేశసేవకులు. జగమెఱిగిన బ్రాహ్మణులు. కావున వారికి నా పరిచయవాక్కులను జందెపు పోగు లనవసరము. లోక సంగ్రహార్థమగు నిష్కామ కర్మయోగముతోపాటు, జ్ఞాన వైరాగ్య సమన్వితమగు భక్తియోగ సమ్మేళనము బంగారమునకు తావియబ్బి వన్నెఁబెట్టి నట్లున్నదాచార్యులవారి జీవితము. కాలానుగుణ్యముగ నుప్పొంగిన యా మనోభావముల వెల్లువయే కావ్యరూపమున వారి రసవల్లేఖినిద్వారా వెలువడినది. కనుకనే యఖిలాంధ్రుల కాస్వాదనీయము.

ఆచార్యులవారు 'వివిధ శాస్త్రార్థ సంస్కార విదుఁడగాను, భక్తిలేశాన మాత్రమే పరగువాఁడ' నని సహజ వినయానుసంధాన మొనరించి, వాల్మీకి హృదయంబునందుఁ జొరగ సాహసించి, 'నీ సమర్చకుపాధిగా నేరచింతు నాది కావ్యంబురీతి స్వేచ్ఛానుగతిని' యని వక్కాణించిరి. ఈ స్వేచ్ఛానుగతి కావ్యారంభమునుండియే దృగ్గోచరమగుచున్నది. సంప్రదాయము ననుసరించి ఇష్టదేవతాప్రార్థనముతో నారంభించినను, మిగత శీర్షికలన్నియు స్వేచ్ఛాను

గతియొక్క యుదాహరణములే. అట్లే బాలకాండ కథయంతయు మూ డాశ్వాసములయందు విభజింపబడినది. (1) శ్రీలీలా కృపాశ్వాసము (2) అవ తారాశ్వాసము (3) శరణాగతాశ్వాసము. ఇదియు నపూర్వమగు విధానమే. బాలకాండయొక్క కథాభాగమధికము మూడవదగు 'శరణాగతాశ్వాసము' నసే నిమిడ్చబడియుండుట, కవివర్యులకు శరణాగతి సిద్ధాంతముపైగల విశిష్టాభి మానమును వ్యక్తపరచుచున్నది.

ఉ. పాడియుఁ బంటయుం గృహము బంధువులాప్తులు పుత్రపౌత్రులుం
బోడిమియుం జవమ్ము హృది బుద్ధియు, విద్యయు సర్వమీవె, నీ
వాఁడ, త్వదంఘ్రి పద్మములవాఁడఁ జరించెడివాఁడ, వడ నీ
నీడ సుఖంతు శాంతిఁగని నిం గనుచుం సతతమ్ము రాఘవా !

గీ. సర్వ ధర్మమ్ములను వీడి శరణమంటి
"అన్యథా శరణం నాస్తి" యంచు నిన్నె
శరణమంటి, స్వయంకృషి సమసె నంటి,
నిదిగో దాసోహమంటి, నన్నేలుమంటి.

పై ప్రథమాశ్వాసాంత పద్యములు శ్రీ వైష్ణవ సంప్రదాయముయొక్క విశిష్ట సిద్ధాంతమగు ప్రపత్తి యోగమును సంపూర్ణముగా కవిగారు విశ్వసించు చున్నారని విస్పష్టముగా తెలుపుచున్నవి.

మూడాశ్వాసములలో ముగింపబడిన నీ కావ్యములో స్వేచ్ఛానుగతియే స్పష్టముగా గానవచ్చుచున్నదని పైన నుడివియుంటిని. ఆమాట నించుక వివరింపవలయునన్న కథా సంవిధానమును, రచనాశైలిని, ఇతర కావ్య గుణములను విపులముగా చర్చింపవలసి యుండును. కావున పై యభిప్రాయ మును సమర్థించుటకై కొన్ని యుదాహరణముల నొసంగుట చాలును. ప్రథమాశ్వాసమున రామాయణకథ కుపోద్ఘాతప్రాయమైన వాల్మీకి తమసా నదీతీర గమనము, వాల్మీకి శాపము, గురుశాపమనన మను మూడు విష యములే వర్ణితములైనవి. ద్వితీయాశ్వాసమునందు దేవతల విష్ణుసందర్శనము, రావణ దుష్కార్య వివరణము, శ్రీమన్నారాయణ వరప్రసాదము, దశరథుని పుత్రకామేష్టి, శ్రీరామాద్యవతారము, మాత్రమే వర్ణింపబడినవి. మూలము నందలి పదునెనిమిది సర్గలకథను ప్రథమ ద్వితీయాశ్వాసములందు సంగ్రథించి శేషించిన ఏబదితొమ్మిది సర్గలకథను తృతీయాశ్వాసమునందు కూర్చి శరణా

గతాశ్వాసమని పేరిడినారు కవులు. ఈ కథా సంవిధానమును పరిశీలించినను, స్వచ్ఛందతయే వ్యక్తమగుచున్నది. ఇట్లే అప్రధానములని వారికి గోచరించిన యనేక విషయములను పూర్తిగా వదలివేసియో, లేక సంగ్రహముగా వర్ణించియో, బాలకాండ నొక ప్రబంధశైలిలో రచించినారాచార్యులవారు.

ఉ. ఆ తమసానదీ సలిల మా తటినీ పులినస్థలమ్ము లా
యా తరుకాండ విస్తృత మహాలత లా సుమపల్లవమ్ము లా
శీతల మందమారుత నిషేవిత సంధ్యలు మేతలన్ దమిన్
గూతలఁ జోడువీడని శకుంతము లెంతొ మనోహరమ్ములౌ.

యను మనోహరమగు వర్ణనతో నారంభించి, యథామూలముగా నానదీ జలనిర్మలత్వమును 'నితాంతమ్ము సత్యరతుండౌ నరు మానసమ్మునగ దీర్ఘమ్ముం డెనిష్పంకమై' యని కొనియాడిరి. క్రౌంచవధను కన్నులతో గాంచిన వాల్మీకి హృదయ సంక్షోభమును, క్రౌంచియొక్క దుఃఖమును కనులకు కట్టినట్లుగా మూలమునకంటె మిన్నగా కావ్యపఙ్క్తిలో హృదయ విదారకముగా చిత్రించిరి.

మ. శవముఙ్గాంచుచుఁ గ్రిందు మీఁదెగయుచున్ సంక్షోభముంబొంది పెన్
రవమున్ సల్పుచు ముక్కుమూయుచును దీవ్రంబైన దుఃఖంబుతోఁ
బవలే చీఁకటిగ్రమ్మ నిత్యసఖునిన్ బ్రాణేశుగోల్పోయి, దై
వవిధింగాంచఁగలేదు క్రౌంచి, తరణోపాయమ్ము సర్వేశుఁడే.

'మానిషాద' యను శ్లోకార్థము నిట్లు వచించిరి.

చ. తగదు సుమా నిషాద! యటు తన్విని భర్తను వేరుసేయఁగా
నగునె! ప్రతిష్ఠ నిల్వదు సుమా యిక నీ కిల శాశ్వతాబ్దముల్
యుగళము కామమోహితమహో! మిథునంబున నొక్కదాని దు
ష్టగతి వధించినావనుచు శాపమిడె న్ముని దుఃఖతప్తుడై.

కథా విషయములను వీలైనంతవరకు యథామూలముగ గ్రహించినను, మూలములోని శబ్దములనే కొన్ని స్థలములందు భావార్థవిస్పష్టతకొఱకో, లేక రమణీయతకొఱకో, స్వీకరించినను, కవులు దమస్వతంత్ర భావ ప్రకటనా చాతుర్యమును, లలిత మధురమైన రచనాశిల్పమును, బహుముఖముల వెల్లడించినారు. కేవల కథాకథనముకాక స్వాభిప్రాయ సూచకములగు ననేక సూక్తులతో నిండియున్న దీ కావ్యము. ఆశ్వాసాంత పద్యము లీ కావ్యము

యొక్క lyrical quality ని విస్పష్టము గావించుచు పోతన్నను గోపన్నను దలపించుచున్నవనుట యతిశయోక్తి కాదు. అవతారాశ్వాసము దేవతలు విష్ణుసందర్శనమునకై నేగుటతో నారంభింపబడినది.

మ. అదె వైకుంఠపురంబు; నయ్యదియె పుణ్యక్షేత్ర మందే మహో
దధి నాదిన్ వటపత్రశాయి సతతార్తత్రాణదక్షుండు మా
సుదతీయుక్తుఁడు శంఖచక్రయుతుఁడున్ సూరివ్రజశ్లోకుఁడున్
దుదిలేకుండెడి శేషతల్పుఁ డగు నిత్యుం డుండు లీలారతిన్.

అని పద్మోద్భవుఁ డా సురేశునకు నిత్యానంద దివ్యస్థలంబును జూపింపఁగ నాతడు 'దన్యోస్మి' యనెను. దశరథుని యశ్వమేధయాగము, ఋశ్యశృంగుని యాగమనము మున్నగు భాగములను వదలి ప్రకృతమగు రామాద్యవతార ఘట్టమునే చక్కగా కవనించినారు. ఈ సందర్భమున నీశ్వరుడు పార్వతికి భవిష్యత్తు నెఱింగించుచుండ నంది విని రావణవధోపాయము నా యార్తులగు దేవతలకు సూచించినట్లును, నట్లే ఇంద్రుడు సురాళితో గలసి బ్రహ్మ వెంబడి విష్ణుపదమునకు వెళ్ళుచుండగా నశ్వినీ దేవతలు జయవిజయులకు శాపమొసంగ వారు ప్రతిశాప మొసంగుటయు నలువురును రాక్షసులై జనించుటయు మున్నగు వశిష్ఠరామాయణ మందలి కథను బొందుపరచినారు. ఇటులే పద్మ పురాణోత్తరఖండమందలి భారద్వాజ రామాయణమునుండి నెలలు నిండిన కౌసల్య నిద్రావస్థయం దప్పుడప్పుడు వాసుదేవుడు గరుడవాహనమెక్కి లోకంబుల విహరించుచున్నట్లు కలలుఁ గనియెననియు నట్లే యామె స్వప్నములోఁ దన చేతులనుండిన పాప రాక్షస వీరు నధిక్షేపించుచు 'గాయము చీల్చెద ధర్మ రక్షణం జేకొనినాడ'నని ప్రతిజ్ఞ చేసినట్లు వాక్రుచ్చినారు. ఆచార్యులవారు రామాయణమును యథావాల్మీకముగాఁ గాక మనోహరమగు నితర పురాణాంతర్గతములగు గాథలను స్వీకరించి తమ కావ్యమును మనోరంజకమగు స్వతంత్ర ప్రబంధముగా రచించిరని తేటతెల్లమగుచున్నది.

మూడవదగు శరణాగతాశ్వాసమును దశరథసభావర్ణనముతోడ నారంభించి అయోధ్యకు సీతారాములరాక వరకు బాలకాండ కథను పూర్తి గావించిరి. దీర్ఘమగు నీ భాగమునందు కవివర్యులకుఁ దమ వాచోవిధేయతను సులలిత వృత్తరచనా పాటవమునుఁ బ్రకటించుటకు సంపూర్ణావకాశము లభించినది. వివిధ సంఘటనలను నాటక కళానైపుణ్యమును సూచించు ధోర

ణిలో వర్ణించి కావ్యమునకు మనోహరత్వముసు జేకూర్చినారు. ఈ యాశ్వాసమున బాలకాండ యొక్క శేషించిన కథను సంగ్రహించి ధారాపాతమువలె నిరాటంకముగఁ బ్రవహించు సెలయేటిని దలపించు పద్యములచే నింపినారు. కష్టింపక దొరలు శిష్టభాష నుపయోగించుచు శబ్దాలంకారములకై తడుము కొనక సహజ భావప్రకటనమును భక్తిరసైకనిష్ఠను ప్రధానముగా గమనించినారు. అందువలననే రసనిర్భరమగు కావ్యమును పాఠకలోకమున కందజేయ గలిగినారు. కొన్ని రసనిర్ఝరులగు పద్యముల నుదాహరించి దీర్ఘమైన నీయుపోద్ఘాతమును ముగింతును. శ్రీరామజనన భాగ్యము గలిగిన కౌసల్యను గుఱించి :

ఉ. ఎంతటి వారికబ్బు జగదీశ్వరుఁ బొత్తిటఁజేర్చి సాకు సా
మంతము కోసలాత్మజ సుమా కనఁగల్గె, ఋషీశ్వరాళి యెం
తెంతగ మౌనముగ్ర ధరియించియు నిశ్చలయోగులయ్యు నే
వింతురె కాని వాని కనిపెంచెడి సంతత పుణ్యమబ్బునే ?

లక్ష్మణుడు బాల్యమునుండి రాముని కొనరించుచున్న సపర్యలు :

ఉ. రాముడు గుఱ్ఱమెక్కుతఱి రాగముతోడ సుమిత్రసూనుఁ డా
రాముని పజ్జనిల్చును బరా కొకయింతయులేక కళ్ళెమున్
నీమముతోడఁ బూని మఱి నేరుపుతో నదలించునంత నా
రామము లన్నియుందిరిగిరా నట నిల్చును గళ్ళె మూనఁగన్.

అయోధ్యను గుఱించి :

ఉ॥ ఆపురిపే రయోధ్య నిజమన్యులకున్ జొరరానికోట, యే
తాపములేక నా దశరథ ప్రభు వేలెడివాడ సజ్జనుల్
కాఁపురముండు నీడ రఘు కాంతులకున్ వసియించు దుర్గమై
యేపుగనెన్ యశంబున మహిన్ సరిపోలక యే ప్రదేశమున్.

విశ్వామిత్రునిరాక.

ఉ. అత్తరి యొక్కనాడు వసుధాపతి మౌనులఁ గూడి కొల్వునన్
చిత్తము పల్లవింపఁగ వసిష్ఠుడు దెల్పెడి ధర్మసూక్ష్ములన్
బత్తిని నాలకించు తఱి వచ్చెను కౌశికుఁ డంత రాజు చే
యెత్తి నమస్కరించి మునికిట్టులు వల్కె సపర్యసిమ్మటన్.

విశ్వామిత్రుడు రాముని యాగరక్షణకై యాచించుట :

ఉ. వచ్చితి నందుచేత రఘువంశసుధాకరు నాశ్రయింపఁగా
సచ్చరితా! స్వపుత్రకుని సత్యపరాక్రము రాముఁగూరునిన్
గుచ్చుగఁ బిల్లజుట్టుగల కోమలు మీసుకుమారు జ్యేష్ఠు నా
కిచ్చిన రాక్షసుల్ మడియరే త్రుటి, రాముని నాకొసంగుమా!

'కుచ్చుగఁ బిల్లజుట్టుగల కోమలుడు' రాముడు. రఘువంశమునందలి 'కాకపక్ష ధరుడగు' బాలుని స్మరించజేయుచున్నది. దశరథుడు రామునిబంపుట కంగీక రింపక మునిని వేడుకొను సందర్భమునను, విశ్వామిత్రుడు కోపించినపుడును, సరయూనదీతీరముఁజేరి బలాతిబల విద్యలనుఁబడసి రాత్రి దర్భాసనములఁ నిద్రించుటయును, గంగానదీతీర వర్ణనము, తాటకావధ మున్నగు యుద్ధ సన్ని వేశములును, వేయేల యన్ని సన్నివేశములును స్వభావ సిద్ధముగాను మనో రంజకముగాను వర్ణింపబడినవి. పాత్రౌచిత్యము ప్రధానముగాఁ బాటింపబడినది. అహల్యాశాపవిమోచన ఘట్టము రసవత్తరముగా వర్ణితమైనది. ఉదాహ రించుటకు కొల్లలుగా పద్యములున్న నీ కావ్యముయొక్క మాధుర్య మనుభ వైకవేద్యము. ఆచార్యులవారు వృత్తములనేగాక ద్విపదలను ఉపజాతులను కూడ చక్కగా నడపించినారు. రసనిర్వృతికి సహృదయులగు పాఠకులే ప్రమాణము. వారి గోవిందరామాయణము కొండలున్నంతకాలము చిర స్థాయియై శ్రీరామ కైంకర్యమున కుపకరించుగాత!

రాజభవన్,
తిరువాంద్రం
25-3-60

బుధజన విధేయుడు,
బూర్గుల రామకృష్ణారావు

---

(43 వ పేజీ తరువాయి)

"పరతత్త్వార్థమునే తలంచుచు, రోజులలో కృపాపారీణ నిన్ జూడగా శరణం బందును నీకె నేనిక సద్భావసద్భక్తి గేల్మోడ్చి" అను వారి పద్యమే, పై విషయముల నుద్ఘోషించుచున్నదిగదా!

భౌతిక ప్రపంచమే పరమావధి యనియు, భావకవిత్వమే పరమమార్గ మనియు పరిగణింపబడుచున్న ఈ రోజులలో శ్రీ గోవిందాచార్యుల వారు ఇట్టి అమూల్య కావ్యమును రచించి ప్రజలకందించి సారస్వత సేవ చేయ గల్గియుండుట ఎంతయు ప్రశంసనీయము.

—పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు
10—3—60.

# మనవి

## వ్రాతప్రతి

"శ్రీ గోవిందరామాయణము — సీతారామ" మను నీ కావ్యరచనము 1944 వ సంవత్సరము ఏప్రియలు మాసమునందు సంపూర్ణమైనది. ఆశ్వాసాంత పద్యములు మాత్రమే మార్పుచెందినవి. 1959 సంవత్సరాంతమునం దీపద్యములను మరల వ్రాసితిని. దీర్ఘకాలము ముద్రింపజాలనైతిని. తత్కారణమున రెండుమారులు వ్రాతప్రతిని, వ్రాయుట అవసరమైనది. ఎట్టకేలకు ఆ సీతారాముని కృప నేటికి లభ్యమై, యీ కావ్యము నాంధ్ర మహాజనుల సన్నిధానమునం దుంచుచున్నాను.

శ్రీయుతులు అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, ఆయుర్వేద వైద్యులు శ్రీరంగం సుబ్బారావుగారు, అక్కినేని జానకిరామారావుగారు, బుర్రా సుబ్బారాయుడుగారు, కుప్పా వేంకట చలపతిగారు (బెజవాడ)ఒసంగిన చేయూతవలన నేటికైన నీ కావ్యమును ముద్రింప సమకట్టితిని.

ముద్రించుట కనువుగ వ్రాత ప్రతిని శ్రీ వెల్దండ ప్రభాకరరావుగారు వ్రాసి తోడ్పడిరి. వీరెల్లరకు గృతజ్ఞుడను.

శ్రీయుతులు డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు, కీ. శే. కురుగంటి సీతారామయ్యగారు వ్రాతప్రతి నంతయు చదివిరి. శ్రీయుతులు శివశంకర శాస్త్రిగారు, వేదాల తిరువేంగళాచార్యులుగారు, డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు, ముదిగొండ వీరభద్రమూర్తిగారు మొదలగు మిత్రులకు జదివి వినిపించితిని. ఈ కావ్యమునుముద్రింప సమకట్టుట కీ సహృదయుల ప్రోత్సాహం మొక ముఖ్య కారణము.

## నూతన వ్యాఖ్యానములు

వాల్మీకిప్రోక్తమగు బాలకాండ కథలో గొన్ని యెడల వాడుకయందు లేని నూతన వ్యాఖ్యానములను నిందు పొందుపరచితిని. "ఈ వ్యాఖ్యానములు సక్రమమైనవిగ, సమీక్షలయందు విబుధు లంగీకరించిరి." ఇందుల కెంతయు సంతసించుచున్నాను. సహృదయులగు పాఠకులు - భక్తులు - ఈ విషయముల గ్రహించి, ఆనందింతురుగాక.

లక్ష్యములు

ఈ కావ్య రచనమున (1) ఔచితి (2) రసము (3) పాకము (4) నూతన విషయ పరిశోధన, యీ నాలుగు విషయములు; నాలక్ష్యములు. ఆ సీతారాముని కృప ఎంతవఱకు లభించినదో, అంతవఱకు మాత్రమే యీ లక్ష్యములతోఁ గృతార్థుడను. ఎంతదనుక, ధన్యుడ నయినదియు, పాఠకులే నిర్ణయింపగలరు.

ప్రయోగములు

ఇం దొకటి రెండు ప్రయోగములు వాడుకభాష ననుసరించి చేయబడినవి. "వరవడి" యని "ఒరవడి"కి మారుగ వాడితిని. ఇట్లే మరొకటి రెండు ప్రయోగములు గలవు. ఇవి బుద్ధిపూర్వకములు.

ముద్రణము

అందచందములతో నీ కావ్యమును ముద్రించిన, అజంతా ముద్రణాలయాధిపతు లిట అభినందనార్హులు.

స్ఖాలిత్యములు

పఠనమునకు గాని, రసాస్వాదనమునకు గాని ప్రతిబంధకములు గాని కొన్ని సాంకేతిక స్ఖాలిత్యము లిందు జొరబడినవి. ఇవి చాలవఱకు, ఁ, ఱ, న, య, లకు సంబంధించినవియే. ఇవియు "తప్పు—ఒప్పుల పట్టిక"లో సవరింపబడినవి. పాఠాంతరములను, శుద్ధపత్రమును పండితులు, పాఠకులు, వినియోగించుకొనెదరుగాక.

ఇతర మిత్రులు

ఈ కావ్య ముద్రణమున, వివిధరీతుల మరికొందఱు మిత్రులు, చేదోడు వాదోడుగా నుండిరి. శ్రీయుతులు కొమ్మవరపు సుబ్బారావుగారు, సింగరాజు లింగమూర్తిగారు, భాగవతుల లక్ష్మీనారాయణగారు మొదలగువార లిట పేర్కొనదగినవారు.

ధనసహాయము

ముద్రణమునకై ధనసహాయ మొనరించిన దాతల నామములు వేరొక చోట ప్రకటించితిని. వీరికి కృతజ్ఞుడను.

పండితాభిప్రాయములు

నా కావ్య ప్రేరణమునఁ బండితు లొనరించు సమీక్షలలో వాల్మీకి రామాయణ విశేషము లెన్నియో పాఠకులకు లభింపగలవని పండితాభిప్రాయముల నర్థించితిని. ఈ నా సంకల్పమునఁ జాలవఱకు కృతార్థుడనైతిని. కోరిన మాత్రమున శ్రమయనక, యీ కావ్యమును జదివి తమ తమ యభిప్రాయముల బ్రసాదించిన పండితులకు - పండిత కవులకు - మిత్రులకు, గవర్నరుగ ఎడతెగని రాజ్యాంగ పరిపాలనాభారము వహించియు, నా కోరికను మన్నించి ఉపోద్ఘాతమును వ్రాసిన డాక్టరు బూరుగుల రామకృష్ణారావుగారికిని నా ప్రణామములు.

ఆశయము

అనఘ కాలములో సశేషమగు శ్రీమద్రామాయణ గాథనంతయు గావ్యరూపమున ముద్రింపగలుగు శ్రద్ధాభక్తులను (శ్రీ గోవింద రామాయణము - సంత్రాణ రామము) ప్రసాదించి మా సీతారామచంద్రుడు నన్ననుగ్రహించుగాక.

ఈ కావ్యమును జదివి, ఆనందించి, పండితులు, కవులు, భక్తులు, సహృదయులు, సుప్రసన్నులై దీవింతురుగాక,

తుదిమాట

మ. "హరినామ స్తుతిసేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానసరస స్ఫూర్తిన్ వెలుంగొందు ఆ
హరినామ స్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవ త్కాకోల గర్తాకృతిన్.

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగము సేయుఁగావున హరిన్ భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్వజ్ఞ చింతింపుమా"
(—భాగవతమునుండి)

మకాం : 6-3-911/1
ఖయిరతాబాదు (పోస్టు)
హైదరాబాదు—4
ఆంధ్రప్రదేశ్.

ఇట్లు
సకలజన విధేయుడు
ఆత్మకూరి గోవిందాచార్యులు.

శ్రీరామార్పణమస్తు

ఓమ్

శ్రీరామాయనమః

# శ్రీ గోవింద రామాయణము

## 'సీతారామమ్'

### బాలకాండ

### ఇష్టదేవతా ప్రార్థనము

ఉ. శ్రీనిధియై యనాది చిదచిత్సదసన్మయ మాతృదేవియై
భానుసహస్రమండలవిభా ప్రతిభాసితమూర్తి గల్గియున్
జానగు మోమున న్మధుర శాంత మృదూక్తులఁ బల్కు బాల నా
మానసమందు నిల్చి యభిమానముతో సుకవిత్వ మిచ్చుతన్. 1

ఉ. శ్రీరమణీలలామ చిదచిన్మయరూపవిశేష బాల ఓం
కారి త్రిలోకసుందరి జగత్త్రయకర్త్రి ప్రశాంతమూర్తి ది
వ్యారుణకాంతిదీప్త త్రిగుణాత్మక పుస్తకపాణి మాత, కై
వార మిదేసుమా ననుఁ గృపం గని నిల్వుము నాదు వాక్కునన్. 2

ఉ. శ్రీలలితాస్వరూపము విశేషశుభంకరమూర్తి సర్వలో
కాళి సృజింపఁ బెంప విలయమ్మొనరింపఁ దనంతఁ జాలు నా
బాల త్రిలోకసుందరి కృపారసపూర్ణవిలోకనప్రభా
జాల మదంబ ప్రోచుత రసప్లుత సత్కవితా ప్రదాత్రియై. 3

ఉ. ఉత్తరరామసత్కథ మహోత్తమరీతి రచింపఁజేసి నా
చిత్తము బత్తి నత్తునటు జేసితి వమ్మరొ మున్ను దీక్షతో,
నిత్తఱి జానకీరఘువరేశుల పెండిలి వ్రాయనెంచి చే
యెత్తి నమస్కరించెద నిదే కరుణింపఁగదే శివంకరీ ! 4

తే. జానకిని రాఘవుఁడు వీడు చరిత నాఁడు
భక్తతతి కంటఁదడి పెట్ట వ్రాసినాఁడ
జానకిని రాఘవుఁడు గూడు చరిత నేఁడు
భక్తతతి సంతసింపంగ వ్రాయువాఁడ. 5

తే. కరుణరసవర్తి యీ మహాకావ్యమూర్తి
భవజలధిఁదాటు గతిఁజూప భక్తతతికి
భక్తిరసము పునాదిగాఁ బాదుకొలిపి
కట్టెదఁ బ్రపత్తిసౌధ మీ కావ్యమందు. 6

తే. భక్తిరసము ప్రధానమౌ ఫణితి యిద్ది
రక్తి గట్టెనా ? లేదొ ? సద్భక్తవరుల
సూక్తులే ప్రమాణమ్ములౌ; ముక్తి గోరు
కవిత యిందుండదగునె శృంగారఁగతులు ? 7

క. ద్రాక్షాపాకము నెక్కొన
దీక్షనుఁ గృపసేయుమమ్మ దేవీ, విద్యా
భిక్షము నిమ్మ ! కవితా
శిక్షణ ఘటియిల్ల జగము శ్రేయము కొఱకై. 8

ఉ. నీ దరహాసచంద్రికల నే విహరించుచు శైలి గూర్తు నీ
మోదపుఁబల్కులం దొలుకు మోహసుధన్ రసమున్ గ్రహింతు నీ
పాదసమాశ్రయంబులగు పాంసువులన్ మృదుభావజాల సం
పాదన నేతు రామవిభు పావన రమ్యకథా విధాయినై. 9

చ. పరిణతి నొందఁజేసి ననుఁ బాలన సేయుచు నా కలమ్ము నీ
వరపడిఁ దప్పకుండ నడువం గృప సేయు, మలోకమాధురీ
భరిత మృదూక్తులన్ సకలభక్తజనుల్ పరితృప్తి దీవనల్
పరుపఁగ నాపయిన్ మరి భవం బిఁక లేక తరించునట్లుగన్. 10

## వాల్మీకి స్తుతి

ఉ. నారదసూక్తమైన రఘునాథు కథన్ విని యే ఘనుండు శృం
గారరసైకలగ్నమగు క్రౌంచయుగిన్ మగదాని బోయ పో
కారుప, లోనపొందు కలకన్ శపియింపఁ దదుక్తిమాధురీ
సారమె సత్కవిత్వమయి సంధిలె, నమ్మహితాత్ము నెన్నెదన్. 11

శా. గారాబంబున జానకీధవు మతే కామ్యంబులఙా గోర దీ
ధీరస్వాంత మొకప్పుడేని, అల వైదేహీశు వాత్సల్యమే

కోరుంగాని ; మహాత్మ ! నిన్ దలఁచి నీ గోరంత సద్భక్తిచేఁ
బ్రారబ్ధంబు లయించురీతి మనెదన్ వాల్మీకి ! దీవింపుమా. 12

## భక్త స్తుతి

గీ. మధురతమ రామనామ సంస్మరణజలధి
మునిఁగి తేలుచు విహరించు పుణ్యమూర్తి
భక్తభక్తుని శ్రీరామభక్తవరుని
ననఘు బావని నెంచి దాసోఽహమందు. 13

గీ. ధ్యాన గానామృతమయుండు త్యాగరాజు
పున్నెములప్రోవు కవిరాజు పోతరాజు
పాపరహితుండు భక్తుండు గోపరాజు
విడువ కేవేళ నన్ను దీవింత్రుగాక. 14

## పూర్వకవి స్తుతి

మ. కవితా మంజుల పుష్పడోలికల ముక్కాలమ్ములందుꣳ మహా
కవులై యెవ్వరు మువ్వురే, విమలులై కాల్సాచి యూగంగలా
రవరోధమ్మను మాట లేక, కవు లాయావృత్త సంకీర్తనో
త్సవముꣳ సల్పగ, నా కవిత్రయము నే ధ్యానించెదꣳ సర్వదా. 15

గీ. ఆంధ్రగీర్వాణభాషల నధికభక్తి
జానకీజాని చరితనే పూని వ్రాసి
సాహితీవృద్ధి సలిపిన సకలకవుల
భక్తభక్తుండనై సదా ప్రస్తుతింతు. 16

## మరల రామాయణమా ?

ఉ. వ్రాసిరి మున్ను రాముకథ భాస్కరముఖ్య మహాకవీశ్వరుల్
చేసిరి రామగానమును జెల్వుగ వాల్మికి వ్రాసినట్లు, నీ
వాసరివత్తువా ? యటుల వ్రాయగ రాఘవు దివ్యగాథలన్ ?
వేసరిపోదె లోకము కవీ ? "యిఁకఁ జాలను"వార లుండరే. 17

ఉ. ఉందురు గాక వారు తగు నోర్పున నుందురు గాక భక్తిమై
చిందులుద్రొక్కఁగాఁ గలుగు చిత్తము రామపదాబ్జభృంగమై
యిందున విందు సేయునుజుమీ నవభక్తిరసామృతమ్ము నా
నందమయమ్ముగాఁ గన వినన్ విసువుండ దలౌక్యసద్రతిన్. 18

మ భవబంధమ్ములఁ ద్రెంపి యైహికమనోభావంబులం జంపి లో
కవిశిష్టంబగు నిత్యసత్యపదవిం గర్మాత్ములం జేయు రా
ఘవు చారిత్రమె ; యద్ది భక్తిరసయుక్తంబైన నద్దాన మా
నవలోకంబున కందరాని ఘనపుణ్యం బుండునే కోరుకోన్ ? 19

ఉ. వ్రాయఁగ లేఁడె వేఱొక ప్రబంధము భాస్కరపండితుండు లే
వే యతిరంజకంబులగు వేఱు పవిత్రకథల్ మహాకవుల్
వ్రాయరొ వానిఁ, గాని యవి రాజిలుచున్నవె నేఁడుగూడ రా
మాయణరీతి ? నెయ్యది సమానమగున్ రఘునాథుగాథకున్ ? 20

మ. కవితావస్తువు సాంప్రదాయికము, లోకజ్ఞానసందాయి యై
వివిధాధర్మసుధర్మనిర్ణయగతిన్ విశ్వార్థమై; సత్యమై
న, వరిష్ఠంబగు సత్ప్రబంధమునఁ బ్రాణంబై రసాఢ్యంబగున్
కవియున్ ధన్యత గాంచి నిక్కముగ మోక్షప్రాప్తి కర్హుండగున్. 21

చ. సకలకళావిశారదుని సర్వరసాత్మకమైన కావ్యమున్
వికలమనన్ సదా నరుఁడు వెంగలియై వెనుదీయఁబోడు మా
నక నలుసెంచు మానవుని నాణెముతోఁ బనిలేదు రాఘవుం
డొకఁడె దయాసుధాబ్ధి కణ మొక్కటి చిల్కఁ దరింపఁజాలమే ? 22

ఉ. వ్రాసితి నాదియందుఁ గడుభక్తిని గాంధిమహాత్మ తత్త్వమున్
వ్రాసితి దాస్యబంధగత భారతదేశ మహార్థశాస్త్రమున్
వ్రాసితి భారతీయ పరరాజ్యవిధాన విపచ్చరిత్రమున్
వ్రాసితి రామరాజు సతి బాసిన దుఃఖపరీతకావ్యమున్
వ్రాసి తరింతు నింక రఘువర్యు వివాహపవిత్రకావ్యమున్. 23

గీ. వివిధశాస్త్రార్థ సంస్కారవిదుఁడఁ గాను
భక్తిలేశాన మాత్రమే పరగువాఁడ

నయ్యె వాల్మీకి హృదయంబునందుఁ జొరఁగ
సాహసింతును మత్కావ్యసకలగతుల. 24

గీ. కవిజనమ్ములఁ బేరెక్కు కాంక్ష గాదు
కాదు త్వత్కథారచనకుఁ గారణమ్ము
నీకుఁగా భక్తిమై వ్రాసి నేఁ దరింతుఁ
జదివి లోకులు దరియింత్రు జానకీశ! 25

గీ. ఏరి దరిఁజేరియో కృతి నిచ్చు నర్థ
కాంక్షఁ గాదు నీ విస్మృతి గలుగకుండ
నీ సమర్చ కుపాధిగా నే రచింతు
నాదికావ్యంబురీతి స్వేచ్ఛానుగతిని. 26

## కృత్యాది మంగళము

ద్వి. ఫణిరాజశయన నిన్ భావింప వశమె
అణువులయందెల్ల నణువవై యుందు. 27

మహిమోన్నతిని నీకు సహచరుం డెవఁడు
మహితంబు లన్నింట మహితుండ వీవు. 28

నీ వెఱుంగని దెద్ది? యీ విశ్వమందు
భావింప నీలీలఁ బ్రభవించె సృష్టి. 29

నా కావ్యభర్తవై నాయందు నిలిచి
నీ కావ్యరచనమ్ము నెరవేర్చికొమ్ము. 30

అవధరింపగదయ్య యభిమాన ముంచి
అవనీసుతేశ నీ యసమానచరిత. 31

లలితస్వరూపంబు లావణ్యగరిమఁ
జిలుకు దీవని యెంతుఁ బలుకులన్నింట. 32

కలముతోఁ గవగూడి కదలిరావయ్య
కలికితో జతగూడి కులుకులాడుచును. 33

ఎటులుండు నీకృతి? యెన్నిక గనునె?
ఎటులున్న నాకేమి? యీ కృతి నీదె? 34

స్థిరభక్తిఁ దిలకమ్ము దిద్ది నీ నొసట
కర మనురక్తి నే కౌసల్య నౌదు. 35

మృదుశబ్దసుమమాల మెడలోనవైచి
హృదయంబు రహిఁజెంద బృథ్వీజ నౌదు. 36

భావాళి ధవళాతపత్రమ్ము వట్టి
పావనహృదయుఁడౌ భరతుండ నౌదు. 37

సరసంపుశైలి వింజామరల్ విసరి
మురిపించుచు సుమిత్రపుత్రుల నౌదు. 38

నవరసంబులవిందు నవగతిఁ జేసి
భవబంధముల ద్రుంచి పావని నౌదు. 39

మత్కావ్యమధుపర్క సత్కృతిఁ జేసి
సత్కర్మ వైదేహి జనకుండ నౌదు. 40

పట్టాభిషేకమ్ము భక్తి గావింతుఁ
బట్టంపు రాణిగా వర్ధిల్ల సీత. 41

ఏనాఁడు గాంతునో నే నట్టి సుకృతి
ఆనాఁడె యీజన్మ మమలమౌ నాఁడు. 42

సీతమ్మతల్లి నీ చెంత నిల్వంగఁ
జూతునా రామయ్య! జూచి మ్రొక్కెదన. 43

ఏమందువో నాఁటి కినకులచంద్ర
శ్రీమంతుడవుగాఁగ సీతతోఁగూడి. 44

మరచిపోకుమ నాఁడు మహి నేలుచుండి
మరువ నిచ్చునె భక్తు మాతల్లి సీత? 45

పవనాత్మజుఁడు లేఁడె భక్తులఁ దెలుప
భవదీయసత్కృపావర్ధిష్ణుఁ డతఁడు. 46

గోవింద రామ వైకుంఠ శ్రీరామ
నీవెకా దిక్కని నిన్నె నమ్మెదను. 47

శ్రీరామ జయరామ శృంగారరామ
కారుణ్యరామ లోకాభిరామ యని 48

పాడుచుఁ గెరలుచు నాడుదునోయి
జోడించి కరములఁ గ్రీడింతునోయి. 49

మంగళ మ్మోరామ మంగళమ్మగుత
మంగళ మ్మోసీత మంగళమ్మగుత. 50



ఓమ్

శ్రీరామాయ నమః

# శ్రీ గోవింద రామాయణము

## 'సీతారామమ్'

### బాలకాండ

### 1. శ్రీ లీలాకృపాశ్వాసము

క. శ్రీకరమే, తుది ఫలితము
లోకమ్మున గర్మ మంతలోఁ గనఁ, దొలుత
నీ కర్మార్థము యోగుల
కే కనరాదు గద, యొరుల కెఱుకయె రామా! 1

#### వాల్మీకి తమసానదీతీరమున కేగుట

ఉ. ఆ తమసానదీసలిల మా తటినీపులినస్థలమ్ము లా
యా తరుకాండవిస్తృతమహాలత లా సుమపల్లవమ్ము లా
శీతలమందమారుతనిషేవితసంధ్యలు మేతలన్ దమిన్
గూఁతల జోడువీడని శకుంతము లెంతొ మనోహరమ్ములో. 2

మ. అపుడే నారదమౌని చెప్ప విని రామాశేషసద్వృత్త మా
తపసిన్ బంపి తదుక్తిసారమగు వేదాంతార్థ మూహించుచున్
దపసుల్ మెచ్చగఁ బుట్టపుట్టువు భరద్వాజుండు వెన్నాడ స్నా
నపరుండై తమసాస్రవంతి కరిగె న్మధ్యాహ్నకాలంబునన్. 3

మ. పరిశుద్ధాంబునదీతట మ్మిది భరద్వాజా! నితాంతమ్ము స
త్యరతుండౌ నరు మానసమ్మనఁగ దీర్ఘమ్ముండె నిష్పంకమై
తరగల్ దోచెడి ధర్మతప్తహృదయోద్యద్భావముల్ గా మనో
హర మీ వాహిని స్నాన మాడఁదగునం చా మౌనిచంద్రుం డనెన్. 4

గీ. ప్రకృతిసుందరీలావణ్యవశుఁడు గాక
తప్పదా తాత్త్వికుని కేని తాత కేని,

ఔర ! యంతర్ముఖుండును నలఘుప్రకృతి
వశమున బహిర్ముఖుండయి పరఁగునొక్కొ ! 5

మ. సతతమ్ముఁ దమసాపగన్ దరియుచున్ స్నానార్థమై, నాఁడె ఏ
కతమో స్నానముసేయఁబోయి యటఁ దత్కాంతారసంచారియై
యతి వాల్మీకి మహామునీశ్వరుఁడు గానాలాపనన్ కామమో
హితమై మత్తిలియున్న క్రౌంచయుగమున్ వీక్షించెఁ బ్రాంతమ్మునన్. 6

మ. మునిమాన్యుం డటు క్రౌంచదంపతులవైపుం జూచుచున్నంతఁ ద్రె
శ్యైను జంటన్ విడి రక్తసిక్తముగ నిర్జీవమ్ము క్రౌంచ మ్మహో !
తనముందే పడియున్న పక్షిఁగని చింతన్ జిక్కి తన్మౌని యె
వ్వనిచిత్తంబు కలంత నొందదొకొ దుర్వ్యాపార మీక్షించుటన్. 7

గీ. అంతలో మౌని యానంద మంతరించె ;
కరుణ పుట్టఁగ నేడ్చెడి క్రౌంచిఁ గాంచి
సుఖము దుఃఖమ్ము సమముగాఁ జూచునట్టి
వాఁడె తానయ్యె కరుణాలవాలుఁ డయ్యె. 8

ఉ. ఆఁకటి కోర్వఁజాలమినొ, యయ్యదియే తన వృత్తి యౌటనో
ఏకతమో కిరాతుఁడు వధించెను గ్రౌంచము, మౌనిసత్తముం
డే కనుచుండ నాతఁ డటనే నిలువంబడియుండి యుంట నా
లోకన సేసియున్ విధికి లోఁబడి కారణకర్ముఁడయ్యెనో. 9

ఉ. దారుణకర్మమూని యిటు దంపతులన్ విడఁదీయఁజెల్లునే
యా రతికాలమం దని మహాముని దుఃఖపరీతచిత్తుఁడౌ;
నే రిఁక నాకు దిక్కు మఱి యెన్నఁడు నిన్నెటఁ జేరుదాన నె
వ్వారు తరింపఁజేయఁగలవారని క్రౌంచి తపించి యేడ్చెడిన్. 10

మ. శవము న్గాంచుచుఁ గ్రిందు మీఁదెగయుచున్ సంక్షోభముంబొంది పెన్
రవమున్సల్పుచు ముక్కు మూయుచును దీవ్రంబైన దుఃఖంబుతోఁ
బవలే చీఁకటి గ్రమ్మ నిత్యసఖునిన్ బ్రాణేశు గోల్పోయి దై
వవిధిం గాంచఁగలేదు క్రౌంచి తరణోపాయమ్ము సర్వేశుఁడే ! 11

మ. మునియున్ జూచు నిషాదునిన్ రుధిరమున్ భూమిస్థలిం ద్రెళ్ళు ప
క్షిని ఘోషించెడి క్రౌంచి నొక్కపరి, రక్షింపం దలంపేమొ ? జీ

వన మీయం గృప యేమొ ? కా దదియు గోప మ్మోను. దప్తాత్ముఁడౌ,
కననట్లే కరుణావశుండగుచు లోకంబెల్ల వీక్షించెడిన్. 12

## వాల్మీకి శాపము

ఉ. తగదు సుమా నిషాద ! యిటు తన్విని భర్తను వేరు సేయఁగా
నగునె ! ప్రతిష్ఠ శాశ్వతహాయంబులు నిల్వదు పొమ్మ నీకిఁకన్
యుగళము కామమోహిత మహో ! మిథునంబున నొక్కదాని దు
ష్టగతి వధించినా వనుచు శాపమిడె న్మని దుఃఖతప్తుఁడై. 13

ఉ. తిట్టి యటుల్ కిరాతకుని దీవ్రమనంబునఁ దప్తచిత్తుఁడౌ
పుట్టను బుట్టినట్టి మునిపుంగవుఁ డప్పుడె, యింద్రియమ్ము లే
పట్టుననో యెటో యెగసి పట్టెడి నెంతటివానినైన నే
నెట్టు లిటుల్ శపించితి నరే యను నాత్మవిలోకనక్రియన్. 14

చ. గురుని మహార్థవత్కవితకున్ బ్రణమిల్లుచు శిష్యుఁ డంతఁ ద
ద్గురువచనమ్ము నేర్చె, మునికుంజరుఁ డప్పుడె స్నానమాడి లో
నరయుచు నోట నన్న నుడి యర్థము, తుష్టిపరీతచిత్తుఁడై
యరిగెను శిష్యయుక్తుఁడయి యాశ్రమభూమికిఁ దీర్చ సద్విధుల్. 15

క. తలవని తలఁపుగ వచ్చిన
పలుకునె మది నెంచుచుండె వాల్మీకియు, స
త్ఫలితం బిది యని భక్తిని
దలపోయుచునుండె శిష్యతల్లజుఁ డెలమిన్. 16

శా. ఓ నిర్హేతుకజాయమానకరుణా ! ఓ సర్వలోకేశ్వరా !
వీణన్ మీటఁగ నొప్పు శ్లోక మిటు రావింపన్ గతంబేమి ? య
ద్దానం బుట్టు సుకర్మ మేమి ? భవదాంతర్యమ్ము కావ్యార్థమే
మో ? నీవే వచియింపఁగాఁదగు దురూహోత్కృష్టముల్ నీపనుల్. 17

మ. అనుచున్ ధ్యానసమాస్థితుండయిన దివ్యాత్మున్ మహాయోగినిన్
గనవచ్చెన్ గృపతో స్వయంభువుఁడు సాక్షాద్బ్రహ్మ, తన్మూర్తినిన్
వినయంబొప్పఁగఁ బూజ నేసి ముని దా నిశ్చేష్టుఁడై బోయవా
విని గ్రౌంచిన్ దన శాపమున్ మరలఁ జింతించున్ తదేకాత్మతోన్. 18

ఉ. "ఏమిటి వచ్చినావనఁ డదేమొ సుఖస్థితుఁడైన బ్రహ్మతోఁ
దా మునుముందు గాంచుచు విధాతను శాపవిధమ్ముఁ దెల్పకే
లో మననంబొనర్చు నవలోకన సేయుచుఁ దన్ను తాను, ని
ష్కాముకులైనవారలకుఁ గర్మముఁ గర్తయు దైవ మొక్కడే. 19

క. నా రాణి వాణి మత్కృపఁ
జేరెన్ వసియింపఁ దనదు జిహ్వా నటంచున్
గోరంతైన నెఱుంగక
యీ రీతిగ వంతఁజిక్కె నీతఁ"డటంచున్. 20

చ. పరమసమాధినిష్ఠ ముని పల్కిన పల్కులె పల్కుచుండి లో
నరసెడి వాల్మికుం గనుచు నాదిమునీశ్వరుఁడైన బ్రహ్మ సా
దరముగఁ బల్కె నిట్లు మునితల్లజ! తావకశాపవాక్య వి
స్ఫురితమహార్థసత్కవితఁ బొందితి వీవు మదీయసత్కృపన్. 21

ఉ. శాపవిధమ్ము నెంచుచు విచారమునన్ మననేల నీవు? నీ
లోప మొకింత లేదు సుమి, లోకహితార్థము చెప్పు మింక నా
భూపలలామరామనరపుంగవుఁ డుత్తమకీర్తిమూర్తి సీ
తాపతి సచ్చరిత్రము యథావిధి నారదవాక్యరీతిగన్. 22

గీ. ఇంతవఱ కీ వెఱింగిన నెఱుఁగకున్న
జానకీదేవి వైదేహి సచ్చరిత్ర
ఆ యగూఢ నిగూఢ వృత్తాంతమెల్ల
విదితమౌ నీకు సకలమ్ము విశదమగును. 23

శా. శ్రీరామా గుణధామ రామ యనుచున్ జిత్తంబునన్ జేర్చు మీ
ధీరున్ ధర్మపరాయణున్ నృపకులాధీశున్ సరోజాక్షు నా
త్మారామున్ భవదీయవాక్కు సతమున్ దథ్యమ్మెయౌ సర్వలో
కారాధ్యమ్ము మనోహరమ్ము నగు నీకావ్య మ్మమోఘమ్ముగన్. 24

మ. పరమానందము గల్గు పుణ్యమొదవున్ బాపమ్ము వోవున్ వసుం
ధరపుత్రీవరగాథ నీదు కృతి విన్నన్ నీ యశశ్చంద్రికల్
వరలున్ దివ్యనదుల్ గిరుల్ భువిపయిన్ వర్ధిల్లునందాక ఎ
వ్వరు నీతోసరి? సృష్టి నెల్లయెడలన్ వర్తించె దీ వీ కృతిన్. 25

ఆ. అనుచు బ్రహ్మదేవుఁ డంతర్హితుండాయె
ఆసనంబునుండి యల్లె శ్రుటిని
విస్మయంబుఁగాంచి విజ్ఞుఁడై వాల్మీకి
బ్రహ్మవాక్కు నెఱిఁగెఁ బరమదృష్టి. 26

గీ. రామనామమ్ము మౌని నారదునివలన
వినిన చుఱులిప్తనుండియే వేత్తనైతి
వాల్మికుఁడె నేడు కవియయ్యె, వనజభవుఁడె
తపసు ఫలియింప జ్ఞాననేత్రం బొసంగె. 27

గీ. మధురమైనట్టి రామనామమ్ము నింక
అమలవాల్మీకికోకిల మ్మవని వినఁగ
గానమొనరించు శ్రావ్యమ్ముగా కవిత్వ
శాఖ నారోహణ మొనర్చి శాస్త్రసరణి. 28

గీ. చిరతపమ్మునఁ బొందని సిద్ధి త్రుటిని
బ్రహ్మకృప లీలగా నేఁడు పడసియుంటఁ
గాంచినాఁడఁ ద్రికాలమ్ముఁ గనఁగ నైతి
బరమసత్యమ్ము, సుశ్లోకఫణితి యబ్బె. 29

క. అనుచుఁ ముదముఁ గనుచుఁ
మునితల్లజు డంత రామపూర్వకథాళిఁ
మనసున లీన మొనర్చును
వినుతింపఁగ రాఘవేంద్రు విశ్రుతచరితఁ. 30

## గురు శాప మననము

గీ. వాల్మికుని శిష్య లన్ననో పరమభక్తి
మరల మరలఁ బఠింతురు "మా నిషాద
మా నిషాద" యటంచు నా మౌనివాక్కు
నాదిసుశ్లోకముఁ వివిధార్థగతుల. 31

ఉ. మాటలు నేర్వ నట్టి యొక మౌని తటాలునఁ బల్కు మాట, లే
మాటల మూట యయ్యెఁ బలు మాటల పాటయి, భావగర్భమై

చాటె భవిష్యదర్థముల సారము, తాపసినోట వచ్చు నే
మాటయు గాని, యెల్లయెడ మానవలోకశుభమ్ము గూర్పదే. 32

గీ. క్రౌంచగతినున్న జంటలోఁ గామవశుని
నొక్కరుని రావణునిఁ జంపియున్న కతన
చిరతరప్రతిష్ఠ గొనుమీ శ్రీనివాస
యనుచు, వాల్మీకి 'మంగళ' మనియె మొదట. 33

గీ. మిక్కిలి కృశించు శ్రీరామమిథునమందు
ఓ నిషాద రావణ! సీత నురక పట్టి
బాధ పెట్టుటఁ గీర్తినిఁ బాయు దింక
ననుచు గావ్యార్థసూచన మనియె గురుడు. 34

గీ. శబ్దశబ్దమ్ము నర్థప్రశస్తి దనరి
కాండలకు సూచకమ్మలై గ్రాలుచుండెఁ
గరుణరసమునఁ బుట్టె శ్లోకంబు తొలుతఁ
గరుణమే ముఖ్యరసమౌచు వరలు నిందు. 35

గీ. ఆ నిషాదుండు గురి పెట్టె నాఁడు పక్షి
గాక మగపక్షియే చచ్చు కత! మదేమొ
జంటగానున్న రెండునుఁ జావకుండ
నొండె చచ్చుట విధి యన నొప్పు నేమొ? 36

గీ. రెంటినిఁ జంపియున్నను జంటయందు
నాఁడుపక్కినె కొట్టిన, నా మునియును
గుపితుఁడై యుండకుండునే! కోపగించి
బోయవాని శపింపక పోవునొక్కొ? 37

గీ. నాటనుండి ప్రతిష్ఠ వినాశమొంద
శాప మిడియుంట మౌని, నిషాదు డెంచ
పేరుగలవాఁడు, సద్ధర్మవిదుఁ డటంచు
నెరుకపడు, నాడె క్రూరుఁడై యేల పరగె? 38

గీ. ఆత్మ పరమాత్మునిఁ బీడి యవలికేఁగి
ప్రకృతిలోఁబడి యతనికై పరితపించు

చంద మన నొప్పు గ్రొంచి విచార మెంచ
నల్లై స్త్రీవిచారమ్మె కావ్యాత్మ యగునొ ? 39

గీ. స్త్రీయనెడి యాత్మ ప్రకృతి సంచితముకతన
జననమరణవిచారమ్మె గనఁగ పరుఁడు
దానఁ బరితప్తుఁడై కృప నూను పగిదిఁ
గడకుఁ బురుషుండు గుందు నీ కావ్యమందు. 40

గీ. మిథున సంశ్లేషవిశ్లేష కథయె మూల
మాయె, రామాయణము చెప్ప నాద్యలీలఁ
దాన తొలినుండి తుదిదాఁక గాననగును
మిథున సంశ్లేషవిశ్లేష కథయె యిందు. 41

గీ. ఆత్మ పరమాత్మ సంబంధ మరయు మునికి
స్త్రీపురుషజీవులకు మధ్యఁ జెలగు కర్మ
దాని సంశ్లేషవిశ్లేష ధర్మములును
గనఁగనయ్యెను సిద్ధికిఁ గత మదేమొ ? 42

గీ. మిథునగతి ఆత్మపరమాత్మ విధమొ ! రతిని
మిథున మేకమ ? వేరెట్లు ? మిథునగుణము
మాత్ర మేకత్వముంబొందు మహితరీతి
ఆత్మ పరమాత్మనిఁ, జేరు ననెడె తెలుఁగొ ! 43

కం. దేహాలు సుఖదుఃఖమ్ముల
వాహినులే సుమ్మ, కాలవారాశిగతం
బై హతమౌ గద దేహము
మోహమ్ముననుండు దేహి పొక్కుఁడె వెతచేఁ ? 44

గీ. సృష్టి పరమాత్మ సద్గుణశ్రేణికెల్ల
నాదియౌటఁ దద్గతియు దివ్యంబె, దాని
భంగ మొనరించు కర్మ పాపమ్మెగాదె
యదియె వాల్మీకి శపియించినట్టికతమొ ? 45

గీ. కాని, కాలనిషాదుండు కరుణఁగనక
యెప్పుడో చంపు మిథునమం దెవరినొ యని

దేహి గ్రహియించి మెలఁగుటే దివ్యసిద్ధి.
అదియె ద్వంద్వమ్ము దాఁటిన. యమలసిద్ధి. 46

గీ. ప్రకృతియందున్న జీవులు పరమనిష్ఠఁ
బ్రకృతిధర్మంబుఁ దీర్చుచు బరగనగును
గాని పరమాత్మయే దిక్కుగా నెఱింగి
కాలధర్మంబునకు వెతఁగాంచరాదు. 47

చ. అని బహురీతి వాల్మికుని యాశ్రమవాసులు శిష్యబృందముల్
మనమున నెంచుచుండిరి సమాధినిఁజేరి పరాత్మసిద్ధి రా
ముని చరితంబుఁ గాంచు పరిపూతచరిత్రుని మౌనిసత్తముఁ
గనుదురు 'మానిషాద' యను కావ్యగతిఁ మననంబు సేయుచుఁ. 48

ఉ. రామజపమ్ము సేయుచుఁ బరాత్మరుఁడౌ రఘురామచంద్రు తే
జోమయమూర్తి గన్నెదుటఁ జూచుచు నాతని జన్మమాది సీ
తామహితాత్మ నా రఘువతంసుడు వీడెడి దాక సర్వముఁ
రామకథఁ యథావిధిగ వ్రాసి హృదిఁ ముని దానిఁ బాడెడిన్. 49

ఆ. నారదుండు రామవీరచరిత్రమ్ము
నెఱుక సేయు ముందె యిలకుమారి
తనదు పంచనుంటఁ తదుపరిచరితమ్ము
నాత్మగతమె యౌట నదియుఁ బలుకు. 50

శా. శ్రీరామా ! రఘురామ ! మౌనివరసంసేవ్యా ! పరంధామ ! సీ
తారామా ! జనకాభిరామ ! బహుకాంతారాగమప్రాప్తికా
మా ! రాత్రించరదుష్టకాముకవిరామా ! పాలితక్షేమరా
మా ! రాజన్యలలామ ! సర్వగుణధామా ! 'పాహిమాం పాహిమాం !'

కం. అను జానకి ఆత్మాక్రం
దనమే వాల్మికి హృదయ తంత్రుల మేళం
బొనరింపఁగ గరుణరస
మ్మున రామాయణముఁబాడు ముక్తగశ్లోక్తిఁ. 52

తో. వినుమీ విను శ్రీరఘువీరకథఁ
కనుమీ కను జానకికర్మగతిఁ

మనుమీ మను మాత్మసమర్పణలోఁ
జననాథుని రాముని సంస్మరణఁ. 53

ఉ. కన్నులఁగట్టుచుండె రఘుకాంతుని పూతమహాచరిత్ర ము
న్నెన్నఁడొ కాలగర్భము వహించిన రామునిఁ గాథ నేఁడదే
తెన్నున విస్మృతిఁ గనని తీరున నయ్యది కర్ణపేయమై
సన్నుతమై వినంగనగు సారెకు సారె కపూర్వసత్కృతిఁ. 54

ఉ. బాలకు లాకుశీలవులు వాల్మికిశిష్యులు జానకీసుతుల్
లీలగ నభ్యసించి యవలీలగఁ బాడుచునున్నవారు తం
త్రీలయయుక్త సుస్వరపరీతము వీరచరిత్రముఁ ధరా
పాలకులుఁ మునుల్ గురుఁడు పండితులుఁ విని సంతసింపగఁ. 55

ద్వి. కవగూడి పాడు నా కవల గానమ్మ
అవనీతలమ్మునం దమలమే సుమ్మ. 56
ఏరీతి నేర్చిరో యీకుశీలవులు
శ్రీరామకథనమ్మ సీతాచరిత్ర. 57
గురుడైన వాల్మీకి చిరతపఃఫలమొ
వరుస దప్పరు పాట వారెట్టివారొ! 58
శ్రీరామజనన మాశ్రితరక్షణమ్మ
వీరాత్మ సద్గాథ వినుడయ్య వినుడు. 59

మ. అనుచుఁ మౌనులు బాలగాయకుల నత్యంతమ్మ ప్రేమించుచుఁ
దనియఁ వారికి వల్కలమ్మ లిడుచుఁ ధాత్రీసుతారాము రా
ముని గాథఁ వినుచుఁ ముదంబు గనుచుఁ బూజించుచుఁ నాకుజుఁ
గనగా నాతనిరీతి మాధవుకృపఁ గాంక్షింతు రెల్లప్పుడుఁ. 60

## ఆశ్వాసాంత పద్యములు

మ. పదునైదేండ్లు గతించె వ్రాసి, అయినఁ బ్రారబ్ధమే యేమొ ! నీ
పదపద్మంబుల దీని నుంచను గదా ప్రజ్ఞావిహీనుండనై
తుదిలేనట్టి యశాంతి చిత్తమున నెంతో క్రుంగి ముద్రించు సం
పదకై పూనక కాలముఁ గడుపు నఁ మన్నించితే రాఘవా ! 1

ఉ. నిన్ను స్మరించి నీదు కథ నిత్యము వ్రాయుచు నీదు పూజల
న్నెన్నఁ గనంగ నోచిన పునీతకర మ్మధికారగర్వసం
పన్నులచేతికిన్ దిగువ భాగమునం బడె లజ్జవీడి ఏ
మన్న ఫలంబిఁకేమి కృప నార్తుని నన్ గరుణింపు రాఘవా! 2

చ. అతులిత రామనామమ ధురాక్షరముల్ పలుకాడుచుండి, దు
ర్గతి నధికారకాంక్ష, నధికారుల గీర్తనసేయకుండ, నిం
తతొ విరమింపఁజేసి పతన, మ్మధికారుల చెంతఁజేరి కేల్
జతపడనట్టి సద్గతిని సాకుము నన్ గరుణించి రాఘవా! 3

ఉ. జీవితయాత్ర తుట్టతుదఁ జెడ్డతలంపు జనింపకుండ నో
దేవ! మదీయచిత్తము త్వదీయపదాంబుజభృంగరాజమై
పావన మౌచు సంతతము వర్తిలునట్లు వరమ్ము నిమ్ము సం
భావనఁజేతు నీ ప్రతిమ మంగళదాయకమూర్తి రాఘవా! 4

మ. పరతత్త్వార్థమునే తలంచుచుఁ గృపాపారీణ నిన్ జూడఁగా
శరణంబందును నీకె నేనిఁక సదా సద్భక్తిఁ గేల్మోడ్చి; నన్
బరుఁడంచున్ వెలిఁబుచ్చెదో, దయమెయిన్ బాలింతువో! కాని ఏ
కరణిన్ జూచిన జూడుమీ యిదియ నీ కర్తవ్యమౌ రాఘవా! 5

ఉ. పండితు లెన్నొ రీతుల సుభావ సుశబ్దమయ ప్రయోగముల్
దండిగఁ జేసి సత్కవిత ధారణసేయగలారు నిన్ను ను
ద్దండగతిన్, త్వదీయుఁడనుదప్ప మతిప్రతిభావిశేషముల్
మెండుగలేవు నాకడసుమీ నిను సంస్తుతిసేయ రాఘవా! 6

చ. లలితమనోజ్ఞ జీవితవిలాసములన్ ద్యజియించి, తాతతం
డ్రుల ధనధాన్యసంపదల డుల్లఁగఁజేసి, స్వదేశసేవ బం
దెల వసియించి, గాంధిగురుదేవుని యాజ్ఞఁ జరించినాడ, నే
డలసితి నర్వదేండ్లు గతమాయె మదాయువునందు, రాఘవా! 7

ఉ. ఆయువునన్ సగమ్ము సనె, ఆస్తి వ్యయంబయె, దేశసేవ నా
రాయణసేవయంచు హృది నత్తిన బత్తి జరించినాఁడ, నీ
కాయము డస్సె, రుగ్మతయుఁ, గష్టపరంపరయున్, సదా ననున్
బాయవు, చీఁకటిన్ బడిన పాంథుఁడ, దీపికఁజూపు రాఘవా! 8

ఉ. గాంధిమహోద్యమానఁ దమిఁ గాలిడినట్టి ముహూర్త మెట్టిదో,
పాంథుని రీతి గాంధిగురువర్య పథానఁ జరించినాఁడ, నే
నంధునిబోలి లోకగతి నారయఁబూనను, ద్యాగమే మహా
బంధముగాగ దుర్భర విపత్తుల కాకర మైతి రాఘవా !

చ. జవము నశించె, జీవితము సారవిహీనము నయ్యె, రాఘవ
స్తవమున రేఁబవల్ గడుప, సన్నిహితంబయె కాల మెంచ, బాం
ధవుఁడవో, మిత్రవర్యుఁడవో, తాతవో, తల్లివో, సద్గురుండవో
యెవరివో, యే గతిన్ గనిన నీవెకదా యిక దిక్కు రాఘవా ! 10

ఉ. ఎందరి నాశ్రయింపఁగల నేనిఁక ఓపికలేనివాఁడ ఏ
ముంది ఫలమ్ము కర్మగతి పోదు గదా శిర మొగ్గు టొండె పో
కుందక, సత్పథ మ్మగును గోరిక లాఱడిఁబెట్టకుండ నో
సుందరమూర్తి, నిన్ను గనుచున్ హృది నర్పణఁజేతు రాఘవా ! 11

ఉ. రామపదాబ్జసేవల విరామ మొకింతయు లేక భక్తిమై
నీమముతో నిరంతరము నిల్పి మనోమయదృష్టి భ్రూకుటిన్,
నీ మహనీయ సుందర వినీల తనూవిభవంబు జానకీ
రామయుతమ్ముగాఁ గనుచు రంజిల నాహృదయమ్ము రాఘవా ! 12

ఉ. పాడియుఁ బంటయున్ గృహము బంధువు లాప్తులు పుత్రపౌత్రులున్
పోడిమియున్ జవమ్ము హృది బుద్ధియు, విద్యయు సర్వ మీవె, నీ
వాఁడ, త్వదంఘ్రిపద్మములవాడఁ జరించెడివాఁడ, ఏడ నీ
నీడ ? సుఖింతు శాంతిఁ గని నిన్ గనుచున్ సతతమ్ము రాఘవా ! 13

గీ. సర్వధర్మమ్ములను వీడి శరణ మంటి
"అన్యథా శరణం నాస్తి" యంచు నిన్నె
శరణ మంటి స్వయంకృషి సమసె నంటి
నిదిగొ దాసోహ మంటి, న న్నేలు మంటి. 14

శ్రీ లీలాకృపాశ్వాసము సంపూర్ణము.



ఓమ్

శ్రీరామాయ నమః

# శ్రీ గోవింద రామాయణము

## 'సీతారామమ్'

### బా ల కాం డ

## 2. అవతారాశ్వాసము

శ్రీకర శుభకర వరదా
నాకనివాసాభిరామ నళినదళాక్షా
లోకాతీత పరాత్పర
ప్రాకట నిజభక్తకోటి రక్షణదక్షా! 1

### దేవతలు - విష్ణుసందర్శనము

మ. అదె వైకుంఠపదంబు; నయ్యదియె పుణ్యక్షేత్ర మందే మహో
దధి నాదిన్ వటపత్రశాయి సతతార్తత్రాణదక్షుండు మా
సుదతీయుక్తుఁడు శంఖచక్రయుతుఁడున్ సూరివ్రజశ్లోకుఁడున్
దుదిలేకుండెడి శేషతల్పుఁ డగు నిత్యుం డుండు లీలారతిన్. 2

మ. అని పద్మోద్భవుఁ డా సురేశునకు నిత్యానందదివ్యస్థలం
బును జూపింపఁగ నాతఁ డిట్లు పలికెన్ బూతాత్మ ధన్యోస్మి శ్రీ
వనితానాథుఁడె పాపఁగాఁగలఁడు మా బాముల్ స్వకీయేచ్ఛతో
నని ఫాలాక్షుఁడు పల్కియుండె నట దైత్యక్రౌర్య మాలించుచున్. 3

శా. శ్రీకైలాసనగాగ్రమందిరమహశ్రీదివ్యపీఠంబునం
దేకాంతంబున నొక్కనాఁడు సతితో నీశుండు సంవిష్టుఁడై
లోకత్రాణ వినాశసంభవమహాలోకమ్మునం దుండఁగా
లోకారాధ్య యుమాకుమారి ప్రమథశ్లోకున్ బ్రశంసించుచున్. 4

గీ. తెలుపఁగాఁగోరె లోకంబుతెఱఁగు నెల్ల
హరుఁడు ప్రియుఁడౌటఁ బార్వతి కంతఁ దెలిపె

ముందుగాఁగల కార్యంబు నంది వినగ
దాన నిటు నంది మముఁ బంపెఁ దమ్మిచూలి. 5

మ. హరు మ్రోలంబడి విన్నవింపఁ జన మా కా నంది నీ వెంబడిన్
హరి పాదంబులఁజేరి మ్రొక్కు లిడుచున్ హా 'పాహి మాం పాహి మాం
సురమిత్రా' యని వేఁడికోలు సలుపన్ సూచించెఁ జక్రాయుధున్
వరదున్ రక్షణదక్షునిన్ గనెడి పుణ్యంఁబబ్బుగా నీకృపన్. 6

మ. అను నింద్రుండు సురాళితోఁ గలిసి యా యా దివ్యలోకంబులన్
గనుచున్ ధాతనుగూడి విష్ణుపదమున్ గన్నార వీక్షించుచున్
జనుచుండన్ పరమేష్ఠి యిట్లనియె మీసంక్షోభకారుండు దై
త్యుని ద్రుంపంగలవాఁడు వాఁడె వినిపింతున్ వాని పూర్వక్రియల్. 7

*ఉ. రావణకుంభకర్ణులు పరాజయ మొందెద రింద్ర! యశ్వినీ
దేవత లిర్వురున్ మును సతీయుతుఁడై విహరించువేళ ల
క్ష్మీవరు మందిరాంగణముఁ జేరిరి వారికి ద్వారపాలకుల్
త్రోవ నొసంగరైరి ప్రియతో హరి వ్యగ్రుఁడటంచుఁ దెల్పుచున్. 8

గీ. హరినిజూడఁ గుతూహల మలమికొనఁగ
వచ్చినారము మారాక లచ్చిమగని
కెఱుక సేయరె యిపు డంచు సురభిషక్కు
లనఁగ ముమ్మారు ముమ్మారు వినమి భటులు. 9

చ. లయ మొనరింతు రా హరికులంబునె విష్ణుపదంబె గూల్తురా
జయవిజయాఖ్యులౌ భటులఁ జయ్యన ప్రాణము దీయనుండిరా
భయము త్యజించి భ్రూయుగళి పైకెగయన్ ముఖ మెఱ్ఱ జేయుచున్
నయనము లగ్నికుండములనన్ భయదారుణవీక్షణంబులన్. 10

మ. ఎవ రోహో మిముఁ బ్రోవఁగాఁగలుగువా రీసృష్టి ముమ్మారు మా
కవరోధమ్మొనరింతురొక్కొ కరుణావ్యాసంగనిర్ణిద్రు మా
ధవు సాన్నిధ్యమునన్ వసింపఁదగ రీ ధామంబునన్ దుర్గతిన్
భువి ముమ్మాఱు జనింతు రాక్షసులుగాఁ బొండింక శాపార్తులై. 11

మ. అనునంత న్సురవైద్యు లాగతి ప్రతీహారు ల్వేసన్ దోఁక త్రొ
క్కిన నాగంబులునా మహోకుపితులై కీడెంచకే సద్విధిన్

*వశిష్ఠ రామాయణము.

గను, మమ్మిట్లు శపించినందులకుఁగాఁ గైవల్యమున్వీడి మీ
రును జన్మింతురు దైత్యులై యనిరి "చేరున్ గీడు కోపమ్మునన్". 12

ఆ. పరమపదమునందె భక్తులౌవారలె
తామసమున శాపదగ్ధులైరి
భక్తభక్తుఁడు గని భక్తుల దుర్గతి
జాలిఁజెంది వారి మ్రోల నిలిచె. 13

క. దేవా మము రక్షింపవె
పావనమగు నీదు దివ్యభవనమునందే
సేవ యొనర్చెడి మా కిఁక
తావల మా భూమి యెక్కొ ? తారణ లేదా ? 14

ఆ. తామసంబుకతనఁ దప్పొప్పు మఱపొంది
యనఘుల కపచార మాచరించి
పుడమిఁగూలు మమ్ముఁ బ్రోవవా మరల నీ
దివ్యమూర్తిఁ గనెడి తెరువుఁ జూపి. 15

క. అనుచు న్వారలు నల్వురు
వనజేక్షణుఁగూర్చి మ్రొక్క భక్తత్రాణుం
డనియెను మిముఁ గృపఁ గాంచెదఁ
జనుఁడీ భువి జన్మ మెత్త శాపోపగతిన్. 16

క. ఐరావణ మైరావణు
లై రా సురదైత్యు లిర్వు రంతట హరి ని
త్యారాధనపరులగు దౌ
వారికశాపమ్ముకతనఁ బాతాళమునన్. 17

చ. జయవిజయుల్ భిషగ్వరుల శాపమునన్ హరిఁ బాసి రాక్షసా
న్వయమున జన్మ మెత్తిరి జనంబుల నేచి హిరణ్యలోచనుం
డయి జయుఁ డొప్పె వాని యసురాన్వయజన్మముఁ బూర్తిఁజేసె న
వ్యయుఁడు మహోరుదంష్ట్రిల మహత్తరశక్తి వరాహమూర్తియై. 18

చ. పుడమిపయిన్ హిరణ్యకశిపుండనఁగా విజయుండు పుట్టి మూ
ఢుఁడు దురితాత్ముఁడున్ హరివిరోధియునై తన పుత్రు భక్తునిన్

మడియఁగఁ జేయ నెంచి హరిమాట తలంచుచు తప్పటంచుఁ దా
విడిచె భువిన్ రమావిభుఁడు ప్రేగులుదీయ నృసింహమూర్తియై. 19

క. తొలి పుట్టువు లీగతిఁ జన,
మలి పుట్టువులందు వా రమానుషకృత్యం
బులఁ జేయుచునుండిరిగా
యల రావణ కుంభకర్ణు లనఁగా భువిలో. 20

ఉ. వారలఁ జంపి ప్రోవఁగఁ గృపాపరుఁడౌ హరి యింక మానుషా
కారముతో జనించుటయె కాఁగల కార్యము భూమిభారమున్
దీఱెడి కాల మాయెఁ గడు దీనగతిన్ దిగులొందు మీ వ్యథల్
వారణసేయఁగాఁగలుగువాఁ డతఁడే సుడి వేడుఁ డాతనిన్. 21

ద్వి. సరసిజోద్భవుఁ డిట్లు సురలతోఁగూడి
పరమాత్మ కథలను బలుకాడుకొనుచు
మురియుచు వైకుంఠముం జేరుచుండి
కరములు జోడించుఁ గర మనురక్తి. 22

సీ. నిశ్చల నిశ్శబ్ద నిర్గుణ పథచారి
మునిసంతతికి భక్తి మ్రొక్కు లిడుచు
నిర్మల నిరుపమ నీలమేఘచ్ఛాయ
పొందు కన్విందుగాఁ నందుఁ గనుచు
"పాహి మాం పాహి మాం భక్తసంఘావనా !"
యను నిత్యసూరుల వినుతి వినుచు
"ఓం నమో వరదాయ ఓం నమో నారాయ
ణాయ" యనెడి ప్రార్థనముల వినుచుఁ
గని యనంతమహాజ్యోతిఁ, గాంచె నందు
ఆదిమధ్యాంతములు లేని యఖిలమూర్తి
నిర్మలానంద సుందర నిత్యసత్యు,
మాసతీయుతు, వైకుంఠవాసు హరిని. 23

క. వడి వడి సురలును బ్రహ్మయుఁ
దడయక హరిపాదయుగళిఁ దాఁకుచు మ్రోలం

బడి లేచిరి సుర లంతటఁ
గడు భక్తిని బల్కి రిట్లు కరుణానిధితోన్. 24

మా. జయము జయము దేవా! సత్యసౌందర్యరూపా!
జయము జయము విష్ణూ! సర్వలోకైకజిష్ణూ!
జయము జయము శ్రీశా! శాశ్వతానందదాయీ!
జయము జయము నిత్యా! చక్రపాణీ! ముకుందా! 25

రథో. దైత్యసంహరణ ధర్మవిలోలా!
భృత్యవారపరివేదనహారీ
నిత్యమంగళ వినిర్మలదేహా
సత్యమూర్తి హరి శౌరి నమస్తే. 26

రథో. నీవకాక మఱి నేర్పరు లేరీ
దేవదేవ భవదీయుల బ్రోవన్
శైవశక్తి తన సత్వము కాఁగా
రావణాసురుఁడు, రాగముఁ బూనెన్. 27

## దేవతలు రావణదుష్కార్యములను వివరించుట

శా. కైలాసాద్రినిగూఢ వాఁడు తునియల్ గావింపఁ బైకెత్తె నా
ఫాలాక్షుండు పదాంగుళిన్ గిరికొనన్ భద్రంబుగా నొక్కఁ ద
ల్లీలన్ శైలముక్రింద దైత్యుఁడు కడున్ గ్లేశాత్ముఁడై క్రమ్మగుచున్
జాలిం బొందెడి రీతి వేడి హరునిన్, సాధించె దీర్ఘాయువున్. 28

చ. జవము నశించి రావణనిశాచర నిత్యదురంతబాధలన్
భువనము లన్నియున్ వణఁకిపోవుచుఁ గ్రుంగి కృశించుచుండె మా
ధవ! రణరంగమం దతనిఁ దాఁకి వధించెడివాఁడు లేఁడెటన్
ధ్రువ మజుఁడున్ హరుండు పరితోషితులై వర మిచ్చియుండుటన్. 29

సీ. పరకాంతలను బట్టి బంధించి క్రీడింప
నిత్యసంచారియై నెగడువాఁడు
మునివరేణ్యుల నెప్డు మోఁకరింపఁగఁజేసి
హరిమాటఁ దలఁప రాదనెడివాఁడు

సర్వలోకంబుల చక్రవర్తిగఁ దానె
పరరాజులను గొట్టి పరఁగువాఁడు
సూర్యచంద్రులఁగూడ సోఁకింపఁ జేయఁగాఁ
దారాపథంబును దాఁటువాఁడు
గీ. తామసము రాజసములందె దనరువాఁడు
సజ్జనుల నేచుచుండు దుర్జనుఁడు వాఁడు
హింసయే నిత్యవిధి గాఁగ నెగడువాఁడు
సత్య మొల్లని ఘననిశాచరుఁడు వాఁడు. 30

గీ. 'రావణా స్వస్తి' యనుచు విరాగికూడఁ
బలుకుచున్నంతకాలమే బ్రదుకఁగలఁడుఁ
వాఁడెపో దేవుఁడని కొల్చు వారలె సుమ
కలియొ ? గంజియొ ? త్రాఁగఁగాఁ గలరు భువిని. 31

శా. నా మాటల్ జవ దాఁటఁగాఁ గలుగునే నారాయణుండేనియున్
భూమిన్ నీరధియందు నాకమున నేఁ బోకార్తు నెవ్వారినేన్
సామంతుల్ గలరే జయింప నను మత్సామ్రాజ్యమందే మదీ
యామోదంబున వెల్గు నర్కుఁ డెపుడం చా రావణుం డాడెడిన్. 32

ఉ. భూసురులున్ బతివ్రతలు పొందెడి బాధల కంతు లేదు స
న్యాసులుగూడఁ గేశవ యటంచు వచింపఁగరాదు గోవులున్
గ్రాసముగా గ్రహింపఁబడు రావణరాజ్యమునందు దుఃఖమే
వాసము చేయుచున్న దనివారితమై భవదీయసృష్టిలోన్. 33

శా. కారాగారనివాసమే ఫలితమౌ కాదన్నచో దుష్క్రియన్
లేరా యేరును రక్ష నీయ ననుచున్ గ్లేశాత్ములై సజ్జనుల్
ఘోరంబౌ విపదంబుధిన్ మునుఁగుచున్ ఘోషించుచున్నారు శ్రీ
శా ! రక్షింపఁగ రమ్ము రమ్మనుచు నిన్ శ్లాఘించుచున్ వేడుచున్. 34

గీ. సజ్జనులు పతివ్రతలును సాధువులును
ప్రజల హిత మెంచువారును బందెలందు
బాధితులు రావణాసురపాలనమున
ఘోష గొడ్డలి పెట్టుగాఁ గొట్ట దేల ? 35

గీ. వాయుమార్గాన విహరింప వలనుపడదు
జలధియానంబు స్వేచ్ఛమై జరుపరాదు
పుడమిపైఁగూడఁ దిరుగ దఁబోవరాదు
వాఁడు కాదన్నచో మాకు నీడ లేదు. 36

ఉ. శంకరు లోకశంకరు వశంకరుగాఁ గొని నిత్యపూజచే
జంకఁడు వాఁడు మిత్తి యనఁ జంపఁగఁబోఁడు హరుండు భక్తునిన్
బంకజసంభవుండును దపంబును మెచ్చి వరంబు లిచ్చుటన్
గొంకక యెప్డు దైత్యసురకోటి కవధ్యుఁడుగా మెలంగెడిన్. 37

ఉ. మానవు లన్న వాని కణుమాత్రము లక్ష్యము లేమిచే వరం
బూనఁడు వారివల్ల మృతి నొందనియట్లు రమామనోహరా
మానుషజన్మ మెత్తి దయమాలిన రక్కసి తేనిఁ జంపి యీ
దీనులఁ బ్రోవ రావ మముఁ దేర్చవ దుఃఖమహాబ్ధిమగ్నులన్. 38

శా. కాలుండున్ భయ మొందినాఁడు గద వీక న్కార్తవీర్యార్జునున్
నేలం గూలఁగఁజేయఁ జూచినను వీనిం జంపఁ డాతండు మున్
వాలిం బట్టఁగఁబోవ నాతఁడును జంపంబోఁడు వానిన్ మహా
వాలంబందునఁ జుట్టి త్రిప్పి జలధుల్, వారించి పోనిచ్చెఁగా. 39

చ. ధనదుఁడు లంక వీడి చని తా హిమపర్వతవాసి యయ్యె మే
మును నమరావతిన్ విడిచిపోవఁగలేమి నెటో కృశించుచున్
దినములు నెట్టుచుంటి మట ! దేవర ! రావణదండయాత్రచే
మునుపటియట్లు మానగరమున్ విలసిల్లక రూపఱె న్గనున్. 40

శా. దంభాచారుఁడు మూర్ఖుఁడున్ దులువ క్రోధాయత్తుఁడున్ వాఁడు మా
రంభన్ మార్గమునందుఁ బట్టి బలిమిన్ రమ్మంచుఁ బెన్రాతిపై
సంభోగించె సుమా పతివ్రతల సంసర్గంబు బల్మింగొనన్
గుంభప్రక్రియ నీ శిరంబు వగులున్ గ్రూరా యనెన్ రంభయున్. 41

శా. పాతాళంబున మున్ను లచ్చిఁ గని యా పాపుండు చేఁబట్టుటన్
భూతంబట్లు త్వదీయదృక్పటిమచే మూర్ఛిల్లఁడో యంత లె
మ్మీ తాల్మిం గనుమీ జవమ్మిదియసుమ్మీ నేనె నిన్ జంపెదన్
పూతున్ జేయఁగ వేఱు కాలమునఁ బో పొమ్మంచు నాఁడాడవో? 42

ఉ. ఏమిది రావణా విభుని వే నెడబాసి యెఱుంగ నైతి మున్
గాముకు లైనఁగాని యిటుఁ గాంతల బల్మినిఁ బట్టితెత్తురే
నీమము నీతియు న్వలదె, నీచుఁడనన్ దిగమ్రింగివేయుదే
నీ మకుటంబు నాయువును నేలనుగూలెడిఁగాక కాంతకై. 43

శా. ఔరౌరా! నను వీఁడు చంపునొకొ హాహా! తల్లినిన్ బిడ్డలన్
గ్రూరుం డీతఁడు వేఱు చేసె బలిమిన్ గొడ్రాలి నేనౌదుఁగా
యేరా దైవమ యెట్లు నాకడుపునం దీ చిచ్చు చల్లారురా
యోరీ రావణ! నీదుభార్యయును దుఃఖోద్రిక్తయౌ నావలెన్. 44

ఉ. తల్లిని బాసి బిడ్డలును దన్విని సాధ్విని బాసి నాథుఁడున్
జెల్లెలిఁ బాసి యన్నలును శిష్టసుత న్విడి తల్లిదండ్రులున్
వల్లడికాఁడు మమ్ముఁ జెఱఁబట్టుట నెంతగ నేడ్చుచుందురో
కల్లగఁదోచె! నీ యునికి కాంతలఁ గావఁగలేవ! దైవమా! 45

ఉ. హరి హరి యీ విషాదమయమౌ నరజన్మము లేల మాకు శ్రీ
హరి హరుఁ డేడ నుండె నిఁక నైనను మా దరి రాఁడొ వానికిన్
భరముగఁ దోఁచుచుంటిమ యెవండు మమున్ గృపఁజూచువాఁడు దు
ర్భరనరజీవముల్ బుడగవంటివి, వీనికి మాన మిత్తుమే? 46

ఉ. ఏల జనించినార లిటు లెందఱొ కోట్లకొలంది భూమిపైఁ
గాలము రాద వీనికి నృకాండమునం దొకఁడైన లేఁడ మా
గోలను మాన్ప.వాని తలఁగొట్టఁగలాఁ డరరే! నరుల్ భువిన్
గాలికిఁబోవు పిట్టలకుఁ గల్గిన స్వేచ్ఛఁ దొఱంగియుండిరే! 47

గీ. అనుచు విలపించుచుండి రా యబలలెల్ల
విను మదే యార్తనాదంబు, వెడలు మింక
వాని చెఱసాలలందున్న మానవతులఁ
బ్రాణనాథులఁ జేర్పఁగా భక్తవరద! 48

గీ. "అన్యథా శరణమ్ నాస్తి" యని సదా "త్వ
మేవ శరణం మమ" యటంచు నెడద నిల్పి
వేడకున్నట్టివాఁ డొండు లేఁడు లేఁడు
మూఁడు లోకమ్ములను నీకు నీడు లేఁడు. 49

దండకమ్. శ్రీశా పరేశా మహాశేషశాయీ త్రిలోకైకభర్తా సదా భక్త
లోకైకసంత్రాణదక్షా మహాచక్రధారీ హరీ సూర్యచంద్రాదులున్
బంచభూతంబులున్ బ్రహ్మరుద్రాదిదివ్యుల్ సురల్ మానవుల్
తావకీనేచ్ఛమేఁగాదె జీవించుచున్నారు, దైత్యాళి నీసృష్టివాసంబుగా
నుండరే, రావణుండన్న నీకెంత మున్నీవు జన్మింపవే భూమిపై
రక్కసిం గొట్టవే వేదముల్ గావవే భక్తునిం బ్రోవవే రాక్షసున్
జంపవే ధర్మమున్ బాలనన్ సేయఁగా దీక్షఁ జేఁబూనవే, నీవె నీ
సృష్టినిన్ నేఁడుదాసీన మేలా యిదే వేళ లేలెమ్ము ధర్మమ్ము గాపాడ
జన్మింపగా బొమ్ము నీవారమౌ మమ్ము రక్షింపఁగా రమ్ము నారాయణా
నిత్యకారుణ్యమూర్తీ యనంతా నమస్తే నమస్తే నమః. 50

## శ్రీమన్నారాయణుండు దేవతలకు వరంబొసంగుట

మ. అనుచున్ దేవత లా హరి న్గొలువఁగా నార్తావనుండౌటచే
గనుచున్ మోదము యోజనం దవులుచున్ గంజోద్భవున్ గాంచుచున్
వినుమా యింద్ర ! భయంబు వీడి చనుమా విధ్యుక్తధర్మంబునే
నొనరింపంగలవాఁడ నం చనె రమాయుక్తుండు దీక్షారతిన్. 51

గీ. అంత "ధన్యాః ప్రధన్యా వయ"మ్మనిరి సు
రలు ముహుర్ముహు ర్జయజయరవము లెసగ
నజుఁడు వైకుంఠవాసు మహాసుదీక్ష
నెఱిఁగి పలుకాడఁ బూనె నేమఱక యిట్లు. 52

చ. హరి నరవేష మూని భువియం దవతారము నెత్తు నింక నో
సురవరులార ! మీరలు వసుంధరపై హరికి న్సహాయులౌ
హరుల మహాబలాన్వితుల నంచిత ధీరులఁ గామరూపులన్
దురమున మీ సురావళికిఁ దుల్యులఁ బల్వుర వే సృజింపుఁడీ. 53

ఆ. కనుదు రింక సుతుల గంధర్వకాంతల
యందు నప్సరసలయందు సురలు
జాంబవంతుఁ డనఁగ జన్మించె నా నోట
మున్నె ఋక్షపుంగవుండు శౌరి. 54

ఆ. దివ్యబలుని వాలి దేవేంద్రుఁడుం గనె
గొప్పవానిఁ దారు గురుఁడుఁ గాంచె
గంధమాదనుఁ గనెఁ గడఁగి కుబేరుండు
నగ్ని గనెను నీలు నతులగుణుని. 55

గీ. అశ్వినీదేవతలుఁగూడ నాత్మభవులఁ
గనిరి మైందద్వివిదులనాఁ గడఁగువారి
వరుణునకు సుషేణుం డనువాఁడు గలిగె
శరభుఁ డనువాఁడు పుట్టెఁ బర్జన్యునకును. 56

గీ. వాయువును గాంచె నొక మహాబలుని సుతుని
వీరవరుని శ్రీమంతుని విబుధనుతుని
వైనతేయసమానజవంబువాని
నాంజనేయుని వజ్రదేహంబువాని. 57

ద్వి. సూర్యుండు పుట్టించె సుగ్రీవకపిని
వీర్యవంతుని మహావీర్యుఁడౌ వాని. 58

వృ వీరలెల్లరు దేవదేవా
వినుతిసేయుచు నిన్ను భువిలో
ధీరులై కడు శూరులై నీ
తెరువుఁబోదురు భక్తులగుచున్
వారువీరని తెల్పనేలా
వరలు కోఁతులు వేలకొలఁదిన్
బోరు సల్పఁగ దైత్యు జంపన్
భువినిఁ బుట్టెద రెన్నొ గతులన్. 59

## దశరథుని పుత్రకామేష్టి

శా. లెమ్మీ! లెమ్ము! మహాప్రభూ వరద లే లెమ్మింక నీ తల్పమున్,
గొమ్మన్ శంఖముఁ జక్రమున్ గలిసి వైకుంఠేశ మీ యంశ, జ
న్మమ్మెత్తన్, భువి కేఁగు వేళ యిదె సుమ్మా యల్లదే పూనె, యా
గమ్మున్, సువ్రతదక్షుఁడై దశరథక్ష్మాభర్త పుత్రార్థియై. 60

గీ. *రాఘవుఁడు దాశరథియౌచు రాముఁడనఁగ
అమల మిక్ష్వాకువంశంబునందుఁ బుట్టి
నిన్ను వధియించు సజ్జనసన్నుతి గను
సత్యమగు గాత నా వాక్కు, సతత మేను. 61

గీ. దానజపతత్పరుండనై ధర్మగతినిఁ
బ్రజల నేలుచునుండెడి వాఁడనైన
నని, యయోధ్యనేలు ననరణ్యనృపుఁ డాదె,
మున్ను రావణుం డతనిపై పోరుసలుప, 62

గీ. "రావణా స్వస్తి"యనఁగఁ దిరస్కరించి
ద్వంద్వయుద్ధంబుఁజేసి జీవంబు వీడు
తఱిని. కల్లగారాదు తద్భక్తుని నుడి
దశరథుని యింట జన్మించు తరుణ మిదియె. 63

చ. అతఁ డినవంశజాతుఁడు మహర్షిసమానుఁడు సత్యవంతుఁడున్
వితరణశీలుఁ డుజ్జ్వలుఁడు విశ్రుతిమంతుఁ డయోధ్యతేఁడు సం
తతహరిపాదసేవకుఁడు ధర్మరతుండు నృపాలశేఖరుం
డతని పవిత్రగేహమున నందుము మానుషజన్మ మచ్యుతా! 64

మ. కులగోత్రంబుల రెండిటన్ ఘనుఁడు సద్గోష్ఠిన్ సదా యుండువాఁ
డల యిక్ష్వాకునృపాన్వయుం డతని భార్యల్ ముప్వురున్ సద్గుణో
జ్జ్వల శ్రీహ్రీలును కీర్తి రూపవతులై భాసిల్లు చందాన వ
ర్తిలి భర్తన్ సతతంబుఁ గొల్చెదరు ధాత్రిన్ భర్తృసేవాత్మలై. 65

చ. ఎవరు మహాబ్ధిఁ ద్రవ్వుటకు హేతువొ దాననఁజేసి సాగరా
ఖ్య వరలు నబ్ధి, యా సగరు గాంచిన వంశములోనివాఁడె మా
ధవ మఖ మూనె నా దశరథక్షితినాథుఁ డతుల్యుఁ డెంచ మా
నవతతి కెల్ల మాన్యుఁడు జనంబుల నేలెడివాఁడు ప్రేముడిన్. 66

చ. అదె సరయూనదీతటమహత్తరపుణ్యవనీప్రదేశ మ
య్యదె రఘురాజపౌత్రుఁ డిపు డధ్వర మూనిన పుణ్యభూమి, కో

---

*రాఘవుఁడు = సర్వజ్ఞుఁడు = నారాయణుఁడు.

విదులుగ ఋత్విజుల్ మునులు వీరులు రాజులు బంధుమిత్రులున్
ముదమున వచ్చియుండిరి విభూ! వినుమీ! త్రయీధ్వనుల్. 67

శా. ఆకర్ణింపుము యాజకోక్తమగు స్వాహానాదమున్, పావకుం
డా కాకుత్స్థుని హోమకుండమున నిత్యాహూతుఁడై తుష్టుఁడై
యేకైకాగ్రత నాహుతుల్ గొనుచు లోకేశు న్నినుం బిల్వగాఁ
నాకంబంటఁగఁజాచు నాల్కలను శ్రీనారాయణా! కంటివే! 68

మ. అవె, వాని న్వినుఁ "భద్ర మస్తు నృపతే" యన్ భూసురాశీస్సు ల
య్యవె క్షంతవ్య మటంచు జే డను విధేయత్వస్ఫురద్వాక్యముల్
దివి మార్మోగ వినంగ నయ్యెడి హరీ! తెమ్మంచు నెవ్వారలా
సవ మం దెయ్యది యెప్డు గోరినను నా సంకల్ప మీడేఱెడిన్. 69

చ. సకలమహామునుల్ యతులు సాధులు బ్రాహ్మణులున్ నృపుల్ వధూ
ప్రకరము వృద్ధవార మనపత్యులు బాలురు బీదలున్ నృపా
లకు మఖముం గనన్ విడుదులన్ వసియించుచునున్నవారు వా
రికిఁ దగురీతి సత్కృతుల జేఁడొనఁగూర్చుఁ ద్వదర్పితంబుగన్. 70

ఉ. తిన్నకొలంది బల్ రుచులఁ దృప్తిని బొందుచు నెల్లవేళలన్
కన్నుల విందు గాఁగ జనకాండము విందుల నారగించు నా
యన్నపుఁ గూటముల్ గనఁగనౌ హరి! యాచన లేదు లే దటన్
మన్ననఁజేసి యిత్తురు సమంచితరీతి ధనాన్నవస్త్రముల్. 71

ఉ. యాగము లెన్నియో సలిపె నా యజభూపతి వాని సూనుఁడే
రాగము లేనివాఁడు మఖరాజ మనందగు నశ్వమేధమున్
బాగుగఁ బూర్తిఁజేసియు, నెబాసన దానగుణప్రపూర్ణుఁడై
సాగిలి యాజకాళికిఁ బ్రశాంతముగా నిడె సర్వరాజ్యమున్. 72

శా. మాకేలా భువి? వేదముల్ చదువుచున్ మానాథు సేవించుచున్
లోకశ్రేయముఁ గోరువారలము భూలోకంబు పాలింపఁగా
నీకే చెల్లు నటంచు ఋత్విజులు దానిం బుచ్చుకోరైరి, రా
జో కోట్లాది సువర్ణ గో రజిత రాసుల్ వారి కర్పించుటన్. 73

ఉ. ఆ కనకంబు వెండియును నావుల మందల నన్ని యాజకుల్
చేకొని ఋశ్యశృంగుని వసిష్ఠుని దానముసేయఁగోరుచున్

వాకొని రెల్లవారుఁ గన, వారు యథోచితరీతి నన్నియుఙ్
లోకుల కిచ్చినారు సురలోకము నేనును జూచుచుండగఙ్. 74

గీ. దశరథనరేశుఁ డశ్వమేధంబు సలిపె
విమల ఋశ్యశృంగుండె ఋత్విజుఁడు గాఁగ
నింక కొదు వేమి భూస్థలి నెల్ల, కోర్కె-
యొండె కొదు వయ్యె, సవ మెల్లఁ బండు వయ్యె. 75

శా. ఆ లీలఙ్ మఖవారముల్ సలిపి ధర్మాత్ముండు పుత్రేష్టియుఙ్
హేళిఙ్ బూర్తి యొనర్చుచుండె నిఁక సర్వేశా ! కృశానూజ్జ్వల
జ్వాలాసంభవుఁ డొచుఁ బాయసము ప్రాజాపత్యరూపం బిడుఙ్
లీలామానుషవిగ్రహంబు గనఁగా లీనంబు నం దందుమా. 76

గీ. ఓ శ్రియఃపతి ! భవదాజ్ఞ నుర్వి నపుడె
జనన మందెఁ దా లక్ష్మియంశంబువలన
రాక్షసవధార్థమై యొక్క రమణి యామె
జనకనృపుఁ డింట సాకఁడో తనయరీతి ! 77

గీ. కమలవాసిని యొచు నా కమలనేత్ర
రావణుని కంటఁ బడుటయు రాక్షసుండు
తన్నుఁ జంపింపవచ్చినదానిఁగాఁగ
నెంచి యా బాల నొక పెట్టె నుంచఁడొక్కొ ! 78

గీ. అంత సంతృప్తిఁగనకుండ నసురవరుఁడు
విడిచిపుచ్చఁడె జలధిలోఁ బెట్టె నదియె
జనకుపొలమున నాఁగటిచాలునందు
చేతఁబడియుంట నాబాల సీత యయ్యె. 79

గీ. విష్ణుఁ గోరి తపము సల్పు వేదవతిని ;
బలిమిఁ జెరఁబట్టఁబోవ రావణుఁడు మున్ను
అగ్నిఁ దన మేను వేల్చి సీతమ్మ యగుచు
రావణవధార్థమై పునర్జన్మ మందె. 80

క. నీ విల కేఁగుము సీతయు
భూవలయముఁ బ్రోచు నీదు పొలఁతుక తానౌ

నీ విఁక నవతారముఁ గన
నో వరదా ! భువి కరుగు ముహూర్తము వచ్చెన్. 81

మ. అనునంతన్ విజయధ్వనుల్ సెలఁగె భూమ్యాకాశము ల్నిండ పా
వనుఁడౌ, భూపతి యధ్వరాంగణమునన్, వైకుంఠవాసుండు నం
తన యంతర్హితుఁడాయె, ధాతయు సురల్ "ధన్యాః స్మ" యంచున్ సవం
బునకుం బోయిరి దేవదుందుభులు మార్మ్రోగెన్ జగం బుబ్బగన్. 82

వసంతతిలకావృత్తము
తేజోమయుం డొకఁడు దివ్యతనుం డయోధ్యన్
భూజాని కట్టెదుటఁ బుట్టె మహాధ్వరాగ్నిన్
రాజోత్తముం డతనిఁ బ్రాంజలి యౌచుఁ గోరెన్
వ్యాజంబు దెల్పఁ గడు భక్తిని నిల్చి యంతన్. 83

చ. కనకమయప్రదీప్తులను గ్రాలెడు నా పురుషుండు "రాణ్మణీ !
నిను గరుణించి దేవతలు నీ కిడఁ బంపిరి పాయసంబు దీ
నిని భవదీయభార్యలు వినిర్మలభక్తి భుజింపఁ బుత్త్రులం
గనెదరు పాయసంబుగల కాంచనపాత్ర మిదే గ్రహింపుమా!" 84

చ. అన విని కోసలేశ్వరుఁ డనంతకృపామయమూర్తి నెంచి నె
మ్మనమున వహ్నిమధ్య నసమానముగా వెలుఁగొందు పూరుషుం
గనుచు నమస్కరించుచు సుకర్మఁ దలంచి ప్రదక్షిణంబుగాఁ
జని కొనునంతఁ బాయసము చయ్యన దేవత యేగె మాయమై. 85

ఆర్యావృత్తము
మునితతియున్ జనంబులు ప్రమోదము నందిరి భూ
పునిఁ గని దేవతల్ మురిసిపోయిరి యజ్ఞవనిన్
వనితలు గీతికా మధు రవంబున నింపిరి పా
వనలును మంగళం బనుచుఁ బట్టిరి హారతులన్. 86

చ. నరపతి! కాంతు వింక నరనందనులన్ ఫలియించెఁ గర్మ మే
మరిగెద మయ్య యాజ్ఞ నిడుమా యని యేఁగిరి ప్రేక్షకావళుల్
మురియుచు ఋత్విజుల్ చనిరి భూపతి ప్రేముడి నీయ నాంధ్రు ము
వ్వురుఁ బరమాన్నముం దినిరి పొందిరి తోడనె గర్భచిహ్నముల్. 87

చ. సురలు యథాగతమ్ముగ వసుంధర నిల్చి హవిస్సునొంది యే
గిరి; బహుమానముల్ వడసి కేల్మొగిడించి నరేశ్వరాళి పో
యిరి పరివారముల్ గొనుచు నేఁగె నయోధ్యకు రాజమౌళి భూ
సురులు వసిష్ఠుఁడుల్ నడచుచుం జన ముందుగ హృష్టచిత్తుఁడై. 88

గీ. గర్భవతులైన సతులను గాంచి ఱేఁడు
పొందు నానంద మెంతెంతొ పొగడ వశమె
ముదుసలితనానఁ దమరాజు పుత్రభాగ్య
మందనుండుట సంతోష మాయెఁ బ్రజకు. 89

మ. ధనధాన్యంబులు లేనివాఁడయిన సంతానంబు వాంఛించు నె
వ్వనివంశంబు తరించుఁ బుత్త్రిఁ డొకఁడేన్ బ్రాప్తింపకున్నన్ సుపు
త్రుని నెవ్వండు గనండొ వాని ప్రతిభల్ నిర్మూలమౌ భాగ్యముల్
వనిలోఁ ద్రోయఁగ నొప్పు వాఁడు గృహముల్ వర్జింపఁగా జెల్లుఁబో. 90

శా. రారాజైనను విజ్ఞుఁడైన మునియై రాజిల్లువాఁడైన లో
కారాధ్యుండయినన్ సుతు న్గనక పూజార్హుండొకో పుత్రుఁ గ్రీ
డారాముండుగఁ బ్రేమ నేర్పని జనుండా ధర్మముల్ దీర్పఁగా
నేరంజాలినవాఁడు? వానిబ్రతుకే నీచంబు గాదే భువిన్? 91

గీ. సప్తసంతానములఁ గృతి శాశ్వతంబు,
కాని కృతిభర్తయను, గృతికర్త గాఁగ
నెంద ఱెందఱు యోగ్యులై యుందు రిలను?
సంతతిని గాంచు టొకటె నిసర్గ మరయ. 92

ఆ. అదియు లేనివాని యాత్మ క్షోభిల్లదో
పుట్టగతులు గలవె పున్నె మున్నె
అనుచు పరితపించు నా దశరథు నన
పత్యత చనువేళ వచ్చె నంత. 93

## శ్రీరామావతారము

*గీ. నెలలు నిండిన కౌసల్య నిద్రయందు
నప్పుడప్పుడు శ్రీనాథు నాద్యుఁ గాంచి

*భారద్వాజరామాయణే పద్మపురాణే ఉత్తరఖండే 47 అధ్యాయే చ.

యిరుగుపొరుగమ్మలకుఁ జెప్పు నెఱుకలేమి
వాసుదేవుండు నిజగర్భవాసి యగుట. 94

గీ. గరుడవాహన మెక్కి లోకంబు లెల్ల
హొయలు మీఱంగ విహరించుచున్న రీతి
స్వప్నమునఁ గాంచి లేచి విస్మయము నొందె
గర్భవాసిని గౌసల్య కాంచలేమి. 95

శా. "ఔరౌరా ! సుకుమార, మారసమ, బాలా యెట్లు నీవుందువో
ఘోరారణ్యములందుఁ ? దల్లి నిటుగా ఘోషింపఁగాఁ జేయుదే ?
వీరా !" యంచుఁ దటాలునన్ దనువు కంపింపంగ మేల్కాంచి యా
ధీరస్వాంతయుఁ గారణం బెఱుఁగమిన్ దేవిన్ దలంచె న్మదిన్. 96

ఉ. "పోకుము రాక్షసా వెడలిపోకు దురమ్మునుండి నిన్నిదే
కాకులు గద్దలున్ దినఁగ గాయము చీల్చెద ధర్మరక్షణం
జేకొనినాఁడ" నంచుఁ దనచేతులనుండిన పాప గట్టిగా
వాకొనినట్లు స్వప్నమయి పార్థివపత్ని యదేమొ యంచనున్. 97

ఆ. సవము సల్పి యొక్క సంవత్సరం బాయె
కనులు మూసినంతఁ గాంచు నామె
నీలవర్ణు విష్ణు నిఖిలేశు శ్రీశుని
శంఖచక్రధరుని శౌరి హరిని. 98

చ. సురలు దివిం బ్రవిష్టులయి చూచుచునుండి రయోధ్యవంక భూ
సురతతి దీవెనల్ సలుపుచుండి రయోధ్యనృపాలు నెంచి యా
పురజనులెల్ల వేడ్కమెయి భూపుఁ గనం జనుచున్నవారు సం
బరమున స్త్రీలు కుంకుమలు పట్టుచు బోవుచునున్నవా రదే. 99

ఉ. ఆ యవతారజన్మసమయమ్మున మ్రోగెను దేవదుందుభుల్
గాయకులున్ నటీనటనికాయము పాడుచు నాడి రెల్ల రా
ప్యాయముగా నయోధ్యను సమస్తజగమ్ములయందు నాదినా
రాయణమూర్తి యంతట ధరాస్థలి మానవరూప మెత్తఁగన్. 100

ఆ. పూలవాన గురిసెఁ బుష్పించె వనభూమి
రాణివాస మెల్ల రాణఁ జెలఁగెఁ

గనులు చెదరిపోయెఁ గౌసల్య కంతట
సూతికాగృహమున సూనుఁ జూడ. 101

ఆ. ఒడలు కంపమొందె నుర్వీశుపత్నికి
మాటరాదు గాని మమతఁ దగులు
శంఖచక్రధరుఁడు సాక్షాత్కరించుటఁ
బుత్రుఁడౌచుఁ దనకుఁ బుట్టి యపుడు. 102

గీ. కలను గనినట్టి పురుషుఁడే కంటఁ బడుటఁ
బూర్వసంస్మృతి యంతలోఁ బొంది సాధ్వి
ధన్యనైతిని నీకు నేఁ దల్లి నైతి
ననుచుఁ జేమోడ్చి విస్మృతినందె నంత. 103

గీ. దివ్యతేజంబుతోడఁ బ్రదీప్త మగుచుఁ
దనరుచుండిన కౌసల్యతనయుఁ డంత
మాయలోఁ బడి తనయుఁడై మాత వినఁగ
నేడ్చెఁ దల్లియుఁ జనుబాల నిచ్చె నంత. 104

గీ. అంగనలు చేరి మంగళహార తిడిరి
దశరథనరేంద్రుఁడో, కడు దాత యయ్యె
నా దినంబున రారాజు హస్తమునకుఁ
గ్రిందనిడు చేయి మఱి యెప్డుఁ గ్రింద లేదు. 105

మ. కమలాక్షు న్గనెఁ జైత్రశుద్ధనవమిన్ గౌసల్య, కైకేయియున్
విమలున్ సత్యపరాక్రమున్ గనె, మహావీరాధివీరద్వయిన్
సుమనశ్శ్లాఘ్య సుమిత్ర గాంచె వరుసన్ సోముండు నిల్వన్ గుళీ
రమునందుం గల రిక్కలన్ జననమై రాజిల్లి రా నల్వురున్. 106

గీ. ధర్మమయమై వెలుంగు త్రేతాయుగంబు
నం దిరువదినాలుగవ మహాయుగమున
శుభదమగు విళంబిని చైత్ర శుద్ధ నవమి
వినుత గుణరాముఁ డగు రాము జనన దినము. 107

ఆ. దినకరుండు నెత్తి దీప్తిమంతుఁడు గాఁగ
నైదు గ్రహము లుచ్చయందుఁ బడఁగఁ

బుట్టె రామవిభుఁడు పుడమిఁ బునర్వసు
మూడు పాళ్లు గడచిపోయిన తఱి. 108

క. కర్కాటకంబున జననం
బర్కుఁడు మేషాదినుండె నాత్మజుఁ గనుచున్
గర్కాట గురు చంద్రులఁ గని
యర్కుని మిత్రుండు కుజుఁడు నలరెడి నుచ్చన్. 109

*గీ. మేషమందు బుధుఁడు మీనంబునం గవి
యైదు గ్రహము లుచ్చయందు నిటులు
గలవు సాయన గతి గణితంబు సేయంగ
బుధుని వారమందు బుటినాఁడు. 110

ఉ. ఎంతటిదో విళంబి ! భళిరే ! నవమీ దశమీ తిథి ద్వయం
బెంతటిదో శుభప్రద మరే మధుమాసము ; శుక్లపక్షమే
యెంతయు శుద్ధపక్షము మహిన్ హరి పుట్టిన వేళ లౌట ; లో
కాంతము వీని నెంతురు గదా ! యివి యెంతటి పుణ్యవంతముల్ ! 111

గీ. రామ లక్ష్మణ శత్రుఘ్న రాజసుతులు
కటకరాశిని బుట్టిన కారణంబొ
శీతకిరణుఁడు తద్రాశినేత యయ్యె
నంత సంతృప్తి లేమినా యట వసించె. 112

గీ. మీనలగ్నంబు శుభదమై మించు వేల
అనిమిషగురుండె కడు యోగ్యుఁడౌట యేల
ఆ యుషఃకాలమే శ్రేష్ఠ మయ్యె నేల
భరతుఁడుదయించి నట్టి ప్రభావ మేమొ ? 113

సీ. సతతంబు విధి దీర్చి సర్వజగంబుల
బాంధవుం డగువాని వంశఫలమొ ?
సుతసహస్రముఁ గన్న సుతుఁ డబ్ధిజనకుండు
పూజ్యుండు సగరుని పుణ్యఫలమొ ?

---

*గోవింద రామాయణము - ఉత్తరకాండనుండి - వియోగాశ్వాసము.

పావన గంగాస్రవంతి ప్రదాత భ
గీరథు నాఁటి సుకృతపుఫలమొ ?
తనదు సర్వస్వమున్ దానంబు సల్పిన
తాతతాతకుఁ గల తపసుఫలమొ ?
గీ. అల దిలీపకృతసుకృతఫలమొ గాక
సర్వక్రతుకర్త యజరాజు శక్తిఫలమొ
తా నొనర్చిన పుణ్యంబొ దశరథునకు
వంశ మిల నిల్చె నెంతటివాఁడొ వాఁడు ! 114

సీ. కౌసల్యపుత్త్రకా కమలాక్ష జనరామ
మహి నేలు బాలకా మంగళంబు
కైకేయిసూనుఁడా లోకైకభరతుఁడా
మహనీయసుగుణుఁడా మంగళంబు
ఓ సుమిత్రాత్మజా యున్మనా లక్ష్మణా
మాన్యుండ వీరుండ మంగళంబు
సకలాస్త్రశస్త్రవిశారదా సౌమిత్రి
మహితాత్మ శత్రుఘ్న మంగళంబు
గీ. మంగళంబు దశరథకుమారులార
మంగళంబు త్రిలోకైకమాన్యులార
మంగళం బిదె రఘువంశమహితులార
మంగళము మంగళము సుకుమారులార. 115

క. అనుచు నయోధ్యను వనితలు
జననాథుని పుత్రకులఁ ద్రిసంధ్యలయందుణ్
జనవుగఁ బాడుచు నెంతురు
తనువుల మఱపొంది తామె తల్లులభంగిణ్. 116

సీ. నారామ శ్రీరామ ననుఁ గన్న జయరామ
వేళ యయ్యెన యుగ్గుపెడుదునయ్య
నిర్మలఘనవర్ణ నిరుపమసుకుమార
పన్నీటి నిధి యిదే భద్రమయ్య

నాదివ్యబింబమా నలినాక్ష కస్తూరి
తిలకం బిదే దిద్ది తీర్తునయ్య
చిన్నారి పొన్నారి శ్రీలఁ బుట్టిన రామ
కనకడోలిక యిదే కునుకుమయ్య
గీ. యిదె దుకూలమ్ము దగు వరియింపుమయ్య
ఇంపుగా వనమాల ధరింపుమయ్య
చిట్టిపొట్టకు స్తన్యంబుఁ బట్టుమయ్య
ముద్దులిడుమయ్య నాతండ్రి మురియుమయ్య. 117

ద్వి. భువనంబు లన్నియుఁ బుట్టించు తండ్రి
అవని నా గర్భమం దవతరించితివె. 118

వటపత్రశాయివై వరలిన తండ్రి
యెటు నీవు పవళింతు వీ తల్లి యొడిని. 119

వేదసౌధమునందు విహరించు తండ్రి
నా దోసిటను హాయి లేదందు వొక్కొ. 120

మునిమనోవాసివై ముదమందు తండ్రి
చనవుగా నాచేత మనసేర్తు వయ్య. 121

తరల. అరయ నీ భువనత్రయంబును నంబుజాక్ష త్వదీయమా ?
మురిపెముం బురికొల్పు నీ చిఱుబొజ్జయందున దాఁగెనా ?
సరసహాసము నీవు సేయ శశాంకమండల మయ్యెనా ?
కరుణఁజిల్కెడి నీదు చూడ్కుల కాంతులే రవి గాంచెనా ? 122

మ. అని యేమో తనలోనఁ దాఁ దలఁచుచున్ హాసంబునన్ బాలకున్
గనుచున్ బొత్తిటఁజేర్చుచున్ గులుకుచున్ గారాముతోఁ బెంచుచున్
తనివింబొందక తన్మయత్వమున నిత్యం బుండు కౌసల్య నో
చిన నోమెట్టిదొ రామచంద్రుఁ డుదయించెంగాదె యా తల్లికిన్. 123

ఉ. ఎంతటివారి కబ్బు జగదీశ్వరుఁ బొత్తిటఁ జేర్చి సాఁకు సా
మంతము కోసలాత్మజసుమా కనఁగల్గె, ఋషీశ్వరాళి యెం
తెంతగ మౌనముద్ర ధరియించియు నిశ్చలయోగు లయ్యు నే
వింతురె కాని వాని కనిపెంచెడి సంతత పుణ్య మబ్బునే ? 124

గీ. ఆపెయే గాదు మువ్వు రిల్లాండ్రు గూడ
దాదులను బిల్వ కెప్పుడుఁ దడయకుండ
దన్మయత నుండి పరిచర్య తామె సలిపి
యాత్మజులఁ బెంచుచుండి రత్యంత రక్తి. 125

గీ. శిష్టుఁడు త్రికాలవేది వసిష్ఠమౌని
పెట్టినటువంటి పేరెట్లు బీరువోవు
ప్రథితసార్థకనాములై వఱలునట్లు
పెంపు గనుచుండి రవనీశు బిడ్డలెల్ల. 126

చ. దినదినవర్ధమానులయి తేజము గాంచుచు రాకుమారకుల్
మునులకు వైష్ణవాంశమునఁ బుట్టిన వారుగఁ గన్నవారికిన్
దనయులు గాఁగ లోకులకుఁ దత్ప్రియపుత్త్రులు గాఁగ సర్వదా
కన దివిజాళి రక్షకులు గాఁగఁ జరింతు రయోధ్య నిత్యమున్. 127

తోట. తనయుల్ కడు మెచ్చుచు దాశరథిన్
ఇనవంశ్యుల వర్తన మిట్లు సదా
జననీ జనకుల్ గన సంతసమున్
వినిపింతు రయోధ్యను వేడుకగా. 128

గీ. రాఘవుఁడు వేఁటకుం జన రక్ష నూను
విల్లు చేఁబూని సౌమిత్రి వీరవరుఁడు
లక్ష్మణుఁడు లేక రాముఁ డుల్లాసి గాఁడు
తిండియైనఁ దినం డత డుండకున్న. 129

గీ. భరత శత్రుఘ్ను లిట్టులే పరఁగుచుంద్రు
లక్ష్మణానుజుఁ డెంచ విలక్షణుండు
రామ భరతులు తమ్ముల రాగమొంది
మెలఁగుచుందురుసూ తోడిమిత్రులగుచు. 130

ఉ. రాముడు గుఱ్ఱ మెక్కి తఱి రాగముతోడ సుమిత్రసూనుఁ డా
రాముని పజ్జ నిల్చును బరా కొకయింతయు లేక కళ్లెమున్
నీమముతోడఁ బూని మఱి నేరుపుతో నదలించునంత నా
రామము లన్నియుం దిరిగిరా నట నిల్చును గళ్లె మూనఁగన్. 131

శా. అమ్మా రాముఁడ నౌదునా ! జనకు నత్యంతంబు సేవించుచో
నమ్మా యౌదునె లక్ష్మణుండ మన యన్నయ్యన్ సదా గొల్చుచో
నమ్మా నే భరతుండ సుమ్మ రఘురామాసక్తి నే నుందుగా
యమ్మా కైకతనూభవుం గొలువ నౌనా నేనె శత్రుఘ్నునై. 132

శా. అయ్యా నేర్వఁగ లేనె రాము వలె నే నామ్నాయమున్ వేఱు లే
రయ్యా రాము డొకండె మేటి యొకొ శస్త్రాస్త్రంబులన్ సర్వదా
అయ్యా సద్గురుఁడౌ వసిష్ఠు కడఁ జేయన్ నేర్తు శుశ్రూష నే
నయ్యా సత్యపరాక్రమాన్వితుఁడ సుమ్మా లోక రాముండఁగా. 133

శా. ఔరా మీరలు వారికిన్ సముల ఔరౌరా నృపాలాత్మజుల్
ధీరుల్ శూరులు వేదవేత్తలు మహా తేజస్స్వరూపుల్ గుణో
దారుల్ జ్ఞానమయుల్ సమస్తజనసంత్రాణోద్యతుల్ యుద్ధక
ర్మారాధ్యుల్ విమలుల్ సదా జనకసేవాసక్తులున్ వీరలున్. 134

ఉ. ఆటల పాటలం గలిసి యా నృపపుత్రులతోడివారలై
సాటి గడింతు రేని సిరిసంపద లెన్నియొ గల్గు మీకు మీ
బోటులు పుట్టినందులకుఁ బుణ్యము లెన్నియొ చేసినట్లుగా
లోటొకయింతలే నటుగ లోకములోఁ దలెత్తి చూడమే. 135

తోట. జననాథుని పుత్త్రుల శౌర్యగతిన్
వినుతింగను వర్తన ప్రేముడితోన్
తనయుల్ వివరింపఁగఁ దండ్రులు తా
రనుచుందు రటుల్ సుతులందఱతోన్. 136

మ. సములై మిత్రులునై ప్రియంవదులునై శాస్త్రంబులన్ ధర్మముల్
తమవెంటన్ దిరుగాడు నెచ్చెలులతోఁ దర్కించుచున్ నిత్యమున్
విమలాదర్శకులై చరించెదరు పృథ్వీజాని సత్పుత్రకుల్
రమయున్ విద్యయున్ శౌర్యము ధృతియునున్ రాజిల్లి వెంటాడఁగా. 137

ఉ. ఎన్నికఁగన్న రాఘవులనే జను లెల్ల రయోధ్య ; రాజ్యమం
దన్నిపురంబులన్ మునుల యాశ్రమభూముల వాడవాడలన్
సన్నుతి సేయుచుండుటను సంతతమున్ బరదేశవాసి యే
తెన్నునఁబోయినన్ విను పదింబదిగా రఘురామనామమే. 138

గీ. ఇంక దశరథేశునకున్నె యిఁక గొఱంత
పుత్రులను గాంచుటయె కాదు పుత్రులెల్ల
దీర్ఘదర్శులు విజ్ఞులు ధీరవరులు
నైరి సంతతసంతుష్టుఁ డతఁడు గాఁడొ! 139

గీ. తల్లిదండ్రుల సంతుష్టిఁ దనుపుచుండి
యుపనయనమొంది సర్వజ్ఞులో యనంగ
బ్రహ్మచర్యాశ్రమంబున వరలు దాశ
రథులు బాలురయ్యును జనప్రథను గనరొ! 140

## ఆశ్వాసాంత పద్యములు

గీ. నిన్నుఁ గాంచినవారల సన్నుతిఁ గని
నిన్నుఁ గాంచినవారల మన్ననఁ గని
నిన్నుఁ దరిఁజేరువారల నెమ్మిని గని
నన్నె కృపఁజూడ వేల రామన్న నీవు. 1

ఉ. నీ గుణదర్పబాహుబలనిస్తులకాంతి పరాక్రమోన్నతో
ద్యోగములన్ సుధామయమృదూక్తి, వశీకరశక్తి, భక్తిమై
సాగిలి మ్రొక్కువారి కిడఁజాలవ? సత్యపరాక్రమమ్మునన్
ద్యాగము మాత్ర మిచ్చెదొ! యిహంబునఁ గష్టములే యెదుర్కొనన్. 2

గీ. ధార్మికుఁడ వీవ యేది నీ ధర్మ మిపుడు
సర్వమును నీదు విధియని నైచుచుంటి
నెన్నటికిమాఱు నీ విధి యింతచేసి
కరుణ వహియింపవా, నినుగాంచునట్లు. 3

గీ. కష్టములఁ దాట్లు వడె మేను గర్వ ముడిగె
వ్యర్థము స్వయంకృషి, విధియు, వదల దాయె
రాత్రియేకాని యెన్నఁడు రాద పవలు
రాత్రియందైన నొకచుక్క రాదె దేవ? 4

గీ. ఆర్తుఁడ, నిశీధసమయమ్ము, నవల నివలఁ
బోవఁ దరికానరాదు, నాబోటివాఁ డొ

కండు తోడై నలేఁడుగా, కర్మ మిట్లు
కట్టి కుడుపునె దేవలోకమ్ము నందు. 5

మ. నిను భావించి తరింపనెంతురు గదా నిర్భాగ్యులౌ నన్నుఁ బో
లిన వారల్ గరుణాపయోధివయి జాలిం జెందవేమయ్య ! యిం
కను నన్నిట్లు పరీక్ష సేయఁదగునా కామ్యమ్ము సర్వమ్ము వో
యెను, ధర్మార్థమెయైన నా దెసకు రమ్మీ దర్శనంబీయుమీ. 6

శా. రామా, తండ్రీ, 'నమో' యటంచు నిటు లేరా నిర్దయా పిల్తు, నే
మీ మర్యాద ! తపింపఁజేసి పిలిపింతే నిన్ను సంతోషసం
ధామమ్మౌ హృదయానురక్తిమెయి దాదాయంచుఁ బిల్పింప లే
వేమీ ! సిగ్గిల వేల ? యీ మహిమ నీకే చెల్లురా ! రాఘవా ! 7

మ. కలలో విన్న తెఱంగుపాటియగునా, కాదంచుఁ బోనాడి నీ
తలఁపుల్ ; లోకహితార్థమౌ మనుగడన్ ధర్మమ్ముగా నెంచి వ
ర్తిలుచుంటిన్ సుఖదుఃఖనాశనము గాదే, యీగతిన్, సర్వక
ర్మల వీడంగలవాఁడె ధన్యుఁడగునా రాముం గనన్, రాఘవా ! 8

చ. ఫలము త్యజించి కర్మతతిఁ బాల్గొనుటే తగుదారియంచుఁ బె
ద్దలు మును చెప్పియుంట నదె ధర్మముగా శిరసావహించి వ
ర్తిల, పతితస్థితుల్ వడి దరిన్ గుమిగూడెడి వాని దాటఁగా
గల కృషి, సంఘమం బెపుడుఁ గష్టములే కలిగించె రాఘవా ! 9

ఉ. చేతుల మోడ్చి నీ భజన సేయుటయే తగుఁ, గన్ను మూసి నిన్
చేతమునందు నిల్పి మునిసేవిత తావకదివ్యరూపు సం
పాతము లేని భావన, సుభక్తిని గాంచఁగ నొప్పు, జన్మసం
ఘాతవిపత్పరంపరల గాయములన్నియు మాన రాఘవా ! 10

గీ. ఎన్నియో దారులంబట్టి యింతదనుక
నిన్నుఁ గాంచెడి సాధన నియతి నుంటి
కర్మలంబూని కడగండ్లఁ గాంచినాఁడ
కర్మవిరహితభక్తి నిన్ గాంచఁగలన ? 11

మ. అల తాఁబేటివిధాన, నీ యవయవవ్యాపారమున్ వీడి, లో
పల బంధించుచు వాని ; నీ స్మరణనే, భక్తిన్ దివారాత్రముల్

సలుపన్ బూనుదు, సర్వధర్మములు నా సాంగత్యమున్ వీడ, నా
తల, నీ పాదంబుల నుంతు, నంతటితొ నిన్ దర్శింతునా రాఘవా !

ఉ. రేలఁ జరించెదొక్కొ కనుఱెప్పల మూయఁగఁ జూడవత్తు వీ
వేల ? దినంబునన్ సతము నెంతయు నిద్ర గనంగోరువాఁడ నీ
లీల కిదే ఘనంబ ! పవలే స్వశరీరముతోఁడ భక్తు నే
వేళనొ చూడరమ్మ మురిపెమ్మున నిన్ విడనాఁడ రాఘవా ! 13

ఉ. దొంగ చరించువేళ నిశ దోర్బలవంతుఁడవున్ బ్రభుండ వే
భంగి నిశాచరత్వమున భక్తులకున్ గలలందు మాత్రమే
పొంగుచు దర్శనం బిడెడి పోకడలన్ వహియించినావు ? నిన్
నింగి వెలుంగునన్ బగటనే సతమున్ గననెంతు రాఘవా ! 14

ఉ. నీవు జగత్ప్రభుండ వవనిన్ సృజియించినవాని తండ్రివిన్
చావులు పుట్టుకల్ గనని శాశ్వతమూర్తి వనాదిమూర్తివిన్
నీవ నిశాచరుండవయి నీదగువారలఁ జూడవచ్చుటల్
దేవ త్వదీయ దివ్యగుణ దీప్తికి నిద్దియు మచ్చ రాఘవా ! 15

ఉ. కానిపనిన్ దగుల్కొనుచుఁ గావగఁ గోరెడివాఁడఁ గాను నే
గానియుగాని నన్యులది కైవసముం గొని నీదు పూజలన్
బూనినవాఁడఁ గాను సిరి పుట్టుకతోడుత నబ్బె దాననే
మానము వీడకుండ నభిమానముతో నిను గొల్తు రాఘవా ! 16

ఉ. మోసమునన్ నవాబు ధనముం గొని భక్తిని నీదు పూజలన్
జేసినవానిఁ గాచితివి చెచ్చెర దారులఁ గొట్టి కొట్టి నీ
బాసలు వ్రాసినట్టి ముని పల్కులు నీ చెవి సోఁకెకాదె నా
దోస మదేమి ? నా వినుతి తుష్టినొసంగదొ ! నీకు రాఘవా ! 17

మ. అపరాధిన్ నను గావుమీ యనను నన్యాక్రాంతచిత్తుండ నన్
గృపతోఁ జూడు మటంచుఁ గోరను సుమీ ! కేల్మోడ్చుటల్ దుష్కృతా
తపతప్తుండ నటంచు గాదు పుటుకల్ తప్పించు నారాయణుం
డపవిద్యన్ నశియింపఁజేసి యనియే యర్చింతు నిన్ రాఘవా ! 18

గీ. గర్భవాస మొనర్చుచు గర్భనరక
మనుభవించెడివేధలో జననమౌచు

నిన్ను సంస్మృతియందుంచనేర నైతి
పరమపురుష! క్షమింపు మీ పతితజీవి. 19

గీ. యౌవనప్రాప్తి నీ జన్మ మఖిలమంచు
ప్రకృతిలోఁ బడి యింద్రియవశుఁడ నగుచు
నిన్ను సత మెంచు మనుగడ నేర్వనైతి
పరమపురుష! క్షమింపు మీ పతితజీవి. 20

గీ. వయసు చనె దేహమో రోగబాధఁ గ్రుంగు
పలుతెఱంగుల సంసారబాధ లెగసి
చుట్టుముట్టుట నీ స్మృతి పట్టు సడలె
పరమపురుష క్షమింపు మీ పతితజీవి. 21

గీ. కోరి భజియింతు మిగిలిన కొన్ని నాళ్ళ
శ్లేష్మ మవసానగతి దరిఁజేరుదాఁక
మాట పడిపోయి స్మృతి దప్పి మనెడి దాఁక
పరమపురుష! క్షమింపు మీ పతితజీవి. 22

ఉ. ఆది జనించినట్టి నెలవా విడి, వీడుచు వంశకర్త సం
పాదన అగ్రహారమును, బాసితి ఏబది నల్బదేండ్లు స
మ్మోదముతో వసించి యశముం గడియించిన తావు, హైదరా
బాదున కేల వచ్చితి నపారపురాకృతకర్మ మెట్టిదో! 23

ఉ. ఐదు గృహమ్ము లమ్మి యిపు డారవ రేకుల యింట హైదరా
బాదు నివాసినైతిఁ జనెఁ బాడియుఁ బంట పొలమ్ము లన్ని సం
పాదన సున్న జీర్ణగతి పట్టి రుజావృత మయ్యె దేహ మిం
కేది శరణ్య మయ్యె సుఖియింపఁ ద్వదర్చన తప్ప రాఘవా! 24

ఉ. ఏడనొ! మేడనో నదినొ యింటనొ వాడనొ రోడ్డుమీదనో
నీడనొ యెండనో హితుల నెమ్మి లభించునొ లేదొ బాంధవుల్
గూడునొ కూడరో యెఱుగకుండ హఠాన్మరణంబొ యేమియున్
జాడ యొకింత యేని గనఁజాలముగా తుదిఁ గూర్చి రాఘవా! 25

చ. తుది యిదె వచ్చెనంచు గడుఁ దుష్టిని నీ పదయుగ్మపూజకున్
మది గలిగెన్ గ్రహింపు మిక మానక నీ స్మరణార్చనల్ పరం

పదమును జూడఁ బాంధునిగ వచ్చెద నీవెనువెంటనే, భవ
త్పదముల నెత్తి నుంచుకొని భక్తుని నన్ గనరమ్మ రాఘవా ! 26

చ. సలలిత రామతారకము సంస్కృతియందున నుంచి నేఁటికిన్
నలుబది యేండ్లు నిండె నిను నా హృది నిల్పి జపించుచున్ సదా
ఫలిత మొకింతయేని మది భావనసేయ, జనించె నేఁటికిన్
వలపు నినున్ గనంగ యిక వత్తువ! రావ! మహాత్మ? రాఘవా ! 27

అవతారాశ్వాసము సంపూర్ణము.



ఓమ్

శ్రీరామాయ నమః

# శ్రీ గోవింద రామాయణము

## 'సీతారామమ్'

### బాలకాండ

### 3. శరణాగతాశ్వాసము

క. రక్షణ దక్షుఁడ వనియో
మోక్షము నీయంగఁజాలు పూజ్యుఁడ వనియో
సాక్షాద్భర్తవె యనియో
కక్షనొ శరణన్న నీవు కావవె రామా ! 1

### దశరథుని కొల్వు

ఉ. ఆతని కేమి లోటు సకలావనినాథుల నాథుఁడైన వి
ఖ్యాతుఁడు పౌరజానపదకాండములన్ దయ నేలువాఁడు సం
ప్రీతిని వైరిఁ బ్రోవఁగల వీరుఁడు వేదవిదుండు పూజ్యుఁడున్
పూతమునీశబాంధవుఁ డపూర్వమహాబలసన్నివిష్టుఁడున్. 2

గీ. అతఁడు రాజర్షియయ్యు బ్రహ్మర్షి నాఁగ
దనరువాఁడు నిరంతరధర్మరతుఁడు
ఆతఁ డతులపరాక్రముం డతిరథుండు
దీర్ఘదర్శియు యజ్వయుఁ దేజువాఁడు. 3

గీ. అతఁడు సత్యరతుండు ధర్మార్థకామ
ముల ననుష్ఠించువాఁడు నిప్పువలె వెల్గు
సైన్యము గలట్టివాఁడు నిక్ష్వాకునృపుఁడు
ప్రథితశస్త్రాస్త్రగణమహాబలయుతుండు. 4

గీ. సింధు కాంభోజ బాహ్లీకసీమలందు
నుత్తమోత్తమహయ మొండు నుండకుండ

నెచటఁ బుట్టిన నవ్వాని నెల్లఁ దనదు
రాజ్యమున సోఁక దెచ్చు రారాజతండు. 5

ఆ. సమదగజచయమ్ము సోఁకఁగా దొరకునె
యరుదు వింధ్యగిరి హిమాద్రులందు
ఎవనితరము చేర్ప నిభజాతు లన్నింటి
దశరథుం డొకండె తగినవాఁడు. 6

గీ. సంతత వసిష్ఠమునిచంద్ర సంయుతుండు
మహితశాస్త్రార్థవిదుఁడు సుమంత్రియుతుఁడు
బాహుబలశౌర్యదర్పవిభాసితుండు
ధర్మ మెడఁబాయ నొల్లని ధార్మికుండు 7

గీ. అయ్యు బాలుని శ్రీరాము నాత్మభవుని
శరణుగొనియున్నరీతిగా సతము నొక్క
క్షణమె యైనను నాతని జాడ నీడ
వినక కానక యుండఁ డా పృథివినేత. 8

శా. శ్రీరామా యను మాటమాటకును రాజీవాక్ష పుత్రా యిటుల్
రారమ్మంచును జేర్చుచుండు నొడి, గారాముల్ గడున్ జిందఁగా
మారామున్ గనకుండ మూర్కొనుచుఁ బ్రేమ న్సంతతానందుఁడై
సారాచారవిచారుఁడై దశరథక్ష్మాభర్త యేలున్ భువిన్. 9

ఉ. ఆ పురి పేరయోధ్య నిజ మన్యులకున్ జొరరాని కోట, యే
తాపము లేక నా దశరథప్రభు వేలెడి వాడ సజ్జనుల్
కాఁపురముండు నీడ రఘుకాంతులకున్ వసియించు దుర్గమై
యేపు గనెన్ యశంబున మహిన్ సరిపోలక యే ప్రదేశమున్. 10

చ. అరుదు గదా స్వదేశజను లార్తినిఁ బొందెడి కాల; మన్యులో
తరుగదుగా గుణప్రతిభ ధర్మవిధంబు నభంగమే కదా
యరుల జయింపఁగా దశరథావనిపాల యటంచు నేరో యా
తురమున రాని రోజు కలదో యతఁ డేలుచునుండ రాజ్యమున్. 11

## విశ్వామిత్రుని రాక

ఉ. అత్తఱి యొక్కనాఁడు వసుధాపతి మౌనులఁ గూడి కొల్వునన్
చిత్తము పల్లవింపఁగ వసిష్ఠుఁడు దెల్పెడి ధర్మసూక్తులన్
బత్తిని నాలకించు తఱి వచ్చెను కౌశికుఁ, డంత రాజు చే
యెత్తి నమస్కరించి ముని కిట్టులు పల్కె సపర్యపిమ్మటన్. 12

శా. మీ రేతెంచుటయే శుభంబు నమృతంబే యబ్బి నట్లుండె స
న్నారీరత్నము భార్యయై సుతుఁడు జన్మంబంద నెట్లుండునో
వారిం గోరి తపించుచుండఁగఁ గడున్ వర్షింప నెట్లుండునో
యే రీతిన్ నిధి చిక్కనుండు నటుగా నేనైతి మీ రాకచే. 13

గీ. బ్రహ్మతేజ! స్వాగతము మద్భాగ్య మేమొ ?
ఆత్మజుల వివాహమ్ము లే నాత్మఁ దలఁప
మీర లరుదెంచినా రిట్లు మేదినీశుఁ
డీయఁగల దేమి ? సత్పాత్రుఁ డిపుడు దొరకె. 14

ఆ. నీదు రాకకతన నినుఁ గనుఁగొంటను
బుణ్యతీర్థ మిపుడె పొందినాఁడఁ
బరమధర్మ మెల్లఁ బ్రాప్తించెఁగా నేఁడు
లభ్య మాయె సుమ్మి యభ్యుదయము. 15

ఆ. కార్య మేదియైనఁ గౌశికా ! నెఱవేర్తు
సంశయింపవలదు శక్తిఁగూర్చి
దైవ మీవు నాకు ధర్మపరాయణా !
ధర్మకర్మ నేయఁదలచువాఁడ. 16

క. రోమంబులు పులకింపఁగ
భూమీశునిమాట వించు మోదముతో వి
శ్వామిత్రుం డను "రాజా,
సామాన్యుండవె నినుఁగన సర్వం బబ్బున్." 17

## విశ్వామిత్రుని కోరిక

మ. పురమున్ గోశము గ్రామముల్ స్వజనులున్ భూనాథ క్షేమంబె? యె
ల్లరు సామంతనృపుల్ వశంవదులె ? లీలన్ మిత్రులన్ జూతువే

యరివర్గంబుఁ జయించితే యిహపరవ్యాప్తంబులౌ కార్యముల్
నెరవేర్పన్ వెనుదీయకుందువె జనానీకప్రమోదంబుగన్. 18

ఉ. విందుగ నీ సపర్య రఘువీర, సుమంత్రియుతా, మునిప్రియా,
పొందితి, వాంఛితార్థమిడఁ బూనిక దెల్పినవాఁడవౌట సా
నందుఁడ నైతి మీ కులగుణంబె సుమా వర మిట్లు కోరకే
ముందుగ నిచ్చుచుంట వృథ పుచ్ఛకయుంట యదెట్టిదేనియున్. 19

ద్వి. ఉత్తముఁడు వసిష్ఠుఁ డుపదేశికుండు
క్రొత్తయే నుడిదీర్పఁ గోసలేశులకు ? 20

క. అనుచు వసిష్ఠుని దక్కిన
మునులను గని క్షేమ మరసి భూపతి మంత్రుల్
వినఁగాఁ గౌశికుఁ డిట్లను
జననాథా ! రాకకతము సర్వము వినుమా. 21

చ. మునులును యోగులున్ విపినభూమి పయఃఫలమూలభక్షణన్
మనరాకా నీ వెఱుంగవాకా ? మాధవుఁ గొల్చెడివారు రాజ్యముం
గొనరు తపమ్మె సిద్ధి గనఁ గోరెద రెప్పుడు నే నొకండు సి
ద్ధిని బడయంగ నెంచి మఖదీక్షను బూనితిఁ గాని; భూవరా! 22

ఉ. ఘోరతపమ్ము సేయుచు నకుంఠితతేజము నొంది యెట్లహం
కారము వీడకుండ మమకారమునం బడువాఁడు సిద్ధినిన్
జేరఁడొ యట్లె నా వ్రతముఁ జేద్వడె నిర్వురు కామరూపులౌ
వీరులు శిక్షితుల్ సవనవిఘ్న మొనర్చుటఁ బాటి వచ్చితిన్. 23

గీ. అధిప మారీచుఁడు సుబాహుఁ డసురు లౌట
మాంసయుతరక్తధారల మలినపఱిచి
రమలమఖవేది నే సిద్ధి నందుపట్ల
వారి గుఱి దాఁటఁగా నిటఁ జేరినాఁడ. 24

ఉ. శాప మొసంగు నంతట నిశాచరు లిర్వురు నేలఁగూలరే
రూపఱి పోరె సిద్ధికి నిరోధ మొనర్పఁగ నూరకుండునే
బాపఁ డటంచుఁ బల్కెదవొ పార్థివ ? కోపవశుండనౌచు నే
శాప మొసంగియున్న ననుఁ జయ్యనఁ గ్రోధముఁ గూడఁ బొందదే.

ఉ. వచ్చితి నందుచేత రఘువంశసుధాకరు నాశ్రయింపఁగా
సచ్చరితా ! స్వపుత్రకుని సత్యపరాక్రము రాము శూరునిన్
గుచ్ఛగఁ బిల్లజుట్టుగల కోమలు మీ సుకుమారు జ్యేష్ఠు నా
కిచ్చిన రాక్షసుల్ మడియరే త్రుటి, రాముని నా కొసంగుమా 26

ఉ. ఏమని యెంతువో రఘుపతీ ! భవదీయకుమారుఁగూర్చి మీ
రాముఁడు దివ్యతేజమున రక్కసు లందఱ విఘ్నకారులన్
భూమిని గూల్ప శక్తుఁడు నమోఘబలుండును నాదు రక్షణన్
క్షేమము గల్గు నిశ్చయము శ్రేయమె గూర్తు ననేక రీతులన్. 27

శా. ముల్లోకంబుల ఖ్యాతిఁబొందఁగలుగున్ మమ్మాటికి న్నమ్ముమీ
విల్లున్ రాముఁడు పూనుచో నిరువురున్ వే పాఱరే, నిల్తురే ?
తెల్లం బియ్యది వారి ప్రాణహరుఁడౌ ధీరుండు రాముండె సం
ధిల్లెన్ మృత్యువు వీర్య గర్వితుల కెంతే పాపులౌ వారికిన్. 28

చ. ప్రతిన యొనర్చుచుంటి నిదె రాము నొసంగిన రాక్షసద్వయిన్
హత మొనరించినట్లె భవదాత్మఁ దలంపకు పుత్రమైత్రి, నె
నతఁ డెవరో యెఱుంగుదు, మహాత్ముఁడు సత్య పరాక్రముండహో !
అతనిని మీ గురుం డెఱుఁగు నా మునికోటి యెఱుంగు నాతనిన్. 29

చ. అరమరలేక నీదు సచివాగ్రణు లందఱు నా వసిష్ఠుఁడున్
వరగుణ రామచంద్రు రఘువర్యునిఁ బంప ననుగ్రహించినన్
ధరణిపయిన్ భవదీయకృతధర్మము కీర్తియు శాశ్వతంబుగా
వరల నభీప్సితంబయిన పార్థివ ! రాముని నా కొసంగుమా. 30

చ. తడ వొనరింతువో క్రతువిధంబున వేళ యతిక్రమించు నీ
యెడఁద విచారమొందఁ దగునే దశరాత్రములైనఁ జాలు నా
కిడ నలినాక్ష భద్రమగు నెంతయు నీకు, సునిశ్చయంబ యీ
కడపటి కోర్కెఁ దీర్పఁదగు క్ష్మాధవ ! రాముని నా కొసంగుమా. 31

## దశరథుని అనంగీకారము

చ. మునివరు మాటలన్ విని ప్రమోదముఁ జూపక భూభుజుండు నె
మ్మనమునఁ గించ నొంది క్షణమాత్రము సంజ్ఞనుగూడ వీడి యే

మనవలెనో యెఱుంగక భయంబునఁ గంపితగాత్రుఁడౌచుఁ బ
ల్కెను వినయంబుతోడ ఋషికిన్ మది మెల్లనఁ గూడఁదీయుచున్.

ఉ. ఆలము సేయఁగాఁ గలుగునా పదునాఱవయేఁడు పోని నా
బాలుఁడు నా ప్రియుండు పలువత్సరముల్ తపముండి కాంచి యే
వేళను వీడనట్టి యరవిందదళాక్షుఁడు జ్యేష్ఠపుత్రునే
యేల వరించినావు తగునే యిది; రాముఁడు రాఁడు కౌశికా! 33

ఉ. రక్కసిమూఁక యెల్లరు పరంపరగా భువిఁ ద్రెళ్లరొక్కొ నే
నొక్కఁడ వత్తు నేనె ధను వూనుదు నాదు మహాబలంబు నీ
ప్రక్కన నిల్చు యాగము సురక్షిత మయ్యెడి నడ్డు రాఁగలాఁ
డుక్కటి నస్త్రె; సంశయము నొందకు, రాముఁడు రాఁడు కౌశికా! 34

చ. పదియునునారె యేండ్లు గలవాఁడు కృతాస్త్రబలుండు గాఁడు కో
విదుఁడును గాఁడు యుద్ధమున వెంటఁ గొనన్ బనితీఱునే విశా
రదుఁడును గాఁడు మాయరణరంగములం దసురాళిరీతి; నే
బ్రదుక ముహూర్తమున్ విడిచి రాముని, రాముఁడు రాఁడు కౌశికా!

మ. అయినన్ కాదని యందు వేని రఘురామాసక్తతన్, నేనునున్
బయనం బయ్యెద నా బలంబుఁ గొని విశ్వామిత్ర పోకార్వ నీ
పయి నుంకించెడి యజ్ఞవిఘ్నకరులన్ వా రెవ్వరో సర్వమున్
దయతోఁ దెల్పిన నట్టి వ్యూహముల సంధానమ్ముఁ గావించెదన్. 36

చ. అనఁగ నృపుండు మౌని యిటు లాడగసాగె, నృపాల! సర్వమున్
వినుము, పులస్త్యవంశజుడు వీరుఁడు రాక్షసరాజు రావణుం
డను నొక దైత్యుఁ డుండె, నజుఁ డాతని కిచ్చె వరంబు, దాన నే
చును భువనత్రయం బెపుడు, స్రుక్కెడు లోకము వాని చేష్టలన్. 37

గీ. విశ్రవసుమౌని పుత్రు కుబేరు తమ్ము
దైత్యనాథుని నెఱుఁగవే తరలివచ్చు
నతఁడె మఖవిఘ్నమొనరింప, నతఁడు దాని
పట్ల మారీచుని సుబాహుఁ బంపుచుండు. 38

శా. నేనేఁ జాలను దుష్టరావణునితో నిల్వంగఁ గయ్యంబునన్
మౌనీ! నా బలగంబు లెల్ల మడియున్ మార్కొన్నచో రావణున్

వానిఁ డీకొనువాఁడె బాలకుఁడు దేవానీకమే దుల్లు న
వ్వానిఁ దార్కొని, నేను నా బలము నా బాలుండు నోడింతుమే. 39

ఉ. సుందుఁడు వాని తమ్ముఁ డుపసుందుఁడు గన్నసుతుల్ క్రతుక్షితిఁ
జిందులు ద్రొక్కుచుండఁగ నజేయులు వారల డీకొనంగ నా
బొందె తరింపఁజేయఁగల పుత్రకు బాలకుఁ గోరు దేల యే
మందు నొసంగఁజాలను మదాత్మజు బాలకు నీకుఁ గౌశికా ! 40

చ. కరుణ వహింపు మయ్య కసిగందును గోరకు మయ్య నీవకా
గురుఁడవు దైవతంబవును గోపము సేయకు మయ్య, వీఁడ సం
గర మొనరించు టయ్య కలకాల మభాగ్యుఁడ నైతి నయ్య నా
చిఱుతని వీడు మయ్య మఱి చెడ్డఁదలంపకు మయ్య కౌశికా ! 41

## కౌశికుని పట్టుదల

ఉ. ఆనతితో నిటుల్ దశరథావనినాథుఁడు పుత్రమైత్రికిఁ
లోనయి విన్నవించు నుడి లోఁదలపోయుచు నా మహర్షి తే
జోనయనాగ్ని ప్రజ్వరిలు చూడ్కులఁ బల్కఁగసాఁగె నిట్టు "లో
మానవనాథ, నీకె తగు మాటల ముందుగఁ జెప్పవైతివే. 42

ఉ. కేవలకర్మఠుండవు, ప్రకీర్ణతపస్థ్సిత యోగమగ్నుఁడఁ
వీవన క్రోధభారమున నిండినవాఁడవు, నే జటాభరం
బె వహియింతు, రాజసుఁడ వీవు, మదీయము సాత్వికంబె, యిం
కీవు సుతాభిమానుఁడవె, యేను జగజ్జనకాభిమానుఁడఁ. 43

ఉ. నీవొకొ భోగమే కనుదు నేనొకొ యోగము నభ్యసించితిఁ
నీవు సుతేష్టి సల్పితివి నేనొ తదిష్టిని బూర్తిచేసితిఁ
నీ విల ధర్మకామముల నెంతువు నా కగు ధర్మమోక్షముల్
నీవయథార్థముఁ గనఁగ నేర్చినవాఁడవు ? రాము నీయవా ? 44

ఉ. ఆడిన మాట తప్పితె ? మహాయశ మందిన కోసలేశ ! యె
వ్వాఁడును లేఁడు మీ కులమువాఁ డిటు లిత్తును గోర్కియంచు మా
టాడిన వాఁడు ; నేఁడు మొద లన్వయ మెల్ల గళంక మొందు నీ
వేడ యసత్య మేడ సుఖియించుట యేఁట సబాంధవంబుగఁ. 45

## వశిష్ఠుని హితోపదేశము

చ. గురుఁడు వశిష్ఠుఁ డంత మునికుంజరు రోషపరీతబుద్ధి భూ
వరు మమకారముం గనుచు వారికిఁ దారణఁ జూప నెంచి లో
నరసియెయుంట సర్వము, మహర్షియుఁ దానయియుంట ధర్మత
త్పరుఁడయి జేనితో హితము పల్కెఁగసాఁగె వినన్ సభాసదుల్. 46

ఉ. నీ కులమందుఁ బుట్టిరి పునీతులు సంతతసత్యసంధు లి
క్ష్వాకుసువంశసంభవులు వారలు ధర్మపరాయణుల్ సదా
శ్రీకరదివ్యసువ్రతులు చేసి రనూనమహాసుదానముల్
నీ కిది యర్హ మౌనె ధరణీశ, స్వధర్మము వీడనెంతువే. 47

గీ. మూఁడు లోకంబులను ఖ్యాతిఁ బొందినావు
ధర్మమూర్తి వధర్మంబు తగదు తగదు
ప్రతిన నెరవేర్పుమీ రఘువంశజాత
వీడుమీ రాము రాముని వీడు మిపుడె. 48

గీ. దానఫలమును సప్తసంతానఫలము
సత్యసంధత తొలఁగిన సమసిపోవు
యజ్ఞయాగాదికర్మల నాచరించి
యిపుడె వీడెదొ ప్రతిన పుత్రేషణమున. 49

ఉ. ఆతఁడు భాగ్యభోగ్యము లనంతముగాఁ గలవాఁడె యయ్యె వి
ఖ్యాతనృపాలుఁడయ్యె వివిధాస్త్రచయాన్వితుఁ డయ్యె మౌనియై
వీతభయానురాగముల విప్రమహర్షియు నయ్యె, రాము సం
ప్రీతి వరింప, నీ విడక వేఱువిధంబు దలంప ధర్మమా ? 50

చ. అతఁ డొక చిన్నవాఁడును కృతాస్త్రచయుండునుగాని బాలుఁ డా
అతిబలులైన రాక్షసుల నాహవమం దెదిరింపఁగల్గునే
సుతుఁడను మాట వీడి పరిశుద్ధమనంబునఁ బంపు రాము మీ
హితుఁడయి వచ్చెఁ గౌశికుఁ డహీనబలుం డరిఁ జంపఁగల్గియున్. 51

మ. శతదివ్యాస్త్రమహాబలాన్వితుఁడు విశ్వామిత్రుఁ డోరాజ ! యా
యితముంజేయఁగలం డతం డెపుడు నూత్నాస్త్రంబులంగూడ సం

తతధర్మాత్ముఁడు సర్వశాస్త్రవిదుఁడుం దా సర్వ మర్పింప నీ
సుతుకున్ వచ్చినవాఁడు, రాము నిడుమీ శుద్ధాంతరంగమ్ముతోన్. 52

## దశరథుఁడు రామునిఁ బంపుట

చ. కులగురువాక్యము ల్వినుచుఁ గోసలనేత ప్రసన్నచిత్తుఁడై
కలఁతను వీడి రాము నిడఁ గౌశికమౌనికి లోఁదలంచుచున్
బిలిచెను రామలక్ష్మణుల, వే చనుదెంచిరి వారు దివ్యమం
గళకరు లౌచుఁ, దండ్రిసముఖంబున నిల్చిరి బద్ధహస్తులై. 53

చ. దరహసితాననుండు వసుధాపతి యంతట రాముఁ బిల్చి యా
దరమున మంగళంబను నితాంతశుభంబగుఁ గాత నీ కనున్
బరమమునీంద్రసన్నిధి విభాసురసత్యపరాక్రముండవై
వరలెదు గాత నీ వనుచు బాలుని మూర్కొను నిండు ప్రేమిడిన్. 54

గీ. రాజ్ఞి యానందబాష్పముల్ రాలఁ బుత్రు
నల్ల నొడిఁజేర్చి యక్షతల్ చల్లె, నతఁడొ
మాటిమాటికి మూర్కొను మాత కపుడు
నంజలి ఘటించె మంగళం బనెను తల్లి. 55

గీ. లోకబాంధవాంశ వహించి లోక మెల్ల
రక్షణము సేయఁ బుట్టిన రామచంద్ర
సముఁడు ధర్మార్థకామమోక్షముల నెఱుఁగుఁ
కౌశికుఁ డితండు, వచ్చె నీకాంక్ష నిటకు. 56

గీ. అని వసిష్ఠుండు మంగళ మనుచుఁ బలికి
రాము నభిమంత్రితునిఁ జేసె రాజరాజు
కౌశికున కిచ్చె రాము లోకంబు మెచ్చ
శంఖదుందుభినిర్ఘోష చదల నిండ. 57

మ. మునులున్ విప్రులు దల్లిదండ్రులును సమ్మోదంబుతో మంగళం
బని యాశీస్సు లొసంగుచుండ సుర లాహ్లాదంబునన్ బుష్పవృ
ష్టిని గల్పింపఁ గడంగ నక్షతలఁ బూజింపన్ జనం బెల్ల, త్రో
వను బట్టించెను రామలక్ష్మణుల విశ్వామిత్రుఁ డాత్మార్థమై. 58

ఆ. దొరకరాని దేదొ దొరకిన చందాన
నద్ది విడువరాని దైనయట్లు
తనువు పొంగ మనసు తత్పరమై యుండ
గాధిసుతుఁడు నడువఁగడఁగె ముందు. 59

## రామలక్ష్మణులు మునివెంటఁ జనుట

మ. జటలున్ వల్కలముల్ పొసంగఁ జను నా సన్మౌని; వెన్వెంట బా
సటమై రాముఁడు నీరజాక్షుఁడు ఘనశ్యాముండు బాలుండు దు
ర్ఘటమార్గంబులఁ బోవు, విల్లుఁగొని, ఖడ్గంబూని సౌమిత్రి రాఁ
బటుబాహాబలఖడ్గధర్మముల శోభన్ దన్ను వెంటాడుచున్ 60

ఉ. ఈ మునిమాన్యుఁ డెవ్వఁడని యెంచఁడు దుర్గమవన్యభూములన్
భూమిధవుండు పుత్రు ననుఁ బొమ్మనెనా యని ప్రశ్న సేయఁ డా
రాముఁడు, తండ్రి యాన యిది రామ యటంచు వశిష్ఠుఁ డాడుటే
నీమము నూనఁజాలె మునినేతకు మ్రొక్కుచు వెంబడించఁగన్. 61

గీ. అన్న రాముండు పయనమై యరుగనుంట
వింటయే చాలు సౌమిత్రి వెంటనంట
సవతి కౌసల్య సరి యని యంట చాలు
మేలు మేలని పంపె సుమిత్రయు సుతు. 62

గీ. ఉడుము చర్మంబు కవచమ్ము నూనియుండె
వారి పల్లవ కోమల పాణియుగము
స్కంధముల గాని వారి భుజమ్ములందు
నలరుచున్నవి రెండేసి యంపపొదులు. 63

గీ. రాజసుతుఁడు రాముఁడు దుర్వారబలుఁడు
కౌశికుని వెంటఁ జనుచుండఁ గాంతి నొందె
దశదిశలుగూడఁ బరుఁడు సద్భక్తు నెపుడు
వెంట నంటెడి గతి వారి విధము దోఁచె. 64

## సరయూనదీతీరముఁ జేరుట

చ. ఉఱుకునఁబోయి వారు సరయూనది దక్షిణతీరమందు ని
ల్చిరి ముని పల్కె నిట్లపుడు శ్రీఘ్రమ రామ బలంబు దీయుమీ
యరుల జయింపఁగల్గెడి బలాతిబలల్ గ్రహియింపవయ్య నీ
సరి మఱి యెవరు లేరు బహుకాలతపఃఫలవిద్య నీయఁగా. 65

చ. ఎవఁ డనురక్తి వీని జపియించునొ వాఁడు సదా ప్రసిద్ధుఁడై
భువనము లన్నిటన్ జయముఁ బొందుఁ, బ్రమత్తుఁడు సుప్తుఁడై ననుఁ
జవమును వీఁడబోఁడు, నిజశత్రుభయంకరుఁ డప్పుగూడ వా
స్తవ మిది పొందఁ డెప్డు శ్రమ దప్పియు నాఁకలి మాఱురూపమున్. 66

ఉ. నీవ గ్రహింపఁబూనుసెడ నేనిడనుండిన రెండు మంత్రముల్
భూవలయమ్మునందు నినుఁ బోలెడి సుందరుఁ డెవ్వఁ డుండు నీ
భావపరంపరామధురవాదమునఁ సముఁ డెవ్వఁడుండు వే
చావక నిన్నెదిర్చి మనఁజాలినవాఁ డెవఁడుండు భూమిపై. 67

ఉ. జ్ఞానమయాత్మ లియ్యవి విశారద లియ్యవి మూఁడుకాలముల్
లోనగు కాలగర్భవతులుం గద యియ్యవి దేవమాతలౌ
వీని ధరింపఁగాఁ దగిన విజ్ఞుఁడ వీవు, మఱొక్కఁ డెవ్వఁడేఁ
బూనఁగలేఁడు, నీకృపను బొందినవాఁడె భరింప నోపెడిఁ. 68

ఉ. తాత సృజించె వీనిఁ గడు తాపసినై గ్రహియించినాను నీ
కే తగుఁగాని నాకుఁ బని యేమి త్వదాశ్రయ మొందియుండ, నా
చేతము మంత్రశక్తుల వశీకరమై భర మాయె, నింక సం
ప్రీతి మదర్పణమ్ము గొనుమీ యిపు డీవె సుధర్మపాలకా! 69

చ. అన ముని రాముఁ డంబు గొని యాచమనం బొనరించి విద్యలఁ
గని గురుపూజలన్ సలిపె, గాధిసుతుండు పరాత్మచిత్తుఁడై
పనివడి రెండు మంత్రములఁ బాసె శరీరసుఖచ్యుతంబుగా
మునియయి యోగమూనియును బొందియు విద్యయు సిద్ధినొందమిన్.

గీ. అల బలాతిబలల్ గొని లలితమూర్తి
రాఘవుండు సహస్రార్కరశ్మి గలిగి

భూరి విక్రమదీప్తి విభూతి వెలుఁగు
నతులుఁడై భానుఁ డస్త్రాద్రి నధిగమింప. 71

గీ. దర్భలను బాన్పుగాఁ బూని దాశరథులు
బాలురే యయ్యు నృపపుత్రవరులు నయ్యు
కౌశికవచో విలాస సుఖమ్ము వలన
సుఖతరమ్మగు నిద్రలోఁ జొక్కినారు. 72

## విశ్వామిత్రునకు శ్రీమన్నారాయణుఁడు ప్రత్యక్ష మగుట

ఆ. తెల్లవారసాఁగెఁ దెలివొందె దిక్కులు
మెల్లమెల్లన ముని మేలుకాంచి
రామ లక్ష్మణులను రాజీవనేత్రుల
నిదురలేపఁ బూని నిలిచె నల్లె. 73

గీ. ఏది సరయూనదీతీర ? మిచట లేరు
రామ లక్ష్మణు లేమైరి రాజసుతులు ?
సర్వమును శూన్య మిట దర్భశయనుఁ డేడి
యనుచు లోలోనఁ దలపోసి యల్లె నిలిచి. 74

ఆ. నిలిచి యొక్క క్షణము నిర్వికారుండయి
యల్లె కనులు మూసి యల్లె తెఱచె
యెదుట నున్న జ్యోతి యెఱుకలేనట్లుగాఁ
జూచి యోర్వలేని చొప్పు దోఁప. 75

ఆ. తనువు పులకరింపఁ దలను బంకించుచుఁ
గమలనేత్ర యనుచుఁ గనులు మూసి
శేషశాయి యనుచుఁ జేతులు జోడించి
కౌఁగిలింపఁబూను కౌశికుండు. 76

గీ. శేషశాయిని విష్ణు లక్ష్మీసమేతు
దివ్యసుందరవిగ్రహదీప్తిమంతు
పరమపురుషు, విరాట్స్వరూపప్రకాశుఁ
గాంచి తన్మయుండాయె నా కౌశికుండు. 77

గీ. నిదురలేపఁబోయి నీరేజపత్రాక్షు
శంఖచక్రధరుని శౌరి హరిని
గాంచి విస్మయంబు గాంచుచు, మఱిపొంది
తనదు విధిని ; ఆత్మఁ దలఁచు నిట్లు. 78

గీ. లోకబాంధవరశ్మిమై లోకమెల్ల
తిమిరమును బాసి కాంతులఁ దేజరిల్లు
నీ తనూకాంతిఁ గాంచుట నేఁ దరింతు
నాదు తిమిరమ్ముగూడ వినాశమగును. 79

గీ. పుత్రుఁగాఁగ హరియె పుట్టుటఁ గౌసల్య
యెంత పుణ్యవతియొ యెవరి కెఱుక !
ఎట్టి నోము నోచె నిలపైన రాముని
కమ్మ యగుట కామె ? యతులపూజ్య. 80

గీ. వెంటఁబంప సుంత వెనుదీయ దా మాత
తండ్రివోలె ; సుతుఁడు తాతతాత
యనుచు నెఱుఁగునేమొ యాత్మలోఁ గౌసల్య,
పూతచరిత దివ్యపూరుషుఁ గనె. 81

గీ. దివ్యసుందరవిగ్రహా ! దేవదేవ !
నీ విరాట్స్వరూపంబు వర్ణింపఁదరమె
ఐతి ధన్యుండ, ధన్యుండనైతి రామ
భక్తభక్త కృపాపరా పరమపురుష ! 82

గీ. తన విరోధుల నిర్జింపఁ దరలినాఁడు
తపనుఁ డదె చూడుమీ ! రామ త్వరగ లెమ్ము
భూమి నవతారహేతువౌ పూర్వసంధ్యఁ
దీర్పఁగాఁదగు సమయ మిదే సుమయ్య. 83

చ. నిను సేవించి తరింపనెంతురుగదా నిన్ బూజలన్ దన్పి, మా
మునిబృందంబు త్రిసంధ్యలందు విధులన్ బూనున్‌గదా రాఘవా !
కనుమీ ; వర్తిలు పూర్వసంధ్య ; నిను లోకంబెల్లఁ బూజించు వే
ళను నిద్రింతువా ? లెమ్ము భూసతికి కల్యాణంబుఁ జేకూర్పగన్. 84

గీ. దేవ పూర్వసంధ్య దీర్చంగ దేహమ్ము
గాంచినావు దానఁ గడఁగుమయ్య
పూర్వసంధ్య, విధులఁ బూనంగ రఘువర
లోకులెల్లఁ గాంచ లోకరీతి. 85

గీ. సత్కృతికి మాటొకో, మంత్రశక్తు లిడుచు
ఆత్మ నర్పించుయోగంబు నపుడె కనిన
తపసిపైఁ గృప గల్గెనా ! దాశరథికి
తనదు దివ్యమంగళరూపదర్శన మిడె
అమితభక్తభక్తుండు నారాయణుండు. 86

గీ. రామ కౌసల్యసుప్రజా రామ లెమ్ము
పూర్వసంధ్య సుమా యిది పురుషసింహ
దైవకృత నిత్యకర్మ కర్తవ్య మిప్పు
డనియె రామలక్ష్మణులను గనుచు మౌని. 87

చ. గురుని గభీరవాక్యముల గుర్తెఱుఁగంగల రాచబిడ్డ లి
ద్ద అపుడు స్నానహోమజపతత్పరులై రవిఁ గాంచి మ్రొక్కుచున్
పరమజపంబునున్ సలిపి భక్తిమెయిన్ బ్రణమిల్లినారు స
ద్గురునకు ముప్వురుం గలిసి త్రోవను బట్టిరి పూర్వరీతిగన్. 88

## గంగానదీ తీరము

క. గంగా సరయూ సంగమ
రంగముఁ గనినారు వారు రాజతనూజుల్
పొంగుచు నటఁగల యాశ్రమ
సంగతులన్ వినిరి మౌని సర్వముఁ దెల్పన్. 89

ద్వి. ముక్కంటి తపమున్న పుణ్యస్థలమ్ము
త్రొక్కియుంటిమి రామ యిక్కడే సుమ్ము. 90
అంగహీనుఁడు కాముఁ డౌట నిచ్చోట
నంగదేశము పేర నలరు నీ భూమి. 91

ఇనుఁ డపరాద్రిపై కేఁగ నుంకించు
కనుమదే యీ రేయి గడపనౌ నిచట. 92

అను కౌశికుని గూడి యా దాశరథులు
వినయమ్ముతో నిత్య విధు లూని రంత. 93

సంధ్య కర్మల నెల్ల సలిపిరి వారు
సాంధ్యరాగము దోఁచు సమయమ్మునందు. 94

వసంతతిలక :

గౌరీనితాంత జపకారకనామరూపున్
దూరీకృతార్తజనదుష్కృతభక్తకాముఁ
నారాయణున్ ఘనగుణద్యుతిదీప్తిమంతుఁ
వీరున్ సురారిచయభీకరబాలరాముఁ. 95

వసంతతిలక :

మానీంద్రసంయుతుని మానవనాథపుత్రున్
జ్ఞానాఢులన్ మునులు స్థాణుని శిష్యు లెల్లన్
గానంగ నోచుటకు గంగదరిన్ బ్రహృష్టున్
వానిం గనఁ గనుల వచ్చిరి వార లంతఁ. 96

ఉ. మ్రొక్కుచు నర్ఘ్యపాద్యములఁ బూజ లొనర్చుచుఁ గౌశికోత్తముఁ,
మక్కువ రామలక్ష్మణుల మన్నన నేసిరి మౌనులెల్ల, పెం
పెక్కిన కూర్మి వారికిడి రెంతయు సత్కృతి, వీరు మువ్వురుఁ
జక్కని జాహ్నవీ విపులసైకతసీమల గూడి రెల్లరన్. 97

సీ. నీలవర్ణమువాని నీరజాక్షులవాని
గనులారఁ గాంతురు మును లదేమొ ?
విమలదేహమువాని వీరదృక్కులవాని
గనులారఁ గాంతురు మును లదేమొ ?
వెడఁదవక్షమువాని బుడమి నేలెడువాని
గనులారఁ గాంతురు మును లదేమొ ?
ధర్మమూనినవాని గర్మ నేర్చెడివాని
గనులారఁ గాంతురు మును లదేమొ ?

గీ. తేరిచూచెద రేల? తదేకదృష్టి
దగ్గరకుఁబోవఁ జూతురు తాఁక నెంతు
రేల? కౌఁగిలింపఁగ వరియింతురేల?
జనకు పంపున మునివెంటఁ జనెడి బాలు. 98

గీ. పలుకరించుచు మాటాడఁ గులుకుచుండ్రు
ధర్మమయగాథలఁ జెప్పి తనివిగాంత్రు
లోకవిజ్ఞానకథల విలోలుఁజేసి
లాలనము చేయుదురు, రాము, బాలు, మునులు. 99

తోటకవృత్తము :
మునితతు లందఱు మోదముతోడన్
జనవుగఁ జెప్పఁగ శాస్త్రహితంబుల్
వినివిని వానిని వేడుకదోఁచన్
తనివిని గాంచెను దమ్ముఁడుఁ దానున్. 100

ద్విపద :
అభిరాములౌ వారి కా కౌశికుండు
నభిరామకథలచే నానంద మొసఁగె 101

అతిథిపూజలఁజేసి రాశ్రమమందు
నతిభక్తిమై స్థాణు నాశ్రమమునులు. 102

రామలక్ష్మణులతో రాత్రి యంతయును
కాము నాశ్రమమందె గడపెఁ గౌశికుఁడు. 103

గీ. అది ప్రభాతమ్ము సాంధ్యకృత్యములఁ దీర్చి
గంగ దాఁటఁగ రామలక్ష్మణులతోడఁ
కౌశికుఁడు జేరెఁ దీరమ్ము, గమలవిభుఁడు
సుప్రకాశమునన్ వెల్గుఁ జూపఁగడఁగె. 104

గీ. స్థాణునాశ్రమమునులు నిశ్చలులు ఋషులు
వెక్కువేలేండ్లు తపసు పెంపెక్కియున్న
యా మహాత్ములు సువ్రతులైనవారు
నావ సమకూర్చినారు జాహ్నవిని దాఁట. 105

ఉ. ఎక్కుము నావ కౌశిక, యిదే యభిరాముల రాజపుత్రులన్
బ్రక్కనఁ జేర్చికొమ్ము, గడుభద్రముగా నిఁక గంగ దాఁటుమీ
యెక్కడఁగాని మార్గమున నేగతి వచ్చు నరిష్టమేనియుఁ
గ్రక్కున దాఁటఁగాఁగలరు కాలవిలంబము లేకయుండెడిన్. 106

క. అని ముని లాశీస్సుల నిడ
వినయంబున వారి మ్రొక్కి విహితపథంబుఁ
గని దక్షిణతటమును నా
వను జేర్పఁగఁ గౌశికుండు బయనంబయ్యెన్. 107

ఉ. తుంగతరంగమాలికలతో సరయూనదిఁ గూడియాడుచుఁ
ఖంగున ముందుకున్ దుముకు గంగను దీవ్రసముద్రగామినిఁ
బొంగుచు నావనూపుఁ బరిపూతను, భక్తినిబద్ధహస్తులై
వంగి నమస్కరించి నృపబాలురు దాఁటిరి మౌనియుక్తులై. 108

తాటకను జంపుట

శా. ఘోరారణ్యము క్రూరజంతుతతి నిర్ఘోషప్రకృష్టమ్ము దు
ర్వారోద్రిక్త భయంకరాస్పద రుత ప్రక్షోభ దుర్గమ్ము త
త్తీరవ్యాప్త పురాణదృశ్యమయముఁ దీవ్రాద్భుతావిష్టముఁ
ధీరుం డా రఘురాముఁ డంత గనియెన్ దేజఃప్రదీప్తాక్షుఁడై. 109

చ. కనికని దాని, గౌశికుని గాంచుచు, నీ వననామ మేమి యె
వ్వని యిల యిద్ది? యెవ్వరి నివాసము? సర్వము నే వినందలం
తును వివరింపవే యని కుతూహలియై రఘురాముఁ డాడ నా
తని మనసున్ గ్రహించి ముని తత్కథఁ దెల్పఁగసాఁగె నీగతిన్. 110

చ. ఇదె సుమ తాటకావిపిన మియ్యది దాని నివాసభూమి య
య్యది వసియించు నీ యడవి నామడదూరముపైని, క్రూరయై
తుది గనకుండె నిప్పటికి దోర్బలయుక్తుఁడు వీరుఁ డొక్కఁ డా
ముదితను గామరూపిణినిఁ బోర జయింపఁగలాఁడు లేఁడహో. 111

చ. మలదకరూశ భూములు సుమా యివి, మున్ను జనుల్ వసించు నీ
స్థలములు చాలయేండ్లు ధనధాన్యసమృద్ధిని వృద్ధినొంది యా

వల నిటు మాఱెఁ దాటక నివాసము చేయుచు నిర్జనంబుగా
గలఁచుటఁజేసె, వీర, చిరకాలముఁ బన్నగిరీతి దుష్టయై. 112

గీ. దాని కొమరుండె మారీచదానవుండు
దానిభర్తయె సుందుఁడు, వానిఁ జంపె
మున్నగస్త్యుండు, దాన స్వపుత్రుఁ గూడి
పోరు సల్పెను మునితోడ మూర్ఖమతిని. 113

ఆ. అందకత్తెయైన యక్ష సుకేతుని
విమలపుత్రి యువతి విదుషి యంత
మౌనిశాపవశత మాఱె రక్కసిగాఁగఁ
బుత్రుఁగూడి యిట్లు పుడమి నేఁచ. 114

గీ. పాప, యౌవనవిమలస్వరూప మెల్ల
నాఁ డగస్త్యునిచేత వినాశమగుట
దారుణాకార క్రోధ యీధాత్రి నేఁచు
నిర్జనముగా నిది యగస్త్యునేలయగుట. 115

గీ. చంపు మీతాటకం జంపు చంపు మిపుడె
వీర గోబ్రాహ్మణహితమ్ము గోరువాఁడ
అబల దుష్టపరాక్రమ యగుటఁజేసి
వధ్యురాలయ్యె నీచేతఁ బ్రజలకొఱకు. 116

మ. వినుచున్ దాటక దుష్ప్రవర్తనము, నా వీరుండు రూక్షాక్షుఁడై
కను నల్దిక్కుల, వధ్య, యంచనెడి వాక్యంబుల్ విన న్దోడనే
తనముందే కల కౌశికున్ మునిని విద్యాబోధకుం జూచుచున్
గనుఱెప్పల్ దిగజార్చు యోజనము నాకాంక్షించు నెమ్మోముతో. 117

శా. ఓహో! ధర్మపరాయణా వినుము నీ వూహించు చందమ్ము వ్యా
మోహమ్మేను, ప్రజల్ సుఖమ్ముగను టే భూపాలు ధర్మమ్ము, నే
నా హత్యన్ బురికొల్పువాఁడ ? నిల లోకార్థంబు దుర్మార్గులన్
బాహాటంబుగ జంపనొప్పు, నది పాపంబౌనె పుణ్యంబెకా. 118

మ. జనబాహుళ్యసుఖార్థియై ప్రజకు రక్షంగూర్పఁగా భూపుఁ డే
పనినైనన్ నెరవేర్పనొప్పు నది పాపంబేని పుణ్యంబయేన్

ఘనతన్ గూల్చెడి దేని క్రూరమయినన్ కాకుత్స్థ భూపాలనం
బున నెల్లెడఁ బ్రజాసుఖమ్ము నిడుటే భూనాథు ధర్మంబగున్. 119

ఉ. నాలుగు వర్ణముల్ సుఖమునన్ మనుఁ దాటకఁ జంపితేని, భూ
పాలతనూజ, స్త్రీవధకుఁ బాల్పడరాదని యెంతువేని, ము
న్నేలెడి వారు స్త్రీల వధియింపరొ శక్రుఁడు మంథరాంగనన్,
శ్రీలలనావిభుండె సురసేవిత శక్రునిభార్యఁ జంపరే. 120

ఉ. ఎందఱొ మున్ను భూవరు లహీనపరాక్రమవీర్యవంతులే
యెందఱొ పూరుషోత్తములె యింతులఁ జంపరె దుష్టలౌటచేఁ
గొందలమంచఁగాఁ దగదు క్రూరుల నేరి వధింపనైన నిన్
బొందదు హింస యిట్టియెడఁ బొందగలాఁడ వహింసధర్మమే. 121

చ. అను ముని ధర్మనిర్వచన మంతయు వించుఁ దదేక దృష్టితో
నినకుల వంశజాతుఁడు నరేశసుతుండు దృఢవ్రతుండు నె
మ్మనమొక నిర్ణయంబుఁ గన, మౌనికిఁ బ్రాంజలియై వచించె మో
మున సరిక్రొత్త కాంతుల సమూహము మూగుచుఁ బ్రజ్వలింపఁగన్.

చ. మునివర ధర్మ నిర్వచనమున్ వినిపించితి వంతకంటె నా
జనకుని యాన మిన్న, యది సంస్మరణం బొనరించుచుంటి ; నన్
బనిచెడినాఁడు దత్సభను బార్థివముఖ్యుఁడు నాదు తండ్రి నీ
వనెడి విధంబునన్ మెలఁగ నాజ్ఞ నొసంగె వసిష్ఠు సన్నిధిన్. 123

శా. ఆ యానన్ జవదాఁట నేర నదె ధర్మార్థంబు నా కెప్డు, నే
నీ యాజ్ఞ న్వధియింతుఁ దాటకఁ బ్రజానీక ప్రమోదంబుగా
నీ యీదేశము లన్ని సస్యముల మున్నేరీతి వర్ధిల్లెనో
యా యా రీతిగ సారవంతమయి సౌఖ్యంబే జనుల్ పొందఁగన్. 124

మ. అనుచు న్వింటిని ముష్టిబట్టి నడుమల్లాడంగ నారిన్ వడిన్
ధ్వని నల్దిక్కుల మ్రోఁగ లాఁగెను బ్రతిధ్వానంబు సేయంగ నా
వని, భూనాథసుతుండు, తాటకయు విభ్రాంతిన్ మహాటంకృతిన్
వినుచు న్వచ్చెను హుంకృతిన్ భయకరోద్వేగంబునం బైఁబడన్. 125

శా. హాహాకార విజృంభమాణ భయద వ్యాపార సంరంభమౌ
దేహంబు న్విదలించుచున్ గుపిత యేతెంచెన్ సుమా యద్దె భృ

త్యాహమ్మంచును మ్రొక్కి భూమికిదె పత్నా లక్ష్మణా కూల్తు సం
దేహింపన్ బనిలేదు ముక్కుఁ జెవులన్ నిర్మూలముం జెసెదన్. 126

ఉ. ఆఁడుది దుష్టురాలయిన నాయువు దీయుట పాడియౌనె చే
యాడదు నాకుఁ గాని జనులందఱు సౌఖ్యమునంద నామె పో
రాడెడి బాహువుల్ నఱికి యంతటఁ గాళ్లను గూడఁ ద్రుంతు నే
వాడఁ జరింపకుండ నిట వట్టిశవంబుగ నుండ జీవియై. 127

ఉ. ఇత్తఱి క్రోధఘూర్ణిత విశేష రవమ్మున రాముపైకిఁ జే
యెత్తుచు హుమ్మటంచు వడి నేఁగుచుఁ దాటక యల్లె దూకె, నా
యత్త నిశాత బాణధరుఁడౌ రఘురాముఁడుగూడ నుగ్రుఁడై
మొత్తె శరాళిభిన్న భుజముల్ గలదానిగఁ దాని జేయఁగన్. 128

గీ. బాహువులు లేని రక్కసిభామ యపుడు
రాళ్ల వర్షించి వర్షించి రాముపైన
రివ్వు రివ్వున రాముని దవ్వుఁ జేరి
భూమిపైఁ గూలి యలసటఁ బొందసాఁగె. 129

గీ. కత్తితో ముక్కుచెవుల లక్ష్మణుఁడు కోసె
నంతనైన బరాజయ మందినట్లు
పాఱిపోవక మాయా వికారగతుల
నంధకారమ్ము దెచ్చి పోరాడు నామె. 130

గీ. రూపమును బాసి బహువిధ రూపమెత్తి
శాత్రవు నెదుర్చు దుర్భర సమరసరణి
కౌశికమునీంద్రుఁ డాస్థితిఁ గాంచి కాంచి
'స్వస్తి' జయరామ రఘురామ 'స్వస్తి' యనుచు. 131

ఆ. ఇంతవఱకుఁ గరుణ నింతిపైఁ జూపితి
వంతె చాలు దుష్టయయ్యెఁ బిదప
మాఱవచ్చు ననెడి మహనీయబుద్ధితోఁ
జంపవైతి వింకఁ జంపఁదగదొ? 132

మ. తడవేలా వధియింపుమీ కరుణకున్ దావిత్తువే వీరరా
ముఁడ? సాయంసమయమ్ము ప్రొద్దుడుగ నా మూర్ధాంగనాశక్తి వే

మతుఁగుల్ హెచ్చు నటంచు మౌని యన ధర్మంబెత్తి రాముండు బల్
వడి బాణంబున గొట్టె దైత్యవనితా వక్షస్థలిన్ దూటగన్. 133

ఉ. హా యని భీకరధ్వని భయంకరరూపిణి నేలఁగూలె, నా
హా యని దేవతల్ మురిసి రంత, దివిన్ వడి భక్కి మ్రోఁగె, నో
హో యని నాల్గుదిక్కుల నరోత్తమునిన్ బ్రకటించురీతి "రా
మాయ నమో నమోఽ" స్తనుచు మౌనులు మ్రొక్కిరి వారి యాత్మలన్.

చ. జనకుని యాన మీఱక విశాంపతి ధర్మము దీర్చి మౌనికిన్
వినయముఁ జూపి తృప్తిగను వీరుఁడు రాముఁడు, కౌశికుండొ బా
లుని దల మూర్కొనెన్ మడిసి డుల్లుట రక్కసి మాయలాడి, యా
వనమున దైత్య రాజ్యపరిపాలన మంతమునొందె నాఁటితోన్. 135

కౌశికుఁడు రామునకు సర్వమంత్రముల ధారవోయుట

చ. దినకరుఁడేగుటన్ దశరథేయులు మూఁడవనాఁటి రేయి న
మ్ముని వచన ప్రకారముగ ముందరికేఁగక నిద్రఁజెంది రా
వనమున గాధిసూనుఁడు ప్రభాతమునందున వారి లేపి రా
ముని పరమౌ మనమ్ము వెలిబుచ్చెడి మోమున మందహాసుఁడై. 136

ఉ. తియ్యని మాటలన్ దశరథేయునిఁ దన్పుచు మౌని పల్కె "రా
మయ్య ముదావహమ్ము భవదద్భుతశక్తి మరెవ్వరేని లే
రయ్య మదీయ యాగ పరిరక్షణ మూనగలారు నీవగా
కయ్యము నెయ్యమున్ సలుపఁగాఁ దగువాఁడవు లోకకోటికిన్. 137

చ. భువనము లన్నిటన్ యశముఁ బొందినవాఁడ త్వదీయుఁడన్ గదా
సవనము రక్షసేయఁగల శక్తుఁడవై దరినుండ మంత్రసం
భవ పరదేవతా మహిత మానిత వైభవమేల నాకు భా
రవహముగాదె నీకె తగు రామ గ్రహింపుము ధారవోసెదన్. 138

చ. ఇలఁ గలయట్టి మంత్రముల నెన్నిటినో జపియించినాఁడ నేఁ
బలుమరు మంత్రదేవతల పాల్పడినాఁడఁ దరింపఁజేయఁగాఁ
గల దొకటేని లేదు, రిపుకాండము ద్రుంచగలట్టివానితో
ఫలితములేదు నాకికను, పట్టుము వానిని ధారవోసెదన్. 139

గీ. "అన్యులెవ్వర శరణమ్ము నడుగ నిన్నె
శరణమంటి" ననుచు మనసారఁ దలఁచి
గాధిసూనుండు రాముని కరముఁ బట్టి
ధారవోసెను వివిధమంత్రముల నొకట. 140

గీ. చిరతపః ఫలమగు మంత్రసిద్ధి నొసఁగి
ముక్తి గననెంచె నణిమాది రక్తుఁ డపుడు
మూఁడు దినముల క్రిందటఁ బూనియున్న
నాత్మ నర్పించు యోగమ్మునందు నిలిచి. 141

గీ. ఈషణత్రయ రహితుఁడై యెంచి పరము
విమలుఁడై స్వయంశక్తుల విహితుఁ డగుచుఁ
గౌశికుఁడు రాముఁ గని కని కాంచు ముదము
ఆ నృపసుతుఁ డా మునికి దాసోఽహమనును. 142

ఆ. అంత రాజపుత్రు నాశ్రయించినవెల్ల
చక్ర పాశ ముసల శక్తి గదలు
నస్త్ర సంచయమ్ము నసి శూల మశనులు
దేవ మమ్ముఁ జేరఁదీయు మనుచు. 143

గీ. దేవ దానవ సంహార దివ్యశక్తి
వెలుగు శస్త్రాస్త్ర దేవతల్ వీరు డాయ
వాని స్పృశియించి గ్రహియించి వాని కంత
వర్తిలఁగ నాజ్ఞనిడె తన భావ మరసి. 144

గీ. అఖిలశస్త్రాస్త్రసంయుతుఁ డైన రాఘ
వుండు హృష్టుఁడై పయనమైపోఁదలంచి
కౌశికుఁడు మంత్రముల ప్రయోగమ్ము నిడుట
నతని నస్త్రోపసంహార మడిగె భక్తి. 145

గీ. కౌశికుఁడు మంత్రసంహారగతుల నన్ని
దాశరథిచేతఁ జేయిడి ధారవోసి
క్రాలెఁ బరమాత్మ తలఁపొందె కలుగురీతి
నితరవిషయవిహీనసంగతిని బొంది. 146

గీ. ఆతఁ డేకసంథాగ్రాహి యతులబలుఁడు
వీరవర్యుఁ డథర్వణవేదవిదుఁడు
సకలశాస్త్రసంయుక్తుఁడౌ సార్వభౌముఁ
డౌచు రాముండు పయనమై యరుగసాఁగె. 147

చ. గురుని యనుజ్ఞ నొంది తన కూరిమి తమ్ము సుమిత్రసూను నా
దరమునఁ జీరి శాత్రవవిదారణమూనఁగనౌ ప్రయోగసం
హరణవిధానసంయుత మహాస్త్రచయంబుల నిచ్చె, నివ్వి నే
నెరుఁగనివౌక్కొ యంచు మది నెంచినరీతిగఁ దత్క్షణంబునన్, 148

చ. తనయెడ నున్న ప్రేముడియె తప్ప మఱొండు తలంపులేమిగా
మునికడనున్న విద్యల సమూలముగాఁగొనె, కాని యేలకో
తనకడగూడ నుంచకయె తత్క్షణమే రఘురాము డంత త
మ్మున కిడె లక్ష్మణుండొకఁడె మూలమొ ? గుప్తము సేయ విద్యలన్.

గీ. అతఁడు సర్వజ్ఞుఁ డందుమా యనఁగరాదు
కౌశికుని వెంటఁ జనిచని కానలోనఁ
గొంతదవ్వునఁ గని యొక కొండసీమ
ప్రశ్నవేసెను ముని కిట్లు పరమభక్తి. 150

## యజ్ఞవాటికఁ జేరుట

ఉ. ఆ సుమనోమనోహర విహంగవిహార వనీనివాస స
న్యాసి యెవండు మౌనివర ? యానగపార్శ్వ మహాశ్రమస్థలీ
వాసము సేయు పూజ్య గుణవంతుఁ డెవం ? డిటు జంతుకోటి హిం
సాసరణిన్ ద్యజించి మనఁజాలెడి ఏని తపోబలంబునన్ ? 151

ఉ. దాఁటితిమన్నమాట బహుదారుణ దుర్గమ తాటకాటవిన్ !
నేఁటికి సుందరంబును వనీతలవాసమునున్ మనోజ్ఞ మీ
వాటిక యేరివాఁడ ? భగవంతుఁడ తావకదివ్యతీర్థ మె
చ్చోటఁ ? ద్వదీయశత్రుచయసూదన మెచ్చట యజ్ఞరక్షకై. 152

గీ. అప్రమేయుండు దానయ్యు నడుగుచుండె
ధన్యుఁడను నేనె యని మౌని దలఁచి యాత్మఁ

దెల్పఁబూనెను తత్కథ దెల్లముగను
గులుకులొలుకఁగ వినుచుండఁ గుజ్జువాఁడు. 153

సీ. అదెసుమా మును విష్ణు వాదినారాయణుం
డత్యంతతపమున్న యమలధాత్రి
అదెసుమా కాశ్యపుం డతులసిద్ధిని గన్న
సిద్ధాశ్రమంబను నిద్ధభూమి
అదెసుమా బలి దాన మర్థించియుండిన
వామనమూర్తి తపస్సుతావు
అదెసుమా నాదు వ్రతావలంబనసీమ
వైరులిర్వురు నను పోరుచోటు
గీ. అదెసుమా నాకు తావు, నా యాశ్రమంబు
కాదు, నాయది, యోతాత నీది సుమ్మ
నాది నీయదికాదె నీ నా విభేద
మేమియునులేదు నాసర్వ మీవె తండ్రి. 154

గీ. అనుచు సిద్ధాశ్రమపదమ్మునందుఁ జొచ్చు
రామలక్ష్మణయుతుఁడైన బ్రహ్మమౌని
మంచుతొలఁగిన చంద్రునిమాడ్కి వెలుఁగ
నచటఁ గను మౌనులెల్లరు నట్లె గనిరి. 155

ఉ. ఆమునికోటి కౌశికమహాత్మునకున్ దగు పూజసేసి గా
రామున రాకొమారకుల రాజసపర్యల గారవించుచున్
నేమమెఱింగి రాట్సుతులు నేదతొలంగఁగనుండి యా ముని
స్తోమముమధ్య గొంతవడి శుద్ధమనంబులఁ బల్కి రంజలిన్. 156

క. మునివర సిద్ధాశ్రమ మిదె
యను సార్థక్యమునఁ జెలఁగు నాశ్రమ మగు నీ
పనుపున నిదె పూనుము దీ
క్షను దోడనె నీదుమాట సత్యమె యగుతన్, 157

క. అని కౌసల్యా నందనుఁ
డనినంతనె కౌశికుండు యజ్ఞవ్రత దీ

క్షనుగొనె సిద్ధాశ్రమమం
దున గల మునులెల్ల భక్తి నుతియింపంగన్. 158

గీ. అంతవఱకు రామా నృపాలాత్మజా య
టంచు సంబోధనమొనర్చి యాశ్రమంబు
జేరి 'తాతా' యటం చనెఁ జిఱుతరాము
కౌశికుండేమొకో యజ్ఞకాంక్షనేమొ ? 159

గీ. అంతవఱకు సద్గురుడంచు నాత్మఁ దలఁచి
యప్పుడప్పు డాశీస్సుల నందుచున్న
బాలరాముఁడు మౌనిని 'భద్రమస్తు'
టంచనియె నప్డు, పూనుమీ యజ్ఞమంచు. 160

ఆ. కర్మసాక్షి యంత మర్మమూనినయట్లు
కనులఁ దోఁపకుండ జనియె నెటకొ ?
పుడమితేనిసుతులు పుణ్యాశ్రమంబున
మునులతోడ మైత్రి బొంది బొంది. 161

## సిద్ధాశ్రమము

ఉ. ఫుల్ల మనోజ్ఞ పుష్పచయముల్ గల సిద్ధతపోవనంబునన్
జల్లఁగ నాఁటిరేయినిఁ బ్రశాంతముగా నిదురించి తూర్పుది
క్కెల్లయుఁ దెల్లవారఁగ దినేశు భజింపఁగఁ బూర్వసంధ్య సం
ధిల్ల యథాగతిన్ విధులదీరిచి మ్రొక్కిరి గాధిపుత్రకున్. 162

ది. దేశకాలజ్ఞులౌ వారు దేశికులకు
సమయ మించుక మించకే శత్రురాక
తెలియఁజేయుము నీయజ్ఞదీక్ష బ్రోవ
ననిరి వినయమ్ము ముఖసీమలందుఁ బ్రబల. 163

ఉ. బాలురు పల్కు మాటలు విభాసుర తీవ్ర కృశాప్రచారముల్
లీలగ నామునుల్ గని భళీయని వారల సంగరోత్సవ
శ్రీలను మెచ్చుచున్ బదులు సెప్పి రిటుల్ కుశికాత్మజున్ మునిన్
బాలన సేయఁజెల్లునుజుమా యిదియే మొద లాఱు రాత్రులన్. 164

చ. అతఁడు హుతాగ్నిహోత్రుఁడు నిజాత్మసమర్పణయోగమూని సం
తతమునియయ్యెఁ బల్కఁడు నితాంతము మీరలె గావగావలెన్
బతితులు రాక్షసద్వయము బల్మిని యజ్ఞముపాడుసేయఁగా
జతపడివచ్చినన్ దురముసల్పిన వారణ సేసి వారలన్. 165

ఉ. మౌనుల పల్కులన్ విని సమాహితచిత్తులు రామలక్ష్మణుల్
బూనిరి విండ్ల రేబవలు పూనికతోఁ గనుమూయకుండ, య
జ్ఞానలకుండమున్ మునిని నాశ్రమభూమిని గాఁపుకాయుచున్
ధ్యానపరాత్ముఁడైన కుశికాత్మజు జన్నము సాఁగుచుండఁగన్. 166

శా. ప్రారంభమ్మొనరించి యాసరయుతీరంబందు నాత్మార్పణన్
ప్రారబ్ధమ్ము నశింప నీషణములన్ వారించి త్రోవన్ భయా
కారన్ దాటకయన్ మహాప్రకృతినిన్ ఖండింపఁగాఁజేసి యా
త్మారిప్రోక్తనషట్కవాసనల నిత్యం బగ్నిలో వ్రేల్చెడిన్. 167

సీ. తొలినాఁడు శ్రీవిద్య లలిత రామున కిడి
దారేషణంబును దాఁటినాఁడు
మలినాఁడు నిజధన మారాము నిడి మౌని
తతికి ధనేషణ దాటినాఁడు
మూఁడవనాఁడు శ్రీ మొలియింపఁగాఁజేసి
తనయేషణమ్మునుఁ దాటినాఁడు
నాలవనాఁడు ప్రాణపదాశ్రమం బిచ్చి
తాతకు కామంబు దాఁటినాఁడు
గీ. పూని క్రోధమ్ము లోభమ్ము మోహములను
మదము మాత్సర్య వాసనల్ మంటఁగలుపఁ
గ్రమముగా నైదుదినములు గాధిసుతుఁడు,
యజ్ఞవేది మహోజ్జ్వలమయ్యె నట్లై. 168

ఉ. పూవుల కమ్మతావి పరిపూతమొనర్చెడి యాశ్రమస్థలిన్
దీవెనలిచ్చి ఋత్విజులు దీర్తురు సద్విధులెల్ల నిత్యమున్
పావనమూర్తి కౌశికుఁడు పాసినవాఁడు సమస్తధర్మముల్
దైవమహో శరణ్యుఁడని తత్పరుఁడై దశకాహ్నికంబునన్. 169

ఉ. ఆఱవనాఁడు నేఁడు వికృతాత్ములు యజ్ఞపు విఘ్నకారు లి
ట్లూరకయుందురంచుఁ దలఁపూనఁగరాదు హఠాజ్జవంబుగన్
గారియవెట్టఁజూచెద రొకానొకవేళ సుమిత్రపుత్ర, యీ
వారము గాచినన్ విజయవంతుఁడు సిద్ధుఁడు కౌశికుండగున్. 170

## కౌశికుని యజ్ఞము - రాక్షసులరాక

క. అచ్చపు భక్తిని గురునెడ
నెచ్చఱికనుజేయ రాముఁ డిటుగన్ దమ్మున్
జెచ్చెఱ రాక్షసు లెందఱొ
వచ్చిరి సవనాగ్ని రుధిరపాతము సేయన్. 171

శా. ఘోరప్రావృష మేఘవేగగతినిర్ఘోషమ్ముతో మింటిలో
మారీచుండు సుబాహుఁడున్ దమ చమూమాయన్ బ్రతిష్ఠించుచున్
బోరన్వచ్చిరి రక్తవర్షమున సంపూర్ణాహుతిం బావకుం
డౌరౌరా యని మిన్నుముట్టె త్రుటిలో నాకాశ మల్లాడెడిన్. 172

శా. ధారాపాతముగాఁగ వేదిపయి రక్తం బడ్డు, రాముం డహో
క్రూరా నిల్వుము నిల్వుమీ యనుచు నాక్రోశించి మారీచుపై
బాఱన్ గొట్టఁగ మానవాస్త్రమును నప్పాపాత్ముఁ డస్త్రమ్ముచేఁ
బాఱెన్ వేగత యోజనమ్ము, మునిగె న్వారాశి నిశ్చేష్టుఁడై. 173

మ. అరరే లక్ష్మణ మానవాస్త్ర మదె ప్రాణాపాయముంగూర్ప కా
సురునిన్ వార్నిధిముంచి వీడెను దయన్, సుశ్లోక్య మయ్యస్త్రమం
చరివీరుండు సుబాహునిన్ గనుచు నయ్యాగ్నేయ దివ్యాస్త్రమున్
గుఱిగాగొట్టగ నప్డె రక్కసుఁడు బల్ క్రూరుండు గూలెన్ భువిన్. 174

గీ, తక్కు మఖవిఘ్నకారులఁ దఱిమి తఱిమి
మడియఁజేసె వాయవ్యాస్త్రమహిమచేత
దశరథేయుఁడు బాలుండు తండ్రియాన
మునులు దివిజులు లోకముల్ మురియునట్లు. 175

చ. గురుఁడు వశిష్ఠమౌని మునుకూర్మినిఁ జెప్పఁ బఠించినట్టి ఆ
గురుతరధర్మవిద్యల నకుంఠితరీతిగ నాచరించి, నే

ర్వరితనమున్ సుశిక్షణయు వర్ధిల గాధిజుచెంత, రాఘవుం
డరి దెగటార్చి కౌశికుని యజ్ఞసమాప్తి గనెన్ ముదంబునన్. 176

## యజ్ఞ సంరక్షణము

శా. రారా రామ! నృపాల బాల! సుకుమారా! వీర! నీలీలలౌ
రౌరా యేరి కెఱుంగ శక్యమగురా! రాజీవనేత్రా కరం
బీరా ముద్దిడరార కౌఁగిలిడరా యే సర్వ మర్పించితిన్
జేరందీయుమురా త్వదీయపదముల్ సేవించు ధన్యుండరా. 177

మ. అనుచున్ వీడి సమాధిసిద్ధుఁడయి రామాలింగనం బొంది మో
మును మోమున్ గలవేసి మైనిమురుచున్ ముద్దాడుచున్ రామునిన్
దన యంకంబునఁ జేర్చి మైపులకతో 'ధన్యోస్మి ధన్యోస్మి' యం
చనె నానందసుధామయుండయిన విశ్వామిత్రు డప్పట్టునన్. 178

మ గురునాజ్ఞన్ నెరవేర్చి తీవిపుడు లోకుల్మెచ్చ సార్థక్యముల్
వరలన్ సిద్ధ తపోవనమ్మిఁక, మునివ్రాతమ్ము జేజేలనన్
బరఁగన్ దిక్కులు శాంతిమంతమయి భీభత్సంబు వోవన్ దయా
కర యవ్యాజకృపన్ ననున్ మనిపితింకన్ నాకు లోటున్నదే. 179

మ. కడుపారం గనిపెంచి సన్నిహితయౌ కౌసల్య ధన్యాత్మ యో!
యడవిం ద్రిమ్మరఁజేసి సద్గురుఁడునై యాత్మార్పణం బూని భ
క్తుఁడు శిష్యుండునునై తరింపఁగల సిద్ధుం డీ మునీంద్రుండు ధ
న్యుఁడో వీరల్ హరిఁ గౌఁగిలింపఁగల పూజ్యుల్ సంతతానందులై. 180

మ. వనితారత్నము కోసలాత్మజయు, విశ్వామిత్రుఁడున్ ధన్యులౌ
టను, రామున్ నరవేష కేశవుని నీడన్ గొంతసేపుండి యీ
కనులం గాంచుచు ముచ్చటల్ సలిపి వాఙ్మాధుర్యముం గ్రోలుచున్
జనవుం గొంటిమి వీనిఁ గౌఁగిలి బిగించన్ నోతుమే యెన్నడేన్. 181

ఉ. లేరిక శాత్రవుల్ మిగులు లేదిఁక జన్మము కౌశికుం డహం
కారము సద్ద్రోసి మమకారము జంపి సమస్త ధర్మముల్
దూరమొనర్చి యన్యు మది దూర్పక రాముని నొందెగాదె యే
కోరికలేనినాడు సమకూరదె యుత్తమ మోక్ష సిద్ధియున్. 182

చ. యమనియమాదివేద్యుఁడు మహాత్ముఁడు గూడ ధరింపలేఁడు కా
మ్యములను వీడి నిత్య శరణార్థుఁడు గాకయె, యట్లై యుత్తరా
ఘము దరి బాసిపోయి హరి కావున దవ్వులకేఁగ పూర్వపా
పము నశియింప గౌశికుఁడు పావనుఁడై జ్వలియించె సిద్ధుఁడై. 183

ఉ. రాచకొమారు వీరు రఘురాము మఖారులఁ జంపదెచ్చి లో
దాచక వైరమున్ సుదతి తాటకఁ జంపఁగఁజేసి, నేఁడు మా
రీచు వధింపుమం చతని, జేనిసుతు న్మని గోరలేదు య
జ్ఞాచరణమ్మునన్ సమత యబ్బి పరాశ్రయసిద్ధిఁ బొందుటన్. 184

క. మునితతి కడు ముచ్చటగాఁ
దనివోవక యజ్ఞరీతిఁ దలఁచుచు నిటుగన్,
గనుచున్ విశ్వామిత్రుని
ఘనవర్ణుని రాముఁగాంచి కల్యాణమనున్. 185

గీ. అంతట తథాస్తని యవనియెల్ల
మాఱుమ్రోగెను రాముని మహిమఁ గాంచి
సహన మిసుమంతలేక నిశాసతీశుఁ
బిల్వఁబోయెనా యన రవి వెడలె నంత. 186

మ. మరునాఁడే యుదయంబునన్ మునులచే మర్యాదలం బొందుచున్
ధరణీనాథ తనూజు లిర్వురును బ్రాతఃకాల ధర్మంబులన్
దరుణార్కుం గని దీర్చి భక్తిమెయి హస్తాంభోజముల్ మోడ్చి స
ద్గురునిన్ మ్రొక్కిరి బ్రహ్మచర్య వ్రత సంతుష్టాత్ములై నమ్రులై. 187

క. మునివర మీ కింకరులము
చనవున శాసింపు మింక సలిపెడిదేమో
యని రా దశరథసూనులు
వినయముతో భక్తభక్తవిధముగఁ దోపఁన్. 188

క. బాలుర మృదుభాషణములు
లీలామానుషవిలాస డింభకగతులన్
హేలన్ మునితతి విని కని
లోలాత్మలఁ బల్కి రిట్లు లోకసువార్తన్. 189

ఉ. భూవరనందనా ! జనకభూపతి యా మిథిలానరేశుఁ డా
దైవపరంబుగాఁ బరమధార్మికయజ్ఞము నూనె, దానికిన్
బోవదలంచుచుంటి మట భూరిధనుస్సొకటుండెఁ జూడఁగా
నీవును వత్తువోయి యవనీధవు లారయవత్తు రెందఱో. 190

ఉ. బూచులతేని దాధను వపూర్వభయంకర మప్రమేయమున్
దాఁచిరి మైథిలాధిపులు దానిని నిత్యము పూజసేయుచున్
రాచకొమారులున్ సురలు రాక్షసులెందఱొ దాని వంచగా
నోచకఁ బాఱినారఁట ధనుర్విధ మెట్టిదొ జూడనెంతువో. 191

చ. సలిపెను దేవరాతుఁ డొక జన్నము మున్ సురలెల్ల మెచ్చఁ ద
త్ఫలితముగాఁగ వారు శివదత్తము ధర్మము నిచ్చినారు, మై
థిలనృపవర్యునింట నది దివ్యమహోద్భుత శక్తిమంతమై
యలరెడి నేఁటిదాఁక గననొఁగద రాఘవ చూడనెంతువా. 192

చ. జనకుని యింటనున్న యల శంకరధర్మము చూడవచ్చు నా
తని వరయజ్ఞముం గనుచు ధర్మమునొందఁగవచ్చు రమ్మ నా
యన రఘువీర మౌనితతులందఱు వోయెడిత్రోవ నంచు నా
మునివరులాడ రాఘవులఁ బూనుచుఁ గౌశికుఁ డేఁగసాఁగుచున్. 193

మ. కనుటన్ సిద్ధిని శీతశైలమున కేఁగన్బూనితిన్ 'స్వస్తి' మీ
కనెఁ బ్రేమన్ వనదేవతాతతికి నిత్యస్నేహబంధంబునన్
తనతో, సిద్ధతపోవనాంతర శకుంతంబుల్ మృగవ్రాతముల్
వనజంబుల్ జనుదేర వెన్కకరుగన్ వారించి యవ్వానినిన్. 194

క. దినకరుఁ డేఁగెడి వేళకు
మునిగణములు రాజసుతులు మోదముతోడన్
జనుచుండఁగఁ దనవెంటను
గనఁగల్గెను శోణతటిని గౌశికుఁ డెలమిన్.

## కౌశికుని వంశ చరిత్ర

ఉ. వారినిగాంచి మౌనులు ప్రభాకరుఁ డేఁగెడివేళ హోమముల్
దీర్చిచి మౌనిముఖ్యకడ దీవెనలందిరి, రాచబిడ్డలున్

వారనిభక్తి మ్రొక్కి మునివర్గము, సద్గురు కౌశికాగ్రముం
జేరిరి, రాఘవాగ్రజుఁడు సిద్ధుని గోరె నిటుల్ ప్రహృష్టుఁడై. 196

ద్వి. మునివర యీభూమి మోదావహంబు
వనసమృద్ధిని బెంపుఁగనుచున్న దెంతొ. 197
విననెంతు నీవాడ వివరంబులెల్ల
అను రాముఁ గని మౌని యాదేశకథను. 198
మునులమధ్యస్థుఁడై వినిపించె నిట్లు
మును గుశుఁ డొకఁడుండెఁ బూజ్యుండు తపసి 199
ధర్మమూర్తి యతండు ధాతపుత్రుండు
కర్మపరుండును గణనీయగుణుఁడు. 200
ప్రజకు సుఖంబుగాఁ బాలనఁజేసి
నిజపుత్రులం గోరె నేల నేలంగ. 201
వసువను జ్యేష్ఠుండు పాలించినట్టి
వసుధయే యిది రామ ఫలవంతమెప్డు. 202
ఈ శోణనది బుట్టు యీ దేశమందె
ప్రాశస్త్యముం గని పాఱు నిందెల్ల. 203
దాన నీమగధ భూతలము పేరొందె
నేనాఁడు నేలోప మేమియుఁ లేక. 204
కుశుని రెండవవాఁడు కుశనాభతపసి
యశముతో రాజర్షియై యేలెఁ బుడమి. 205

ఉ. ఆతని పుత్రికాశతము నందమునం దులలేనివారు సం
ప్రీతి వనాంతరస్థలి జరించుచుఁ బాడుచు వీణమీఁటుచుఁ
జేతము లుల్లసిల్లఁగ వశీకృతనాట్యవినోదమగ్నలై
పూతచరిత్రలై ప్రమదముం గనుచుండినవార లొక్కటన్. 206

గీ. వలచి వలపింపఁగల వారిఁ బవనమూర్తిఁ
గాంచి మోహించి దరిఁజేరి కన్యలార
అమరుఁడను నేను, యౌవన మరుగదెపుడు
కొనుఁడు భర్తగ నన్నునఁ గొమ్మలెల్ల. 207

గీ. పరిహసించుచు వాయుదేవా? సమస్త
ప్రాణులఁ జరియింపఁగలుగువాఁడ వీవు
తపసి కుశనాభాసుతలపైఁ దలఁపు తగదు
సమసిపోవుదు క్షణమాత్ర శాపమిడిన. 208

గీ. యముఁడు గాకుండుఁగాక మాయయ్య నీకు
నతని నవమానపఱుపఁగా నలవియగునె
యెవని మాతండ్రి భర్తగా నిచ్చువాఁడొ
వాఁడె మాభర్తయగుసుమ్మి వాస్తవంబు. 209

ఆ. తండ్రియే ప్రభువును దైవంబు నగు మాకుఁ
దండ్రియాన మీరఁదలఁప మెపుడుఁ
దండ్రియాజ్ఞ భక్తిఁ దలఁదాల్చుకంటెను
ధర్మమొండు లేదు ధాత్రి మాకు. 210

మ. అని యాకన్యలు పల్కు మాటలకుఁ గ్రోధాయత్తుఁడై కామియై
యనిలుం డంతట వారిదేహముల సర్వాంగంబులం జొచ్చి భం
జనముం జేసెను గుజ్జలౌనటుల, నాసౌందర్యమూర్తుల్ వెసన్
జని తండ్రిం గని చెప్పిరంతయు మహాసంతాపముం బొందుచున్.211

మ. తన ముద్దున్ మురిపించు బిడ్డలను జింతన్ద్రోసినన్ గోపమున్
గనకుండన్ గుశనాభు డంత క్షమయే కర్తవ్యమం చెంచి ప
ల్కె నిటుల్, పుత్రికలార వంశమిఁక మీకీర్తిన్ క్షమన్ ధన్యమై
చను, నెవ్వాఁ డపకారమున్ సలిపినన్ క్షాంతిన్గనన్ ధర్మమౌ. 212

మ. క్షమతోడన్ క్షమియించుటే తగిన సత్కారంబు నద్దాన క్షే
మమె గల్గున్ జనులేరికైనను పరే మన్నించు సద్బుద్ధి గాం
తుమె దుస్సాధ్యముగాదె యద్ది, సుజనుల్ తుష్టిన్ క్షమన్బొందరే
క్షమ దానమ్మె యశమ్మె సత్యమును యజ్ఞంబున్ మహాధర్మమౌ.213

మ. అని యాతేఁడు వరార్థమై వెదకి యాయాదేశముల్ మౌనిచూ
ళుని పుత్రుండగు బ్రహ్మదత్తు వరు సుశ్లోకున్ నృపున్ గాంచి పెం
డ్లినిగావించెను బుత్రికాతతియు వీడెన్ దానఁ గుబ్జత్వమున్
జనకాజ్ఞన్ దలఁదాల్చి పొందిరి మహాసౌఖ్యంబులన్ పుత్రికల్. 214

గీ. ఆఁడుఁబడుచుల నత్తింట కంపి రాజు
పరమ సంతోషమగ్నుఁడై పరఁగి పరఁగి
పుత్రుఁ డొకఁడేని లేమి వాపోవసాఁగి
పుత్రకామేష్టిఁ గావించి పొందె సుతుని. 215

గీ. పుత్రకామేష్టి సల్పెడి పుత్రుఁ గాంచి
కుశుఁడు దీవించి దివినుండి కొడుకు పుట్టఁ
గాంచె శాశ్వత బ్రహ్మలోకంబు నంతఁ
దండ్రి దీవన తనయుండు తలను దాల్చె. 216

ఆ. కుశుని పల్కు రీతి, కుశనాభు డొందెను
గొంతకాల మరుగఁ గొడుకు నొకని
యతఁడె ధర్మమూర్తి యమలుండు పూజ్యుండు
గాధిపేరఁ గీర్తిఁ గన్నవాఁడు. 217

గీ. గాధిసూనుండ, నే, రామ కౌశికుండ
నైతి కుశవంశ సంజాత మందియుంట
బొందితో స్వర్గముంగన్న పూత సత్య
వతియె యీ కౌశికి నదిభగిని నాకు. 218

గీ. కౌశికీనదీ స్నేహమ్ము కలిమి వలన
వాసమొనరింతు హిమనగ పార్శ్వమందు
సిద్ధిఁగనవచ్చి నీ కృప సిద్ధిఁ గాంచి
మఱలుచుంటిని సిద్ధాశ్రమంబు వీడి. 219

గీ. అల్లదే రామ నడిరేయియయ్యె నపుడె
విశ్రమింపఁగఁ దగునోయి విశ్వమెల్ల
నిదురఁ జెందెడిఁ జంద్రుండు నింగిఁ బొడమె
గగనమెల్లను నక్షత్రకాంతిఁ దనర. 220

ద్వి. ఆరేయి శయనించి రాశోణతటిని
నా రాజపుత్రకు లలపులు దీఱ 221
మునికోటి గాధేయు పూతవంశమ్ము
విని వానిఁ గొనియాడి విశ్రాంతి గనిరి. 222

తోటకము :

మునివర్యుఁడు మేల్కొని ప్రొద్దునసే
కని రాముని లెమ్మనఁ గర్మ కనెన్
విని కౌశికు వాక్యము ప్రేమమెయిన్
గనె సాంధ్యవిధుల్ రఘుకర్మఠుఁడున్. 223

ఆ. విపుల పులినశోభ విస్తరించిన శోణఁ
దపసు లేఁగుత్రోవ దాఁటినారు
కౌశికుండు మునులు కాకుత్స్థవీరులు
ప్రొద్దు పొడువఁ గర్మ పూర్తిచేసి 224

## గంగానది

క. నడినెత్తికిఁ దపనుఁడు రా
వడివడిఁ జనినారు వారు భాగీరథికిన్
దడవొనరింపక తర్పణ
మిడి హోమాదుల ముగించి రెల్లరు మునులున్. 225

శా. గంగా సైకతసీమలందు వలయాకారంబుగా రాముఁడు
పొంగన్జేరిరి మౌనులెల్లరును వ్యామోహాత్ములై రామునిన్
భంగం బేమియులేక కాంచ నత డంతన్ జాహ్నవీ వృత్తమున్
సాంగోపాంగముగా వచింపుమనె విశ్వామిత్రుని న్నద్గురున్. 226

గీ. పూతగంగాభవాని సంపూర్ణచరిత
రామచంద్రుండు వినియె బరాకులేక
సరసమృదుసూక్తి యాఋషిచక్రవర్తి
మునులమధ్యస్థుఁడై తెల్ప వినయమునను. 227

గీ. ఇంతలో లోకబాంధవుఁ డంతరించు
సమయమాయెను వారెల్ల సాంధ్యవిధులఁ
దీర్పసాఁగిరి త్రిపథగా దివ్యగాథ
పరమమంచని దశరథబాలు రనిరి. 228

ద్వి. ఆనందమయులౌచు నారాత్రియందు
భూనాథపుత్రులు పుణ్యసత్కథల. 229

వినివిని మునిరాజు వినిపింపఁ బ్రీతి
జనినారు ప్రొద్దున జాహ్నవిన్ దాఁటి. 230

## విశాలానగరము జేరుట

గీ. దాశరథిగూడి చనుచున్న తపసిఁ గాంచి
యచటనుండిన మౌను లత్యంతభక్తి
విహితపూజ లొనర్చిరి వీడుకొల్పి
వారల విశాలపురి జేరినారు వీరు. 231

ఉ. తమ్మునిగూడి రాఘవుఁడు తాపసితోడ విశాలకేఁగి సౌ
ధమ్ముల నొప్పు నాపురి యుదంతము సర్వము దెల్పఁగోరె హ
స్తమ్ముల మోడ్చి సద్గురుని దత్పురిగాథ సమస్త మప్డు మో
దమ్మునఁ జెప్పెఁ గౌశికుఁడు దాశరథుల్ విని సంతసింపఁగన్. 232

గీ. దేవదానవ సమరమ్ముఁ దెలిసికొంట
పాలకడలిని బుట్టిన వాని వినుట
సురల పక్షంబె తొలినుండి హరియునుంట
వినుచు రాముండు దలనూపు విభ్రమమున. 233

క. ఈరేయిని నిటఁ బుచ్చెద
మా! రామా! రేపు రాత్రి కరుగఁగఁదగుఁగా
శ్రీరాజిలు జనకుని నగ
రారామమునందు విడియ నంచితరీతిన్. 234

చ. అని ముని పల్కనంత నగరాధిపుఁ డచ్చటి కేఁగుదెంచి యా
మునికి యథావిధిన్ విహితపూజలొనర్చి నమస్కరించి యి
ట్లనియెను, గాధిపుత్ర! యిఁక నైతిఁ గృతార్థుఁడ మీదుదర్శనం
బున, ననుఁబోలు ధన్యతమపూరుషుఁ డుండునె నేఁడు భూస్థలిన్? 235

మ. కుశలప్రశ్నలువేసి రొండొరులు పెన్గూర్మిన్ బ్రసంగించుచున్
యశముంగన్న విశాలపట్టణనృపుం డాబాలురం గాంచి నీ
వశులై యుండిన వీరలెవ్వ రిట విశ్వామిత్ర రా హేతువే
మి? శరచ్చంద్రనిభాననుల్ విపినభూమి న్నిన్ను వెంటాడిరే. 236

సీ. గజరాజ మృగరాజ గమనంబు హసియించు
వీరల కెవ్వాఁడు పితరుఁడయ్య
శార్దూల వృషభ ప్రశస్తిని గాల్దన్ను
వీరెన్న నేయూరి వీరులయ్య
అశ్వినులకుఁ గల యందమందమె యను
వీర లే సద్వంశ ధీరులయ్య
కమలములకు సరికాని కనుదోయి గలవారు
వీర లేతల్లి కుమారులయ్య
గీ. ఖడ్గతూణీర ధనువులఁ గ్రాలువారు
చిలుకరించిన యౌవన శ్రీలవారు
కుసుమకోమల మూర్తులు కోమలాంగు
లిటుగ నడచుచురా, కతం బేమి? యిటకు? 237

మ. అను రాజున్ సుమతిన్ గనున్ దనదు యజ్ఞారంభ చారిత్రమున్
మనవింజేయు మునీశ్వరుండు, నృపుఁడున్ మర్యాదలన్ దన్పు రా
ముని సౌమిత్రిని, వారిఁగూర్చి విని సంపూర్ణంబుగా, రాట్సుతుల్
మునిబృందమ్ములఁ గూడుచున్ మిథిలకున్ బోఁబూని రావేఁకువన్. 238

ఉ. ఎట్టి తపంబుసేసె భళిరే మిథిలాపురి; యిట్టివారు ము
న్నెట్టిరె యీ స్థలమ్మని రనేకులు, మౌనులు గాధిసూను వెన్
బట్టిన రామలక్ష్మణుల పార్థివ సూనుల మార్గమధ్యమం
దెట్టులో వేచిచూచి కను లింపుగనన్ జని కొంతదూరమున్. 239

## అహల్యా శాపవిమోచనము

మ. ముని బృందమ్ములు సత్కథల్ దెలుపుచున్ మోదమ్ము గావించుచున్
దన వెంటన్ బడిరాగఁ గౌశికుని వెంటన్ భ్రాతృ సంయుక్తుఁడై
చనుచున్ రాముఁడు గాంచెఁ బొంత మిథిలాసాన్నిధ్యసీమన్ వనిన్
దనువెల్లన్ బులకింప నేరి పిలుపో తన్ జూడుమన్నట్లుగన్. 240

ఉ. ఏమిది సద్గురూ యెచటి కిప్పుడు వచ్చితిమయ్య? తెల్పుమీ
యే మహనీయు నాశ్రమమి దిట్టుల శూన్యము రమ్యమయ్యు ము

న్నే మునిసత్తముండు వసియించెఁ బురాతన దృశ్యముండెె నీ
ధామము నిర్జనమ్మయి ప్రధానముగా శిలలున్న వేలొకో. 241

చ. అను నృపసూతి కా ముని మహాత్ముఁడు వాక్యవిశారదుండనున్
విను రఘురామచంద్ర! వినిపింతు వినందగు దీవొకంత పీ
వని మును గౌతమాశ్రమము, బ్రహ్మ ఋషీంద్రుఁడు గౌతముండె యిం
దునఁ దపముండి పూనె బహు దుస్తర దుర్భర బ్రహ్మచర్యమున్. 242

చ. సరసిజ సంభవుండు కడుఁ జక్కనిచక్కని నహల్యభామినిన్
సురల కపూర్వమైన బహు సుందరినిన్ సృజియించి ముందుగా
ధరణిని జుట్టిరాఁగలుగు ధన్యున కిచ్చెదనంచుఁ బల్క నా
సురపతి గూడ నీ పుడమిఁ జుట్టఁగబూనె నహల్యఁ బొందఁగన్ 243

చ. సురపతి రాకమున్నె కడు చోద్యముగా బహు శాస్త్రవేదియౌ
ధరణిసురుండు గౌతముఁడు తన్విని బొందెను గోప్రదక్షిణం
బరయఁగ భూప్రదక్షిణమె యౌటను, దానొనరించి యట్లు సుం
దరిఁ గవఁగూడి యాతఁ డిటఁ దాపసియై చరియించుచుండఁగా. 244

ఆ. వేయికన్నులవాఁడు విరహంబులోఁ బడి
గౌతముండు లేని కాల మరసి
యతని వేషమూని యాశ్రమంబునఁ జొచ్చి
పల్కె ని ట్లహల్య ప్రమద మొంద 245

మ. తరుణీ సుందరి మోహనాంగి వలపున్ దాఁచంగ శక్యంబె యె
వ్వరికైనన్, నినుఁ గోరివచ్చితిని నెవ్వా రిందులే రిప్పుడే,
సురతిన్ దన్పఁగదే యథేచ్ఛగ మనస్సున్ దాతురే కాముకుల్
వెరపేలా ఋతుకాలమేల రమణీ ప్రేమింతుఁ బ్రేమింపవే. 246

మ. లలితప్రేమము చిందులాడ మన ముల్లాసాబ్ధిలోఁ దూగ నా
చెలి, యీనాఁటికి వాంఛితార్థము లభించెన్గాదె యంచు న్వెసన్
గలిసెన్ గామకళా మహావిభవు నాకస్త్రీ విలోలాత్మ పూ
విలుకానిన్ భజియించు సంభ్రమమున ముద్వేగించి రాపాడఁగన్. 247

ఉ. గౌతమవేషధారి యిఁక గౌతముఁ డింటికి రాఁగలండు వి
ఖ్యాతుఁడ వీవు నేనొ మునికాంతను రక్షణనేయు మిద్దరన్

జేతము నీ నిమిత్తమయి చేడ్పడు నెప్పుడు వీడిపోవఁగా
జేతులురావు కాని యిఁక జెల్లదు నీ విటనుండ శక్రుఁడా! 248

ఉ. ఎంత తపంబు సేసితినొ యింతిరొ నీకయి పెక్కునాళ్లుగా
నింతకునింతె ప్రాప్తియెకొ యిద్దరకున్, విడుపెట్లు నిన్ను, నీ
కాంతుఁడు వచ్చునన్ జెడుగు గల్గెడి నీనుడి నిశ్చయంబె యే
కాంతమునందుఁ గన్ మొఱఁగగాఁ గలవాఁడనుగాను ప్రేయసీ! 249

శా. పోనీ పోయెద గౌతముండు మునియున్ బూతాత్ముఁడున్ జూచినన్
నా నీ మోహములన్ని యొక్క త్రుటిలో నాశమ్ముగావించు, నే
నే నాకమ్మును వీడి యప్పుడప్పు డిట్లే వత్తు లోలాక్షి! ని
న్నేనాఁడున్ మరపొందఁజాల హృదిలోనే యుందు వీవెప్పుడున్. 250

మ. అనుచుం గౌఁగిలివీడి వేచుచును నేరైనం గనన్ వచ్చిరో
యని ముందున్ గన మోమునెత్తి యటు లాయామూలలన్ జూచుచున్
జనుచు న్వేగఁ బరావృతాస్యుఁడగుచున్ జంద్రాననన్ జూచుచున్
ధ్వనిలేకుండగ మెల్లమెల్ల నడుచున్ వజ్రాయుధుం డత్తఱిన్. 251

ఉ. గౌతముఁ డంత స్నాతుఁడయి కర్మలదీర్చి నదీతటంబునన్
జేతుల దర్భలూని కడు శీఘ్రగతిన్ జ్వలితాగ్నిహోత్రుఁడో
యాతఁడనంగ వచ్చి వని నెట్టులొ దాఁటఁగఁ జూచు నింద్రునిన్
గౌతమవేషమూనిన వికర్ముని జారుని గాంచె నుగ్రుఁడై. 252

ఉ. ఏమిది వాసవా! సురల నేలెడివాఁడవ, ఆతతాయివా
కామముచేత నాకె యపకారముచేసితివా త్వదండముల్
భూమికిఁ ద్రెళ్లగాక యనె భూమి బడెన్, సురనాథునండముల్
కాముకులైనవారి కడగం డ్లిటు లుండవె యెంతవారికిన్. 253

చ. అతని శపించి గౌతముఁ డహల్య కనున్ వనితా యిటుల్ దురా
గతమొనరించి, నాకెటులొ కన్నుల గంతలుగట్టఁ జూచితే
సతివని నిర్మలాత్మవని సాత్త్వికతత్వము గాంచితంచు నే
యతినయితిన్ శరీరసుఖ మారసి దుర్గతి నేఁడు పొందితే? 254

ఉ. ఈవ్యభిచారదోషము సహింపఁగరానిది పూతచిత్తలై
సవ్యముగాఁ జరింపఁగల సాధ్వులు లేరొకొ! వీలుచిక్కుచో

ద్రవ్యమొ తుచ్ఛమౌ సుఖమొ రాగమొ యెంచి చరింతురొక్కొ : నీ
కవ్యయ సౌఖ్యమీయఁదగునంచు దలంచితి దుష్టవైతివే ? 255

చ. కుల మపకీర్తిపాల్పడఁగ గోమలి యన్యుని బొందినావె వ్యా
కులతఘటించె, నాకుఁ బ్రతికూలముజేసిన దాన, శాపమే
ఫలితము పూర్వమైత్రి ననుఁ బాయదు చేయఁగలట్టిదేమి : నీ
విల దురితంబువీడి తరియింపఁదలంతును దుష్టచారిణీ ! 256

చ. పొరబడి తీవటంచుఁ దలపోసితి దుష్కర బ్రహ్మచర్యముఁ
జరుపఁగలేక ; నేర మిదె సల్పుటచేఁ బరితాపమొందినన్
గరుణమునన్ క్షమింపనగుఁగాని, త్రుటిన్ బరిత ప్తచిత్తగా
మరలుట సాధ్యమా యిటుల మానమొసంగిన నీకుఁ గామినీ ! 257

శా. ఏరూపంబును జూచి నిన్ను సురలోకేశుండు కామించెనో
యారూపంబు దొలంగుఁగాక, యిఁక నేయాహారముంగొంట నీ
వారీతిన్ జెడినావొ కామమున నయ్యాహారశూన్యంబుగా
నీరాయిన్ సరిపోలి రేబవలు నట్లేయుండుమా దుర్మతీ ! 258

ఉ. ఆతపశీతవాయువు లహర్నిశలున్ మెయిఁ సోక, నిద్రయున్
భీతియు భూతియున్ విడిచి పెద్దయుఁగాలము త ప్తచిత్తవై
చేతులుమోడ్చి ప్రార్థనము సేయుదుగాక రమేశుఁగూర్చి నీ
చేతము వీతరాగమగు సిద్ధినిబొందెడిదాఁక దుర్మతీ ! 259

ఉ. ఈవని నామహాశ్రమ మిదే చెడు శూన్యము నిర్జనమ్మునై
నీవొకదానవే జగతి నెవ్వరి కండ్లకుఁ గానరాక యే
త్రోవయులేక బూడిద పరుండియె పాపము త్రోసివేయఁగా
దేవునిగూర్చి నిశ్చలమతిన్ దపియించెదుగాక దుర్మతీ ! 260

చ. స్థిరమగు రాయివోలె నిటఁ దేజము రూపము వాసి నీవు దు
స్తర దురితంబు వాపుకొని తారణమొందఁ దపించుచుండఁగా
వరగుణ రామమూర్తి రఘువర్యుఁడు వచ్చెడు పాదచారియై
ధరణిసుత నృతివ్రతను దాఁగనఁబోయెడి మార్గమందునన్. 261

శా. శ్రీమత్పాదరజమ్ము పేర్మి నఘముల్ చెండాడు పద్మాక్షుఁ డా
రాముం డెప్పుడు వచ్చి యీ భయకరారామమ్మునం జొచ్చునో

రామా యాక్షణమందె నీవు మరలన్ రమ్యాకృతిం దాల్చి యా
రామాతిథ్యమున న్బునీతవయి చేరంగల్గు దంతస్ ననున్. 262

ఉ. ఈవని నీదుపాపమున నీ సుకృతాకృతి వీడి శూన్యమై
పోవునుగాదె యద్దియును బూతమగున్ రఘురాముురాక, నే
నో వసియింతు శీతగిరి నుగ్రతపంబున నంతదాఁక వా
పోవుటచెల్లునా సుదతి బుద్ధియుఁ గర్మనుబట్టి పుట్టుగా. 263

ఉ. నాసహధర్మచారిణివి నాకిటు గోపము దెచ్చియుంట నేఁ
బాసితి శుద్ధవర్తనము వర్షసహస్రము లెన్నొ దీక్షతోఁ
జేసిన నాతప మ్మిటుగఁ జిందరవందరయయ్యె నేఁడు నిన్
గాసిలి దిట్టితిన్ జెడితిఁ, గర్మకుఁ జిక్కఁడె యెవ్వఁడేనియున్. 264

మ. అని యామౌని హిమాద్రికేఁగె సురలోకాధీశు నండద్వయం
బును డుల్లెన్ భువి నంత నాతఁడు మహా మోదమ్ము క్లేశమ్ములన్
గనుచున్ బోయి సురావళిన్ గలిసి స్వర్గం బింక శాంతంబునన్
మనజెల్లున్ ముని శాపమిచ్చుటఁ దపోమాలిన్యముం బొందెగా. 265

క. మీపని నెరవేర్చితిఁగాఁ
దాపసి కోపమ్ముకతన దగ్ధమొనర్చెన్
శాపము నిడి తన తపమును
గాపాడరె యండము లిడి కరుణన్ నన్నున్. 266

మ. అన శక్రుం గని దేవతల్ మురిసి బ్రహ్మానందముం జెంది వెం
టనె దోర్తెచ్చి రజాండముల్, గొనుచు దోడన్ వాని, నాతండు స
న్మని వాక్యంబున నల్లె నేఁడు మనెడిన్ బూతాత్మ దుష్టాత్మయై
వనిలోనున్నది శాపమోచనమొనర్పన్ నీకెగాఁ జెల్లురా. 267

## అహల్య రాముని బూజించుట

మ. అని గాధేయుఁడు వల్కఁ, గౌతముని శాపార్థమ్ము రాముండు త
మ్మునితోడన్ మునిఁగూడి యేఁగు వనికిన్ మోదమ్మొ యాశ్చర్యమో
కనుదోయి న్వెలిబుచ్చకుండఁ దన విఖ్యాతి న్సమాలోకనం
బొనరింపం దలపోయకుండ త్రుటియేన్ మోమోటమిం జూపకే. 268

ఉ. జానగుమోముతో విపుల సారసనేత్రుఁడు శూన్యదుర్గమో
ద్యానవనిన్ బదమ్ములిడె నంతఁ దదంఘ్రిరజమ్ము రేఁగె, రా
రా నలినాక్ష యోయఘవిరామ పునీత పదాబ్జరామ! యన్
ధ్యానమునన్ శిలాప్రతిమ తారసిలెన్ భువి దొర్లివచ్చుచున్. 269

శా. అంతంతన్ శిల రాముపాదయుగళం బంటున్, గనున్ గంపమిం
తింతన్, రూక్షత వీడుచున్ వనితయై యెంతో సుపారాంగియై
చింతన్ ద్రోయుచుఁ బద్మనేత్రయగుచున్ సేవించుచున్ రామునిన్?
గాంతారత్నము తప్తచిత్త గనియెం గాకుత్స్థు సాన్నిధ్యమున్. 270

ఉ. రామజపామృతాబ్ధిఁ బడి రాయిగ క్షాళితపాపచిత్తయై
కోమలియై సురాసురులకున్ వశగాని ప్రచండదీప్తయై
సోమనిభాంగయై వెలుగుచున్ బరిపూతగ బద్ధహస్తయై
భామ తదేకదృష్టి గనెఁ బావన రామ కృపేక్షణంబులన్. 271

ఉ. శాపవిముక్తయై విమల శాశ్వత సౌఖ్యపరీత దేహయై
భూపతనూజ దర్శనవిభూతి నిరంతర లోకదృశ్యయై
తాపసిభార్య 'పాహి' యని దాసివలెన్ నిలువన్ గృపాత్ములై
యాపరకార్యసక్తులు నృపాత్మజు లిద్దఱు మ్రొక్కి రామెకున్. 272

సీ. నీ రామనామమే నిర్మలాహారమై
బ్రతికితి నిన్నేండ్లు భక్తవరద!
నీ రామనామమే నిరత పానీయమై
జీవమ్ముతో నుంటి దేవదేవ!
నీ రామనామమే నిరుపమనిద్రయై
మనియుంటి నేవేళ వనజనేత్ర!
నీ రామనామమే నిఖిలసౌఖ్యమ్మునై
గడపితి నిన్నేండ్లు కమలనాభ!
గీ. ఇనకులేశ్వర నీ రాక కింతదనుక
భక్తనై వేచియుంటి నీ భస్మమందు
ప్రకృతిఁజిక్కి విరూపనై పరమపురుష
పడసియుంటిని స్వస్వరూపంబు నిపుడె. 273

ఉ. చేయగరాని తప్పిదము చేసితి భర్త కడుఁ క్షమించి న
న్నీ యపరాద్ధ గావ శపియించె; నినుఁ గన, నీదు రాకకై
యో యవతారమూర్తి! తపముంటిని నేఁ బరితాప మొందితిఁ
గాయవిశుద్ధినొంద నను గావవె గైకొనవే సపర్యలఁ. 274

సీ. అర్ఘ్యంబు నిడుదునా యఘవిదూరక రామ
భక్తసంరక్షణ పాహి పాహి
పాద్య మర్పింతునా పరమాత్మ రఘురామ
బ్రహ్మాది సంస్తుత్య పాహి పాహి
ఆతిథ్య మిత్తునా యనుపమగుణ రామ
వరదాత పరిపూర్ణ పాహి పాహి
హారతి బట్టనా యసురారి జయరామ
వాసుదేవా హరీ పాహి పాహి
గీ. ఎంతదూరము నడచితో యిటకు రాఁగ
పరమపావన కమనీయ పాదయుగము
మెత్తగా హస్తములతోడ నొత్తనిమ్మ
పార్థివేయ కృపామూర్తి పాహి పాహి. 275

శా. మాయామానుషవిగ్రహా! దశరథక్ష్మానాథ పుత్రాగ్రణీ!
ధ్యేయంబైన త్వదీయవిగ్రహ మిటుల్ దీపించె నాముందు, నే
నోయీ ధన్యనుగాదె నా బ్రతుకె యెంతో పూతమౌఁగాదె నీ
కీ యాకారము సార్థకంబగునె నన్నే బ్రోవలేకున్నచో. 276

ఉ. కోసలరాజపుత్రి నినుఁ గూరిమిఁ గాంచి తరించెఁ బూజ్యయై
నా సరిగూడ లేరు భువి నాయన దాశరథీ! నినుఁ గనఁ
వేసరి రెండతో మునులు విశ్రుతయోగులు జ్ఞానవంతులుఁ
దాసికి నాకుఁ జూపిన యుదారత యెవ్వరికబ్బె మున్నిటుల్. 277

శా. కల్యాణాత్మకమై ముముక్షుజన మార్గప్రాప్య పాథేయమై
కల్యంబై కవిరాడ్విరామమయి లోకత్రాణమై కర్మసా
ఫల్యంబై కలినాశహేతువయి దేవా రామ నామంబె త
త్తుల్యం బేమియు లేక నిత్యమగుతఁ దృష్టి న్బ్రసాదించుచున్. 278

తోటకవృత్తము :
మంగళదాయక మాసతి, నాథా
సంగరవీరవిశాంపతిపుత్రా
రంగదభంగపరాక్రమధర్మా
మంగళమయ్యెడి మానితకర్మా. 279

గీ. అని యహల్య భక్తి నా రాచకొమరుల
మ్రొక్కి మ్రొక్కఁగాంచి పూజసల్పి
మంగళమని పల్కె మాఱుమ్రోఁగెను దివి
మంగళమని నిత్య మంగళమని. 280

ఉ. గౌతమపత్ని యిట్లు పలుకన్ గడు మ్రోగెను దేవ దుందుభుల్
శీతనగాశ్రితుండయిన సిద్ధుఁడు గౌతముఁ డంతయున్ గనెన్
బూత యహల్య యయ్యెనని పొంది మహాసుఖము న్వెసన్ వనిన్
బ్రీతిని జేరి రాఘవుల ప్రేముడిఁ బొంది తరించె నాతఁడున్. 281

## జనకుని యాగశాల

గీ. గౌతముఁ డహల్యతోఁ గూడెఁ గౌశికుండు
వెంటరా రాజపుత్రులు వెడలినారు
జనకరాజ మహాయాగశాల కంత
నచటఁ గలవార లెల్ల రాహ్వానమిడిరి. 282

చ. జనతతులున్ యతీశ్వరులు సాధులు సజ్జనులున్ మునీంద్రులున్
వినుత మహాబలుల్ ప్రథితవీరులు బ్రాహ్మణ ఋత్విజావళుల్
జనకుని ధర్మకర్మపరు జన్నము చూడఁగ వచ్చినారు వా
రిని మఖవాటికన్ గనుచు జేనితనూజులు రామలక్ష్మణుల్. 283

క. కెరలిరి మునికిన్ ముదమున్
నెరపిరి క్రతుభూమి విడిది నెయ్యముతోడన్
గురువరుఁ డెంచఁగఁ గొని చూ
పఱులో యన వార లచటఁ బరఁగెడి యంతన్. 284

మ. విని, గాధేయుఁడు బ్రహ్మమౌని యటకుం వేంచేసెనంచున్ వెసన్
జనకక్ష్మాపతి తోడితెచ్చి సభకున్, సర్వోపచారంబు లం

తన గావించెఁ బురోహితుండగు శతానందుండు ముందుండ నా
మునియుఁ వానిఁ బరిగ్రహించి యడిగెన్ భూపాలునిన్ క్షేమమున్.

శా. భూపాలుండు కృతజ్ఞతన్ దెలుపుచున్ బుణ్యాత్మ మీ రాకచే
నా పాపమ్ము నశించు నా మఖము నిర్విఘ్నంబుగాఁ బూర్తియౌ
ప్రాపౌ సర్వశుభమ్ము నా జనులకున్, భద్రమ్ము నాకయ్యెడిఁ
మీ పాదాశ్రయ ధూళి లభ్యమొకొ స్వామీ యిట్టు లెవ్వారికేఁ. 286

గీ. పదియురెండు నాళ్లె పరఁగుట సవ మింక
వేల్పు లిట హవిస్సు ప్రీతిఁ గొనఁగ
వచ్చువారు మిమ్ము వారి నెల్లరఁ గన
నుండఁగోరువాఁడ నో మునీంద్ర! 287

ఉ. ఏరి కుమారు లీ యువకు లీ సము లీ సుకుమారమూర్తు లీ
చారుతనూకళాంచితులు శస్త్రధరుల్ సుమకోమలున్ మునీ
యేరికతాన నా మిథిల కిప్పుడు వచ్చిరి? నాల్గురీతులఁ
దీరిన వీరి కాల్నడక దెల్పెడి వీరికి వీరె సాటిగా. 288

చ. జనకుడు పల్కుచే తడవు సారసనేత్రులఁ గూర్చి యీ గతిఁ
మనవి యొనర్చెఁ గౌశికుఁడు, మౌనులు భూపతు లాలకింప, నీ
తనయులు వీరు లా దశరథ క్షితినాథుని రామలక్ష్మణుల్
జనకుని యాన రక్కసులఁ జంపిరి నన్నృపసేయ వీరలే. 289

చ. వనిత యహల్య శాపమును బాపిరి మార్గమునందు వీరలే
ముని నుతుఁడైన గౌతముని పూజల నింతకుమున్నె పొంది, యో
జనకపతీ త్వదీయ శివచాప మహాఘనతఁ గ్రహించి యా
పని నిట కేఁగుదెంచిరి నృపాల తనూభవు లెంతొ వేడుకఁ. 290

## శతానందుని యానందము

మ. అని మౌనమ్ము ధరించుఁ గౌశికుఁడు, రాజాస్థానమందున్న స
న్మును లీక్షించిరి మోముదమ్ము లొకపై ఫుల్లంబుగా రాజనం
దనులన్, గౌతమమౌనిపుత్రుఁడు శతానందుం డహల్యా విమో
చన వృత్తాంతము నాలకించుచు నమస్కారంబునన్ హృష్టుఁడై. 291

ఉ. చూపితివా మునీశ్వర? విశుద్ధ తపస్విని నాదు మాత నీ
పాపవిరామ రామునకు భవ్యచరిత్రునకున్ వెసన్ శిలా
రూపవిధమ్ము వాసి తొలిరూపము నొందినదా? ప్రపూతగా
భూపసుతున్ వనీకుసుమపూజలఁ దేర్చినదా యథావిధిన్. 292

చ. మునివర, మున్ను నా జనని పొందిన కీడు తెఱంగు నెల్ల రా
మునకు సమస్త జీవతతి పూజ్యున కీ వెఱుఁగంగఁ జెప్పితే
వినెనె సమస్త మీ పరుఁడు? వింటను బూజలఁ బొందియుంట నా
జనని పవిత్రయై మరల సఖ్యము నొందెనె నాదు తండ్రితోన్. 293

చ. కుశికతనూజ, నా గురుఁడు కూర్మిని రాముని గాంచి మ్రొక్కుచున్
యశము గడించెనా? పిడిచి వ్యాకులతన్? హిమశైలవాసియై
భృశతప మాచరించిన పవిత్రుని గౌతముఁ గాంచి యీ గుణా
తిశయుఁడు రామచంద్రుఁడు నుతించెన, పూజ లొనర్చి కొల్చెనా? 294

మ. అను చా రాజపురోహితుండు వరవాక్యజ్ఞుండు మాటాడ, నో
ముని! కర్తవ్యము సర్వము న్నలిపితిన్ బొల్లేమియు న్లేక మీ
జననిన్ గైకొనె గౌతముం డనియె విశ్వామిత్ర వాక్కోవిదుం
డనుకంపన్ జనకక్షితీశ్వరుఁడు సత్యం బెల్ల నాలింపఁగన్. 295

## శతానందుఁడు విశ్వామిత్రుని శ్లాఘించుట

చ. జయము జయమ్ము రామ యిదె స్వాగతమయ్య పునీతకర్మ య
వ్యయ ఫలసిద్ధి నీ కగుత భానుకులోత్తమ నేఁడు దైవని
ర్ణయమునఁజేసి మా మిథిల రాఁ గతమయ్యె మదీయ పుణ్యరే
ఖయు నిపుడే బయల్పడెనుగా సుఖులౌటను దల్లి దండ్రియున్. 296

ఉ. వచ్చినవాఁడు రాఘవుఁడు, వానిని దెచ్చినవాఁడు రక్షణం
బిచ్చెడివాఁడు గాధిజుఁ డహీన తపోబల సిద్ధమూర్తి నేఁ
డిచ్చట యాగకాలము మునీశ్వర బృందము లెల్ల వచ్చిరో
సచ్చరితా! సభాస్థలి విశాంపతి పుణ్యమఖాశ్రయంబుగా. 297

ఉ. ఎంతటి పుణ్యమూర్తివో మహేశ్వరతుల్యుఁడు మౌనివల్లభుం
డింతఁగ నీపరుండగు మహీతలమందున నీకు సాటి భూ

కాంతులు లే రచింత్య బహుకర్మలఁ జేసినవాని నీ విధిన్
బొంత వసింపఁ జేసితి వపూర్వము వాని చరిత్ర రాఘవా! 298

సీ. అరిరాజభయద ఘోరారాభాట సంతతుల్
గుహలఁ బట్టించిన మహిపుఁ డతఁడు
ప్రజలసౌఖ్యార్థియై పరిపాలకుం డైన
సకలధర్మార్థ విచారుఁ డతఁడు
సర్వసామ్రాజ్యంబు సంయమీంద్రుం డయి
విడిచిపుచ్చిన తపోవీరుఁ డతఁడు
సకలయోగంబుల సవ్యాపసవ్యముల్
తుదముట్టఁ గనినట్టి ప్రథితుఁ డతఁడు
గీ. మీ వసిష్ఠమునీంద్రుతోఁ జేవమీఱఁ
గామధేనువు వాంఛించి కయ్యమూని
తపసు కలిమికి భుజశక్తి తగమి వీఁగి
యోగ మూనిన బహుగుణ యోగ్యుఁ డతఁడు. 299

ఉ. ఓ రఘురామ ? తాపసిగ నుండుట శక్యమె కాని, పో యహం
కారము వీడకుండ మమకారముఁ జంపక సిద్ధుఁ డౌనె యా
వీరుఁడు సూర్యవంశ పృథివీతలనాథు పురోహితున్ మునిన్
బోరున గెల్వగాఁ దపసుఁ బూనును. వానికి సిద్ధి సాధ్యమా ? 300

గీ. అగుట మౌనిగ, బహుశక్తు లంది యితఁడు
నీ కులోద్భవుండు త్రిశంకునృపునికొఱకు
స్వర్గధామంబునకు మాఱు స్వర్గ మొకటి
సృష్టిచేసిన ఘనతపోద్రష్ట యతఁడు. 301

గీ. మీ త్రిశంకు శునశ్శేపు మిగులఁ బేర్మి
శరణు గొనినంత రక్షణ సల్పె నితఁడు
కోపవశుఁడయ్యు శరణార్థికొఱకు నపుడె
తనదు తప మెల్ల యిచ్చిన దాత యితఁడు. 302

చ. హిమనగమందుఁ దాపసిగ నేండ్లును బూండ్లు వసించు కాలమం
దమరులవారకాంత మరు నాఁకటికిన్ గుఱినేసె, నాతఁడున్

దమిఁ బదివేలయేం డ్లొకతృణంబుగ మేనకఁగూడి పుచ్చె కా
మము దెగటార్పలేక, యెటు మానును గామము మౌనికేనియుఁ౯. 303

మ. అటులుండన్ దపముం దొలంగి, యొకనాఁ డాగాధిజుం డంతలో
విట కాంతా సుఖమెల్ల రోసి, విడి యా పెన్ దప్తచిత్తంబునన్
బటు దీక్ష౯ మునియై మహర్షియయి యొప్ప౯, దేవతల్ కౌశికీ
తటియం దాతని గాంచి జంకిరిసుమా దక్షుం డతం డెంతకేన్. 304

శా. జంభారాతి యనుజ్ఞమై తపసిని౯ సమ్మోహితుంజేయ సం
రంభించె౯ వలపూని రంభ, యతఁ డా రాజీవపత్రాక్షిమో
హాంభోధిన్ గని భీతిఁజెంది కుపితుండై శాపమిచ్చె న్వేసన్,
రంభ్యాగామముఁ గ్రోధమున్ విడువకుంటం దిట్టె నామౌనియుఁ౯. 305

గీ. తప్పులొనరించినను మౌనితతులు పిదపఁ
బొందుదురుగాదె పరితాపబుద్ధి, యట్లె
బ్రహ్మచర్యవ్రతంబునఁ బరఁగలేక
తరుణిఁ దిట్టుట తప్పని తలఁచె నతఁడు. 306

ఉ. కామము క్రోధముం గెలువగాఁగల శక్తి లభింప నెంతయో
నీమము నిష్ఠయుం గలిగి నిశ్చల నిర్మల బుద్ధి యోగియై
యామహనీయమూర్తి తనువంతయుఁ జేడ్పడ నెండవానలన్
రామ తపించి బ్రహ్మఋషిరాజుగ నిర్ణయమొందె బ్రహ్మచేన్. 307

గీ. సాత్వికపుమూర్తి బ్రహ్మర్షి సకలవిదుని
నా వసిష్ఠుని గౌశికు డంతఁ గాంచి
పూజలొనరించె సాధువై పోరు విడిచి
యా మహాత్ముఁడు గాధిజుం డతులగుణుఁడు. 308

ఉ. ఆహిమశైలవాసి శరణాగత రక్షణ తత్త్వ మంతయు౯
దేహమునిండ నింపుకొని దేహియటం చని సిద్ధిగోరుచు౯
పాహి యటంచు మ్రొక్కఁగల భక్తుఁడు నీశరణార్థియై భువిన్
దేహి గనంగఁజాలు తుది తేజముఁగాంచెఁ బ్రపత్తిసిద్ధుఁడై. 309

ఉ. పాలకుఁడైన క్షత్రియుఁడు బ్రాహ్మణ ధర్మములెల్ల బూనఁగాఁ
జాలినవాఁడు కాఁగలిగె, సర్వవిదుండయి నేఁడు గాధిజుం

బోలిన మౌని లేఁడు, విధిపుత్రుఁడు దివ్యవసిష్ఠమౌనియున్
జాల నుతించినాఁ డతని, సంతత ధర్మమహాత్ముఁ డాతఁడే. 310

## జనకుని ప్రశంశ - శివుని విల్లు

చ. జనకపురోహితుండు ద్విజసత్తముఁ డారఘురామలక్ష్మణుల్
వినఁ బలుకాడ నిట్లు పృథివీపతి కౌశికుఁ గాంచి మ్రొక్కి యి
ట్లను, మహనీయ వంశజుల నంచితమూర్తులఁ దోడితెచ్చితీ
వనఘ మదీయయజ్ఞము శుభాస్పదమౌను గృతార్థుఁడన్ జుమీ. 311

ఉ. పాలననేసి తీవు నను బ్రహ్మమునీంద్ర? త్వదాగమంబుచే
క్షాళిత పాపకర్మచయ సత్కృతిబొందితి ధన్యుఁడన్‌గదా
ఆలననేసియుంటిని మహాత్ముఁడు రామునిగూడి నీతపో
లీల మహాద్భుతం బది ఫలించె ననేకగుణంబులందునన్. 312

చ. వినినకొలంది నీచరిత వీనుల కింపుగ నున్నదయ్య తృ
ప్తిని గనఁజాలమైతిమి త్వదీయగుణంబుల నీ సదస్యులున్
విని ముదమందినార లదె వీగెఁడి భానుఁడు పశ్చిమాంబుధిన్
గననగుఁగాదె సాంధ్యవిధికర్మ కనుజ్ఞనొసంగు కౌశికా! 313

గీ. రేపు సుప్రభాతమ్మునన్ జేనిసుతులఁ
గూడి దర్శనమిడ మిమ్ము గోరువాఁడ
స్వాగతం బిదె యంచు నా జనకనృపుఁడు
మౌనికిఁ బ్రదక్షిణమొనర్ప మౌనిగూడ. 314

గీ. ప్రీతుఁడై పంపి జనకుని, వెడలెఁ దాను
తపసిబృందమ్ము పూజింప, దాశరథులు
వెంటరా సాంధ్యవిధులకు విడిది కపుడు
సభ్యులెల్లరు జేజేల సలుపుచుండ. 315

ఉ. క్రొక్కారకోలుకోడి వడిఁ గూయుచు మేల్కొలిపెన్ జగంబు న
ల్దిక్కులఁ దెల్లవాఱె రవి తేజు వహింపఁగడంగె, వీథులం
దొక్కెడ సందులేక జనులుండిరి, మైథిలు యజ్ఞవాటికన్
ద్రొక్కిరి గాథిపుత్రసహితుల్ జలజాక్షులు రామలక్ష్మణుల్. 316

చ. జనకనృపుం డెదుర్కొనుచు సంభ్రమమొప్పఁగ గౌశికోత్తముం
గని; కరముల్ మొగిడ్చి దయఁ గాంచుఁడు నన్ గృపసేయరండు రం
డని సభ కంతఁ దోడ్కొని మహాత్ముని సద్గతిఁ బూజసేసి యా
సనముల నిచ్చి యిట్లనె విశాంపతులున్ మునులున్ జనుల్ వినన్. 317

మ. భవదాజ్ఞన్ శిరసావహింతు వెస విశ్వామిత్ర శాసింపుమీ
యవరోధం బొనరింపఁగాఁగలుగువా రాచార్య లేరయ్య వే
దవిధంబై తనరారు నీపలుకు సత్యం బెప్డు, కర్తవ్య మీ
వ విధింపందగు నన్నుబోటులకు విశ్వశ్రేయపుం ద్రోవలన్. 318

ఉ. వీరలు క్షత్రవంశజులు వీరు లయోధ్యనృపాలుసూను లీ
ధీరులు, లోకవిశ్రుతు లిదే కనవచ్చిరి నీమ ధర్మమున్
ఘోరమణా విశిష్టమది పూరిగుణాన్వితమంచు వింటచేఁ
గోరికదీఱఁ జూచి చనగోరెదరయ్య శుభంబు నీకగున్. 319

క. అను గాధేయున కపు డా
జనకుఁడు శివధనువుఁగూర్చి, సంయమివరులున్
జననాథులు సభ్యులు ముద
మున వినఁ దెలుపంగసాఁగె బూర్వాపరముల్. 320

చ. మును పల దక్షయజ్ఞమున బూచులతేఁడు హవిస్సు నొందమిన్
గినుకవహించి తొల్త సురకీర్తితుఁడై పరితృప్తుఁడై తుదిన్
దన ధను విచ్చె వారలకు, దానినొసంగిరి వారు దేవరా
తునకు మదీయపూర్వనకుఁ, దోడగు నేఁడది సీతపేర్మికిన్. 321

చ. వినుము మహాత్మ యీధనువు పేర్వడియున్నవిధమ్ము సేత నా
తనయకు వీర్యశుల్కముగ ధర్మము నూనుట నిశ్చయించితిన్
జనపతు లెందఱో జనకుపంపున వచ్చిరి మున్ను కాని యీ
ధనువు కదల్పఁజాలరుగదా యొకరైనను నేటికేనియున్. 322

ఉ. శంకరధర్మమూనఁగల శక్తివిహీనులు పుట్టడించి రే
కొంకునులేక నాపురిని గోపముతో నొకవత్సరమ్ము నే
జంకక పోరి సైన్యతతి చాలనశింప సురాళిఁ గొల్చి నా
సంకటమెల్లఁ బాపుకొనఁ జాలితి వైరుల గెల్చి యాజిలో. 323

ఉ. యాగము సేయనెంచు సమయంబున శోధనసేయు భూమిలో
నాఁగటిచాలునన్ బసితనంబున నాకు లభింపఁ బుత్త్రిగా
సాగరకన్యకా ప్రతిభఁ జాలెడి సీతను బెంచినాఁడ సం
యోగము సేతయోనిజను నుంకువగా విలుబూను వానితోన్. 324

చ. మునివర పెక్కుమంది నృపముఖ్యుల గర్వ మడంచినట్టి యా
ధనువును జూపమందువ యథావిధి జూతురు దెమ్ము దాని నో
జనకమహీశ యంచు ముని చయ్యన మాఱువచింప భూతలేం
ద్రుని నుడి మంత్రు లంత శివరూపము ధర్మ్యము నుంచి రా సభన్. 325

ఆ. అయిదువేల మంది యతికాయులగు వార
లమిత బలులు త్రోవ నాగి యాగి
మోయలేక లేక తెచ్చెడి వింటినిఁ
గాంచి విభ్రమంబుఁ గనిరి జనులు. 326

గీ. ఇనుపపెట్టె నున్న యీశ్వరు వింటిని
గందు రొక్కమారుఁ, గాంచి కాంచి
రాచఠీవి వెల్గు రామ సౌమిత్రుల
నట్లె చూతురెల్ల రంత సభను. 327

## చూపరుల తలంపులు

మ. తలపంకింతురు శంకితాత్ములగుచున్ ధాత్రీవరుల్ గొందఱా
లలితాంగి గుణ రూప శీలములఁ జాలం జాలఁ జింతించి, మై
థిలిపైఁ బ్రేముడి యేల నీ ధనువు సంధింపన్ దలంపేల మా
బలమా చాలదటంచుఁ గొందఱు నృపుల్ భావింత్రు డోలాత్ములై. 328

ఉ. ఎత్తఁగఁజాలమే బలవిహీనులమే పలునాళ్లు త్రుప్పురే
కెత్తిన యీ మహేశు విలు నిప్పుడ దుశ్శకునంబులాయె నా
చిత్తరు వెత్తఁగా దగిన చేడియ యేరి తపఃఫలంబొ మా
సొత్తది కాదుకా దనుచు స్రుక్కిరి కొందఱు రాకుమారకుల్. 329

గీ. క్షణికమాత్రాన విలుబూని జనకపుత్త్రిఁ
బరిణయ మొనర్చుకొనలేనివార మొక్కొ

యేక పత్నీవ్రతమ్ము మమ్మింత సేసె
ననిరి కొందఱు తమ సిగ్గు నదిమికొనుచు. 330

ఉ. అందము చందముల్ గల మహారథికుల్ మును విల్లుఁ బూనగా
నెందఱొ వచ్చి భంగపడి యేఁగిరి వీరలలో నెవండొ మా
సుందరి జానకీతనయ సూరిజనస్తుత ధర్మమూని తా
పొందఁగలాఁడు మోములవిపో కడు వాలినవయ్య తేండ్లకున్. 331

ఉ. చందురువంటి మోముగలఁ సారసనేత్రుఁడు వాఁడుకాని, చ
క్కందన మెంత సేయు శివకార్ముకమూనెడి శక్తి యుక్తుఁడే
చిందులు ద్రొక్కు వీరరస సిద్ధి, వినీల ముఖాబ్జ సీమలో
నందఱిలోన వాడె ఘనుఁడా? అగు బాలుఁడు వాఁడె కాఁడొకో. 332

ఉ. బాలుఁడొ వృద్ధుఁడో ధనువుఁ బట్టెడి యోధుఁడు వాఁడెయైనచో
జాలెడి సీత యాకృతికిఁ జక్కఁదనాన సుపాత్రుఁడౌను మా
పాలకు సాటిగాఁ బుడమి పట్టి గ్రహింప నయోనిజాసతీ
లాలితుఁడై మహాగుణ విలాసితుఁడై భువి పేరునొందఁగాన్. 333

క. ఇందఱిలో నవ్వాఁడే
సుందరుఁడై కానిపించుఁ జూడన్ జూడన్
గందర్పుని జనకుండే
యిందుల కేతెంచినాఁడొ యీ సీతకుఁగాన్. 334

ఆ. సురల తరము గాని హరు విల్లు బూనంగ
నరుని తరమె యెట్టి వరునకైన
అవని యందు మరల నవతారమెత్తిన
హరి యొకండె పూననగును దీని. 335

గీ. ధనము రూపమ్ము గోరఁ డా జనకవిభుఁడు
వయసు గణియింపఁ డేలొకో పార్థివుండు
కులము తేఁ డెంచఁడా? దాని పలుకలేదు
గుణము వట్టినఁ జాలుఁ జేకూర్ప సీత. 336

శా. మారాముండును లక్ష్మణుం డిటకు రా మానేత్రపర్వమ్ముగా
వారిం జూడకయుందుమే యిపుడొకో వారింతురే యత్తలో

రౌరా! యంచు నయోధ్యపుత్రికలహో ఆ యూరి కోదండ్రు వే
రారండం చని తోడురాఁ బతులతో రాఁగల్గి రీవేళకున్. 337

ఉ. చక్కదనాలచుక్క మన సారసనేత్రుఁడు రామమూర్తి పె
న్మక్కువ వచ్చెనంట యిట మైథిలు సన్నిధి నుండెనంట సీ
తక్క మహేశుచాపము మహోమఖవాటికఁ బూనునంట వే
యక్కడి కేఁగిరాఁదగు నటం చని వచ్చి రయోధ్యపుత్రికల్. 338

గీ. అన్న కందును సుమమృదుహస్తయుగము
నీ మనోహరరూపమే నిజతనూజ
నీయఁజాలద! విలుబూను నియమ మేల?
వీరె నిన్గన రాకుండువారె! రామ! 339

గీ. దశరథుఁడు బంపెనా లలితస్వరూప
యినుపవింటిని రాఘవుఁ డెత్తకున్న
నపయశముగాదె, యెత్తఁబో హస్తయుగము
ఎంతగాఁ గంది కనలునో యెఱుఁగరాదు! 340

ఉ. శీలము రూపమున్ వయసు సీతకు నచ్చునొ నచ్చదో కనం
జాలునుగాని యీశ్వరుని చాపముఁ బూనుటయేల? రామునిన్
నీలతనూవిలాస రమణీయు మహాసుకుమారమూర్తి, సీ
తాలలితాంగిఁ గాంచునెడ తండ్రిప్రతిజ్ఞకుఁ గించనొందదే. 341

ఉ. చిన్నదికాదె యంకుశము చిక్కదె మత్తమహాగజంబయేన్
జిన్నదికాదె మంత్రము వశీకృతులయ్యెద రాత్రి మూర్తులున్
జిన్నదికాదె పూలవిలు చేడ్పడిపోవఁడె యోగివర్యుఁడేన్
జిన్నతనమ్మెపో రిపులు చేడ్వడ రాముఁడు చెండు వింటినిన్. 342

ఉ. శ్యామలదేహవల్లి రుచి శౌర్యనిధానముసుమ్ము నెచ్చెలీ
కోమలదీర్ఘబాహువు లకుంఠితవీర్యపదమ్ము సుమ్ము గా
రాములపట్టి దాశరథి రాక్షసిఁదున్మిన మేటిసుమ్ము, మా
రాముఁడు బాలుడేయయిన రాజసభామహితుండుగాఁడొకో! 343

క. అనుచున్ సభలోనం గల
జననాథుల నెంచి రచటి జనములు వేడ్కన్

మునులో సీతను దలఁచుచు
ఘనదేహుని రాముఁ గాంఁ(త్రు) కొంచుచు జనకుఁడు. 344

చ. జనకమహీశ్వరుండు జలజాక్షుని రామునిఁ గాంచి యోరకం
టను, కుశికాత్మజా ! గుణము తంకృతి సేయఁగవచ్చు నెవ్వఁడేన్
వినుతబలుం డొకండయిన వీరలలోఁ గలఁడేని భారతీ
యుని రుధిరమ్ము చల్లబడియుండెన ! వీర్యవిహీనమయ్యెనా ? 345

చ. ఇదియ ధనుర్వరంబు జనకేంద్రుల నిత్య సుపూజ కర్హ మి
య్యదియె పరాక్రమాన్విత మహాధరణీశు లశక్తులౌటచేఁ
గదలుపరానిదై వినుతి గన్నది వారల పూజలంది యు
న్నది యిఁక రామలక్ష్మణులు నాటము సేయఁగవచ్చుఁ గౌశికా. 346

చ. సుర లసురాది ఖేచరులు శూరులు పట్టి కదల్పలేకపో
యిరిసుమ యీ ధనుస్సు, నరులెత్తుట మోపుట తూపుఁగూర్చుటా
జరుగుట ! నారి గూర్చెదరె ! శాంకరి రాముఁడు మోపువెట్టుచో
ధరణితనూజ సీతనిడి దాశరథిన్ గొను దల్లువానిగా. 347

గీ. సీత ధర్మమ్ము పూనెడి సిద్ధబలుఁడు
మహితమునులార జనక జామాత యగును
శంకరుని విల్లు పూనఁగా శక్తిలేని
మందుఁడగువానికీ సీత మాత యగును. 348

విశ్వామిత్రుని ప్రోత్సాహము - రాముఁడు విల్లు చూచుట

క. అని పలుకాడుట తడవుగ
మునినాథుఁడు కౌశికుండు మోదావహుఁడై
యనియెన్ బ్రజ విన, రాఘవుఁ
గని, కనుమీ, వత్స రామ, కార్ముక మదిగో. 349

ఆ. చాలమంది నృపులు చనినారు విఫలులై
యనెడి తేనిపలుకు వినిన యంత
భీరువయ్యెనేమొ వీరుండు రాముండు
నను నపోహ వొడమె నా మునికిని. 350

గీ. వత్సమున రామ రంజిలు వత్స రామ
ఇది ధనుర్వరంబ! కనుమీ యదియ చాలు
నంచు సర్వజ్ఞుతో ముని యనియె నంత
రామునకుఁ బూర్వ సంస్మృతి రాజిలంగ, 351

ఆ. గురుని యాన నంత శిరసావహించుచు
రాచకుఱ్ఱవాఁడు రాఘవుండు
శివుని వింటి గుణము చేఁబూని కనఁబోయెఁ
పిడుగు కొండఁ బడగ వెడలుగతిని. 352

## శివచాప భంగము - సీతా వివాహ నిశ్చయము

క. జనకుని మ్రొక్కుచు మదిలో
ధనువును దరిజేరఁబోయి తలఁచున్ శివునిన్
జనువునఁ బేటిక తెఱచుచు
మునిరాజుల యానఁ బొందె ముట్టగ వింటిన్. 353

చ. ఇదియ ధనుర్వరంబు ధరణీశుల నెందఱినో కడున్ గడు
న్బెదరగఁజేసెఁ బూర్వము? మునీ! కదలించన యెత్తనా వడిన్
ఇదె కను మోపువెట్టుమనుదే యని యెల్లనృపుల్ జనుల్ మునుల్
కదలక యేకదృష్టిఁ గనఁ గార్ముకమధ్యము పట్టె నంతటన్. 354

ఉ. లీలగ వింటిఁ బట్టి యవలీలగనెత్తి గుణంబు మోపి భూ
పాలసుతుండు రాఘవుఁడు బాణము గూర్చుచు నారి లాగుచోఁ
బ్రేలుచు ఫెళ్ల ఫెళ్లమని విల్లు తటాలున రెండుముక్కలై
కూలె నధోముఖంబగుచు ఘోరనినాద సముద్భవంబుగన్. 355

ఉ. భూమి వడంకె నాకసము భోయని బ్రద్దలువాఱె సంద్రముల్
రామ యటంచు క్షోభఁగనె రక్కసితండము దద్దరిల్లె నే
మేమి ఘటిల్లె దిగ్గజము లిట్టుల ఘూర్ణిలుచున్నవంచు సు
త్రాముఁడు మింటిపై విడిసి రాఘవుఁ గాంచెడి బద్ధహస్తుఁడై. 356

గీ. రామబాణమ్మమోఘమ్ము రాముఁ డిపుడు
వీడునెడఁ దూపు క్రుంగదో విశ్వమెల్ల

అతుల బలమున సంధించినట్టి యమ్ము
వెడలనిచ్చుట తగదని విఱిగె విల్లు. 357

చ. జనకుఁడు కర్మయోగి జనసత్తముఁడు, న్వరబ్రహ్మమౌని పా
వన కుశికాత్మజుండు, రఘువర్యులుఁ దక్క, నృపుల్ మునుల్ జనుల్
గొనమును మీటినంతటనె కూలి రయోమయ ధర్మభంజన
ధ్వని సెలరేఁగఁ, దద్భవ సదాశివ తేజము జొచ్చె రామునిన్. 358

గీ. విలయ తేజస్థుఁడై యున్న లలితరాముఁ
గాంచి "ధన్యాస్మ" యని రంత గాధిజుండు
మైథిలుండును, నంతలో మాయమాయె
ప్రళయ కాంతియు లయమొంది రామునందు. 359

గీ. బలిమిఁ బంచేంద్రియంబులఁ బట్టలేక
పంచబాణుని జంపినవానిచేత
నున్న పాపమ్ము శమియించు తెన్ను కొఱకు
కార్ముకమ్మట్లు విరిగె రాఘవునిచేత. 360

గీ. మోసి నవమాసములు మోసి మోసి గన్న
తల్లి శిరమును ద్రుంచిన ప్రల్లదుండు
తన్నుఁ బూనిన యఘమెల్ల దగ్ధమొందఁ
దల్లి దండ్రులఁ బూజించు తనయుచేత
ము_క్తిఁగనె విల్లు తనుదాన ముట్టునంత. 361

గీ. ర_క్తసి_క్తంబె జీవిత భు_క్తియెల్ల
యేఁటి కిట్టి హింసావ్రత మెంతదనుక
ననుచు రాఘవు భవితవ్య మరసియేమొ?
ముదిమి రోసియొ విల్లంత ముక్కలయ్యె. 362

గీ. ధర్మ సంరక్షణార్థమ్ము ధార్మికుండు
గాఁగ రాముండు, నా ప్రతిఘటన మేల
నాత్మ బలినిత్తు విడువ నీ యదనటంచు
దాశరథిచేత త్రుటిమాత్ర ధనువు విఱిగె. 363

గీ. అని యలంకారమే కవితాత్మ యంచు
ధనువు నుత్ప్రేక్షజేసి రామునిఁ దలంతు
రితని చారిత్ర మెంతదో యెంతదంచు
నచటి కవులెల్ల నబ్బురమంది యంది. 364

గీ. ప్రేక్షకులు మూర్ఛఁ దేలుచు బిడియపడక
నిశ్చల మనస్కులై యస్లై నిర్మలాత్మఁ
జూడసాఁగిరి లోకైక శూరు రాము
మంగళాకారు జనక జామాత నంత. 365

మ. భళిరే కంటిమి కంటి మిప్పుడు మహాప్రజ్ఞాధురీణున్ ఘనున్
విలయాకార ధనుర్విభేది విలసద్వీరాగ్రగణ్యోత్తమున్
లలితశ్యామల ప్రావృడభ్రరుచి లీలామానుషాగ్రేసరున్
దులలేకుండిన బాలరాము నని రెంతో వింత నచ్చో నృపుల్. 366

గీ. ఈర్ష్యఁ బొందరు నరనాథు లెవరుగాని
బాలుఁడగు వీఁడ విలుద్రుంచె లీల ననుచు
కరములను మోడ్చి యదియేమొ ? ధరణిధవులు
భక్తిపరులౌచు రాఘవవరుని గాంత్రు. 367

గీ. కాని నృపవేషధారులై కాచియున్న
రక్కసులు రౌద్రమూర్తిగా రామచంద్రుఁ
జూడఁగడఁగిరి, భీతిల్లి చూడలేక
తలలువంచిరి: వంచియుఁ దాల్మిఁగనరు. 368

గీ. భక్తి పరవశులైరి సద్భక్తులెల్ల
ధ్యేయమూర్తియె యితఁడని తెలిసికొంచు
రామరామయనంగ విరామమైన
నెఱుఁగరట భక్తకోటి యేకైకమతిని. 369

గీ. ఇతఁడె శృంగారరసమూర్తి, యీతఁ డితఁడె
రతిపతికిఁ బుష్పబాణమ్ము, నితఁడుగాఁడె
పురుషులనుఁగూడ వలపించు తరుణుఁ, డితఁడె
సుమ్ము వైదేహికిం దగు సుందరుండు. 370

గీ. ప్రకృతిసుందరి శృంగారరసము నెల్ల
దీసి వడఁబోసి వీనిగాఁ దీర్చెనొక్కొ
బ్రహ్మ, కానిచో పేరేడి రాము జోడు
అంచు వనితలు తనివోక యతనిగాంత్రు. 371

ఉ. బాలుఁడొకండు రాఘవుఁడు వచ్చినవాఁడె ధనుర్విభంగముల్
లీలగఁజేసినాఁడె సఫలీకృతుఁ డాజనకుండు నేఁడు వాఁ
డే లలితాంగుఁడా హృదయమిచ్చెడి మోహనరూపవంతుఁడా
యేలెడివాఁడ వీరవరు లెంచెడి వీరుఁడ రామచంద్రుఁడా. 372

ఉ. ఏ సుదతీలలామ పరమేశువరం బిటు గొల్చి పొందెనో
యే సతి దీవెనల్ సలుప నిట్లుగ నెంతతపమ్మొనర్చెనో
యే సకలప్రవీణ హృది నెంతగ రాముజయమ్ముఁ గోరెనో
యే సుమనఃపతివ్రత యహీన పవిత్రత దారవోసెనో. 373

గీ. బాలరాముండు కోదండపాణి, పాణిఁ
బట్టుట తడవుగా విల్లు ఫళ్ళుమనియె
జనకపుత్రిక యీవార్త వినెనొ లేదొ
యంద్రు మధురస్వనమ్మున నాఁడువాంద్రు. 374

ఉ. ఔనఁట యట్లెయంట చెలి యాతని కాతఁడె సాటి యంట లే
రే నునుఁబోలువార లరరే యిఁక ధన్యను ధన్యనైతినం
చానలినాయతాక్షి జనకాత్మజ పల్కెడి హాస్యలాస్యముల్
జాలగ నుప్పతిల్ల సహచారిణు లప్పుడె తెల్పువార్తకుల్. 375

ఆ. దృష్టిగొట్టకుండ దీవింపుమమ్మరో
లలితమూర్తి కంచు రామ దలఁచు
బాల నేఁటి కిట్లు పాలించితివి నన్ను
బాల యిచ్చవచ్చువాని నిచ్చి. 376

గీ. ఇష్టదేవతఁ దలపోసి యిట్లు సీత
కరములను మోడ్చి రామునిఁ గాంచినట్లె
కనుల నానందబాష్పముల్ గ్రమ్ముకొనఁగ
ప్రణతి సల్పెడి లోలోన రాముఁ దలఁచి. 377

మ. మునులో మూర్ఛిలి లేచి చూచి హృది రాముఁ బ్రొక్కు చిట్లెంత్రహో
కనలేమైతిమి రాఘవుఁ దపసుమై కండ్లార, నేఁడైన నీ
కనుదోయిఁ గననెంచి వచ్చితిమి పో కర్మంబు వెంటాడె, రా
మునితేజోమయమూర్తిఁ గాంచిరి మహాపుణ్యాత్మ లీమువ్వరే. 378

ఉ. సిద్ధుఁడు గాధిజుండు, గుణసింధువు కామవిహీనకర్మకుం
బద్ధుఁడు మైథిలుండు, దెస వర్ధిలు తోడుగదా సుమిత్రజుం
డద్దిర వారిభాగ్య మెటులబ్బను మాకు, మహాత్మ రాము లో
కోద్ధరణార్థజన్మ నిటులుండుట చూచితి మంత చాలదే? 379

మ. హఠయోగుల్ తొలి యూర్ధ్వకుండలినులఁ హత్తించి కర్మద్వయిఁ
గఠినాత్మఁ విడఁగొట్టురీతి ధనువుఁ గళ్యాణరాముండు క
ర్మఠుఁడై పైకొన నారిఁగూర్చి విఱిచెఁ మర్మమ్ము శూన్యమ్ముగా
హఠయోగమ్మను ముక్తిమార్గమగుసుమ్మా యంచు బోధింపఁగఁ. 380

ఉ. కాదది కాదుకాదు భువి కర్మకుజీవుఁడు చిక్కిచిక్కి తా
నేది యొనర్చినఁ ఫలితమెట్టిదియైనను కారకత్వమా
పాదనమూని మాయఁబడ; వానిఁ గృపఁ గను శౌరి మాయ వి
చ్ఛేదవిధమ్ము రాఘవుఁడు చెండెను మాయధనుస్సు సీతకై. 381

ఉ. ఎక్కడిరాఘవుండు మనమెక్కడివారల మేటిక్రొత్త బల్
రక్కసిమూకలఁ దునుమరా దివినుండి, కనంగనోఁచి యీ
చక్కికి వచ్చినాము, శివచాపము ద్రుంపఁగ నేరిశక్యమౌ
దిక్కులకెల్ల దిక్కయిన దీనజనావనమూర్తికే తగుఁ. 382

ఆ. వేయి తలలవాఁడు వేయి కన్నులవాఁడు
వేయి కాళ్ళవాఁడు విష్ణుమూర్తి
విశ్వమయుఁడు విశ్వవిశ్వేశ్వరుండును
మొదలు తుదయు లేని పురుషుఁ డితఁడు. 383

ఉ. తాతనుడి న్వహించి చని దారుణదుర్గమ భీకరాటవిఁ
బూతనదీనదమ్ముల నపూర్వగతిఁ గని దాఁటిదాఁటి, సం
ప్రీతి గురుఁ భజించి బహువిద్యలనేర్చి మఖంబుఁగాచి యా
రాతిని నాతిఁజేసిన విరాట్పురుషా కొనుమీ నమస్కృతుల్. 384

మ. అని లోలో మననంబుసేయుచు మహాహ్లాదంబునన్ జొక్కి, రా
ముని, వీరున్ బహుసౌమ్యు నిండువదనున్ మోహాంకురప్రాపకున్
ఘనవర్ణున్ మృదుకాకపక్షధరునిన్ గంభీరు సేవింతు రా
మునిబృందమ్ములు దివ్యదృష్టిమయులై పూర్ణానురాగంబునన్. 385

ఉ. అప్పుడు రాఘవున్ దశరథాత్మజు గాంతురు, వారు, వార లే
చొప్పుదలంతురో యటుగ; చూచెడివారలు పల్కలేరు, రా
మప్ప కృపాతరంగ యని యాడెడివారలు చూడఁజాల రే
గొప్పఘటించె నో పురుషకుంజరుఁ డారఘురామమూర్తిలో. 386

గీ. కనుచుఁ గన్నార నోటితో ననెడి వార
లనుచు నోరారఁ గనులతో గనెడివారు
పల్కుచును గాంచుచును వినువారు లేరు
ఏదియో దానిలోనుండి రెల్ల జనులు. 387

చ. ఇనకులదీపకుండు మనుజేశ్వరపుత్రుఁడు బాలరాముఁడో
జనులను మందహాసమున శాంతరసప్రతిబింబమో యనన్
గనుఁ, గరముల్ మొగిడ్చి గురు గాధిజు మ్రొక్కుచు మౌనిబృందమున్
గను వినయంబుతోడ, భువి కాంతులఁ గాంచెడిఁ బ్రేమ పెంపునన్. 388

గీ. రామనామంబు లోకాభిరామ మగుచు
యజ్ఞవాటిక మార్మ్రోగెఁ నంతకంత
మింటినంటెను సురలును మిన్నుకుంద్రె
పూజ్య రఘురాము ముంచిరి పూలవాన. 389

చ. జయజయ రామ, చారుతర జానకిరామ, వినీలరామ, య
వ్యయగుణరామ, భాస్కరకులాంబుధిచంద్రమ, వీరరామ యన్
జయజయనాదముల్ జనము సల్పుచునుండగఁ గాధిసూతికిన్
నయగుణమూర్తి మైథిలు డనన్దొడఁగెన్ గరముల్ మొగుడ్చుచున్.

ఉ. చూచితిఁ జూచితిన్ లలిత సుందర రాముని బాలరామునిన్
జూచితి రాఘవున్ బ్రథితశూరుని ధీరుని వీరరామునిన్
జూచితి నద్భుతమ్ము మును జూడ మచింత్య మతర్కితమ్ము నేఁ
జూచితిఁ జూచితిన్ విమలుఁ జూచితి మత్కులపావను న్మునీ. 391

ఉ. నోఁచితి నింత నీకృపను, నోఁచితిఁ జూడఁగ జానకీపతిన్
నోఁచెను సీతభర్తను మనోహరు దాశరథిన్ గనన్, సుతన్
నోఁచితిమయ్య మాకులము నోఁచిన నోములపంటగాఁగ, మా
యోచితి కీర్తిపెంపు గననయ్యెను, నయ్యెఁ బ్రతిజ్ఞ సత్యమున్. 392

ఉ. సీత మదీయపుత్రిక విశేషగుణాన్విత నిత్తుఁ గౌశికా!
ప్రీతిని రామభద్రునకుఁ, బేర్మిని నీవ యనుజ్ఞనిమ్మి, నా
కూఁతురు నిచ్చుమాట రఘుకుంజరు లిచ్చుట నీదు రక్ష వి
ఖ్యాతిని బొందియుంట నిది యంతయుఁ దెల్పెద రాముతండ్రికిన్. 393

చ. వెడలెడుఁగాక మంత్రితతి వేగముతోడ నయోధ్య కిప్పుడే
తడవొనరింపకే, దశరథక్షితినాథున కీసువార్త నా
నుడియని తెల్పుఁగాక యిది నూత్నవివాహశుభార్థలేఖ చే
నిడి, ముదమారఁ దోడ్కొని నరేశుని వచ్చెడిఁగాక గౌశికా. 394

## దశరథుని రాక

చ. జనకునిమాట వించు మునిసత్తముఁ డాకుశికాత్మజుండు చ
య్యనఁ దెలిపెన్ హితంబు, సచివాగ్రణులంద అయోధ్యకేఁగి యా
జనపతిఁ గాంచి రామకథ సర్వముఁ దెల్పి వివాహపత్రికన్
వినయముతోడ నిచ్చి మఱి పెండ్లికిరండని వేఁడి రానృపున్. 395

చ. జనకు నమాత్యశేఖరుల సాదరవాక్యము లాలకించి నె
మ్మనము ముదబ్ధిఁదోఁగ మునిమాన్యుని గాధిజు సంస్మరించి మ్రొ
క్కును, హృదయమ్మునందుఁ దనకూర్మిసుతుల్ మునుముందు నిల్వఁగాం
చినగతిగాఁగ మైపులకఁజెందెడి కోసలరాజు ప్రేముడిన్. 396

చ. కనుఁగవ మోదబాష్పములు గ్రమ్మ నమాత్యుల సంప్రదించి రా
మునిఁ గడుపారఁగన్న సతి పుణ్యము నెంచుచు ముప్పురాంద్రకున్
జనకు సువార్తఁ దెల్పి మునిసంఘసమక్షమునన్ వసిష్ఠునిన్
గని కొని వానియాన జనకక్షతినాథు నుతించి పేర్మితోన్. 397

గీ. పెండిలికి సమ్మతిందెల్పి వివిధగతుల
మన్ననలఁ దన్పి జనకుని మంత్రివరుల

సర్వసన్నాహముల మరుసటిదినమ్మె
తరలివెడలెను మిథిలకు దశరథుండు. 398

గీ. దశరథునియాన మున్ముందు తరలినాఁడు
వంశగురుఁడు వసిష్ఠుండు పరమఋషులఁ
గూడి, వృద్ధకోసలపతి కూర్మిసుతులఁ
గనెడి రాకను దెలుపంగ జనకుతోడ. 399

చ. ఎనిమిదినాళ్ళలోన మిథిలేశుని మంత్రులు కోసలక్షితీ
శునిఁ బరివారయుక్తుఁ గొనుచు న్మిథిలాపురిఁ జేరి రంత నె
మ్మన మనురాగపూర్ణమయి మై పులకింతలు పుట్టుచుండఁగా
జనకుఁ డెదుర్కొనెన్ వినతిసల్పుచు వృద్ధుని భానువంశజున్ 400

ఉ. స్వాగత మోనరోత్తమ విశాంపతిసత్తమ బ్రహ్మమౌనితో
నాగమనమ్మొనర్చి, కుశికాత్మజ గుప్తులు వీర్యవంతులౌ
నీగరువంపు బుత్రులు గణించిన వీర్యఫలమ్ము జూచి, నా
యోగము యాగము న్సుఫలమొందగఁ జేసితి పూజనీయుఁడా! 401

ఉ. ధన్యుఁడ సత్యమో దశరథక్షితినాథ త్వదాగమమ్మునన్
ధన్యుఁడ మ్రొక్కఁగాఁగలిగి ధర్మపరుండు వసిష్ఠమౌనికిన్
ధన్యుఁడ నీ మునీశ్వరుల దర్శనభాగ్యము నేఁడు పొందుటన్
ధన్యుఁడ నాదు వంశమును ధన్యము రాఘవు వియ్యమందుటన్. 402

చ. వరగుణ! రేపుప్రొద్దున వివాహమొనర్పఁగ వచ్చు మౌను లె
ల్లరు హితమన్నరీతి, సఫలంబగు యజ్ఞసమాప్తియం దనెన్
బరమగతిన్ విదేహపతి బ్రహ్మమునీంద్ర సమక్షమందుఁ ద
త్తరుణమునందె దానవిధి దాతహితంబనె కోశలేశుఁడున్. 403

చ. జనకుఁడు కోసలేశు నుడి సంతసమందుచు బంధుమిత్రులన్
మునినికరంబునెల్ల తగు పూజలొనర్చుచు లాంఛనంబులన్
దన పరిచారకావళి యథావిధి వారలఁ గొల్చుచుండఁగాఁ
బనిచెఁ బ్రియంబునన్ విడిదిపట్టుల కెల్లర నర్హరీతులన్. 404

చ. తనయుల రామలక్ష్మణులఁ దాల్మిని గౌఁగిటఁ జేర్చి చేర్చి లో
చనముల మోదబాష్పములు చల్లగ నింపుచుఁ గాంచి గాధిసూ

తిని, నతిసల్పి మున్నతఁడు దెల్పినమాటల సంస్మరించుచుం
దన శిబిరంబునం దశరథక్షితినాథుఁడు సేరె నంతటన్. 405

సీ. లేగలఁజూడంగ వేగమ్ము మరలెడి
యావుల పదధూళి యలమువేళ
కలకలారావముల్ గావించుచున్ గూండ్ల
కపుడె శకుంతమ్ము లరుగువేళ
ఆటలపాటల నాడుచుఁ దేలుచు
నిండ్లకై బాలకు లేఁగువేళ
పడమటికన్నియ ప్రకృతిపై బంగారు
పూతల పనిబూని పూయువేళ
గీ. పిల్లతెమ్మెర లల్లన వీఁచువేళ
జానకీపరిణయమును గానవచ్చు
సర్వజనములు విడుదల సకలగతుల
సుఖతరమ్ముగఁ జేరి రాశుభదినమ్ము. 406

ఉ. వచ్చె గుశధ్వజుండు తనవారల నెల్లరఁగూడి యన్నయా
సచ్చరితుండు మైథిలుఁడు జానకి పెండిలివార్తఁ బంపఁ రా
లచ్చివెలుంగ సోదరవిలాసితుఁడై జనకుండు కొల్వునం
జొచ్చెఁ, ద్రిలోకబాంధవుఁడు సూర్యుడు తూర్పున వెల్గువేళకుం. 407

ఆ. కొల్వుదీర్చి నృపతి కూరిమి రాఁగోరె
మునులకూడి కూడి ముద్దుసుతుల
సచివయుక్తుఁడైన సాకేతనాథుని
పెండ్లిమాటలన్ని విశదపరుప. 408

సీ. జయమస్తు జయమస్తు సర్వదా శుభమస్తు
దశరథా యను చోపుదారులుండఁ
కౌశికుఁడు వసిష్ఠ కాత్యాయనాదులు
బ్రహ్మమౌనులు ముందుఁ బరగుచుండఁ
ఇరుపార్శ్వములఁ దీర్చి యింపుగా వీరులు
తనయులు నల్వురు దరలుచుండ

బారుబారులఁగూడి బాంధవుల్ ద్విజులును
పౌరులు మిత్రులు పఱచుచుండ
గీ. మంగళనినాదముల్ మ్రోగి నింగి నిండ
అతులిత కళావతులు నాట్యమాడుచుండ
జానకీరాఘవుల పెండ్లి సలుపనెంచి
చనెను దశరథనృపుఁ డంత జనకుసభకు. 409

చ. మునులు సమస్తశాస్త్రములు పుక్కిటఁబట్టిన పండితోత్తముల్
వినుతయశుల్ నృపోత్తములు విప్రులు వీరులు రాకుమారకుల్
జనములు వందిమాగధులు స్వాగతమీయఁగ రాఘవాన్వయుల్
జనకుని కోర్కెఁ జేరిరి విశాల సువర్ణ సుఖాసనంబులన్. 410

## దశరథ - జనకుల వంశాభివర్ణనము

చ. జనకుఁడు మందహాసమున స్వాగతమిచ్చుచు సాదరంబుగన్
విన సచివుల్ కుశధ్వజుఁడు వీనులవిందుగ నాలకింప, రా
ముని ఘనవంశమెల్లయును బూజ్యవసిష్ఠుఁడు దెల్పసాఁగె స
న్మని కుశికాత్మజాది మునిపుంగవులెల్ల రనుజ్ఞనీయఁగన్. 411

గీ. ఆదిమధ్యాంతరహితుండు హరి యొకండె
అతని పుత్రుండు బ్రహ్మ కాశ్యపుని తండ్రి,
కాశ్యపుని సూనుఁ డర్కుండు, గాంచె నతఁడు
మనువు, నిక్ష్వాకుఁ డతనికి జననమొందె. 412

గీ. ఇతఁడెపో యయోధ్యను దొల్త నేలియుండె
నితని పేరిటఁ గడు వంశ మెన్నికఁగన
సగరుఁడు దిలీపుఁ డీవంశజన్ములైరి
నృపవరోత్తములై భూమి నేలినారు. 413

గీ. అల భగీరథుండు కకుత్స్థుఁ డవల రఘువు
నంబరీషుండు నహుషుండు నజుఁడు దశర
థేశుని పితామహులు సుమ్మ, యీ కుమారు
లిర్వురును జన్మమొందిన దీ కులమ్మె. 414

చ. జనక నృపాల! మా కులప్రశస్తి సమూలము జెప్పినాఁడ, నీ
వును వినియుంటి వంతయును బూర్వమె, ధార్మిక రాజసత్తముల్
వినుతి గణించినట్టి గుణవీరులు సంతత సత్యపాలురౌ
నినకుల భూతలాధిపులు నీవును బాంధవమొంద మేలగున్. 415

ఉ. రాచకులమ్మువారు రఘురాముఁడు లక్ష్మణుఁడున్ త్వదాత్మజల్
నోఁచిన నోముపంటలు మనోరథ సిద్ధిని బొందు దీవు సం
కోచము నొందఁగాఁ దగదు, కూర్మిని నీడున రూపమందుఁ గా
ణాచులు, నీ కుమార్తెలకు నచ్చినవారగువారు వీరలే. 416

చ. కుల పరిశుద్ధవర్తన మకుంఠితకీర్తి నెఱుంగకుండ, నే
లలననుఁ గాని గైకొనఁ దలంచుట పాఁడియె, యట్లె సద్వరున్
గులగుణ రూప సంపదల గొప్పతనమ్ము గణింపకుండఁ జూ
పుల కనువైనమాత్రమునఁ బొందఁగఁజూచుట చెల్ల దేరికిన్. 417

చ. అనెడి వసిష్ఠమౌనికిఁ గృతాంజలియై జనకుండు పల్కె, క
న్యను వరియించుపట్ల విననౌఁ దొలినుండియు నామె వంశమున్
మునివర! మా కులమ్ము నిమి భూపతి దివ్య యశఃఫలమ్ము, నా
తని వర కర్మయోగ రతి, ధర్మము, సత్యము లోకపూజ్యముల్. 418

చ. ఇతని కుమారుఁడైన మిథి యీ మిథిలాపురిఁ గట్టె, నీతఁడే
వితరణశీలుఁడున్ జనక విశ్రుతిఁగాంచినవాఁడు తొల్త, సం
తత నిజకర్మయోగియయి ధార్మికుఁడై జనకాఖ్యవంశ స
ద్గతికిఁ బునాదియయ్యె, నిటు గ్రాలఁగ మైథిలు వంశమున్నతిన్. 419

గీ. తాత ముత్తాత లెల్లరు ధర్మరతిని
బుడమి నేలిరి రాజర్షులనెడి కీర్తి,
స్వర్ణరోముండు మా తాత సకలవిదుఁడు
హ్రస్వరోముండు తండ్రి మహాత్ముఁ డతఁడు. 420

గీ. ఈతఁడు కుశధ్వజుఁడు, తమ్ముఁ డితఁడె నాకుఁ
దపసునకు నేగె మా తండ్రి తమ్ము నిచ్చి
రాజ్యభారంబు విడిచి విరాగియౌచు
జ్యేష్ఠుఁడను గాన రాజ్య మీచేతఁ బెట్టి. 421

చ. కర మనురక్తి రాజ్యమును గర్మతెఱంగు లెఱింగి యేలుచున్
వరగుణుఁ డీ సహోదరునిఁ బాయక మైత్రిని జూచుచుండ, శం
కరధనువున్ మదీయసుత క్ష్మజను గోరె, సుధన్వనాముఁడన్
ధరణివిభుం డొకం డొకట దానిని నేను దిరస్కరించితిన్. 422

చ. అలిగి, మహారణంబునకు నంతట డీకొనె నాతఁ డమ్మెయిన్
విలయమొనర్ప నామిథిల, విశ్రుత వీరరణంబునం, దతం
డిలపయిఁ గూలె తోడనె మునీశ్వర బ్రహ్మమహర్షిచంద్ర ! నా
వలన, తదాది యానృపుని పట్టణమేలెడి నాదు తమ్ముఁడున్. 423

గీ. శౌర్యధర్మరతుండు కుశధ్వజుండు
పాలనము సేయు సాంకాశ్యపట్టణంబు
నేనొ మిథిలను బాలింతు నీసదుక్తిఁ
దనయ లిర్వుర రామలక్ష్మణుల కిత్తు. 424

ఉ. నాసుత వీర్యశుల్క సురనందనతోసమ సీతనిత్తు నీ
భాసురమూర్తి రామునకు భానుకులాగ్రణికిన్, మదూర్మిళన్
నీసుకుమారలక్ష్మణున కిచ్చెద వియ్యమునందువాఁడ వ్య
త్యాసమొనర్తునే దశరథక్షితినాథ, మునీశ్వరాజ్ఞకున్ ? 425

గీ. నేఁడు మఖ వచ్చు నుత్తరనాఁడు పవలు
పెండ్లిసలుపంగఁ దగునంచుఁ బెద్దలాడి
రని వసిష్ఠుని గౌశికు నరసి పలికె
బ్రాంజలి యగుచు జనకుండు భక్తిమీఱ. 426

ఉ. అంత ముదావహుండు కుశికాత్మజుఁ డాడఁగడంగె, నిట్లహో
సంతసమాయె రాఘవులు చక్కనివారు యశోవిశాలురున్
గంతునిగన్నవార లనఁగాఁదగుఁబో హరివంశజాతు ల
త్యంతము మీకుసాటి జనకా సరిపోదురుగా వధూవరుల్. 427

గీ. భరతశత్రుఘ్ను లనఁబడువారు వారె
తాల్మిఁ గవనుండు కడగొట్టు దాశరథులు
రాఘవుని కూర్మితమ్ము లమోఘబలులు
శౌర్యధైర్యపరాక్రమసరణి వారు. 428

గీ. ఈయఁదగు మీకుశధ్వజుం డెలమి సుతల
వీరలకుఁ బూ_ర్తియౌను మీవియ్య మంతఁ
గనులపండువు మాకు, రాఘవ విదేహ
నృపుల వియ్యంబు త్రిభువనహితముగాదె ? 429

చ. అనెడి వసిష్ఠకౌశికుల కాజనకుండు నమస్కరించి మీ
రనినతెఱంగుసల్పెద మహాత్ముల యానల మీఱ నెప్డు మీ
యనుచరవర్గ మీజనకుఁ డాతని సోదరుఁ డీకుశధ్వజుం
డును, నల కోసలేశుఁ డెటులో యటులే మది నెంచుఁడీ మముఁ. 430

గీ. నల్వురను బుత్రసములను నాకొసంగెఁ
గోసలేశ్వరుఁ డతనికిఁ గూర్మినిత్తుఁ
బుత్రికాతుల్యలగు మాదు పుత్రికలను
మేముముగ్వుర మొకరీతి భూపతులము
మీరుముగ్వురు నొకచొప్పు పూజ్యఋషులు. 431

ఉ. మాముని గౌతమాత్మజుఁడు, మావరమౌనులు మీర లిర్వురుఁ
మీమువు రిప్డె మామువుర మేదిని రాజ్యము సేయఁజెల్లరే
యోమహితాత్ములార ? దయనొందుఁడు మావగు మూడుగద్దియల్
వేమఱు దీవెనల్ సలుప వేఁడెద మంతియచాలు మాకిఁకఁ. 432

సీ. దారేషణంబునఁ దమిఁ జిక్కి వృద్ధుండు
ధాత్రినేలుచునుండు దశరథుండు
సీతార్థి భువిఁ గొంటచే ధనేషణమున
సాంకాశ్యమేలు కుశధ్వజుండు
పుణ్యకర్మల నూని పుత్రేషణంబున
మహి నేలుచుండె నా మైథిలుండు
మువురు రాజులఁ జిక్కి మూఁడు రాజ్యములందు
నీషణత్రయమేలు నెలమి ప్రజల

గీ. విమల జనకుండు భవితవ్య వేత్తయగుట
మూఁడు మూర్తుల యంశముల్, మువుర ఋషుల,
నెదుటఁ గననోపి తమ సర్వమిచ్చె నొక్క
తాము ప్రజతోడఁ దరియింపఁ దలఁచియుంట. 433

## సీతాకల్యాణము

సీ. శ్రీరామ సృష్టి వసిష్ఠుని తావయ్యె
సీత గౌతమపుత్రుచేంతఁ బెరిఁగె
సృష్టి స్థితులకెల్ల చేడ్పాటు మూలమై
విధియాట లయరూపు విల్లు పొందె
లయకారుఁ డనఁగ విలయమొందఁగ ధనువు
కారకుండయ్యె నా గాధిజుండు
మూఁడు మూర్తుల యంశముల్ ముగురు మునులు
పొంది పుట్టినయట్టి పోల్కె లేదొ
గీ. యనుచు సభనున్న మునివరు లాత్మఁదలఁచి
భళిభళీ యనిరి జనకువైపు జూచి
యితర జనులెల్ల వహ్వారే యెంతమాట
జనకుఁ డాడెనటం చెద సంతసిలిరి. 434
గీ. జనకనృపుఁడన్న స్నేహంపు సరణి పలుకు
దశరథుఁడొ వించు హృష్టుఁడై తగినరీతి
ధాత్రివరులను మునులను దన్పినావు
భద్రమగుఁగాక నీకని పలికి యంత. 435
గీ. విడిది కరిగెను దనవారు వెంటరాఁగఁ
బెండిలికి ముందు జరిపెడి విధులు దీర్ప
జనకుఁడో పెండ్లికూతుంద్ర సలుప సుతల
నాజ్ఞయిడె ; మాఱెను మిథిల యమరపురిగ. 436
సీ. పలు తెఱంగుల పందెముల గట్టి హాయలుమై
వేసెడి పందిరుల్ వీథి వీథి
వీథి వీథిని వేడ్క వెలయ బచ్చనితోర
ణమ్ములఁ గట్టు గృహమ్ము గృహము
గృహ గృహాంగణమెల్ల కెరలి ముత్తైదువుల్
పూయునట్టి పసుపుఁ బూఁత పూఁత
పసుపుఁ బూఁతల దీర్చి కుసుమాకృతులఁ బెట్టు
పొంకపుం గుంకుమ బొట్లు బొట్లు

గీ. బొట్లు నిడి పెండ్లికై పిల్చు పూవుఁబోండ్లు
పూవుఁబోండ్లు ధరించిన పూలచెండ్లు
పూలచెండ్ల సువాసనల్ బొరయు పురము
పురము పురమెల్ల వరుఁబిల్చు పోల్కెఁ దోఁచు. 437

ఉ. వేడుక వచ్చి సీత నిదె పెండ్లికుమార్తెగఁ జేయరమ్మ యీ
నాఁడె శుభప్రదమ్మనెడి నారి యొకర్తుక యన్యఁజూచి పూఁ
బోఁడిరొ నేఁడె యూర్మిళయు భూమిజతోడుగఁ బెండ్లికూఁతురౌ
చూడగదమ్మ రమ్మనెడి సుందరియొండు మరొండు సుందరిన్. 438

క. నలువురు సుతలకు నొకపరి
లలిత వయోయుతులు భూరి లావణ్య నిధుల్
వలపుల మూర్తులు దొరకిరి
ఫలియించెను జనకు తపము బాపురె కనరే. 439

క. అనుచున్ సతులను బిలిచెడి
వనితలు పతియాజ్ఞఁ బొంది పరఁగెడి సతులున్
గననైరి రాజవీథులఁ
గనుపండువుగాఁగ నాఁడు కళ్యాణగతిన్. 440

సీ. విడిది యెల్లయు నాఁడు విప్ర సంతృప్తికై
గోదాన భూదాన గోష్ఠి నుండె
మరియుచుఁ బెండ్లిల్లు ముత్తైదువులఁ గూడి
గౌరీమహా పూజ గ్రాలుచుండెఁ
దమిని మునితతి సీతారాముల వివాహ
ధర్మ మొక్కట మదిఁ దలఁచుచుండె
వేదవేదాంగాది విహిత శాస్త్రపురాణ
పఠన సద్ధ్వని మింటఁ బరఁగుచుండె
గీ. నెచటఁ జూచిన విడిదియె యెచటఁ గన్న
వీరవరులును శూరులు విప్రతతియు
భూమి పతులును పెండ్లికి ముందునాఁడె
గూడియుండిరి కలకలలాడ మిథిల. 441

గీ. భరతుఁ గొనిపోవఁ దనవెంట గురునియాన
వెడలియు నయోధ్య యట లేమి పెండ్లికొఱకు
మిథిలకరుదెంచె భరతుని మేనమామ
తలవనితలంపుగా సుకృతమ్ముకతన. 442

గీ. వచ్చుచున్నారు బంధువుల్ పరమహితులు
జానకీరాఘవుల పెండ్లిగాన నోఁచి
పిలుపు పేరంటముల మాట పెట్టుకొనక
సుకృతిజనులెల్ల వచ్చిరి చూడఁ బెండ్లి. 443

గీ. లోకబాంధవుఁ డరుదెంచె, లోకరాము
పరిణయముఁ గాంచ సురతతి పర్వె నింగి,
దేవదుందుభి నిర్ఘోష దిశలునిండె
మంగళధ్వానముల వియ్యమందుచుండి. 444

గీ. అర్కుఁ డుదయించునంతట యజ్ఞవాటి
కిలకిలల యెల్ల జనులకు నిలయమయ్యె
వీథివీథులఁ బెండ్లికి వెడలు జనులె
రామనామమ్ము స్మరియించు ప్రజలె కలరు. 445

మానినీవృత్తము :
సీతకుఁ బెండిలి, సేవకుఁబోదమ శ్రీకరమయ్యెడి శీఘ్రముగాఁ
బూతచరిత్రుఁడు పూజ్యుఁడు రాముఁడు పుణ్యముగల్గెడి పోవుదమా
సీతయు రాముఁడు చెంతవసింపఁగఁ జూడఁగనోతుము శోభనమౌ
ఖ్యాతివహించిన కార్ముకవీరు వివాహము జూచుట భాగ్య మహో. 446

అర్కుటవృత్తము :
కొలిచెద రామమూర్తి మృదుల కోమల పాదములఁ
నిలిచెద వాని కట్టెదుట నిర్మలభక్తిమతిన్
గలఁచెద సంచితాఘనిధి కాంచెద నేను దరిన్
సలలిత రాము మోముగన సర్వశుభమ్ము లగున్. 447

సీ. తాటకఁ జంపిన దైత్యారి వీఁడఁట
దుర్గుణమ్ములనెల్ల దునుమునంట

కౌశికుయజ్ఞమ్ము గావాడె వీఁడఁట
సద్గుణమ్ముల నెప్డు సాకునంట
రాతినాతిగఁజేయు రాముండు వీఁడఁట
పాదధూళియె పాపు పాపమంట
శివువిల్లు ద్రుంచిన జెట్టి వీఁడేనంట
మంగళప్రదుఁడౌచు మనుపునంట
గీ. ఇనుఁడు శశియును రాఘవు కనులుగాఁగ
తీవ్రకాంతుల వెదఁజల్లు దివ్యముఖము
మిగులఁ జల్లనిచూడ్కుల మెరయునంట
నేఁడు కననోతుమంట యీవాడ నతని. 448

గీ. అనుచు నార్తులు సర్థార్థులైనవారు
జ్ఞానితతియును జిజ్ఞాసులైనవారు
వేడ్కఁగనువారు స్త్రీలును వృద్ధజనులు
బాలబాలిక లెందఱో లీలఁ గలరు. 449

గీ. రామనామమ్ము వినుచుఁ గర్ణములు నిక్కఁ
దొండములు చాచిచాచి వేదండచయము
దశదిశలు నాదమయమయి దద్దరిల్ల
సలుపుచున్నవి బృంహితశబ్దతతుల. 450

గీ. మైపదల్చుచు ముఖమెత్తి మరల మరల
కంఠములనెత్తి సలుపు ఘీంకారరవము
పాదములవేయు లయయొప్ప మోదమేమొ ?
యశ్వతతికినిగూడ రామా యటన్న. 451

శా. అంత న్మౌని వసిష్ఠుఁ డాజనుల మధ్యం దోఁచె, వెన్వెంటనే
చెంత న్గౌశికుఁడుండె, నావెనుక వేంచేసెన్గదా రాముఁ డా
పొంత న్సోదరులుండి తండ్రినడువన్ బూజ్యుండు జేజేలతో
నెంతో మోదము దెల్పు సర్వజను లట్లే చూడ నిశ్చేష్టులై. 452

గీ. అంతిపురముల నుండెడి యాఁడువాండ్రు
సౌధములనుండి యక్షతల్ సల్లినారు

దివిని గుమిగూడి యుండిన దేవగణము
పెండ్లికొమరుల ముంచిరి విరులవాన. 453

చ. జనకునియానఁజేసి మునిచంద్రుని గొల్చుచుఁ బాదచారియై
వనమున వెంటనంటి మునిపజ్ఞను విద్యల నభ్యసించుచున్
జనపద రాష్ట్ర దేశముల సచ్చరితల్ వినుచున్ నదీగతుల్
గనుచు ధరాధరమ్ములను గాంచుచు సల్పెను బ్రహ్మచర్యము౯. 454

గీ. సలిపి బ్రహ్మచర్యాశ్రమసరణి నెల్ల
కొన గృహస్థాశ్రమము నేఁడు జనకు పేర్మి
తమ్ములనుగూడి రాముండు తరలినాఁడు
పెండ్లిపీఁటకు మునులెల్ల ప్రేమఁజూడ. 455

ఉ. రామునిరాకఁ దెల్పి జనరాముని పెండ్లిముహూర్త మియ్యదే
యేమి విదేహరాజ యటు లింకను వేచెదవంచుఁ బల్కనే
నేమఱియుండలేదు సుతలెల్లరు సిద్ధమ పెండ్లిసేయుమీ
స్వామి వసిష్ఠ యంచు నుడువంగ విదేహుఁడు, సాఁగె యత్నము౯.

సీ. కమలాక్షు లనఁదగు కాటుక కనుదోయి
కరుణాలవాలమై గ్రాలుచుండ
శ్రీకరమ్ముగ వెల్గు చెల్వగు చెయిదోయి
యురమున జోడుగా మెరయుచుండ
కంజాతములఁబోలు మంజుల శ్రీపాద
యుగళమ్ము పారాణి నొప్పుచుండ
మామాతయన జనుల్ మహితానురాగమ్ము
వెదజల్లు మెయిదీవ వెలయుచుండ
గీ. పసిడిమోమునఁ దిలకమ్ము వరలుచుంచ
శాంత మొల్కెడి చిఱునవ్వు కాంతులీన
కడలి గనినట్టి తొలినాటి కన్నెవోలె
విహితగతి పెండ్లిపీఁటపై వెలసె సీత. 457

గీ. ధాత్రిజావక్త్ర మల్ల విధాతృపదము
శిష్టవక్షస్థలము సదా శివపదమ్ము

విమలమధ్యము శ్రీలసద్విష్ణుపదము
నాతి ధమ్మిల్ల మది సుమనః పదమ్ము. 458

గీ. అధర మరుణధరమ్మునై యలరు వధువు
వాణి మధురాపురమ్ము, జవ్వనినితంబ
సీమ కాంచీప్రదీప్తమ్ము, సిరులపేటి
యంగన శరీరమెల్ల శ్రీరంగభూమి. 459

గీ. ఎంతటి తనూవిలాసమో యీపడంతి
పుణ్యములప్రోవు శృంగారమూర్తి యతుల
దివ్యమంగళవిగ్రహ దీప్తిమతియె
విదితగతి పెండ్లిపీటపై వెలసెనంత. 460

గీ. రాముతమ్ములు మువ్వురు రాముతోఁడ
సీతచెల్లెండ్రు మువ్వురు సీతతోడ
నొకరికొకరౌచు నెదురుగా నున్నవారు
హోమకుండము మధ్యగానుండు నట్లు 461

గీ. అగ్నిసాక్షిగఁ బెండ్లిండ్లు యజ్ఞవాటి ;
మొదలుపెట్టె వసిష్ఠుండు మునులయాజ్ఞ
వేదవిదులన్ని నిశ్శంక విహితరీతి
సలుపుచుండె సదస్యు లాసరణి జూడ. 462

ఉ. ఎందఱు రాములో యిక మఱెందరు సీతలొ యీవధూవరుల్
వందలుగాగఁ దోఁచెడిని ప్రక్కను ముందును వెన్క నెల్లచో
నిందఱిలోన నెవ్వరొకొ యెంచ వధూవరు లంచు సభ్యు లా
నందముతోడఁ గాంత్రు రఘునందను జానకిచెంత దిగ్భ్రమన్. 463

చ. అరయ వివాహమందిరము నద్భుతలీల సృజించె మైథిలుం
డురుతరశక్తి నద్దముల నుంచెనొ చారుతరప్రభాశిలల్
వరలఁగఁజేసెనో యొకఁడె పల్వురుగాఁ గనిపించుచుండె శ్రీ
వరుగతి సృష్టినంతటను వర్తిలుఁ దానెయటన్న రీతిగన్. 464

శా. నాచెంత న్గలవాఁడు రాముఁ డనుచున్ నాచెంత నాచెంత నే
దోఁచెన్, రాముఁ డిదేయటంచు జన మెంతో ప్రేమ నేకాగ్రతన్

జూచుచు సన్నిధినున్నవానివలెనే చూపట్టు బింబమ్ము దో
బూచు ల్సల్పెడి రామచంద్రుడనఁగా, మోదంబు పెంపొందడిన్. 465

ఉ. సీతయొ లజ్జచే మొగముచెంతను జేయిడి మోమువాల్చి సం
పాతమొనర్చి దృష్టిఁ బతిపాదములన్ దన బింబ మా పద
ద్యోతముగాఁగఁ జూచుఁ బరితుష్టి సమర్పణఁజేసి యాత్మ నే
సీతనికై తపించి తరియించితి నంచుఁ దలంచు నాత్మలో. 466

ఉ. రాముఁడొ దివ్యసుందర ధరాతనయేద్ధ పరాత్మఁ జిక్కి యీ
రామ వివాహవేదికకు రాదొ మరెప్పుడు వచ్చునో యిదే
నామమకారమూర్తి కననా యిఁకనైన నటంచు నర్దెసల్
కాముకురీతి నెల్లెడల గన్పడు సీత ప్రతుల్ గనుచు వెసన్. 467

గీ. కౌశికుఁడొ యెన్నడో వీడి కాననట్టి
దంపతులు తిహతహలాడు తాల్మిరీతి
జానకీరాఘవుల చిత్త సరణి నరసి
మందహాసంబు సలుపు నానందమొంది. 468

చ. జనకుఁడొ యా పురోహితుఁడు సాత్త్వికమూర్తి వసిష్ఠమౌని చె
ప్పినగతి సర్వధర్మముల వేదవిధి న్నెరవేర్చి ప్రేమ, రా
మునిగనుచు సభాస్థలిఁ దపోధనులెల్లరఁ గాంచి మ్రొక్కి యి
ట్లనును సమంత్రపూరిత జలంబుల దోసిటఁబట్టి నమ్రుడై. 469

క. ఈ సీత నాదు పుత్రిక
కౌసల్యానందనుండ గైకొను మింకన్
మా సీత నీదు భార్యగ
వాసిం జరియించు రాఘవాన్వయ వింటే. 470

చ. ఇది సుమ సీత నాదు సుత యెన్నిక గన్నది కన్నెలంమ నే
మిది తగు పేరు గాదనుచు నెంతువొ సీతకతానఁ గాపు సం
పద గనునట్లు కర్మఫలవంతుఁడ వౌదువు నీవు సర్వదా
మది ఫల మెంచఁబోదు కృషి మాన్య యయోనిజ సీత నీ కిలన్. 471

చ. పృథివిని బుట్టియుంట బృథివీతల సద్గుణజాల మెల్ల యీ
సుదతికి సంక్రమించెఁ బరిశుద్ధ సదా యపరాధ మోర్చు భూ

తదయను భూతధాత్రి యగుఁ దల్లిని బోలు క్షమాంతరంగ యి
య్యదియ మదీయ పుత్రికసుమా గ్రహియింపుము పాణిఁ బాణిచే. 472

చ. అది యది సీతబింబముసుమా యిట నున్నది చూడు సీత యీ
సుదతుల మేలుబంతి యతిసుందరి నీదగు ధర్మమెప్డు స
మ్మదమున నాచరించెడి ప్రపూత యయోనిజ సత్కులీన యి
య్యదియ మదీయ పుత్రికసుమా గ్రహియింపుము పాణిఁ బాణిచే. 473

చ. ఇది సహధర్మచారిణి త్వదీప్సితభోగపదార్థకర్త్రి నీ
హృదయసమాన నీదు తను వెంచఁగ భద్రము గల్గుఁగాత నీ
విదిత కటాక్షవీక్షణము వీడక యేలఁగదయ్య సీత యి
య్యదియ మదీయ పుత్రికసుమా గ్రహియింపుము పాణిఁ బాణిచే. 474

చ. హృదయము ప్రేమపెన్నిధి వరించిన దీమె హృది న్నినుఁ సతుల్
వదలరు లజ్జ ముందు చెయివట్టుట యామెకు పాఁడిగాదు నీ
సదమలకీర్తి కద్ది సరసంబగునా యిటు గాంచు సీత యి
య్యదియ మదీయ పుత్రికసుమా గ్రహియింపుము పాణిఁ బాణిచే. 475

చ. అదనిది యెల్లవారలు మహాముదమందఁగలారు నీవ నా
కదియిది నేయుమంచనెడి యాజ్ఞల నిచ్చెడివాఁడ వంచు నె
మ్మది గమనింతువోయి బతిమాలెద నాజ్ఞనొసంగ సీత యి
య్యదియ మదీయ పుత్రికసుమా గ్రహియింపుము పాణిఁ బాణిచే. 476

చ. విదితము లోకలోకములు వీర్యము శుల్కముగాఁగ నిచ్చి యీ
సుదతిని బొందియుంటి ; కడు చోద్యముగా నెటు దాతవైతి వం
చెదఁ దలపోయుదయ్య ; గురు విచ్చెడిరీతిగదయ్య; సీత యి
య్యదియ మదీయ పుత్రికసుమా గ్రహియింపుము పాణిఁ బాణిచే. 477

చ. పదిలము నేసి పెంచిన విభాసుర దివ్య సువర్ణరేఖ యే
విధమునఁగాని యెప్డు నను వీడక విద్య గణించినట్టి కో
విద భవదీయదాసి బుధవిశ్రుతమంగళమూర్తి సీత యి
య్యదియ మదీయ పుత్రికసుమా గ్రహియింపుము పాణిఁ బాణిచే. 478

శా. శ్రీరాముండవుగమ్మ రామ, సుదతిన్ జేపట్టి గార్హస్థ్యమే
వీరా ధర్మపథమ్ము వంశకరముఁ విఖ్యాతధర్మార్థమున్

సారాచారవిచారశేముషి, మహా సంసారసామ్రాజ్యమున్
మా రామ న్గొని యేలవయ్య జనకు న్మన్నించి లోకార్థమై. 479

క. నీ పలుకు పలుకుచుండును
నీ పరహిత మెడ్డు ప్రీతి నెఱపుచునుండున్
నీ పదములనే పట్టుచు
నీ పను లొనరించుచుండు నీడగ నెపుడున్. 480

ఉ. ముందు భుజింప దీ జనకపుత్రిక భర్త భుజింప కెన్నఁడుఁ
ముందుగ నిద్రబోదు పతి పొందెడిదాక సుషుప్తి భర్తకున్
ముందుగ లేచుచు న్విధులఁ బూనుచు సౌఖ్యము దుఃఖ మెల్లెడఁ
బొందెడి భర్తతో సమతఁ బూని పతివ్రతయై మెలంగెడిఁ. 481

క. పతిగలపట్టున మాత్రమె
సతియొౌటను దిద్దుకొనును జక్కందనముఁ
బతి యిలువీడిన వేళల
బతిభావనిమగ్న యౌచు వరలెడి రామా! 482

క. మంగళమగు రామా! సీ
తాంగన మహితాత్మ వెంటనంటఁగ నెపుడుఁ
భంగము గలుగదు నీ కె
భ్భంగిని ధర్మమున సీత వరలఁగ నీతో. 483

క. అనుచు న్మంత్రజలంబుల
మునితతు లెల్లరును గాంచ మోదముతో రా
ముని కరములలో వదలెను
జనకుఁడు కడు భక్తి జన్మసాఫల్యముగాన్. 484

గీ. తోడ లక్ష్మణ భరత శత్రుఘ్నుల కిడె
మంత్రజలముల నూర్మిళా మాండవులను
సుతను శ్రుతకీర్తిని వరుస సొంపుమీర
మంగళనినాదముల్ మ్రోగి నింగి నిండ. 485

గీ. రామచంద్రుండు దమ్ములు రాజసుతల
కరములనుబట్టి మంగళకరముగాఁగ

సభకు మ్రొక్కి విదేహుని జనకవిభుని
పాదములచెంత సాగిలఁబడిరి యంత. 486

గీ. యజ్ఞఫలముగ నా రాము నరసి యరసి
ప్రతిన నెరవేర్చుకొనఁగల్గు భాగ్య మబ్బి
పూని పురుషార్థములు నాల్గు పొందినట్లు
పరమతుష్టి విదేహుండు వరలఁగలిగె. 487

గీ. గుణగణమ్ముల నాత్మను గురుఁడు పెంచి
యిచ్చెఁ బరమాత్మ కనురీతి నెల్ల మునులు
తలఁచినారలు సీతమ్మ వలపుపెండ్లి
నఖిలమూర్తిని గమచు 'ధన్యా స్మ' యంచు. 488

గీ. వంశకరులైరి సుతు లిష్టు భార్య లుంట
సర్వధర్మమ్ములం దీర్పఁజాలువారు
నా తపం బెల్ల ఫలియించె నో తపస్వి
కుశికసూతి యటం చను దశరథుండు. 489

గీ. సురలు తమ కార్యసిద్ధిని జూచి చూచి
ధరణిజా రాఘవుల పెండ్లి తంత్రమందు
నరసి సీతమ్మ మూర్తిని మురిసి మురిసి
లీల శ్రీరాము ముంచిరి పూలవాన. 490

గీ. నాఁటి దానమ్ములకు నేఁడు సాటియెచటఁ
జాలదనుమాట లేదఁట సకల జనులు
తృప్తిఁగనినారు దశరథు నాప్తులగుచుఁ
గాంచి శ్రీరాముఁ గననోఁచి కమలనాభు. 491

తో. మంగళమయ్యెడి క్ష్మాసుతభర్తా !
మంగళమయ్యెడి మాన్యచరిత్రా !
మంగళమయ్యెడి మాపతిరూపా !
మంగళమయ్యెడి మారఘురామా ! 492

క. అనుచు న్హారతిఁ బట్టిరి
వనితలు దంపతుల కంత బ్రాహ్మణతతి దీ

వెనలిచ్చిరి యక్షతలను
జను లెల్లరు జల్లినారు చల్లనిదృష్టిన్. 493

గీ. రంగ దుత్తుంగ హృష్ట వారాశి యిదియె
యనఁగ వైదేహి పరిణయయజ్ఞ ముండె
విడిదియందున నా రేయి విడిసియుండె
కోసలేశుండు చుట్టాలఁ గూడి తరల. 494

గీ. విడిది నిదురించిరో లేదొ పెండ్లివార
లినుఁడు కులవర్ధనుని పెండ్లిఁ గనిన ప్రీతి
బసిఁడిరేఁకులఁ బ్రకృతిపైఁ బఱుపసాగె
కలకలారావముల పక్షిగణము సలుప. 495

## విశ్వామిత్రుని వీడికోలు

మ. అపుడా సిద్ధుఁడు గాధిపుత్రకుఁడు నిత్యానందుఁ డారాఘవున్
విపులాబ్జాక్ష కృపార్ద్ర వీక్షణపరున్ విఖ్యాత సీతాయుతున్
నృపసూను న్ననుఁ గాంచుచు న్గరము లెంతే భక్తి జోడించి భ
క్తిపరుండై కనుమూయు మూసి హృదిలోఁ గీర్తించు శ్రీరామునిన్.

శా. శ్రీరామా రఘునందనా మునిజనశ్రేయోభిలాషా మహా
వీరా భక్తసమస్తకర్మహరణా విశ్వేశ విశ్వంభరా
యేరా నీ చరణద్వయి న్విడిచి నే నెట్లుందు శీతాద్రిపై
శ్రీరామా యను నామచింతనమునన్ సేవింతు ని న్సర్వదా. 497

ఉ. ఎందఱో రాజు లేలిన మహీస్థలిఁ బాలనసేయఁ బుట్టితో
సుందరమూర్తి! నీవిఁక వసుంధరపుత్రికమైత్రి నంది పెం
పొందుము లోకనాయక విభూతిని నీకిల సాటిలేక, నీ
కుందగు కర్మ దీర్పుము నృకుంజరవేషమున న్మహేశ్వరా! 498

ఉ. ఎప్పుడొ నిన్ను వీడి భువి నెత్తితి జన్మల; సంచితాఘముల్
కుప్పలుగాఁగఁ బ్రోగువడెఁ గుందితిఁ గుందితి నేఁటిదాఁక; నో
యప్ప, మదాత్మ నిచ్చి శరణంటిని నన్యులఁ జేరనంటి నా
తప్పుల సైపుమంటిని బదంబుల నంటితి నిన్నుఁ జేరితిన్. 499

ఉ. దోషిని నన్నుఁ బ్రోచి పతితు న్నను జేరఁగఁదీసి యిట్లు సం
శ్లేషముఁ గూర్చికూర్చి పరచింతన మాయగఁజేసినావు వి
శ్లేషము నైచు టెట్లు ! నృపలీల వరించిన జన్మకర్మమున్
బోషణసేసి మించెదవుపో యదె కూర్చెడి నాకుఁ దృప్తినిన్. 500

క. రామావతారమందున
స్వామీ నినుఁజేర నింక ; స్వాంతమె "ఓం రాం
రామాయ నమో" యను మం
త్రామృతమయ మౌచునుండు నంతియె చాలున్. 501

మ. అని లోలోఁ దలపోసి గాధిసుతుఁ డాత్మానందుఁ డా కోసలే
శునియొద్ద న్సెలవొంది దంపతులపైఁ జూడ్కుల్ ప్రసారించి యా
జనకు న్గాంచుచు వీడికోలుగొని పోసాఁగెన్, తుషారాద్రికై
మునులెల్లన్ జయ మస్తు కౌశిక యనన్ బూతాత్ముఁడై సిద్ధుఁడై. 502

ఉ. వీడఁగలేక వీడు కడుఁ బ్రేముడి నిండిన మోమునీడ, తా
వీడియు ముందుకుం జనఁడు వెన్కకుఁ జూచుఁ బరావృతాస్యుఁడై
యేడనొ మానసంబిడి చరించెడిరీతిగఁ జూచు నట్లె యే
నాఁడు లభింతువో మరల నా ప్రభువా యని లోఁ దలంచుచున్. 503

చ. వెనుకకుఁ జూచి నిల్చి రఘువీర పదద్వయమందు దృష్టి ముం
దున కరుగున్ దటాలుమని దూరముగాఁ జనుచుండి యుండియున్
గనుల కదృశ్యమౌదనుకఁ గాంచుచు మాంసపుకంట నంత నేఁ
గెను ముని యోగదృష్టిఁ బరికించుచు రాము సతీసమేతునిన్. 504

గీ. రామతారకమంత్రమ్ము వ్రాసి వ్రాసి
హృదయఫలకమ్మునందు సంతృప్తి నంది
జనులు తరియింప నది వెదజల్లి పుడమి ;
మౌని చనినాఁడు రాముని మరలఁ గనఁడు. 505

## జనకుని వీడికోలు

చ. జనకుఁడొ సారెచీర లిడి చల్లని దీవెనలన్ గుమార్తెలన్
బనుపఁగసాఁగె రాఘవుల ప్రాపున వేలకొలంది గోవులున్

మునులును వెంటరాఁ దరలిపోవు నయోధ్యకుఁ గోసలేశుఁడున్
దన సుకుమారపుత్రులు ముదంబున రాఁగ సతీసమేతులై. 506

గీ. మిథిలజను లెల్ల రాఘవమిథునదృష్టిఁ
దృప్తిఁ గనలేమి బహుమార మేఁగియేఁగి
మఱలిచనినార లిండ్లకు మమతఁదగిలి
విడిచి చనలేక యెట్లెట్లొ విడిచి విడిచి. 507

చ. జనకుఁడు కర్మయోగి జనసత్తముఁడై గ్రహియించె జ్ఞానమున్
ధనువు విభంజనమ్మయిన తత్క్షణమే : యిఁక యజ్ఞపూర్తిచేఁ
గనె సకలమ్ము, పుత్రికలు కాంతులవెంటను జెట్టఁబట్టిపోఁ
జనవుననైనఁ బొందఁడు విచారము, పొందును హర్షమే కడున్. 508

గీ. వెంటఁ జని కొంతదవ్వు దీవెన లొసంగి
తనయ విధిరీతి జనకుండు దంపతులకు
సెలవుగైకొని వియ్యంకుచెంత నంత
ఆశవానందు దోడ్కొని యరిగె తిరిగి. 509

## పరశురాముఁడు

చ. ఇనకులదంపతుల్ మును లహీనతపోధనుఁడా వసిష్ఠుఁడున్
జనములు గోసలేశుఁడును సైన్యచయమ్ము నయోధ్య కేఁగుచున్
గనిరి శుభాశుభమ్ము లనఁగన్ శకునమ్ములు కొన్ని దారిలోఁ
జనుచును వానిఁ గాంచుచు విశాంపతి క్రుంగు మహాభయమ్మునన్.

శా. అంత న్ఘోరనినాదము ల్జెలఁగి భూమ్యాకాశము ల్నిండె నా
శాంతమ్ముల్ గడు మాఱుమ్రోఁగ జను లాహాకారము ల్సల్ప నం
తంతన్ లోకము ధూళిసంభరితమై వ్యాపించె బెంజీఁకటుల్
సుంతైనన్ రవికాంతిలేక జగముల్ క్షోభించెడిన్ భీతిమై. 511

మ. అపుడా పంక్తిరథుండు భీతమతియై యట్లట్లు చూడన్ జనుల్
నృపుసైన్యంబులు బంధుమిత్రతతియున్ నిశ్చేష్టులైపోవ, నా
తపసుల్ రాఘవులున్ గనన్, బరశువున్ ధర్మమ్మునుం గొన్న రౌ
ద్రపుమూర్తిన్ జమదగ్నిపుత్రు నృపవిధ్వంసాత్మకున్ భీకరున్. 512

శా. ఓహో దాశరథీ యిఁక న్నిలువుమీ యోడింతు నే ని న్నిదే
బాహాబాహి రణమ్ము సల్పి, శివచాపంబెత్తుటే గొప్ప యో
ఆహా యయ్యది సీతయుస్కుఁ గని రెండయ్యెన్సుమా యంతె, నీ
దేహం బెంత ? బలం బదెంత ? విను సందేహింప కేఁ జూచెదన్.

మ. హరుధర్మ మ్మది యద్భుత మ్మెటుగ నీ హస్తమ్మున న్జిక్కె ? శ్రీ
హరిధర్మ మ్మిది నాదు చాపము మహాఖ్యాత మ్మనన్యమ్ము, స
త్పురుషశ్రేష్ఠుఁ డొకండుమాత్రమెసుమా పూనంగిలా డీ గుణా
కరమున్; రాఘవరామ ! నీదు బల మాకాంక్షించునే దీనినిన్. 514

చ. పరపురము న్జయింపఁగల బాణము నీదెకదా యిదే దివా
కరకులసూతి నా ధను, విఁకన్ ఘటియింతువె, బాణమిందు వే
జరిపెద, ద్వంద్వయుద్ధము దిశావలయమ్ము వడంకి క్రుంగ నే
నిరువదియొక్కమాఱు లవనీశ్వరుల న్దునుమాడితి న్జుమా. 515

క. అనుచు న్భార్గవరాముఁడు
గనఁగన్ దీవ్రాగ్నిఁ బోలు కనులన్ రామున్
జనవిభుఁడు దశరథుండును
దనువెల్లను గంపమొందఁ దహతహఁ బలుకున్. 516

ఉ. శాంతమునొందియుంటివి విశాంపతులన్ మును జంపిచంపి యా
శాంతము, బ్రాహ్మణుండవు మహాయశము న్గడియించినాఁడ వీ
పంతము సెల్లునొక్కొ ! పసిబాలురు వీరలు నాదు పుత్రు లి
ట్లెంతువె క్రౌర్య మీ వభయ మీయఁగ వేఁడెద భార్గవాన్వయా ! 517

క. వ్రతమున స్వాధ్యాయంబున
నతులితవంశంబునం దనన్యుఁడ వీవై
వితరణసేయవె పృథ్విని
గతమాయెనుగాదె యిహము కాంక్షల్ రామా! 518

గీ. అస్త్రసన్యాస మొనరింపవయ్య మున్ను
స్వర్గలోకాధినాథుండు సాక్షి గాఁగఁ ?
గాశ్యపున కిచ్చి భూమిని గాననమ్మె
యిల్లుగా నుందు వీవు మహేంద్రమందె. 519

చ. పటుతర బాహువిక్రమ విభాసుర భార్గవరామ సన్మునీ
యిట కరుదెంచినా వేఁక, లయించు మదీయ మహోఘజాల మి
చ్చట, కొనుమీ సపర్య, రఘుచంద్రులు మ్రొక్కెడివారు వీరి న
క్కటికముఁ జూపి దీవెనలఁ గావవె బాలురె నీకు శాత్రవుల్ ? 520

క. శ్రీరామునిఁ జంపెదవా
మా రాచకులమ్ము మేము మడిసెద మిపుడే
వీరా తండ్రిబుణమ్మను
దీఱెంగద నీవు ధర్మతృప్తిం గనవే. 521

చ. అని కరము ల్మోగిడ్చి పలుకాడెడి కోసలజేనిఁ జూడఁ డా
యనిమొనగాఁడు క్షత్రియకులాంతకుఁ డా జమదగ్నిసూనుఁ డా
త్మను రఘురాము నిల్పి తనధర్మము నాతఁ డెటుల్ గ్రహించునో
కను తమకమ్మునన్ బడి యెగాదిగ నాతనిఁ జూచి పల్కెడిన్. 522

మ. వినియుంట న్భవదీయ చిత్రకథ ని న్వీక్షింపఁగా వచ్చితిన్
గనలేనైతిని నేఁటిదాఁక నొరు నీకంటె న్మహావీరుఁ బృ
థ్విని శైవంబని వైష్ణవంబని కడున్ బేర్గన్న ధర్మద్వయ
మ్మున ము న్నీ వొకదానిఁ ద్రుంచితివిగా భూరిప్రతాపమ్మునన్. 523

చ. వినుటను నీ గుణోద్ధతిని విశ్రుతవీరుఁడ వీవ యంచు నె
మ్మనమున నెంచి నాసరిసమానున కిప్పుడె ద్వంద్వ మీయగాఁ
బనివడి వచ్చితిన్ మహిత వైష్ణవధర్మముఁగూడఁ బూని నీఁ
ఘనశరముంచుదే? యిపుడు గాంతువు నా గుణ రూప సంపదన్. 524

ఉ. ధర్మ మొకండె యుండె నిదె, ద్వంద్వమునన్ భవదీయ శక్తి చే
వర్మ ! యిదే ప్రతిజ్ఞ మన ద్వంద్వమునం దొకరుండె నిల్చు, స
ద్ధర్మము వైష్ణవమ్మ గని దానన ద్వంద్వ మొసంగనెంతు నీ
ధర్మము శాత్త్రి మెంచఁ బరధామ జయమ్ము శరమ్ము రాఘవా ! 525

చ. పరపురము న్జయింపఁగల బాణము నీయది నాదు చాపమున్
బరపురము న్జయించునది, పట్టెను రెంట సమానధర్మమే
యిరువుర మొక్క నామముననే పిలువంబడుచుంటి మన్నిటన్
సరియగు నంశ మొందుట గనన్‌దగు ద్వంద్వవిధమ్ము నంతయున్.

చ. పరపురము న్జయింపఁగల ప్రజ్ఞ సగమ్ము శరమ్ము రూపునన్
బరఁగుఁ ద్వదంశమై ; సగము వట్టె ననున్ ధనురాకృతి న్నిఁకన్
బరపురము న్జయింపఁగల ప్రజ్ఞను నైక్య మొనర్పఁ జెల్లదే
శరమును వింటఁ గూర్చి రఘుసత్తమ ద్వంద్వ మిఁకేల రాములన్. 527

చ. పరపురము న్జయింపఁగల బాణము నీయదె నిశ్చయమ్ము, నా
పరపురము న్జయించు విలు భార్గవుఁడైన ఋచీకుచేతికిన్
హరియె యొసంగె తొల్త, నతఁ డా జమదగ్నిని బుత్రుఁ బిల్చి యా
దరమున నిచ్చె, నాకు జమదగ్ని గురుండు మహాత్ముఁ డాతఁడే. 528

గీ. కార్తవీర్యార్జునుఁడు కన్నుగానకుండ
నస్త్రసన్న్యాసియై తప మాచరించు
నాదు తండ్రిని జంప నన్యాయ్యముగను
ధార్మికుఁడ నైతి ధర్మసంస్థాపనమున. 529

గీ. ధర్మసంస్థాపనకుఁ బూనఁదగిన బలము
తపసిఁ జంపుట కనువౌట దాని కలిగి
క్షత్రియుల నెందఱినో జంపఁగల్గినాఁడ
బ్రాహ్మణుఁడనయ్యుఁ బలుమాఱు బాలరామ ! 530

గీ. పుడమి నంతను నాచేతఁ బూని యిట్లు
క్షత్రియవినాశ యజ్ఞము సమయునంత
యుగసమాప్తిని దక్షిణ నొసఁగి పృథివి
నల మహాత్ముఁడు కాశ్యపుం డనఘునకును. 531

గీ. తపసినయ్యు మహేంద్రభూధరమునుండి
నిన్నుఁ గని ద్వంద్వము జయించు సన్నుతిఁ గన
వచ్చియుంటిని క్షాత్త్రిమ్ము వదలవలదు
వీర్యగుణపరాక్రమశీల ! విల్లుఁ గొనుము. 532

మ. అను నా భార్గవు నిశ్చలాత్మఁ గని వీరారాధ్యుఁ డా రాఘవుం
డను నమ్రుండయి, మెచ్చితిన్ బరశురామా ! తండ్రికిన్ దృప్తిఁగూ
ర్చిన వీరుండవు క్షత్రధర్మముననే ; శ్రీనాథు ధర్మ మ్మిదే
కొని నా తేజము నా పరాక్రమము నీకుం జూపెద న్జూచెదే. 533

మ. అని హస్తమ్మును జాచి భార్గవకరంబం దున్న ధర్మమ్ము నా
తనియందు న్గల వైష్ణవాంశము ద్రుటిన్ దాఁ బొంది యా రాఘవుం
డనుసంధాన మొనర్చె స్వీయవిశిఖం బా విష్ణుధర్మమ్మునన్
మును దానిం గడు వాడియున్నగతి సమ్మోహమ్ము సంధిల్లఁగన్. 534

ఉ. చూచితె నా పరాక్రమము చూచితె తేజము రామ బాణమున్
జూచితివే యమోఘ మిది చూపుము లక్ష్యము దీని కింక, నిన్
గాచితి బ్రాహ్మణుండ వని గాధిసుతాప్తుఁడ వంచు, రాఘవుం
డేఁచఁడు బ్రాహ్మణోత్తము; లయింపదు లక్ష్యముఁబాస బాణమున్.535

చ. పరపురము న్జయింపఁగల వైష్ణవదివ్యశరమ్ము నాది ; నీ
చరణగతిన్ సమర్పణము సల్పెదవా, తపమాచరించి నీ
పర మొనరించుకొంటి విభవమ్ముల వానిఁ ద్యజింప నెంతువా,
పరశుధరా యథేచ్ఛ మనివార్య మొసంగుట రెంట నెద్దియో ? 536

ఉ. రాముఁడు బాణమెత్తఁగ సురల్ దివిజేశుఁడు బ్రహ్మ వెంటరా
"రామ నమో నమో" యని పరాత్పరుఁ జూడఁగ వచ్చినారు శ్రీ
రాముని గాంచుచున్ బరశురాముఁడు వీర్యవిహీనుఁడై "పరం
ధామ కృపాపరా" యనుచు ధారణ సల్పెడి స్తబ్ధచిత్తుఁడై. 537

గీ. కమలనాభుని గనినాఁడఁ గాంచినాఁడఁ
గంజదళనేత్రు విష్ణుని గమలవిభుని
నాద్యు నప్రతిద్వంద్వు మహాత్ము నాశ
రహితు ధన్యుండ ధన్యుండ రామమూర్తి. 538

చ. జపము తపమ్ము సల్పితిని జన్నిద మూనితి నంతెకాని నీ
కృప గననైతి ; లోకముల నెల్ల జయింప తపమ్ము సర్వమే
నుపకరణ మ్మొనర్చితిఁ బ్రభూ భవదర్పణసేయకుండ నా
తపమునఁ గొన్న లోకసముదాయము నాహుతిసేతు నీశిఖిన్. 539

శా. బాహాబాహి రణ మ్మిఁకేల నిను గెల్వంజాలితి న్నేఁడె నా
కాహా యోటమి లేదులే దిటుల నిన్నాద్యు న్గనన్ వేడితిన్
దేహిన్ సర్వసమర్పణ మ్మిదె ; కృప న్నీవే గ్రహింపంగదే
యోహో రామ రఘూద్వహా శరణ మోహో సర్వలోకేశ్వరా. 540

చ. పరమకృపాపరా భువనభారహరా కమలామనోహరా
శరమును వీడుమీ యిఁక నిశ న్వసియింపఁగరాదు భూస్థలిన్
త్వరితగతిన్ మహేంద్రగిరిపై నివసింతు మనోజవమ్మునన్
ధరఁ గొని కాశ్యపుండు నను ధారుణి వీడఁగఁ గోరె రాత్రులన్. 541

చ. చరణగతిన్ ద్వదర్పణము సల్పఁగరాదు నిరంతరమ్ము నీ
చరణసమాశ్రయం బయిన స్వాంతమున న్మనుదీక్ష గొన్న నా
కరయ, జగమ్ము సర్వము తమోవృతమయ్యెను నాకు దాన నో
పరపురనాథ నీయెదుటఁ బ్రాంజలి నుంటి రజస్స్వరూపుఁడన్. 542

చ. తిమిరము నిండియున్న జగతి న్బరు లెవ్వరుఁ గాననట్టి నిన్
సమరమిషం గనుంగొనఁగఁజాలితినోయి విరాట్స్వరూప యీ
తమమును గొట్టి నా రజము దాఁకి మదీయ తపఃఫలమ్ము లు
త్తమభవము ల్విదల్చి మిఁక దాసున కిచ్చి త్వదీయసత్త్వమున్. 543

మ. అనుచు న్భార్గవరాముఁ డప్లై కను లోకాతీతవేగమ్మునన్
జను నా వైష్ణవసాయక మ్మెటుల వే నాశమ్ము గావించెనో
తన పుణ్యార్జిత లోకపంక్తి, గనుచున్ ధన్యోఽస్మి చక్రాయుధా
వనజాక్షా యనుచున్ బ్రదక్షిణమున న్బాఱె న్మహేంద్రాద్రికిన్. 544

ఆ. సురలు మునులె చూడ హరి వీడి తొలిరూపు
పరశురామువిల్లు వరుణున కిడి
సైన్యమధ్యమందు స్తబ్ధుడై యుండిన
పుడమిఱేనిఁ జేరెఁ బుత్రుఁ డగుచు. 545

చ. నలుఁగడ వెల్గు గల్గెడి యనంతుఁడు వీడి విరాట్స్వరూపమున్
గులుకుచు బాలరాముఁ డయి, కుందుచు విహ్వలుఁడైన తండ్రికిన్
బలుఁడగు భార్గవుండు చనె వాసె భయమ్ము జయించినాఁడఁ ద
త్ఫలితము చీఁకటుల్ చెదరెఁ బార్థివ యెల్లరు క్షేమమే యనున్. 546

చ. పరశువుఁ బూని భార్గవుఁడు వచ్చుటయున్ జగమెల్లఁ జీఁకటుల్
బరఁగుటయున్ జను ల్తమమువల్ల జడీకృతులౌటయున్ బరా
త్పరుఁడగు రాఘవుండె కనవచ్చుటయున్ జనకాత్మజాత దా
శరథులు గానరామియుఁ బ్రశాంతమున న్గని రెల్ల మౌనులున్. 547

ఆ. కాంచి మానమేతుఁ గననోఁచి యహితల్పు
శంఖచక్రధరుని సకలవిదుని
వైష్ణవాంశధరుఁడు పరశురామునితోడ
మునులు తృప్తిఁగని రపూర్వముగను. 548

చ. మునివరుఁడౌ వసిష్ఠునకు మ్రొక్కుచుఁ దక్కఁగలట్టి మౌనుల౯
వినయమున న్నమస్కృతుల విందునఁ దేల్చుచుఁ దండ్రిఁగూర్చి యి
ట్లను మఱియొక్కమాఱు, చనె నా జమదగ్నిసుతుండు, సైన్యము౯
మన మిఁకఁ బోఁదగు౯ బురికి క్ష్మాపతి నీవ యనుజ్ఞ నిచ్చిన౯. 549

## అయోధ్యకు సీతారాముల రాక

మ. అను రామున్ గను మూర్కొను౯ శిరముపై నా భార్గవుం డేఁగెనే
యను, నీవు౯ భవదీయ సోదరులు సౌఖ్యంబే యను౯ గౌఁగిలిం
చును బుత్రుల్ మరల న్గనించి రను లేచున్ జూచు నల్దిక్కుల౯
జనఁగావచ్చు నయోధ్య కింక ననుచు౯ క్ష్మాభర్త కాంచె న్ధృతి౯. 550

చ జయజయనాదము ల్సెలఁగె సాధువతంసులు సంతసిల్ల, న
వ్యయగుణమూర్తి గాంచి సురవర్గము నాకము సేరె, సైన్యముల్
భయము త్యజించి వేగముగఁ బాఱఁగడంగెను, రాఘవాన్వయుల్
పయనము సేసి రంత మునివారము తోడుగరా, నయోధ్యకు౯. 551

సీ. సృష్టికి మాఱుగా సృష్టిఁజేసినవాని
పరమౌచుఁ బొందిన బ్రహ్మశక్తి
లయకారకునివిల్లు లాఘవమ్మునఁ బట్టి
సమయించి కాంచిన శైవశక్తి
పరశురామునిఁ గాంచి హరి ధర్మమును బూని
జిష్ణువై గైకొన్న విష్ణుశక్తి
సీతాసతిం గూడి శ్రీమంతుఁడై సదా
ప్రతిఫలించు కృపాపరత్వశక్తి
గీ. సతము శరణాగతులఁ గాఁచు సకలశక్తి
పతితపావనమైన యప్రతిమశక్తి

గలిగి వచ్చెడి శ్రీరాముఁ గనెడి భక్తి
గుంపులై ప్రజ లెదురేఁగి కొలిచి రతని. 552

ఉ. దారులుదీరి నిల్చిరి యథావిధి పౌరులు రాజసౌధముం
జేరెడి రథ్యలన్ వినుతిసేయుచు నా రఘువంశ మెల్లయున్
గోరికలూరి మీఱ రఘుకుంజరుఁ గాంచ, నయోధ్య, యెల్ల శృం
గారపు పంటయై చెలఁగెఁ గన్నులవిందొనగూర్చుచుం గడున్. 553

గీ. బాట లన్నియు సుమములపాన్పు గాఁగ
మాటమాటయు రఘురాముమాట గాఁగ
ఇండ్లు వాకిళ్లు సిరికి పెండ్లిండ్లు గాఁగఁ
దనరు సాకేతపురిఁ జేరె దాశరథుడు. 554

సీ. మంగళ మో రామ మా జానకీరామ
యనుచు సువాసినుల్ హారతిడగ
బ్రహ్మవేత్తలు 'రాఘవాయ నమో' యని
స్వస్తివాచనములఁ జదువఁగడఁగ
అమ్మ నీదే యమోఘమ్మపో యను నృపుల్
వీరకుంకుమబొట్టు పెట్టి కనఁగ
శరణాగతత్రాణ శస్త్రాస్త్రకోవిదా
శ్రీరామ యని జనుల్ చెంత కరుగ
గీ. కోమలుల్ పూల జల్లుచు రామ యనఁగ
మువురుతల్లులు మూర్కొని పుత్రులఁ గని
అక్షతలఁ జల్లి కోదండ్ర నాదరింప
రాముఁ డరుదెంచె సోదరుల్ రాఁగ వెంట. 555

గీ. తూర్యనాదమ్మ రేగ దుందుభులు మ్రోగ
జయజయధ్వానములు మీఱి చదల నంట
నెవరి భవనమ్ములకు వార లేఁగినారు
రాఘవవధూవరుల్ ప్రేమరాసు లనఁగ. 556

గీ. దానధర్మములకు నాఁడు తనివి లేదు
ధనము ధాన్యమ్మ వస్త్ర గోతతుల నెన్నొ

దశరథనృపాలు డిచ్చె పాత్రత నెఱింగి
పరమతుష్టిని జీవితభాగ్య మంచు. 557

క. రాముఁడు రామానుజులున్
భామల జతఁగూడి శ్రీల బ్రాపయి ప్రజకున్
నోములపంటగ నుండిరి
భూమీశుని మెప్పుఁ బేర్మిఁ బొందుచు సతమున్. 558

గీ. తండ్రిశుశ్రూషఁ దనరుచు దాశరథులు
సతులతోఁ గూడి కాంత్రు సంసారసుఖము
సద్గుణమ్ముల మూర్తులై సతము వారు
మెలఁగుచుండిరి తల్లులమీఁది భక్తి. 559

గీ. కొంతకాలమ్ము సుఖులౌచుఁ గొడుకులుండ
దశరథుండు యుధాజిత్తు తలఁ పెఱింగి
మేనమామకు ప్రియకరంబైన రీతి
వానితోడుత భరతుని బంపె నంత. 560

గీ. తండ్రియానతి బాటించి తమ్ముఁగూడి
ధర్మపరుఁడైన భరతుండు తరలియుంట
రామలక్ష్మణు లిర్వురు రాజుఁ గొల్చి
పౌరహితకర్మ సేతురు ప్రభునియాజ్ఞ. 561

ఉ. తల్లులుఁ దండ్రియున్ గురుఁడు ధర్మవిదుం డని సంతసింపఁగా
నెల్ల జనమ్ము ప్రీతిమెయి నెప్పుడు రాముని సంస్మరింపఁగాఁ
జల్లనిచూడ్కులన్ జెలియ చక్కనిచుక్క వరించి కొల్వఁగా
నుల్లము పల్లవింపఁగ రఘూద్వహుఁ డుండు జనాభిరాముఁడై. 662

గీ. భర్త రాముండు సీతయే భార్య యనఁగ
జెల్లు నంచని లోకమ్ము చెప్పికొనఁగ
హృదయముల రెంటిఁ గలిపి వా రేలఁ గడఁగి,
రంత సకల సంసారరాజ్యమ్ము సతము. 563

గీ. ధర్మవిధిఁ బెండ్లియౌటచే ధరణిజాత
ప్రేమపాత్రమె కాని యీ విధియె కాదు

ఆమె యాత్మార్పణ మొనర్ప నమలమైన
ప్రేమకుం జిక్కె రాముండు ప్రియతముండు. 564

చ. జనకజ రాజయోగిసుత సంతతదివ్యగుణాభిరామ బు
ద్ధిని మిథిలాపురీజనిత ధీయుత చారుతరాంగ సీత భ
ర్తను వలపించు, మించు ననురాగమునన్ ద్విగుణీకృతమ్ముగా
జనతతి "యీమె శ్రీ" యనఁగ సర్వశుభాస్పద యౌచు నిత్యమున్.

గీ. రాముఁడో సద్విభుండు రారాజసుతుఁడు
సతము రాముండు కాముండు సకలగుణుఁడు
తఱుగులే దిఁక శ్రీరామదంపతులకు
శ్రీయు విష్ణువువోలె క్రీడింత్రు వారు. 566

గీ. శ్రీయుతుం డగు రాముని శీల మెంచి
ధర్మవిదుఁ డగు పుత్రుని కర్మఁ జూచి
పరమసంతోషమున నుండు పార్థివుండు
తనదు కాలమ్ము పండిన దశరథుండు. 567

సమాప్తము శ్రీ శ్రీ శ్రీ

## మంగళము

మంగళ మా శ్రియఃపతికి మంగళ మా రఘువంశసూతికిన్
మంగళ మా ధరాసుతకు మంగళ మా రఘునందనాళికిన్
మంగళ మా సుభక్తులకు మంగళ మా శరణార్థికోటికిన్
మంగళమౌ ననంతుఁ డగు మా కృతిభర్తకు రామమూర్తికిన్. 568

## ఫలము

సీ. అనపత్యదోషమ్ము చనుఁ గతుల్ లభియించు
రాముఁ గాంచిన దశరథునివోలె
సాధు సజ్జన మైత్రి సమకూరు విజ్ఞాన
సాఫల్య మౌను దాశరథిపగిది

పాపమ్ము సర్వమ్ము భస్మమౌ ప్రాప్తించు
నమల స్వరూప మహల్యరీతి
ఆశ్రమోత్తమ గృహస్థాశ్రమ మ్మొనగూడు
జానకీరాముఃచంద మొప్ప
గీ. తపము సిద్ధించు శాస్త్రార్థ ధర్మ మబ్బు
ఆయురారోగ్యభాగ్య సువ్యాప్తి గలుగు
సకల సంసార సౌఖ్యమ్ము సంభవించు
బాలకాండంబుఁ జదివిన భక్తతతికి. 569

## ఆశ్వాసాంత పద్యములు

ఉ. కావుము 'రామరామ' యని గాత్రము చీలఁగఁ గీర్తిచేసినన్
బ్రోవవ ? యెట్టివారికిని పుత్రను బుట్టిన పుండు మానునే
నీవ ఘనుండవా యనుచు నిన్నెదిరించినవారిఁ బ్రోచెదో
దేవర కేది పథ్యమొ యదే యొనరించెద నేటినుండియున్. 1

ఉ. తిట్టెద బ్రుయ్యఁదిట్టెద నదేవిధిగా భవదీయసంపదల్
గిట్టఁగ, లెక్కసేయవ ? చలింపవ ? నిర్మలభక్తిశక్తిమై
దిట్టఁడనైతి శాపమిడఁ దేలవుపో, వటపత్రశాయివై
గట్టును గానలేక యడుగంటవా ? తేలెదవో ? పయోనిధిన్. 2

ఉ. మెట్టల గుట్టలన్ దిరుగు మేటివిగా విపినమ్ములందు గీ
పెట్టుచుఁబోయె దీవును శపింపఁగ భక్తవరుండు, భక్తుఁ దే
పట్టుననో తపించి కడుఁ బ్రాణముపై విసువొంది మున్నె నిన్
దిట్టకయుండెనొక్కొ గణుతింపఁగ భక్తులశక్తి రాఘవా ! 3

గీ. గడచిబ్రతికిన వాడేడి ? కష్టచయము
జన్మమెత్తుట తడవుగ సంక్రమించు
ముందుకాలాన రాఁగల పుట్టిమునుక
నెవ్వఁ డెఱుఁగంగఁగలఁడు రాజేంద్ర, భువిని ? 4

గీ. కట్టికుడుపదో కర్మ భూకాంతునైన
పరుల సహకార మొందనివాఁడు గలఁడె

ఎవ్వఁ డేకాకిగా మను, నింత కింత
యనుభవింతువు నీవును నవనినాథ ! 5

శా. "ఆర్తత్రాణపరాయణా" యనుచు ని న్నర్థించు మూఢుండహో
కీర్తించుఁగద యొక్క దుర్బలుఁడు నిన్ గేల్మోడ్చుచున్ స్వేచ్ఛమై
వర్తింపన్ పసలేక, కర్మతెఱఁగున్ వారింతువే జానకీ
భర్తా, నిన్నన నేల ? నీ తలఁపె నా ప్రారబ్ధకర్మ మ్మగున్. 6

మ. నినుఁ గోరన్ వర మేదియున్ నిరతమున్ నీ నామమున్ భక్తి కీ
ర్తనసేతున్ భవదీయకీర్తి దిశలన్ రాణింప నెగ్గెత్తుచు
న్వినుతిన్ జేసెద నిన్ను కర్మగతిమై నీవో యదే చొప్పునన్
నను మన్నింపుము, కోర కేమియును నీ నా సంచితాంతమ్ముగన్. 7

శా. వైకుంఠంబున లచ్చితోఁ జెలిమిమై వహ్వా యటంచుండు నీ
వా ? కర్మన్ జవదాఁటలేక భువిపై వర్తించు నీవా ? మహా
లోకానీకము నెల్లఁ బ్రోవఁగలవా ? లోకుల్ సదా మూఢులై
నీకై చాతురు చేతులన్ విఫలులై నీపేర శోకించుచున్. 8

మ. భవదీయాద్భుత దివ్యసుందరతనూ భాస్వద్విలాసమ్ముమై
జవరాల్ డాయఁగ నామె ముక్కుచెవులన్ సంకోచమున్ వీడి కో
యవె ? ప్రేమాస్పద నట్లు చేయఁదగునా ? అర్థార్థులై గూడ భ
క్తవరుల్ నీ కృపఁ గాంతు రంచనుట కే కార్యమ్మొ తార్కాణమా ? 9

చ. కృప యన నెట్టిదో యెఱుఁగ వీవు సుఖంబును నోచ వెవ్వ నే
యపకృతిఁగాని సేయక నిరంతరమున్ నినుఁ గొల్చువారినే
తపతపలాడఁజేసెదు వృథామతి, నద్దె మహాగుణంబుగా;
సఫలుఁడఁగానె యన్యులదెసం జన నీవ పరార్థజీవివా ? 10

ఉ. ఏ పగఁగాని పూనకయె యెల్లర నేచుట నీకు క్రీడ గా
నోపు, శరీరధారు లహహా ! భరియింపఁగలారె కష్టమే
ప్రాపుగ నెల్లకాలము విరాగియు దుఃఖమయుండు గాఁ డె సీ
తాపతి వీవు నిన్ననుట ధర్మముకాదుగదా ! రఘూత్తమా. 11

చ. చరణములన్ని కుంటుపడసాగెను జూడఁగ బోయిపోయి యెం
దఱినో దివార్ధరాత్రముల దారియుఁ దెన్నును గానకుండ, ఏ

మరితిని నీ గుణానుభవమాధురి, దుష్టదశావిపాకముల్
జరుగకమున్నె యేరికిని సాధ్యముగాదొకొ ప్రోవ రాఘవా. 12

ఉ. కష్టచయమ్ము శల్యగతిఁ గన్నది నేటికి నీదు సత్కృపా
విష్టత శాంతిఁ గొంతఁ గని పీడను నీ స్మరణమ్ము కాని, నా
యిష్ట మదేమి? నీవె రచియింపఁగఁజేయుమ నీదు గాథ ను
త్కృష్టగతిన్ బ్రపూర్ణముగఁ దుష్టిని బొంద బుధాళి రాఘవా. 13

మ. నిను సేవించెడివారి కష్టచయముల్ నీవే నివారింపఁగాఁ
గను దేవో గతులన్ నిజ మ్మదియ, ఆ గాధేయుఁడే సాక్షియా
నినవంశోత్తముఁడైన రాఘవుఁడు తా నెట్లో దయన్ భక్తులన్
గను సంచున్ మును మౌను లన్న నుడికిన్ గై మోడ్తు దీవింపుమా.

ఉ. కవచశరాస్త్రబాణసితఖడ్గములన్ ధరియించి, సీతయున్
గవమెయి రామలక్ష్మణులు గ్రాలఁగ నా మునుముందు, నే సహో
అవమతిఁ జిక్కి సంచిత మహోఘమునే తలపోయ నేలకో
అవనమునందు నేర్పరిగదా రఘురాముఁడు భక్తభక్తుఁడై. 15

శా. ఏవేవో యనినాఁడ వేసరిలి న న్నేమందువో దేవరా
నీవే దక్షుఁడ వయ్య భక్తతతి నెంతేఁ బ్రీతిఁ బ్రోవంగ, రా
మా వాత్సల్యమునన్ గృపాపరుఁడవై ఆర్తున్ దయన్ జూడవే
నీవేతప్ప నితఃపరంబెఱుఁగ మన్నింపంగదే రాఘవా. 16

మ. దివియో భూమియొ ఘోరమౌ నరకమో దేనిన్ బ్రసాదించినన్
భవదీయేచ్ఛ నటన్ వసించెదఁ దమిన్ 'భక్తప్రియా! జానకీ
ధవ! రామా! రఘురామ! రామ' యను నిత్యధ్యాన చిత్తంబె రా
ఘవ! యిమ్మి యెట నున్న నయ్యదియె నాకం బౌను నీ సంస్మృతిన్.

చ. పనివడి యొక్కయేడు, కడు బాములకుం గురియైన యేడు, నీ
యనుపమ మంత్రబీజముల కక్షరమాలగ నష్టమాలలన్
నినుఁ దనియింప వ్రాసితిని నీదు వివాహమహోత్సవమ్ము గై
కొను మిదె కావ్యకన్య సుమకోమలి నా ప్రియపుత్రి రాఘవా. 18

చ. చదివిన సంస్కృతాంధ్రముల సాహితి సర్వము నిన్ స్మరింపఁగా
హృది, మది, నా కుపాధిసుమ యింక మఱేమియు నా కలమ్ము వ్రా

యదుసుమ నా చరిత్ర మినహా, అపవిత్రము సేయ లేఖినిన్
దుదిఁ గనుదాఁక నీ బ్రతుకు, తుష్టి వహించెద నింత రాఘవా. 19

ఉ. నాకనివాససంతతు లనారతమున్ భజియించు మూర్తియే
యీ కృతికన్యకాపతి ; మహీస్థలి ధర్మగుణప్రశస్తుఁడై
జానకినిన్ గ్రహించిన విశాంపతి, రాఘవరాముఁ డల్లుఁడౌ
నా కిఁక, సంచితమ్ము హరణమ్మగుఁగాదె తరింప రాఘవా. 20

మ. అనుగుందమ్ముఁడు జానకీసతియు వెంటాడంగ బాణాస్త్రముల్
గొని భక్తాళికి రక్షణమ్మొసఁగ సంకోచింపఁ డెన్నండు, నే
మనసారన్ సుజనాభిరామ! రఘురామా! పాహి మాం పాహిమాం'
అని, మా రాము స్తుతించి వేడవలెనే ఆ తండ్రియే ప్రోచుఁగా. 21

శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము

ఇతి శ్రీవసిష్ఠ - శక్తి - పరాశర - త్ర్యార్షేయ - పరాశరగోత్ర - పవిత్ర సుభద్రా
వేంకటకృష్ణమాచార్య పుత్రుండును - మహాత్మాగాంధిచరిత్ర -
భారతదేశార్థికచరిత్ర - భారతీయ రాజ్యాంగచరిత్రే
త్యాదిగ్రంథకర్త ఆత్మకూరి గోవిందాచార్య
విరచిత గోవిందరామాయణ మహా
కావ్యంబున 'శ్రీసీతారామమ్'
అను బాలకాండము
సర్వము సంపూర్ణము

శ్రీ సీతారామార్పణము

మంగళమ్ మహత్ శ్రీశ్రీశ్రీ

★

# శ్రీగోవిందరామాయణము

## ఉత్తరకాండము

నిర్వచన పద్యకావ్యము - సులభశైలి

సమకాలికుల ఆదరాభిమానముల పొందిన కావ్యము

వెల రు. 3 లు మాత్రమే.

వలయువారు :

గ్రంథకర్తకు

శ్రీ సీతారామ నిలయమ్

F-3-911/1 ఖైరతాబాదు P. O. - హైదరాబాదు A. P.

అని వ్రాసిన బడయగలరు.

# తప్పు - ఒప్పుల పట్టిక

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 17 | 2 | 3 | చేతిన్ | చేతికిన్ |
| 18 | 10 | 4 | నీవె దా | నీవెకదా |
| 26 | 43 | 3 | నీచుఁడనన్ | నీచుఁడ నన్ |
| 27 | 50 | 4 | తావకీనేచ్ఛమెఁగాదె | తావకీనేచ్ఛమై గాదె |
| 28 | 59 | 1 | వీర లెలరు | వీర లెల్లరు |
| 30 | 67 | 1 | విదులుగ | విదులును |
| 30 | 68 | 1 | స్వాహానాధమున్ | స్వాహానాదమున్ |
| 32 | 87 | 1 | నరనందనులన్ | వరనందనులన్ |
| 36 | 110 | 4 | బుటినాఁడు | బుట్టినాఁడు |
| 39 | 130 | 4 | చుందురుసూ | చుందురుమా |
| 40 | 137 | 4 | విద్యయున్ | విద్యయు |
| 44 | 23 | 2 | పాదన అ | పాదన మ |
| 52 | 40 | 3 | బొందె | బొంది |
| 55 | 61 | 3 | వశిషు | వశిష్ఠు |
| 55 | 63 | 3 | స్కంధముల | స్కంధములు |
| 58 | 78-80-81 | | గీ. | ఆ. |
| 59 | 85 | 1 | దీర్చంగ | దీర్పంగ |
| 66 | 136 | 1 | దశరథేయులు-మూడవ | వసుమతీ పతిపుత్రులు (లేక)-ముని విధేయులు మూడవ |
| 66 | 137 | 1 | దశరథేయుని | గడు విధేయునిఁ |
| 71 | 167 | 4 | ప్రోక్తన | ప్రాక్తన |
| 72 | 175 | 3 | దశరథేయుఁడు | దాశరథి వీర |
| 73 | 182 | 1 | లెరిక | లేరిక |
| 77 | 208 | 3 | కుశనాభా | కుశనాభు |
| 77 | 213 | 3 | దుస్సాధ్యము | దుస్సాథము |
| 78 | 218 | 4 | కౌశికి | కౌశికీ |
| 89 | 288 | 2 | సుమకోమలున్ | సుమకోమలుల్ |
| 92 | 305 | 4 | రంభ్య | రంభన్ |
| 94 | 322 | 1 | నేత | సీత |
| 107 | 406 | 7 | విడుదల | విడిదులు |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 109 | 415 | 4 | భూతలాధిపులు-నీ | భూతలాధిపతు లీ |
| 111 | 432 | 3 | మా వగు | మా కగు |
| 116 | 456 | 2 | యటు | యిటు |
| 119 | 473 | 3 | మ్మదమున | మ్ముదమున |
| 121 | 487 | 4 | పంమ | పరమ |
| 124 | 509 | 4 | ఆశవా | ఆశతా |
| 127 | 527 | 2 | ధనురాకృతిన్నికన్ | ధనురాకృతిన్ సుమా |

## పాఠాంతరములు

| పుట | పద్యసంఖ్య | పంక్తి | | |
|---|---|---|---|---|
| 68 | 147 | 3 | సకల శాస్త్రార్థ పరిచయ<br>సార్వభౌము | |
| 73 | 178 | — | చనె, నానంద సుధామయుం డయిన వి<br>ఖ్యాతుండు గాధేయుఁడున్ | |
| 92 | 305 | 4 | రంభన్ గామము గ్రోధమున్ విడువనే<br>రంజాలమిన్ దిట్టైగా | |
| 96 | 332 | 1 | చందురువంటి మోముగల<br>చక్కని చూపుల చుక్క కాని చ | |
| 99 | 354 | 2-3 | కదలించన యెత్తమందువా యిదె | |
| 129 | 542 | 3 | కరయ, జగమ్ము సర్వము మ<br>హాతిమిరంబుగ నుండె దాననో. | |
| 25 | 39 | 4 | వాలంబందునఁ జుట్టి | వాలంబందు బిగించి |
| 30 | 67 | 4 | విభూ ! వినుమీ ! | విభూ ! కనుమీ ! వినుమీ |
| 45 | 27 | 1 | యందున నుంచి | యందు వహించి |
| 48 | 15 | 1 | నీదురాక కతన నినుఁ<br>గనుఁగొంటను | మీదురాక కతన మిముఁ గనుఁ<br>గొంటను |
| 48 | 15 | 4 | లభ్యమాయె సుమ్మి | లభ్యమాయెనయ్య |
| 54 | 52 | 4 | నీ సుతుకున్వచ్చిననాడు | నీ సుతునిం జేరినవాడు |
| 90 | 298 | 2 | మహీ తలమందున<br>నీకు సాటిభూ | మహీ తలమందు త్వదీయతుల్యభూ |
| 114 | 446 | 3 | సీతయు రాముఁడుచెంత<br>వసింపఁగఁ జూడగ<br>నోతుము శోభనమౌ | సీతయు రాముఁడుచెంత వసింపఁగఁ<br>జేరికనందగు చింతచనన్ |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 114 | 446 | 4 | ఖ్యాతి వహించినకార్మ్మకవీరు వివాహము జూచుట భాగ్యమహో | ఖ్యాతివహించిన కార్ముకవీరుని గాంచుటయే శుభకార్యమహో |
| 44 | 25 | 2 | బాంధవుల్ గూడునో గూడరో | బాంధవున్ గూడునొ గూడడో |
| 45 | 27 | 1 | సంస్మృతి యందున నుంచి | సంస్మృతిలో సతముంచి, (లేక) - సంస్మృతియందు వహించి |
| 48 | 15 | 1 | నీదురాక | మీదురాక |
| 48 | 15 | 1 | ననుగను | మిముగను |
| 48 | 15 | 4 | సుమ్మి | నయ్యా |
| 71 | 169 | 4 | దళకా | దళమా |
| 111 | 433 | 4 | రాజులఁ జిక్కి | రాజులుఁ గూడి |
| కృతిసమర్పణము | 6 | 2 | జానకీసుదతి | జానకీమహిత |
| 27 | 54 | 4 | మున్నె ఋక్షపుంగవుండు శౌరి | మున్నెశౌరి ఋక్షపుంగవుండు |
| 65 | 128 | 1 | విశేష | మహిష్ఠ |
| 81 | 237 | 7 | కమలములకు | కమలముల్ |
| 114 | 446 | 3 | చొతవసింపఁగ చూడఁగ నోతుము | చెంత వసించెడి సేవఁ గనన్ గడు శోభనమౌ |
| .. | .. | 4 | కార్మికవీరు.... భాజ్యమహో | మహాత్ముని సన్నిధి భాజ్యమహో |
| 131 | 554 | 4 | దాశరథుఁడు | దాశరథులు |
| 33 | 90 | 3 | ప్రతిభల్ నిర్మూలమౌ | గతి నిర్మూలంబుగా |
| 9 | 9 | 3 | యుండియుంట | చూచుచుంట |
| 10 | 13 | 2 | ప్రతిష్ఠశాశ్వత హాయంబుదు నిల్వదు పొమ్ము నీకికన్ | ప్రతిష్ఠ నిల్వదుసుమీ యిఁక నీకిల శాశ్వతాబ్దముల్. |

అర (ఁ) సున్నలు

| | | | | |
|---|---|---|---|---|
| 2 | 7 | 4 | శృంగారఁ గతులు | శృంగార గతులు |
| 12 | 26 | 4 | నెఁటిఁగె | నెటిఁగె |
| 68 | 152 | 3 | వాఁడ | వాడ |
| 80 | 230 | 4 | జాహ్నవిన్ఁ | జాహ్నవిన్ |
| 93 | 313 | 3 | వీగెఁడి | వీఁగెడి |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 133 | 569 | 1 | చనుఁ గతుల్ | చనుగతుల్ |
| 51 | 39 | 1 | నేనేఁ జాలను | నేనే చాలను |
| 71 | 168 | 6 | ఁదాటినాడు | దాఁటి నాఁడు |
| 71 | 168 | 4 | దాటి | దాఁటి |
| 71 | 165 | 2 | గావగావలెన్ | గావఁ గావలెన్ |
| 70 | 161 | 4 | మైత్రిబొంది | మైత్రిఁ బొంది |
| 70 | 163 | 3 | దీక్షబ్రోవ | దీక్షఁ బ్రోవ |
| 70 | 162 | 4 | విధుల దీర్చి | విధులఁ దీర్చి |
| 1 | 4 | 2 | నటు జేసితి | నటుఁ జేసితి |
| 2 | 6 | 2 | దాటు | దాఁటు |
| 3 | 13 | 4 | బావని | ఁబావని |
| 6 | 36 | 2 | బృథ్వీజ | ఁబృథ్వీజ |
| 6 | 39 | 2 | ద్రుంచి | ఁద్రుంచి |
| 6 | 41 | 1 | భక్తి | భక్తిఁ |
| 8 | 2 | 3 | మేత | మేఁత |
| 8 | 3 | 3 | మెచ్చుగ | మెచ్చుఁగ |
| 9 | 11 | 3 | ప్రాణేశు | ప్రాణేశుఁ |
| 10 | 12 | 3 | గోపమ్మూను | గోపమ్మూనుఁ |
| 11 | 19 | 3 | దన్ను తాను | దన్నుఁ దాను |
| 13 | 38 | 1 | నాట | నాఁట |
| 13 | 38 | 4 | నాడె | నాఁడె |
| 14 | 39 | 1 | నొప్పు | నొప్పుఁ |
| 15 | 47 | 2 | దీర్చుచు | దీర్చుచుఁ |
| 15 | 49 | 3 | దాక | దాఁక |
| 16 | 58 | 1 | గురుడైన | గురుఁడైన |
| 16 | 59 | 2 | వినుడయ్య వినుడు | వినుఁడయ్య వినుఁడు |
| 17 | 3 | 2 | గీర్తన | ఁగీర్తన |
| 17 | 5 | 4 | జూచిన | జూచినఁ |
| 17 | 8 | 2 | బత్తి | బత్తిఁ |
| 18 | 9 | 4 | గాగ | గాఁగ |
| 18 | 11 | 4 | విన్ను | విన్నుఁ |
| 23 | 27 | 2 | బ్రోవన్ | ఁబ్రోవన్ |
| 24 | 30 | 2 | నేచు | నేఁచు |
| 32 | 82 | 4 | జగంబుబ్బగన్ | జగంబుబ్బఁగన్ |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- | --- |
| 34 | 99 | 4 | పట్టుచు | పట్టుచుఁ |
| 43 | 16 | 4 | నిను | నినుఁ |
| 43 | 18 | 1 | నను | ననుఁ |
| 45 | 27 | 4 | నిక | నిఁక |
| 49 | 21 | 1 | వశిష్ఠుని | వశిష్ఠునిఁ |
| 50 | 27 | 3 | భూమిని | భూమినిఁ |
| 52 | 45 | 3 | మెల్ల | మెల్లఁ |
| 56 | 66 | 3 | పీఁడ | పీడ |
| 60 | 97 | 4 | సీమల | సీమలఁ |
| 60 | 98 | 5 | బుడమి | ఁబుడమి |
| 60 | 98 | 7 | గర్మ | ఁగర్మ |
| 65 | 128 | 4 | దాని | దానిఁ |
| 66 | 139 | 3 | ద్రుంచ | ద్రుంచఁ |
| 66 | 139 | 4 | నా కికను | నా కిఁకను |
| 68 | 149 | 2 | గొనె | ఁగొనె |
| 68 | 152 | 3 | వాఁడ | వాడ |
| 69 | 153 | 1 | తత్కథ | తత్కథఁ |
| 69 | 156 | 4 | మధ్య | మధ్యఁ |
| 70 | 158 | 4 | దున | దునఁ |
| 72 | 174 | 4 | గుఱిగ | గుఱిగఁ |
| 73 | 182 | 2 | జంపి | ఁజంపి |
| 76 | 206 | 2 | స్థలి | స్థలిఁ |
| 80 | 231 | 4 | విశాలపురి | విశాలపురిఁ |
| 80 | 232 | 1 | తమ్ముని | తమ్మునిఁ |
| 80 | 232 | 3 | సద్గురుని | సద్గురునిఁ |
| 87 | 274 | 1 | చేయగా | చేయఁగా |
| 92 | 304 | 4 | గాంచి | ఁగాంచి |
| 93 | 314 | 2 | మిమ్ము | మిమ్ముఁ |
| 99 | 353 | 4 | ముట్టగా | ముట్టఁగా |
| 101 | 367 | 4 | గాంత్రు | ఁగాంత్రు |
| 101 | 369 | 4 | నెఱుఁగరట | నెఱుఁగరఁట |
| 107 | 407 | 1 | వచ్చె | వచ్చెఁ |
| 107 | 409 | 6 | నల్వురు | నల్వురుఁ |
| 109 | 415 | 1 | సమూలము | సమూలముఁ |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 110 | 427 | 3 | గంతుని | గంతునిఁ |
| 112 | 437 | 3 | వెలయ | వెలయఁ |
| 115 | 452 | 4 | మోదము | మోదముఁ |
| 118 | 465 | 4 | రామచంద్రుడన | రామచంద్రుఁ డన |
| 118 | 467 | 4 | నెల్లెడల | నెల్లెడలఁ |
| 118 | 468 | 1 | యెన్నడో | యెన్నఁడో |
| 118 | 469 | 3 | ముని | మునిఁ |
| 131 | 555 | 1 | పూల | పూలఁ |
| 132 | 560 | 4 | భరతుని | భరతునిఁ |
| 132 | 563 | 2 | జెల్లు | ఁజెల్లు |
| కృతిసమర్పణము | 5 | 1 | స్రవంతి | స్రవంతిఁ |

## (అ) బండిఱాలు

| | | | | |
|---|---|---|---|---|
| 6 | 45 | 1 | మరచి | మఱచి |
| 6 | 45 | 2 | మరువ | మఱువ |
| 10 | 13 | 1 | వేరు | వేఱు |
| 13 | 38 | 4 | నెరుకపడు | నెఱుకపడు |
| 14 | 43 | 2 | వేరెట్లు | వేఱెట్లు |
| 44 | 24 | 1 | యిపుడారవ | యిపుడాఱవ |
| 66 | 137 | 2 | మరెవ్వరేని | మఱెవ్వరేని |
| 68 | 148 | 4 | నెరుఁగని | నెఱుఁగని |
| 82 | 246 | 4 | వెరపేలా | వెఱపేలా |
| 117 | 463 | 3 | నిందఱలోన | నిందఱిలోన |
| 102 | 371 | 3 | పేరేడి | వేఱేడి |

## అక్షర దోషములు

| | | | | |
|---|---|---|---|---|
| 6 | 43 | 2 | జూచి | చూచి |
| 10 | 18 | 2 | స్వయంభువుడు | స్వయంభవుఁడు |
| 14 | 4 | 4 | ననెదె | ననెడి |
| 17 | 3 | 2, 3 | వింతతో | ఆనతి |
| 18 | 10 | 4 | యెవరివో | యెవరవో |
| 18 | 11 | 1, 2 | ఏముంది.... పోదుగదా | ఏమందు.... మాయదుగా |
| 21 | 14 | 4 | తారణలేదా | తరణము లేదా |
| 24 | 30 | 7 | సోకింప | శోకింప |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 24 | 30 | 9 | తామసము రాజసము లంచె | తామస రజోగుణమ్ములఁ |
| 24 | 30 | 11 | నెగడు | నేచు |
| 25 | 39 | 4 | వాలం బందున జుట్టి | వాలం బందు బిగించి |
| 26 | 44 | 2 | గొడ్రాలి | గొడ్రాల |
| 27 | 50 | 7 | బాలనన్ సేయగా | బాలనం జేయగా |
| 30 | 74 | 2 | ఋశ్యశృంగుని | ఋష్యశృంగుని |
| 31 | 75 | 2 | ఋశ్యశృంగుని | ఋష్యశృంగుని |
| 33 | 90 | 3 | ప్రతిభల్ నిర్మ్మలమౌ | గతి నిర్మ్మలంబుఁగా |
| 33 | 92 | 2 | కృతిభర్తయను | కృతిభర్తయును |
| 36 | 112 | 4 | సంతృప్తిలేమియా | సంతృప్తిలేకయా |
| 37 | 114 | 5 | పావనగంగా ప్రవంతి | పావనగంగా ప్రవంతీ |
| 39 | 126 | 2 | పేరెట్లు, పెట్టు | పేర్లెట్లు, పెట్టి |
| 40 | 132 | 4 | శత్రుఘ్నునై | శత్రుఘ్నుతన్ |
| 40 | 136 | 4 | అందఱతోన్ | అందఱితోన్ |
| 41 | 5 | 1 | నిశిధ | నిశిత |
| 42 | 10 | 2 | దివ్యరూపు | దివ్యమూర్తి |
| 43 | 12 | 4 | సంతతితో నిన్ | సంత నిను నే |
| 43 | 13 | 3 | పుటుకల్ | భవముల్ |
| 43 | 14 | 4 | బగటనే | బగటినే |
| 44 | 22 | 4 | వురుష | పురుష |
| 45 | 26 | 4 | నుంచుకొని | నుంచికొని |
| 45 | 27 | 4 | గనంగ యిక | గనంగ నిఁక |
| 47 | 11 | 1 | బొండెడి | బొందెడి |
| 47 | 10 | 2 | లేకనా | లేకయా |
| 48 | 12 | 1 | యొక్కనాఁడు | నొక్కనాడు |
| 59 | 20 | 1 | దేశికుండు | దేశకుండు |
| 51 | 34 | 1 | మూకయెల్లరు | మూకలెల్లరు |
| 51 | 39 | 1 | నేనేఁ జాలను | నేనేచాలను |
| 53 | 52 | 2 | ఆయితముం | ఆయతముం |
| 53 | 46 | 2 | ఁదారణఁ | సద్గతి |
| 56 | 65 | 4 | కాల | జన్మ |
| 63 | 115 | 3 | క్రోధ | క్రుద్ధ |
| 65 | 127 | 4 | జీవిమై | సానువై |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | ఒప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 70 | 162 | 3 | దిక్కెల్లరు | దిక్కెల్లను |
| 71 | 166 | 2 | బూసిరి | పూసిరి |
| 71 | 168 | 3 | మొలియింప | బొలియింప |
| 73 | 176 | 1 | నుశిక్షణ | సుశిక్షణ |
| 73 | 179 | 3 | భీభత్సంబు | బీభత్సంబు |
| 73 | 179 | 4 | మనిపితింఁన్ | మనిచితింకన్ |
| 74 | 186 | 1 | తథాస్తని | తథాస్తనె సురలు |
| 75 | 191 | 4 | జూడనెంతువో | చూడనెంతువో |
| 76 | 196 | 2 | బ్రహృష్టుఁడై | ప్రహృష్టుఁడై |
| 76 | 201 | 1 | ప్రజకు | ప్రజను |
| 76 | 203 | 4 | బుట్టు యీ | పుట్టు నీ |
| 77 | 208 | 3 | నాభా | నాభ |
| 78 | 215 | 1 | నత్తింట | నత్తింటి |
| 84 | 257 | 3 | గరుణమునన్ | గరుణ మెయిన్ |
| 86 | 270 | 2 | సుపారాంగియై | సురూపాంగియై |
| 90 | 298 | 2 | మందున | మందెట |
| 91 | 300 | 4 | దపసు | దపము |
| 91 | 302 | 4 | ఇచ్చిన | నిచ్చిన |
| 91 | 301 | 4 | యతఁడు | యితఁడు |
| 91 | 302 | 1 | శునశ్శేపు | శునశ్శేపు |
| 93 | 316 | 4 | ద్రాక్కరి | ద్రాక్కరి |
| 93 | హెడ్డింగు | 3 | ప్రశంశ | ప్రశంస |
| 94 | 322 | 1 | థనువు | ధనువు |
| 94 | 322 | 3 | జనకుపంపున | యిటకుఁ జయ్యన |
| 94 | 318 | 2 | రాచార్య | రాచార్యు |
| 95 | 324 | 4 | సేతయోనిజను | సేతునీయమకు |
| 95 | 325 | 2 | థనువు | ధనువు |
| 95 | 325 | 2 | జూప | జూపు |
| 95 | 326 | 3 | తెచ్చెడి | మోసిన |
| 97 | 340 | 1 | బంపెనా | పంపెనా |
| 98 | 347 | 3 | శాంకరి | శైవము |
| 100 | 358 | 4 | జొచ్చె | చొచ్చె |
| 104 | 389 | 2 | నంతకంత | నంతనంత |
| 108 | 411 | 3 | మెల్లయును | సుంతయును |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 108 | 411 | 3 | దెల్ప | తెల్ప |
| 110 | 424 | 1 | ధర్మతుండు | ధర్మరతుండు |
| 110 | 424 | 4 | యా నృపుని | నా నృపుని |
| 111 | 438 | 4 | యొండు మరొండు | యొర్తు మరొక్క |
| 113 | 441 | 4 | సధ్వని | సుధ్వని |
| 113 | 446 | 2 | యుటు | యిటు |
| 117 | 463 | 2 | దోఁచెడిని | వోచెదరు |
| 120 | 481 | 2 | బోదు | పోదు |
| 122 | 496 | 2 | విపులాజ్ఞాత | విపులాజ్ఞాక్ష |
| 124 | 511 | 1 | జైలఁగి | ల్చెలఁగి |
| 127 | 530 | 3 | జంఢఁగల్గినాఢ | చంఢఁగల్గినాఢ |
| 132 | 555 | 2 | వాచనము | వాచికము |
| 133 | 566 | 1 | రారాజ | రారాజు |
| 134 | 569 | 1 | భస్మమా | భస్మమై |
| 135 | 11 | 2 | లహహా | లహహో |
| 134 | 4 | 1 | గడచి | కెడచి |
| 134 | 569 | 1 | మహాల్యకీతి | మహాల్యకువలె |
| కృతిసమర్పణము | 4 | 3 | అంకిత | సంకిత |
| 82 | 243 | 2 | పూర్వమైన | పూర్వయైన |
| 24 | 31 | 1 | "రావణాస్వస్తి" | రావణా : "స్వస్తి" |
| 5 | సమీక్ష | 13 | తనూభిః | తేన లభ్యః |
| 6 | | 1 | వాహామితి వా ఙనే | స్మేతి చ యా చ తే |
| 8 | | 29 | నిషాదార్థకమగు 'కూ' | నిషేధార్థకమగు 'మా' |
| 9 | | 16 | నతస్వేశౌ కశ్చన కస్య | న తస్యేశే కశ్చన తస్య |
| 9 | | 29 | రక్షించు | రక్షించుఁ |
| 37 | 13 | 8 | హేష్వం | హ్లీష్వ |

వృత్తములు

| | | | |
|---|---|---|---|
| 28 | 59 | వృత్తం | జయప్రభ |
| 23 | 26, 27 | రథోద్ధ వృత్తములు | స్వాగత వృత్తములు |
| 40 | 130 | తోటకం | తోదకం |
| 61 | 100 | తోటకం | తోదకం |
| 88 | 279 | తోటకం | తోదకం |
| 114 | 447 | అర్కుటం | నర్కుటం |
| 121 | 492 | తోటకం | తోదకం |

★

# గోవిందరామాయణము - సీతారామమ్

1. పద్యములు సులభశైలిలో రసపరిప్లుతములుగా నున్నవి.

—*మాడపాటి హనుమంతరావు*

2. "సీతారామమ్" అను పద్యకావ్యము, భాషాసరళతను, భావసౌష్ఠవతను, వెలార్చుచున్నది. మధురరసమును స్రవించుచు పాఠకుల కానందముగూర్చు నీ గ్రంథ మమూల్యము.

—*కల్లూరి చంద్రమౌళి*

3. సరళశైలిలో పండిత పామరజన రంజకముగానున్న యీ గ్రంథం ఆంధ్ర భాషామతల్లికి మరొక్క భూషణం కాగలదని నా విశ్వాసము.

—*బి. యస్. మూర్తి*

4. "గోవిందరామాయణం" గోదావరీ పావనోదారవాః పూరమువలె; తియ్యగా కమ్మగా తెనుగు ప్రజల హృదయసీమలలో ప్రవహిస్తున్నట్లు ఉంటుంది.

—*యస్. బి. పి. పట్టాభిరామారావు*

5. ఆచార్యులవారు, శ్రీరాముని వర్ణించు నెప్పట్టుననేని ఆత్మసాక్షాత్కృతమైన దివ్యస్వరూపమును మనకు జూపింప యత్నించిరేగాని వేఱుగాదు.

—*ఆచార్య విద్వాన్ సోమయాజి*

6. ఆచార్యులుగారు........నేడు రామాయణమును, రమ్యాక్షర పరాయణంగా రచించారు ... వారి రచనలు భాషలో బాగా పరిచితములైనవి; వాఙ్మయంగా నిలిచినవి. నిలుస్తవి .......

—*ఆచార్య రాయప్రోలు సుబ్బారావు*

7. భాస్కరాదుల కావ్యమార్గమును భక్తి శిఖామణియైన కంచెర్ల గోపన్నగారి శతక మార్గమును - తమ హృదయమునందు వీరు ప్రత్యక్షీకరించుకొనిరి.

—*ఖండవల్లి లక్ష్మీరంజనం*

8. సరళసుందరమైన వాల్మీకి రచనమందలి సౌలభ్యాన్ని పుడికి పుచ్చుకొన్నది మీ రామాయణం ...

—*కాటూరి వేంకటేశ్వరరావు*

—*దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి*

9. కవి ప్రతిభా సమన్వితుడు. ఇందలి కవిత్వము, ద్రాక్షాపాకమున శయ్యాసౌకుమార్యముతో ననేకరీతుల నడిచినది.

—*ముదిగొండ వీరభద్రమూర్తి*

శ్రీ

# గోవింద రామాయణము

## పాదుకా పట్టాభిషేకము

(అయోధ్యాకాండ)

శ్లో॥ నిఖిల భువన జన్మస్థేమ భంగాది లీలే।
వినత విపధ భూత వ్రాత రక్షైక దీక్షే।
శ్రుతి శిరసి విడప్తే బ్రహ్మణి శ్రీనివాసే।
భవతు మమ పరస్మిన్ శేముషె భక్తిరూపా॥

—( శ్రీభాష్యము నుండి )


కృతికర్త:

ఆత్మకూరి గోవిందాచార్యులు

హైదరాబాదు.


Rs 1

## సప్తాశ్వాసము

## భక్త్యాశ్వాసము

## ప్రపన్నాశ్వాసము

## పాదుకాశ్వాసము

# [ తప్పొప్పుల పట్టిక - 5వ పేజీ తరువాయి ]

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 3 | 18 | 3 | నివఀరంబుగ | వివఀరంబుగ |
| 3 | 18 | 4 | మిమ్ము | మిము |
| 30 | 69 | 4 | నా వరంబులన్ | ఆ వరంబులన్ |
| 33 | 90 | 1 | రథ ఘోషణము | రథ చక్రమును |
| 35 | 102 | 3 | యౌవ్వనము | యౌవనము |
| 36 | 110 | 2 | వాంఛితుఁడైన ప్రియుండు | వాంఛకుఁ జిక్కిన వాఁడు |
| 37 | 113 | 2 | సరసీరుహ సామ్య | సరసీజ సమాన |
| 37 | 116 | 4 | వాంఛితార్థియై | వాంఛితార్థుఁడై |
| 37 | 117 | 1 | ఎవరోసీ | ఎవరోసీ |
| 39 | 127 | 3 | దుర్నీతివహించి | దుర్నీతిపరుండు |
| 45 | 166 | 2 | నాత్మజుఁగంటెను | నాత్మజుకంటెను |
| 52 | 214 | 2 | సుకృతున్ | సుకృతిన్ |
| 53 | 220 | 2 | హితుఁడు, రతుఁడు | రతుఁడు, హితుఁడు |
| 55 | 235 | 2 | యంతము | యంతయు |
| 58 | 253 | 1 | హృది | హృద్ |
| 68 | 50 | 4 | బదింబదిఁ జూతురు భక్తు లెల్లరున్ | తదేకమతిం గనుచుండి రెల్లరున్ |
| 69 | 52 | 3 | ద్యుతున్ | ద్యుతిన్ |
| 71 | 65 | 3 | మెఱుంగక | మెఱుంగమి |
| 84 | 164 | 4 | సంభావింతువే | గూర్పన్ జూతువే |
| 88 | 195 | 3 | మహాభయ | భయంకర |
| 93 | 225 | 2 | దలఁతు నిన్ను | దలఁచుఁ దల్లి |
| 110 | 334 | 1 | నాః | యీ |
| 116 | 371 | 1 | కనులెత్తి | ఁ గనులెత్తి |
| 120 | 408 | 1 | విహితంబుఁగా | హితంబుగా |
| 129 | 467 | 2 | నీయ | యీయ |
| 131 | 482 | 3 | మయోధ్యయగు | మయోధ్యయగును |
| 138 | 527 | 3 | ఆర్యుఁడ | ఆద్యుఁడ |
| 144 | 27 | 2 | నిన్ | నన్ |
| 146 | 42 | 3 | రంజిత | రంజక |
| 154 | 96 | 1 | కిరణాల | కిరణాళి |
| 161 | 140 | 3 | నికటంబున్ విడజేసె | నికటత్వంబును బాపె |
| 164 | 161 | 4 | నరకాంతుఁడు | మహీకాంతుఁడు |
| 171 | 207 | 3 | దలంచు మైత్రి | దలంచును మైత్రి |
| 171 | 209 | 4 | ప్రాజ్ఞుఁడైన | తపసియైన |
| 175 | 234 | 1 | జలకంబు | సలిలంబు |
| 175 | 236 | 1 | జలకంబు | సలిలంబు |

(మిగతా— సమీక్షలు 42వ పేజీలో)

# శుభాకాంక్షలు

**Dr. S. RADHAKRISHNAN,**
*(President of India)*

*Dear Sri Govinda Charyulu,*

I wish success for your Publication.

New Delhi. 10-4-63.

డా॥ యస్. రాధాక్రిష్ణన్,
రాష్ట్రపతి.

శ్రీ గోవిందాచార్యులవారికి,

మీ ప్రచురణము విజయవంతముగుగాక.

న్యూఢిల్లీ. 10-4-63

---

"పద్మభూషణ", "ఆంధ్ర పితామహ"
శ్రీ మాడపాటి హనుమంతరావుగారు
[సభాపతి-లెజిస్లేటివ్ కౌన్సిల్, ఆంధ్రప్రదేశ్].

శ్రీ గోవిందాచార్యులవారి సన్నిధికి

తమరు నాకనుగ్రహించిన రామాయణము యొక్క పాదుకా పట్టాభిషేక భాగమును చదివి చాల చాల ఆనందించితిని. మీ విశ్రాంతి కాలమును ఇట్టి ఉద్గ్రంథ రచనమునకు వుపయోగింపగలిగిన మీరు నిజముగా ధన్యులు. అచ్చటచ్చట తమరు యిచ్చిన Foot-notes విజ్ఞానప్రదములైనవని మనవి చేయుచున్నాను. భాష ఎప్పటివలె చాల సులభముగాను, సుబోధకముగను ఉన్నందున సామాన్య భాషా జ్ఞానము కలవారు కూడ చదువుకొని లాభము పొందగలరు.

విధేయుఁడు,
మా. హనుమంతరావు.

హైదరాబాదు, 29-3-63.

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు
అనంతపురము.

ఆర్యా,

మీరు దయతో పంపిన గోవింద రామాయణమందలి పాదుకా పట్టాభిషేక ఖండము ప్రతి అందినది. ధన్యోస్మి.

మీ సహజసిద్ధమైన భక్తి, ధారాళమైన శయ్య, కమనీయముగా నున్నవని, మీ శ్రీరామ కైంకర్యము నభినందించుచున్నాను.

నమస్సులు.

భవదీయుడు,
రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

3-5-63.

# PREFACE

*By*

**Sri Boorgula Ramakrishna Rao Garu,** M. P.
(Ex-Governor, Kerala and Uttara Pradesh)

I am grateful to Shri Atmakuri Govindacharyulu Garu, for having done me the honour of asking me to write a preface to his Telugu Kavya "Govinda Ramayanamu". He is one of the stalwarts of freedom fighters who worked in close association with leaders like the late Pattabhi Sitharamayya, the late Andhra Kesari Prakasham Pantulu of Andhra Pradesh. He had the benefit of close association also with Bapuji and all other Indian leaders and courted imprisonment several times. After independence, however, he has more or less devoted himself to the pursuit of literary activities for which he had a flair even from his boyhood. His up-bringing in a family which was famous for its learning and culture and his adherence to the principles of Shri Vaishnava sect of Shri Ramanuja, naturally nurtured in him deep feelings of devotion to God and a philosophy of renunciation at the feet of the Almighty. It is this background which evidently and admittedly prompted Shri Govindacharyulu to compose a poetical work on the life of Shri Rama which has been a perennial source of inspiration to several devoted Indian Poets and writers.

The story of Ramayana is of far greater importance to the people of this country than the Greek and Latin epics to the Western countries. Far greater sacredness is attached to the life and story of Shri Rama, than to the heroes of any other world epic that can be thought of. Shri Rama is not only the embodiment of all noble virtues that are associated with the highest beings but he is also

considered to be the incarnation of Vishnu born as a human being in order to destroy Ravana and the other Asuras who were creating havoc on earth. Poets and Writers, in this country, have always held the belief that writing or hearing the story of Ramayana, is a sure step towards salvation or self-realisation. True to this faith, Shri Govindacharyulu has added one more work on Ramayana in Telugu to the several poetic works which already exist on the theme. The story is the same but its treatment differs from poet to poet and writer to writer. The mental outlook, the religious faith, the extent of learning, and the quality of style, differ from one another. With the background that I have mentioned, Shri Acharyulu has for his object the desire to place at the feet of Shri Rama the feelings of devotion which surge in his heart and bow to them in complete renunciation according to Shri Vaishnava faith. I had no doubt that he has succeeded in his object and presented a work which deserves hearty welcome from the Telugu readers.

The treatment of the story of Ramayana by this author differs from many others, in the main religious outlook which characterises the work. While Shri Rama, is depicted as a man-God or a God-man, he always forgets his Divinity. He has to be reminded of it, so also his mother Kausalya, his brothers, Lakshmana and Bharata, and above all his divine consort, Seeta. All of them forget that Shri Rama is Divine. They pour out their natural human love on him and have to be reminded, whenever occasion demands that Shri Rama, is not only a son, a brother, and a husband to them, respectively, but is God incarnate himself and that he has a purpose behind this human life. When they are reminded of this fact they all become devotees and forget their personal relationships. They fall at his feet and pray to him as to God. They place themselves at his feet in complete renunciation, and

become "Prapannas" i. e those who have adopted "Prapatti". This is the main difference in outlook which characterises the work of the present author. He follows the style of the famous Bhakta poet Pothana in many places. His work is not a translation nor does he closely follow the narrative of Valmiki. He has divided "Ayodhyakanda" which is the subject of this preface, into six "Asvasas" or chapters, which indicate the main points which the author desires to stress on his readers. All over there are beautiful stanzas, expressing sentiments of sincere and heartfelt devotion towards Rama, couched in sweet language, containing many appropriate examples of Telugu idioms. The style is flowing and natural and nowhere, has any attempt been made to embellish artificially, the language. at the cost of simplicity and naturalness. I commend this work to Telugu readers and hope that Shri Govindacharyulu will complete the series of the story of Ramayana which he has undertaken to write. May Shri Rama shower all His blessings on him and grant him a healthy and devoted life to complete his mission.

Barkatpura,
Hyderabad.
15-6-'63.

*B. Ramakrishna Rao*

# పీఠిక

## డాక్టరు బూర్గుల రామకృష్ణరావు గారు, M. P.

పండితరాజ పంచామృతము - విష్ణుశతకము - సారస్వత వ్యాసావళి

ఇత్యాది గ్రంథకర్తలు;

కేరళ, ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నరు.

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారు భారత స్వాతంత్ర్య సమర యోధులలో నగ్రశ్రేణికిఁ జెందినవారు. సత్యాగ్రహోద్యమములలో పాల్గొని, యనేక సారులు కృష్ణజన్మస్థానము నలంకరించి, కాంగ్రెసు సంస్థ యొక్క అగ్రనాయకు లందఱకును సుపరిచితులై చేదోడువాదోడుగా వారితోపాటు సమర శంఖారావమును పూరించి యువకుల కనేకులకు మార్గదర్శకులై, త్యాగమయ జీవితమును గడిపిన నాయకులు. అనాసక్తియోగము నాచరణపూర్వకముగా నవలంబించిన కర్మయోగులు, మానధనులు. త్యాగముతోపాటు భక్తి వారికి వెన్నతో బెట్టిన విద్య. అనువంశికముగా లభించిన ఆర్ష విద్యావాసనలు, సాహిత్య సంప్రదాయములు, భగవద్భక్తి ప్రపత్తులు. వారి సుగుణగణములలోని మేలిబంతులు. వారు రచించిన 'గోవింద రామాయణము' నకు తొలిపలుకు వ్రాయు గౌరవ సౌభాగ్యములు నాకు లభింపచేయుటకు కారణము కేవలము వారి వాత్సల్యభావమే. వారికి సప్రశ్రయముగా నా నమోవాకముల నర్పించు చున్నాను.

ఆదికవినాటినుండి నేటి వరకు శ్రీమద్రామాయణ గాథ భారత దేశమునందు సుస్థిరమగు స్థానము నాక్రమించుకొనుటయే కాక సర్వ ప్రపంచమునందును విశ్వ సాహిత్యమందలి పరమోదాత్తమగు మహాకావ్యమనియు, ఇతిహాసమనియు సువిఖ్యాత మైనది.

యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే,
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి॥

అని భగవానుడగు బ్రహ్మ యాశీర్వదించి "కురు రామ కథాం పుణ్యాం, శ్లోకబద్ధాం మనోరమాం" అని ప్రాచేతసుల కాదేశ మొసంగినటులు శ్రీమద్రామాయణములో తెలుపబడి యున్నది. (బాలకాండ సర్గ (2) శ్లో॥ 36-37) కనుక రామ కథామృతము నెందఱెన్నెన్ని రీతుల నెన్నెన్ని పాకములలో నందించినను తక్కువే. పద్య కావ్య ములు-ద్విపదలు-పాటలు-గేయములు-సంకీర్తనములు-ఎన్నియో కలవు. ఐనను రామ కథా కథనము ముక్తికారకమనియు, భవతారకమనియు విశ్వసించుచు శ్రీ ఆచార్యుల

వారు 'గోవింద రామాయణ' రచనకు పూనుకొని మూడు కాండములను పూర్తి గావించి యున్నారు. మొట్టమొదట ఉత్తరకాండ కథా భాగమును రచించి తరువాత బాలకాండమును వ్రాసి అయోధ్యాకాండమును 'పాదుకా పట్టాభిషేక' మను నామాంత రము నొసంగి మూడవ కావ్యముగా రచించియున్నారు. తమ రామాయణ రచనా ప్రయోజనమును రచయితలే ఈ క్రింది పద్యమునందు తెలిపియున్నారు.

చ॥ చదివిన పాండితీగరిమ • సర్వము చాటగ గాదు, కాదహో!
ముద మలరంగ సత్కవిగ • బూజల నొందగ గాదు, కాదహో!
సదమల సర్వశాస్త్రముల • సారము శ్రీ రఘురాము పూజగా
హృదయ సమర్పణమ్మున, దద • రింప దలంచి రచింప నెంచితిన్.

ఈ పవిత్రోద్దేశమును నెరవేర్చుకొనుటలో నాచార్యులవారు సఫల మనోరథు లైరని నిస్సందేహముగా వచింప వచ్చును.

శ్రీమద్రామాయణము శ్రీ వైష్ణవ సంప్రదాయ ప్రకారము పరమోత్కృష్ట మైన పారాయణ గ్రంథము. సకల కల్యాణగుణ సంపూర్ణులైన చక్రవర్తి తిరుమగ నార్ (శ్రీరామచంద్రుని) యందు మూర్తీభవించిన సుగుణగణములు మానవజాతికే యాదర్శ ప్రాయములు. ప్రాచీన కాలమునుండి వేదోక్త మానవ ధర్మములను భారతీయ ప్రజలందు ప్రగాఢముగా నెలకొల్పి వ్యక్తిగత సాంఘిక జీవనమును కౌటుం బిక వ్యవస్థల నైతికాదర్శములపై మలచుచు వచ్చినది రామాయణగాథ. దుష్ట నిగ్రహము-శిష్ట రక్షణ-సత్య వాక్పరిపాలన-పితృభక్తి-భ్రాతృప్రేమ-ఏకపత్నీవ్రతము-పాతివ్రత్యము-క్షమ-దయ-శౌచము-శరణాగత రక్షణ మున్నగు మహోదాత్త సుగుణ ముల కాలవాలములైన రామాయణ మహాపాత్రలు మానవజాతి కాదర్శప్రాయములైన ఉత్తమ వ్యక్తులు.

కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః •
చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః
విద్వాన్ కః కః సమర్థశ్చ కశ్చైక ప్రియదర్శనః ॥

'ఏత దిచ్ఛామ్యహం శ్రోతుం' అని నారద మునిపుంగవుని విచారించి వాల్మీకి మహర్షి రామ కథను తెలిసికొనెను. కాబట్టి రామాయణ కథలో మూర్తీభవించిన వ్యక్తు లనేక సుగుణముల కాకరములైన మహాపురుషులు. పవిత్రమూర్తులు. వారి చరిత్రల నభివర్ణించుటలో శ్రీ యాచార్యులవారు ఆదికవి ననుసరించియే గొప్ప యౌచిత్య మును ప్రకటించియున్నారు. కరుణారసము పొంగిపొరలుచుండు అయోధ్యకాండలో ననేక సన్నివేశములం దుదాత్తభావ పరిపోషణము చక్కగా గావించియున్నారు.

ఇందుల కుదాహరణములు గ్రంథమున కోకొల్లలుగా గలవు. గ్రంథ విస్తరభీతిచే వానిని పొందుపరచక సహృదయుల యనుభూతికై వదలుచున్నాను. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రకారము భక్తి జ్ఞాన వైరాగ్యములలో భక్తి ప్రధానమైనది. 'యామే భక్తః సమే ప్రియః' ॥

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ ॥

అను గీతాంత సమాశ్వాస వచనము భగవద్గీతోపదేశము యొక్క కీలకము - సారాంశము. అందునుండియే 'శరణాగతి' లేక 'ప్రపత్తి'యను ఆత్మ సమర్పణ సిద్ధాంత ముద్ధరింపబడినది. శ్రీమద్రామాయణ మీ సిద్ధాంతములను సోదాహరణముగా నిరూపించుచున్నది. కావుననే యాచార్యుల వారు,

తే॥ భక్తి రసము పునాదిగాఁ బాదుకొలిపి
కట్టెదఁ బ్రపత్తి సౌధమీ కావ్యమందు

యని తమ యుద్దేశ్యమును వెల్లడించినారు. మఱియును

ఉ॥ ధీరమతిన్, బ్రపత్తినిఁ ద్వదీయ పదాబ్జములందు మ్రొక్కి సం
సార మహాబ్ధితారణము, సర్వశుభాస్పద మంత్ర రాజమౌ
తారకమున్ జపించుచు, సదా హృది నిల్పుచు నిన్ను నీ మహో
దార కథా సుధాలహరిఁ దాండవమాడెద దన్మయుండనై ॥

అని ప్రతిజ్ఞ యొనర్చినారు.

ఆచార్యులవారి రచన యనువాద మసలే కాదుగదా ! కేవల మనుసరణమును కాదు. కథా కథనమును, రచనా విధానమును వీరి "స్వేచ్ఛానుగతిని" చాటుచున్నవి. నన్నయ, తిక్కన, పోతనాదుల విధానము ననుసరించి కథా సామగ్రిని రసావిష్కరణమున కనుగుణముగా నుపయోగించి రసవంతమగు స్వతంత్ర కావ్యమనదగునట్లు రచించియున్నారు. మూలమునం దయోధ్య కాండము (119) సర్గలలో పూర్తియైనది. ఆచార్యులవారు కావ్యరచనాపక్కి ననుసరించి ఆరాశ్వాసములలో గ్రంథమును విభజించిరి. (1) రాజ్యాశ్వాసము (2) మాయాశ్వాసము (3) సత్యాశ్వాసము (4) భక్తాశ్వాసము (5) ప్రపన్నాశ్వాసము (6) పాదుకాశ్వాసము. ఈ యాశ్వాసముల శీర్షిక లయోధ్య కాండమందలి కథా విషయములను రచయితలే దృక్పథముతో గమనించిరో చెప్పక చెప్పుచున్నవి. రాజ్యాశ్వాసము మిగుల చిన్నది. వశిష్ఠ నారదులు రాముని సందర్శించి స్తుతించుటతో నంతమగుచున్నది. మంథర జన్మ వృత్తాంతము నుండి దశరథుడు కైకకు వరము లిడువరకు గల కథా భాగము మాయాశ్వాసమను పేరుతో

గ్రథింపబడినది. శ్రీరాముడు మాయామానుష విగ్రహుఁడైన నారాయణుఁడను విషయమును స్పష్టీకరించుటకై ఈ శీర్షిక నొసంగి నట్లాశ్వాసారంభ మందలి క్రింది పద్యమే తెలుపుచున్నది.

మాయను సృష్టించుచు, నా
మాయనె జన్మించి, ప్రకృతి మాయకులోనై
ధ్యేయుఁడవై మసలెడి, నా
రాయణ! త్వ దనంత గుణము, లాఁయ వశమే॥

ఈ యాశ్వాసమునందు రసవంతములైన ఘట్టము లనేకములు గలవు. సాకేత పౌరుల రామ సందర్శనాభిలాషతో నత్యాశ్వాస మారంభమై శ్రీరామ వన ప్రస్థానము వరకు గల కథలో ముఖ్యభాగమునందు సత్య వాక్పరిపాలనము యొక్క ప్రాధాన్య ముపదేశింప బడినది కనుక నా శీర్షిక యివ్వబడినది. వన ప్రస్థానమునుండి భరత విలాపమువరకు పౌరులు, మునులు, దశరథుడు, మాతలు, సీతా లక్ష్మణులు, గుహుడు మున్నగు వారందఱు శ్రీరాముని యెడలఁ దమకు గల భక్తి విశ్వాసములను వెల్లడించు ఘట్టములు భక్త్యాశ్వాసము క్రింద చేర్చబడినవి. భరతుడు రాజ్యమును నిరాకరించి భరద్వాజాశ్రమ పథమునుఁజేరి పాదుకల గ్రహించి గృహోన్ముఖుడగు వరకు గల కథా భాగమునందు, భరతుడు శరణాగతుడైన ప్రపత్తి ఘట్టము ముఖ్యమైనది. కావున నీ యాశ్వాసము ప్రపన్నాశ్వాసమను పేరఁ బరగినది. మిగత కొలది భాగమున పాదుకా గ్రహణానంతరము భరతుని రాజ్యపాలనా విధాన మభివర్ణింప బడినది కనుక పాదుకాశ్వాసమను శీర్షిక క్రింద గ్రథితమైనది. ఆశ్వాసాంత పద్యములన్నియు శ్రీ ఆచార్యుల వారి పరమ భక్తి ప్రపత్తుల నుద్ఘోషించుచు శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు జెందిన యాళ్వారాదుల సూక్తులను స్మరింప జేయుచున్నవి. ఆచార్యులవారిది ధారాళమైన శైలి, ద్రాక్షాపాకము. చంపకోత్పల మాలాది వృత్తములు గంగాఝరులవలెఁ బ్రవహించినవి. అచ్చటచ్చట ద్విపదలు వింత సొబగును సంపాదించినవి. సహజములైన భావములు, సరళమైన భాష. ఎక్కడను అలంకారములను కృతకముగా జోడించలేదు.

"చ. వడిగల ధారతో మధురభావ పరంపరలన్, మృదూక్తులన్
గడగడ నిక్షుపానకము గైకొని ద్రావునటుల్ రచింతు"

నని యారంభముననే వచించినారు. మధురభావపరంపరలను వడివడిగా వ్యక్తీకరించునపుడు సహజముగా బహిర్గతమగు భాష యప్రయత్నముగా నే తొడవులు దొడిగికొని ప్రత్యక్షమగునో యవియే యలంకారములు. గ్రంథమునం దామూలాగ్రము ప్రతి పుటయం దాచార్యులవారి 'వడిగల ధారకును' 'మధురభావ పరంపర'కును, 'సహజ మృదూక్తులకును' ఉదాహరణములు కొల్లలుగా కనిపించును.

రామ పట్టాభిషేకవార్త సకలజనులకు సంతసంబు చేకూర్చినను దివిజులకు మాత్రం మది వగ దెచ్చిపెట్టగా వారు వాగ్దేవిని దర్శించి ఈ విధముగా చెప్పుకుంటారు.

ఉ॥ మాకు వరంబునిచ్చి పరిమార్పఁగ రావణు, జన్మ మెత్తియున్ లోక విభుండు, మాయఁబడి, లోకులు మెచ్చ, నయోధ్య రాజ్యమున్ చేకొన నుంచె విస్మృతిని".

చ॥ వనమున కేగకున్న రఘువర్యుఁడు రావణు జంపుటెట్లు? సీతను వని రావణుండు తన ఘారుణికిన్ గొనిపోవు టెట్లు? బర్విగల పెక్కు రాక్షసుల పెంపడగించుట యెట్లు? భారతీ!

అని వాపోవుచున్నారు. సహజమైన భావము. సరళమైన భాష. వాగ్దేవియొక్క సమాధానము నట్లే యున్నది.

ఉ॥ మీపని దీర్ప, రాఘవుని మేదినికిన్ యువరాజు సేయఁ బో
భూపుని యత్నమున్, విఫలమున్ బొనరింపఁగ నొక్క కుబ్జయే
యోపు, నయోధ్య నావడతి, యుండెఁగదా యదె మందరాఖ్యతో
నాపెయు కక్షఁ దీర్చికొను, నాతఁడు నేఁ డిల నేలఁజాలునే?—

ఇందులో మంథరా జన్మరహస్యము సహజముగా బైలుపడినది.

దశరథుడు కోపగృహమందు కైకతో 'నీవు కోరిన ఏ వరమునైన నిత్తు'నని శపథము చేయుచున్నాడు.

శా. ఏ రామున్ గనకుండ నేనొక క్షణం, బేనిన్ మనం జాలనో
ఏ రాముండు మదీయ ప్రాణమునకే యెంచన్ గడున్ మిన్నయో,
ఏ రాముండు సదా ప్రియుం "డతనితోడే" సుమ్మిదే బాస; నీ
గారాబం బది యేమొ తెల్పఁగదవే, కంజాక్షి నే తీర్చెదన్.

చక్కని నుడికారము. ప్రియతముడైన రాముని 'తోడు'గా బాసచేసి దానినే మఱింత బలపరచుటకై నొక్కి చెప్పుచున్నాడు.

చ॥ పరమ హితాళినిన్ సకల బాంధవులన్, మఱి ప్రాణమేనియున్,
భరతుని వాని తమ్ములను బాసినఁ బాయఁగవచ్చుగాని, నా
వరగుణు రామచంద్రు నెడఁబాయఁగఁ జాలను, "వానితోడు" నీ
వర మదియేమొ తెల్పు మిఁక, భామరో! తీర్పఁగ బాస చేసితిన్.

దశరథుని యాజ్ఞగా వనవాస మాదేశింపబడి యంగీకరించిన రాముడు కుపితుడైన లక్ష్మణుని శోకసంతప్తయైన కౌసల్యను సమాధానపఱచి, కైకపై వీరికి సహజముగా జనించు యాగ్రహమునుఁ దొలగించుటకై కర్మ సిద్ధాంతమును ప్రవచించు

పద్యములు (పుట 86-87 పద్యములు 181-188) రాముని క్షమాగుణమును చక్కగా పరిపోషించుచున్నవి.

ఈ కావ్యమునందు 'భక్తియొక్క పునాదులపై ప్రపత్తి సౌధము' కట్టబడినది. కనుక కౌసల్య, సీత, లక్ష్మణుడు, భరతుడు మున్నగువారు శరీర సంబంధములు కల బంధువులేకాక యాత్మ సంబంధులగు భక్తులు ప్రపన్నులు కూడను. కౌసల్యయందు మానవ సహజమైన మాతృప్రేమ యొకవంక లాగుచు ప్రాకృతములగు సంతాప విలాప భావనల నుద్రిక్త పరచుచుండ, మధ్య మధ్య శ్రీరాముడు మాయామానుష విగ్రహుడైన శ్రీమన్నారాయణుని యవతారమూర్తి యను జ్ఞానోదయమగుటచే, భక్తి ప్రపత్తి భావన లావహించుచు తత్తదుచితములగు చేష్టలందు పరిణతము లగుచున్నవి. కౌసల్య ప్రపత్తి ఈ విధముగా వర్ణితమైనది.

ఉ॥ సకల మంగళరూపంబు స్వాంతమందు
పాదుకొన నిల్పె కౌసల్య భాగ్యమేమొ
పుత్రు తనువున గంధంబు పూసి పూసి
అంబ యంతఁ బ్రదక్షిణ మాచరించు.

అటులనే—

తే॥ భక్తభక్తుడు విడలేడు భక్తురాలి
భక్తురాలును విడలేదు భక్తవరదుఁ
బోవుచుఁ బ్రదక్షిణంబున మూఁడు మార్లు
సేవ సాయించి సేవించు శ్రీవిభుండు.

మఱియు—

తే. రాము విడనాడఁజాల దా రామమాత
మర్కటకిశోరవిధమున మాత యొప్పు
సంతతిని నోటఁ బట్టు మార్జాలగతిని
తల్లి విడనాడి చనలేడు దాశరథియు.

ఈ మర్కటకిశోర మార్జాలకిశోర న్యాయములు ప్రపత్తి సిద్ధాంతము యొక్క అంగములు.

సీతయు 'నేను పతివ్రతయగు భార్యను. భర్తృ విశ్లేషమును భరింపలేను. వనమునకు వెంటదీసికొని పొండ'ని ప్రేమానురాగములను, ధర్మములను వక్కాణించుచు వేమాఱులు ప్రార్థించినది. పిదప 'నేను భక్తురాలిని. నా సేవలఁగొని కృతార్థురాలినిఁ జేయు'మని బ్రతిమాలినది. తుదకు ప్రపన్నురాలై

తే॥ "అన్యథా శరణం నాస్తి" యనెను సీత
జన్మధర్మార్థ మెఱిగిన జనక పుత్రి
భక్తవత్సలుఁ డా రామభద్రుఁడంత
కరుణ వెదజల్లి కాంచె నా కాంత సతిని ॥

తే॥ స్నేహ మనన ప్రణయ రాగ చిత్తగతిని
కాంత విశ్లేష విరహ దుఃఖంబుఁ బొంది
యంత అనురాగపూర్ణయై అవనిజాత
మధురభావ మహాభావ మగ్నయగుచు.

స్త్రీ సహజములైన ప్రేమానురాగములు మధుర భక్తియందు పరిణతిజెంది సీత ప్రపన్నురాలైనది.

భరతుడు శ్రీరాముని వన ప్రస్థానమును దశరథుని మరణమును తెలిసికొనిన తరువాత తల్లియగు కైకను దూరునెడ (224-225) ప్రకటింపబడిన భావములును ఉపయోగింపబడిన భాషయు భరతుని హృదయమునుండి వెలువడు కోప సంతాపానల జ్వాలలు ఒక్కుమ్మడిఁ గ్రక్కుచున్నట్లు రసవంతములుగా నున్నవి. భరతునికి భరద్వాజ మహర్షి విందు నొసంగినప్పటి చిత్రము మనోహరముగా నున్నది. ముని పుంగవుడొక మహా సౌధమును యోగబలముచే సృష్టించి, యందు మహారాజోచితమైన విందు నేర్పాటు చేసెను. కాని

చ॥ భరతుఁడు విందునందుగల భక్ష్యము లంటడు, గాన నృత్య సం
భరిత వినోదముల్ గనఁడు, ప్రాంజలి రాముఁ దలంచి ఛత్ర చా
మర మహితాసనంబులకు మాన్యతఁ జూపి. ప్రదక్షిణించి, చా
మరమును బూని కేల, నృప, మంత్రులతో నుపవిష్టుడై సభన్

తే॥ "దాస భూతోఽస్మి'' యనుచు లోఁదలఁచు వాఁడు
రామ కింకరు గతి చామరంబుఁ బూని
రాఘవుఁడు పెద్ద గద్దియ రాజిలునటు
లాత్మ భావించి కైంకర్య మంతఁబూనె ॥

ఇట్లు భరతుడుకూడ ప్రపత్తినిఁ బొంది కృతార్థుడై పాదుకలను గొనిపోయెను. రాముడు రాజ ధర్మములను వేదాంతమును బోధించి వాత్సల్యాపూరిత మనస్కుడై భరతు నను గ్రహించెను. ఈ సన్నివేశము లందంతటయు శ్రీ ఆచార్యులవారి విశిష్ట దృక్పథము స్పష్టముగా కనుపడుచున్నది.

ఆచార్యులవారు తారక మంత్రోపాసకులు. తారక మంత్రమున కారక్షరములు. ఈ షడక్షర సంఖ్య కనుగుణముగా నీ కావ్యమును ఆరాశ్వాసములందు విభజించి 2016 పద్యములను రెండు సహస్ర నామార్చనల క్రిందను 294 పద్యములను దక్షిణ క్రిందను జమకట్టి మొత్తము (2310) (6) పద్యములను రచించి కావ్యమును పూర్తి చేసిరి. ఈ సంఖ్య యొక్క కలయిక (6). దీనివల్ల తిరిగి షడక్షర తారక మంత్ర సంకేతము సంపాదితమైనది. ఈ కావ్యము నామూలాగ్రముగ పఠించి కావ్య దృష్టితో విషయ వివేచన మొనరించి సమీక్షించుటకు తగిన విజ్ఞత నాకు లేదు. ఆ కర్తవ్యము సహృదయులగు పండితులది, కవులది, సాహిత్యకులది. అల్పజ్ఞుడనగు నేను నాతోచినయట్లు కొన్ని యభిప్రాయములను వెల్లడించితిని. శ్రీ ఆచార్యుల వారిచే నందింపబడిన ఈ రామ కథామృతము నాంధ్ర పాఠక లోకము చవులూర నారగించి నవనవానందము ననుభవించుగాకయని కోరుచున్నాను.

బర్కత్ పురము,
హైదరాబాద్.
2—6—63.

ఇట్లు,
బుధజన విధేయుడు,
బూర్గుల రామకృష్ణరావు

---

ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు

కం॥ జనకుని నుడి పాలించిన
అనుజుని శ్రీపాదుకలకు నభిషేకించెన్
తన రాజ్య చక్ర మఖిల సు
జన సుతుడయి భరతు డెంత సచ్చరితుండో ॥

కం॥ శ్రీ వాల్మీకి ముఖ బ్రా
హ్మీ వైఖరి సంగ్రహించె మేలితెనుగునన్
గోవిందాచార్య కవి
తా వరివస్య చరితార్థతన్ గని తనియున్ ॥

కం॥ సుందరి జానకి, రాముఁడు
సుందరుఁడు, మహర్షి తల్లజుని గీర్వాణ
చ్ఛందమును సుందరము, గో
విందు ఫణతి సుందరముగ వెల్లువలాయన్ ॥

—రాయప్రోలు సుబ్బారావు.

# "ఉపోద్ఘాతం"

—శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధాని.

౧

ఈ గోవింద రామాయణం చదివిన తరువాత వేఱు వేఱు రామాయణాలు చదువనక్కఱలేదు. అలాగే శ్రీమద్రామాయణానికి ఉన్న వేఱువేఱు వ్యాఖ్యల లోని విశేషాలుగూడా పరికించే పనిలేదు.

ప్రతిభా వ్యుత్పత్తులు ఈ కవిలో సమంగా కనిపిస్తున్నవి. ఇవి ఎక్కువగా కలిస్తే కవి దుర్బోధుడై పోవడం అక్కడక్కడ చూస్తాం గోవింద రామాయణానికి వ్యాఖ్యతో అయే పని సున్నా.

గోవింద రామాయణంలో రాముడు మనిషికాడు. ఆచార్యులుగారు మనిషినిగా నిలబెట్టాలని అనుకొంటారుగాని ఆ రాముడో ఇట్టె దేముడై కూచుంటాడు. ఈ కవి జన్మతః వైష్ణవుడు. ఇపుడు రామభక్తుడై రామాయణం చెపుతున్నాడు.

రామాయణం దీర్ఘశరణాగతిట! ఇంకేం; కవికి శరణాగతేకాక రామాయణం చెప్పడమనే దీర్ఘశరణాగతి దొరికింది ఆకించన్యం మొదలయిన పంచాంగాలూ, అర్ధపంచకమూ మొదలయినవి రామాయణ పాత్రలలో ఉన్నవి. ఇవే కాక ఆచార్యులవారు పంచసంస్కార సంస్కృతులు. ఈ రీతిగా ప్రపన్నుడయినవాడు కవి.

అయితే ఇల్లా భక్తి భక్తి అంటూ శరణాగతి లేక ప్రపత్తి ప్రపత్తి అంటూ వాచ్యంగా కవిత్వం చెపితే కావ్య ప్రయోజనమయిన రససిద్ధి కలుగుతుందా? అనే ప్రశ్న ఎవరయినా వేస్తారేమో! అలవారిని నేను ఈ రామాయణం చదివి ఆనందం కలిగిందో లేదో చెప్పండి అని అంటాను

రెండేసి మూడేసి అక్షరాలు గల మాటలు, చిన్న చిన్న వాక్యాలు, పొంకమయిన పలుకుబళ్లు ఉన్న ఈ గోవింద రామాయణం చదివిన తరువాత పానకం అక్కఱలేదు.

ఇతఁడే పరబ్రహ్మ మిదియె రామకథ
శతకోటి విస్తరము సర్వపుణ్య ఫలము

అన్నమయ్య XI-225

పేరు :

అన్ని భాషలలోనూ శతకోటి ప్రవిస్తరంగా రామకథ పెరుగుతూనే వుంటుంది. ఈ గోవిందరామాయణంతో తెలుగు రామాయణాల బలగం పెరిగింది. గోవిందాచార్యులవారు తమ రామాయణానికి గోవిందరామాయణం అని పేరు పెట్టకపోయినా

లోకులు శృంగగ్రాహికగా దీనిని గోవింద రామాయణమనియే అనేవారు. మంచిదే, పేరు ముద్దుగా వుంది.

## రా మా య ణ ం

కొంచెం పరిశీలించి చూచేవారందరూ రామాయణ కథ నిజంగా జరిగిందేనా అని ఆలోచింపక మానరు. కారణం అందరకూ తెలిసిందే. ఆ రాకాసులూ ఆ రాబందులూ ఆ కోతులూ ఆ కొండముచ్చులు, ఆ ఆయుధాలూ ఆ యుద్ధాలూ ఈ మానవుల కథలో ఎలా ఇముడుతవి? త్రేతాయుగంలో వాళ్ళెవళ్ళయినా వుంటే వాళ్ళకు సందేహం కలుగకపోవచ్చునేమో కాని కలియుగంలో వాళ్ళకు? ఈ మహాయుద్ధంలో మానవులనేవాళ్ళు ఇద్దరంటే ఇద్దరే. ఒకడు రాముడు రెండవవాడు లక్ష్మణుడు. ఎదిరి పక్షం అంతా రాక్షసుల సముదాయం. రామబలం చూదామా కిష్కింధాపురపు అగ్రహారీకులు. రావణుడందామా ఒకపెడ బ్రాహ్మణుడు. ఇంకొకపెడ రాజు. —'అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే.' ఒకపెడ శివభక్తుడు ఇంకొకపెడ కామభక్తుడు. ఆంజనేయులను చూదామా ఒకపక్క కిచకిచలూ, ఇంకొకపక్క నవ వ్యాకరణాలే కాక—

సాళంగనాట

"హరికి లంకిణీహంత కంతర మిట్టున్నది
కరుణ నింత మన్నించె కమలా విభుఁడు. ॥పల్లవి॥

విశ్వరూపు చూపినాఁడు విష్ణుఁడు దొల్లియట్టె. విశ్వరూపాంజనేయుఁడు వీఁడె చూపెను. శాశ్వతుఁడై యున్నవాఁడు సర్వేశ్వరుఁడు వీఁడె శాశ్వతుఁడై యున్నాఁడు జగములో నితఁడు.

హరికి ప్రాణవాయు సంబంధి పరమాత్ముఁడు అట్టె
ప్రాణవాయు సుతుఁడు పవనజుఁడు ।
రాణింప రవివంశ్యుఁడు రామచంద్రుఁడు తాను
నాణెపు రవిసుతుని నమ్మిన ప్రధాని ॥హరికి॥
దేవహితార్థము చేసెఁ ద్రివిక్రముఁడు అట్టె
దేవహితార్థమే జలధిలంఘనుఁడు
శ్రీ వెంకటేశుఁడు చిన్మయమూర్తి తాను
కోవిదుఁడు జ్ఞానమూర్తి గొప్ప హనుమంతుఁడు. ॥హరికి॥

అని అన్నమయ్య చెప్పినట్లు ఈ కపి వట్టి కపియే కాక వృషాకపి అంతవాడు. వాలి చూదామా సగం మృగం. సగం దైవం. జటాయువైతే పిట్టే కాని వేయిమంది పెట్టు.

ఇటువంటి సిబ్బందితో వాల్మీకి రామాయణం అల్లాడు. ఈ కథ ఇట్లా జరిగిందా లేదా అనే సందేహమే ఆయనకు వున్నట్లు తోచదు. పైగా కుశలవులచే పాడించి ఆనాటి యజ్ఞశాలలోకి వచ్చిన వాళ్ళందరికీ వినిపిస్తాడాయె. ఇంతేకాక ఆయన కథా సమకాలికుడు, భారత కథా సమకాలికుడు వ్యాసుడైనట్లు. ఆ ఆదికవికి సందేహమే ఉంటే—

ఉ॥ సీతయు లేదు రావణుని చెల్లెలు లేదల రాముఁ డబ్ధిలో
సేతువు గట్టలే దతనిచే దివిజారులు చావలేదు సా
కేత పురమ్ము లేదచటఁ గేకయ పుత్రియు లేదు సర్వమున్
నూతన సృష్టియే.........................

అని కొందరంటారని మా గురుదేవులు తిరుపతి వేంకట కవులన్నట్లు రామాయణం అనే మాటే ఉండకపోయేది.

## పురాణకాలంలోనే సందేహం

వ్యాసులవారు రామాయణం చదివినటులున్నారు. వాలి వధ ఘట్టంలో భారతం కొంత గ్రంథం నడిపింది. ఇంతేకాక ఆరణ్యంలో రామాయణ కథను టూకీగా చెప్పింది. విష్ణుపురాణం—

యః కార్తవీర్యో బుభుజే సమస్తాన్
ద్వీపాన్ సమాక్రమ్య హతారి చక్రః
కథా ప్రసంగే ష్వభిధీయ మానః
స ఏవ సంకల్ప వికల్ప హేతుః (౪-౪ (424146)

× × × ×
× × × ×

భగీర థాద్యా స్సగరః కకుత్స్థో
దశాననో రాఘవ లక్ష్మణౌ చ
యుధిష్ఠిరాద్యాశ్చ బభూవు రేతే
సత్యం న మిథ్యా క్వను తే న విద్మః (౪-౨౪-IV౪౯)

శత్రువుల నందరనూ చంపి ద్వీపా లన్నీ ఆక్రమించి కార్తవీర్యుడు పుడమి నంతా ఏలాడు. రాచవారి మాటలు వచ్చినప్పుడు 'ఇంతవాడు, అంతవాడు' అని కీర్తింపబడతాడు. అట్టి కార్తవీర్యుడే 'ఉన్నాడా, లేడా' అని సందేహానికి ఆస్పదం (౫౪౬) 'భగీరథాదు లున్నారు, సగరు డున్నాడు, రావణు డున్నాడు, రామలక్ష్మణు లున్నారు, ధర్మరాజాదు లున్నారు. ఇది నిక్కమే కాని కల్లకాదు. వారు (ఇపుడు) ఎక్కడు

న్నారో తెలియదు' అని అంటుంది. ఈ శ్లోకాలు సందేహాన్ని మేలుకొలిపి అసందేహాన్ని స్థూణానిఖనన న్యాయంగా ప్రకటించినవి.

## కవులు సహృదయులు

రామాయణం నాటకభేదాలలో రచింప దలచికొన్న కవులందరు మాత్రమేకాక సహృదయులు కూడా చాలామంది ఏమిటీ పాత్రలు? అని తల తడుముకున్నవారే. తడుముకొన్నా మురారివలె 'యాంతి న్యాయ ప్రవృత్తస్య తిర్యం చోపి సహాయతామ్। అపంథానం తు గచ్ఛం తం సోదరోపి విముంచతీ'.

'న్యాయంగా నడచేవానికి జంతువులు కూడా సాయపడతై. అపమార్గంలో పోయే వాణ్ణి తోబుట్టువుగూడా వదిలిపెడతాడు' అని వాల్మీకం యథాస్థితంగా నమ్మినవారే. త్యాగయ్యగారున్నూ......కపి వారధి దాటునా? అని అన్నారు. దాటె ననియే ఆయన నమ్మకం.

"ఉమ్మడి కోతులకూట ముదధికి గట్టువచ్చె
తమ్మునిబుద్ధి రావణు తలబోయెను"

అని అన్నమయ్యకున్నూ ఇయ్యెడ సందేహంలేదు.

ఎల్లా అయితేనేమి ఆ కోతులు వారిధి కట్టినట్టే వారి నమ్మకం. అవకాశం కలిగి నప్పు డెప్పుడో ఒకప్పుడు అందరూ ఇంతో కొంతో సందేహం రాల్చినవారే. నాటక కవులు భాసుడు మొదలుకొని అందరున్నూ అవసరం వచ్చినచోట—'అన్యథా వా ప్రకల్పయేత్' అనుసరించినవారే. ఉత్తర కథలో పూర్వమీమాంసకులు కొంత చోటు చేసుకొన్నారు. ఎందుకంటే తామనుకొన్న ధర్మం రాముని కంటగట్టడానికి. అందుకని ఆయనకు పునర్వివాహం చేశారు. ఇది కాంట్రాక్ట్ వివాహం. అంటే అశ్వమేధం చేయడానికి గాను ప్రక్కన వేసిన పీట నిలపడానికి. ఈలాగే ఐతిహాసికులు కూడా ఉత్తరకథలో తమ సొంతసోది కొంత కలిపారు. ఆలంకారిక పక్షాన అభినవ గుప్తులు నాట్యవేద భాష్యంలో—వేదం చెప్పినా ఈ ఉత్తరకథ కొంత మేం నమ్మం అని అన్నారు.

'ఇది త్రేతాయుగంనాటి కథకదా. రావణుడు బ్రాహ్మణుడై పుట్టి రాజ్యం చేయడ మేమిటి? కలిధర్మాలకు కాపు కావలసినవాడు త్రేతలో పుట్టడ మేమిటి? పద్మా పిప్పలాద చరిత్ర ధర్మానికి హానివృద్ధులున్నటులు చెప్పినా (ఈ కథ ఏ యుగంలో జరిగిందో) నాలుగుపాదాలలో అన్ని పాదాలకూ లంకలో హానా? ఇంకేదో విశేషకారణం వుందని ఊహించుకోవాలి' అని ఇలాగే కోతులమెడలా కొండలయెడలా (సంజీవి పర్వతం మొదలైనవి) ఖగముల యెడలా మృగములయెడలా (జాంబవంతుడు) సందేహాలు సందోహా

లుగా ప్రతిపాదించినవా రున్నారు. పరదేశీయులు నమ్మనే నమ్మరని (అందరూకాదు) అనుకోండి. పై సందేహాలకూ ఇంకా ఈలాంటి సందేహా లెన్నింటికో ఎందరో ఎన్నో సమాధానాలున్నూ చెప్పుకుంటూనే వస్తున్నారు. కాని సంశయాత్ములంతా విని 'రామునికి సీత ఏమవుతుందని' అడుగుతూనే వస్తున్నారు. భారతదేశంలో అందరకూ రామాయణం ఉగ్గుపెట్టడంవల్లనేమో కొందరకు సందేహమేరాదు. పైగా అన్ని జాతులవారిలోనూ రామోపాసకులూ, ఆంజనేయోపాసకులూ ఎందరో వున్నారు. రావణోపాసకులే ఎక్కువమంది ఉన్నారని అనుకోండి. సహృదయులు కథా శరీరాన్ని తెంకాయలాగా మోచినా తెలియకుండానే లోపలిరసం ఆస్వాదిస్తున్నారు. ఇటీవలి నాటక కవులున్నూ ఔచితిని ఒకకంట కనిపెట్టుకుంటూనే నడక సాగిస్తున్నారు. భవభూతి శంబుకవధ ఘట్టంలో—

> రేహ స్త దక్షిణ మృతస్య శిశోర్ ద్విజస్య
> జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్
> రామస్య గాత్ర మసి దుర్భర గర్భ ఖిన్న
> సీతా వివాసన పటోః కరుణా కుత స్తే ?

"నా దక్షిణ హ స్తమా? చనిపోయిన బాపన పిల్లవానిని బ్రతికించడానికి, శూద్ర మునిమీద క త్తి విసురు ! నీవు నిండు చూలాలు సీతను అడవిలో పారేసి రమ్మన్న రామన్న చేతివి కావా ? నీకేటి కరుణ ?" అని రామునిచేత రాముణ్ణే తిట్టించి ఔచిత్యాన్ని ఎంతో వంతుకూ వాసికీ ఎక్కించాడు.

శ్రీ గోవిందాచార్యులవారున్నూ ఇలా అన్నారు,...............ఆ

> ఆహారము తీరునం బ్రతిభ యబ్బదు ప్రాణులకెల్ల సృష్టిలో
> వారని యోగసిద్ధిగను భవ్యులు మాత్రమె జ్ఞానులౌదు ర
> వ్వారల వర్ణభేదమును బట్టి వధింపఁగ జెల్లునే నృపా!
>
> గీ. అంచు గొందఱు దమలోఁ దలంచుచుంద్రు
> శంబుకుని చావునందలి సత్యనిరతి
> నాత్మ శంకించువారు.

(ఉత్తర-సుతోదయాశ్వాసము III)

అని చెప్పి - 'ఈ పీడ నాకెందుకు' అన్నట్లు ఈ శంకను లోకులమీద పారవయిచారు. ఇదంతా ఈలాగుండగా శ్రీమద్రామాయణమంతా గబ్బున త్రేచిన మహాత్ము లెవరో—

> వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
> వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా.

ఈ కావ్యమును వ్రాయ ప్రోత్సహించి పూర్తిగా వ్రాసిన పిమ్మట అమితానందభరితులై నా కండదండగ నిలిచిన శ్రీ కొమ్మవరపు సుబ్బారావుగారును, శ్రీ శ్రీరంగం సుబ్బారావుగారును మరపురాని మిత్రులు.

## దాతలు

నా యందున, గోవింద రామాయణ కావ్యములయందున ప్రత్యేకాభిమానము చూపించుచూ నా కమిత ప్రోత్సాహ మొసంగిన శ్రీ టి. అనంతరెడ్డిగారికి (Advocate) మిక్కిలి కృతజ్ఞుడను. (నేడు రద్దు అయిన) ఆత్మకూరి సంస్థాన పక్షమున ఆదియందు వీరి ధనసహాయమే లభింపకున్నచో ఈ కావ్యము నింతలో ముద్రింపగలిగినవాడనే గాను. నాకు ధన సహాయముచేసిన ఆత్మకూరి సంస్థాన వంశీకులకు నా కృతజ్ఞతాభివందనములు.

ఈ కావ్యము అచ్చు అగుటకు ధన సహాయము చేసిన తదితరదాతల నామములు వేరొకచో ప్రకటింపబడును. ఈ దాతలందరికి కృతజ్ఞుడను.

## గోల్కొండ ప్రెస్సు - నాగేంద్ర ప్రింటింగ్ ప్రెస్సు—

ఈ కావ్యమందలి మొదటి 30 పుటలు గోల్కొండప్రెస్సులో ముద్రించబడినవి. తదుపరి కావ్యమంతయు నాగేంద్ర ప్రింటింగ్ ప్రెస్ (సికిందరాబాదు) లో ముద్రింపబడినది. వ్యవధి చాలకపోయిననూ పరమభక్తితో సకాలమున సర్వాంగ సుందరముగ నా కావ్యమంతయూ ముద్రించిన నాగేంద్ర ముద్రణాలయము యజమానులగు శ్రీ దాచేపల్లి కిష్టయ్య అండ్ సన్సు వారికిని, అందలి పనివారలకు నా హృదయపూర్వక అభివందనములు. ఈ ప్రెస్సునందు కార్యనిర్వాహకులుగా నుండిన శ్రీ గరికపాటి దక్షిణామూర్తిగారికి నా ప్రత్యేకాభివందనములు.

## కావ్య స్వరూపము

ఈ కావ్యము వాల్మీకమందలి అయోధ్యాకాండ ప్రతిబింబమే. అయినను అయోధ్యాకాండ అనువాదము మాత్రము కాదు. అయోధ్యాకాండమందు నిక్షిప్తముగానున్న వాల్మీకి హృదయమును నా శక్తికొలది సంగ్రహించి యిందు పొందుపరచితిని. వాల్మీకమందలి కథా సంవిధానమునకు దోహద మొనరింపగల విషయముల నచ్చటచ్చట యితర రామాయణములనుండి స్వీకరించితిని. అంతియే. వాల్మీకి కథా విధానమునకుగాని, భావమునకుగాని యిం దిసుమంతయు వ్యతిరేకము లేదు.

బాలకాండముననే భక్తియోగమునకు - భక్తి రసమునకు - వాల్మీకి బీజములను వెదజల్లినాడు. తదుపరి కాండలలో యీ బీజములే మహావృక్షములై శాఖోపశాఖలైనవి. వాల్మీకి కోకిల, గానమున కాధారములైనవి. భక్తి ప్రత్యేకమొక రసము. నిర్ణీత పరిణామావస్థలు గలది. ఈ పరిణామావస్థలతో భక్తిరస సంపూర్ణ స్వరూపమును వాల్మీకి చిత్రించినాడు. ఇందుల కయోధ్యాకాండము మూలము. ఇది వాల్మీకమును నే నర్థము చేసుకొనిన రీతి. మా పెద్దలవలన వినిన విషయము. గాన యీ కావ్యమున భక్తియోగమును, భక్తి రసమును బోషింపబడినవి.

ఎల్లరకును రసాస్వాదనమున కనువుగా సులభశైలిలో నీ కావ్యమును వ్రాయ యత్నించితిని. ఈ నా ఆదర్శముల యందెంతవరకు సఫలీకృతుడనైనదియు నిర్ణయించుటకు పాఠక మహాశయులే అర్హులు.

## పండితాభిప్రాయములు

నా కోరికను మన్నించి తీరిక చేసికొని యీ కావ్యమునకు పీఠిక వ్రాసిన శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారికిని, ఉపోద్ఘాతము వ్రాసిన శ్రీ శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారికిని నా నమస్కారములు. తమ తమ పండితాభిప్రాయములను గృపజేసిన పండితులకు, మిత్రులకు నా దాసోహములు.

## దోషములు

అటనట కొన్ని దోషములు దొర్లినవి. తప్పు - ఒప్పుల పట్టికతో నిమిత్తము లేకుండగ అచ్చు అగునట్లు విశేష కృషి సల్పియు విఫలుడనైతిని. అయితే యీ దోషములు కావ్య రసాస్వాదన కడ్డు తగులునవి కావు. అయినను పాఠకులు వానిని గుర్తించెదరుగాక. అందునను జేరని తప్పులెటనైన మిగిలియున్నచో క్షంతవ్యుఁడను. పునర్ముద్రణమున సవరించుకొందును.

ఈ కావ్యమును భక్తితో పఠించు పండితులు, కవులు, భక్తులు నా యీ కృషిని మన్నించి నన్నాశీర్వదింతురుగాక.

మా పాదుకా పట్టాభిరాముడు మా పాఠకుల నెల్లర అనుగ్రహించి ఆశీర్వదించుగాక.

## తుదిమాట

మ. హరినామ స్తుతిజేయు కావ్యము సువ • ర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానస సర • స్ఫూర్తిన్ వెలుంగొందు ఆ

హరినామ స్తుతిలేని కావ్యము విచి • త్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్య దుర్మలిన వ • త్కాకోల గర్తాకృతిన్. 96

మ. ఆపశబ్దంబులఁ గూడియున్ హరి చరి • త్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగము సేయుఁ గావున హరిన్ • భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు న • శ్రాంతంబు గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా • తత్వజ్ఞ చింతింపుమా. 97

—పోతన

(భాగవతము - ప్రథమస్కంధము 96 - 97 పద్యములు)

మకాం 6-3-911/1
శ్రీ సీతారామ నిలయం
ఖైరతాబాదు (పోష్టు)
హైదరాబాదు-4
ఫోన్ నెం. 34233

ఇట్లు,
భక్తభక్తుఁడు,
ఆత్మకూరి గోవిందాచార్యులు

---

ఓమ్

గోవింద రామాయణము

పాదుకాపట్టాభిషేకము

# ( అయోధ్యాకాండము;-వివరములు )

( నం. 12-1-10 రోజులు )

( త్రేతాయుగమునం దిరువది నాలుగవ మహాయుగమున
చైత్ర శుద్ధ నవమి శ్రీరామ జననము )

1. 12 విలంబి సంవత్సర చైత్రము మొదలు — సాధారణ సంవత్సర చైత్రమువఱకు బాలకాండ విషయములు.
2. 12 తదుపరి దుందుభి సంవత్సర చైత్రము వఱకు అయోధ్యావాసము.
3. వెరసి 24 సంవత్సరములు – శ్రీరామునకు 24 వ వత్సర ప్రారంభము.
4. దుందుభి సం॥ చైత్ర శు 4 శ్రీరాముఁడు పట్టాభిషేకార్థము పవసించిన వ్రత దినము.

చైత్ర శు 5 పట్టాభిషేక విఘ్నము – వన ప్రయాణ దినము.

చైత్ర శు 5 సాయంతనమున సరయూతీర వాసము.

| | | | |
|---|---|---|---|
| ,,- | 6 | ,, | గంగాతీర వాసము. |
| ,,- | 7 | ,, | జటాధారణ గంగాతరణము. |
| ,,- | 8 | ,, | భరద్వాజాశ్రమ ప్రవేశము. |
| ,,- | 9 | ,, | యమునాతీరము చేరుట. |
| ,,- | 10 | ,, | చిత్రకూట ప్రాప్తి. |

సుమంత్రుని విషయములు

దుందుభి సం॥ చైత్ర శు॥ 7 వఱకు గుహుఁడు సుమంత్రుఁడు కలిసి రామునితో నుండుట.

,, 7 మొదలు 10 ప్రాతః కాలము వఱకు } గుహుఁడు సుమంత్రుఁడు కలిసి యుండుట.

| | |
|---|---|
| చైత్ర శు॥ 10 సాయంకాలము | సుమంత్రుఁడయోధ్య—జేరుట. |
| ,, ,, 10 అర్ధరాత్రమున | దశరథుఁడు కాలధర్మము నొందుట అందరు విలపించుట. |
| ,, ,, 12 | ప్రముఖుల సభ భరతునికై దూతల నంపుట. |
| ,, ,, 13 | దూతలు భరతుని కలియుట. |

భరతునిచరితము

| | |
|---|---|
| దుందుభి సం॥ చైత్ర శు॥ 14 | భరతుఁడయోధ్యకు ప్రయాణ మొనర్చుట. |
| చైత్ర బ॥ 5 రాత్రి | భరతుఁడయోధ్య జేరుట. |
| ,, బ॥ 6 | కర్మారంభము. |
| ,, బ॥ 30 | కర్మాంశము-దశాహము. |
| వైశాఖ శు॥ 1 | ఆశౌచ నివృత్తి. |
| ,, ,, 2 | సాపిండ్యము. |
| ,, ,, 3 | భరతుఁడు దుఃఖించుట. |
| ,, ,, 4 | భరతుని పట్టాభిషిక్తుని జేయఁ బూనుట. |
| ,, ,, 5 | వందిమాగధ స్తోత్రము. |
| ,, ,, 6 | భరతుని వన ప్రయాణము. |
| ,, ,, 7 | గంగాతీర వాసము — జటా ధారణము. |
| ,, ,, రాత్రి | భరద్వాజాశ్రమ నివాసము. |
| ,, ,, 8 | చిత్రకూట ప్రాప్తి - రామ దర్శనము. |
| ,, ,, 9 | స్నాన తర్పణ పిండ దానాదులు. |
| ,, ,, 10 | పాదుకా దానము. భరతుని అయోధ్యా గమనము. |
| ,, ,, 11 | భరతుని నంది గ్రామ ప్రవేశము పాదుకాపట్టాభిషేకము. |

### శ్రీ గోవింద రామాయణము-

### పాదుకా పట్టాభిషేకము

## అంకితము- కృతి సమర్పణము

రామా! రఘునందన!
ప్రేరణ సేయంగ నీవు! ప్రేమన్ రావా?
గారాబంబునఁ గృతిఁగొన
రారా వేవేగ దేవ! రాజ లలామా! 1

శా. నీవే దైవముఁగా నిరంతరము ని•న్నే ఆత్మలో నిల్పి భ
క్త్యావిర్భూత విశేషముల్ గల అయో•ధ్యాకాండమున్ వ్రాసితిన్
జీవాత్మల్ పరమాత్మ వెంటఁబడుటన్ • చిత్రించు నీ కావ్యమున్
గోవిందాఖ్యుఁడొసంగు నంకితముగాఁ • గొమ్మీకృపన్ రాఘవా! 2

ఉ. శ్రీ మహనీయమూర్తి! ముని • సేవిత దివ్య పదారవింద! శ్రీ
రామ! మదీయ కావ్యమిది • వ్రాసితిఁబుట్టినరోజు కాన్కగా
స్వామి! త్వదీయ దివ్యపద • పద్మములందు సమర్పితమ్ము కొ
మ్మీ, మధుమాస శుద్ధ నవ•మిన్ శుభకృద్ భృగువాసరంబునన్. 3

ఉ. ఏ చపలత్వముంగనక • యీప్సిత మిమ్మనకుండ భక్తిమై
నీ చరితంబుఁ గావ్యముగ • నే రచియించితి మూఁడుమార్లు నన్
బ్రోచెడివాఁడ వంకితముఁ • బొందుము మూఁడవ మారుఁగూడ భ
ద్రాచలరామ! భక్తవర•దా! కరుణాకర! జానకీవరా! 4

ఉ. పట్టినవాఁడ వీవు నను బట్టిన పట్టును వీడకుండఁ జేఁ
బట్టియె యుంచు మీయిటుగ • భక్తిఁ ద్వదీయ మహాచరిత్రలో
గుట్టునుదీసి లోకమున•కున్ వెదఁజల్లఁగఁ జేయుదాఁక ఏ
పట్టునఁగాని నే విడువ • భద్రగిరీశ! త్వదంఘ్రి యుగ్మమున్. 5

ఉ. మూఁడవ కావ్యమిద్ది రఘు • పుంగవ! సర్వ గుణాభిరామ! నీ
నీడఁ జరించి నీదుకృప • నీ కథ వ్రాయుచు నున్న వాఁడ, నీ
వాఁడ, మదీయ కావ్యరమ • భర్తవు, కర్తవు, నీవె. నీవు నా
వాఁడవు, పద్యమాల మెడ • వైచెద; భద్రగిరీశ! రాఘవా! 6

# ఇష్ట దేవతా ప్రార్థనము

శ్రీ బాలా త్రిపుర సుందర్యై నమో నమః

ఉ. శ్రీ నిధియై యనాది చిద • చిన్మయ దివ్య శుభంకరాంబయై
భాను సహస్ర మండల వి•భా ప్రతిభాసిత మూర్తి గల్గియున్
జానగు మోమునన్ మధుర • శాంతమృదూక్తులఁ బల్కు బాల నా
మానసమందు నిల్చి యభి•మానముతో సుకవిత్వ మిచ్చుతన్. 1

ఉ. ఎన్నికఁగన్న పూర్వకవు • లేగిన బాటలఁ దప్పకుండ వి
ద్వన్నుతిఁ గాంచురీతి పర•తత్త్వ సుబోధనముండు భాతి, రా
మన్న కథా విధానము ర•సాస్పదమై మృదు శబ్ద భావ సం
పన్నత వ్రాయు దీక్షనిడు • మాతరో! బాల! త్రిలోక సుందరీ! 2

తే.గీ. ఆ యరుణ కిరణమ్ములా • శాంత మెగయఁ
జీకటులఁ బాపి సద్విద్యఁ • జేతఁబెట్టి
భక్తతతి నోట నడయాడు • బాల! త్రిపుర
సుందరి! కుసుమ పేశల • సూక్తు లిమ్ము. 3

గీత లలిత భావ పరంపరా • లాలితముగ
మాలిక పలుకు పలుకెల్లఁ జవులీను • పలుకు గాఁగ
మధుర మధురమ్ము లౌమేటి • మాట గాఁగ
శుచి రుచుల తేటతెల్లమౌ • సూక్తిగాఁగ 4
కులుకు లొలికెడు పండు వె•న్నెలలు గాఁగ
దివ్యగంగా సుధా ధునీ • తీర్థ మనఁగ
భక్తకోటికిఁ దరణమై • వరలునటుగ
రామచంద్రుని సద్గాథ • వ్రాయవలయు
వ్రాసిపెట్టుము బాల చే•పట్టి నన్ను. 5

ఉ. ద్రాక్ష రసమ్మునన్ మునిఁగి • తద్దయు నిక్షు రసస్రవంతిలో
దీక్షఁ జరించి, తేనె దిని, • తెల్లని మీఁగడలన్ మెసంగి, నీ

చతురశేష దృష్టిమయ ♦ శాంతపు వెన్నెలలన్ రహించి, త్వ
ద్రక్షణ నున్న లేఖిని మ♦ధ్ధంబరో! పూనుము నా నిమిత్తమై. 6
తే.గీ. త్రిపుర సుందరి! యీ కోర్కెఁ ♦ దీర్పవమ్మ
తేట గీతలఁ బాడుచుఁ ♦ దెనుఁగు నుడిని
చంపకోత్పల మాలల ♦ సౌరభమ్ము
తోడఁ బూజించి మారాము ♦ తృప్తిఁగందు. 7

## రామాయణ రచనా ప్రయోజనము

చ. చదివిన పాండితీ గరిమ ♦ సర్వము చాటఁగఁగాదు కాదహో
ముదమలరంగ సత్కవిగఁ ♦ బూజల నొందఁగఁగాదు కాదహో
సదమల సర్వ శాస్త్రముల ♦ సారము శ్రీరఘు రాము పూజగా
హృదయ సమర్పణమ్ము నఁద♦రింప దలంచి రచింప నెంచితిన్. 8
ఉ. లోక హితార్థ మౌచుఁ బర ♦ లోకమునందు రమేశు సేవయే
చేకురఁ గావ్య సద్గతిని ♦ సిద్ధి లభింపఁగ భక్తియోగమున్
జేకొని మాధురీ భరిత ♦ చిత్తమునన్ రఘు రాము గాథలన్
వాకొనువాఁడ భక్తజన ♦ వత్సలుఁడా రఘు రాముఁడౌటచేన్. 9
ఉ. వ్రాసితిఁ దొల్త జానకినిఁ ♦ బాసిన యుత్తర గాథఁ బిమ్మటన్
వ్రాసితి బాలకాండము, వి♦వాహ మహోత్సవ దర్పశేముషీ
భాసిత జానకీ చరిత ♦ భక్తుఁడనై, భవదీయ శక్తిచే
వ్రాసి తరింపనెంతు నిఁక రాజ్యము పాదుక లేలు రీతులన్. 10
మ. రమణీయార్థ తరంగ పంక్తిరసవా ♦ రాశిన్ మహోత్తుంగమై
విమలంబై మృదు శబ్దరత్నభవమై ♦ విశ్వార్థమై యొప్పు, కా
వ్యము, రామా! రచియింపఁబూనితిఁ ద్వదీ ♦ యాశీస్సుమై మోక్షవం
తమురామాయణమంచు మూర్ధమునఁద్వ♦త్పాదంబులన్ దాల్చుచున్.
చ. సకల కళా ప్రశస్తిఁ గొన ♦ సాగిన కావ్యము నేనిమెత్తురే
వికల మటంచుఁ బేర్కొనక ♦ వెంగలులై సమకాలి కాళి; యం
చొక కవి మున్ను వ్రాసెనది ♦ యొప్పదు, నా కృతు లెన్నసాటి వా
రికి రుచియించె నేఁడె సఫ♦లీకృత కర్ముఁడనైతి నీ కృపన్. 12
ఉ. నిన్ను జపించి, నీ కృతుల ♦ నే రచియించిన, నీ కథా విశే
షోన్నతినైనఁ బేర్వడరొ♦కో కవు లెప్పుడుఁ గూడ, నింతకున్

సన్నుతి యేల? కాకవుల • సాకులవేల? తరింపవ్రాయ, నా
పన్న శరణ్యా! నీ దయకుఁ • బాత్రుఁడఁగానొ అలౌక్య సద్రతిన్. 13

ఉ. అన్నది కన్నదే అటుగ • నౌచితితో రసభావ యుక్తమౌ
తిన్నని శయ్యతోఁ బలుకు • తీరు నెఱుంగమిచే, సమాధి సం
పన్నుఁడుగాని వాఁ డుపమ•వంటి యలంకృతులన్ బిగించు, కా
దన్న సమాసజాలములఁ • దాగుఁగదా కవితా పరితారణన్. 14

చ. వడిగల ధారతో మధుర • భావపరంపరలన్, మృదూక్తులన్
గడగడ నిఙుపానకముఁ • గై కొని ద్రావునటుల్ రచింతు న
ల్గడ రసవత్ప్రపంచమునఁ • గాంచుచు మా రఘురాము, నాతఁడే
యెడదఁ బ్రతిష్ఠఁ గై కొనఁగ•నెప్పుడు మాత్రిపురాంబ సత్కృపన్. 15

తే గీ. భక్తిరసము పునాదిగాఁ • బాదుకొలిపి
కట్టెదఁ బ్రపత్తి సౌధమీ • కావ్యమందు
నవ నవోన్మేష రసముల • నారతంబు
నారగించుచు నిందుండు • మయ్య రామ. 16

శా. ధీరోదాత్తుఁడ వౌచు నా కలముపై • దీపించి దీవింపనన్
రారా! రామ! రమావరా! రఘువరా! • రాజీవ పత్రాక్షు! నీ
గారాబంబునఁ జేసి వ్రాయగమదిన్, • గాంక్షించుచున్నాడ లో
కారాధ్యంబగు నీ పురాణ కథ, దాని•జూపాకమై యొప్పఁగన్. 17

ఉ. ఆయు వొసంగినన్ దినుట • కన్న మొసంగిన బుద్ధి నిల్పినన్
గాయపటుత్వ మిట్లయినఁ • గాచితివేని పరిపూర్తిగాఁగ రా
మాయణ కావ్య మెల్ల నసమానముగా రచియింపనెంతు రా
మా! యిఁకమీదఁగూడభవ • దాశ్రితుగాఁ జరియింపజేయుచోన్. 18

కం. సఫలుఁడ నౌదునొ; యీ కృతి
విఫలుఁడ నౌదునొ? ముగింప • విచ్చల విడిగా
కఫ మలముకొనెడి దాఁకను
సఫలీకృత నిష్ఠతోడ • సాగింతుఁ గృతిన్. 19

తే.గీ. విద్య జీవనోపాధి గాఁ•వింపలేదు
పుస్తకము లమ్మి జీవించు బుద్ధిలేదు

నీ వొసంగిన విద్యచే • నిన్నె యెంచి
సతము ముక్తినిఁ గననెంతు, జానకీశ! 20

చ. నరులకు నంకితంబిడఁగ • నా మన సొప్పదు పొట్ట కూటికై
పరుల సమాశ్రయంబుఁ గొను • భావము పుట్టదు భక్తకోటికిన్
దరణముగా భవాబ్ధికిది • దాశరథీ! రచియింప నెంచితిన్,
భరమగునే త్వదీయ గుణ • వర్ణన కావ్యములన్ రచించుటల్. 21

ఉ. ధీరమతిన్ బ్రవృత్తినిఁ ద్వదీయ పదాబ్జములందు మ్రొక్కి సం
సార మహోబ్ధి తారణము • సర్వశుభాస్పద మంత్రరాజమౌ
తారకమున్ జపించుచు సదాహృది నిల్పుచు నిన్ను నీ మహో
దారకథాసుధాలహరిఁ • దాండవ మాడెదఁ దన్మయుండనై. 22

వాల్మీకి స్తుతి.

తే.గీ. తానుతరియించి భూలోక • తారణముగఁ
గలుషహార రామచరితంబుఁ • గావ్యరీతి
నాదిగాఁ బల్కి మృతజీవి • యైన మునికి
ఆ చిరంజీవి కెపుడు దాసోహమందు. 23

ఉ. "రామ" పవిత్ర శబ్దము విరామము లేక జపించి, జానకీ
రామ చరిత్రఁ గావ్యముగ • వ్రాసి తరించిన మౌని సత్తమా
నేమముగా స్మరించి నిను • నీ హృది జొచ్చి త్వదీయ భావజా
లామల సత్యవిస్ఫురణ • మంది, రచింతు మదీయ కావ్యమున్. 24

భక్త సంస్మరణ.

తే.గీ. సతము శ్రీరామ నామ సంస్మరణఁజేసి
యనుప మానంద మగ్నుఁడై • య మృత జీవి
యైన, రామభక్తుఁడు శ్రీమదాంజనేయు
నాత్మ నిల్పెద భక్తి దాసోహ మనుచు. 25

మ. కవియున్ భక్తుఁడు గాయకుండునగు త్యాగయ్యన్ మహాసిద్ధునిన్
గవినిన్ భక్తుని నిత్యసత్య పదవీ • కాంక్షా పరున్ బోతనన్
గవియో భక్తుఁడో సిద్ధుఁడో రఘువరుం • గన్నట్టి గోపన్ననున్
స్తవమున్ సల్పుచు మ్రొక్కెదన్ సతము నన్ శాసించిదీవింపగన్. 26

గురు స్మృతి.

తే.గీ. రామ భక్తుండు సత్య, పరాక్రముండు
ధార్మికుఁడుగాని సంతత • ధార్మికుండు
భారతీయ స్వరాజ్య సంపాదకుండు
గాంధి గురునెంచి మోడ్చెదఁ • గరయుగమ్ము. 27

పూర్వ ఉ. నన్నయ తిక్కనాదికవి • నాథులకుం బ్రణమిల్లి, భక్తిఁబో
కవి తన్నకు మ్రొక్కి తక్కుఁగల • యాంధ్ర మహాకవి శేఖరాళికి
స్తుతి. న్మన్ననఁ దెల్పి సంస్కృతము•నన్ రఘురాముని గాథ వ్రాసి వి
ద్వన్నుతిఁ గన్న సత్కవులఁ • బ్రార్థన సేసెద మంగళార్థినై. 28

ఉ. మీవలె వ్రాయఁగాఁ గలనె • మిమ్ములఁ బోలిన వారలెవ్వ రాం
ధ్రావనిఁ? దెన్గుబాసను, మ•హా కవితన్ రససిద్ధులౌ చిరం
జీవులు మీ కవిత్రయము • చిత్తమునన్ దలపోయుచున్ మిమున్
నావలె నే రచింతునిఁక • నా రఘు రాముఁడు చెప్పుచొప్పునన్. 29

మ. లలితామ్నాయ కథావిధాన రచనా•లావణ్యు శ్రీభాస్కరున్
విలసత్ శబ్ద సమన్వయ ప్రథితు గో•పీనాథునిన్ సత్కవిన్
బొలఁతిన్ మొల్లను, వాసుదాసుఁ దపిసిన్• బూజ్యుండు శేషాద్రినిన్
దలతున్ వీరలు భక్తి వ్రాయుటను సీ•తారామ సత్కావ్యముల్ 30

కృత్యాది తే.గీ. నిన్ను యువరాజుగాఁ జేయ • నెన్నినపుడు
మంగ అడవులకుఁ బొమ్ము నీవని యన్న యపుడు
ళము సుఖము దుఃఖముఁ గననట్టి • సుగుణమూర్తి
మంగళము మంగళము జయ • మంగళమ్ము. 31

తె.గీ. తండ్రి సత్య ప్రతిజ్ఞను • దలను దాల్చి
ఎలమి కైకమ్మ మాట మ•న్నింపఁ దలఁచి
చిత్ర కూటాద్రిపై నివ•సించు రామ
మంగళము మంగళము జయ • మంగళమ్ము. 32

తే.గీ. భూమిఁ బాలింపఁగా హేమ • భూషితలగు
పాదుకల నిచ్చి భరతునిఁ • బంపినట్టి
దండ కారణ్య వాసి! కో•దండపాణి
మంగళము మంగళము జయ • మంగళమ్ము. 33

తే.గీ. సీతయును లక్ష్మణుండును • జెంతనుండ
ధర్మమును బూని ధర్మార్థ • కర్మనెరప
గహన సీమఁ జరించు లో•కైక నాథ
మంగళము మంగళము జయ • మంగళమ్ము. 34

తే.గీ. రామునకు రామభద్రుకు • రామచంద్రు
నకును రఘునాథునకు నాథు•నకును వేధ
కు, నల జానకీ పతికి భ•క్తుండు పలుకు
మంగళము మంగళము జయ • మంగళమ్ము. ౭౫





# శ్రీ గోవిందరామాయణము

# పాదుకాపట్టాభిషేకము

## రాజ్యాశ్వాసము

శ్రీ యోగముఁ గనినాఁడవు
భూ యోగముఁ బొందు మింక ♦ భూశ్రీ దేవుల్
నీయోగ విలక్షణమా
మాయామయ చిద్విహార ♦ మా పతి రామా.

### దశరథ సంకల్పము

శ్రీరామున్ సుజనాభిరాము సుగుణున్ ♦ జిత్తంబునం జేర్చి, పెం
పారన్ బ్రేముడి నల్వురన్ సుతులనా ♦ ప్యాయంబుగాఁ బెంచుచున్
గారాబంబున రాముఁ జీరు సుగతిన్ ♦ గాంక్షించుచున్ హృష్టుఁడై
ఆరాజన్యలలాముఁ డాఘనుఁడయో ♦ ధ్యాభూపుఁడే వేళలన్. 2

శ్రీలు చెలంగు రాజ్యరమ ♦ చే సుఖియించుచుఁ బెక్కు నాళ్లుగా
గాలము పండి పుత్రకుఁడు ♦ గల్గెడి యాశలయింప, యాగముల్
జాలఁగఁ జేసి చేసి తుది ♦ సంతతిఁ గాంచి తరింప నున్న భూ
పాలుఁడు మోదముం గనఁడొ ♦ ప్రాజ్ఞుని, జ్యేష్ఠునిఁ గాంచి నిత్యమున్.

గీ. పుత్త్రి సంతానమున్నంతఁ ♦ బుడమియందు
సౌఖ్య మబ్బునె యబ్బునె ♦ సంతసంబు!
వర యశోవంతులై వారు ♦ వరలు నపుడె
ధన్యుఁడగుఁ దండ్రి, వంశంబు ♦ ధన్యతఁ గను. 4

తే.గీ. రావణ వధార్థమైగాదె • రాము జన్మ
రాఘువుండిక సద్గుణ • రాశి యగుట
వింతయే! అట్టి సుకుమారు • వీరు, ధీరు
నతులముగఁ దండ్రి గనుచుంట • యబ్బురంబె! 5

చం. తన, సుకుమార రాము, నిజ • ధర్మ పరాయణ వీరరాము, పా
లనమున, లోకులెల్ల సుఖ • లాలితులై మన నోతురంచు, స
జ్జనపతి యౌచుఁబేర్వడయు • సత్యపరాక్రమ రాముడంచు వం
తన మొనరించె నాదశర • థక్షితినాథుఁడు వృద్ధుఁడౌటచే. 6

తే.గీ. తనకు సరియౌచు మాత్రమే • తనయుడుండ
జనకుఁడెప్పుడు ముదమొంది • తనరుచుండు
తనకు మించిన వాఁడుగాఁ • దనయుడుండఁ
బుడమి నేతండ్రి సంతుష్టిఁ • బొందకుండు? 7

చం. భరతుఁడయోధ్యకున్ మరలి • వచ్చుటకున్ మునుపే నృపుండు దా
శరథిని, జ్యేష్ఠపుత్త్రిని విశాంపతిఁగా నొనరించు పూన్కిలో
నరమర యేదియో నృపుని • యాత్మఁగలంచెడి రీతి దోచు మున్
మరచిన దేదియో మరల • మానసమందు స్ఫురించుచుండెనో! 8

ఆ.వె. మామ యింటి నుండి • మరలి రాలేదింక
భరతునకును బిలుపుఁ బంపలేదు
జనకుఁగాని కేకయునిఁగాని • పిలువఁడు
దశరథుండు వింత • తలఁపుగాదె! 9

తే.గీ. కాని రాముని యువరాజుఁగా నొనర్పఁ
దనకుదాఁ బూననొల్లక • దశరథుండు
నిండు పేరోలగంబుండి • నేర్పుమీద
ప్రజల హితమెంచఁ బూనె శ్రీ • రాము గూర్చి 10

ఉ. ఆ పరిషన్మహాస్థలి, నృ • పాదరణమ్మును బొందినారలా
యాపుర వాసులున్, జనప • దాళివసించు జనంబు లెల్లరున్
భూపులు, బ్రాహ్మణుల్, మునులు • పూజ్యులు బిల్వఁగవచ్చిరెందఱో
ఏ పనియో యెఱుంగమియు • నెల్లరు వచ్చి రయోధ్యకత్తఱిన్. 11

చం. జనపతి, యాసభంగల వి•శాంపతులంగని పాలితుల్ వినన్
దన మృదు దుందుభిస్వనము•నన్ దిశలెల్లయు మారుమ్రోగ ని
ట్లనుc బ్రజ నేలినారలుగ•దా రఘువంశజు లింతదాcక కూ
ర్మిని, సుఖులై నిరంతర మ•మేయ ముదంబున వారలుండcగన్. 12

ఉ. పండిన దీయొడల్ పుడమి • పాలనసేయుటయందు, మానసం
బెండినదన్ని భావముల, • నింకవిధిన్ గమనించుచున్ ధరా
మండలమేల జ్యేష్ఠుc నస•మాను మదీయసుపుత్రు రాము ను
ద్దండ పరాక్రమున్ జన ను•తమ్ముగ నే యువరాజుc జేసెదన్. 13

ఉ. శ్రీయుతుcడౌరమా విభుcడ • శేషజగత్ప్రియుcడైనయట్లు "రా
మాయనమో" యటన్న జన • మండలినిన్ గృపc బ్రోచునెవ్వcడా
ప్యాయముగా నతండె తమ • పాలకుcడంచు, వరింపదే జనం
బీ యిల నీయ రాఘవున • కిప్పుడె, సజ్జన సమ్మతంబుగా. 14

చ. ముదుసలి నైతి రాజ్యమికc • బూన నొడల్ శ్రమకోర్వలేదు చి
క్కదు ప్రమదంబు, పెద్దయును • గాలము నేలితి, ధర్మపాలనా
హ్యదిని, జితేంద్రియుండెతగు • నీ భువినేల, గుణాన్వితున్ బ్రజల్
ముదమున గోరరే తమ వి•భుండుcగc కీర్తిc గ్రహింప కుందురే. 15

ఉ. మీ దొర మాటసేసి ప్రియ • మేయని పల్కcగరాదు, మీ హితం
బేదొ వచింపcగాc దగు, మ•హీపతిcగా రఘురాము సేయcగా
రాదని యెంతురేని, నివ•రంబుగ నట్లె వచింపcగాc దగున్
కాదని మీరలన్న మిమ్ము • కాదని యే నొనరింప నేదియున్. 16

శా. అమ్మాటన్ వినినంతనే సభ, మహో • హ్లాదంబుతో మేఘ రా
వమ్మున్ విన్న మయూరివోలె, నినద • వ్యాసక్తమై పొంగcగా
సమ్మోహింపగc జేసె రామ పదమే • సర్వమ్ము శ్రీరాముcడే
సుమ్మాయన్ దలcపే స్రవించె నచటన్ • శుద్ధాత్మ సంజాతమై. 17

శా. అంతన్ మౌని వసిష్ఠుcడున్ నృపులు, బ్ర•హ్మజ్ఞాన సంపన్నులు
న్సంతోషంబునc గోసలేశ్వు నుడి నం•తన్ యోజనన్ జేసి భూ
కాంతున్ రామునిc జేయనెంచి జన సం•ఘంబున్ విచారించి సి
ద్ధాంతమ్మున్ వినుమీనృపా!యని రిటుల్ • ధాత్రీశుcడుప్పొంగగన్.18

## పౌరజనయామోదము

ఉ. లోకులు పౌర జానపదు • లున్ నృపముఖ్యులు నెల్లవారలున్
రాకొమరుండు రాఘవుఁడె • రాజ్యము సేయఁగ నర్హుఁడంచిదే
వాకొనుచున్నవారు, తమ • భావములంగడు స్వేచ్ఛతోఁ బ్రభూ!
ఏకమగున్ త్వదీప్సితము • నీ జన వాక్యము, ధర్మమయ్యదే. 19

ఉ. ఏలితి వీవు రాజ్యము, న హీన బలాన్విత ధర్మ బుద్ధితో
వేల కొలంది యేండ్లు తగు • వేగ దమిన్ యువరాజు సేయ, నీ
బాలు, గజంబు నెక్కి రఘు • వర్యుడు ఛత్రసమన్వితుండురాఁ
జాలిత లోకమెల్ల కను • పండువుగాఁ గననున్నదో నృపా! 20

చం. అను పలుకుల్ వినంగ హృద • యమ్మున సమ్మద ముద్భవించియున్
జనపతి నెమ్మదిన్ గలుగు • సంతసమున్ వెలిబుచ్చ కుండ ని
ట్లను నృపులార! రాఘవు ని • లాధిపుగాఁ గనఁ గోరుచుంటకున్
బని యదియేది? నాదు పరి • పాలన మీ కహితంబొ తెల్పుడీ! 21

ఉ. నల్లనివాఁడు పద్మనయ • నంబులవాఁడు కృపారసమ్ముపైఁ
జల్లెడు వాఁడు సంతతము • సత్యపరాక్రముఁడైన వాఁడు మీ
చల్లని పిల్లవాఁడు జన • సంతతులన్ దయ నేలువాఁడు మే
మెల్లర మాతఁడే తగు సు • మీ యువరాజుగ నంట వింతయే. 22

ఉ. మోహనుఁడా ప్రియంవదుఁడు • మూఁడు జగమ్ముల నేలువాఁడు సం
దేహము లేదు దాశరథి • నిచ్చలు ధార్మికుఁడైన వాఁడు వై
దేహి విభుండు రాఘవుఁడు • ధీరుఁడు శత్రుభయంకరుండు మే
మా హిమశైల సన్నిభు ని • రంతర నిశ్చలునిన్ వరింపమే. 23

చం. సకల కళావిశారదుఁడు • సత్పురుషుండు రఘూద్వహుండు రా
జ్ఞికరము గొల్వఁగాఁ దగు పు • నీతుఁడు సర్వ జనమ్ము మెచ్చు పా
లకుఁడు రమావిభుండన ని • లన్ సిరి నిల్పఁగఁ జాలు మేటి ఏ
లిక, విజయుండు నిత్య సఫ • లీ కృతకర్ముఁడు, వానిఁ గోరమే. 24

చం. జనక సుతావిభు రాముఁడు వి • శాల మహీ స్థలికెల్ల రాముఁడై
తనరు. కరమ్ము లాతనికి • ధర్మము సత్యమునున్, సమత్వమున్
గనికరమున్ గనుల్, పదయు • గమ్ము పవిత్రత, నిర్మలా కృతిన్
గన నగు దివ్య తేజము, న్న • కాండను రాజుగ వాని నెన్నదే. 25

చం. అతి మధురంబు లౌనుడుల • నార్తుల మన్ననఁ జేయుఁ బాలనా
గతుల నెఱుంగుఁ బాలిత సు•ఖంబరయున్ సతతంబు క్రోధసం
గత మొనరింపఁ డెప్డుహృది • కర్మపరుండు జితేంద్రియుండు సం
తతము పరార్థచింతనము•నన్ మనురాముఁడు వాని నెన్న మే. 26

చం. సురలును మానవాళియు వ•సుంధరపైఁ గల రామమూర్తినే
వరములఁ గోరుచుంద్రు, జన • వల్లభుఁడౌచు వరప్రదాతయై
వరలెడి కాలముంగనెడి • వాంఛను వేచితిమింత వట్టు, దా
శరథి, మహాగుణోదధి, వి•శాంపతి సేయ వరంబొసంగుమా. 27

సీ. మునిరాజు వెనువెంట • వనచారియై చని,
తాటకన్ జంపిన • మేటివాఁడు
రక్కసి మూకల • నుక్కడగించుచు
మౌనికౌశికునిఁ దే•కైకనవాఁడు
గౌతమ ఋషి పత్నిఁ • బూతఁగాఁజేసిన
మహనీయ పాదప•ద్మముల వాఁడు
కరచాలనంబునఁ • గరళకంఠుని విల్లు
రెండౌట పేర్వడ్డ • దండి వాఁడు

తే.గీ. పరశురాము జయించిన • వాఁడు వాఁడు
భక్తి శరణన్నఁగా చెడి • వాఁడు వాఁడు
రామచంద్రుండు మాకుండ • రాజు గాఁగ
అన్యు నెవ్వరి వరియింతు • మయ్య మేము? 28

చం. ఫలముల కాకరంబు తరు•వైయల రారునుగాదె; భూవరా!
ఫలముల నారగించి మరు • వంగల మొక్కొ రసాలసాలమున్
సలలిత రామచంద్రుని వి•శాంపతిగా వరియించు నంత తో
వలగొనియున్న భక్తిమము•బాయునె నీ యెడ, మూలమీవెగా. 29

చం. అనఁగ సభాసదుల్ దశర•థావని పాలుఁడు మోదమొంది యా
జనతతి కోర్కెఁ దీర్పఁ దన • సమ్మతినిన్ వెలిబుచ్చి జ్యేష్ఠ పు
త్త్రుని యువరాజు సేయఁగఁబు•రోహిత ముఖ్యులఁ గాంచి పల్కె తో
డనె జయనాదముల్ దివిఁగ• డంగె దిశావలయంబు ముట్టఁగన్. 30

## యువరాజపట్టాభిషేకము

చం. ఇది మధుమాసమెంచ, నవె • యెల్లవనంబులు పుష్పితంబులై
హృది వికసింపఁ జేయుఁగడు • శ్రీకరమై శుభదాయకమ్ము నై
ముదమొన గూర్చెడిన్ బ్రకృతి; • పుణ్యతమమ్మగు నీనెలన్ దగున్
గద! పనులెల్లఁ దీర్చ రఘు•కాంతుని, నే యువరాజు సేయగన్. 31
చం. సలలిత వాగ్ఝరీ మధుర • సమ్ము శుభోదయ వాంచితార్థ మౌ
పలుకులఁ గోసలేశుఁడు స•భన్ గల వారల కెల్ల విందుగాఁ
బలికె. వసిష్ఠమౌని తన • చేరువ నుండిన వామదేవునిన్
గలిసి, నృపాజ్ఞఁ దీర్ప సమ•కట్టె సుమంత్రుని కెల్లఁజెప్పియున్. 32
చం. సచివులు మౌని సత్తములు • సద్వచనంబుల నెంచి తోడనే
యుచితగతిన్ మహా విభవ • మొప్పఁగఁ దీర్చిరి సర్వ కార్యముల్
బ్రచురితరీతి రాము యువ • రాజుగఁ జేయఁగఁ గోసలేశుఁడున్
శుచిశుభముల్, జెలంగఁ, గడు•శోభన లీల నొనర్చె సద్విధుల్. 33
తే.గీ. దశదిశల రాజు లెల్లరుఁ • దన్నుఁ గొల్వ
నా, ముని ప్రోక్త విధులెల్ల • నాచరించి
ముద్దుల కుమారు శ్రీరామ • మూర్తినంత
సభకు రావించె దశరథ • చక్రవర్తి. 34
ఉ. సుందర మూర్తి, కోసల వ•సుంధర నాధుని పుత్రరత్న మా
నంద, నిమగ్నుఁడైన జన•నాధుని మ్రోల, నయ స్వరూపుఁడై
వందన మాచరించుచు నృ•పా! భవదాజ్ఞను రామ వర్మ నీ
ముందర, నిల్చినాడనె, న•పూర్వ ముదంబున నేడు చూడఁగన్. 35
ఉ. ఆ సభయందు, మౌని నిచ • యమ్మును, రాణ్ణికరమ్ము; సంతత
శ్రీ సహితుండు, రాఘవుఁడు • చేతుల మోడ్చుచు నిల్వఁ జూచియ
ద్దేసకలమ్ము; జిక్కెనని యెంతయు సంతసమందు చుండి, ర
ద్దే, సుముహూర్త మన్నటుగ • నెల్ల సభాసదులున్ దలంపఁగన్. 36
తే.గీ. దశరథుండు, రాము • ఁదనివారఁ గని కని
కౌఁగిలించి మరలఁ • గౌఁగిలించి
యొడలు నిమిరి నిమిరి • యుచితా సనంబిడి
పలుకఁ దొడఁగె నిటుగ • ప్రజలు వినఁగ. 37

## రాముఁడు-దశరథ హితోపదేశము.

ఉ. రామ! జనంబులెల్ల యువ॰రాజుగ నిన్నె వరించినార లీ
వో, మహనీయ సద్గుణ,మ ॰ యుండవు నాతొలి దొల్త బిడ్డవున్
నామముకారమూర్తివియు॰ నమ్ముఁడవౌట నయోధ్య, న్యారమా
రాముఁడవై, వసింప, యువ॰రాజుగఁ జేసెద నిన్ను రేపటన్. 38

తే.గీ పుష్యమీతార వచ్చెడి ॰ పుత్త్రి! రేపు
అదియె, శుభదంబు యువరాజ॰వగుట కరయ
నీవు సంసిద్ధుఁడవుగమ్ము ॰ నేల నేల
ధర్మ విధులెల్లఁ దెలిసిన ॰ కర్మవీర! 39

ఉ. నీవె,సమస్త ధర్మములు ॰ నేర్చిన వాడవు, కాని మిత్రుఁగా
భావనఁ జేసి నిన్ను మహీ॰పాలన రీతులు గొన్ని చెప్పెదన్
పావనమూర్తి! నీసచివ ॰ వర్గము తోడనె కూడి మంతనం
బీవెపుడున్ బొనర్పఁదగు, ॰ నేమరకుండ జితేంద్రియుండవై 40

చం. వ్యసనములన్ ద్యజించి, విన॰యమ్ము వహించి నిజారి షట్కము
న్వెస విడనాడి నీహృదిని. ॰ నిర్మలమైన బ్రజాను రక్తితోఁ
గసరక, సైన్య నాథులను ॰ గాంచుచు వారలఁ బ్రేమతో సదా
వసుధఁకుఁజక్రవర్తివయి ॰ పాలన దాశరథీ! యొనర్పుమా. 41

తే.గీ ధనము, ధాన్యమ్ము సతతమ్ము ॰ తఱుగు లేక
వృద్ధి సేయు నృపాలుండె ॰ పృథ్వినెల్లఁ
గీర్తివడయును బాలితుల్ ॰ కీర్తి సేయఁ
గూడుఁ గుడ్డయుఁ బ్రజకిచ్చు ॰ వాఁడె ఱేఁడు. 42

ఆ.వె అనెడి తండ్రిమాట ॰ కంజలి ఘటియించి
గురున కంతమొగ్గి క్కెఁ ॰ గూర్మి సుతుఁడు
రామమూర్తి హితులు ॰ రాణి కీశుభవార్తఁ
దడవులేక తెలుపఁ॰ గడఁగి రపుడె. 43

తే.గీ పుష్యమిని రేపె మనరాఘ॰వుండు మనలఁ
బాలనముసేయ మొదలిడు ॰ భాగ్యమబ్బుఁ
నంచు సభ్యులెల్లరు ముద॰మంది వెడలు
నంత, సభనెల్ల జాలించె॰నాన్నృపుండు. 44

తే.గీ సభను జాలించి దశరథ • చక్రవర్తి
తనదు సౌధంబు నందుండి • తనయు రాము
మరల రావించి ముద్దాడి• మమత దీర
ఆసనంబిడి యేమొ యి•ట్లనఁగడంగె. 45

చం. ముదుసలినైతి, నింకఁ గ్రమ• బుద్ధినిఁ బట్టముఁగట్టనీకు నా
యెద తపియించుచున్న యది • యేకవిధంబున చిత్తవృత్తి ని
ల్వదు గద యేరికైనను? వి•లంబన మిట్టి సుకర్మమందు గూ
డదు, యువరాజవై సుఖ • పరంపరలన్ మనుమీ సుపుత్రకా! 46

ఉ. ఉండిరి సూర్య రాహు కుజు • లొక్కట నాదగు జన్మ తార, ని
ట్లుండుట, ప్రాణహాని యని•యున్ గడునాపద కాలమంచునున్
ఖండితరీతి విజ్ఞులనఁ•గా వినియుంటిని. ఇంతెకాదు భూ
మండలమెల్ల దద్దరిలు • మాడ్కిని దుశ్శకునంబు లయ్యెడిన్. 47

చం. భరతుఁడయోధ్యకున్ మరలి • వచ్చుటకున్ మునుపే మదీయ రా
జ్యరమఁ ద్వదీయహస్తము ప్ర•శాంతముతో గ్రహియించుగాక నా
భరతుఁడు ధర్మవర్తనుఁడు • ప్రాజ్ఞుఁడు, వాఁడు జితేంద్రియుండు నీ
సరణినిఁ బోవువాఁడు మది • సంతతమున్ దయనిల్పువాఁడెగా 48

ఉ. సందియ మేమిలేదు, కడు• సజ్జన మార్గమువాఁడు, కాని యీ
బొందె లశాశ్వతంబులు, సు•బుద్ధులుఁ గూడననిత్య మెంచ, నే
కొందఱొ ధర్మ తత్పరుల • కుంఠితరీతి చరింత్రు, వార లా
నందమునన్ మెలంగుచు,న• నారతమెంతురు మేలె రాఘవా. 49

తే.గీ ఈవు నియతాత్మనుండు మీ • యీ క్షణమ్ము
మొదలు, దర్భ శయనుఁడవై • పూనఁదగును
భార్యతోఁగూడ నుపవసిం • పంగ వ్రతము
పుష్యమియు వచ్చు రేపె సు•పుత్రరామ! 50

తే.గీ ఇట్టి ఘనకార్యమునుఁ జేయు • పట్టునందు
జాగరూకత వలయు, నీ • సహచర తతి
నిన్నుఁగాపాడఁగాఁదగు• నియతితోడ
సుకృతములె విఘ్నపరమౌట• ప్రకృతి గుణము. 51

కం. అనుచున్ హితమును బల్కెడి
జనకుని మృదుభాషణమ్ము • చక్కగ వినయం
బున విని, ప్రణమిల్లి సెలవుఁ
గొని తన, మేడకుఁజనె రఘు •కుంజరుఁ డెలమిన్. 52

రాముఁడు-కౌసల్యా-ఆశీస్సులు.

ఆ.వె తన సుపుత్రుడింక • ధాత్రీశుఁ డగునని
సంతసించుచున్న • జనని కడకుఁ
దడవు సేయకంత • దశరథ సుతుఁడేగి
మ్రొక్కి దీవనలను • బొందుచుండె. 53

ఆ.వె అత్త పిలువనంప • నటకేగె సీతయు
వినయ మొప్ప రాణి • విధులఁ దీర్ప
:: "వత్సరాముఁ" గాంచి • వర్ధిల్ల దీవింప
నా సుమిత్రగూడ, • నచట నుండె, 54

ఆ.వె అన్నఁగాంచి మ్రొక్కి • ఆశీస్సు లందుచుఁ
దనదు విధులఁ దీర్పఁ• దడవు. లేక
లక్ష్మణుండు కడు వి• లక్షణయుక్తుఁడు
రామ చంద్రుఁగూడె • రహిఁచెలంగ. 55

తే.గీ శ్రీకి మ్రొక్కి జనార్దనుఁ• జేర్చి హృదిని
రాజ్యలక్ష్మిఁ దలంచుచు • రాఘవునకు
దీవనలొసంగు నామాతృ • దేవికిట్లు
పలుకఁ దొడఁగెను రాముండు • భక్తి తోడ 56

తే.గీ తండ్రి నియమించె నంబ; యీ • ధాత్రిఁ బూని
నే,ప్రజా పాలనాకర్మ • నెఱప, రేపె
జరుగుఁ బట్టాభిషేకమ్ము • జరుపు మింక
ధర్మపథి మంగళప్రద • కర్మ మెల్ల 57

తే.గీ నేను జానకియుంగూడ • నేటి రాత్రి
నుపవసింప విధించి రా • యుర్వి పతియు

---

( వత్స రాము-వక్షే-వక్షము నందు; రామా యస్యసః వత్సరామః
వక్షమునందు లక్ష్మీగల వాడు; )

గురుఁడు ఋత్విజులునుఁ గడు • కూర్మితోడఁ
దల్లి దీవింపుమీ మమ్ము • దంపతులను. 58

ఆ.వె అనెడి రాముఁగాంచి • యా యమ్మ కౌసల్య
హార్ష బాష్పకణము • లల్లె రాలఁ
దాను చాల పండ్లు • తలపోయుచున్నట్టి
వాంఛితంబు దీరు • నంచు నెంచి. 59

ఆ.వె ఆసుమిత్ర హితుల, • నటుగ,నా హితతతి
జ్ఞాతి వారి సమతఁ • గనుము సతము
రాజ్య మూని సుత! చిరంజీవి వగుమయ్య
అనుచు నుడువసాగె • నా సుశీల 60

ఆ.వె.+"వత్సరామ" యనుచు • "వైరులు నశియింత్రు
గాక"యనుచు "దీర్ఘ కాల జీవి"
వౌదుగాక యనుచు • నాశీర్వదించెను
(శ్రీ) సమేతుఁడౌచుఁ • జెలఁగ సుతుఁడు 61

ఆ.వె. నాదు బాంధవులకు • మోదంబుఁ గూర్పు మీ
యనుచుఁ బలుకసాగె • నది యదేమొ!
ఆ సుశీల యపుడె • ఆత్మజు భవితవ్య
తనుదలంచి స్వస్తియనెడు రీతి. 62

ఆ.వె పురిటియింటఁ గన్న • మూర్తి స్ఫురించి యొ
"వత్సరామ"యనుచు • వత్సలతను
గర్భ వతిగనున్న • కాలంపుఁగలలన్ని
యెంచి యో,రిపులు నశించు దురను 63

ఉ. పుట్టినవాడవీవు కడుఁ • బూజ్యతమంబగు తారయందుఁజే
పట్టుము రాజ్యలక్ష్మి,నయ • భావములన్ గురుపూజ సల్పుచున్
దిట్టరివౌచు, నాకడుపు • తీపి ఫలించెఁ గదా సుపుత్ర! యి
ప్పట్టున ధన్యనైతి సుమ • పండెను నోచిన నోములన్నియున్ 64

తే.గీ అనుచు దీవించు తల్లికి • నా సుమిత్ర
కంత "దాసోహ" మని మొక్కె • నమితభక్తిఁ

+( "వత్సరామచిరంజీవ, హాతాస్త్రే. పరిపంథినః" 6 వ సర్గ శ్లో 88. అ)

గనుచుఁ గై మోడ్పుతో నున్న • ననుజుఁ బ్రేమఁ
బలుకు నగు మోముతో రామ•భద్రుఁడంత 65

తే.గీ ఈవె రెండవ ప్రాణ మూ• హించ నాకు
నాదు రాజ్యమ్ము సర్వమ్ము • నీదె సుమ్ము
అనుభవింపుము రాజ్య సౌ•ఖ్యమ్ములన్ని
అస్మదీయాంత రాత్మ యీ • యవని నీదె 66

చం. అనిచనె స్వీయ సౌధమున•కారఘుకుంజరుఁడాత్మ పత్నితో
జనపతి యాటకున్ విహిత• శాస్త్రవిధుల్ నెరవేర్చి. నాటి, రే
యిని గురుఁడౌ వసిష్ఠముని • యింటికి వచ్చెడినంచు వేచియుం
డెను నుపవాస దీక్షఁగొన • శీ విగఁ జుక్కల జేనిఁ జూచుచున్ 67

## రాముఁడు-వసిష్ఠుఁడు

మ. మరునాడే యువరాజుఁ జేసెడిదినం • బై యుంట, రాజేంద్రుఁడా
గురునింగాంచి సమస్త వస్తుచయముల్ • గూర్పన్విధించెన్ ఋషీ
శ్వరు డట్లే సెలవిచ్చి మంత్రులకు, కౌ•సల్యా సుతున్ జేరి; శ్రీ
కరమౌ సద్విధులెల్ల సక్రమముగాఁ• గావింప నేగెన్ వెసన్ 68

తే.గీ ఎన్ని ప్రాకారములు గల్గి•యున్న, నేమి?
ఎట్టి యాటంకములు లేక• యే,గురుండు
జానకీరాఘవులఁ జేరె•లోని కరిగి.
సంతసిలివారు మునికిఁ "దా• సౌస్వ" యనిరి 69

తే.గీ అతఁ డిక్ష్వాకుకులగురుఁ• డౌట వలన
రాఘవుల కెల్ల సంప్రీతిఁ• గ్రాలుచుండె
నంతెకాదు మహాముని•యై, యనంత
సిద్ధిఁ గని నట్టి శిష్ట వి•శిష్టుఁ డతఁడు 70
మునిమాన్యుంగని • మోదముతో
వినుతింజేసిరి • ప్రేమ మెయిన్
తనువుల్ నాడవా • ధన్యములం
చని పాదంబుల • నంబువుతో 71

తే గీ కడిగి, శిరసావహించి యా • కంకణముల
వంశగురు వైన మునివరు • పాదతీర్థ

మ ల్పె "ధన్యోస్మ"యనిరంత • నమితభ క్తి
జానకీరాఘవులు • నమస్కారమిడుచు. 72

ద్వి. చిరునవ్వు మొలకెత్త• జేమోడ్పుతోడ
నరవింద పత్రాక్షు• నాముని కాంచి
పరమేశ! లక్ష్మీశ!• ప్రభవించినావు
ధరపైన రావణు• దలల గొట్టంగ. 73

సీ. ఏ పాద జలముల•నీశుండు తలఁ దాల్చెఁ
శివుఁడౌచు దేవ వి•శిష్టుఁడా యె
ఏ పాదతీర్థంబు•పాపహరంబుగాఁ
దమిఁజేసి మా ×తాత•ధన్యుఁడా యె
ఏ పాద యుగళమ్ము•ప్రాపౌట సంసార
సాగర తరణియౌ•సాధుతతికి
ఏ పాదపద్మమ్ము• లెంచిన మాత్రాన
సంచితవాసనల్ •సమసి పోవు

తే.గీ అట్టి మహనీయ దివ్య ప • దాబ్జ సీమ
నిలిచిఁయుంటిని ధన్యుఁ డ• నేన సుమ్ము
నినుఁ బరంధాము, వైకుంఠ • నిలయ వాసుఁ
గాంచి పూజించి తరియింపఁ• గలిగినాడ. 74

కం. నీవే గురుఁడవు, సృష్టికి
నీవే కర్తవును, భర్త• నీవే సుమ్మా
దేవతల కిడిన వరమున
నీ విటు భువిఁ బుట్టినావు • నిజ మిది రామా! 75

ఉ. యోగవిశిష్ట దృష్టి నిను • యోగులు గాంతురుగాని నీదు సం
యోగముఁబొంది సత్క్రతుల•నొందుచు నీ గురుపూజలంద నౌ
యోగముగల్గె నాకె, భువి•నుంటిని దేహముతోడ నిన్గనన్
సాగర కన్యకాపతి! ని• శాచర శిక్షక! సాధు రక్షకా! 76

శా. మాయామేయ జగత్పితామహుఁడవై • మాన్నాధ!లోకార్థమై
మాయాచ్ఛాదిత మానవాకృతిఁ జరిం• పన్ జానకీ లక్ష్మితో

× తాత = తండ్రియగు బ్రహ్మ

ఆయా ధర్మనిరోధి రాక్షసుల సం•హారార్థమై పుట్టి నా
వోయీ! మీదు పురోహితుండనయి నే•నుంటిన్ నినున్ గాంచఁగా. 77

ఉ నాయన! రామచంద్ర! రఘు•నాయక! అచ్యుత! జానకీవరా!
నీయవతారముం దెలియ • నేర్చిన, తాపసి నేను, బ్రహ్మమున్
నాయెడ కూర్మి మై తెలిపె • నాకనివాసుల, సజ్జనావళిన్
బాయక ధర్మరక్షకుఁడ•వై యిలఁ బుట్టెద వంచు నీ విటన్, 78

శా. పౌరోహిత్యము పాపమంచెరిగియున్ • బాయన్ గదాదాని నే,
శ్రీరాముండొక కాలమందు పుడమిన్ • శ్రీరామతోఁగూడ,లో
కారాధ్యుండయి పుట్టునంచు విని ధ్యే•యంబైన యామూర్తి, నా
త్మారామున్ గనవేచియుంటి నిటుగన్ • "ధన్యోస్మి" నారాయణా! 89

తే.గీ నేనె గురువుగఁ జరియింతు • నీ స్వరూప
మేరికినిఁ జెప్పదలఁప,ర•మేశ! రామ!
భూమి నవతార మెత్తిన • :: "పూర్వసంధ్య"
విజయ మగుగాక దు•ష్టులు వీగిపోవ. 80

శా. మాయామేయ జగన్నియామకుఁడవై • మౌనీంద్రులంగూడ, నీ
మాయన్ ద్రోయఁగఁ జూచెదో? ఎరుగుదున్ • మాదేవిగా జానకిన్
కాయంబూని నృపాత్మజుండవగుచున్ • కౌసల్యా సంతానమై
ప్రాయంబంది భవిష్య దర్థము నటిం•పన్ జూచు నిన్నెంచెదన్. 81

తే.గీ × ఆది నారాయణాయ తు• భ్యం నమోస్తు
భక్త సంరక్షకాయ తు• భ్యం నమోస్తు
పతిత జన పావనాయ తు• భ్యం నమోస్తు
అమల భక్త భక్తాయ తు• భ్యం నమోస్తు. 82

ద్వి. అని చెప్ప వాల్మీక• యా రాముఁగాంచి
చనినాఁడు సిద్ధుఁడు • ముని తల్లజుండు 83

తే.గీ పాహి మాం, పాహిమాం, ప్రణ•వ స్వరూప
పాహి మాం, పాహిమాం, రఘు•వంశరామ

---

:: (పూర్వసంధ్య = పూర్వప్రతిజ్ఞ)
× (ఆధ్యాత్మ రామాయణం సర్గ-2)

పాహిమాం, పాహిమాం, వట • పత్రశాయి
పాహిమాం, పాహిమాం, పాహి•పాహి పాహి 84

తే.గీ అనుచు నిక్ష్వాకు కులగురుఁ•డంత వెడలె
వేద విధులన్ని దీర్చి దీ•వించి రాము
జన్మసాఫల్య మొందిన • సరణి నెంచి
దాశరధి భావి కార్యంబుఁ• దలఁచి తలఁచి. 85

:: నారదుఁడు శ్రీరాముని సందర్శించుట

మ. లలితశ్యామల దేహవల్లి వెదజ•ల్లం గాంతి పుంజంబులన్
విలసత్ కౌస్తుభరత్న భూషణరుచుల్•పెంపొంది మైదీవ రా
జిల, సీతాసతి వీవ చామరముతో • సింహాస నాసీనుఁడై
లలినుండెన్ జిలువెన్నెలన్ ముదమునన్•రాముండులీలాహృదిన్. 86

ఉ. కాలము వేళయున్ మరువఁ•గాఁగల రీతిగ, మేళవించి, తం
త్రీ లయ బద్ధ గీతఫణి•తిన్ ×మహతిన్, మృదు నాద సంప్లుత
శ్రీలు మనోహరంబుగ, న•శేష జగన్మయ మౌచు, రాఘువుం
డాలనసేయ షడ్జమ; మ•హాగతి భక్తుఁడొకండు పాడెడిన్. 87

ఉ. హాయిగ వీణ మీటుచు, వి•హంగ పథమ్మున, రామనామ, సం
ధాయక భక్తి తత్పరత ఁ•దాళము రాగము మేళవించుచున్
మ్రోయఁగ, గజ్జలున్, జిలుత•లున్ భువికిన్ దిగివచ్చు చుండె నా
ప్యాయముఁగాగ నారద మ•హాముని, నృత్యముసేసి పాడుచున్. 88

తే.గీ అతఁడు శుద్ధ స్ఫటిక కాంతి•నలరు వాఁడు
మౌని కుల శేఖరుఁడు సిద్ధుఁ•డైన వాఁడు

---

:: నారదః నార దేతి:-నరస్యేదంనారం. అజ్ఞానం• తత్ద్యతి ఖండయతీతి నారదః. దో అవఖండనే ఇతి ధాతోః యద్వా నరతి సద్గతిం ప్రాపయతీతి నరః పరమాత్మా. శ్లో. నరతీతి నరఃప్రోక్తః పరమాత్మా సనాతనః. ఇతి భారత వచనాత్. త్వదిషయక జ్ఞానం నారం తద్దదా త్యుపదిశ తీతి నారదః

నారదుడు:- మనుష్య సంబంధ అజ్ఞానమును ఖండించువాఁడు. నరుఁడనగా పరమాత్మ. ఆ పరమాత్మ జ్ఞానము నిచ్చువాడు నారదుఁడు:-

×(మహతి:- నారదుని వీణ పేరు. సరస్వతి వీణపేరు కచ్ఛపి. తుంబురుని వీణ పేరు కళావతి)

దివిని భూమినిఁ దిరుగాడు॰ తేజు వాఁడు
లోకహిత మెంచువాఁడు త్రి॰లోకచారి. 89

వాసుదేవ! ముకుంద! కేశవ! భక్తవరదా! నమోనమో
అసురాంతక! శిష్టరక్షక! ఆదిపురుషా! నమోనమో
కోసలేశ్వర! జానకీప్రియ! గూఢచరితా! నమోనమో
భా సమాన యశో విశాంపతి! వైరిహారణా! నమోనమః 90

క. అనుచున్ బాటను మహతీ
స్వనమున మేళంబుఁజేసి॰చదలు ధ్వనింపన్
జనము కనంగ నయోధ్య కుఁ
జనుదెంచెను ఋషివరుండు॰చంద్రుఁడు వెలుగన్ 91

తోవక వృత్తము శ్రీరఘురాముని ॰ సేవను బొందన్
నారదుఁడంతట॰నమ్రితఁజొచ్చెన్
సారస నేత్రుని॰సౌధములోనన్
గౌరవ మొప్పఁగ ॰ గాంచెను రామున్. 92

పాదప వృత్తము సాగిలి మ్రొక్కుచు॰జానకి తోడన్
వేగమ రాముఁడు॰విశ్రుత మౌనిన్,
యోగ విశిష్ట! సు॰యోగము గల్గెన్
స్వాగత మంచనె॰సంతస మొప్పన్. 93

ఉ. నారద మౌని సత్తమ! య॰నారత లోక హితాభిలాషి! సం
సారులమైన మా కెటుగ॰సాధ్యము నిన్గన! నీదు దర్శనం
బారయ పూర్వ పుణ్యము క॰దా! సఫలీ కృతమాయె జన్మ, సం
సారులుఁగూడ నొక్కతరి ॰ సాధు సమాగమ మొందకుందురే! 94

ద్వి అనునంత రాఘవుం॰డామౌని పలికె
వినుమంచుఁ జిరునవ్వు॰వెలయంగ వేడ్క. 95

ఉ. ఆరయ సర్వలోకముల॰కంబవు నబ్బవుఁ నీవ, నీదు సం
సారము పెద్దదే! నిజము సత్యము ॰ సృష్టి కనాది భూతమౌ
ధీరుఁడవీవ! దానికి న॰తీతుఁడవై చరియించు వాడ నీ
దారయు మాయయే కద? స॰దా కను నామెయె లోకసంతతిన్. 96

తే.గీ. కట్టి సంసార మీ దంగ • నేరి తరము!
ఆధ్యునకుఁ దప్ప, లోక హి • తాభి లాష!
సర్వము, నశింప, వట పత్ర • శాయి, వగుచు
విశ్వ లీలల, ఘటియించు• వేద వేద్య! 97

ఉ॥ నే నహా! నీకుఁ జెప్పఁగల•నేర్పరినా? భువనత్రయంబు, నీ
లోనఁ, గలట్టిదేకద! యె•ఱుంగుదు. నన్నిటు మోస పుచ్చెదో!
కానని, వాని నూతఁగొని•కానఁగ నెంచెడి ప్రాకృతుండు నా
గానఁగ నెంతువే? భువన• కర్తవు భర్తవు నీవు రాఘవా! 98

కర అరయ నీ భువన త్రయంబు మ•హా గృహంబగు నీకె హా!
లము పర మెఱుంగని యట్టి మాయయె•పాయకుండెడి జాయ యా
హారణముం గనలేని సృష్టికి• ఆది భూతము మాయె, హో
పరుఁడవై యిది ఎల్లఁగాంచెడి•పర్జ్ఞ నీ దగు నిత్యమై. 99

తే.గీ. నీవెగా విష్ణుమూర్తివి • నీదు సీత
లక్ష్మియే కాదె? శివుఁడవు • రామ నీవు
ఈశ్వరియె సీత, పద్మజుం • డీవె, వాణి
సీత, సూర్యుండ వీవాదు • సీత ఛాయ 100

తే.గీ. ఇంద్రుఁడవు నీవు, శచి సీత• యింతి నీకు
అగ్ని వీవు, స్వాహా దేవి • యవని జాత,
రుద్రుఁడవు. సీత రుద్రాణి, • లోకమందు
చెల్వు స్త్రీ వాచకంబు నీ • దేవి సీత 101

తే.గీ. పురుష వాచక మీ వౌదు • పరమ పురుష
"నాస్తి" మిము మించి లోక త్ర • యంబు నందు
"నాస్తి" రూప మాకారము • నాయుధమ్ము
"నాస్తి" నెలవొండు! పురుషుండ • వౌట నీవు. 102

తే.గీ. ≐ భక్తులకుఁ గోచరింతువు • భ క్త భ క్త!
అంతరిక్షంబు విస్తృత • మయ్యు విడువ
బాణములు లేని విలుకాండ్ర • పగిది సుమ్ము
బుద్ధి నశియింప గోవిందు • సుద్దు లనరు 103

---

≐ (రామోప నిషత్తు నుండి)

తే.గీ. నీదు సద్గుణ రాశి వ • ర్ణింప నగు నె
శబ్దములు లేమి భక్తుఁడు • స్తబ్ధుఁడగును.
తావకీన పదంబులఁ • దగులు వాఁడు
నీదు పద పద్మములుఁగొల్చు • నియతి వాఁడు 104

తే.గీ. గాంచి జ్ఞానంబు ముక్తినిఁ • గాంచుఁదుదకు
అరయ త్వద్భక్త భక్త కిం • కరుఁడ నేను
మోసపుచ్చక నన్నింకఁ • బ్రోవు మయ్య
రామ! సర్వజ్ఞుఁడవు నీకె • ప్రణతిఁ జేతు
బ్రహ్మ నిను గూర్చి చెప్పెనో • పరమ పురుష! 105

తే.గీ. దివ్య మంగళ విగ్రహా! • దేవ దేవ!
భవ్య చరితాత్మకా! రామ! • పార్థివేంద్ర!
రమ్య గుణధామ! జానకీ • రామ! రామ
పాహిమాం, పాహి, రామ తు•భ్యం నమోస్తు 106

చం. దరహసితాన నుండగుచు • ధాత్రిజ భర్త రమా విభుండు, సా
దరమున బల్కె మౌనికి య•థా విధి, నా శపథంబు, దీరు, నే
ధర నవతార మెత్తిన క•థా స్మృతి దప్ప దు, నారదా! హృదిన్
స్థిరమది, రావణాసురు వ•ధించెద నిల్పెద ధర్మ మీ యిలన్. 107

చం. దివిజుల కిచ్చినట్టి నుడిఁ•దీర్చెదఁ, గాలము కూడి రావలెన్
భువి, జనియించు జీవులకు•పుణ్యము పాపము పండఁ గావలెన్
అవగుణ రాక్షసావళి వ•ధార్థమె పుట్టితి ధర్మ మూనెదన్
భువిజ, నెపంబునన్ దునుమ•ఁబూనెద దుష్టుల ధర్మరక్షకై. 108

చం. తెలియని దేది లేదు ప్రకృ•తిన్ సకలంబును నే నెఱుంగనే
యిల జనియించినట్టి పని•కేగెద రేపె, ధరా తనూజ తోఁ
గలసి వనీస్థలిన్ దిరుగఁ•గా యతివేషముఁ బూని, రావణున్
బలిమిని జంపి రక్కసుల•వర్తనమున్ సరి చేయ నెంచెదన్. 109

తే.గీ. పదియు నాలుగేండ్లు•వనవాసముం జేసి
నేలఁగూల్తు రావ • ణీయ బలము
సురలు ముదముఁ గాంచఁ • బరిమార్తు నసురుల
ధర్మ రక్షఁజేసి • ధాత్రి యందు. 110

చం. అనిన ప్రతిజ్ఞ వించు సుర • లందఱు సంతస మంది రాదివిన్
మునివరుఁడో కరంబులను • మోడ్చి శిరంబున రామ పాదముల్
గనుచుఁ బ్రదక్షిణించి రఘు • కాంతుని భక్తిని మూడు మారు లా
తని హృదినిల్పుచున్ మహతి•తంత్రులమీటుచుఁ బాడుచుంజనెన్.111

మాలిని. జయము, జయము దేవా • శాశ్వతానంద ధామా
జయము జయము రామా • సత్య సౌందర్య రూపా
జయము, జయము శ్రీశా • సద్గుణోపేత వీరా
జయము. జయము విష్ణూ • సర్వలోకైక జిష్ణూ 112

చం. అనుచు విహంగ వీధిఁజను • స్వామునిఁ గాంచి రయోధ్యలో జనుల్
వినతు లొనర్చుచున్ సురలు • వింటిమి నీనుడి రాము మాటయున్
బని యిక దీరునంచనిరి • స్వాగత మిచ్చిరి హృష్ట చిత్తులై
మునియు నదృశ్యుఁడై చనెఁబ్రి• మోదముతోడఁ ద్రిలోకచారియై.113

ఆ శ్వా సాం త ప ద్య ము లు

ఏమిది రాఘవా! కలము•నెత్తినవాఁడ నయోధ్య కాండమున్
నీమముతోడ వ్రాయఁగరు • ణింపవ? వ్రాసిముగింప నోప నా?
"రామ" యటంచు సంస్తుతిని• వ్రాసితి నంతట వామ పార్శ్వ మం
తా మెయిఁబక్షవాత రుజ•దాఁకెను మాటయు రాదు నోటికిన్. 114

చం. గ్రహములు నీదు సృష్టికద • రాహువు కేతువు గూడ స్వేచ్ఛమై
నిహపరదాయకంబులు, త్వ • దిచ్ఛమెయిన్ గ్రహచారముండుఁగా
గ్రహము లొనర్చు బాధలను • రాగల కీడుల నాపఁజాలవో
రహి నినుఁగొల్చువారల పు•రాకృత కర్మ నశింపఁజేయుచున్. 115

ఉ. ధర్మముఁబూని కారడవి • ధాత్రిజఁగూడి సలక్ష్మణుండవై
మర్మములేక జొచ్చితి వ• మాయికులన్ దయఁబోచు దీక్ష, నా
కర్మఫలంబదేమొ? ననుఁ•గావఁగరావు త్వదంఘ్రి యుగ్మమున్
బేర్మినిఁ గొల్చువాఁడ కద? • వేగముగా రుజఁబాపు రాఘవా. 116

మ. కుడిచేతన్ లిఖియింపఁగాఁ గలిగితిన్•గోదండ పాణీ! రుజన్
మడియంజేయఁగ రమ్మురమ్మనిన నా•మాటల్ చెవిన్ సోకె, నీ
యెడ, సంజీవిని దెచ్చియిచ్చితివో, వే•రే రీతిఁ గావించితో
వడిగా మూఁడవనాడె నోరు చెయికాల్•వచ్చెంగదా రాఘవా! 117

ఉ. నీ దయ యెట్టిదో? యెటుగఁ•నెయ్యముఁ జూపెదో నీగతిన్ గనన్
రాదు, కనంగలేమి చెడు•రాదు, నితాంతము భక్త సంతతిన్
సాందరదృష్టితోఁ గనెడి•స్వామివి, నిన్నిల, నమ్మువారలన్
గాదనఁడంచు సత్యము ది•గంతములంటఁగఁ జాటి చెప్పెదన్. 118

చ. ఇక కలముం గ్రహించెద, మ•రే విధమో నవరోధమింకఁ, గాం
చక, భవదీయ సత్కృపను•క్ష్మాతలనాథ! అయోధ్యగాథఁ బూ
నిక రచియింపఁ జేతువని•నిశ్చల నిర్మల బుద్ధి నీదు. పా
దుకలు లభించుదాఁక విన•తుల్ గడుఁజేయుచు వెంటనుండెదన్. 119

శా. పూజా పుష్పముగా నొనర్చితి నొడల్•పూజింప నీ పాదముల్
రోజూ రోజును, గాని యీ తను వహో•రోగంబుచే మ్రిగ్గఁగా
వ్యాజంబేమి? పరీక్షయా? వపువు దే•వా! తేజుఁ గోల్పోయి, నీ
పూజార్హంబగు నొక్కొ? వాడిన సుమం•బున్ బోలదే? రాఘవా. 120

శా. కాలాంభోధర కాంతి కాంతమగు నీ• కాయంబు సేవించెదన్
హేలన్ నిత్యము కాని యీ మెయికి సుం•తేనిన్ భవత్తేజ మే
లా లాభింపదు? చూచి తృప్తిల వదే•లా యందువా? జూచుచున్
కాలాకాలము దేహమున్నిలుపుమా• సత్యా? శివా? సుందరా? 121

తే. ధర్మసాధన భూత మీ•తనువె యగుట
బ్రతికి యున్నంత కాలంబు•భద్ర గతిని
రుజ విహీనంబుఁగా నైన• తేజు గలిగి
నిన్ను సేవించుటకె మేను•నిలువ వలయు. 122

శా. మాయా మానుష రూపముంగనిన నీ•మాయా విలాసంబుతే
ధ్యేయంబై మనుచుంటయే సుకృతమై•యీ జన్మ సాఫల్య మౌ
కాయం బెంచగఁ రోగపీడితముఁగాఁ•గాకున్నచో మాత్రమే
వ్రాయం బాడఁగఁగల్గుదేహి? రఘు వీ•రా నీదుసత్కావ్యముల్. 123

శా. కొమరులు లేరటంచు భువి•కొందఱు దుఃఖదవాగ్ని దగ్ధు లౌ
సముచిత భాగ్యభోగ్యములు•చాలవటం చని కొందఱార్తు లౌ
అమలుని,శాశ్వతున్ సకలు•నాద్యుని నిత్యసుఖ ప్రదాత, నా
అమృతమయున్ బరాత్పరుని•అప్తునిఁ జూడఁ దపింప రేలకో. 124

శా, ధనమునుఁ దోడఁబుట్టువును•దల్లియుఁ దండ్రియు నాలి బిడ్డలున్
జన నుతిఁగన్న కీర్తియు, వి•శాల ధరా స్థలి పాలనంబునున్
జనక సుతాభి రామ! భవ•సాగర మీదఁగ నావ యౌనె, నిన్
గనఁగఁ దపంబు సల్పుట సు•ఖంబగు సత్పథ మౌను జీవికిన్. 125

గోవింద రామాయణము – పాదుకా పట్టాభిషేకము-అను
కావ్యమునందు ప్రిధమాశ్వాసమగు రాజ్యాశ్వాసము
సమాప్తము.
శ్రీ శ్రీ శ్రీ

ఓమ్

# శ్రీ గోవిందరామాయణము

# మాయాశ్వాసము

మాయను సృష్టించుచు, నా
మాయనె జన్మించి ప్రకృతిఁ మాయకు లోనై
ధ్యేయుఁడవై మసలెడి నా
రాయణ! త్వ దనంత గుణముఁ లారయ వశమే. 1

## అయోధ్యానగరము - కోలాహలము

కం. ఎచ్చటఁ జూచినఁ బ్రజలే
హెచ్చిన మోదంబు తోడఁ హేలాగతి నా
రచ్చల నిండిరి రాఘవు
మెచ్చుచుఁ గాంచుచు నయోధ్యఁ మేలగు సొబగున్. 2

ఉ. ఆ పురపాలకుండు బహుఁళా ధ్వర సంచయ ధర్మ కర్మ దీ
క్షా పరుఁడైన వృద్ధుఁడు విఁశాంపతిఁ గా సుతు జ్యేష్ఠు, సత్య ని
ష్ఠా పరతంత్రు రాఘవునిఁ సల్పఁ దలంచె, నయోధ్య యింక, శో
భా పర దేవ లోకముగఁ నంతనె మారుట గొప్ప వింతయే. 3

ఉ. శ్రీయుత రాజ్య వైభవముఁ చేకుర మౌని వసిష్ఠు నాజ్ఞ, నా
రాయణుఁ బూజ సేసె రఘుఁ రాముఁడు జానకితోడఁ గూడి, నా
రాయణ మంత్ర రాజము విఁరామము లేక జపించి, వెన్నెలన్
హాయిగ రత్న పీఠి జనఁకాత్మజ తోడుత నుండె వేడుకన్. 4

తే గీ. రాముఁ డుపవాస మున్న తెఁఱంగు నెల్ల
నా వసిష్ఠుండు తెల్పఁగాఁ నాలకించి
దశరథ నృపుండు చేరె నంఁతః పురంబు
కుశల వార్తఁ బ్రశాంతిమైఁ కునుక రేయి. 5

కం. రామా యను శబ్దం బే
ధీ మంతులు పండితాళి తెలియని వారల్
వ్యామోహంబునఁ బల్కుచుఁ
గామింతురు గద అలౌక్య కర్మల రామున్. 6

తే.గీ. మంచి చెడ్డలు రెండును మహిఁ జెలంగు
నొకట, నొక దాని వెను వెంట నొకటి పరఁగు
నీ డ రాముని గూడ వెన్నాడ దొక్కొ!
ప్రకృతి నైజము వీడ, దెప్పటికి నైన 7

తే.గీ. అతి మనోజ్ఞమై యొప్పెడి నయ్యయోధ్యఁ
గనుచు ముదమొందు వారు రాఘవుని జనము
లో, న సూయతో మగ్గెడి లోకు లుండ్రె
పుట్ట జే దట్టి వారలా భూమి యందు 8

తే.గీ. అందఱొక రీతి భావించి యుందు రొక్కొ!
భరతుఁడే డిట? రా లేదొ పట్టణంబు
మా మ యిలు వీడి పలకో! మరలఁ? డనుచు
గుస గుసలు సల్పు చుండిరి కొందరాండ్రు. 9

## మంథర జన్మ వృత్తాంతము

తే.గీ. () జ్ఞాతి దాసినిఁ గుబ్జను జనకుఁ డిచ్చెఁ
గైక కరణంబుగాఁ బెండ్లి కాలమందు
రాఘవుని యెడ మది పగ రాజు చుంట
కోప ఘూర్ణిత యై యుండెఁ గుబ్జ యొకతె. 10

తే.గీ. శ్రీ రఘూద్వహ పట్టాభిషేక వార్త
సకల జనులకు సమకూర్చె సంతసంబు
దివిజులకు మాత్ర మది వగఁ దెచ్చి పెట్టె
త్వరగఁ జనినారు వార్ధే విధరికి వారు. 11

ఉ. మాకు వరంబు నిచ్చి పరిమార్పఁగ రావణు, జన్మమెత్తియున్
లోకవిభుండు, మాయఁబడి లోకులు మెచ్చ, నయోధ్య రాజ్యమున్

---

() జ్ఞాతిదాసి-వాల్మీకము) 10 వ సర్గము జ్ఞాతుల దాసి

జేకొననుండె విస్మృతిని;• చేయగలట్టిది లేదొ రావణున్
డీకొని చంపగాఁ గల, కఁ•డింది మగండు నరుండు రాముఁడే. 12

చం. వనమున కేగ కున్న, రఘు•వర్యుఁడు రావణుఁ జంపు టెట్లు? సీ
తను వని రావణుండు తన•ధారుణికిన్ గొనిపోవు టెట్లు? ఉ
ర్వినిఁగల పెక్కు రాక్షసుల• పెంపడగించుట యెట్లు? భారతీ!
పనివడి రాఘవున్ వనికిఁ•బంపుటయే తగు కార్యమిత్తఱిన్. 13

చం. పలుకు పొలంతి! మమ్ములఁ గృ•పామతి నేలఁ దలంతు వేని నీ
విల కిపు డేగి మంథర మెఁ•యిన్ నివసించి, వచింపఁజేయు మీ
చెలిమినిఁ గైకకున్, హితవు•శ్రీవరుఁబంప నరణ్య భూమికిన్
దొలి, మలి కైకఁజొచ్చి, నృపు•తోఁ బలికింపుము కార్యసిద్ధిగాన్. 14

తే.గీ. అటుగఁ గావించి మరలి రా•వమ్మ దివికి
ననుచు మ్రొక్కగ దివిజు, లా•యమ్మ వల్లె
యనుచు భువి కేగు మంథర•నావహింప
బిదపఁ గైకనుఁ జేరఁగా•మదిఁ దలంచి 15

ద్వి. అని పల్కు దివిజుల•కా బ్రహ్మ పత్ని
కనుడంచు నిటనుఁ•గాఁగల గతుల. 16

ఉ. మీ పని దీర్ప రాఘవుని•మేదినికిన్ యువరాజు సేయఁబో
భూపుని యత్నమున్, విఫల•మున్ బొనరింపఁగ నొక్కకుబ్జయే
యోపు, నయోధ్య నాపడతి• యుండెఁగదా, యదె మంథరాఖ్యతో
నాపెయె కక్షఁదీర్చుకొను•నాతఁడు నేఁడిల నేలఁ జాలునే. 17

తే.గీ. ఆ సురాసుర సంగ్రామ•మందు మును, వి
రోచన సుత, మంథర సదా•కాచి కాచి
సురల వేధించె, మాయలఁ• జొక్కి చొక్కి
స్త్రీ యనుచు నింద్రుఁడో సంహ•రింపఁడాయె, 18

తే గీ. అంత విష్ణువు పురికొల్ప•నతివ పైన
విసిరె వజ్రాయుధమ్ము నా•అసురవైరి
దాన మంథర కుబ్జయై•పూనెఁ దపము
హరిని సాధింపఁ గడు నిశ్చ•లాత్మ యగుచు. 19

ద్వి. పగఁ బూనితా నంత•ప్రతిపత్తు నూని
వగవోవ విధిఁ గోరె•వర మొండు గుబ్జ
తే.గీ. ఎఱుక లే దీమె పుట్టుక• యీ ధరిత్రి
ఎక్కడిదొ! యెప్పు డెచ్చోట• నెటుగఁ బెరిగె
నెటుల కైకను జేరెనో•ఎరుక కాదు
కైక తోడ నయోధ్య లోఁ•గాలు పెట్టె. 21

కం.× గంధర్వి రూపముఁ గొని
మంథర దుంధుభి యనంగ•మారుచుఁ దపమున్
సంధించెన్, హరిపై కసి
బంధించెన్, గద హృది, విధి• వరమున్ గోరెన్. 22

ద్వి. దశరథ సూనుఁడై •ధాత్రి జనించు
యశ మొందు నా విష్ణు•వా నాడు నీవు. 23
ద్వి. కసిదీర్చు కొనెదవు• పసికట్టి యదను
వసియింపఁ జేతువు• వన భూము లందు 24
ద్వి. కైకమ్మ దాసి వై •గ్రాలు దీవిలను
లోకంబు తపియించు• పోకడన్ గలిగి. 25
ద్వి. అని తాత వర మీఁయ• ఆ కుబ్జ యటుగఁ
బనిఁ జేయనున్నది• భయ మేమి లేక 26
ద్వి. సురలంత సంతోష• భరితులై నారు
పరమాత్మ దీర్చును• వర మంచు వారు
ద్వి. భువి వైపు చూతురు• దివిజు లా వారు
అవతార మూర్తిని• ఆత్మలన్ నిలిపి. 27

### కుబ్జ - అయోధ్య - శృంగారమును జూచుట

తే.గీ. రామ చంద్రుని లోకైక• రాము నపుడు
కాదనెడి వారు భువి నేరుఁ•గాన రారు
కుబ్జ యొక్కతె కైకమ్మ• కూర్మి దాసి
కలతఁ జెందె నయోధ్య లోఁ•గాంచి సొబగు. 28

× (గంధర్వి: మంథర = వాల్మీకము; 25 వ సర్గలో విశ్వామిత్రుఁడు, రామునితో చెప్పిన విషయము; పూర్వమింద్రుఁడు, మంథరయను విరోచన సుతను నుక్కడగించెను.)

తే.గీ. సౌధ రాజంబు పైకెక్కి సకల దిశల
గలయఁ జూచి, యయోధ్య శృంగార మెల్లఁ
దోటి దాసిఁ బ్రశ్నించి యా బోటి వినెను
రాము యువరాజు సేయు కార్యక్రమమ్ము. ౨౯

తే.గీ. తలను బంకించి యా కుబ్జ తలచి యేదొ
రివ్వు రివ్వున కైకమ్మ దవ్వుఁ జేరి
కని ప్రశాంతియై నిదురించు కైక కంత
నిసు మడించిన కలతమై ననగ సాగె. ౩౦

కైకకు - మంథర - హితోపదేశము

చం. ఒక పరి, చూడవమ్మ, పురి యెుప్పెడి నేడె, విసూత్న కాంతి, సై
కిక నిటు తావు లేదు, భువి నేలెడు కోసల పుత్రిసూనుఁడే
సకలము, రేపె నీదు చెయిఁ జారెడుగా యువరాజు రాముఁడై
వికలతఁ గూర్పఁడే, సవతి బిడ్డఁడు నీ కెటు, కూర్మిఁ జూపెడిన్. ౩౧

సీ. దాసివై కౌసల్య దాసివై మననగు;
కైకమ్మ నీ కర్మ గాంచవమ్మ
భరతుండు నీ పట్టి చరియింపఁ దప్పదు;
రామ కింకరుడై నిరంతరమ్ము
రాజ్యలక్ష్మి కరగ్రహణ మన్నకు రాగ,
భరతుఁ డన్నకుఁ గాళ్లు పట్టునమ్మ
లక్ష్మణుం డన్న ఛత్రంబుఁ బూనంగ; నీ
భరతుండు తలఁదాల్చుఁ బాదుకలను.

తే.గీ. ఇంతి యే సుమ్మ మీ గతి యింక నమ్మ
కాంచు భరతునిఁ బరిపంథిఁ గాఁగ, నతఁడు
వనికిఁ బంపునో చంపునో భరతు నెపుడొ
ఏమి సేయునొ రఘు రాముఁ డేరి కెఱుక? ౩౨

తే.గీ. మేల్కొనుము తల్లి యిక నైన మేలు కొనుము
సల్పు తవ మాన మెపుడుఁ గౌసల్య కీవు
రాజు నీ మాట వాఁడను మోజు చేత
ఆమె మఱచునె నీ కింకఁ బాము లె కద! ౩౩

ఉ॥ పీడగదే పరాకుఁ బృథి• పీతల నాథుఁడు నీదు భర్తయే
కీడొనరింప నుండె, మటి• కేల్ మొగిడించెదో, నిన్ను నీవు కా
పాడుకొనంగఁ బూనెదవొ• పైఁబడనున్న దురంత దుఃఖమున్
జూడవొ! రేపె, నీ సవతి• సూనున కిచ్చెడి రాజు రాజ్యమున్, ౩౪

ఆ.వె. అందకత్తె నంచు• నా రాజు వలపుల
కుప్పనంచు ముదముఁ• గొందు వెపుడు
రామ మూర్తి తల్లి• రా రాణి నేటికి
రాజ మాత యగును• రాణి రేపు ౩౫

కం. వలపుల మేటులు మగ వా
రలు వారల నమ్మ, రాదు• రాణీ విను మీ
లలి, నీ యంకపు శయ్యను
పలుకాడడె దశరథుండు• పలు ప్రేమోక్తుల్. ౩౬

కం. తుదకెట్టులఁ జేసెను పో
మదిఁ బుట్టదొ భరతుని కిడ•మహినిన్ బ్రేమన్
విదితంబే కద నీ ప్రియు
హృదయం బిక? కైక నేని• నెంచడు క్రియలన్ ౩౭

ఆ.వె. అనెడి దాసిఁ గాంచి• యామె గాంచదు తృప్తిఁ
జెవినిఁ బట్ట లేదు• చెప్పిన నుడి
అపుడె తాను వింట• నభిషేక వార్తను
కొమరు రాముఁదలచి• కోరు శుభము. ౩౮

కం. ఈ సంతోషపు వార్తను
దాసీ! చెప్పితివి తొల్త•దానన్ గొను మీ
వాసింగను భూషణ మిదె
యా సీతా పతికి శుభ మె• యా కాంక్షింతున్. ౩౯

తే.గీ. జ్యేష్ఠ పుత్రుండు యువరాజు• సేయఁ దగఁడొ
అదియె సంతోష వార్త; యెట్లార్తి యగును?
దాన బహుమతి యిదె కొమ్ము• దాసి యనుచు
స్వర్ణ నూపుర రత్న భూషణము నిచ్చె 40

క. ఏమిటు లాడెదవో నీ
రాముండే నాదు బిడ్డ రాజై, నన్నుం
క్షేమంబున గను సుమ్మీ
రాముండె కదా జనాభి రాముఁడు కుబ్జా! 41

పరహిత మెంచువాఁడు తన భ్రాతల బ్రేమడిఁ జూచువాఁడు నె
ల్లర దయఁ గాంచువాఁడు జనపాలితుఁడా రఘు రామచంద్రుఁడే
యర మర, లేక చూచు, ముగురమ్మల నొక్క తెఱంగునన్ సుమీ
స్థిరమగు భక్తివాఁడు గుణసింధువు, నేనెటు సేతు దుష్క్రియన్. 42

ఏ యపకారమున్ రఘు వరేశుఁడు సల్పెను నీకు మున్ను, రే
బ్రాయమువాఁడు, వాఁడు, పరభామల మాతృసమాన భావముం
బాయకఁ జూచువాఁడు కులవర్ధనుఁడై భువి నేలు వాఁడు కు
బ్జా! యిటులాడెదేల? గుణవంతుని గూర్చి యెదుష్ప్రలాపముల్. 43

ఆనతి సేయుఁ దల్లుల కహర్నిశలున్, గురుఁగొల్చు భక్తిమై
మానము వీడఁడెన్నఁడును మాయల మారియుఁ గాడు తమ్ములన్
దానుగఁ దన్నుఁ దమ్ములుగఁ జాఁ దలపోయు బ్రియం వదుండు నే
నా నయనాభి రామునకు నడ్డము వచ్చుట యేల చెప్పుమా. 44

ఉ. తలఁపఁగ రాని దా పని! కుతంత్రముఁ బూనఁగ రానివేళ, యీ
యిల శత వత్సరంబులు నరేశుఁడుగా రఘు రాముఁడుండి యా
వల తన తమ్మునిన్ భరతుఁ బట్టము గట్టెడె రామచంద్రుఁడే
వలగొను ప్రేమ, నే నిపుడు భ్రాంతికిఁ జిక్కి యశంబు వీడనా? 45

ద్వి. అని పల్కు కైకేయి నా దాసి గాంచి
కనులెఱ్ఱ జేయుచుఁ గను బొమల్ ముడిచి 46

ద్వి. పలుకాడ సాగించె బహు రీతి నంత
నలుకతో ముట్ట దా యా భరణమ్ము 47

క. నీ క్షేమంబే కోరెడి
పక్షము నా ది, భవదీయ భాగ్య మదేమో
యీ క్షణమే తగు గతి గని
రక్షింపవె నీ తనయుఁ బరాకిక యేలా 48

ఆ.వె వేయిమాటలేల•వినుమింక నామాట-మించిపోవుసుమ్మి•మంచియదను
నీకుఁ గీడుగల్గ• నాకునుఁ గీడగు-నీ శుభంబె యెంచ• నాశుభమ్ము 49

చం. భరతుని మేన మామ కడ• బాంధవ మొందఁగఁ బంపు టేల? యి
క్కరణినిఁ బిల్వ నంపక యె•కై కరో! రాముని రాజు సేయఁగా
దొరకొను టేల? మర్మమని• తోఁచదొ నీకికఁ గూడ? దేవి! యీ
సరణి సహింతువే? యిదె వి•శాంపతికిన్ దగు ధర్మ బుద్ధియా? 50

చం. దొరకిది చెల్లు నొక్కొ కడు• దొడ్డగ మాటలఁ జెప్పునంతనే
యర మర లేక మూఢవయి• ఆదరణంబున జూతువే పతిన్
పరమ పవిత్ర భావమునఁ• బాలిడి శీతల బాధఁ దేర్చినన్
బరగునె శిష్టయై, కఱచి• ప్రాణము దీయదె పాము పెంచినన్. 51

ఉ. పుట్టవె రాజ వంశమునఁ• బుట్ట వొ కేకయ రాజ పుత్రి వై!
యిట్టుల నేర్పు మై కన వి•సీ! నృపుఁ డాడెడి నేర్పు మాటలన్
గుట్టును, జెట్టఁబట్టియు నృ•కుంజరు, నెంతటి బేల వమ్మ రో!
కట్టడి ధాత నీకు కడ•గండ్ల నె గూర్చెనొ జీవితాంతమున్. 52

ఉ. మాయల మారివై భరతు• మామ కడన్ బడవైచి యెంతొ ఆ
ప్యాయముగాఁగ నిన్నుఁ దన•యంకమునన్ దగఁ జేర్చి చేర్చి ప
మో యనుచున్ గడున్ మురిపె•మున్ నటియించెడి, నాధుఁగొల్చి నీ
వాయన మాట నమ్మెదవొ!• అంతకు నింతకు నీకె దుఃఖమౌ. 53

తే.గీ. ఇన్ని యేలను తనలోని• యీప్సితంబు
రాము యువరాజు సేయు, గా• రాము తలఁపు
తెలుపఁ డేలకొ ముందుగా• దేవి నీకు
రాముఁడే శ్రేష్ఠుఁడని యెంచు• రాణి వి, గద! 54

తే.గీ. లక్ష్మణుండుండు శ్రీరామ• రక్షణమున
భరతునే రాము డెంచెడి• యరి విధంబు
భరతు వెంటాడు సౌమిత్రి• భయము వడడు
రాజ్య మే రీతిగను రాని• భ్రాంత యతఁడు 55

కం. నీకును నీ కొమరున కే
ప్రాకటముగఁ దోచుఁ బ్రాణ భయమే సుమ్మీ
కాక వనంబున కంపు నొ
కైక రో! నీదు సుతుని నరిఁ కడ ముట్టుటకై ౫౬

చం. చాలును జాలు నీ పతి, విశాంపతి నీ కొనరించినట్టి యీ
మేలు. బళే తలంపులు సుమీ, యిఁక సిగ్గిల వేల? వాదు తే
లా, లలి తాంగి! నేడె నినుఁ లాలనఁ జేయఁగ రాగఁ బొమ్మనన్
జాల వొ? చూపవే యలుక జాగ్రకఁ జేయకఁ గోపగింపుమా. 57

ఉ. తోయ జనేత్ర! నీదు భరతుం డొక కింకరుఁడై మెలంగుటో?
ఆయత మైన రాజ్య రమ నాతని కబ్బెడి రీతిఁ జూచుటో?
ఆ యమ కోస లాత్మజ, నరాధి పు మాతగ నుండ, దాసివై
కాయముఁ బాయు దాక మనఁగాఁ దలపోయుటో? రాజమాతవై
ధీయుత వై చెలంగుట యొ తెల్పుకొనన్ సమయం బిదే కదా. ౫౮

కం. పుక్కిలిఁ బట్టెదొ యమృతం
బెక్కువ యని యుమ్మి వేయ నెంతువొ! నీవే
దిక్కను నా మాటలఁ జెవి
కెక్కఁగ నీయ వ? యివే సుమీ చెడు బుద్ధుల్. ౫౯

ఆ.వె. చేత కాని తనము చెప్పక చెప్పెడి
వీత రాగ బుద్ధి వెలయు కతము,
కలదు మార్గ మొండు కాంక్షింపఁ బనిదీరఁ
దెల్పు మంటి వేని దెల్పు దాన. ౬౦

ద్వి. ప్రీతి కెడి తెరవును ప్రీతిమాలి చెప్పితి
ఖ్యాతి కింపు గాకున్న జెడెదవు సుమ్మి. 61

ద్వి. అను దాసి మాటలఁ కంత మై మరచి
కనుగండ్ల రోషంబుఁ గ్రిక్కుచుఁ గైక ౬

ద్వి. విని యుంటి సర్వమ్ము • విని యున్న దాన
పనిఁ బూని భరతునిఁ • బార్థివుం జేతు 63

ద్వి. చేత కాదందు వా? చేసి • చూపింతు
ఘాతు కుండన రాజు • కాదన లేను 64

ద్వి. కాని తోచదు యుక్తి • కాంత దీరంగ
ఏ నేమి చేయఁగా • నెంచఁగాఁ దగునొ. 65

ద్వి. తెలుపు మీ మంధర • తేట తెల్లముగ
చెలియరో! యిదె, దీక్ష • చేసి తీరెదను 66

ద్వి. అనునంతఁ గైకమ్మ • ఆ కుబ్జ పొంగి
మనసున నుప్పొంగి • మాటాడఁ దొడఁగె 67

ఉ. సంతస మమ్మ, నీ పలుకు • చక్కఁగ నున్నది, నిశ్చితాత్మవై
పంతముఁ బూని తేని, నిను • పార్థివు డెట్టుగఁ గాద నంగ నౌ
వంతలు సేరవింక నినుఁ • బ్రాజ్ఞతఁ బొందిన దాన వౌట నీ
కంతయుఁ దేటతెల్లము క • దా! స్మరియింపఁగదే వరమ్ములన్. 68

ఉ. తెల్పవొ! మున్ను నీవె, భవ • దీయ విభుండు వరమ్ము లిచ్చి సం
కల్పముఁ దీర్పఁ జెప్పెనని • కాయము చేర్పడ దేవ దానవుల్
సల్పిన యుద్ధమందు, నుప • చారము లెన్నియొ చేసి ప్రాణముల్
గోల్పడకుండఁ జేయుటను, • గోరఁ దగుం గద. నా వరంబులన్. 69

ఉ. మున్నటు నీకు రెండు వర • ముల్ దయ సేయఁడె ఱేడు వాని నా
పన్నత, నున్న వానిఁ బరి • పంథుల చేతికిఁ జిక్కు వాని నీ
వెన్నఁగఁ గావవే! యవి యె • యిప్పుడు దీర్పఁగఁ గోరు మీ, త్వ దీ
యోన్నతి,నెంచుచున్, ఫలిత • మొందఁగ వేడుము నాటిమాటలన్. 70

చ. పదియును నాలుగేండ్లు వన • వాసము చేయఁగ రాముఁ బంపులే
మొదటి వరంబుగా నను • మోదముతో యువరాజుఁగాఁగ నీ
సదమల మూర్తి, నీ సుతుని, • సల్పుట, రెండవ కోర్కెగాదగుం
గద; క్షితి నాథుఁ డేమనును? కైక? వరంబులఁ దీర్పకుండునా? 72

ఉ. నేలఁ బరుండి యొంటిగ, న • నిర్మలవస్త్రమునఁ బూని, కోపముం
జాలఁగఁ జూపుచున్, మగని • చాయకుఁ బోవక శోక మూనుచున్
బలుకక, మేల్ముసుంగున, వి• భాసుర దివ్యముఖారవిందమున్
దొలఁగకయుంచ, నా దశర • థుండు వగన్ నెరవేర్చు కోరికన్. 73

ఉ. ముందుగ నీ మనంబు వెలి • బుచ్చకు కోర్కెలు దీర్తునంచు, రా
జేంద్రుఁడు పల్కుచున్ సుగతిఁ • జేరుఁగదా, నిను నర్మభాషణన్
బిందొనరించుచున్ విభుని • వీనుల కప్పుడు ముద్దుమాటలన్
సుందరి! ఱేఁడు కాదనని • చొప్పునఁ గోరుము నీ వరంబులన్. 74

ఉ. ఆనతి సేయుమమ్మ విభుఁ • డాజ్ఞనొసంగుచుఁ జెప్పుమన్న నీ
మానసమందున్న యది • మానకచెప్పఁ దొడంగి, ముందు వా
గ్దానము పొందు, నీ తలఁచు • కార్యము "తప్పక" చేతునంచు, నా
పైన, నసత్యముం, బలుకు • వాఁడను, గానని, నీదు భర్తచే. 75

తే. అతని వాగ్దానముం బట్టి • యంత చెప్పుమ
నీ యభీష్టంబు, నెరవేర్చు • నియతిఁ బూన
ఆడు మాటకుఁ దిరుగాడఁ • డవని విభుఁడు
కాన, ఱేని ముమ్మారు వా • గ్దాన మడుగు. 76

ఉ. జంకును గొంకులేక మదిఁ, • జంచలతన్ హృదిచేరనీక ప
*పంకము నెంచకుండ దృఢ • భావమునన్ విభుఁడేమియన్న నా
టంకములేక యన్నది, వి • డంబనఁజేయకఁ జేయఁగోరుమీ
పంకజనేత్ర యంతటు, శు • భమ్ము జయమ్మును గూడ నీకగున్. 77

క. తిట్టిన, భూషించిన, నే
పట్టునఁగాని విడవకుము • ప్రతినన్ రాణీ
గుట్టునుఁ జెప్పిన ప్రిమ్మటఁ
బట్టిన నీ పట్టువిడువ • బ్రతుకే భరమౌ. 78

*పంకము — పాపము.

చ. ప్రజలు, సహింపపరంచనెద • వా ? భయమొందగరాదు, రాముఁ, డా
విజన, వనీ, నివాసుఁడయి • వీటికి వచ్చున ? వచ్చునంతనే
నిజరమ చేతఁజిక్కునొకొ ? • నీతిమెయిన్, భరతుండు భూమి నే
ల, జనులె కోరువారతఁ డి • లాపతిఁ గాఁదగునంచు నా పయిన్. 79

ఆ. పదియు నాలుగేండ్లు • వనవాస మొనరించి
రాముఁడిటకు మరలి • రాడొ ! అపుడు
రాజ్య మతని కీయ • రాదనఁ జెల్లునె
అనుచు సంశయింప • కమ్మ వినుము. 80

ఆ. పాదుకొనునుగాదె • భరతుని రాజ్యంబు
వాఁడు మరలివచ్చు • వరకు, మరియుఁ
గాలగతిని నేరు • గనఁజాలఁగా నగు
నెవ్వఁ డెట్టులగునొ • యెరికెఱుక. 81

ఆ. అనెడి కుబ్జ పలుకు • లత్యంతహితమాయె
కైక కంత రాజ్య • కాంక్ష వొడమి
కుబ్జఁ దనదు హితమె • కోరెడిదానిగా
విశ్వసించి పలుకు • వేడ్క నామె. 82

ఆ. మంచివారుఁగూడ • మాటల నేర్పునఁ
దారుమారుగారొ • దానివలన
సంతసంబుఁ బౌరు • షంబును జనియింపఁ
గైక యుబ్బి పలుకఁ • గడఁగె నిటుల. 83

చ. వినుమిదె నా ప్రతిజ్ఞ, పృథి • వీ పతి నానుడిఁ దీర్పకున్నఁ గా
దని, విభుఁడాడునంతఁ దను • వంతముఁజేసెద వేరుమాట లే
దని దృఢచిత్తనై పలికి • యల్లె యొనర్చెద సిగ్గుమాలి నే
మన, నటుపైన, భర్తకు స • మస్త మెఱుంగఁగ విప్పిచెప్పెదన్. 84

చ. ఎంతటిదానవోసి, నిను • నింతటిదానిగ నెంచలేదు ర
వ్వంతయు,మున్ను, నా, హితమె • ప్రాణముగాఁ దలపోయు నిన్ను నా
చెంత వసించుచున్ సతము • శ్రేయమెగోరెడి శ్రేష్ఠవైన ని
న్నెంతగ మెచ్చికొందు నను • నిట్టుగ మార్చఁగలట్టి కుబ్జరో. 85

చ. ఎందఱు లేరు మంథర? య • హీనకురూపలు, కుబ్జ లెంచ, వా
రందఱి దొక్క యెత్తు నిను • నట్టుగఁ బోల్పఁగరాదు సుందరీ !
అందము విందొనర్చు భవ • దద్భుతదేహము, కుబ్జవయ్యు నీ
చందము వేఱు రూపసుల • చక్కదనమ్మున శ్రేష్ఠమే సుమీ. 86

తే. మోము తీరెంచ, చక్కగా • ముద్దులొలుకు
మచ్చలేనట్టి, శశియె, స • మానమగునొ
దాసివేయయ్యు నాపాలి • దైవతమవు
కోమలాంగిరో ! కొదువేమి • కుబ్జవైన. 87

ఆ. తెల్ల పట్టు బట్ట • దీపించె నీమేనఁ
గ్రొత్తశోభఁగలిగి • కుబ్జ, దాన
రాజహంసవోలె • రాణించుచున్నావు
నాదుముందుఁ దిరుగ • మోదమలర. 88

ఆ. అసురరాజు శంబ • రాసురమాయలు
అంతకంటె మిన్న • యైనవాని
మాటుపరచియున్న • మాయలమారివి
నీదు గూను గొప్ప • నేర్పుగూను. 89

ఆ. అహాహా ! రథఘోషణముఁ బోలు • నట్టి గూను
ఎన్నిబుద్ధులఁ దాచెనో ! • యెట్టి రాజ
నీతికి నిలయమో ! కుబ్జ ? • పాతుకొనిన
మాయలకుఁ గుట్టయై గూను • మహితమాయె. 90

సీ. రత్నాలఁ బొదిగిన • రంగైన తిలకంబు
నిడుదు నీ నొసటిపై • నింతి వినుము
మేలైన బంగారు • మాల నుద్దీపింపఁ
జేతు నీ గూనుపై • నాతి వినుము
స్వర్ణకవచమున • సొంతంబుగా గూను
రహినొప్పఁ గప్పింతు • రమణి వినుము
శుభదుకూలంబుల • శోభాయమానమై
తనువొప్ప నిచ్చెదఁ • దరుణి వినుము.

తే. పలుతెఱంగుల తొడవులు • ప్రమద మొప్ప
బహుమతులనీయఁ గలదాన • భరతుఁ డిలకు
రాజుగానైన నేఁడు; నే • రాజమాత
నైన, హితురాల!, మంథర! • యనుఁగు దాసి! 91

క. సుందర భూషణముల్ గొని •
యందముగా వెలయుదాన • వంతన్ గుబ్జా
అందఱు కుబ్జలలోఁ గడు
సుందరివై వారి రాణి • చొప్పుఁ దలర్పన్. 92

చ. గతజల సేతుబంధనము • గా నగు కైకరో ఆలసించినన్
పతి, భవదీయ మందిరము • మానక చొచ్చెడి వేళయిద్దె, నీ
వతిరయమొప్ప వీడఁ దగు • నంతిపురంబుఁ, జొరంగఁ గోపసం
గత గృహమున్ సునిశ్చితము • గా గుఱిఁ దప్పని కార్యసిద్ధికై. 93

చ. దశరథుఁ డెంచ టక్కరిగ • దా! గమనించితి మిన్నినాళ్లు, నిన్
వశమొనరించుకోఁ దలఁచి • బంగరుకాన్కలు రత్నహారముల్
శశివలె వెల్గు నిట్ట గనుచు • సారెకుసారెకు నీయఁబోవు నీ
యశము నశించి కోర్కె లడు • గంటు సుమా యవి స్వీకరించినన్.

తే. ఒక్కటేమాట, వేరొక్క • దిక్కులేదు
వరము లీడేర్పఁ బట్టును • బట్టవలయు
విడువఁగారాదు రాముఁడు • విపినసీమ
కరుగు నందాక, నేమర • కమ్మ పట్టు. 95

తే. చెడుగు, చెవికెక్కు ఞణమాత్ర • చెప్పినంత
దాసి నుడువులు తలకెక్కి • దానఁ గైక
వీడి సుఖశయ్య సౌధంబు • వెడలి యంతఁ
గోపగృహముఁ బ్రవేశించెఁ • గుబ్జఁగూడి. 96

చ. తొడవులు రత్నహారములు • తోడ భువిన్ బడవైచి, క్రుద్ధయై
పుడమిపయిన్ బరుండె, యొక • పుత్తడిబొమ్మగ చంద్రమండలిన్
విడి, యిలఁగూలు తారవలె • వెల్గుచు మాసినబట్టఁ గట్టియున్
జడ సవరింపకుండ, సుమ • నంబులఁ బూనక వాలుమోమునన్. 97

తే. భరతునకు రాజ్యమీవలె • పంప వలయు
రాము వనసీమ నివసింప • రాజు బుద్ధి
అర్థమాయెను గద నాకు, • నట్లు కాని
బ్రతుక, దీజీవి, బ్రతుకదు • బ్రతుకు టెట్లు. 98

ద్వి. ప్రాకటంబుగఁ గుబ్జ • పరితుష్టిఁ గొనఁగ
గైకమ్మ శపథంబుఁ • గావించి యంత. 99

ఉ. మానెద తిండి నిద్దురయు • మాసినచీర ధరించి నేలపై
మేను విదిల్చి కర్మగతి • మేల్నగలన్నియు దీయుదాన, భూ
జాని తిరస్కృతిన్ సలుపఁ • జచ్చుట కిద్దియె మార్గమౌ కదా!
నేను వచించుచుంటి నిదె • నిశ్చితమైన మదీయదీక్షగా. 100

ఉ. ధీరుఁడు సర్వవిద్యల తు • దింగను నా సుగుణాత్ముఁడున్ సదా
చారుఁడు సద్గురూత్తముని • ఛాత్రుఁడు, ధర్మవిదుండునున్ దురా
చారుల స్నేహితుండయిన • సత్వరమే చెడు, వారె వీరలౌ
చేరగరాదు దుష్టులనుఁ • జేరినఁ బో నగుఁ గైకరీతిగా. 101

తే. దుష్టచిత్తురాలు • దుష్టబుద్ధిని నేర్పి
కుబ్జ యంత తనదు • కొంప కరిగె;
రూప యౌవ్వనముల • రూపొంది గర్వితై
కైక యీర్ష్యవలనఁ • గనల సాగె.  102

## కైక — క్రోధగృహము — దశరథునిపోక

ఉ. ఆతఁ డయోధ్యనేత, ప్రజ • లందఱు సౌఖ్యపరంపరాగతిన్
భూతలిఁ బెంపుగాంచ సత • మున్ గృషిఁజేయుచు ధర్మపాలనన్
శ్రీతనరార ధర్మగుణ • శేముషి, శాంతియు, దాంతి వర్ధిలన్
ఖ్యాతిఁ గడించె నే కొఱఁతఁ • గాని కనన్, వినలేని రీతిగా. 103

శా. శ్రీరాముం డుపవాసమున్న తెఱఁగున్ • సీతాసమేతంబుగా
పౌరాచార విధిన్, వసిష్ఠమునిచే • సర్వంబు నాలించి, సం
బారంబుల్ తగఁగూర్ప నాజ్ఞనిడి, భూ • పాలుండు సంహృష్టుఁడై
చేరెం గైక నివాసముఁ దెలుప రా • జీవాక్షి కీ వార్తలన్. 104

చ. శుక పిక శారికా మధుర • సుస్వనగీతపరీతముఁ లతా
నికర నికుంజ పుష్పచయ • నిర్మిత సుందర కేళికా గృహ
ప్రకరయుతంబునుఁ రజిత • రాజిత దివ్యసువర్ణ వేదికా
సుకరమునున్ వనాంతరముఁ • జొచ్చె ధరాధవనాథుఁ డంతటన్. 105

క. ఒప్పగు ఫలహారంబులు
కుప్పలు కుప్పలుగనుండెఁ • గోరిక లూరన్
గొప్పగు మృష్టాన్నంబుల
చొప్పులు గల వెన్నొ కైక • సొంపగు వనిలోన్. 106

క. గూనులవారలు, వామను
లైన, కురూపులు, సువర్ణ • రాజిత భూషల్
మేన ధరించిన సొంపగు
చానలు, గలరందు కైక • సద్మమునందుఁ. 107

తే. కాముకుల వాడయో సుర • కాంత నెలవొ
అనగ నొప్పెడి కైకమ్మ • మనెడి తావు
మన్మథుని మందిరమొ, రతీ • మందిరమ్మొ
అనగ నలరారు కైక, యు • ద్యానవనము. 108

ఆ. కైక పరమసాధ్వి • కానున్న శుభవార్త
వినుచు మోదమందు • విహితరీతి
నని తలంచి నృపతి • యామె గృహంబును
జేరి కానఁ డచట • నారి నతఁడు. 109

ఉ. కైకను బ్రేయసిఁ గనఁడు • కాముకుఁడైన నృపుండు పాన్పునన్
వ్యాకులచిత్తుఁడాయె! రతి • వాంఛితుఁడైన ప్రియుండు, మన్మథో
ద్రేకమునఁ; నృపున్ గనుచు • దెల్పెను దాసి యొకర్తు రాణిఁ గ్రో
ధాకరమందిరాంతరము • నందుఁ గనఁ దగునంచుఁ జయ్యనఁ. 110

ఉ. కోరికలూరి మీరఁ దన • కూరిమి ప్రేయసిఁ జేరి, కాము, క్రీ
డారతిఁ దృప్తిఁ జెందగఁ ద • లంచి కృతార్థుఁడుగాక యుంటయే
భారముగాఁగఁ గ్రోధగృహ • వాసమువింట మఱెంత భారమో
తీరని కోర్కె ఱేఁడరిగెఁ • దిన్నగఁ గ్రోధగృహంబు లోనికిఁ. 111

తే. వెల్లమబ్బుల మఱుఁగున • వేచియున్న
రాహువును డాయఁ జను నిశా • రాజు పగిది
క్రుద్ధయైయున్న కైకమ్మఁ • గూడఁబోయె
విధిని, జవదాటఁ గోసల • విభుని వశమె. 112

## రాజు కైకను బ్రతిమాలుట

చ. తన ప్రియురాలు, భూపతిత • తారవలెన్ బుడమిం బరుండె, మా
సిన వసనంబుగట్టి, సర • సీరుహసామ్యముఖంబువాడి, నే
లను, గది, స్వర్ణభూషణము • లన్ నలుమూలలఁ జారవైచె, ఆ
మెనుగని కాముకుండయిన • మేదినినాథుఁడు దుఃఖితాత్ముఁడా. 113

మత్తకోకిల. మెల్లమెల్లనఁ గైకఁజేరుచు • మేదినీ విభుఁడంత, సం
ఫుల్ల పద్మసమానమౌ, ముఖ • మున్ గనన్ దలపోసియున్
వెల్లనౌ బహుదుఃఖపూరిత • భీతదృక్కుల కైకనే
యుల్లమెల్లను బ్రద్దలౌనటు • లున్నదానినిఁ గాంచుచున్. 114

ద్వి. సోకెనా దయ్యంబు • సుందరీ యనుచుఁ
బ్రాకటంబుగ రాజు • పలుకాడఁ గడఁగి. 115

చ. తన మృదుపద్మహస్తములఁ • దన్విని, మై నిమురున్, ముసుంగుఁ దీ
యును, శిరమెత్తి, యంకమున • నుంచికొనున్, బ్రతిమాలు, సుందరీ
తనువు, రుజప్రకోపమునఁ • దాపముఁగాంచెనో, తెల్పుమీ యనున్
జనపతి కోసలేంద్రుఁడు వి • షాదపరీతుఁడు వాంఛితార్థియై. 116

మ. ఎవరొసీ యపకారమున్ సలిపి రీ • వీరీతి దుఃఖంప, వా
రెవరో తెల్పఁగదే ప్రియా, యిపుడె • శిక్షింతున్గదా వారలన్
భవదీయుండను సుమ్మి, నీ నుడినిఁ దీ • ర్పంబూననే, యింతిరో!
అవరోధం బొనరింప నేరికగు ? నీ • యాంతర్యముం దెల్పవే. 117

చ. లలితమృణాలతుల్యము, వి • లాసిని నీ మెయిదీవ, రమ్యకో
మలతనువున్, ధరాస్థలి య • మంగళరీతిగఁ ద్రోసియుంటివే!
యిల కఠినత్వ మీవెటు, స • హించితివో! సుమశయ్య వీడి ? నీ
తలఁపు నెఱుంగఁ జెప్పు మికఁ • దాని నొనర్తుసుమీ, ప్రియంవదా! 118

ఆ. చంపఁదగనివాని • చంపింతు, విడిచెదఁ
జంపఁదగినవానిఁ • జంపకుండ
అదియె నీదుకోర్కె • యైనచోఁ జెప్పుము
తడవదేల? తలఁపు నుడువ వేల? 119

తే. ధనవిహీనుని భాగ్యవం • తునిగఁ జేతు
భాగ్యవంతుని ధనహీనుఁ • బగిదిఁ జేతు
గలరొ యేరైన నీమది • కాంత చెపుమ!
అట్లె యొనరింతు నీ కో • ర్కె ననుసరించి. 120

ఉ. ఏమది నీదుకోర్కె? యని • యెట్టిదియేని, ఫలింపఁజేసెదన్
నా, యవనీతలంబె, దిన • నాథుఁడువెల్గు ప్రదేశమంతయున్
జాయరో! యీ స్థలాంతరము • నంగల దేనినిఁగాని, కోరినన్
జాయకఁ గూర్చువాఁడ నది, • ప్రాణము నొడ్డెద నీనిమిత్తమై. 121

ఆ. అస్మదీయ జీవ • మర్థింతువా? తెల్పు
మదియుఁగూడ నీయ • బెదరిపోను
అతివ, నాదు, ప్రేమ • యందనుమానమా?
ఎఱుఁగవో కోర్కె? వలపు • మఱచినావొ? 122

మ. లలనా! సూర్యుఁడు పోవుమేర భువి నా • రాజ్యంబు; పాటించు నా
సెలవున్; వంగ, కళింగ, మత్స్య, కురు, కా • శ్మీరాది దేశంబులన్
గలవేవైన లభింపఁ జేయఁగల, నా • జ్ఞా నాథు లేవేళ, నా
పలుకెల్లన్ శిరసావహింపఁగల, రా • ప్యాయంబుగా నమ్రులై. 123

ఉ. నేల బరుండి యుంట తగు • నే! సతి మంగళరూపిణీ యిటుల్!
జాలి జనింప, వంతకు వ • శం వదవౌట నెఱుంగనెప్డు, నా
పాలిట ప్రేమమూర్తి, వ్యథ • పాలయి కుంద సహింపలేను, నా,
జాలిన యంతవట్టు నిడఁ • జాలుదు లెమ్మిక కోర్కెఁదీర్పుమీ! 124

మ. అను నాకోసలనాథు, కాముకుని వా • క్యార్థంబు గుర్తించి "నా
మనసున్ విప్పెరఁ గోరెదన్ వరము సం • భావించుచున్ మారు మా
టన, నంచున్ శపథంబు సేయు మెడ, రో • గార్తిన్ లవంబేని, గుం
దను, లేరెవ్వరు వైరులున్, బసిడియున్ • నాకేల ప్రాణేశ్వరా! 125

ఉ. భూతము సోకలేదు! రుజ పొంతకుఁ జేరుటకాదు, భాగ్యమున్
జేతముగోరఁబోవ, దవ • నీపతి పత్నికి నెగ్గుసేయఁగా
జూతురె యేరుకాని, హృది • స్రుక్కెడి నొండు తలంపుగూర్చి, నీ
చేతఁగలట్టిదే, యదియ • సేయఁగ బాస నొనర్తువే నృపా!" 126

## దశరథ శపథము

తే. ఏమనిననేమి? కాముకుం • డెంచ డేఁడు
దాని నూతగఁ గొని పల్కెఁ • దన్వి కైక
కాముకుఁడు కామినీహ స్త • కంకణమ్ము
సార్వభౌముండె యగుఁగాక • సకలగతుల. 127

ఉ. చేతము కామదీప్తికి వ • శీకృతమౌచుఁ బ్రసన్నుఁడాయెఁ, గా
మాతురుఁడైన ఱేఁడు, విను • మాసఖి! ఆడినమాటఁ దప్పు దు
ర్నీతివహించు ఱేఁడెపుడు • లేడు రఘూత్తమవంశమందు, సం
జాతుఁడు కాఁడు, నా నుడి ని • జంబు త్వదర్థము ప్రాణమిచ్చెదన్. 128

చ. పురుషులలోఁ బ్రియుండు, నర • ముఖ్యుఁడు రాముఁడె; స్త్రీసమూహమం
దరయఁగ, బ్రేమమూర్తివి క • దా; సరి యెవ్వతె నీకు? నా హృదం
తరమునఁ బాదుకొంటివి, క • దా? నినుఁ బ్రేమికిఁ జూతునంచు, నీ
వెరిగియు నీగతిన్ మెలఁగ • నేల! హృదీశ్వరి! మూర్ఖురాలవై. 129

ఉ. రాముఁడు సర్వలోకనుత • రాముఁడు శ్రేష్ఠుఁడు, రాఘవుండు, నా
రాముఁ డజయ్యుఁడున్, సత మ • రాతి భయంకర సద్గుణాత్ముఁడో
రామ! మహాత్ముఁ డాతఁడు స • రాసరి "యాతని తోడు" కోరుమీ
ఏమొ త్వదీప్సితమ్ము, విను • మీ! యిదె తీర్చఁగ బాస సేసెదన్. 130

శా. ఏ రామున్ గనకుండ నేనొక క్షణం • బేనిన్ మనంజాలనో
ఏ రాముండు మదీయప్రాణమునకే • యెంచన్ గడున్ మిన్నయో
ఏ రాముండు సదా ప్రియుం "డతనితో • డే" సుమ్మిదే బాస; నీ
గారాబంబది, యేమొ తెల్పఁగదవే • కంజాక్షి నే తీర్చెదన్. 131

చ. పరమహితాళినిన్, సకల • బాంధవులన్, మఱి ప్రాణమేనియున్
భరతుని వానితమ్ములను • బాసినఁ బాయఁగవచ్చుఁగాని నా
వరగుణు రామచంద్రు నెడఁ • బాయఁగఁజాలను "వానితోడు" నీ
వర మదియేమొ, తెల్పుమిఁక • భామరో! తీర్చఁగ బాసచేసితిన్. 132

ఉ. చేసిన పుణ్యసంచయము • చేడ్పడు నీ కిడు మాటఁ దప్పినన్
బాస యొనర్చినాఁడ రఘు • వర్యుఁడు రామునిమీఁదఁగూడ వ్య
త్యాసము చేయఁబోను, శప • థంబిదె పూనితి, నాదుప్రాణమై
భాసిలు జ్యేష్ఠపుత్రకుని • పై, భవదీప్సిత మిచ్చెదన్ సఖి. 133

చ. మును సభలోనఁ గౌశికుఁ డ• పూర్వముగా నని యున్న వాక్యముల్
తన హృది నిల్చియుండెనొకొ • ధాత్రిజ ధర్మముఁ ద్రుంపియుంటయున్
మనమున నిల్చియుండె నొకొ • మార్గమునందునఁ గ్రూరతాటకన్
దునుముట యాగరక్షణము • నున్ స్మృతియందు వసించుచుండెనో.

తే. గౌతమసతి యహల్యను • గాచు ప్రజ్ఞ
పరశురాము జయించిన • ప్రతిభఁగూడ
దశరథుని యాత్మరాముని • తత్త్వమెఱుఁగఁ
దోడుపడె; వాని స్మృతిదప్పి • లేఁడు ఱేఁడు. 135

ఉ. ఆతఁడు ముఖ్యుఁడంచనె, మ • హాత్ముఁడు రాఘవుఁడం చనెన్ సతీ
చేతముఁ జొచ్చురీతిఁ గడుఁ • జెప్పెను రామునిగూర్చి; ధర్మసం
పాతముఁబూనెఁ గైక యను • భావము, ముందుగనే ఘటించెనా ?
భూతలనాథుఁ డేమి కత • మో శపథం బొనరింప రాముపై. 136

తే. తనదు ప్రేమమూర్తి • తనయులలోఁ బెద్ద
ప్రథితదివ్యమూర్తి • రామమూర్తి
అతని "తోడ"నంగ • ఆ కైక వినరాని
వరము లడుగదని నృపుని • భావమేమొ ? 137

## కైక వరంబు లడుగుట

సీ. కౌశికు యజ్ఞంబుఁ • గాపాడి దైత్య సం
హరణార్థియైన మ • హాత్ముఁ డతఁడు
పదధూళిమాత్రాన • పాపంబు విదళించు
పూజింపఁదగు రాఘ • వుం డతండు

పీరు లెత్తఁగలేని • వింటిని[దుంచి; య
జయ్యుఁడై భువివెల్గు • సకలుఁ డతఁడు
మునికోటు లెల్లరు • మోదంబుతోఁగను
వేదవేద్యుఁడు, సదా • ప్రియుఁ డతండు

తే. జ్యేష్ఠపుత్రుండు, తానెపు • డెవనిఁబాసి
ఒక ముహూర్తంబయేనైన • నుండలేడో
అట్టి రామునితోడని • యనినమాత్రఁ
దొలి స్మృతినిఁ గైక గనునని • తలఁచె నేమొ! 138

తే. సత్యరూపుండు రాముఁడు • సత్యవేత్త
సత్యవాక్పాలకుండు కా • సల్యవిభుఁడు
సత్యమునుఁబాసి యెట్లుండు • క్షణమె యైన
నీడ పాయునె సూర్యుని • నేడనైన. 139

మ. పరుఁడున్ సత్యపరాక్రముండు సుతుఁడై • ప్రాదుర్భవింపంగ, ఆ
పరమార్థంబు సభన్ మునీశ్వరులు సం • భాషింప నాలించియున్
ధరపై రాముని దివ్య సత్కృతుల సం • ధానంబు వీక్షించియున్
మఱపుం, గాంచునె, కోసలేశుఁడు సదా • మాయావశుండయ్యునున్.

తే. అతనిపై నొట్టుఁబెట్టిన • యంత మాత్ర
కైక నమ్మట విధియని • కానిపోని
వరము లాశింపదనుచు • భూవరుని తలఁపొ!
కైకయునుఁగూడఁ బ్రేమించు • కతన రాము. 141

ఆ. కాని ఈని మాట • కైకమ్మ హృదిఁజొచ్చె
అగ్నికణ మనంగ • నాహుతిఁ గొన
రామునియెడ రాజు • రాగంబు నెంచుచు
అతివ మదిని మిగుల • నాగ్రహించి. 142

తే. తనదు కోర్కెను దెల్పెడి • తరుణమంచు
ఈని బంధించి సత్యవా • క్యాన కైక
ములుకులనఁ జెల్లు పలుకుల • ముంచ విభుని
శంక, దక్కదు; కాని, ని • శ్శంకఁ గనదు. 143

తే. ఘోరతర వరమ్ముల నాధు • గోరనుంట
రాము నెడ ఙేనికింగల • రాగమెంచి
వరమిడుదు నన్నమాట సు • స్థిరము గాఁగ
మరలఁ బలుకాడు కైకమ్మ • మగనిఁ గాంచి. 144

ఉ. కామిని, మానవేశ్వరుని • గైవశముంగొని "ప్రాణనాథ" ని
న్నేమని మెచ్చుదాన, నిజ • మే పలుకాడెడి ధర్మమూర్తివై
ఈమెయి నొట్టుఁబెట్టితి వి • దే కృతకృత్యను, సంతసంబు, నీ
"రామునితోడు" మాట విని • రా, దివిజుల్ మఱి అగ్నిహోత్రుఁడున్.

ఉ. రాముని 'తోడు'ఁ బెట్టుచుఁ బు • రాకృత, పుణ్యము; 'తోడు'ఁగూడ, నా
స్వామి! వచించినావు, రవి • చంద్రులు, నాకసమున్ గ్రహంబులున్
భూమియు రేల్, బవల్, దిశలు • భూతములున్ సురరాతుసాదు లా
యా మహనీయ లోకతతి•యన్నియు సాతులు నీ ప్రతిజ్ఞకున్. 146

ఉ. ఓ సురలార! ధార్మికుఁడు • నుత్తమవీరుఁడు సత్యసంధుఁడున్
భాసురమూర్తి, సాధుపథ • వర్తి, సమాహిత చిత్తుఁడున్, గుణో
ల్లాసి, విలాసవంతుఁడు, ని • లాపతి, నాప్రియనాథుఁడీ, మహా
కోసలరాజు నా కిడిన • కోర్కెలదీర్చు వరంబు వింటిరే. 147

మ. అనుచున్ ధీరుఁడు కామమోహితుఁడు ధ • ర్మాయత్త చిత్తుండు నౌ,
తన భర్తం గను, దేవదానవుల యు • ద్ధంబందు రక్షించితిన్
నిను; నాఁడీయవె నాకు రెండువరముల్ • నేఁడా వరంబుల్ సుమా!
పనిగల్గెన్ గృపసేయు, మిప్పుడనుచున్ • ప్రార్థింతుఁ బ్రాణేశ్వరా!

ఉ. ఓపికతోడ నావరము • లుంచితి నీకడనే; నిగూఢ, ని
క్షేపమువోలె; నేనడుగ • కే యవి, రాజును, భర్తవున్ నిజం
బే పలుకాడు వాఁడవని. • యే నెపుడెట్టుగఁ గోరినన్ వెసన్
భూపుఁడొసంగు వాని నను • బుద్ధిని, నేఁడవె కోరుచుంటిఁగా. 149

చ. పదిలము సేయవే వివిధ • వస్తువులన్, యువరాజు సేతకై
యిదె, సుమూహూర్తమౌ, భరతు • నే యువరాజుగఁ జేయుమిప్డు నా
మొదటివరంబు నిచ్చి, రఘు • పుంగవు రాము వనీ నివాసిగా
పదియును నాలుగేండ్లు పను • పందగు రెండగు నావరంబునన్. 150

తే. దండకారణ్యమున రాముఁ • డుండ వలయుఁ
గానన నివాసముం జేయు • కాలమందు
పరగి మునివేషమున జటా • వల్కలములఁ
గంద మూలాదులను దిని • గడపవలయు. 151

దశరథుని విలాపము - కైకను తిట్టుట

ఉ. దారుణ వాక్యశూలములఁ • దాడనమై హృది, శోకమగ్నుఁడై
ధారమణుండు నేలఁబడె • మూర్ఛమెయిన్ స్మృతిదప్పి; సంస్మృతిన్
ఖోరున నేడ్చుచున్ మరల • పొందుచు మూర్ఛను విస్మృతిన్ గనున్
సారెకు సారెకున్ దలఁచు • శాంతుని దాంతుని రామునిన్ స్మృతిన్.

శా. ఈ మాటల్ సుదతీ లలామ సతియే • యెట్లాడెనో? ఆడెనా?
రామున్ కాననసీమ కంపుమని, ఘో • రమ్మిద్ది నా కైకయే!
బాముల్ రాముని కెంచునా? ని • ర్భాగ్యుండుగా జేయునా?
స్వామిన్, జ్యేష్ఠుని ప్రేమమూర్తిని విడన్ • శాసించి భాషించెనా! 153

ఉ. బెబ్బులిఁగన్న లేడిగ, వి • భీతమనంబునఁ జంచలాత్ముఁడై
అబ్బురపాటుఁ జెందుచు, మ • హా విషసర్పము బుస్సుకొట్టుచున్
గబ్బున మంత్రకుండలినిఁ • గట్టున నుండిన భాతి కైకకున్
దబ్బరమాడలేక, వసు • ధాపతి, చేష్టలఁ దక్కియుండెడిన్. 154

తే. కొంతవడి యిట్టులుండియుఁ • గూరుచుండి
అశ్రుధారలఁ దడఁబడు • నంతరాత్మఁ
బొక్కుచుండెఁ గర్తవ్యతా • మూఢుఁడగుచు
పలుకనేరక విభ్రాంతిఁ • బడుచుఁ బడుచు. 155

మ. కలయో, నిక్కవమో, పురాకృతమొ, నేఁ • గన్నాడనో, భ్రాంతియో;
చలితాత్ముండనొ, రోగపీడితుఁడనో • చాంచల్యయుక్తుండనో,
కలదానిం గనలేక మూతవడెనో • కన్నట్టు, మున్నెన్నఁడీ
ఫలితంబున్ గన, జీవితాంత్య దశలోఁ • బ్రారబ్ధమెట్లుండునో! 156

చ. కనులవె యగ్నిగోళములు • కాల్చున కైకను పీతపాపగా
ననుగతి నెట్టనై కనలు • నగ్నికణంబుల భీకరాకృతిన్
గనుచు, దురాత్మురాల! రఘు • కాంతుని వంశవినాశినీ! నినున్
జనువున, నేలితిన్ దులువ, • సర్పముగాఁ దలపోయ నైతిఁగా. 157

చ. సుగుణవు, రాజవంశ, భవ • సుందరివిః సతివంచుఁ బత్నిఁ గాఁ
దెగవరినై వివాహమునఁ • దెచ్చితి వృద్ధుఁడనయ్యు నిన్ను, మో
హాగతిఁ జరించితిన్ హృదయ • మంతయు, నీకిడి మృత్యుదేవతా !
వగఁ జనియింపఁ జేసితివి • వంశము నాశము నొందునట్లుగా. 158

శా. రామున్ బంపి యరణ్యసీమలకుఁ గ్రూ • రా! నేను జీవింతునే ?
స్వామిన్ సోదరు వెంటనంటు వనికిన్ • సౌమిత్రియున్, భక్తితో,
ఆ మాన్యల్ సతులిర్వురున్ సుతులఁ బా • యన్ రోసి యేమౌదురో!
ఈ భూమిన్ బతిఘాతినీ విధవవై • యేలింతువే పుత్రుచేన్. 159

ఉ. రాముఁడు సర్వలోకనుత • రాముఁడు జ్యేష్ఠుఁడు భూపుఁడౌటయే
నీమది కిష్టమంచు మును • నెయ్యమునన్, బలుకాడవే యతం
డేమి యొనర్చె ? నీవిటుగ • నింతగమార ? నరిష్టమెట్టిదో !
నీమము నీతియుంగల పు • నీతుఁడు, ముప్పురతల్లులన్, సదా
ప్రేముడి నొక్కభంగిఁ గను • విందుగ నెంచుచు సేవసేయఁడే. 160

ఉ. అందము చందముం గనుచు • నాత్మ నినున్ బ్రియురాలివంచు, వో
సుందరి నీహితం బెపుడుఁ • జూరగొనన్ దలపోయు నన్నె, నీ
వెందుల కీగతిన్ వెత ల • యింపఁగఁజేసెదు, నేరమేమి ? నా
బొందిని జీవుఁడుండఁడిఁక • పో రఘురామునిఁ జూడకున్నచో. 161

చ. మృగములు పతులున్, జనము • లీ ప్రకృతింగల సర్వజీవముల్
జగమున రామచంద్రు గుణ • సంస్తవమే తగఁ జేయుచుండ నే
వగ విడనాడుదున్ సుతునిఁ • బ్రాణసమానుని నిష్ఠమూర్తినిన్
పగతునివోలె నేనెటుగఁ • బాయుదు నమ్రు, మదీయ భక్తునిన్. 162

ఉ. కోసలపుత్రినేని సుమ • కోమలి నాదుసుమిత్ర పత్నినేన్
బాసినఁ బాయఁగానగును • బాయఁగవచ్చును జీవమేని, ప
దోసములేని రాము విను • తుః రఘురాము మహాత్మలో, సదా
భాసిలురాము నేనె యెడఁ • బాయుదునే! పితృవత్సలుండపో. 163

ఉ. లోకము ప్రాణిలోకమును • లోక సుబాంధవు సూర్యమూర్తినిః
వీక త్యజించుచున్ బ్రతుక • వీలగు నేమొ! జలంబులేకయే
ప్రాకటరీతి సస్యము భు • భాస్పదమై బ్రతుకంగ నౌను! నే
నేకతమైన రాము జగ • దీశ్వరు వీడి లయింప కుందునే ? 164

మ. అరరే ఘోరవిషాహి నిన్ బడసి నే • నాత్మీయగేహంబునన్
జోరఁగాఁ దెచ్చితిఁ బ్రాణసంకటముగాఁ • జోద్యంబహో! కైక! ప
పరమార్థంబు ఘటించు మౌని నుతునిన్ • భక్తిన్ త్వదీయాంఘ్రులన్
నిరతమ్మున్ దగు పూజసల్పెడి సుతున్ • నీవిట్లు ద్వేషింపఁగన్. 165

చ. అనవరతంబు నీనుడి, నహ • ర్నిశలున్ శిరసావహించి, నీ
కనుపమ సమ్మదంబిడుచు • నాత్మజుఁగం చెను మిన్నయైన, పు
త్రుని సకలావనీ వినుతు • దోర్బలవంతుని రామచంద్రునిన్
గినుకవహించి యేల వని • కిన్ జనుమీ యనె దీవు కైకరో! 166

చ. విమలుఁడు దానధర్మముల • వీరుఁడు, వీరుఁడుగా దయన్ సదా
సముచిత కార్య తత్పరుఁడు • సత్యపరాక్రమ వీరుఁడున్, గదా
ప్రమదమునన్ గురున్ హితులఁ • బాలితులన్ మిముఁ దల్లులన్ గడున్
సమతవహించి కాంచు రఘు • చంద్రునిపైఁ గృపఁ జూపుమీ దయన్.

చ. ముదుసలినైతి చావు కడు • ముందుగనున్నది దుఃఖమూర్తినై
తుదిఁ గననుంటి; దిక్కగు సు • తున్ వనికంపుట పాడియౌనె? నీ
కిది ఘనమే? బుధుల్ నగరె? • యీర్ష్య వహింతువె? తల్లివీవ,నా
హృదయవిదారణమ్ముఁ గను•మీ కరుణార్ద్రుఁడఁ గావుమీ కృపన్. 168

చ. భరతునిపట్ల నాకుఁగల • భావము నీ వెఱుగంగ నెంచియూ
దొరకొనినావు నీ విటుగ • దుర్భర దారుణ కర్మమూనఁగా!
వరములపేర నిట్లడుగ • వచ్చునె? దుర్మతివైతి వీవు నీ
చరణము లంటువాఁడ శిర • సా, నతి సల్పెడివాఁడఁ బ్రోవుమీ. 169

## కైక సమాధానము

చ. పలుమా రీగతిఁ బల్కుచున్ బరుషముల్, • ప్రార్థించుచున్ దిట్టుచున్
జెలివంచున్ బ్రియురాలవంచు గనుచున్ • జేడ్పాటుఁ జేమోడ్పుతో
నిలపైఁగూలుచు మూర్ఛలోఁబడెడి ధా • త్రీశుండు, కైకమ్మయున్
దలఁ బంకించెడి తోకఁ ద్రొక్కినగతిన్ • ద్రాచో యనన్ గ్రుద్ధయై.

ద్వి. అను వాక్యజాలంబు • లాలించు కైక
మనమున జాలినిం • గనదుగా సుంత. 171

చ. మును పల దేవదానవుల • పోరున నా పరిరక్షణంబునన్
మనిన దినంబులన్ మిగుల • మాన్యను! నాకు వరంబులిచ్చి దీ
వనలిడువేళ ప్రేయసిని, • పాణి గ్రహించెడినాఁడు నా సుతున్
జనపతి సేయ నియ్యకొనఁ • జక్కని సుందరినైతి నీ కహో! 172

చ. వరములనిచ్చి ప్రేముడిని • బాసల సేసియుఁ దీర్పనేఁడు నా
వరముల గోరునంతటనె • పార్థివ! క్రూరను దుష్టనైతినా ?
వరగుణహీననైతినొకొ • బాసల సేసియు వాని మీరఁగా
దొరకొనువారు ధార్మికులొ • దోషులు గారొకొ! నీవె చెప్పుమా.

చ. నరవరు లెందఱో యెఱుఁగ • నాకు వరంబుల నిచ్చియుంటి, వా
వరములఁ గైక కోరె నొకొ • పార్థివ! కోరిన నేమికోరె? నీ
వరమరవీడి దీర్చితివె? • యంచు నినున్ దమిఁ బ్రశ్న వేయుచో
ధరణిపులేరుగాని, సము • దంబున మారుగ నేమి చెప్పెదో ? 174

చ. వరము లొసంగలేదనుచుఁ • బల్కెదొ? కోరదు కైక వాని నం
చరమరవీడి పల్కెదవొ? • ఆర్తిని గుందుచుఁ ద్రోసిపుచ్చితిన్
వరముల నందువో? యెటుగఁ • బల్కిన కీర్తి గడింతువో? కదా!
స్థిరమగు బుద్ధియోజనను • దేల్చుకొనం దగు నీవె భూవరా! 175

చ. మరచితివొక్కొ మున్ను శిబి • మాంసము డేగ కొసంగడొక్కొ? మున్
శరణముఁ గొంటు పావురము • సత్యవిదుండు నలర్కుఁడున్ గనుల్
వరమిడి గ్రుడ్డివాని కిడెఁ! • బాయఁడు సాగరమూర్తి పారమున్
సురల కొసంగినట్టి వర • శుద్ధి గణించి స్మరింపు వీరలన్. 176

చ. కులము సముద్ధరింపఁబడు • గోత్రము వన్నెకు వచ్చు శీలమే
నిలచెడి శాశ్వతంబుఁగ బు • నీత మనంబున స్వర్గధామమున్
గలుగు యశస్సు పెంపుఁగనుఁ • గాంచిన సత్యము, సత్యసంగర
స్థలి విజయంబుపొంద నృప! • జన్మము సార్థకమయ్యెడిన్ జుమీ. 177

తే. సత్యధర్మ పరిత్యాగ • సరణి తగునె
కైక నెట్లొ త్రోసి రాముని • కరముఁబూని
రాజ్యరమ నిచ్చి కౌసల్య • రాగమొంది
కులుక నుంటివె యామెతోఁ • బలుకులేల ? 178

చ. తలఁచినరీతిఁ గోరితిని • ధర్మమొ లేక యధర్మమో నృపా
పలికితి మంచియో చెడుగొ • పల్కితి సత్యమసత్యమో వరం
బుల నిదె యిచ్చువాఁడ నను • భూపుని నమ్మించు, నీ ప్రతిజ్ఞ నీ
విల నిలఁబెట్టుకొందువొ చ • లించెదొ? నేను చలింపఁ గోరికన్. 179

శా. రామున్ రాజుగఁజేసితేని వినుమీ • రాజన్య! కౌసల్యయే
సోమున్ భాతిగ పెద్దదై వెలుఁగు దా • సోహమ్మనం బాలితుల్
రామున్ మాతనుగాంచి యోర్వగలనే • ప్రాణంబులన్ వీడెదన్
స్వామీ! వేరొకమాట, లే దిడుము రా • జ్యంబిప్డె నాబిడ్డకున్. 180

తే. రామచంద్రుండు రాజైన • రాజమాత
కాదె సవతి? కౌసల్య న • క్కరణిఁ గాంచి
బ్రతికి యుండుట కంటె జీ • వంబుఁబాయు
టొప్పుఁ బరలోకమందేని • ఒనరు సుగతి. 181

చ. విషము లభింపదా? ఉరికి • వీలగు తాడొక యింతలేదె? ప
మిషనొ త్యజింతు, జీవమును • మేదినినాథ! సునిశ్చయంబ, కి
ల్బిషమున రామచంద్రుఁ బృథి • వీపతిఁ జేయఁగ నిశ్చయించితే
విషమునుమ్రింగి యీ తనువు • వీడెద నిప్పుడె, నీదు సన్నిధిన్. 182

చ. భరతునిమీద నొట్టు మఱి • ప్రాణము మీదను గూడ నొట్టు నా
భరతుఁడె రాజ్యమేలవలెఁ • బంపవలెన్ వనికిప్డు రామునిన్
స్థిరమిది మార్పుఁజెందదిఁక • చిత్తము వేరగు మార్గమేమియున్
సరిపడదో జనాధిప! ప్ర • శాంతిఁ గనన్ హృది మార్గ మియ్యదే? 183

శిఖరిణి. ధరానాథా! రామున్ వనికిఁ బనుపన్ • తథ్య మనుమీ
స్థిరుండై సత్యంబున్ దశరథుఁడు సా • ధించె ననఁగన్
వరంబీడేర్పంగా, భరతుఁ డిపుడే • పార్థివుఁడుఁగా
మరే మార్గంబెంచన్, దుది పలుకు సు • మ్మా రఘుపతీ! 184

## దశరథుని విలాపము

మ. అవనీనాథుఁడు *దుఃఖశోకమయుఁడై ♦ ఆ ఘోరవాక్యంబులన్
విని, పత్నీ శపథంబు నెంచు, సుతుతో ♦ విశ్లేషమూహించు, రా
ముని రాజ్యచ్యుతియున్, వనీగతియు సం ♦ బోధాత్ముఁడై వ్యాకులం
బున, నిశ్చేష్టితుఁడై భువింబడుచు నొ♦ప్పున్ భిన్న భూజంబనన్. 185

చ. జనపతి పిచ్చివాని గతిఁ ♦ జంచల చిత్తుని రీతి వ్యాధిచేఁ
దనువుకృశించు వానివలె ♦ దాల్మి నశించిన చొప్పు, తేజమున్
మనమును గోలుపోయిన, స ♦ మాహిత చిత్తము లేనివాని భం
గిని బొరలాడుచున్ బలుకు ♦ గీడ్పడు సర్పమువోలె కట్టునన్. 186

ఉ. చిన్నతనంబునందు, ననుఁ ♦ జేరిననాటను నీ విలక్షణం
బెన్నికఁగన్న దీవిటుగ ♦ నిప్పుడు లజ్జ పరిత్యజించి నా
మున్నె వచింప సాగితి వ ♦ పూర్వముగా, విపరీత భాషణల్
సన్నుతిఁగన్న నీకు సహ ♦ జంబిదియా? తలక్రిందులౌటకున్. 187

ఉ. భూతమొ యేమొ నిన్ను, వశ ♦ ముంగొని నాలుకపై నటించెడిన్
ఘాతుక వాక్యముల్ పలుకు ♦ కారణమయ్యెది యేమొ! కానిచో
వీతభయానురాగములఁ ♦ బ్రేయసి నీవిటు కోరనెంచ, వీ
రీతి యపూర్వమే కద! వి ♦ రించి విధమ్ము నెఱుంగ శక్యమే. 188

ఉ. కారణమేమి? నీ విటు ల ♦ కారణ వైరముఁ బూన రాముపై
నేరొకొ యీహితంబును వ ♦ చించిరి? మేలని నీకు నెవ్వరే
గారడిఁ జేసినార లిటు ♦ గా, భయమేమి? త్వదీయ సూనుఁడే
భూరమణుండు గాఁగఁ దల ♦ పోయఁడు రాముని వీడి కైకరో!

చ. అవగుణమెంచఁ డా భరతుఁ ♦ డన్నకుఁజోడగు తమ్ముఁడేసుమా
చివరకు నీకు దక్కునవి ♦ సీ! యపవాదము లోకనింద, నీ
ధవు మరణంబు, నియ్యదియ ♦ దక్క మఱొండు ఫలంబులేదు, రా
ఘవునకు మిన్న నీ సుతుఁడు ♦ కర్మల ధర్మగుణ ప్రధానుఁడై. 190

*వాల్మీకిప్రయోగము.

ఉ. రాముఁడు *రాఘవుండు సుమి • రామరో! కారణజన్ముఁడుంగదా!
కాముకులై నవారలకుఁ • గానఁగరాని మహాత్ముఁడున్ సుమా!
నీమము నీతియుంగల పు • నీతుఁడు దివ్యగుణాకరుండు, నా
రాముని బంపుటా వనికి? • రాగల లాభము లేదు నమ్మునీ. 191

ఉ. ఏమని చెప్పువాఁడ వని • కేగుము రామ యటంచు! కల్మషం
బేమియు లేని రాము, ముఖ • మేగతిఁ జూడఁ గలాడ? దోషినై
యేమియుఁ జెప్పకుండఁగనె • యేగును రాముఁడు వన్యభూమికిన్
నామది యిట్టిదంచు విని • నన్, గడు వీరుఁడతండు ధీరుఁడై. 192

తే. తండ్రిమాటను జవదాటఁ • దలఁపఁబోడు
నీదు కోరిక వినునంత • నే యయోధ్య
వీడు, తల్లి హితముఁ దీర్చు • వాఁడు, వాఁడు
వినయ సంపన్నుఁ బంపుదే • విపినములకు. 193

చ. తలఁచినచో నతండొకఁడె • ధాత్రిని సర్వముఁ గేలఁ బట్టఁగా
గల, వర ధార్మికుం డటుగఁ • గర్తగనై నిజరాజ్య మూనుచున్
వెలసి, మదాజ్ఞ మీరుటయె • ప్రీతియ, నాకని రాముఁడాత్మలో
దలపఁడు శుద్ధవర్తనుఁడుఁ • దామది నెంచఁడు లోకరీతులన్. 194

తే. రాము నడవికిఁబంపి యా • రాము సతిని
జానకినిఁ జూడఁగలనె? య • శాంతి మయుఁడఁ
బ్రతికియుండునె క్షణమైనఁ • బతినిఁ బాసి
మామ, మరణంబు వినియును • మహిజ, యింక. 195

తే. ప్రాణసముఁడైన రామునే • పంపె వనికి
నాదు లక్ష్మణు గతి యిఁక • నేదియగునో
అని సుమిత్రయు, భయమొంది • ఆర్తిఁగనదొ
చంచలాత్ముఁడు రాజని • యెంచదొక్కొ. 196

తే. సకలగుణధాము శ్రీరామ • సార్వభౌము
జనని, రాఘవుంగాంచిన • సాధ్వి, యమల,
మునితతుల గౌరవాస్పద • పూతచరిత
నెప్పుడును గాని నీవలె • నెలమిఁ గనము. 197

---

*రాఘవుఁడు = సర్వజ్ఞుఁడు.

తే. అకట కౌసల్య కేమని • యనఁగ నోతు
ప్రియ ప్రియంవద, భార్యయుఁ • బ్రేమమూర్తి
దాసియనుఁగాఁగ మెలఁగెడి • తన్వి యామె
సర్వ సుఖముల నొనఁగూర్చు • జనని వోలె. 198

తే. కైకకోపించు నను భయ • కారణమున
సత్కరింపను కౌసల్య, • సరసిజాక్షి
కేమిచెప్పుదు రాఘవుం • డేడి యనిన!
కట్టి కుడుపదొ! నాపాప • కర్మ నన్నె. 199

తే. రామువిడి లక్ష్మణుండును • రామమాత,
ఆ సుమిత్రయు వేవేగఁ • నమరపురికి
ఒకరి వెనువెంట నొకరుగా • నుర్వివీడి
చనరొ ? ఆ పైన విధవనై • సాకు మిలను. 200

తే. ఎందఱెందఱో హితులును • బందుగులును
రామవిశ్లేష దుఃఖ భా • రమ్ము కతనఁ
గుంది గుందుచు మరణింప • కుందురొక్కొ
జీవతతి సర్వమును వెతఁ • జెంది కుందు. 201

ఉ. బాలుఁడు జ్ఞాన హీనుఁ డహిఁ • బాణినిఁ బట్టినరీతి నిన్ను నే
లీలగఁ బూనినాను, పురు • డించెడి పుత్తడిబొమ్మవంచు, నా
కేల, మహోరగంబవని • *కింజుఁడనై తలపోయనైతి, నీ
మూలమునన్, గుటుంబము స • మూలముగా నశియించు నక్కటా.

ఉ. మౌనులు సర్వలోకనుత • మాన్యులు, రాజులు సాధు సజ్జనుల్
కానగ రామచంద్రునకుఁ • గట్టెదఁ బట్టమునంచుఁ బల్కియుఁ
గానకు రాజుగాఁగ రఘు • కాంతుని బంపిన సాటివారిలో
న్యూనతగాదె! సత్యపద • మూనక వీడిన గేలి సేయరే. 203

ఉ. లోకము తిట్టిపోయదొకొ • లోలుఁడనై సతి చెప్పుచేతలఁ
జేకొని యాచరింప, నెటు • చెప్పెద? నేర మొకింతలేక యే
నీకిక రాజ్యమీయనని, నిండు • సభన్ యువరాజు సేయగా
వాకొని, రామమూర్తి కటు • పల్కగనౌనె యసత్యవాదినై. 204

*కింజుఁడు = నిరర్థక జన్మ కలవాఁడు.

ఉ. ఏమని చెప్పువాఁడ మను • జేశ్వరులందఱు ప్రశ్నవేయుచో
రాముని కేల యీయవని • రాజ్యము? నేరము మోపుటెట్లు? శ్రీ
రాముఁడు నింద్యుఁ డందున? ప • రాజితుఁ డందునా? దోషియందునా?
కామినికిన్ వశంవదుఁడ • కాంతయె దీనికి హేతువందునా? 205

ఉ. గోతికి నూతికిన్ నడుమఁ • గుందుచునుంటిని నెట్లుపోయినన్
జాతము నిశ్చయంబు, వన • వాసిగఁ బంపినఁ బంపకున్న, నా
నేత, వరంబు లిచ్చుటకుఁ • జేతము వెన్కకుదీసె నేనియున్
ఘాతకురీతి, రాఘవునిఁ • గాననసీమకుఁ బంపినన్ సుమా. 206

తే. అనృతదోషంబు వాటిల్లు • నటుగ నిటుగ
సత్యవాదిగ మననగు • సరణి లేదు
సత్యమునువీడి బ్రతుకఁగాఁ • జాల నిలను
వంశ మిల అపయశమును • బడయదొక్కొ! 207

తే. రాజవీధుల మొగమెత్త • రాదు రాదు
ప్రజలు ననుఁజూచి నవ్వరా? • పడతికొఱకు
జ్యేష్ఠపుత్రుని వనికంపె • సిగ్గుమాలి
యనుచు, దుష్టుండు స్త్రీలోలుఁ • డనుచు నన్ను. 208

చ. అతఁడు మహాత్ముఁడంచని దు • రాత్ముఁడు తండ్రియటంచు కోవిదుల్
సతతముఁ బల్కుచుందు రిఁక • చచ్చిన చావకయున్న నేమి? యీ
బ్రతు కిఁక దూషితంబగును • రాఘవ, వంశము కీర్తిఁ బాసెడిన్
సుతుఁడో! చరించు, ఘోరవని, • స్రుక్కెడి నాదగు సత్యనిష్ఠయున్.

ఉ. కైకరో! నీకతంబున, వి • కావికలైచను వంశకీర్తి, నా
ప్రాకటశుద్ధవర్తనము • బాయుదుఁ బాయుదు సత్యసంధతన్
లోకవిశిష్టులైన జను • లున్, నిను, నన్నును దిట్టిపోయరే
ఏకరణిన్ మనంగనగు! • నీగతిఁ బాపు మివే ప్రణామముల్. 210

ఉ. ముందెపుడో, వరద్వయము • ముద్దులకైక కొసంగియుంటి, నేఁ
డందున రామునిన్ వనికి • నంప, విధించె వరంబొకండు నన్
సుందరమూర్తినిన్ విడిచి • స్రుక్కుచునుంటి, సతీవశుండనై
యందున? శిష్టరక్షకుఁడ • నయ్యుఁ ద్యజించితి ధర్మమందునా? 211

ఉ. దుష్టుల శిక్షకుండనయి • దోర్బలవంతుఁడనై నృపుండనై
యిష్టములేని దుష్కృతి స • హించితి సూనృతమూని యందునా?
కష్టపరంపరాగతికిఁ • గాయము ద్రెళ్ళఁగ నొప్పగించి, ని
శ్చేష్టితుఁడై నృపాలుఁడు వ • శీకృతుఁ డాయెను గర్మకందునా?

ఉ. ఏమనువాఁడ? దుష్టకు వి • ధింపక శిక్షను, బ్రాలుమాలి, మా
భూమిధవుండు, రాఘవునిఁ • బొమ్మనెఁ గానకునన్న నాప్రజల్?
ఏమనువాఁడ? మున్ సభ వ • చించియు రామునకీయ రాజ్య, మీ
వేమని త్రోసిపుచ్చితివ • నే ప్రజ కేమని మారుపల్కెదన్? 213

శా. నోరెట్లాడెనో కైకకున్! దనదు సూ • నున్ రాజుగాఁ జేయఁగా
గోరం గోరగవచ్చుఁగాని సుకృతున్ • గోదండపాణిన్ మహా
ఘోరారణ్యములన్ జరింపుమనుచున్ • ఘోషింపఁగానేలనన్
మారాడంగల మాటయేమొ చెపుమా • మాన్యాళికిన్ సుందరీ. 214

ఉ. హా! యెటువంటి దుఃఖము! మ • హా క్షుభితాత్ముఁడనైతి సత్యముం
బాయఁగవచ్చె రాఘవునిఁ • బాయఁగవచ్చె, మహాత్మ పుత్రునిన్
బాయఁగవచ్చె, వంశమును • బాయఁగవచ్చె సుకీర్తి, సద్గతుల్
బాయఁగవచ్చెఁ బ్రాణమిఁకఁ • బాయుదు! బ్రోవగదే సతీమణీ. 215

ఉ. సాగర సంవృతాఖిల వి • శాల ధరాస్థలి నాది, సర్వమున్
రాగమువీడి యిచ్చెద, వి • రామములేని మదీయదుఃఖమున్
వీడగఁ జేయుమీ శరణు • వేడెద నీ చరణంబు లంటెదన్
వేగ క్షమించి బ్రోచి రఘువీరునిఁ, • గీర్తిని నాకు నిల్పుమీ. 216

ఉ. స్త్రీ లహా! స్వార్థమే తలతు • రేపని నైనను, దుష్టబుద్ధులౌ
స్త్రీలె గణింప, పెక్కురు స • తీ తిలకంబులుఁ గూడ లేరనం
జాల, సతీమతల్లులకు • సాగిలి మ్రొక్కఁగ వచ్చుకాని, నిన్
బోలెడి కైకలందఱను • బ్రువ్వగదిట్టినఁ బాపముండునే? 217

ఉ. నాదు సమస్త రాజ్యముఁ గొ • నందగుఁ గైకరో, నీవ యిప్పుడే,
సాదరరీతి, నే శరణ • మంటిఁ గృపామతిఁ బ్రోవుమంటిఁగా;
నీదగు రాజ్యముం దిరిగి • నీవె దయన్ క్షమియుంచి రామునిన్
గాదనకుండ నిచ్చి కల • కాలము కీర్తి వహింపుమీ సఖీ! 218

ఉ. హా! సుకుమార బాల! విపి • నాంతరమందుఁ జరింపనోపుదే!
వాసియు వన్నెయుం గనిన • వంశమునం దుదయించి, రాజువై
బాసిల నొప్పు నీవు వన • రాజుగ నుందువె? యెట్టికర్మమో!
దాసుఁడు నిన్నువీడి, యిక • తాల్మి నశించి కృశించి పోవఁడే! 219

తే. సర్వ సుఖముల కాణాచి • సకల విదుఁడు
అతులమృష్టాన్న భోజన • హితుఁడు, రతుఁడు
కందమూలంబులం, దినఁ • గలుగు నొక్కొ
వెదకి, వెదకుచుఁ గని వాని • విపిన మందు. 220

తే. హయ గజ రథమ్ము, లే వాహ • నాళి గాఁగ
సరళమగు బాటఁ దిరుగాడు • పరహితుండు,
పుట్టగుట్టలఁ బట్టుచుఁ • బోవుచుండి
అడుగులను వేయఁగలఁడొకో! • అడవియందు. 221

తే. సౌధరాజమ్ము లందున • సతత ముండు
చారుతరమూర్తి యా తరు • చ్ఛాయ లందు
అలపులను వాయఁ బవళింపఁ • గలుగు నొక్కొ
కఠినతర భూమియే పాన్పు • గాఁగ, నింక. 222

తే. దాశరథి వౌటఁ గష్టంబు • దాపరించె
శ్యామ సుందర రామ వి • శాల నేత్ర!
దండకాటవి వసియింపఁ • దరమె నీకు
కఠిన చిత్తయుఁ గడు దుష్ట • కైక నిజము. 223

మ. ముని వేషంబున నారచీరల మెయిన్ • బూనంగ నీ కౌనొకో!
కొని కృష్ణాజనమున్ జరింపనగునే • ఘోరాటవిన్, దండకన్
దినఁగా నోపుదె కందమూలముల ధా • త్రిన్ శయ్యగాఁ గొందువే
తనువెల్లం గనలుంగదా? యెటుగ నా • తండ్రీ మనంగల్గుదో. 224

ఉ. కైకరో! పీడు వాఁడ నిను • కాంతను పత్నిని; నాదు భార్యవై
నా కపచారమూనఁ దగు • నా? నిను వీడిన బాప మేమియున్
సోకదు నన్ను; రాఘవునిఁ • జూడక నుండఁగలాడ నొక్కొ? నీ
శోకో, కఠినాత్మ! బాసనిడఁ • గుందగఁ జేతువె భర్త నీగతిన్. 225

తే. ధాత్రిజా భర్త వని కేగ • దశరథుండు
చచ్చుటయె నిక్కువంబగుఁ • జనిన పిదపఁ
జేయు కర్మల భరతుండు • సేయరాదు
మీర లిర్వురు విడనాడు • వారు గాన. 226

మ. అనుచున్ భూమికిఁ గ్రుంగునట్టి విభు నా • అజ్ఞాతి కైకమ్మ గాం
చును, మోముం బెడవైపు ద్రిప్పు నలుకన్ • జోద్యంబుగాఁ జూపు; వే
తన పాదంబుల వెన్క కీడ్చు పతిచే • తన్ దాఁకగానీక అం
తన గొంతెత్తుచు, నిశ్చితాభిమతమున్ • ధాత్రీశుతోఁ బల్కెడిన్.

కైక దెప్పుడు

చ. వరము లొసంగునాఁడు, మరి • బాసలఁ జేసిననాఁడు, నేఁడు నీ
వరములఁ దీర్చువాఁడ నను • బ్రజ్ఞలఁ గొట్టకముందు నీ కహో
కొరవడెనా వివేకము ? న • కుంఠిత సత్యపరాయణత్వమున్
విరమణమూన, నంచనిన • విశ్రుత వాక్యము లన్ని వీడితో. 228

ఉ. ఏమిటు లంగలార్చఁ దగు • నే, నృపసత్తమ ! అన్నమాటనే
నీతియు నీమముం గలిగి • నిల్పుకొనందగు నంట పాపమా ?
రాముఁడు గీముఁ డంచు, విన • రాదిక నాదు వరంబు లీయుమీ
బాములు గీము లన్నియునుఁ • బాయును సత్యమువీడ నొల్లవేన్. 229

ఉ. ఆడినమాటఁ దప్పఁడు ధ • రాధిప ముఖ్యుఁడు రాజరాజు నా
వాఁడు నృపాలుఁడంచు బహు • భంగులఁ బ్రేముడిఁ జూచు నంచు, నీ
నీడఁ జరించితిన్ మనసు • నిల్పఁ గలట్టి వదాన్యుఁ డెంచ నా
ఱేఁడని విశ్వసించితి న • రే ! మగవారల నమ్మరాదొకో. 230

చ. వరము లొసంగుమీ యనుచుఁ • బ్రార్థనఁ జేసినదానఁగాను మున్,
స్థిరమతి లేనివానిగ, ని • సీ ! విభు నెంచిన దానఁ గాను, నే
వరముఁ దలంచియే మును స • పర్యలఁ జేసినదాన భర్తకున్
వరగుణ సత్యసంధుఁడను • భావమునన్, సరి, తేలె నేఁటికిన్. 231

ఉ. ఇచ్చితి నీ వరద్వయము • నిచ్చ మెయిన్ నెరవేర్ప నెంచి; ఏ
పొచ్చెముగాని లేనియెడ • పో, నని ముందుగఁ జెప్పవైతివే
యిచ్చెద కోరుమీ శపథ • మియ్యది యంచని యిప్పుడే గదా
యిచ్చక మాడినావు నృపుఁ • డేమన, నయ్యది సత్యమౌనొకో. 232

ఆ. వరము లీయనేల ? • పదపడి యీ రీతి
ఆడితప్పు నేల ? • యతివతోడ
దశరథుండు ప్రకృతి • వశుఁడౌచు సత్కీర్తి
నేలఁ ద్రోయుచుంట • నే సహింప. 233

ఆ. నీదు ధర్మపత్ని • ని సుమ; న్మము మదియ
దాన నీ యశమ్ముఁ • దలఁచి తలఁచి
సత్యసంధుఁడవను • శాశ్వత కీర్తిని
పాదు కొల్పెడి విధి • నాది కాదె! 234

చ. అతఁడు మహాత్ముఁ డంచనవె • అతఁ డజయ్యుఁడు నంచు బల్కవే
అతఁ డిలఁ బుట్టినట్టి పని • యంతముఁ దీరెడి రీతి నాతఁడే
సతముఁ జరింపఁ గాఁగలఁడు • సత్యము వీడఁగ నేల నీకు, నీ
సుతుఁడను భావమున్ మఱచి • ప్రుక్కుట వీడుము సత్యసంధుఁడా.

తే. ఇది అపథ్యంబుఁగా నెంచు • దే, నృపాల ?
కర్మ తెఱఁగును మఱతువే • కర్మవీర ?
వరములను దీర్చుటయె, నీదు • పరమ హితము!
అడిగి విడుచుట సూనృత • మగునె నాకు ? 236

తే. అనుచు ధ్రువమొనర్చె • నా కైక తన కోర్కె
ఆమె నోట వాణి • అమరిన గతి
మారు మాటలేక • మమతలోఁ బడి రాజు
తనయు నెంచి శోక • తప్తుఁ డగుచు. 237

దశరథుని దుర్భరావస్థ

తే. కుపితుఁడై కొంత తడవుండి • కోప ముడుగఁ
గైక కనసాగె రాజు దుః • ఖమ్ము పొంగ
మనుజపుంగవ రాముఁడు • వనికి నేగ
నేను మరణింతు సుఖముల • నీవె గనుము. 238

తే. హాసమును, లజ్జ రాగంబు • నభినయమ్ము
పెడమొగము, చూచి, చూడని • వీక్షణములు
లలితమధురోక్తి నీర్ష్య వి • లాసములును

బ్రణయ కలహమ్ములును జవ • రాండ్ర చైదు
లివి ప్రయోగించి పురుషుల • నేలుఁ బడఁతి. 239

తే. స్త్రీల హావభావంబులు • లీల లెంచఁ
బురుషులకు బంధనమ్ములే • పోలఁతి కనులె
పురుషు నాడించుఁ, గోతిఁ జేఁ • బూనినట్లు
కీలుబొమ్మలు మగవారు • స్త్రీల కెపుడు. 240

తే. చేయఁగా రాదు స్నేహంబు • స్త్రీలతోడ
వలదు వైరంబుఁగూడ జ • వ్వనులతోడ
మోదమో ఖేదమో యెట్టి • పొందుఁగాని
స్త్రీలతో సల్పు, మగవారు • చెడుట నిజము. 241

ఉ. బిడ్డలు లేక లేక పృథివిం • గల జన్నము లెన్నొచేసి యీ
దొడ్డ కుమారుసిన్ గనితి • దోర్బలవంతుని దీర్ఘబాహు, నీ
*గడ్డ భవాబ్ధిఁ ద్రోవఁ గను • గడ్డ సుమా "మహిమోన్నతుండు" నీ
†జడ్డు త్యజించి ప్రోవుమిక • సారసనేత్రుని రాము సత్కృపన్. 242

తే. అనుచుఁ గోసలేశుఁ • డవనిపైఁ బడె మూర్ఛఁ
దెల్లవారవచ్చె • నెల్ల దిశలు
కైక తహ, తహఁ బడెఁ • గర్తవ్య మరయక
చదలఁ జుక్క గూడ • వదలుచుంట. 243

ఉ. చుక్కలగుంపు, భూధవుని • శోక దవానల దగ్ధుఁ గాంచుచున్
బక్కున నవ్వుచుండె నన • భాసిలి, వీడుచు వీడుచున్ జిగిన్
గ్రక్కునఁ బోవసాగె, రఘు • రాముఁడు కారణజన్ముఁ డంచుఁ దా
నిక్కరణిన్ వెతంబడగ నేల • నృపుండని లోఁదలంచుచున్. 244

## కైక కడపటిమాట

తే. తెల్లవారునంత • కల్లయౌ తన వాంఛ
రామచంద్రుఁ డగును • రాజరాజు
అనుచుఁ గైక దలఁచి • యవనీశునకుఁ జెప్పు
సత్యసంధ కనుము • సత్య నిరతి. 245

*గడ్డ = దీపము, †జడ్డు = జాడ్యము.

తే. నిత్య సత్యదీక్ష • నింగిని సూర్యుండు
పొడువనుండెఁ గనుము • పూజ్యుఁ డతఁడు
సూర్యవంశజుండ! • సూర్యునిఁ గనియైన
ఆడి తప్పఁ దలఁప • కమలచరిత! 246

ఉ. ఆడిన, నాడవచ్చు వివి • దార్థములం దలపోసి కల్లలన్
ఱేఁడు; సతీలలామ యర • రే యటుపల్కాదు రెండు మాటలన్
గూడునె సత్యసంధునకుఁ • గుందగ? సత్యపథానువర్తియా
వాఁడవు ధర్మవీరుఁడవుఁ • బ్రాజ్ఞుఁడవున్ విలపింపఁ జెల్లునే? 247

ఆ. ఆడఁ దలఁచితేని • ఆడుమీ యొక కల్ల!
శోకమేల? యిటుగ • స్రుక్కనేల?
ఆడి తప్పఁజాల • నడిగిన వరముల
మార్చు లేదను, మాట, ము • మ్మాటికందు. 248

ఉ. నీ కహా! కల్ల లాడుటకు • నె మ్మది యొప్పదుగాని నన్ను నీ
కైకనుఁ బల్కియున్న నుడి • కాదని పల్కగఁ బ్రోత్సహించెదే
సోఁకును నాకు పాప మటు • స్రుక్కఁగఁ జేసిన సత్యవాక్కు, నే
నా కరణిన్ సహింప విను • మా! విడుమా! యిక దీన వృత్తినిన్.

చ. అడిగిన, నాదు మాటయును • నల్లె యొనర్చెదనన్న నీ నుడిన్
దడయకఁ దీర్చ నిర్వరముఁ • దప్పిన వారముఁగాము సత్యమున్
విడువుము పుత్రమైత్రి నని • వీడఁగ రామునిఁ గౌశికుండు మున్
నుడివిన సత్యమెల్ల స్మృతి • నుండి తొలంగెనొ ధర్మతత్పరా! 250

ఉ. చాలును జాలు శోక మిఁక • చయ్యనఁ జెప్పవో ఒక్కమాట వే
యేల? యధర్మమార్గము, వ • హింతువో? ధర్మమె పొంద నెంతువో
కాలము మీరకుండఁ గల • కాలము నిల్పెడిమాట యేదో, భూ
పాల! త్రిలోకబాంధవుఁడు • ప్రాగ్దిశఁ దోఁచెడి యంతలోపునన్. 251

తే. అనుచు నేమేమొ కైకమ్మ • అవని విభుని
స్మృతి విహీనుని మూర్ఛలో • నేడ్చువాని
కఠినవాక్కుల ములుకోలఁ • గాంతి యుడుగఁ
తాడనము సేయసాగె, ని • తాంత వృత్తి. 252

తే. హృది విదారణమైన, యా • సుదతి చెయిది
కమిత వృద్ధుండు రాజు 'హా • తోస్మి' యనుచు
దానవృత్తికిఁ బలియైన • వాని బలిని
నాత్మఁ దలపోసి దుఃఖించు • నమితముగను. 253

చ. అడుగులు మూఁడె కోరుటను • నంతెకదా యని దాన మిచ్చుటన్
మడియఁగఁజేసె వామనుఁడు • మాయ మెయిన్ బలిచక్రవర్తినిన్
పడతి! అధర్మవర్తనకుఁ • బాల్పడకుండమి యెప్పుఁ డెప్పుడో
నుడివిన, నీ వరద్వయము • నున్ బలివేదికయయ్యె నాకహో. 254

## దశరథుని వర ప్రదానము

తే. కనుల నీరు నిండఁ • గాంచుచుఁ గైకను
కుంటువడగ మాట • గొంతునెత్తి
పలుకఁ దొడఁగె కైక • బద్ధుండనై తిని
ధర్మగతికి సత్య • తత్పరుండ. 255

ఉ. చిక్కితి ధర్మపాశమునఁ • జిక్కితి నీదు వివేకహీనతన్
జిక్కితి సంచితార్థమునఁ • జిక్కితి అగమకర్మ కీగతిన్
జిక్కితి కామ మోహములఁ • జిక్కితిఁ జేడియ పల్కులన్ గడున్
స్రుక్కెద లోకబాంధవునిఁ • జూచిన పిమ్మటఁ దెల్లవారగన్. 256

ఉ. ఓ యుడులార! మీరయిన • నుండరె? మీకును జాలి లేదొకో!
పోయెదరేల? రేపె రఘు • పుంగవునిన్ వనికంపు నీమె, నేఁ
బాయుదు శుద్ధవర్తనునిఁ • బ్రాజ్ఞుని జ్యేష్ఠుఁ బ్రభాతమైన, నా
కాయతమౌను దుష్కృతి, ని • శా, కరుణింపుము కొంతవేళయేన్.

ఉ. ఈ యపరాధిఁ గాంచనగు • నే యని పోవఁ దలంతువేని నే
నీయమఁ జూచు దుర్గతియు • నేగెడి; నా కనుగండ్లఁ జూడఁ గై
కా! యిక నిన్ నృశంస! రఘు • కాంతుని మాత్రమె కాంచ నెంచెదన్
నాయన! రామ! నిన్ను విడ • నాడి మరేనినిఁ గాంచ వీకనుల్.

చ. అవిగొ! ప్రభాతరేఖలు, ది • శాంతరముల్ కడు నెఱ్ఱవాఱె, భూ
ధవుఁడగు నాపయిన్ గినుక • దాల్చెనొ వంశకరుండు; లోకబాం
ధవుఁ డదె తోఁచు స్వీయకుల • ధార్మికు వర్తనఁ జూడనెంచి; ఓ
రవికుల సార్వభౌమ! రఘు • రామ! మనోహర! రమ్ము చెంతకున్.

తే. అనుచు రాముండు తన చెంత • నలరినట్లు
పలుకు పలుకున విభ్రాంతిఁ • బడుచు రాజు
వందిమాగధ, సంస్తుతి • వలదటంచుఁ
సైగఁ గని పల్కె రప్పింపఁ • గమలనేత్రు. 260

తే. కర్మవశ కైక; దశరథ • క్ష్మా విభుండు
కాముకుండు; సురవార • కాంతఁ జిక్కి
మాయ సుడిఁ బడి యీఁదు, ర • మా విభుండు
విధిని జవదాటఁ గలఁడె • పృథ్వీశుఁ డైన. 261

## ఆశ్వాసాంత పద్యములు

చ. లలిత మనోజ్ఞ సత్కవిత • లాలనఁ జేయుచుఁ బాటఁ బాడఁగాఁ
గలిగినవాఁడ గానుగద • గాత్రమొ శ్రావ్యముగాదు, జంత్రమో
అలవడలేదు, తాళగతి • యా యిసుమంతయు రాదు నీ చెవుల్
వలపుఁ గొనన్ సునాదమునఁ • బ్రార్థన సేయమి మెచ్చుకుంటివో. 262

తే. భక్తి వైరాగ్యముల జ్ఞాన • పరిణతిఁ గని
సరస సాహిత్య సంగీత • సకలగతుల
నిన్నుఁ దనియించి నీ కృప • నే వహింప
త్యాగరాజునుఁ గానుఁగా • దశరథసుత. 263

శా. నాదోపాసనఁ జేసి షణ్ముఖిని "ఓం" • నాదంబు నాలించియున్
నీ దారిం గనఁజాలమిన్, హఠము నెం • తే దీక్షమై పూని, నిన్
సాధింపం దలపోసినాడ నదియున్ • సాఫల్యముం గూర్పమిన్
'నాథా' యంచుఁ బ్రణామమున్ సలిపి కా • నం జూతు నిన్ భక్తిమై.

మ. తిరువారాధన, నిత్యమున్, సలిపి, నీ • తీర్థంబు సేవింపకే
పరమాన్నం బగుగాక యేది యయినన్ • భక్షింప నే నాఁడు నీ
తిరుపాదద్వయి నారగింపిడక • నేదేనిన్ గ్రహింపన్, గదా!
పరమాత్మా! రఘునందనా! వరద • భక్తున్ కృపన్ జూడుమీ. 265

శా. సాలగ్రామముఁ జేరె నన్వెదకుచున్ • పట్చక్రరామంబు, నా
యుల్లాసం బహు శబ్ద జాలములతో • నుత్ప్రేక్షగాఁ జెప్పఁగాఁ
జాలన్ రాఘవుఁ డి ట్లయాచితముగా • సంప్రాప్త మంచెంచి నీ
లీలామాయకు మ్రొక్కుచుంటి నిదె నీ • లీలన్ గనన్ శక్యమా. 266

శా. కాలం బొక్క తెఱంగునన్ గడుపఁగన్ । గామింపగా నౌనె నీ
వే లీలన్ భవదీయులన్ గనుదువో! । ఏ కాలమం దెప్పుడో
జాలిం జెందక యుందువే? కృప మెయిన్ । సాకంగ రాకుందువే?
ఏలా జీవి వృథా ప్రలాపములు! నీ । వే దిక్కనం జాలదో? 267

గోవింద రామాయణము—పాదుకా పట్టాభిషేకము అను కావ్యమున—
ద్వితీయాశ్వాసమగు మాయాశ్వాసము—సమాప్తము.

---

# గోవింద రామాయణము

## పాదుకా పట్టాభిషేకము

### సత్యాశ్వాసము

క. శ్రీ కారణ జన్ముఁడవు
నీ కొఱ్కై చిఱుతగద్దె • నీ గతి యేదో
ఏ కాలజ్ఞుఁడు గననగు
లోకాధిప ! నిత్య సత్య • లోకాతీతా !

### సాకేతము – రామ సందర్శనాభిలాష

ఉ. బాలురు వృద్ధులున్ బడుచు • వారలు స్త్రీ పురుషాదు లెందఱో
కాలము మీఱకుండ రఘు • కాంతుని రాము మదేభ వాహనున్
బాలకుఁ గాంచ నెంచి కడు • భక్తిని జేరి రయోధ్యకున్, బ్రజల్,
పాలిత వారముల్, విడిది • పట్టులుగాఁ గొని రెల్ల రథ్యలన్. 2

చ. వినఁదగు మేళతాళములె • వీథుల, వీథుల, రథ్య లన్నిటన్
గననగు మూఁగియున్న జన • కాండములన్, రఘురాము కీర్తనన్
మునిఁగిన భక్త సంఘములు • మోద మొకండె నయోధ్య నెల్లెడన్
దనరెడి పండువో యనఁగ • దాశరథిన్ గన వేచి రెల్లరున్. 3

తే. మల్లె మొగ్గల తీరున • వెల్లనగుచు
రామ పట్టాభిషేకంబు • రండి యనుచు
దివిజులం బిల్వఁ బోయిన • దెరఁగు నొప్పు
నా, అయోధ్య సౌధ వితతి • యంటె మిన్ను. 4

తే. తుడువఁబడి రథ్య లన్నియుఁ • దడుపఁ బడుట
బహుజనంబులుఁ గూడియు • బాటలందు
అపరిశుభ్రత యను మాట • యచట లేదు
చోటు లేకుండుటయు లేదు • బాటలందు. 5

తే. వేడుకలు పండువో యన • వెలయుచుండె
గృహము గృహమెల్ల సొబఁ • గుల నీనుచుండె
ఎచటఁ జూచిన ధూపులె • యింట నింటఁ
బురము పురమెల్ల నొక పెద్ద • పూలతోఁట. 6

తే. జానపదులును పౌరులు • వేనవేలు
గూడి రీనాఁడు రామునిఁ • జూడఁ గోరి
ముదుసలులుఁ గూడ ఆ రామ • మూర్తిఁ జూడ
వచ్చియుండిరి పురమెల్లఁ • బ్రజల మయము. 7

తే. ధూపు రాశీస్సు లవి మిన్ను • ముట్టఁ గడఁగెఁ
బ్రజల కోలాహలం బదె • పర్వె దిశల
రథ్యలన్ని, యలంకార • రాసులయ్యెఁ
బండుగను మించె నీనాఁడు • పట్టణంబు. 8

చ. కులసతు లెందఱో పురినిఁ • గూరిమితోఁ దులదూఁగినారు, 'వా
రల కొమరుండె నేఁడు యువ • రాజుగ నౌనని'; బాల బాలికల్
లలిత మనోజ్ఞ రీతులఁ జె • లంగఁ గడంగిరి సోదరుండె మా
యిల కధినాధుఁ డంచు; జన • మెంచిరి రాఘవు వారి వానిగా. 9

తే. లోక బాంధవుఁ డనుపేర • లోకమెల్లఁ
బాలనము సేయు నా కీవు • ప్రతిగరాగ
మిన్నకుందునె యను నట్లు • మింటియందుఁ
బ్రజ్వరిల సాగె మహిత మా • ర్తాండుఁ డంత. 10

సీ. పూలబంతులు పూని • పురుషావతంసుని
మూర్ధంబుపై వేయ • మురియువారు
పుష్పమాలలఁ గొని • పూజ్యుండు రఘురాము
మెడ వైచి తరియింపఁ • గడఁగువారు
కుంకు మగరుబొట్టుఁ • గూర్మితో శ్రీరాము
నెమ్మోము నుంచఁ జెం • తించువారు
పలు తెఱంగుల నొప్పు • బంగారు భూషల
యువరాజున కొసంగ • నున్నవారు

తే. చెలిమి రామునిఁ గన నెంచు • చిఱుతవారు
కులుకు లొలుకగఁ బలుకాడఁ • గూడువారు
లలిత రాముని హృది భక్తిఁ • దలఁచువారు
రథ్య రథ్యల నిండిరి • రాము కొఱకు. 11

తే. మనుజ సంఘమ్ములే మార్గ • మార్గ మందు
సంఘ సంఘమ్ములన్ రాము • సంస్తుతు లవె
తన్మయత్వమ్ము సంస్మృతిఁ • దనరుఁ, బరఁగు
సచ్చిదానంద భావమే • సకల గతుల. 12

ఉ. పచ్చని తోరణంబుల వి • భాసిలు సౌధ గృహాంగణంబులున్.
హెచ్చిన భక్తిమై మెలఁగు • నింతులు వారల నృత్యగీతముల్
మెచ్చగు బ్రాహ్మణోత్తము, ల • మేయ ముదంబున జెప్పు స్వస్తులున్
రచ్చల నన్ని తావుల వి • రాజిలు చున్న వయోధ్య యందునన్. 13

క. "రామా" యను శబ్దంబే
ధీమంతులు, పండితాళి • తెలియని వారల్
వ్యామోహంబునఁ బలుకుచుఁ
గామింతురు కద అలౌక్య • కర్మల రామున్. 14

తే. రామ నామముఁ జపియించు • రాజధాని
అంద చండాల నిలయమై • యలరు నేఁడు
రాముఁ డింకను రాడేల • రాజ వీధి
మద గజం బెక్కి యధికార • మాన్యతఁ గన. 15

## పట్టాభిషేక సంసిద్ధత

ఉ. ఏమి ? ముహూర్త మీ యుదయ•మే కద ! యింకను రాఘవుండు రా
డేమి ? యటంచుఁ గోట దరి • కేగిరి రాజులు మౌనులున్ బ్రజల్
భూమిధవుండు వృద్ధుఁ గనఁ • బూజ్యుఁడు మౌని వసిష్ఠుఁడున్ వెసన్
నీమము లన్నియున్ నెరపి • నిల్చెను వేచుచుఁ గోట వాకిటన్. 16

ఆ. తనదు రాకఁ దెలుప • దశరథ నృపునకు
మౌని కోరె నా సు • మంత్రు నంత
వర; ముహూర్త వేళ • పట్టాభిషేకంబు
జరుప, మేల్కొలుపుము • సార్వభౌము. 17

చ. వలసిన వస్తు సంపదయు • వార్నిధి నీరము గంగ తోయమున్
విలసిత రత్న సంచయము • వేదవిధిన్ సమకూర్చినాఁడ రా
జులు మునులున్ ప్రజాళియును • జూపఱు లెందఱొ గూడినారు వీ
రలఁ గనుమీ సుమంత్ర! మన • రాజున కీ వెఱుఁగంగఁ జెప్పుమీ. 18

చ. అనెడి వసిష్ఠు వాక్యముల • నాలనఁ జేసి సుమంత్రుఁ డంత రా
జును గనఁ గోట లోపలికిఁ • జొచ్చి వినమ్రతఁ బల్కె, దేవరా!
యినుఁ డుదయించె రాఘవు మ • హీపతిఁగా నొనరింప వేళకున్
మునివరులున్ వసిష్ఠుఁడును • బూనిరి నిల్చిరి కోట ముంగలన్. 19

## దశరథుని నిద్రావస్థ - సుమంత్రుఁడు

చ. ఇనకుల సత్యసంధ! ధర • ణీశ్వర పుంగవ! కోసలాధిపా!
జను లరుదెంచి నారలు వి • శాంపతిఁగా రఘురాముఁ జూడఁ బ
త్తన మది మేళ తాళములఁ • దాండవ మాడెడి పండువో యనన్
జనపతు లెన్నొ కానుకల • సాదరణంబునఁ దెచ్చినారహో. 20

తే. మేలుకొను మిఁక దశరథ • మేలుకొనుము
అవని ఆఁబోతు లేనట్టి • యావుల గతి
కాపరియె లేని పశువుల • కరణి; శశినిఁ
గాంచని నిశగ, నాయకుఁడు లేని సై • న్యంబు వోలెఁ
బరగు నే రాజ్యమైన భూ • పాలుఁ గనమి. 21

చ. మతిమంతుండు సుమంత్రుఁ డా దాశరథ • క్ష్మానాథు కీర్తించుచున్
స్తుతి వాక్యంబుల మేలుకొల్పెడిని, సం • క్షోభించి శోకించి దుః
ఖతుఁ డౌచున్ గను లెఱ్ఱబారిన తెరిన్, • కీర్తించు వాక్యంబు, లా
క్షితినాథుం డతి దీనుఁడై వినఁడు హె • చ్చెన్ శోకమే కీర్తనన్.

ద్వి. కైకేయి మాటలఁ • గడు దుఃఖితుండ
నా కేల సంస్తుతుల్ • నా కేల యనుచు 23

## రామునిఁ దోడ్కొనిరా కైక యాన

తే. శోక సాగర మగ్నుఁడై • క్షుభిత హృదిని
మాట లాడు నృపుఁ గని సు • మంత్రుఁ డంతఁ

జింతలోఁ బడి నిలిచె ని ♦ శ్చేష్టుఁ డగుచు
నా సుమంత్రుని కంతఁ గై ♦ కమ్మ చెప్పు. 24

తే. "రామ హర్షోత్సు" కుం డౌట ♦ రాజు రేయి
లేశమైనను నిదురింప ♦ లేదు సుమ్ము
దాన నిదురించు చున్నాఁడు ♦ దశరథుండు
రాము నికఁ దోడికొని రమ్ము ♦ రాజ మంత్రి. 25

తే. రామ పట్టాభిషేకంబె ♦ రాజు సలుప
నిర్ణయించిన యెడఁ గుంద ♦ నేల ఱేఁడు
అతని మాటగఁ గైకమ్మ ♦ యనఁగ నేల
అని సుమంత్రుఁడు దలఁచెనా ♦ యిపు డదేమొ ! 26

ఉ. కుందుచు నున్న వానిని ది ♦ గుల్పడి దీనతఁ బల్కు వాని, రా
జేంద్రునిఁ, గాంచి యాతఁ డెద ♦ నెంచదు సత్యము; కైక మాట కా
నందము నొందెగాని రఘు ♦ నందనుఁ బిల్వగఁ బోదు సంశయం
బొందెనొ, రాముఁ బిల్వఁగ, నృ ♦ పుండు దలంచెనొ లేదొ యంచెదన్.

తే. కోట బైటను బ్రాహ్మణుల్ ♦ గూడినారు
రాజవరు లెల్ల గూడిరి ♦ రాజుఁ గనఁగ
సైనికాధ్యక్షులౌ వీరు ♦ లైన వారు
పౌర ముఖ్యులుఁ జేరి ర ♦ ప్పట్టు నందు. 28

తే. రాజు రాడేల ? కనమేల ? ♦ రాజు సుఖుఁడె ?
చేయునే నేఁడు పట్టాభి ♦ షేక మరయ ?
అన్నియును సిద్ధమై యుండె ♦ యతఁడె రాడు
అనెడి పలుకు సుమంత్రుండు ♦ వినుచు నచట. 29

తే. రాజు సుఖుఁడు, నే నిపుడెపో ♦ రాజుఁ గాంచి
లేపి వచ్చెద రారాజు ♦ లేచి వచ్చు
నని సుమంత్రుండు నృపుఁ గాంచఁ ♦ జనెను మరలఁ
జేరె శయన మందిర సీమ ♦ శీఘ్ర గతిని. 30

తే. శయన మందిరముం జేరి ♦ జయ మటంచు
ఆ సుమంత్రుండు రఘు వంశ ♦ మంతఁ బొగడి

సకల దిక్పాలకులు నిన్ను సాఁకుఁ గాఁత
యనుచు మేలుకొలిపెడి నా • యవని విభుని. 31

ఆ. నిదుర లేచి ఛేఁడు • నీ వేలఁ బోలేదు
రాముఁ బిలువ నింక • రాముఁ డెమ్మొ
గణన సేయవైతి • కైకమ్మ మాటల
నృపతి యాన మీటి • తేల యిట్లు. 32

క. అనుచున్ బలుకాడెడి నృపుఁ
గనుచున్ సెల వొంది రాజ • కార్యార్థముగా
జననుతుఁడు సుమంత్రుం డే
గెను రఘు రామునిఁ గనంగఁ • గెరలుచు దోడన్. 33

## సుమంత్రుఁడు రామ మందిరముఁ జేరుట

చ. అటు సని కాంచె సూతుఁడు మ • హోద్యుతి మంతము సౌధ రాజమున్
బటుతర బాహు విక్రమ వి • భాసుర సైనిక రక్షితంబునున్
జటుల మణి ప్రభాసితము • చారు మృగాంచిత పక్షి యుక్తమున్
నటనిచయాభి రామ సుమ • నః ప్రకరాన్విత రామ సౌధమున్. 34

తే. అంతఁ జారుల నంపి రా • మాజ్ఞఁ బొంది
మూఁడు ప్రాకారముల దాఁటి • పోయి యచట
మందిరాంతర సీమ సు • మంత్రుఁడు గనె
రామచంద్రుని స్వర్ణ ప • ర్యంక మందు. 35

ద్వి. జనపతి యాజ్ఞమై • తన విధిఁ దీర్చి
ముని చనె గత రాత్రి • మోదంబుతోడ. 36

ఇన వంశ జాతుండు • తన పనిఁ దలఁచి
జనకజాయుతుఁడౌచు • సలిపె సద్విధుల. 37

మధుసూదనునిఁ గొల్చె • మహిజయుం దాను
నిదురించె దర్భల • విధి విధానమున. 38

నియతాత్మ నుపవాస • నిరతితో నుండి
ప్రియురాలితోఁ గూడ • లేచి వేకువనె 39

తే. పూర్వ సంధ్య నుపాసించు • పూన్కతోడ
వీర రాముండు నెరవేర్చి • విహిత కర్మ
భక్తి నారాయణునిఁ గొల్చి • భార్యతోడ
వేచియుండెను జనకుని • పిలుపు కొఱకు. 40

తే. తండ్రి యాన నెదురు చూచు • తనయుఁ గాంచి
వృద్ధ మంత్రి సుమంత్రుండు • విమల భక్తి
మ్రొక్కి సాష్టాంగముగ రామ • మూర్తి నల్లై
జూచు నేకైక దృష్టి వి • శుద్ధ వృత్తి. 41

సీ. రమణీయ స్వర్ణ ప • ర్యంక మందున సుఖా
సీనుండు నీలంపు • మేనివాఁడు
రక్తవర్ణపు సుగంధ • లిప్త తనూ దీప్తి
ఘుమఘుమ వాసనన్ • గ్రాలువాఁడు
వెడద యురంబున • విలసిల్లు తెల్లని
స్వచ్ఛమౌ ముత్యాల • సరమువాఁడు
జానకీదేవి విం • జామరన్ వీచుచు
ప్రక్క నిల్చిన కృపా • పరమువాఁడు

తే. చిత్ర వెలుగొందు శశివోలె • చెలఁగువాఁడు
సతత వరదుండు సహజ తే • జంబువాఁడు
రశ్మిమంతుని సరికాంతి • రగులువాఁడు
సర్వలోకైక విభుఁడు సా • క్షాత్కరించె. 42

తే. కట్టెదుటఁ గాంచుచుండి లో • కైక విభుని
గనుచుఁ బర్యంక విద్యా ప్ర • కాశమూర్తి
నమిత భక్తిని కుశలంబు • నడిగి తెలిపెఁ
బ్రాకటంబుగఁ గేకయీ • భర్త పిలుపు. 43

ఉ. రామునిఁ జేరి సూతుఁడు ధ • రాపతి యాన నెఱుంగఁ జెప్పఁగా
రాముఁడు సీతకుం దెలిపి • రాజును గైకయుఁ బిల్వనంపుటన్
రాముఁడు సద్గుణాన్వితుఁడు • రాజ గృహంబును జేరెఁ ద్రోవలో
రామ "నమో నమో" యనుచుఁ • బ్రాంజలినున్న జనమ్ముఁ గాంచుచున్,

ఆ. రామ ! కౌసల్యా సుప్రజా • రామ, వరద
నిన్ను గొనిరాఁగఁ, గైకయు • నీ గురుండు
నన్ను బంపిరి పోదమ • యన్న నుడి
జాగు సేయక పాలించె • జన నుతుండు. 45

## రాముఁడు తండ్రియింటి కేగుట

ఆ. ఛత్ర చామరముల • సంతోషమునఁ బూనె
లక్ష్మణుండు కడు వి • లక్షణుండు
రథము నెక్కి, యన్న • రాజునుఁ, గైకేయిఁ
జూడఁ బోవువేళ • శుద్ధబుద్ధి. 46

తే. సీత, విభునకుఁ బట్టాభి • షేక మగుటఁ
తథ్యమే యని తలపోసి • తనివినొంది
సాగనంపె భర్తకు నాశి • షంబు లిడుచు
రథముపై రాముఁ డేగుట • రమణు లరసి
విరుల వానలు గురియించి • మురిసినారు. 47

తే. కైక తనపట్లఁ బ్రేమతోఁ • బ్రాలునంచుఁ
దాన కబురంపె ననుచు ము • దమ్ముఁ గాంచుఁ
దనదు పట్టాభిషేకంబు • తథ్య మనుచుఁ
బ్రజలు విశ్వసింపఁగఁ దోఁచు • రాఘవుండు. 48

తే. అగరు ధూపాస్రృతంబుగా • నా యయోధ్య
యింద్రలోకమ! కైలాస • మిదియ! యనఁగఁ
బ్రమద మూర్తిగఁ దోఁచె నా • పట్టునందు
మురియుచుండెను బ్రజ, రామ • మూర్తి నెంచి. 49

ఉ. మాయలమారి గారడి సు • మా యిది యంచుఁ దలంత్రు మౌను లా
ప్యాయముఁ గాఁగ, రాము రఘు • వర్యునిఁ గాంచుచు, హృష్టచిత్తులై
ఆ యమరుల్ కథా విధిని, • నారయ, నిల్చిరి యంబరస్థలిన్
ధ్యేయుని నిర్వికారునిఁ బ • దింబడిఁ జూతురు భక్తు లెల్లరున్. 50

తే. ఆమె కౌసల్య నోచిన • నోము పండె
ఎట్టి పుణ్యాత్మ యో కాంచె • నిట్టి పుత్రు

ధరణిజాదేవి మున్నెట్టి • తప మొనర్చెఁ
బొందెఁ బతిఁగాఁగ రఘురాముఁ • బురుషసింహు. 51

మ .మనముం గూడఁ దపస్సుమై సుమ,యిటుల్ • మానాథుతోఁ దుల్యునిన్
జనవంద్యున్ సుగుణాలవాలుఁ డిల రా • జ్యంబూను కాలంబునన్
జననంబంది కనంగ నోచితి మహో • శ్యామ ద్యుతున్ సుందరున్
ముని సంస్తుత్యుని మోహనాంగు, వరదున్ • ఫుల్లాబ్జ పత్రాక్షునిన్. 52

తే. అనుచుఁ దమలోనఁ దా మెంచు • కొనుచుఁ బ్రజలు
నశ్వ గజ వాహనాసీను • లైన వారు
రథ్యలం దున్నవారలు • రథము వెంటఁ
బరువులెత్తిరి రాజమం • దిరము వఱకు. 53

తే. తేరు సాగిపోవఁ • దెల్లఁ బోయెడివారు
రథము వెంటఁ జనఁగ • రానివారుఁ
గాంచఁ గలుగువఱకుఁ • గను రెప్పవేయకఁ
జూచుచున్నవారు • సుందరాంగు. 54

ఆ. తన్నుఁ జూడకుంటఁ • దానును జూడని
పరమపురుషు దృష్టిఁ • బడయనట్టి
వారి జన్మమేల? • వ్యర్థజీవులు కారె
చూడవలయు నేఁడె • సుందరాంగు. 55

ఆ. ఆత్మ నెంచుచుఁ గీర్తించి • యతనిఁగాంచు
వారె ధన్యాత్ములౌ, వారు • పరమభక్తి
త్రికరణంబుల రాముని • దివ్యతేజుఁ
దలఁచి కీర్తించి సేవింప • వలను పడునె! 56

క. అనుచున్ జూడని వారలుఁ
గనుచున్ సంతృప్తి నంతఁ • గాంచని వారల్
మనములఁ దల పోయుదు రహ
జనవంద్యునిఁ బ్రేమమూర్తి • సారసనేత్రున్. 57

## రాముఁడు రాజునుఁ జూచుట

తే. రాజమందిరముం జేరి • రామమూర్తి
కైక కడనున్న తండ్రినిఁ • గనుచు మ్రొక్కి
పిదపఁ గైకమ్మ పదముల • వినతిఁ జేసి
కనులఁ దడిఁబెట్టు తండ్రినిఁ • గాంచి కాంచి. 58

తే. ప్రశ్న సేసెను గురుని య • వస్థ నెంచి
'ఏమి? నా తండ్రి కెపుడైన • నెట్టిదైన
అపకృతినిఁ జేసి యుంటినా? • అమ్మ చెపుమ
ఏల? నా తండ్రి దుఃఖించు • నిటుగఁ దల్లి. 59

ఉ. ఏమిటు దుఃఖితుండు గురుఁ • డేల ననున్ ప్రియమారఁ బిల్వఁ, 'డో
రామ' యటంచుఁ, బల్కి మరి • రాగముఁ జూపఁడు మున్నుపోలె, నా
నామమె దుఃఖ కారణమ • నాయనకున్ మఱి హేతువేమి? సు
త్రాముని తుల్యుఁ డీతఁడు వె • తంబడు టేల? తపింప నేటికిన్. 60

ఉ. మేరు సమాన ధీరుఁడు న • మేయ బలాన్విత రాజరాజె, యీ
తీరున దుఃఖవార్నిధి ని • దే తలమున్కలుగాగనుండె ప
కారణమో, త్వదీయుఁడను • గాదె, నివృత్తినిఁ జేయనెంతు, నా
కారయఁ దెల్పుమీవ, కృప • నంబరో నా సుముఖుండు డేఁడు గాన్.

తే. తమ్ము లందఱు సుఖులొకొక్కొ, • తల్లు లరయ
సౌఖ్యమున నున్న వారలె? • సార్వభౌముఁ
డెన్న వ్యాధి పీడితుఁ డొకొ? • కన్న తల్లి!
తెల్పుమీ నివె దుర్భాషఁ • బలికినావొ. 62

తే. జనని మున్నెన్నఁడును దండ్రి • గనఁడు వంత
నన్నుఁ గను నంత ముద మొందు • చున్న వాఁడు
అంకమునఁ జేర్చి ప్రియ మాడు • నట్టివాఁడు
ఏల, నేఁడు మౌనమ్ము వ • హించినాఁడు?' 63

## కైక రామునకు సత్యమునుఁ దెల్పుట

ఉ. ఏమని చెప్పుదాన విభుఁ • డేమియుఁ జెప్పఁగలేక నీ కహో
రామ! వ్యథాంబురాశిఁ బడె • రా జిసుమంతయుఁ గోపిగాఁడు నిన్

ప్రేముడిఁ జూచువాఁ డగుట • వేఱొక అప్రియవార్తఁ జెప్పి, శ్రీ
రాముని, బాయలేక వెత • రాజు కృశించెడి ప్రాకృతుండనన్. 64

ఉ. మున్నొకనాఁడు నాకు వర • ముల్ గృప సేసినవాఁడు ప్రేముడిన్,
సన్నుత సత్యసంధుఁడు వి • శాంపతి నేఁ డవి దీర్పనొట నా
పన్నతఁ బొందుచుండెడి, ను • పాయ మెఱుంగక గల్లలాడ, ప
మన్న ఫలంబికేమి? వర • మర్థి కొసంగి కృశించు పిమ్మటన్. 65

తే. రామ సత్యమె ధర్మ కా • రణము గాదె
నీకుగా సత్యమును వీడ • నీదు తండ్రి
తలఁచి దుఃఖించుచున్నాఁడు, • దాశరథివి
నీవె నీ తండ్రి సత్యంబు • నిలుప వలయు. 66

తే. శుభమొ అశుభమో నీ తండ్రి • చొప్పు నరసి
సఫల మొనరింతునందువా, • సకల మిపుడె
చెప్పుదానను, నది నీకు • చెడుగె యైన
దండ్రి శపథంబు నెరవేర్పఁ • దలఁతు వేని. 67

చ. జనకుని మాటఁ దప్పక వి • శాంపతిసిన్ గడు సత్యవాదిగా
నొనరుప నెంతువేని, యిపుఁ డూనెద వేని ప్రతిజ్ఞ దానికిన్,
జనవునఁ జెప్పుదాన, రఘు • చంద్రమ, నీ కిపుడే సమస్తమున్
గనఁదగు నీవె ధర్మమును • గర్మము సత్య మసత్యమున్ దగన్. 68

ఆ. తండ్రిమాట దాఁటు • తనయుండ కానంచు
నెఱిఁగియుండి సంశ • యించు నేఁడు
తల్లి యనుచు వంతఁ • దగులుచు రాముండు
వాకొనంగసాగెఁ • గైక కంత. 69

శా. తల్లీ నాల్కలు రెండు లేవు సుమ, నా • తండ్రేది శాసించునో
యుల్లం బేవిధి సంతసించు నది నే • నుత్సాహవంతుండనై
చెల్లంజేయుదు సుమ్ము, నే శపథముం • జేతున్ గదా నమ్ముమీ
కల్లోలాబ్ధిని గ్రుంకెదన్ జితిని దూ • కం జాలుదున్ దండ్రికై. 70

ఆ. విసము నైనఁ దినఁగ • వెరవను గురు నాజ్ఞ
తండ్రి మాట మీరు • తనయుఁ డేల!

బ్రతికి యుండనేల ? • పలుమాట లేటికి
తల్లి చెప్పు మింక , తండ్రి హితము. 71

### రామునకు కైక పూర్వవృత్తాంతము, వనవాసగతిఁ దెల్పుట

చ. అను రఘునందనున్ గనుచు • నాబిడ కైక రవంతయేని శం
కను గనకుండఁ బల్కు భువి • కాంతుని సన్నిధి నిల్చి, రాఘవా!
మును విను దేవ దానవుల • పోరున స్రుక్కెడి నీదు తండ్రికిన్
మనదగు నట్లు చేసితిని • మాన్యత నన్ గణియించె నాథుఁడున్. 72

ఉ. నాయెడఁ దృప్తుఁడైన జన • నాథుఁడు రెండు వరంబులిచ్చె నా
కా యెడ; నేను కోరకయె; • ఆ వరముల్ గృపసేయఁ గోర, నేఁ
డీ యవనీవిభుం డిటుగ • నెంతయొ దుఃఖితుఁడాయె, రామ ? ము
న్నీయఁగ నేల? యిప్పు డవి , యే, నెరవేర్పఁగఁ గుందనేలకో. 73

చ. భరతున కిచ్చి రాజ్యరమఁ • బట్టముఁ గట్టఁగ నేఁడె, కోరితిన్,
వరగుణు రాఘవున్ విపిన • వాసము సేయఁగఁ బంపుమంటి, నీ
వరమర వీడి తండ్రి హిత • మారసి సత్యము నిల్పఁగోరుదే
గురువును నీవు సత్యమున • కున్ దలలొగ్గెడి వార లౌటచే. 74

చ. పదియును నాలుగేండ్లు వన • వాసమునందు జటాజినమ్ములన్
ముదమునఁ దాల్చి యుండఁదగు • భూసుతనాథ, త్వదీయ ధర్మమే
గద యిది, నేఁడె పోవలయుఁ, • గాదనకుండఁగ; దీనిఁ జెప్పి, నిన్
వదలగలేక దుఃఖపడు • పార్థివ ముఖ్యుఁడు సత్య సంధుఁడై. 75

చ. హృదయము నీకె యర్పణము • వృద్ధుఁడు కోసల ఱేఁడు చేసి, కో
విదుఁడును నీ తెఱంగుల వి • వేకియునయ్యు సుతేచ్ఛఁ జిక్కి సం
పదఁ దలపోసి కారడవిఁ • బట్టు మటంచు వచింపలేక, నె
మ్మది దిగులొంది, ని గ్గనఁడు • మాన్యుఁడు, సంతత సత్యసంధుఁడై

### అడవి కేగ రాముఁ డంగీకరించుట

తే. మరణ వార్తకు సరియగు • మాత మాట
చెవికి సోఁక రాముని హృది • చెదరలేదు
సుఖము దుఃఖము నొకటిగాఁ • జూచు వాఁడు
నిశ్చలుఁడు నిర్మలుఁడు తెల్పు • నిశ్చయంబు. 77

తే. తల్లి దండకారణ్యమున కేగఁ • దలఁతు నేఁడె
జటల గృష్ణాజినముఁ బూని • జాగుఁ జేయ
భరతుఁడే నేఁడు రాజ్యంబుఁ • బడయుఁగాక
దండ్రి యానకు మించిన • ధర్మమేది ? 78

ఆ. హితుఁడు గురుఁడు నృపతి • యేది చెప్పినఁగూడఁ
జేయువాడ వెనుక • దీయ నెపుడు
నే నొనర్చు మంచి • యిసుమంతయే నైన
బరమతుష్టిఁ గనెడి • వాఁడు జేఁడు. 79

తే. తల్లి కోపంబు వలదు; నీ • యుల్ల మిపుడె
సంతసింపంగ నీముందె • జటలఁ దాల్చి
నారచీరల ధరియించి • కారడవికిఁ
బోవు చున్నాఁడ సంప్రీతి • బొందు మమ్మ. 80

చ. భరతుని రాజుసేయఁ దగు • భావము నేరును జెప్పకుండ నా
దరమున నేనె యీయఁగల • ధాత్రిని; ధాత్రియెకాదు ప్రాణమేన్
సరకుగొనం జుమా, యిడఁగ, • జానకిసిన్ భరతాజ్ఞ చొప్పనన్
బరఁగ, నొసంగఁ గల్గుదును, • భ్రాతకు సంతసమొంది తల్లిరో. 81

చ. అది యటులుండ నిమ్మిపుడె • అమ్మరొ నీకుఁ బ్రతిజ్ఞ సేయనే,
విదితముఁ గాఁగ, నీనుడిని • వీడొనరింపగఁ దల్లి తండ్రులే
యది యన దానిఁ జేయుటయె • ఆత్మజు ధర్మము జన్మకారకుల్
గద! ఋణ మిట్లు దీర్పఁ దగుఁ • గా? నపుడేగద పుత్రుఁ డాతఁడౌ.

చ. వనమున కీవు పొమ్మనుచు • వాకొన నష్టుఁడుగాడె తండ్రి యా
ననమును వంచి భూమిఁ గను, • నన్ గన నొల్లఁడు కోపమేమి? యా
తని యనుకంపనే గొనఁగఁ • దాలిమి నుండిన వానికిన్ బ్రియం
బును బలుకాడఁ డేల యిదె • పో యిక పొక్కఁగ నాకు హేతువౌ.

చ. భరతుని రాజుసేయు తన • భావము ముందుగఁ జెప్పియున్నచో
నరమరలేక వల్లె యన • నా? యిటు దుఃఖముఁ బొందనేల, నే
స్థిరమతిఁ గల్గువాఁడ నని • సిద్ధుఁడఁ దీర్పగఁ దండ్రి యాన నం
చరసియు మున్నె నాకు హిత • మారయఁ జెప్పఁ డదే విచారమౌ.

చ. ఎగ్గును జెప్పలేక శిర • మీ గతి వంచి తపించు చుండెపో
సిగ్గున, నంతె రామ, కడు • శీఘ్రముగా వనికేగు మింక, నీ
దగ్గర నెంతకాల మిటు • తండ్రి చరించునో, అంత కాలమున్
గ్రుగ్గెడి వేధచేఁ గుడువ • మానెడి త్రాగడు నీరమేనియున్. 85

తే. అనుచుఁ దొందరఁ బెట్టు, కై • కమ్మ మాట
హృదయమున శూలమై చొచ్చి • పడ్చి మూర్ఛ
నపుడె పడె ఱేఁడు హేమ ప • ర్యంకమందు
నేను దహియింపఁ బడుగాక • నేఁడె యనుచు. 86

## రాముఁడు వనికేగ నంగీకరించుట

తే. మూర్ఛకుం జిక్కి పడు తండ్రి • ముందుఁ జేరి
యెత్తి పట్టుచు జనకుని • బత్తితోడ
త్వరితగతి వని కేగగాఁ • దలఁచి యంత
కైకతో బల్కు దుఃఖంబుఁ • గాంచకుండ. 87

ఉ. పుట్టినవాఁడఁ గాను ధన • ముం దరిఁ జేర్పఁగ, భాగ్య భోగముల్
గుట్టగఁ బెట్టఁ జూచు కృషి • కుండనుగాను, జనంబు నేలఁగా
దిట్టరిఁగాను, నేమియు మ • దిం దలపోయను, ధర్మ మొక్కచే
పట్టి చరించువాఁడ, ఋషి • భావమునన్ మనువాఁడ దల్లిరో. 88

చ. జనకుని సేవఁ జేయుటకుఁ • జాలిన ధర్మము లేదు లేదహో
తనకుఁ దనంతఁ దాను, వగ • దండకకున్ జను మంచు పల్కకు
న్నను జనకుండు, నే, నిదె, జ • నం దలపోసితి తల్లివైన నీ
వనుటయె చాలు, నీ నుడిని • యాచరణన్ శిరసావహించెదన్. 89

చ. ఇనకులు నీప్సితార్థ మది • యే యగుచో శిరసావహింతు నో
జనని త్వదాజ్ఞ యేనియును • జాలుఁగదా? శిరసావహింప, నే
జనెదను దండకాటవికిఁ • జయ్యన వే రవరోధ మేమియుం
గన నిది స్వల్పకార్యమగుఁ • గా పితృవాక్య సుపాలనంబునన్. 90

తే. కాని నీదు హృదయ • కాంత నా కెఱిఁగింప
వేల? మున్నె జెప్పి • తేని, యిలను
భరతున కిడి వనికి • నరిగెడి వాఁడను
నాదు హృదయ మింత • నమ్మవైతి. 91

చ. వరములఁ గోరనేల నృప • వర్యుని? మాన్యుఁడు సత్యసంధుఁడున్
వరదుఁడు ధార్మికుం డిటుగ • బంధుర దుఃఖముఁ బొందనేల? నే
బరుగున బోవువాఁడ వనిఁ • బట్టుచు నేఁ డిదె పోయి వచ్చెదన్
జరిపెడి వాఁడ నీ హితము • చయ్యన మున్నె యెఱింగి యున్నచో.

ఉ. చెప్పిన రీతిఁ జేసెద, ని • సీ యది కష్టమ! వన్యసీమలో
నొప్పుగ శాంతిమై మనుట; • నూనితి వీవహా పక్షపాతమే
యిప్పుడు నా యెడన్, జనుల • నేలెడి భారము కుఱ్ఱవానిపై
ఒప్పులకుప్ప మూర్ధమున • నుంచితి వమ్మరొ, నేనె ధన్యుఁడన్. 93

ఆ. సకల భువన భార • సంశ్రితుఁ జేయవే
భరతుఁ దమ్ముఁ గుఱ్ఱ • వాని, నన్నుఁ
బక్షపాతమూని • వనికి మాత్రమె యేగ
మనవొ పరమ శాంతిఁ • గనఁగ నచట. 94

చ. ఏమనుకొందు నీ దయకు • నింతగఁ బాత్రుఁడనై తిఁగా, వనీ
భూమి ప్రశాంతిమై తపసుఁ • బొందఁగ నొగద యన్యచింతతో
నేమరకుండు సాధన ల • భించుఁ, జరాచర జీవరాశితో
నీ మెయి లీనమై హృదయ • మెప్పుడు పొందు నతొక్యసద్రతిన్. 95

ఆ. భరతుఁడు రాజ్య పాలనము • భారముగాఁ దలపోసి పల్కెనా ?
కర మనురక్తిఁ దండ్రి నుడిఁ • గానకుఁ బోనని పల్కియుంటినా?
పరమ పతివ్రతామణివి • భర్తకు సేవ లొనర్చుచుండ నీ
ధరణి విభుండు నేఁ డిటుగ • దారుణ దుఃఖము బొంద నేటికో. 96

తే. భరతు రావింపవమ్మ భూ • పాలనమ్ముఁ
గొనఁగఁ దండ్రికి శుశ్రూషఁ • గూర్చుచుండ
ననుచుఁ దలిదండ్రులకు మ్రొక్కి • యరిగె నంత
నంతి పురమును వీడి రా • మయ్య వెలికి. 97

ఆ. సర్వ జీవ రాశి • సాఁకెడి రాముని
బుద్ధిహీనుఁ డగుచుఁ • బుడమి ఱేఁడు
సకల భూతచయము • సంక్షోభ మొందంగ
పంపుచుండె వనికిఁ • బ్రాలు మాలి. 98

తే. ఎవఁడు నిత్యమ్ము మమ్ము ర • క్షించుచుండు
ఎట్టి యాదేశమును విభుం • డీయకుండ
ఎవఁడు ప్రేమానురూపుఁడు • నెప్డుఁ గాని
కోప మనుమాట లేనట్టి • కోవిదుండు. 99

తే. అట్టి రఘురాము నడవికి • నెట్టు చుండె
పట్టముం గట్టకుండఁగఁ • బ్రభు వటంచు
బిట్టుగా నేడ్వసాగిరి • ప్రేమ మయులు
రాజ మహిషులు నంతి పు • రంబు వారు. 100

తే. దశరథుండును రాముండుఁ • దక్కిన ప్రజ
యెల్లరు వినంగ ఘోషించి • యేడ్చువారు
సర్వమును రాముఁ డాలించి • శాంతి నుండు
పొంగి పొరలెను దుఃఖంబు • భూమి పతికి. 101

తే. తండ్రి మాటను బాటించు • ధర్మ మతినొ
జన్మకారణ ధర్మమ్ము • సలుపు హృదినొ
అంతరాత్మ ప్రవృత్తియే • యదియొ కాని
రాఘవుఁడు హృష్ట చిత్త వి • రాజితుండు. 102

## శ్రీరాముఁడు తల్లిని జూడఁబోవుట

చ. తన యభిషేక భాండముఁ బ్ర • దక్షిణఁ జేసి సలక్ష్మణుండుగా
జనము రథంబునున్ విడిచి • ఛత్రము చామరమున్ త్యజించి మా
తనుఁ గనఁబోయెఁ గైకయును • తండ్రియుఁ జెప్పిన యాన తెల్పఁగా
మనసున కించలేని ముఖ • మండల దీప్తులు ప్రజ్వలింపగాన్. 103
చ. తన యభిషేచనమ్మును ము • దంబునఁ గాంచఁగ నున్న పౌరులున్
జనములు మిత్రులున్ గడు వి • చారము నొందుటఁ జూచి లక్ష్మణుం
డునుఁ గుపితాత్ముఁ డౌటయుఁ గ • డుంగని చూపడు సుంత యేని వం
తను సకలేంద్రియంబులును • తాల్మి వశంబుగఁగొన్న మౌనిగా. 104
చ. తన సుకుమార రాఘవుఁడు • ధారుణి భర్తగ నౌనటంచు నె
మ్మనమున విశ్వసించుచు ర • మాధవు పూజల సల్పి సువ్రతం
బును నెరవేర్చుచుండె రఘు • పుంగవుఁ డామెను జూడ వచ్చుటన్
విని యెదురేగి తల్లి కను • విందుగఁ గౌఁగిటఁజేర్చుఁ బుత్రునిన్.

తే. శిరము మూర్కొను సవరించుఁ • జెక్కిళులను
సత్యసంధుఁడు నీ తండ్రి • జన విభుండు
చేయు నభిషేచనంబును • జెప్పిన గతిఁ
దాని గనులారఁ జూచెడి • దాన నేను. 106

తే. వ్రత సమాప్తియు నాయెను • వచ్చినావు
కొమరు బంగారు పీటపైఁ • గూరుచుండు
మదిగో భుజియించు తరియాయె • ననుచు నామె
యాత్మ సంతోషమగ్నమౌ • నంత కంత. 107

ఉ. ఆ మమకార మూర్తికి, ని • జాత్మజుఁ గౌఁగిటఁ జేర్చు తల్లికిన్
నీమము లన్ని సల్పి యవ • నీపతి గాఁగ సుతుండు, ప్రేముడిన్
రామ భుజింపుమీ యనుచు • రాగమునన్ బలుకాడు మాతకున్
రాముఁడు చెప్పనోపునె వ • నంబునకున్ జనునన్న యత్నమున్. 108

ఆ. మనసుఁ గూడఁదీసి • మమకారమును వీడి
తల్లి కంత మ్రొక్కి • తనయుఁ డనును
హేమపీఠ మేల? • యిఁక నాకు తల్లిరో
విందు భోజనమ్ము • వీడవలయు. 109

ఉ. నీకు సుమిత్ర సూతి కవ • నీజకు ముప్పు ఘటిల్లు, రాజ్యమున్
నా కిడకుండఁ బొమ్మనె, వ • నంబునకుం నను, దండ్రియాన, నే
నాకుల కంద మూలముల • నాఁకటికిం గొని దండకాటవిన్
బ్రాకటమౌ జటాజిన వి • రాజిత మౌనిగ నుండఁ దల్లిరో. 110

తే. పదియు నాలుగేండ్లు • వనవాస మొనరించి
బ్రతికి మరలి వచ్చు • వాఁడఁ దల్లి
భరతుఁ డేలు భువినిఁ • బాలించు మిమ్మెల్ల
సమతఁబూని తనదు • జనని వోలె. 111

## కౌసల్య మూర్ఛఁ బొందుట

క. అను సుతు వాక్యంబుల నా
జననిి వినఁగ జాలదాయెఁ • జయ్యనఁ బడె, పృ
థ్విని నరికిన ఘన వృక్షం
బన హా రఘు రామ యనుచు • నార్తికి లోనై. 112

ఆ. తల్లి లేవ నెత్తి • తనయుండు రాముండు
నొడలి దుమ్ము దుడిచి • యొప్పు గాఁగ
కమలనేత్ర తల్లి • కౌసల్య కన్నీటఁ
బలుక దొడఁగె సుతుని • వైపుఁ గాంచి. 113

ఆ. నిన్నుఁగాంచి యుంట • నేనిట్టి బాములఁ
బొందుచుంటి రామ • పుడమి యందు
నీవు పుట్టకున్న • నేనొక గొడ్రాల
ననెడి తలపు మాత్ర • మనెడి దాన. 114

చ. వయసునఁ బ్రేముడిం గనఁడు • పార్థివుఁ డెంచఁగ నన్నుఁ గైకకున్
బ్రియుఁడయి కైక దాసివలె • రేపును మాపును బ్రొద్దు పుచ్చుచున్
భయమున నుంటి జ్యేష్ఠుఁడగు • పార్థివ పుత్రుఁడు నాదు బిడ్డ రా
జయి వెతఁబాపు నెప్డాయని • ఆ దినముం గన వేచి యుంటిఁగా. 115

ఉ. నేఁడు ఫలించు గోర్కె యనిఁ • నెమ్మది సంతస మొందుచుంటి నీ
నాఁడిటు లాయె, దైవ విధి, • నన్నిక హీనఁగ జూచుఁ గైక ఎ
వ్వాడిక రక్ష నీయఁగల • వాఁడిట, నీవు వనంబు కేగ, బల్
దాడి యొనర్చుఁగా సవతి • దాని భరింప వశంబె రాఘవా. 116

## లక్ష్మణుఁడు కోపించుట

ఉ. అంత మొనర్తు నింకఁ జెడు • గాడిన వారల రాఘవేయ, వే
దాంతము కట్టిపెట్టఁ దగు, • ధారుణి నేతకుఁ జెల్లునే, యిటుల్
సుంతయు నీతి లేక నినుఁ • జోద్యముగా వని కేగుమంట! గో
రంతయు ధర్మముం గనని • యానను మన్నన సేయు మందువే. 117

మ. ధరణీ రాజ్యము నీది నీకిడుటకే • తానెంచెఁగాఁ దొల్త నే
కరణిన్ ధర్మము గాదనంగ నగు నీ కార్యంబు నిప్పట్టునన్
స్థిర బుద్ధింగని యోజనన్ సలుపుమీ తీవ్రంబుగా, ధర్మమే
ధరపై ధర్మము నిల్పుఁ దండ్రి నుడిలో • ధర్మంబు లేదేమియున్.

మ. అనుచున్ బల్కెడి లక్ష్మణుండు కడు, రో • షాయత్త చిత్తంబునన్
గను దో యెఱ్ఱగనై మహా కుపితుఁడై • కౌసల్యనుం జూచుచున్,
వనితా కాముకుఁడైన వాఁ డెటుగనేన్ • బల్కాడ వెన్ దీయునే
మన మా మాటల లెక్కసేసి వనికిం • బారంగ ధర్మమ్మొకో! 119

ఆ. పూనలేక యింటఁ • బోరు గిటఁ బూనుదే
ధర్మ మీవు రామ? • ధర్మ విదుఁడ
ధీర వృత్తి వీడి • భీరువు చందాన
అడవి కేగు దొక్కొ • అమల వీర. 120

మ. భవదీయంబగు రాజ్యమెల్లను ద్రుటిన్ • బాణిన్ గ్రహింపంగనౌ
జవముం జూపఁగ ధర్మ రక్షణకుఁగా • జంకేల? నెవ్వారు ని
న్నవరోధింపఁ గలారు? లక్ష్మణుఁడు నీ • యండన్ విలుం బూని శా
త్రవ వారంబుల దున్మ్మచుండ; రఘు నా • థా! పూనుమీ ధర్మమున్.

చ. భరతుఁడు వాని బందుగులు • వాని హితుల్ నృపుడున్ మఱె
వ్వరయిన, నడ్డు రాఁగలుగు • వా రెవరుందురు? వచ్చిరేని, చ
త్తురు, కఠినత్వమూనఁ దగుఁ • దొయ్యలి మాటను లెక్క సేసి భూ
వరుఁ డనిఁ జొచ్చెనేని పను • పందగుఁ గాలుని యింటి, కాతనిన్.

ఉ. కాదని యందు వేని విను • కైక విభున్ జెరసాల కంపి, వే,
నీదగు రాజ్య మీవు గొను • నేర్పరివై, తరుణంబు, మించఁగా
రాదిక, దుష్టబుద్ధి యగు • రాజ వరుండును దండనార్హుఁడే
వాదము సేయఁబోను రఘు • వీర, యిదే సుమి ధర్మమౌ సదా.

ఉ. అపకారంబను మాటయే యెఱుఁగ వా • ర్యా! దుష్టుఁడై రాజు నీ
కపచారం బొనరించె, స్వీయ వచన • వ్యాఘాతముం జేసి, నీ
కపకారుల్ భువి నేరు, లేరు, పరిశు • ద్ధాత్మా! త్రిలోకంబులన్
గృప నేలంగల ధర్మ రూపుఁడ వహో • కాంక్షింపవే ధర్మమున్. 124

చ. సుతుని మహా పరాక్రముని • శుద్ధ చరిత్రుని యోగి వంద్యునిన్
పితరుల నిత్యముం గొలుచు • వీరుని నింద్రియ నిగ్రహున్ సదా
హితమతి యైన వాని నెవఁ • డీ గతి వీడు! నధర్మ వృత్తిమై
యతని నుడిన్ వినంగఁ దగు • నా? అదె ధర్మమ? ధర్మపాలకా!

ఉ. రాముని గొల్చువాఁడ నను • రాగమునన్ భవదీయ పుత్రుఁ డే
ధామమునన్ వసించినను • దాన వసించుచు నుందు నేను, నే
కామినిఁ గాను కాని నృప • కర్మఁ ద్యజింపఁ దలంప ధార్మికుం
డే మనునో! సరే యనిన • నిప్పుడె తెచ్చెద రాజ్య మన్నకున్. 126

తే. తల్లిరో జ్ఞాతి నని నన్నుఁ • దలఁప కమ్మ
అగ్ని గుండమునం బడ • మన్న యన్న
నటుగ నొనరించు వాఁడ స • త్యమ్ము సుమ్మ
అన్న యాజ్ఞనుఁ దలఁ దాల్చు • చున్న వాఁడ. 127

మ. విలు సారించి గుణధ్వనుల్ సలుపుచున్ • విశ్వంభరా మూర్తియా
లలిత శ్యాముఁడు రాఘవుండు సుజనో • ల్లాసుండు ధర్మార్థమై
నిలువన్; శాత్రవమూని ఎవ్వఁ డెదురౌ • నిర్మూలమై పోవఁడే
బల ధర్మంబుల రెంటికిన్ జెడిన భూ • పాలుండు చే మోడ్చఁడే. 128

తే. దినకరుం జూచి పరువెత్తు • తిమిర మట్లు
బాణముం గొని నే నిల్వఁ • బారి పోవు
వైరి వర్గంబు రాజ్యంబు • వదలి యెటకొ
తల్లి కౌసల్య! నీ వంత • దుల్లు నంత. 129

తే. అన్న జను త్రోవయే నాదు • తెన్నుఁ గూడఁ
నడవికో అగ్నికో ఆతఁ • డరుఁగు గతియె
నాదు ధర్మంబు కర్మంబు • నమ్ము మమ్మ
సత్య దాన ధర్మంబులె • సాక్షి సుమ్మ. 130

## రామునకు కౌసల్య హితము

తే. అనుచు రామానుజుఁడు పలు • కాడు నంత
ముదము నొందుచు రాముని • మోముఁ గాంచి
రామ వినఁదగు లక్ష్మణు • రాజ నీతి
అదియ ధర్మంబు సత్యంబు • నాచరింప. 131

ద్వి. తగు నంచుఁ గౌసల్య • తనయున కనెను
జగడంబుఁ బూనంగ • జంకదా రాణి. 132

తండ్రి మాటను దప్పు • ధర్మంబు చెడిన
తండ్రితో సమ కాదె • తల్లియుం బుత్ర. 133

వనమున కేగుట • వలదంటి నేను
గనవో కొ్కా నామాట • గౌరవం బెసఁగ 134

మాత మాటకు మారు • మాటాడఁ దగునె
నీతియా? ధర్మమా? • నీ కది పుత్ర? 135

మాతృ సేవకు సాటి • మహిత ధర్మంబు
మాతృ శుశ్రూషయే • మరి వేరు లేదు. 136

వినవొ కొక్కొ కాశ్యపు • విహిత చరిత్ర
జనని సేవించియే • స్వర్గంబుఁ గనెను 137

తనయింటఁ దానుండి • తపసు ఫలంబు
గనలేదె గావించి • జనని శుశ్రూష. 138

నీవు లేకున్నచో • నేనింకఁ బ్రతుక
కావుమీ నాయింటఁ • గాపాడు నన్ను. 139

నీకుఁగా దుఃఖించి • నే చావుఁ గనిన
తాఁకదే పాపంబు • తనయ నీకెంతో. 140

నీరుఁ ద్రాగక దిండి • నే విడు దాన
మారు లోకంబున • మన నేగుదాన. 141

ఎట్టి దుర్గతి నిన్ను • బట్టునో రామ
యిట్టి దానను దల్లి • నీగతి పీడ. 142

రాముని సమాధానము

తే. అనుచు విలపించు కౌసల్య • నంబఁ గాంచి
ధర్మ హృదయాను రక్తుండు • తమినిఁ బలుకు
అడవి కేగియు మరలి రాఁ • బుడమి నేల
అమ్మ దీవింపు మమ్మ దా • సోహ మమ్మ. 143

తే. తండ్రి మాట దాఁటు • తనయుండఁ గానమ్మ
వెడలనిమ్ము తల్లి • యడవి కిపుడె
చంపె గోమాతఁ గండుండు • జనకు నాన
మౌనియునుఁ బండింతుండు నా • మనెడి వాఁడు. 144

తే. వన్నె కెక్కెను మున్నె మ • ద్వంశ మెల్ల
తండ్రి యానను దలఁదాల్చు • ధర్మమందు

సాగరముఁ ద్రవ్వి మడియరే • జనకు నాన
సగర సుతు లెంచ వారు ప్ర • శస్తిఁ గనరొ! 145

తే. పరశురాముండు మును తండ్రి • వాక్య సరణిఁ
దల్లి యగు రేణుకం జంపి • ధర్మముఁ గనె
తండ్రి మాటను దలఁదాల్చు • ధర్మ మరయ
ధర్మముల యందు నుత్తమ • ధర్మ మగును. 146

తే. విధి వశంబునఁ బ్రాప్తించె • విపిన సీమ
తండ్రి యానను దలఁ దాల్చు • ధర్మ మబ్బె
పూర్వులగు నాదు పెద్దలు • పూనిన గతి
నే గ్రహించితి దోషం బ • దేమి జనని ? 147

తే. నాకు ప్రాప్యంబె, శోకంబు • నీకుఁ దెచ్చె
ఇందులకు కర్త జనకుఁడు • నేను గాను
దోసమేమిక నాకు ని • ర్దోషి నమ్మ
ఎట్టి దుష్కృతి నీకుఁ గా • వింప లేదు. 148

## లక్ష్మణునకు రాముని యుపదేశము

ద్వి. అని తల్లి నోదార్చి • యా రాఘవుండు
వినుమోయి లక్ష్మణా • వినుమంచుఁ బలుకు. 149

చ. అతుల పరాక్రమాన్వితుఁడు • నంచిత తేజుఁడు లక్ష్మణుండు నా
హితుఁడనియే నెఱుంగుదు మ • హింగల ధర్మవిదుండ వీవ స
న్మతి ధృతి శాంతి దాంతులఁ గ • నందగుఁ గ్రౌర్యమువీడి సత్య సం
ధత పరమార్ధ ధర్మము గ • దా ? విడనాడఁగ నౌనె సోదరా ?

తే. తల్లి! కౌసల్య; స్త్రీ, సత్య • ధర్మ నిర్వ
చన మరయు నొక్కొ, పుత్ర వా • త్సల్య గరిమ,
ఆమె భక్తికిఁ బ్రేమకు • నంతు గలదె
అమ్మ దుఃఖాబ్ధిలోఁ బడ • నగునె మనకు. 151

ఆ. తండ్రి యాజ్ఞఁ జేసి • తాఁ జెప్పె కైకమ్మ
నీవు చెప్పు దాని • నే నొనర్తు

నంచు జనని కంటి, • నబ్బయు నమ్మయు
బ్రాహ్మణ సముల్తైన, • వార లవని. 152

ఆ. మాట దాఁటఁ దగదు • మాన్యంబు గాదది
ధర్మ మెుల్ల దటుగ • ధర్మ వేత్త
జాత్ర మిపుడు వలదు • సత్య ధర్మంబులె
పూను మీవ యరసి • ముందు గతుల. 153

## రాముఁడు తల్లి నాశీర్వదింపఁ గోరుట

తే. అనుచు లక్ష్మణునకుఁ జెప్పి • అమ్మను గని
ప్రణతి సల్పుచుఁ బ్రాంజలిఁ • బలుకఁ దొడఁగె
రాముఁ డామెకు గద్గద • రావమునను
తల్లి యాశీర్వదింపుమీ • తనయు నింక. 154

మ. వనికిం బోవఁగ నిశ్చయించితిని నిన్ • బ్రార్థింతు ధర్మంబె నే
కొనసాగింపఁగ నాశిషంబు లిడుమీ • కూర్మిన్ వనిం బట్టి నా
జనకుం డాడిన రీతిమై మరలిరా, • ధాత్రీశు నాజ్ఞన్ శిరం
బునఁ దాల్చందగు దీవు లక్ష్మణుఁడు భూ • పుత్రీ సుమిత్రాంబయున్.

## కౌసల్య సంతాపము - ఆత్మానుభూతి

ద్వి. అని రాముఁ డాడంగ • నమిత దుఃఖంబు
గని తల్లి మూర్ఛిల్లె • కర్తవ్య మేమి ? 156
కన్నీరు గాల్వలై • కౌసల్య మరల
తిన్నగా రఘురాముఁ • దేరి జూచుచును 157
లలిత స్వరూప నా • లావణ్యామూర్తి
కులకాంత నీ తల్లి • ఘోషించు దాని 158
వీడుచు వని కేగు • వాఁడవా యిపుడె
పీడను నిన్నేను • వీడగాఁ జాల. 159
తమి నుందు నీ సన్ని • ధానంబు నందె
అమితమౌ ఆనంద • మదియె నా కెంచ. 160

చ. అనుచుఁ బ్రపత్తిలోఁ బడుచు, • నార్తిని గుందుచు, సారె సారెకున్
గనుచుఁ దదేక దృష్టి రఘు • కాంతునిఁ, గన్నుల నీరు నింపుచున్
వని జనరాదు పుత్ర యను, • బ్రాంజలి నుండిన దివ్యమూర్తికిన్
విను విను నిన్ను వీడ వెను • వెంటఁ జరించెద నీదు సన్నిధిన్. 161

శా. ధర్మాధర్మ విచక్షణన్ సలుపుదే • తండ్రీ ననున్ వీడ నా
కర్మం బింతదె! నిన్నుఁ గాంచితికదా! • కన్నార నిన్ జూచుచున్!
మర్మం బేమియులేక నీదరి వసిం • పన్ నోచనా రామ? ఏ
ధర్మార్థంబును గాంతునోయి రఘునా • థా నీ వియోగంబునన్.

తే. ప్రాణి లోకంబు రామునిఁ • బాయఁ గలదె
క్షణమె యైనను నీ పజ్జ • శాంతి గలుగు
విడువ నొల్లను రఘురామ • వీరరామ
కంటికిని రెప్పవలె నను • గాచు రామ. 163

మ. కను పాపన్ జరియించు వాఁడ వగుచున్ • గంజాక్ష సంశ్లేషమున్
జననం బాదిగఁ గూర్చి గూర్చి త్రుటిలో • సాన్నిధ్య విశ్లేషమున్
గను మంచున్ హితమాడఁ జూచెదవో! లో • కం బెట్లు హర్షించు నీ
పని! నిన్నే గతి వీడుదాన! వెత సం • భావింతువే మాతకున్. 164

తే. దుఃఖ పరవశులగు మాతఁ • దోడుఁ గాంచి
నడు గిడఁగ లేడు వారల • నచట విడిచి,
భక్తవశుఁ డైన పరమాత్మ • భంగి నిలిచె
ధర్మవరుఁ డైన రాముండు • తల్లి ముందు. 165

తే. అశ్రువులు కాల్వలై పారు • నట్టి వారి
సోదరునిఁ దల్లినిం గాంచి • సాదరమున
ధర్మ ముపదేశ మొనరింపఁ • దలఁచినాడు
రాఘవుఁడు ధర్మవేద్యుండు • రామమూర్తి. 166

మ. జనకుండున్ స్తవనీయ పాలకుఁడు నా • చార్యుండు వృద్ధుండునున్
మన కెద్దానిని నానతిచ్చినను, కా • మంబో మహాకోపమో
మన ఉల్లాసమొ, యేది హేతు వయినన్ • మన్నించి యీడేర్చుటే
ఘన ధర్మంబగు నాకు నీకు సతికిన్ • గాదందువే లక్ష్మణా! 167

తే. సతిగఁ గౌసల్య, మన మెంచ • సుతులము గను
దశరథుని మాటఁ దలఁ దాల్చఁ • దప్పదు గద
పతిని విడనాడ ధర్మమ్మొ • సతికి నెందు
వనికి నావెంట రారాదు • వలదు తల్లి. 168

తే. రాజు జీవించి యుండఁగా • రాణి యెటుగ
విధవ వలె పుత్రు వెనువెంట • వెడలు వనికి
భర్తయే సర్వధర్మంబు • భార్య కెంచ
భర్తృ శుశ్రూషయే భార్య • పరమ సుగతి. 169

మ. జననం బందిన ప్రాణికిన్ సహజమౌ • సంశ్లేష విశ్లేషముల్
తనువుం బొందిన వాని కిట్టి గతి, ని • త్యంబే సుమా, తల్లి ప్రే
మనుఁ, గూడన్ విడి, ధర్మ మూనఁదగు ద • మ్మా దైవ సాన్నిధ్యమున్
గొన; విశ్లేషముఁ గోరి పోవుటకు నే • క్రూరుండఁ గా నమ్మరో. 170

ఆ. పదియు నాలుగేండ్లు • ప్రకృతి చక్రంబునఁ
రెప్పపాటు మాత • తెప్పరిలుము
విష్ణుదేవుఁ దలఁచి • పీడుమీ యీ వగ
మరలి వత్తు నమ్మ • మాతఁ జేర. 171

తే. ధర్మము యశమ్ము పీడి య • ధర్మ వృత్తి
రాజ్యముం గొన బుద్బుద • ప్రాయమైన
జీవిత సుఖంబులం గోరు • చెనఁటిఁ గాను
మాత దీవింపు మమ్మ నే • మరలి రాగ. 172

## లక్ష్మణునకు హితవు

ఉ. నా కిటు కష్టమాయె నని • నాయనపైఁ బగఁ బూనరాదు, నే
లౌకిక వృత్తి నొల్లను, వి • లక్షణ లక్ష్మణ నీ వెరుంగవే ?
ప్రాకట రాజ్య మెంచి క్షణ • భంగుర జీవితకాల మెంచవే ?
నాకికఁ గూర్చుమీ చన వ • నంబునకున్ దగు నారచీరలన్. 173

తే. తల్లి, శోకంబు విడనాడు • ధర్మ గతులఁ
జెప్పఁగాఁ దగు నామెకుఁ, • జెప్పి భయము
వాపుట మనకు ధర్మంబు • వన నివాస
కాల మరయంగఁ ద్రుటిగాఁగఁ • గడచి పోదె. 174

ఉ. పుట్టినదాది తల్లులకుఁ • బూజ్యుఁడు తండ్రికి సేవసేయు నె
ప్పట్టునగాని వారియెడ•వైరముఁ బూనఁడు నిస్పృహా లేనివాఁడు,బల్
దిట్ట పరాక్రమంబున, మ • దిన్ దలపోయఁ డసత్య మెప్పుడున్
దట్టె భయంబు నేఁడె తన • తండ్రియె సత్యము బాసి నశ్లెడన్. 175

తే. దానిని నివృత్తిఁ జేయ నే • తలఁచినాడ
తండ్రి దుఃఖమ్ము వాపుట • ధర్మ మగుట
సత్యసంధుని సత్కీర్తి • సమయకుండ
వనికిఁ జనుటయె నావిధి • జనకుని యెడ. 176

తే. కైక కిడినట్టి వరములు • కాదనంగ
రాదు, మన తండ్రి వాని దీ • ర్పంగవలయు
'నయ్యొ అడిఁ దప్పితిని నే' • ననెడి బాధ
బొందఁగా రాదు జనకుండు • పుత్ర మైత్రి. 177

తే. దాన నేఁ జేరఁగా వలె • కాననమ్ము
నిపుడె యిట నుండియే వని • కేగువాఁడ
భరతునకు బుత్రునకు నడ్డు • జరుగకుండఁ
జేయు కైకమ్మ పట్టాభి • షేక మంత. 178

తే. కైక శాంతించుఁ దండ్రికిఁ • గలుగు సుఖము
ధర్మవిధి దీర్చి సంతుష్టిఁ • దనరు వాఁడ
నార చీర జటాజిన • ధారి నగుచు
గూర్పుమీ వాని శాంతించి • కూర్చు మింక. 179

తే. అతిగ దుఃఖించి దుఃఖంచి • యార్తిఁ దగిలి
సత్య సంరక్షణార్థంబు • జనకుఁ డిపుడు
నన్ను వనికంప స్థిరబుద్ధి • నున్నవాఁడు
అతని వెతఁదీర్ప వనమున • కరుఁగు వాఁడ. 180

తే. అమితముగఁ బ్రేమ నున్న కై • కమ్మ, నేఁడె
నా ప్రవాసమ్ము సౌఖ్య వి • నాశములకు
కారణం బందునా కాదు • కాదు కైక,
దైవ విధి మాత్రమే యిది; • తప్ప దింక. 181

తే. తమిని వాత్సల్యమునఁ జూచు ♦ తల్లి కైక
ఒక్క త్రుటి మాత్ర శత్రుత్వ ♦ మూను నొక్కొ
నన్ను బాధింపఁ దలఁచునే ♦ తెన్ను మీఱి
దైవ విధి యిది; కైకమ్మ ♦ తప్పు గాదు. 182

తే. తల్లు లందఱు నొక బుద్ధిఁ ♦ దలఁతు నేను
కైక తన పుత్రు నను నొక ♦ కరణిఁ గాంచు
అట్టి కైకకుఁ బుట్టునే ♦ యిట్టి తలఁపు
దైవ విధి యిది; కైకమ్మ ♦ తప్పు గాదు. 183

తే. రాకుమార్తెయు రారాజు ♦ రాణి కైక
అతుల గుణవతి దుర్భాష ♦ లాడఁగలదె
ప్రాకృతాంగన గతిఁ దన ♦ భర్త యెదుట
దైవ విధి యిది; కైకమ్మ ♦ తప్పు గాదు. 184

తే. సిగ్గు భయమును విడి భర్త ♦ చెంత నిలిచి
పుత్రకుని నన్నుఁ బీడించు ♦ బుద్ధిఁ జెపునె
మున్నిటుగఁ జెప్పెనా, తే ద ♦ పూర్వ మిద్ది
దైవ విధి యిది; కైకమ్మ ♦ తప్పుగాదు. 185

తే. దైవ మెట నుండె? నేఁ డని ♦ తలఁతు వేని
కర్మ ఫలమందె నాతఁడుఁ ♦ గనఁగ నౌను
పురుష యత్నంబు విఫలంబుఁ ♦ బొందు కర్మఁ
గోచరింపఁడె దైవంబు; ♦ గోచరించు. 186

తే. ఒప్పుఁ జేసిన నొకపట్లు ♦ తప్పె యగును
తప్పుఁ జేసినఁ గూడను ♦ నొప్పె యగును
సఫల విఫలంబులకుఁ గర్త ♦ సన్నిహితుఁడు
దైవ మొక్కండెగా యని ♦ తలఁప వలయు. 187

తే. పుట్టుకయుఁ జావు; సుఖ దుఃఖ ♦ ములు భయమ్ము
క్రోధమును లాభము నలాభ ♦ కూటములును
కారణముఁ దేల్ప లేనట్టి ♦ కర్మలన్ని
దైవకృత కర్మలని యెంచఁ ♦ దగును జుమ్మి. 188

తే. దైవ విధివల్లఁ దపసులు • తన్వి వలలఁ
బడుచు భవితవ్య మెఱుఁగక • భ్రష్టులైరి
కామమునఁ గ్రోధమునఁ జిక్కి • కాంచలేరు
దైవ విధి, దాని నెవ్వారు • దాఁటఁ గలరు ? 189

ఉ. దైవబలంబె యప్రతి హ • తంబుగ నా కెదురైన దిప్డు, నే
నా విధి నెంచియే యిదె వ • నంబునకుం జన నుంటిఁ, గానలో
దైవ విధం బదెట్టిదియొ • కాఁగల కార్య మదెట్టిదో వనీ
జీవిత మేలకో యెఱుక • శ్రీహరికే యగుగాని తప్పునే. 190

ఉ. దైవ కృతంబు సర్వము వి • ధాత రచించెడి ఫాలసీమపై
జీవి జనింప గర్భమునఁ • జేరెడి నాఁడె పురాకృతంబు; నే
జీవియెగాని దానికి వ • శీ కృతుఁడై మను, జీవ యాత్రలో
దైవగతిన్ గ్రహించి విది • తంబగు దానినిఁ బట్టి పోదగున్. 191

చ. ఎడద విచార మేమియును • నేఁ గనకుంటిని దానఁ జేసి, కా
రడవి నివాస కాలమున • నబ్బు తపంబు, స్వరాజ్య మేలుచో
నెడతెగనట్టి భారము వ • హింప వలెన్; పితృవాక్య పాలనన్
గడఁగుట యొండు; పెచ్చయిన • కార్యము నా సుకృతం బిదే వనిన్.

ఉ. ఏలికగా నయోధ్య వని • యింపక పోవుట కెంతమాత్రమున్
జాలి వహింపఁగాఁ దగదు • సర్వ గుణాన్విత లక్ష్మణా ! వనీ
పాలన ధర్మపాలనము • పాటిలె దైవ విధంబునన్ గతం
బేల ? ప్రశాంతమై భగవ • దిచ్ఛగ సర్వము నెంచగాఁ దగున్. 193

శా. దైవ ప్రేరణఁ జేసి కైక పలికెన్ • ధర్మార్థమున్ లక్ష్మణా
నీవున్ దాని గ్రహింపుమీ పరమ శాం • తిన్ బొందుమీ, ఱేనిపై
లావుం జూపకుమీ యిదే యగు నిగూ • ఢం బంచు, లో నెంచుమీ
దైవాయత్త ఫలంబులం గనుచుఁ జిం • తన్ వీడుమీ సోదరా. 194

## లక్ష్మణ సమాధానము

చ. అచలిత రామభద్రుఁడు మ • హాత్ముఁడు తమ్మునిఁ గాంచి ధర్మ ని
ర్వచనము సేయఁ, దాన, నని • వారణ రోషకషాయ నేత్రుఁడై
అచల బిలస్థ రోషిత మ • హాభయ పన్నగ రీతిఁ గ్రుద్ధుఁడై
రుచిర విహీనుఁడై పలుకు • రోయుచు లక్ష్మణమూర్తి యన్నకున్.

తే. ధర్మ తత్పరు రాము సో • దరునిఁ గాంచి
ఆత్మ నొక వంక మెచ్చు; రా • జ్యంబు వీడి
వనికిఁ బోనుంట కొక వంక • వనటఁ గుందు
ఆ సుమిత్రాత్మజుఁడు కుపి • తాత్ముఁ డగుచు. 196

ఉ. అన్న తలంపెఱింగి కడు • నార్తికి లోనయి, దైవ తత్వ సం
పన్నతఁ గూడి పల్కు రఘు • వర్యుని మాటల నీసడించు; రా
మన్న! స్వకీయ బాహు బల • మారయ లేనటువంటివాఁడె దై
వోన్నతి నెంచి దీనుఁడగు • నొందఁడుపో విజయంబు నెప్పుడేన్.

తే. తండ్రి మాటను బాలించు • ధర్మము విడ
జనముఁగూడ ధర్మము వీడు • ననెడి తలఁపు
భ్రాంతియే సుమ్మ, కాకున్న • పగఱ గెలువఁ
గలుగు వాఁడిట్టి మాటలఁ • బలుకఁ బోడు. 198

ఉ. ధీరుఁడు శూరుఁడంచుఁ గుల • దీపకుఁ డీ రఘువర్యుఁ డంచు నో
రారగఁ బల్కుచుండెఁ, బ్రజ, • రాజ్యము వీడి పరాజితుండనన్
బారఁగ నౌనె కారడవిఁ • బట్టఁగఁ; జేయునె క్షత్రియుం డిటుల్
వీర! స్వకీయ బాహుబల • వీర్యములన్ దలపోయ వేలకో. 199

ఉ. దైవమె సర్వమంచు విధి • తప్పదటంచును బల్కెదే నృపా?
దేవుఁడె సర్వమంచుఁ గడు • దీనుఁడెపో పలుకాడు చుండెడిన్
జేవయుఁ దేజముం గలుగు • శ్రేష్ఠుఁడు పౌరుషమూను సర్వదా
నీవొకొ వీడి రాజ్యము వ • నిం, దిరుగాడెదొ, సిగ్గు చేటుగా. 200

ఉ. సంచిత కర్మ మున్న, విధి • శాసన మన్నది యున్న, స్వీయపౌరుషం
బంచిత మెన్న, ధీర హృద • యాంతర సీమ చలింపకున్న వే
రెంచునె యన్న! భీరువె చ • రించెడి దైవమటన్న పేర, ఆ
*కించులు మాత్రమిట్లు విధి • కిన్ దల యొగ్గెద రెన్న వ్యర్థులై.

ఉ. దేవుని పేర స్వీయబల • ధీగుణ సంపదలన్ ద్యజించి ఓ
దేవ, పరాత్పరా, యనుచు • దేబలవోలె కృశించు వారికిన్
దేవుఁ డెవండొ, యున్నను, ప • దింబది తోడుగ రాడు వాఁడు, న
న్గావు మటంచు వేడఁదగు • నా పరుఁ బౌరుషమున్ ద్యజించుచున్.

*కించులు = అల్పులు

ఉ. కేకయి ఆమెకుం బ్రియుఁడు • గీడె తలంచుచుఁ గుట్రఁ బన్న; లో
కైక విభుండు తత్కపట • కామిని కుట్రకు మోసపోయి, నీ
లోకము మెచ్చు నంచుఁ బర • లోకమునన్ సుకృతిన్ గణింపనౌ
పోకడ యంచు ధర్మగతి • పో యిది యంచు వనీ నివాసుఁడౌ. 203

చ. భరతుని స్వీయ పుత్రకు నృ • పాలకుఁ జేయు తలంపుతో మహీ
వరు నెటో కూడఁ గట్టుకొని • పన్నెఁ గదా యొక పెద్దయెత్తు దా
శరథినిఁ బంపఁగా వనికిఁ • జయ్యన ధర్మ మిషంబుఁ జేసి, ఎ
వ్వరు సహియింపఁగా గలుగు • వారలు, చూడవ కుట్ర రాఘవా.

చ. వరము లొసంగె నంట! మును • పార్థివుఁ డెప్పుడొ, కైక నేఁటికిన్
స్థిరముగ వాని నుంచె నఁటఁ! • జెల్లఁగ లేదఁట! యింత దాఁక! ఆ
వరములఁ దీర్ప భర్తను నృ • పాలునిఁ గోరిన దంట! రాజు తా
వరదుఁడు దీర్పఁగా బ్రతికిన • వాకొనె నంట! యిదెంత వింతయో.

ఉ. ఇచ్చెను పో వరంబుల, మ • హీపతి, తీర్పడె నేఁటిదాక, దా
నిచ్చిన వాని, సత్య పరుఁ • డిట్టుగ నేఁటికిఁ దీర్పకుంట, ప
పొచ్చెము లేక రాఘవుని • భూపునిఁ జేయు దినంబనాఁడె ము
న్నిచ్చిన వాని సేయఁ దమ • కించుట యన్నియుఁ గుట్ర కావలెన్.

తే. కైకయు దశరథుండును • గలసి మెలసి
లోకమును మోసపుచ్చెడి • పోకడ నిటు
పూని నారలు; వారల • పూన్క నీవు
విజయ మొనరించు చున్నావు • వీర రామ. 207

ఆ. తండ్రి యానఁ జెప్పఁ • దలదాల్తు వీవని
వార లెఱిఁగి కుట్రఁ • బన్నినారు
ధర్మమన్న నీదు • తనువెల్లఁ బులకించు
నంచుఁ గుట్ర నిటుగ • నెంచినారు. 208

తే. దుష్టులగు రాజుఁ గైకేయి • యిష్టు లనుచు
మోసపోయెద వేలకో • పురుష సింహ
కష్ట మొనరింప నుంకించు • దుష్టు లెపుడు
నిజముఁ గప్పి పుచ్చెద రహా • నిర్మలాత్మ. 209

ఉ. కొండలు ధర్మమూర్తులుగఁ • గొంషలు దీయ నటించుచుండ్రు వీ
రందఱు ప్రేమనే యభిన • యం బొనరింతురు నట్టి వారె నీ
ముందు నటించుచుండిన ప్ర • భుండును గైకయు, వారి యాజ్ఞ నా,
సుందరమూర్తి నీవు వనిఁ • జొచ్చుట యియ్యదియే సుధర్మమా.

తే. నీవు ధర్మార్థ మెఱిఁగిన • నిశ్చలుఁడవు
కాని మమకారమును వీడ • లేని గతిగ
తండ్రియని తల్లియని వారిఁ • దలఁతు వీవు
వారు పాపులు వినరాదు • వారి మాట. 211

తే. పాప మిసుమంతయును రాదు • పార్థివేయ
దశరథుని మాటఁ దప్పిన • ధర్మవీర
కామ వశవర్తు నాజ్ఞను • గాదటన్న
కిల్బిషం బేమి? రామన్న • కీర్తి మూర్తి. 212

తే. బాహువుల శోభకై గాదు • ప్రథిత ధనువు
భూషణార్థంబె యొరఁ గత్తి • పోదు నిదుర
అమ్ము పొది బాణములు గాంచ • నగునె త్రుప్పు?
నరులఁ బరిమార్చుటకుఁ గాదె • వరలు నివియ. 213

తే. చేసికొనఁ దగుఁ బట్టాభి • షేక మింక
పూను మిక రామ! రాజ్యంబుఁ • బూను తెఱఁగు
విఘ్న మొనరింపఁగాఁ గల • వీరుఁ డెవఁడు
దైవ విధి యొండె నెదురంచుఁ • దలఁతు వీవు. 214

తే. పురుష యత్నంబుఁ బూని య • ప్పరమ పురుషు
విధిని వెడలఁ గొట్టెద నిదె • వీర గనుము
ధనువు చేఁబూన లోకముల్ • దద్దరిల్లు
మనుజులైనను సురలైన • మడియ రొక్కొ! 215

మ. భవదీయాంఘ్రుల నిత్యమున్ గొలుచు సే • వా సక్తుఁడున్ రామ, నీ
కవరోధం బొనరించు శాత్రవులఁ గ • య్యంబందు నిర్జించి నీ
కవనిన్ బట్టముఁ గట్టు యత్నమున సి • ద్ధాత్ముండనై వేఁడెదన్
జవమున్ జూపెద ధర్మమూని యిక నా • జ్ఞాపింపుమీ కింకరున్..

## మాతా పితృ సేవా ధర్మ నిర్వచనము

తే. అనుచు నశ్రుధార • ననుజుఁడు పదములఁ
గడుగఁ దొడఁగె నన్న • కాళ్లు పట్టి
తమ్ము లేవనెత్తి • తమి దీర రాముండు
కంట నీరుఁ దుడిచి • కౌఁగిలించి. 217

తే. కాంచి రామానుజునిఁ గాంచి • కన్నతల్లిఁ
బలుకు వేదాంతమంత సు • వ్యక్తముగను
కర్మ తెఱఁగుల సంచిత • కర్మ గతుల
దేహమును జీవి వేఱంచుఁ • దేట పరుప. 218

తే. పాము నోటను సగముండి • ప్రక్క నున్న
జలచరంబులఁ దిను కప్ప • సరణి జీవి
కాల సర్పంబు నోటిలోఁ గాలు పడిన
గతి నెఱుంగక భోగ భా • గ్యంబు లెంచు. 219

ఆ. కంట నీరు నింపు • కమలాక్షిఁ గౌసల్యఁ
గాంచి వినయ పూర్వ • కంబుఁ గాఁగ
మనవి సేయ గడఁగె • మాతతో రాముండు
ధర్మ విధులఁ దీర్ప • దశరథునకు. 220

చ. భరతుఁడు ధర్మమూర్తి, యను • వర్తనతో నను గొల్చు నిత్యమున్
పరహితమే తలంచెడి వి • భాసుర దివ్య గుణాకరుండు, స
త్యరతుఁడు సర్వభూత హిత • ధర్మపరుండు ప్రియంవదుండు, సు
స్థిర మతి ధైర్యమూని పతి • సేవలఁ జేయుచు నుండుమీ పురిన్.

తే. శ్రేష్ఠుఁడు, గురుండు విద్యోప • దేష్ట యగుట;
జ్ఞాన మిడుచుంట, నాచార్యుఁ • డైనవాఁడు
గురుని కంటెను బదిరెట్లు • గొప్పవాఁడు;
ఈతనికి నూరు రెట్లగు • నెంచ తండ్రి. 222

తే. తనువు నిడు కర్త యౌటచే • తండ్రి కంటె
తల్లి వేయిరెట్లను బుధ • తతి నిజంబు
కనియుఁ బెంచియుఁ బెద్దగా • మనుచు కతన
అనెడి శాస్త్రోక్తి దెలియదే • అమ్మ నాకు. 223

## భార్యా ధర్మ నిర్వచనము

తే. కాని తండ్రి యాన • కాదంటి వీవమ్మ
భర్త యాన మీఱ • భార్య కగునె
దాన నీదు మాట • ధర్మంబు కాదాయె
నైన నీ యనుజ్ఞ • నభిలషింతు. 224

తే. తల్లి మాటను జవదాటు • తలఁపు లేదు
తండ్రి కంటెను మిన్నగాఁ • దలఁతు నిన్ను
నెవరి యానను మీఱగా • నెంచ లేని
రాఘవుఁడు తల్లి పదముల • వ్రాలె నంత. 225

ఆ. ఆవు వెంట దూడ • అంబా యనుచు నుండు
దూడ నెపుడు గోవు • వీడ కుండు
తల్లి వీడ లేదు • తనయుండు రాముండు
తనయు వీడి యుండఁ • దలఁప దామె. 226

తే. ప్రేమమై వీడఁగా లేదు • ప్రియుని సుతుని
వీడకుండిన ధర్మంబు • వీఁగిపోవు
తాను వెనువెంటఁ జననుంటఁ • దగదటంచు
పుత్రకుఁడుఁ జెప్పు ప్రణమిల్లి • పుణ్యవతికి. 227

## కౌసల్యా పరివర్తనము

తే. ధార్మికుఁడు తల్లి పదములఁ • దాఁకి తాఁకి
అమ్మ నాశీస్సు లిడుమని • యడుగు నంత
మార్పు జనియించె కౌసల్య • మనమునందు
పూర్వ సంస్మృతి పుట్టె నా • పుణ్యవతికి. 228

చ. కొమరుని సద్గుణాన్వితునిఁ • గోమలు ధర్మవచో విలాసు శ్రీ
రమణునిఁ గాంచి కాంచి హృది• రంజితమై యొడిఁ జేర్చి మూర్కొనున్
దమి శిరమున్ గరంబుల, య • థా విధి; మెత్తగ నొత్తు, మేను, మో
దము దళుకొత్త రాఘవ సు • ధామయ దృష్టిని దృష్టిఁ జేర్చుచున్.

ఆ. ఒడలు పులకరింప • నెడద యుప్పొంగఁగ
పరమ దృష్టినంతఁ • బడసె నామె
కాంచి పెంచి పెద్దఁ • గా నొనర్చిన తల్లి
త్రుటి నలౌక్య తృప్తి • తోఁ జెలంగె. 230

తే. పాదధూళి సోఁకిన మాత్ర • పతిత వనిత
పూతయై మించె మును, రామ • మాత పూత
పుత్రు సంశ్లేషమున మాయ • వోయి పరమ
సంస్మృతిఁ దగిలె విస్మృతి • చనఁగ నంత. 231

## కౌసల్య అంగీకారము

తే. రాఘవా! దైవ బల మెంచ • రాని దదియ
నిన్ను ప్రేరేపణము సేయు • చున్న దిపుడు
కాల గర్భంబు నందేమి • కలదొ నీకె
యెఱుక సుమ్మి మహాత్మ పొ • మ్మింక వనికి. 232

తే. వెడలి రాఁదగు రామయ్య • విపినమునకు
ధర్మ సంరక్షణార్థమై • ధార్మికుండ
నీకు విజయంబె యగుఁగాక • విపిన సీమఁ
గాలము నతిక్రమింపఁగాఁ • గలమె రామ. 233

తే. మరలి రా, మహీపతి వోచు • వరలు నిన్నుఁ
గాంచి కనులార ముదమునఁ • గ్రాలు దాన
ధర్మ విజయుండవౌ నిన్నుఁ • గాంచు దాన
మంగళంబగు రామ సు • మంగళంబు. 234

## కౌసల్య ఆశీస్సులు

ఉ. ఓ మునివర్యులార! పురు • షోత్తముఁడున్ రఘురామచంద్రుఁడున్
నా మమకార సింధువు వ • నంబులకుం జనుదేర నుండె, మీ
రాముఁడు వీఁడు సర్వ గుణ • రంజిత రాముఁడు వీఁడు మీ వనీ
భూముల మౌనిఁగాఁ దిరుగుఁ • బూనుచు ధర్మము *స్వస్తిఁ జెప్పరే.

* స్వస్తి = మూఁడులోకములలో వ్యాధి, వ్యసనములు లేక లభించు సుఖము. కోరికలు ఫలించుచుండుట- దీనినే 'స్వస్తి' యందురు.

..ురలార మీ హితుఁడ • హో రఘురాముఁడు నేఁడె కానకున్
వాసము సేయఁ బోయెడి శు • భాస్పద మీతని పోక మీకు; కా
దే? సహవాసులై మెలఁగ • రే నిరతంబు, జయ ప్రధానుఁడై
వాసికి వన్నె కెక్కు రఘు • వర్యుఁడు చెప్పరె, స్వస్తి వానికిన్. 236

. ఓ దిక్పాలకులార! మీ ప్రభువు ధ • ర్మో పాసనాసక్తుఁడై
భూదేవీ పరిపాలన వ్రత మహో • త్కృష్టుండై వనీ వాసియౌ
ఆ దాంతున్ మహనీయ వర్తనుని మా • యామానుషాగ్రేసరున్
మీ దిక్కుం గనువాని రాఘువుని స్వా • మిన్ గావరే సర్వదా. 237

. ఒకనాఁడు మీరూప • ముదకంబులం బొంది
చెలిమిమై నున్న మీ • స్నేహితుండు
ఆనాఁడు మీరూప • మందుచుఁ గనె కీర్తి
నీనాఁడు మీ వాడ • నెలమి నుండు
మీవలె నిల నింగి • మీపైన నిరతంబు
తిరుగాడుచుండు మీ • వర సఖుండు
గాలి మేతరి పాన్పు • లీలగాఁ గొనువాఁడు
నిరతంబు మిముఁ గను • నిర్మలుండు

. జలచరంబులార! • జంతు సంతతులార
పక్షులార! యెల్ల • పాములార
మిమ్ముఁ జేరనుండె • మీ రామ భద్రుండు
రక్ష నీయ రొక్కొ • రక్షకునకు. 238

. అరయ నదీనదంబులును • నబ్ధులుఁ గొండలుఁ జెట్లు చాములున్
ధరణియు నింగియున్ దిశలు • ధర్మము తప్పని కాలమానమున్
వరుస విరామమనుం గనని • వత్సరముల్ నెలలున్ దినంబులున్
బరహిత మూర్తి రాఘువుని • భద్రముగా దయఁబ్రోచుఁ గావుతన్.

. రవియును దారకల్ శశియు • రాత్రియునున్ బవలున్ త్రిసంధ్యలున్
రవి సుతుఁడున్ గురుండు బుధ • రాహు కుజుల్ కవి కేతువుల్ ద్విజుల్
దివిజ విభుండు వాయువు స • తీ త్రిలక్షంబులు, పితిహోత్రుఁడున్
శివుఁడు విధాతయున్ సతముఁ • జెప్పుచు నుందురు గాత స్వస్తినిన్.

తే. తల్లి దండ్రుల శుశ్రూష • ధర్మ శక్తి
సత్య వాక్పరిపాలన • సత్య శక్తి
సర్వభూత హితంబగు • సకల శక్తి
'స్వస్తి' జేసెడి గావుత • స్వస్తి రామ. 241

తే. నీవు పోయెడి దారులు • నిత్య సుఖము
సర్వసంపద లిడి నిన్ను • సాకుగాక
అనవరతము పరాక్రమ • మధిక మగుచు
వైరుల జయించుc గావుత • స్వస్తి రామ. 242

క. శ్రీమన్నారాయణుడే
రాముం డనగాc జరా చ • రంబుల నెల్లన్
ప్రేమన్ స్వస్తినిc జెప్పగc
జేమోడ్పున వేడెc దల్లి • చిలుకుచు భక్తిన్. 243

తే. దశరథాత్మజ రామ భ • ద్రాయ స్వస్తి
రామ కౌసల్య సుప్రజా • రామ స్వస్తి
జానకీరామ శ్రీరామ • స్వస్తి స్వస్తి
అనుc బ్రపత్తిమై కౌసల్య • అంత కంత. 244

తే. సప్త ఋషి గణమ్ము • స్వస్తిc జెప్పుచు నిన్ను
సాకుc గాత, రామ • స్వస్తి యనుచు
నారదుండు నీకు • నారదుం డగుగాక
'వత్స రామ' నీకు • స్వస్తి యనుచు. 245

తే. రాక్షసాళి పిశాచాళి • రాత్రి పవలు
భయముc గలిగింప కుండంగ • భద్రమగుత
క్రూర కర్ములు నిను జేర • కుంద్రు గాక
సతము విజయం బ గుంగాక • స్వస్తి రామ. 246

ఆ. కాంచి ముందు గతులc • గౌసల్య శుద్ధాత్మ
తన్మయత్వ మొందు • తనయు నెంచి
పూర్వ రూప సేవc • బొంది ప్రపత్తిమై
పలుకు మంగళంబుc • గులుకు చిలుక. 247

దండకము (1): శ్రీరామ! నారాయణా! భూమి జన్మింపవే, లీలమై, దుష్టు
లంగొట్టఁ దత్కార్య సాఫల్యమౌ, మంగళంబౌఁ జుమా రామ
సన్మంగళం బౌ సదా

(2) శత్రుండు వృత్రుండు చావంగ నింద్రుండు మున్నెట్టి
సన్మంగళం బొందెనో అట్టి సన్మంగళంబే య
గున్‌గాత నీకున్ సదా

(3) దాస్యంబు నందున్న తల్లిన్ విముక్తిన్ గనంజేయు దీక్షన్ సు
పర్ణుండు తేఁ బో, సుధన్, దల్లి దీవించె నద్దాన వాఁడెట్టి
సన్మంగళం బొందెనో అట్టి సన్మంగళంబే య
గున్‌గాత నీకున్ సదా

(4) దుస్సాధమౌ కార్యముం బూని సాధించి వారించెఁగా తల్లి
కష్టంబు నంతన్ సుపర్ణుండు; తానే సుధన్ దెచ్చి; యా
రీతి నా కష్టమున్; బిడ్డ; వారింపగా, దివ్య సన్మంగ
ళంబే యగున్‌గాత నీకున్ సదా

(5) క్షీరోదధిన్ జిల్కు కాలంబునన్, *దల్లి, దీవింప, దేవేంద్రుఁ డే మంగళం
బొందెనో; అట్టి సన్మంగళంబే యగున్‌గాత నీకున్ సదా

(6) ఇష్టార్థముం బొందె నింద్రుండు దివ్యామృతంబుం గొనెన్,
నీవు నున్, నీ యభీష్టంబు నే పొంద
సన్మంగళంబే యగున్ గాత నీకున్ సదా

(7) మున్నా బలిన్ దాన మర్దించి పాదత్రయిన్ లోక మెల్లన్
గొనన్ గల్గు నాఁడా మహా విష్ణు వే మంగళం బొందెనో
అట్టి సన్మంగళంబే యగున్‌గాత నీకున్ సదా.

(8) ఏ సర్వ లోకాధిపత్యంబు సాధించెనో వామ నుండిప్పు డాసర్వ
లోకాధిపత్యంబు నీకున్ లభించున్ గదా అట్టి, సన్మంగ
ళంబే యగున్ గాత నీకున్ సదా.

---

*తల్లి = అదితి దేవి

తే. దివ్య మంగళ విగ్రహా • దీప్తి మంత
సకల లోకంబు 'స్వస్తి' వా • చకము పలుకు
దీర్ఘ బాహుండ! సంతత • దివ్య తేజ
అనుచు స్మృతిఁ దెచ్చు • జన్మ వృత్తాంత మెల్ల. 248

తే. అంతఁ దా ప్రపత్తినిఁబడి • అతుల రూపు
కౌఁగలించుచు మూర్కొని • కౌఁగలించి
ఆత్మను నివేదన మొనర్చి • అమిత తృప్తి
సేసలను జల్లి చందన • సేవఁ జేసి
మంగళంబగు గాత స • న్మంగళ మను. 249

తే. రక్షఁ గట్టెద శ్రీరామ • రక్ష యనుచు
మంత్రమున విశల్య కరణి • మాత కట్టె
లోక రాముని కరమూని, • లోక వినుత
మంగళం బగు శ్రీరామ • మంగళ మను. 250

ద్వి. బ్రాహ్మణుల్ మంత్రముల్ • పఠియించినారు
బ్రహ్మాది దేవతల్ • స్వస్తి యనంగ 251
వేదవిహిత కర్మ • విప్రులుఁ దీర్చి
మోదంబుతో వారు • పొందిరి ధనము. 252

## కౌసల్య ప్రపత్తి

తే. సకల మంగళ రూపంబు • స్వాంత మందు
పాదుకొన నిల్పె కౌసల్య • భాగ్య మేమొ
పుత్రు తనువున గంధంబు • పూసి పూసి
అంబ యంతఁ బ్రదక్షిణ • మాచరించు. 253

తే. రామ జయరామ శుభరామ • లలిత రామ
మరలుమీ వేగ నిటకు నీ మాతఁ • దలఁచి
జన్మ ధర్మమ్ము నెరవేర్పఁ • జనుము వనికి
ననుచు నక్షతలను జల్లె • నతని తలను. 254

తే. తల్లి తనివార దీవింప • నుల్ల మలరి
తనయుఁ డెలమినిఁ బ్రణమిల్లి • తల్లి కంత

మ్రొక్కి మ్రొక్కుచు విడనాడి • పోవలేక
చేయును బ్రదక్షిణంబు స్వ • శ్రీ చెలంగ. 255

తే. *మూఁడు తాపంబులను దాటు • పూన్కి యనఁగ
మాత కంతట మ్రొక్కె ము • మ్మారు సుతుఁడు
మాయలోఁ బడు రీతి ర • మా విభుండు
ప్రకృతిని, నిసర్గమన రామ • భద్రుఁ డపుడు. 256

తే. భక్త భక్తుఁడు విడలేడు • భక్తురాలి
భక్తురాలును విడలేదు • భక్త వరదుఁ
బోవుచుఁ బ్రదక్షిణంబున • మూఁడుమార్లు
సేవ సాయించి సేవించు • శ్రీ విభుండు. 257

ఉ. ఓయి! కుమార నీ వరుగు • మోయి, మహాత్ముఁడవై, పరార్థమై
పోయి, వనీ నివాసమునఁ • బూనఁ గదోయి స్వకీయ ధర్మమున్
ధ్యేయము నీ స్వరూపమె సు • మీ భవదాగమనాభిలాషిణిన్
నీ యభిషేకముం గనఁగ, • నిగ్గన, రాఘవ, రాజ రాజుఁగా. 258

క. అనుచున్ మాయకు లోఁబడు
వనితా రత్నంబు మరల • వత్సను తమిమై
కనులన్ నీరము నింపుచుఁ
గను, మాయాతీతు లెవరు • కాఁగల, రవనిన్. 259

తే. రాము విడనాడఁ జాల దా • రామ మాత
మర్కట కిశోర విధమున • మాత యొప్పు
సంతతిని నోటఁబట్టు మా • ర్జాల గతిని
తల్లి విడనాడి చనలేడు • దాశరథియు. 260

తే. కృపను బ్రసరింప నగు మోము; • కెరలు హృదిని
రాఘవుండు, పరావృత్తి • రాగ మొప్పఁ
దల్లి దృక్కులఁ దన దృష్టిఁ • దమిని నిల్పి
జనకజ గృహంబుఁ జేరఁగాఁ • జనుచుఁ జనుచు. 261

---

* తాపత్రయము = ఆధ్యాత్మిక – ఆధిభౌతిక – ఆధిదైవికములు. ఇవి మానవ సహజములు.

## శ్రీరాముఁడు - జనకజ

చ. జనని గృహంబు వీడి నిజ • సౌధముఁ జేరఁగఁ బాదచారియై
చనుచు రథమ్ము సైన్యతతి • ఛత్రము చామరమున్ త్యజించి వెం
టను భటు లేరు లేకయె హుటాహుటి బోయెడి రామచంద్రునిన్
జనములు రథ్యలందుఁ గని • చాలఁ దపించి కృశించి రత్తఱిన్. 262

చ జనకజ కేమి చెప్పెద! వి • శాంపతిగా నను గాంచ వేచి యుం
డును గద, యంచు రాముఁడు క•డుంగడు లోఁ దలపోయుచున్ సతిన్
గనె, దన ముందు; మైథిలియుఁ • గాంతు వివర్ణముఖంబుఁ గాంచి యా
తనిఁ దెలుపంగఁ వేఁడెను వె • తంబడి కుందెడి హేతు వంగయున్.

చ. ఇదిగద వేళ ? రాజ్యభరము • నీవు గ్రహింపఁగఁ; బుష్య మెంతొ సం
పదకరమౌ ముహూర్తమని • పల్కిరి శిష్టులు పండితోత్తముల్,
ముదమును వీడెనేల నగు • మోము ? రథాదులు వందిమాగధుల్
వదలఁగ నేల ? వీర ! రఘు • వంశ నరోత్తమ ! పూరుషోత్తమా !

ద్వి. అని పలుకాడెడి • జనకజ కపుడు
వినుమంచు రాముండు • విశదంబు సేయు. 265

చ. జనకజ! కర్మవీర సుత! • సర్వము సెప్పెద నాలకింపుమా
జనకుఁడు సత్యసంధుఁడు వి • శాంపతి నన్నడవిన్ జరింపఁ బొ
మ్మనె; భరతుం డయోధ్యను జ • నాధిపుఁడై పరిపాలన క్రమం
బును గొను; దండ్రి యాన వన • భూమికి నిప్పుడె పోవఁగా వలెన్.

చ. భరతుఁడు రాజ్యమేల; వన • వాసిగ, నేఁ జన, నేఁడె; కైక యీ
వరములఁ గోరె రెండిటిని, • పార్థివ ముఖ్యుఁడు సత్యసంధుఁడై
వరదుఁడుఁ గాగ; నే నటవి • వాస మొనర్చెడి నిశ్చయాత్మతో
బరఁగుచు నిన్నుఁ జూడ నిటు • వచ్చితి నీ కిది చెప్పి పోవఁగన్. 267

ఆ. పదియు నాలుగేండ్లు • వనవాస కాలంబు
క్షణము గాగఁ జరుగు • కాల గతిని
నన్నుఁ బోవడ వలదు • నా భరతుని కడ
రా జతండు మనుము • రాజ గతుల. 268

తే. భరత శత్రుఘ్నులఁ గను సో • దరుల భంగి
ఎన్నఁ డాత్మలో నపకార • మెంచ వలదు
అత్త మామల పరిచర్య • నత్తి యిచట
కాలమును బుచ్చుమా, సీత • కలిసి మెలసి. 269

తే. భామినివి నీవు; కొంపోవ • వనికి నిన్ను,
యిట నయోధ్యనె యుండుమీ • యెవరికేని
కోపతాపంబు లుదయింప • కుండ నెపుడు
నిదియ నా మాట వని కింక • నేగు వాఁడ. 270

మ. అనుచున్ బల్కు ప్రియంవదున్ గనుచు నా • యజ్ఞాఙి సీతమ్మ; కా
నన మేగన్ దలపెట్టు నాథు నుడిఁ గా • నంబోదు, విభ్రాంతి భీ
తిని, లేశం బయినన్ దలంప దెద; ధా • త్రీ పాలనా లక్ష్మిఁ జే
కొన లేదంచు రవంత యేని వెత సం • క్షోభింప దెప్పట్టునన్. 271

ఆ. కాని స్త్రీవి నీవు • కానకు రారాదు
వెంట నంటు తలఁపు • వీడు మనిన
విభుని మాట సీత • విననొల్ల కంతటఁ
గోప తాపములను • గూడి పలుకు. 272

తే. భర్త విడనాడ నెపుడేని • భార్య కగునె
భార్య అర్ధాంగి కాదెపో • భర్త కెపుడు
నిన్ను నీ తండ్రి వని కేగు • మన్న యాన
యిర్వురకుఁ గూడ వర్తించు • నినకులేశ! 273

ఉ. ఏ మిటు మాటలాడఁ దగు • నే! లఘు వాక్యములన్ నృపాత్మజా
రాముఁడె యీ గతిం బలుక • రాములుఁ గూడ హసింప కుందురే
భామకుఁ దల్లి తండ్రి సుత • బంధువు లందఱు భర్తయే కదా
భూమిని, స్వర్గమందు, గతి, • పూతకు భర్తయె కాదె రాఘవా. 274

ఉ. నే నిదె ముందు పోవుచు వ • నిన్ గుశ కంటక మార్గ శుద్ధిఁ జే
బూనెద; తావకీన పద • ముల్ గడు సున్నితముల్ గదా; మహా
కానన సీమ నీ చరణ • కంజము లెప్పుడు వాడకుండ నే.
మూనెదఁ బావనాంఘ్రులి మ • హోత్తమ సేవ సతంబు రాఘవా!

ఉ. పావన తావకీన పద • పద్మ నిరంతర సేవ లభ్యమౌ
తావలమౌ గదా వనము; • దానికి మించిన దెద్ది నా కిలన్
దేవర ! సౌధ రాజములు • నింగిఁ జరించు విమాన యానముల్
కావు గదా సమానములు • కాంతు పదార్చన కెంచ రాఘవా. 276

ఉ. నీవు పరాక్రమాన్వితుఁడ • వెందు భయం బొకయింతలేదు, న
న్నీవు త్యజించి పోవఁ దగు • నే, ననుఁ బోలెడి, పెక్కు స్త్రీల, వే
గావఁగఁ జాలువాఁడవు, మృ • గంబులకున్, వెరపొందు వాఁడవే
దేవర వారి సత్కృప, యి • దే యొకొ ! న న్విడనాడ రాఘవా.

ఉ. కోపము, నీర్ష్యయున్ గనక, • కోమలి మాటల నాలకింపుమీ
పాప మొకింతయున్ గనని • భార్యను న న్విడనాడఁ జెల్లునా
నీ పరమైన స్వాంతమున • నీ, కుపకారమె సేయుఁదాన, నే
నోప వియోగమున్ విను మ • యోధ్య వసింపఁ, దలంప, రాఘవా.

ఉ. చెప్పిరి శాస్త్రకోవిదులు • చిన్నతనంబున ధర్మరీతి, నా
అప్పయు, నమ్మయున్ దెలిపి • రార్యుల వర్తన మింటి యందె, నే
నిప్పుడు, మున్నెఱింగి నది • యే, యగు ధర్మముఁ బూన నెంతు, ఏ
ముప్పు ఘటించు ధర్మమును • బూనుచు నీ దరినుండ రాఘవా. 279

ఉ. దుర్గమ కాననాంతరము • దుష్ట మృగాకుల వన్య భూమి, నై
సర్గిక పుణ్య తీర్థమగు • శాంతిమెయిన్ వసియింప; భర్తృ స
న్మార్గమునం జరింపఁ గల • తన్వికి, నీ దరిఁ బాసి యుండునే
స్వర్గము నందెయైనఁ బ్రియు • సన్నిధి వీడను వీడ రాఘవా. 280

చ. ఫలముల వన్య మూలముల • భక్షణముం గొని బ్రహ్మ చర్యమున్
సలుపుచు భూస్థలిన్ గొనుచు • శయ్యగ, నీ వశవర్తినై సదా
మెలఁగుచు నీదు ధర్మమె సు • మీ ఫలియింపగఁ జేయు దాన; నే
నిలువ గృహమ్ము నందు, నను • నిల్పఁగ శక్యముగాదు రాఘవా.281

ఉ. నీ వెనువెంట నుండఁగ వ • నీస్థలి నెయ్యది గాని సౌఖ్యమే
ధీవర ! శూర ! వీర ! యొక • స్త్రీ కథా రక్షణ మీయఁ జాలవే
భూ వలయంబు నెల్లఁ బ్రదుటిఁ • బ్రోవఁగఁ జాలెడి వాఁడ వీవెగా
చావది మేలు నీదు పద • సన్నిధిఁ బాయుట కంటె రాఘవా. 282

చ. జనకుని యింట నున్న గతి • సంతస మొందుచు నుండు వెంట; నే
వనిని, అనన్య చిత్తను జ • వత్పద పద్మ సముద్భ వామృతం
బును గొను పూన్కి దానఁ గృపఁ • బూనుము నేలుము భక్తురాలి నీ
పని కెటువంటి కష్టమును • బాల్పడఁ జేయను జమ్ము రాఘవా. 283

మ. వివిధానేక లతా నికుంజ తరులన్ • వీక్షించుచున్ శైల సం
భవ దివ్యోరు నదీ నదంబులఁ జరిం • పం గల్గుచున్ మున్గుచున్
స్తవనీయంబగు పద్మినీ విభవ కా • సారంబులన్ జంటమై
అవనీశా ! యభిషేకమున్ సలిపి య • త్యంతంబు నిన్ గొల్చెదన్.

చ. సలలిత సుందరాకృతుల • చారు వసంత సుగంధ పుష్పమా
లల మెడ వైచి కాంతు నిను; • సర్వ రసాత్మక దివ్యమైన శే
నెలఁ గొని యారగింపిడుదు • నిచ్చలుఁ దృప్తినిఁ జెంద నీవు నిన్
గొలిచెద స్వస్తి వాక్యము ల • కుంఠిత భక్తినిఁ బల్కి రాఘవా. 285

చ. [1]కుశలను గూర్చెదన్ [2]సమిధఁ • గూర్చెద నీ నిరతాగ్నిహోత్రమే
దిశలకు వెల్గుఁ జూపు; భవ • దీయ శివంకర దివ్య మూర్తికిన్
కుశలము గాఁగ తద్ద్యుతిని • కొమ్మని హారతిఁ బట్టుదాన, నీ
యశము గణించి, నీ పద స • మార్చనఁ జేసెడి దాన రాఘవా. 286

తే. నిన్ను, జలకమాడఁగ వేడి • నీటిఁ గోర
షడ్రసోపేత భోజన • సరణిఁ గోర
పండుకొనుచుండుటకుఁ బట్టు • పాన్పుఁ గోర
కట్టుకొనుటకుగాఁ బట్టు • బట్టఁ గోర. 287

తే. దాస దాసీ జనంబుల • కాస లేదు
బంధు మిత్రుల చెలిమికై • భ్రాంతి లేదు
పూలతోఁటల విహరించు • బుద్ధి లేదు
హార్మ్యముల యందు వసియించు • నాశ లేదు. 289

తే. సర్వమును రామచంద్రుండె; • సకల విభుని
సన్నిధానంబె సకలంబు; • సమస్తి పోవు

1. కుశలు = దర్భలు. 2. సమిధ = చిదుగు - వంటచెఱకు.

నఖిల దుఃఖమ్ము నీ యంఘ్రు • లంటు నంత;
వనమె నీపాద సేవమై • స్వర్గ మగును. 289

మ. అని మోదంబు వనీ ప్రయాణమున కా • అబ్జాక్షి అర్ధాంగి చూ
పెను; దానిన్ గ్రహియింపఁ డా విభుఁడు; పృథ్వీ జాత కైంకర్యమున్
గొన నొల్లండొ! వనీస్థలిన్; భయదమున్ • గ్రూరంబు నౌ వన్య భూ
మిని స్త్రీ యుండఁగ రాదటంచు సతికిన్ • మేలెంచుచున్ బల్కెడిన్.

## సీతకు రాముని హితము

తే. పరమ ధర్మజ్ఞుఁడును ధర్మ • వత్సలుండు
సీత కుపదేశ మొనరింపఁ • జెలఁగి నాడు
వనమునం గల దుర్భర • బాధ లెంచి
వెంటఁ గొని పోవ నొల్లఁడు • విపినమునకు. 291

తే. బాష్పదూషిత లోచన! • పరమ సాధ్వి!
శ్లో జనకపుత్రి!, కులీన!, వి • చార మేల ?
ధర్మ మాచరింపనగు స్వ • ధర్మ మూని
నాకుగాఁ జేయు ధర్మంబు • నాకె చెందు. 292

తే. ఇట వసించుచు ధర్మంబు • నేల లేవొ
వనము నందెన్నొ బాములు • ప్రాప్తమగును
నాదు మాటను కాదన • రాదు నీవు
వనికి పుత్తెంచు యత్నంబు • వలదు వలదు. 293

తే. నిన్ను భరియింప శక్తుండ • నే, నిజంబు
నీదు హిత మెంచి చెప్పెద • నెలఁత వినుము
దుఃఖమే ప్రాప్తమగు వని • దుఃఖమె సుమ
సౌఖ్యమను మాట సున్న ని • శ్చయము వనిని. 294

సీ. సెలయేళ్ల నాదంబు • సింహగర్జనలును
గూబ బ్రద్దలుఁ గొట్టు • కోమలాంగి
శార్దూల మత్తేభ • సహజ దుష్టత్వంబు
నరులఁ జంపెడి గద • హరిణ నయన

సంకిల మగ్నమౌ • వాహినీ జలముల
జలక మాడఁగ నౌనె • జలరుహాక్షి
కంట కావృత మార్గ • గహనాంతరంబుల
నడుగిడ నేర్తువే • అలరుబోణి

తే. తలలఁ దాఁకెడి కొమ్మల • ములుకులైన
మోడులను దాటఁ గల వౌకొ • మోహనాంగి
భయద నాదంబు, భీకర • లయ విధంబె
వినఁగఁ గానఁగ నయ్యెడి • విపిన మందు. 295

సీ. పూలఁ గోయఁగరాదు • పూజల కొఱకైన
భువి రాలు పూలనే • పొంద వలయు
పండ్లైన క్షుద్బాధఁ • బాపఁగా నోపవు
భువిరాలు పండ్లనే • పొంద వలయు
ఆకు పాన్పునకైన • ఆకులు కొఱవడు
భువి రాలు నాకులఁ • బొంద వలయు
మధువుఁ గైకొని తృప్తి • మనఁ జూచినను గూడ
భువిరాలు కణములఁ • బొంద వలయు

తే. తేనెటీఁగలు, దోమలు • పూని కుట్టుఁ
గుట్టుఁ గ్రిమి కీటకాదులు, • పుట్ట విడిచి
విచ్చల విడిగ దిరుగాడు • విపినమందు
కొండ చిలువలుఁ ద్రాచులు • మెండుగాఁగ. 296

తే. భీకరార్భట సంతతుల్ • వినుచు చెవులఁ
గష్టతర దుఃఖ దృశ్యముల్ • గనుచుఁ గనుల
నల్లి బిల్లిగఁ బెరిగెడి • అడవి లతలఁ
దనువుఁ బెనఁగొన నడుగిడ • తరమె సీత. 297

ఆ. విపుల విపిన సీమ • వేసారి పోయెదు
కష్ట గతులె సతము • గడలు కొనును
దుఃఖ కష్టము లవి • తుల తూగు నొండొంట
ఏల నీకు సకియ ? • యిట్టి గతులు. 298

తే. అన్నిటిని మించు యమ నియ • మాది విధులు
పూనఁగా వలె నుపవాస • ముల వెలంది
నారచీరలఁ గట్టఁగఁ • గోరు దేల ?
దుఃఖమయమగు వనియందుఁ • దుష్టిఁ గనుదు. 299

తే. నీటి కోళ్లును నక్రముల్ • నీటి యందు
కొండ చిలువలు తేళ్లునుఁ • గూడ నేల
పక్షి మృగ సంకులంబులు • వనము నెల్ల
భయముఁ జేకూర్చు శాంతి, వి • భ్రాంతి కాదె. 300

ఉ. ఎంతని చెప్పువాఁడ వని • నింతకు నింతకు మించి మించియే
వంతలు గల్గు, నమ్ము సఖి • పార్థివు నాజ్ఞ వనిన్ వసించి, నే
నింతట వచ్చువాఁడ నిను • నిచ్చటఁ గూడెడివాఁడ శాంతివై
చింత వహింపకుండఁగ, వ • సింపు, మయోధ్య నభీత చిత్తవై. 301

## జానకి తుది మాట - జ్యోతిషము

ద్వి. అని రాముఁ డాడంగ • నా సీత పలుకు
కనుల నింపిన నీరు • కాల్వలై పార 302

తే. కష్ట సుఖములు కావటి • కడవ లరయ
శాశ్వతం బేదియును గాదు • సకల విదుఁడ
ఏవి కష్టంబులని యిపు • డెంచి నావొ
అవియ సుఖతరమ్ముగ మారు • నాత్మ వృత్తి. 303

ఉ. నీవు ప్రసన్న బుద్ధిఁ గమ • నించితివేని, త్వదుక్త కష్టముల్
రావు; సమస్తమున్ సుఖత • రంబుగఁ దోఁచెడి నీకె యిప్పుడే,
నీ వహా; అప్రసన్న మతి • నే కన, నెల్ల సుఖంబులున్ త్రుటిన్
లేవు, ప్రసన్నతన్ గనుము • లీల; ననన్య పరాత్మనో సతిన్. 304

తే. నీదు సహవాసమున నుందు • నియత బుద్ధి
నిన్నుఁ గనుచుందు నీ సేవ • నే, చరింతు
సతత మేకాంత సేవ సం • సక్త నగుదు
ఇంక కష్టంబు భయము నే • నెట్లుఁ గందు 305

ఉ. ఈ *యపురూప సేవ లభి • యించినఁ గష్టము దుష్ట ముండునే
వాయు, [1]నదృష్ట రూపుఁ గని • వన్య మృగంబులు సర్వదుష్టమున్,
ధ్యేయ [2]మదృష్ట పూర్వ నిజ • తేజము, తొల్లి [3]యదృష్ట రూప మా
ప్యాయముగాఁ గనన్ భయము • పారదె పారు [4]నదృష్ట సంతతుల్.

శా. ఘోరారణ్య నివాస దుష్ట మృగముల్ • ఘూర్ణిల్లునే, †రాఘవున్
మారాకార వినూత్న సత్పురుషు; స • న్మానించునే, కాని; ప్రే
మారాధ్యుండు జనింపఁ జేసెడిని, ప్రే • మంబే సదా; ప్రాణులన్;
శ్రీరామా కనినావొ విస్మృతిని స్వ • శ్రీ శేముషిన్ బుట్టవే. 307

ఆ. కాల గతినిఁ బట్టి • కారాని దేమొకో
కాల గతిని మీఱఁ • గలమె మనము
భావి కష్టములను • భావింతు నా పట్ల
కనవు నీదు భావి • కర్మ మేమొ. 308

తే. పూజ్య! యిపుఁ డీవు ననుఁ గొని • పోవకున్న
నాకుఁ బ్రతికెడి పనియేమి, • నాథు వీడి
మనను; సంశ్లేషమున, మన • మహిత కర్మఁ
దీర్పనగు నిర్వ్వరముఁ గూడ • దివ్యతేజ. 309

తే. భర్త భరియింప నోపని • భార్య పుడమి
బ్రతుకఁగా నేల బ్రతికిన • బాములె గద!
నీదు విశ్లేష మే నోర్వ, • నిన్ను విడిచి
జీవముల, నుండఁ జాలను • జీవితేశ. 310

తే. నేను నీ సమీపము నందె • నిలిచి యున్న;
నమర విభుఁడైనఁ దన పరా • క్రమము వలన
నెంచఁ డవమాన మొనరింప • నెప్పుఁడేని
భర్త విడనాడ, నిల్లాలు • బ్రతుక నేల? 311

---

*యపురూపము = పూర్వములేనిది, అరుదైనది.

1. చూడని ఆకారము. 2. చూడనటువంటి అనాది సహజ తేజము.

3. సంపత్కరమైన రూపము. 4. జలాదులవల్ల కలుగు కష్టములు.

† రాఘవుఁడు = సర్వజ్ఞుఁడు.

(వినయవృత్తము) అని నీ - వనవే - మును నే - వినఁగా 312

(బింబవృత్తము) కాననమున్ - జానకిరో - కానఁగ నీ - కౌ, ననరే. 313

(భద్రకవృత్తము) జ్యోతిషంబుఁ గని బ్రాహ్మణుల్
తాత యింట మనుచుండగన్
చేతియందుఁ గల రేఖలున్
జ్యోతిషమ్ము ధ్రువమే యనెన్. 314

ద్వి. పండితుల్ ప్రాజ్ఞులుఁ న్ • బలికిన రీతి
దండ కాటవి నుంట • తప్పునే రామ. 315

ఏనాఁడు వింటినో • యీ మాట రామ
ఆనాఁటి నుండియు • నడవిఁ జూడంగ 316

కోరిక యుదయింపఁ • గోర నే మున్ను
గారామునన్ నీవు • కాదన లేదు. 317

విధి యిట్టు లుండఁగా • వే యేల ? మనకు
ప్రథితుండ ! తప్పునే • వనవాస మెంచ. 318

వనవాస మందున • బాములు గలుగు
నని నాకుఁ దెలియదే • నైన దప్పు నొకో. 319

వెరచునే పురుషుండు • విధినెంచి రామ
స్థిరబుద్ధిఁ బ్రాప్తంబుఁ • జేఁ బూన వలయు. 320

కన్యగా నుండిన • కాలంబు నందె
వన్య నివాసంబు • ప్రాప్తించు ననుచు 321

సాధు వృత్తిని నున్న • సచ్ఛీల యొకతె
బోధించె విన తల్లి • పూర్వమే సుమ్మ. 322

తే. కొన్ని జన్మల నుండియుఁ • గూడి యున్న
సంచిత విధంబు దాంపత్య • సరణి గాదె
నేఁటి సంసర్గమే కాదు • నీవు నేను
దాశరథి జన్మ జన్మల • దంపతులము. 323

తే. నీకు నాకును నొక్కటే • నియతి సుమ్మ
ధర్మ మొక్కటి దీర్ఘంగ • ధాత్రి యందు
జన్మ మెత్తితి మా ధర్మ • సరణి మనము
విడి వడఁగ నిర్వహింపంగ • వీలు పడదు. 324

తే. నేను పతితోడ ననురాగ • మూని మెలఁగుఁ
దానను బతివ్రతను, వీడి • కాన కరుగఁ
జెల్లునే ? సుఖ దుఃఖములను • జేరి సగమ్ము
ననుభవింపఁగ వలయుఁగా • మనము రామ. 325

తే. సహజ ధర్మము వీడుచు • సతినిఁ బాసి
అడవి కీ వేగ భువి వీడ • నగును నాకు
విషమొ జలములో అనలమో • విధి యదేమొ
చావునకు మార్గముల్ గనఁ • జాలఁ గలవు. 326

తే. అనుచు దుఃఖాశ్రు పూర్ణయై • యవని జాత
ఎంతో మొరపెట్టు కొనుచుండఁ • గాంతుఁ డామె
నూరడింపంగఁ జేయఁగా • నుద్యమించు
విజన సీమకుఁ దానొండె • వెడల నెంచు. 327

ఉ. ఆ యమ భర్తురాలు సతి • ఆత్మపతిన్ విడనాడ నెంచ, దా
ప్యాయముఁగా వనీస్థలి, ని • వాసమొనర్పఁగ నిశ్చితాత్మయై
ధీయుత చెప్పె, శాస్త్రవిధి • తెల్ల మొనర్చియు, జన్మ ధర్మమున్,
గాయముఁ గూడ వీడనగు • కర్మగతిన్ వివరించి యంతటన్. 328

తే. కుపితయై నిష్ఠురంబులఁ • గూడఁ బలికె
వినమి రాముండు గొనిపోవ • విపినమునకు
విసివి వేసారి భర్తులు • వేయినోళ్ల
దిట్టుటయుఁ గూడ సహజమే • గుట్టు విడిచి. 329

తే. [1]"వినవొ ? రామాయణంబుల • వీర రామ
పూర్వ రామాయణంబుల • పోకడఁ గన
సీత విడనాడి రాముండు • చెలఁగె నొక్కొ
స్వీయ ధర్మంబు నెరవేర్ప • సీత వలదె". 330

---

(1 ఆధ్యాత్మ రామాయణమునుండి)

## సీత దెప్పుట

ఆ. సకల విదుఁడ రామ • *శైలూషుని విధాన;
యౌవనవతి భార్య • నబల సతిని
ఎవని కప్పగించి • యేగె దీ వడవికి
వెంటఁ గొనుము సీత• వెంట నంటు. ౩౩౧

తే. ప్రకృతి మాయను దాపెడి • వాఁడు గలఁడొ
పూర్వ సంస్మృతిఁ బుట్టు • టపూర్వమె సుమ
నీకుఁగా జెప్పుచుంటిని, • నీదు ఘనత
వన్నెయుఁ దొలఁగు సీతను • వదలితేని. ౩౩౨

ఉ. సీతను వీడుచున్ వనికిఁ • జేరిన; సత్యపరాక్రముం డొకో
శ్రీ పూత చరిత్రుఁ డొక్కొ, రఘు • పుంగవుఁ డంచును లోక మెంచి నీ
ఖ్యాతికి మచ్చఁబెట్టు ననుఁ • గాంచిన నా జనకుండు వీరుఁడే
సీతను వీడెనా యితఁ డి • సీ! పురుషాకృతి వాఁడె పో యనున్. ౩౩౩

చ. లలిత వినీల సుందర వి • లాస తనూ విభవంబు పేర్మి నా
లలన నొసంగితిన్ ద్రిపుర • లాలిత సుందరి మోహనాకృతిన్
వలపులఁ జూపి పొందెఁ దన • భార్యగఁ బూరుష వేషమూని యీ
యిలఁ గల దెంతొ మోసమని• యెంచఁడొ నా జనకుండు రాఘవా!

చ. జనకుఁడు కర్మయోగి జన • సత్తముఁ డెప్పుడుఁ బత్ని వీడఁ డా
జనకుఁడు నల్లు వాని, సహ • చారిణినిన్ విడనాడు వాని నిన్
గని, మది నెంత కుందు నొకొ • ఙ్మా తనయన్ విడి వన్య భూమికిన్
జన, మగవాని వేషమునఁ • జాన లభించె, నటంచు, రాఘవా! ౩౩౫

---

(* వాల్మీకము) శ్లో. 8; స. 30- స్వయంతు భార్యాం కౌమారీం చిర మధ్యు
షితాం సతీమ్। శైలూష ఇవ మాం రామ పరేభ్యో దాతు మిచ్ఛసి,

శ్లో. 3: స.—30- కిం త్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుష విగ్రహమ్.

ఈ శ్లోకమునకు వివిధార్థములు గలవు. ఈ అర్థముల వివరణమే ౩౩౩ నుంచి ౩౪౩ వఱకు గల పద్యములు.

చ. అతులిత నైష్ఠికుండు మిథి • లాధిపుఁడున్ ప్రజ కెంతమందికో
సతతము రక్షణం బొసఁగు • సాధు వతంసుఁడు నాదు తండ్రి, ఒ
క్కతె సతి నేలలేక విడి, • కానకు నల్లుఁడు పోవ, నాతనిన్
వెతఁ దలపోయఁడే పురుష • వేషమునం గల, స్త్రీగ రాఘవా! 336

ఉ. జనకుఁడు పాలితావళికి • సార్థక నాముఁడు నాదు తండ్రి, నన్
బెనిచిన వాఁడు; భర్త నను • వీడి వనీ గతుఁ డాయె నంచు; నిన్
గనిన గురుండె పుత్రకునిఁ • గానన సీమకుఁ బంపఁ గారకుం
డనుచు వినంగ, నెంతగ వ్యా • దంతర మందుఁ దపించు రాఘవా!

ఉ. రామ "అయోనిజన్ సుగుణ • రాజిత నుంచితి రాము పాణిలో
రాముఁడు, నామమాత్ర మగు • రాముఁడు, కోసల పుత్రి సూనుఁడున్
గామము నర్థ ధర్మములఁ • గైకొని 'నాతి చరామి' యంచు, నేఁ
డామెను వీడి పోయె; వని" • కంచను, నా జనకుండు రాఘవా!

ఆ. కన్నతల్లి గాని • కైకమ్మ కతమున
నింత ముప్పు దాప • రించు ననుచు
జనకుఁ డెఱుఁగఁ డాయె • జనకజ నీ కిడ
ధర్మ వీరుఁడ వని, • తలఁచె నతఁడు. 339

ఆ. ఆడు దొకతె సుంద • రాకృతిఁ జూపించి
పురుష వేషమూనిఁ • బొందె సీత
జనక చక్రవర్తి • జామాత, యొక, రామ
అనరె ప్రజలు రామ • అబల వీడ. 340

తే. రామ! జామాత పురుష వి • గ్రహము రామ
ప్రాప్తమాయె నంచు జనక • పార్థివుండు
ఆత్మఁ దలపోయు నవ్వీడి • యరుగ నిన్ను
స్త్రీగ నెఱిఁగిన నన్ను నీ • చేతి కిడునె? 341

ఆ. నేతి బీరకాయ • నీ నామ మనరొక్కొ
రామ! వీడి చనెను • రామ నంచు
నన్ను వీడుదే? య • నన్య పరాయణ
**వంశ యశము వెల్లఁ • బా డొనర్చి.** 342

తే. వాసుదేవుండె పురుషుండు • వాస్తవముగ
వాసుదేవాన్య మెల్లను • ప్రకృతి కన్య
యనుచుఁ దత్త్వంబు నెఱిఁగిన • జనక విభుఁడు
నిన్నుఁ గని మోహమున నాదు • తెన్ను మరచె. 343

తే. తల్లిఁ దలపెట్టఁ దండ్రినిఁ • దలఁపఁ బోను
ఇంటి మాటనె యెత్త నే • నినకులేశ
ఫలమొ మూలమొ పుష్పమో • బ్రతుకఁ దినుచు
మనెద నీ పాదముల చెంత • మానవతిని. 344

తే. ఇంత విశ్లేష కాలంబు • నెటుగ నుందు!
పదియు రెండును రెండేండ్లుఁ • బాయఁ గలనె!
ఒక్క క్షణమైన నినుఁ బాసి • యుండఁ గలనె!
కృప వహింపుము రాఘవ! • కృప వహింపు. 345

తే. లోక బాంధవుఁడో యన • కీర్తిఁ గనుము
రామచంద్రుండుఁ గోల్పోయె • రశ్మి నంచు
జనులు పల్కంగ విన నొల్ల • జానకీశ!
దీప్తి రహితుండ వౌదువే • దీన వరద! 346

తే. నేను కుల పాంసనను గాను • నిశ్చితాత్మ
ధర్మ నిర్వాహణార్థంబు • ధర జనించి
యుండిన పతివ్రత నెఱుఁగు • మోయి రామ!
అనుచు నిజ భక్తి రాముండు • వినఁగఁ బలికె. 347

ఉ. లోకులు నిన్ దలంచి యిటు • లోటులఁ బల్కుచు మాటలాడఁగా
నాకు వినంగ శక్యమొకొ • నాథుని కీర్తి గణించు దాన, నన్
జేకొని పోవుమీ వనికిఁ • జేడ్పడకుండ యశంబు ధర్మమున్
సాఁకులు చెప్పుదేని యికఁ • జచ్చెద నీ మునుముందె రాఘవా!

తే. *పురుష †విగ్రహా! అచ్యుత! • పరమ పురుష
రామ! జామాతగాఁ గొని • రహిఁ జెలంగె
మిథ్య యని యైహికం బెంచి • మిథిల విభుఁడు
నీవ నన్వేతఁ బెట్టుదే • నిరుపమాన. 349

---

*పురుష = భక్తులను; †విగ్రహా = గ్రహించువాఁడ.

క. అని రాముని శ్రీ పాదము
లను బడి కన్నీటను, గడిగి • లలిత పదంబుల్
పెనగొను భక్తిని హృదయే
శునిఁ గట్టిగఁ గౌఁగిలించి • శోకించు వ్యథన్. 350

తే. *మున్ను సావిత్రి పెనిమిటి • తెన్నుఁ బట్టి
30/6 చనిన చందాన నీ వెంట • మనెడి దాన
నీదు వశవర్తినిని గాదె • నీరజాక్ష
మంగళమగుఁ దాన శ్రీరామ • మంగళమగు. 351

## సీత ప్రపత్తి

తే. "అన్యథా శరణం నాస్తి" • యనెను సీత
జన్మ ధర్మార్ధ మెఱిఁగిన • జనక పుత్రి
భక్త వత్సలుఁ డా రామ • భద్రుఁ డంత
కరుణ వెదజల్లి కాంచె నా • కాంత సతిని. 352

తే. స్నేహ మనన ప్రణయ రాగ • చిత్త గతిని
కాంత విశ్లేష విరహ దుః • ఖంబుఁ బొంది
యంత అనురాగ పూర్ణయై • అవనిజాత
మధురభావ మహాభావ • మగ్న యగుచు. 353

తే. హృదిని హృది నుంచి కౌఁగిలి • నదిమి పట్టి
కాంతు, దృష్టిని లీనమౌ • గతిని నిలిపె
శుద్ధ కంజాత నేత్ర వి • శుద్ధ దృష్టిఁ
గనుల కాటుకఁ గన్నీరు • కడిగి వైవ. 354

తే. పరమ దుఃఖితయై సీత • పట్టు వదలి
చేష్టలను దక్కి పతి పాద • సీమఁ బడెను
పొంగి దిగ మ్రింగు దుఃఖంబు • పొరలి రాగ,
సీతఁ గరములఁ గౌఁగిటం • జేర్చు విభుఁడు. 355

---

*వాల్మీకము-శ్లో. ద్యుమత్సేన సుతం వీర ! సత్యవన్త మనువ్రతామ్।
సావిత్రీ మివ మాం విద్ధి త్వ మాత్మ వశవర్తినీమ్॥ ...

## రాముఁడు సీతయెడఁ గృపాళుఁ డగుట

తే. సతిని మాధుర్య భావ సం • సక్త నంత
మహిత రాముండు మన్మథ • మన్మథుండు
ముదిత మాధుర్య భావ సం • పూర్ణ మూర్తి
కౌఁగిలించుచుఁ బ్రేమంబుఁ • గనుల నింపె. 356

తే. నే, ననన్య పరాయణ • నిన్ను వీడ
నని ప్రపత్తిఁ దన్మయతమై • ఆత్మ విభుని
కాత్మ నిడి కౌఁగిలించిన • యంత సీత
ప్రేమ రూపంబుఁ దాల్చిన • విధము దోఁచె. 357

తే. పరమ భక్తినిఁ బ్రార్థించె • భక్త సీత
సఖ్య భక్తినిఁ బ్రకటించె • సకియ సీత
మధుర భక్తిని వెదజల్లె • మగువ సీత
అతుల విశ్లేష దుఃఖంబు • నందె సీత. 358

తే. ధర్మ కర్మార్థములఁ బల్కె • ధాత్రి తనయ
జన్మ గతిఁ దెచ్చె స్ఫురణకు • జనక పుత్రి
నిత్య సంసర్గ విధిఁ దెల్పె • నిర్మలాత్మ
సంతతానందుఁ డంత ప్ర • సన్నుఁ డాయె. 359

## భక్త వరదుఁడు భక్తురాలి ననుగ్రహించుట

తే. భక్త వరదుండు వరదుండు • భార్య కపుడె
హృదయ సీమయె నీయది • ఎలమి నందె
రాజిలుచు నుందు దానవే, • రామ నీవు
నిన్ను విడనాడు టెట్లనె • విమల వృత్తి. 360

ఆ. నీ మనంబు నెఱుఁగ • నే నింత యంటిని
వేఱు గాదు సీత • వీడు భయము
ఎట్టి కష్టమేని • ఏ నిన్ను బాయను
యశము వీడి యుండ • నట్టు లబల. 361

తే. ఈవు సహధర్మ చారిణి • వెటుగ విడిచి
వనికిఁ జనువాఁడ రమ్మింక • వనికి వెంట
నీదు నిశ్చితాభిమతము • నే నెఱిఁగి
యియ్య కొంటిని వనికి • నిందువదన. 362

తే. నన్నుఁ గవఁ గూడి విపినంబు • నందు మెలఁగ
అస్మ దర్థమ్ము నిన్ను నా • యబ్జభవుఁడు
సృష్టిఁ జేసెను విడఁజాల • సీత, యిపుడె
వెంటఁ గొని యేగువాఁడ నిన్ • విపినమునకు. 363

తే. స్వర్గమున నేని నీదు సం • సర్గము విడి
మనఁగఁ జాలను జానకీ • మనఁగఁ జాల
వనికిఁ గొంపోదు జానకీ • వనికి రమ్ము
దీర్ఘ సహధర్మమున్ ధర్మ • దీప్తి వీవు. 364

ఆ. తండ్రి యాన మీఱఁ • దలపెట్ట నెప్పుడు
గురుని కంటె దైవ • మరయ లేఁడు
దాన వనికిఁ జనుట • తథ్యంబు వెడలంగ
జాగు సేయ నేల • జనక పుత్రి! 365

తే. సుప్రసన్నుండు రాముండు • చూడఁగలఁడె
భక్త, దుఃఖించి, విలపించు • ప్రాణసఖిని
నీవు శోకింప స్వర్గమ్మె • నే వరింప
ననుచుఁ బలుకాడి యెలె సీ • తమ్మ నంత. 366

తే. పూర్వ సంధ్య రాముఁడు మర • పూనలేదు
వనములోఁ గల్గు జాములు • ప్రకటితముగ
జనకజకుఁ జెప్పి తో • డ్కొని పోఁ దలంచె
పూర్వ సంస్మృతిఁ బుట్టించి • పురుష వరుఁడు. 367

తే. జానకీ రాము లిర్వురు • జన్మగతుల
మఱవకుండియు మఱచిన • మనుజుల వలె
నొండొరులకుఁ జెప్పిన మాడ్కి • నొప్పి రపుడె
కలసి మెలసియె వని కేగఁ • దలఁచినారు. 368

కవిరాజవిరాజితము :-

జనకజ వేగమె సల్పగ నౌ గద • శాస్త్రవిధిన్ దగు దానములన్
గనకము భూసురకాంతల కీదగు • కాదనకే మరి లేదనకన్
పనివడి భిక్షుక పంక్తులఁ దేల్పుము • పావనమౌ గద జన్మ మిఁకన్
పను లొనరించెడి వారికి నింటను • వాడెడి వస్తువు లీయఁ దగున్.

## జానకి పశ్చాత్తాపము - క్షమాపణము

ద్వి. అని పల్కు ప్రాణేశు • కనులెత్తి చూచి
తనలోన సిగ్గుఁ దా • గనుచుండి యంత 370
పలుకాడె సీతమ్మ • భర్తతో నిటుగ
లలిత స్వరూప ! • రాఘవా వినుము. 371

క. నిష్ఠురవాక్యము లంటిని మది
కష్టముఁ గలిగించినానొ? • గ్రక్కున, ధర్మా
విష్ట మనంబున బుట్టుక
భ్రష్టము గాకుండు కొఱకు • రాఘవ రామా. 372

ఆ. జన్మ కర్మగతిని • సాఫల్య మొందింప
నీదు వెంట వనికి • నాదు రాక
తప్పదంచు దాని • దశరథపుత్రకా
మఱచితేమొ యంచు • మాట లంటి. 373

తే. నీవు రాఘవ ! సత్ప్రేమ • నిలయ మంచు
ధర్మరూపుండ వీవని • ధాత్రియందు
మఱచి ప్రాకృతభావాన • మాటలంటి
నైన క్షమియించినావు నీ • వెంత నీవె. 374

తే. రామ క్షమియించి సర్వాప • రాధను నను
నిటుగ నవ్యాజ కృపఁ జూపి • ఏలినావు
యీప్సితార్థంబు ఘటియించె • నింక ధన్యు
రాలను సతము నీ సేవ • లభ్య మగును. 375

ద్వి. నీ మాటమై యిప్డె • నే నాచరింతు
రామ, దానాది ధ • ర్మార్థ విధుల 376

## జానకి వితరణము

మేఘవిస్ఫూర్జితవృత్తము :-

ధరానాథుం డా రాఘవుఁడు పలుకన్ • ధాత్రిజారామ యెంతో
పరాకాష్ఠన్ దానప్రతతి సలిపెన్ • భర్త సంప్రీతిఁ బొందన్
వరానేకామూల్యాభరణచయముల్ • బ్రాహ్మణుల్ తృప్తిఁ జెందన్
గరంబా సాకేతంబునఁ గల జనుల్ • గాంచి మెచ్చంగ నిచ్చెన్. 377

## రామ లక్ష్మణులు

సుగంధివృత్తము :-

సీత వాదు సేయ భర్త • చెప్పియున్న మాటలన్
పూతుఁ డైన లక్ష్మణుండు • పొంత నుండి వింటచేఁ
జేత మెల్లఁ బొక్కి భ్రాతఁ • జేరి మ్రొక్కి కోరెడిన్
బ్రీతి తోడఁ దానుగూడ • వెంటరా ననుజ్ఞకై. 378

ద్వి. మునుముందుఁ జనువాఁడఁ • బూనుచున్ విల్లు
$\frac{3}{4}\frac{1}{}$ వనమందు భయమేమి • ప్రాప్తింప కుండ 379

$\frac{3}{4}\frac{1}{}$ సహచారినై యుందు • సర్వకాలంబు
మహనీయ నీ సేవ • మనుచుండి సతము. 380

$\frac{3}{5}\frac{1}{}$ అమరత్వమే యైన • నైశ్వర్యమైన
భ్రమియింపఁ బోను, నే • రామానుజుండ. 381

నీ వెట నుండిన • నే నట నుందు
నీవహో సర్వంబు • నీ వెంట నుందు. 382

నీ వెంట నుండ ము • న్నీ విడి యాన
నీ విట్లు వలదందు • వేలకో యిపుడు. 383

అను లక్ష్మణుం గాంచి • యనురాగ మొప్ప
వినుమంచు రాముండు • ననుజుని కనును 384

చ. ప్రియుఁడవుఁ బ్రాణతుల్యుఁడవు • వీరుఁడ! సత్పథవర్తనుండ ధ
ర్మయుతుఁడ! నీవు స్నిగ్ధుఁడవు • భ్రాతవు వశ్యుఁడవున్ సఖుండవున్
బాయఁగలాడ నొక్కొ నిను; • వచ్చితివా వని నాకె సౌఖ్యమౌ
ధీయుత యోజనన్ సలుపు • దే గురుఁ డెప్పుడు కామబద్ధుఁడే. 385

ద్వి. సవతియౌ కైకమ్మ • చాటున బ్రతుక
భవదీయ మాతయు • భయ మొందుచుండు. 386

కౌసల్య నాతల్లి • కంపించు చుండె
వేసారి సవతితో • విలపించు చుండె. 387

భరతుండు రాజ్యాధి • పత్యంబుఁ బూన
బెరుగు బాధ లటంచు • భీతిల్లు వారి 388

రక్షింప నుండుమీ • దీక్ష నయోధ్య
దక్షుండ నీవౌదు • తల్లుల కింట. 389

మన తండ్రి సేవించి • మనఁగనౌ నిచట
వనికి రాఁ బనియేమి • జనకుని వీడి. 390

తల్లుల సేవించు • ధర్మంబు గలుగు
నుల్లంబు సతము రం • జిల్లుగా నీకు. 391

నామాట విని భక్తి • నాయెడఁ జూపు
వే మాట లేల సం • ప్రీతిమై మనుము. 392

## లక్ష్మణుని వేఁడికోలు

తే. దివ్య తేజుండ నీవు నీ • తేజమునకె
భయము నొందుచు, మాతల • భద్ర గతిని
భరతుఁ డెప్పుడుఁ బూజించు • భయము వలదు
అరయ కౌసల్య కెట్టి భ • యంబు లేదు. 393

తే. వేయి గ్రామాదు లున్నవి • వేనవేల
ప్రజల నను బోలు వారల • పట్టు కొమ్మ
ఆమె నా తల్లినిం గూడ • నాదుకొనును
వారి రక్షింపఁ బరులేల • వనజ నేత్ర. 394

తే. న న్ననుచరునిఁగాఁ గొమ్ము • నిన్నుఁ గొల్చి
31/22 నే కృతార్థుండ నౌదు, వ • నీ నివాస
మం దుపకరించెద సుమ రా • మయ్య వినుము
గొనుము నను గూడ నీతోడ • వనికి నేఁడె. 395

ఆ. తవ్వుగోల గంపఁ ◆ దగఁ దాల్చి నీముందు
$\frac{3}{2}\frac{1}{3}$ చనెడి వాఁడఁ ద్రోవఁ ◆ జక్కఁ జేయ
$\frac{3}{2}\frac{1}{4}$ తెచ్చి యిచ్చువాఁడఁ ◆ దిన మూల ఫలములఁ
దాపసులకుఁ దిండి ◆ తగిన రీతి. 396

తే. కొండ నెత్తమ్ములన్ సీతఁ ◆ గూడ నీవు
$\frac{3}{2}\frac{1}{5}$ సర్వ కార్యంబుల సమస్త ◆ సమయములను
నియతిమై నేనె చేతు పు ◆ నీత రామ
చేసి నీ సేవ సంతృప్తిఁ ◆ జెలఁగు వాఁడ. 397

ఆ. సఖ్య దాస్య భావ ◆ సంకలితాత్మతో
నన్న వేఁడెఁ దోడ ◆ నరుగ వనికి
శాంత భావమూర్తి; ◆ శరణాగతుల ప్రాపు
సమ్మతించెఁ దోడు ◆ చనఁగ వెంట. 398

ఉ. నీవిఁకఁ బోయి నీ హితుల ◆ నెమ్మినిఁ గూడుము దాన ధర్మముల్
వావిరిగా నొనర్చి గురు ◆ వర్యుని చెంత సురక్షితంబులౌ
నా వివిధాయుధంబులఁ గొ ◆ నందగు, మున్ జనకాధ్వరంబునం
దా వరుణుండు తండ్రి కిడె ◆ నవ్వి వసిష్ఠుని చెంత నుంచితిన్. 399

ద్వి. అని రాఘవుం డను ◆ నంత లక్ష్మణుఁడు
గని మోదముం జనె ◆ గావింప విధుల 400

రాముని యాన స ◆ రాసరి సల్పి
సౌమిత్రి యాతని ◆ సన్నిధి నిలిచె. 401

ఉ. పూజ లొనర్చినారు రఘు ◆ పుంగవుఁడున్, సతి, లక్ష్మణుండు న
వ్యాజ కృపామతిన్ ధనము ◆ స్వర్ణము గోవులు వాహనంబులున్
వాజులు దాన మిచ్చిరి శు ◆ భంబని బ్రాహ్మణకోటి కెల్ల ఆ
రోజున బీద సాదలు సి ◆ రుల్ గని దృప్తినిఁ గాంచి రెల్లరున్. 402

చ. గురు సుతుఁడౌ సుయజ్ఞకుఁ ◆ గూరిమి నిచ్చిరి రామ దంపతుల్
వర మణులున్ సహస్ర గజ ◆ వారము రత్న మయంపు పాన్పులున్
స్థిరమగు భూమి దానములఁ ◆ జేసిరి వస్త్రములున్ విభూషలున్
గర మనురక్తి సేవక ని ◆ కాయముఁ బొందెను నాఁడు వేడుకన్.

తే. త్రిజటుఁ డను బీద బాఁపఁ డ • ర్థించు నంత
కఱ్ఱ విసిరిన మేఱకుఁ • గలుగు నేల
నుండు గో, గణంబుల నిచ్చె • మెండు గాగ
బ్రాహ్మణుఁడు భార్యయుఁ • దృప్తి వరలు నట్లు. 404

తే. దాత యన రాఘవుఁడె దాత • దాత సుమ్ము
బీదవారల పాలిటి • పెన్నిధి యన
రాముఁ డా నాఁడు దాన వి • రాజితుండు
సలిపె గోదాన భూదాన • సంచయమ్ము. 405

తే. గౌరవము గోవులో డబ్బొ • కాంచనంబొ
పౌరులును జానపదులును • బడసినారు
ద్విజుఁడు హితుఁడు భృత్యుండు, న • ర్థియును లేరు
లేరు దానముల్ పొందని • వారు నాఁడు. 406

తే. పూర్వ యుగ మందు శిబి నృప • పుంగవుండు
తగును బోల్పఁగ రాఘవు • దాన మందు
నని యయోధ్యను గొనియాడి • రర్థులెల్లఁ
గరముఁ జాచంగ మిగులఁ డో • కండుఁ గూడ. 407

ఆ. సకల ధర్మవిదుఁడు • శాస్త్ర విహితంబుఁగా
నిర్వహించినాడు • సర్వవిధుల
*తాత యానఁ బొంది • తరలంగ వని కంత
వెడలినాడు తండ్రి • వీటి కపుడు. 408

సీ. మదగజా రూఢుఁడౌ • మార్తాండ తేజుఁడా
పాదచారిగఁ బోవుఁ • బాట లందు
ప్రథిత ఛత్రాన్విత • పట్టాభి రాముఁడా
భటవర్గ రహితుఁడై • బరఁగుచుండె
సర్వారి జయవీర • సామ్రాజ్య దక్షుఁడా
రాజ్యంబు విడనాడు • రాజు నాజ్ఞ
సకల జగత్ప్రీత • సజ్జనావనమూర్తి
కాన కేగెడు నేఁడు • కర్మ వశత

* తాత = తండ్రి.

తే. స్త్రీ వశుండగు జనకుఁడు • చెప్పఁ మాటఁ
దలను దాల్చుచు వని కేగు • ధర్మమూర్తి
అఖిల లోకైక సత్య ప • రాక్రముండు
ధర్మ వీరుండు వని కేగుఁ • దాత నుడిని. 409

## ప్రజల ఆక్రందనము

తే. రాము పట్టాభిషేక వి • రాజ మానుఁ
గాంచ నుండిన జనములు • కనుల నీరు
నింపుచుఁ గనిరి రథ్యల • నిలిచి యుండి
నడచి చనుచున్న లోకాధి • నాథు రాము. 410

ఉ. జిందర వందరై ప్రజలు • చేరిరి, చేరిరి గుంపు గుంపులై
కొందఱు సౌధ రాజములఁ • గొందఱు చెట్లను గోపురంబులన్
గొందఱు రాజ వీథులనుఁ • గొందల మందుచు పాదచారినిన్
సుందరమూర్తి రాఘవునిఁ • జూడఁగఁ గన్నుల నీరుఁ గార్చుచున్.

ఉ. ప్రాకట *షడ్గుణాన్వితుని • రాముని వీరునిఁ బూరుషోత్తమున్
గైక కతాన వీడు నహా; • క్ష్మాపతి యెంతటి దుష్టచిత్తుఁడో
లోకము ద్రువ్వ దిట్టునని • లోఁ దలపోయఁడొ సుంత యేనియం
చాకుల పాటునం బ్రజలు • నార్తిని నొండొరుతోడఁ బల్కెడిన్. 412

తే. జలము లింకిన చెరువున • జల చరములు
వేసవిని పీడ నొందెడి • విధము గాగ
సర్వ సద్గుణ సంపన్న • సకలవిదుఁడు
రాఘవుఁడు పీడ నొందుట • ప్రజయుఁ గుందు. 413

తే. పుష్ప ఫల పత్ర శోభిత • భూజములను
33/14 మూలవిచ్ఛేద మొనరింపఁ • గూలు రీతి
సర్వ జగతి జగత్పతి • సకలవిదుఁడు
రాము నెడఁబాయఁ జాలక • ప్రజయుఁ గుందు. 414

---

*షడ్గుణములు :— 1. అహింస 2. దయ 3. విద్య 4. సత్యభావము (శీలము) 5. దమము (ఇంద్రియ నిగ్రహము) 6. శమము (కోపము లేకుండుట)

తే. పుష్ప ఫల పత్ర శాఖలే • పుడమి జనులు
శ్రీకే మూలమగు రాఘవుండె యా • భూజమునకు
మానవుల కెల్ల మూలమౌ • మా విభుండు
జాములకు జిక్కెనంచని • ప్రజయుఁ గుందు. 415

తే. సిరిని సర్వంబు నర్థులఁ • జేతఁ బెట్టి
సర్వ ధర్మ సారంబు, ర • సజ్ఞమూర్తి
రామచంద్రుండు, వీడునే • రాజు వీనిఁ
దయ్యామేదియొ సోఁకెనో • దశరథునకు. 416

తే. ఆ యతివ "అసూర్యం పశ్య" • అడుగు లిడుచు
శ్రీ రాచబాటల వెడలెడి • రాము వెంటఁ
గర్మగతి యెంత గట్టిదో • కాంచలేము
కాని నేఁడహా *మా మాతఁ • గాంచినాము. 417

చ. మన జనరాము వీడి మన • మా మనజాఽము, కాని, తండ్రియా
నను జవదాటుమోయి రఘు • నాయక యంచనఁ బాటిసేయఁ డా
అనుపమ రామచంద్రుఁ డక • టా! యిక చేసెడి, దేమి? యీ యయో
ధ్యను విడనాడి రాఘవు ప • దంబుల వెంబడి పోవనౌ గదా. 418

చ. జనము త్యజింపఁ బాడయి శ్మ • శానముగా నగు నీ యయోధ్యలో
వనచరముల్ చొరంగ నగుఁ • బాములు స్వైర విహారమూను దీ
నిని భరతుండు కైక సుతు • నిన్ బరిపాలన సేయనిమ్మహో
మనకు వనీ నివాసము స • మంచితమౌ మన రాము వెంబడిన్. 419

క. అనుచున్ బౌరులు నిశ్చల
మనమునఁ జనినారు రాము • మార్గము వెంటన్
జన విభు సౌధముఁ జేరిరి
మనసుల దుఃఖించి వేరు • మార్గము గనమిన్. 420

## రాముఁడు దశరథుని యాజ్ఞఁ గోరుట

తే. రాజ సౌధంబుఁ డాసిన • రామచంద్రుఁ
గాంచుచు సుమంత్రుఁ డంత శో • కంబు నొంది

*మా మాత = మా తల్లిని = లక్ష్మీదేవియగు తల్లిని. (మా = లక్ష్మి)

య(శుధారల వర్షించు • నతఁడు, తోడ
దశరథ నృపాలునకుఁ జెప్పెఁ • దనయు రాక. 421

ఆ. గ్రహణ మందు నున్న • రవిబింబ మాయన
నీరులేని చెరువు • తీరుపోలె
భస్మమందు నున్న • పావకు చందాన
దశరథుండు కాంతిఁ • దక్కియుండె. 422

తే. రాముఁడు సలక్ష్మణుండయి • రామఁ గూడి
తన్నుఁ గన వచ్చెనంచును • దశరథుఁడు
వినిన తోడ్తోన భార్యలఁ • బిలువనంపె
వారు మున్నూర్వురులకు మించి • వచ్చినారు. 423

తే. హస్తముల మోడ్చి నమ్రుఁడై • అడుగు లిడుచు
దన్నుఁ దరిఁజేరుచుండిన • తనయుఁ జూచి
దశరథుం డంత నెదురేగి • దారి యందు
మూర్ఛకుం జిక్కె దుఃఖ ప్ర • పూర్ణుఁ డగుచు. 424

తే. జానకీ రామ లక్ష్మణుల్ • చయ్యన జని
ఱేని నెత్తి సుఖాసనా • సీనుఁ జేయఁ
గొంతవడిఁ, దెప్పరిలి నీరు • గార్చు కనుల
రెప్పవేయకఁ గనసాగె • ఱేఁడు సుతుల. 425

చ. జనక ! త్వదాజ్ఞమై యిపుడె సాంద్ర • మహా వనవాస యాత్రకున్
జనుచుఁ ద్వదీయ పాదజల • జంబుల సన్నిధి మ్రొక్క వచ్చితిన్
జనకజ ! లక్ష్మణుండు మన • సారగ వెంబడి వచ్చువారు వా
రిని గొనిపో ననుజ్ఞ నిడ • ఱేనిని వేడెడి వాఁడ రాణ్మణీ. 426

## దశరథుఁడు రామునకు సత్యముఁ జెప్పుట

ఉ. పోయెదొ పుత్రకా వనికి ! • మోసమునం బడినాను కైకచే,
నా యభిమాన సూనుఁడ వ • నారత మీవెగ, వన్య భూమికిన్
ద్రోయఁ దలంపు లేదు, విధి • ద్రోసుక వచ్చె వరాల పేరిటన్
నీయది రాజ్యమెల్లఁ గొను • నేర్చున నన్నిక, నిగ్రహించుచున్. 427

ఉ. పోయెదవో పుత్రకా! వనికిఁ • బోయెదొ బాములఁ గుంద, సత్యమున్
బాయని కీర్తి నాకిడగఁ • బాసెదొ రాజ్యము సర్వసౌఖ్యముల్
నీయది కాదె రాజ్యరమ • నేనొక వ్యర్థుఁడ, నిగ్రహించి, నన్
ధీయుత! రాజ్యముం గొనుట • తేఁకువ, ధర్మపరాక్రమాన్వితా. 428

ఉ. నీ మతిఁ ద్రిప్ప నేర్వ, యవ • నీ స్థలి సత్య పరాక్రముండవౌ
రామ! సుధర్మ తత్పర! ప • రమ్ము నిహాంబుల కీర్తి మంతమౌ
నీమము వీడ కుండుట వ • నిం జరియింపగఁ బోయి రమ్మహో
నా మమకార మూర్తి రఘు • నందన నిత్య శుభ ప్రదమ్ముగాన్. 429

తే. సత్య మిది నమ్ము శ్రీరామ • చంద్ర! కైక
ఎప్పుడో అన్న వరముల • నిప్పు డడిగి;
బాస చేయించి వంచనఁ • జేసె నన్ను
సత్యమే నీకు వనవాస • సరణి యయ్యె. 430

తే. కైక వంచన మది కేను • కైవశుండ
నైతి, నీవును రాఘవా • ఆమె హితమె
సఫల మొనరించుచుంటి వా • శ్చర్య మదియె
వంశ గౌరవ నాశిని • వనిత యీమె. 431

తే. మంగళకరంబు క్షేమమౌ • మార్గ మరసి
పోయి రాదగు నాయనా • పోయి రమ్ము
కాని యీరేయి నాయొద్దఁ • గడుపు మిచటఁ
గాంతు కనులార నిశనైనఁ • గలిసి యుండి. 432

తే. నేను నీ తల్లియుం గూడ • నిన్నుఁ గలిసి
గడుప నెంచెద మీ నిశఁ • గన్న తండ్రి
కామ్యములఁ దీర్చి కడతేరఁ • గలము రామ
యనెడి వాత్సల్య భక్తిమై • నవని విభుఁడు. 433

ఉ. నాయన నీ వొసంగు మృదు • నవ్య పదార్థములన్ గ్రహించుచోఁ
బాయఁగఁ జాల నా మధుర • భక్షణ సంస్మృతిఁ; గాననంబు నం
దీ యభిమాన మెట్లు లభి • యించెడి రేపటి నుండి; తండ్రి! నేఁ
బోయెదఁ గామ్య మెంచు తలఁ • పుల్ కడు వ్యర్థములే కదా యికన్.

మ. ధన ధాన్యంబులు రాజ్యమంతయును దా • తా! యిమ్ము కైకమ్మ సూ
నునకున్, దావక సత్య వాక్య గతి సం • తోషించుఁ గైకమ్మ; నే
వనవాసంబున కేగు నిర్ణయమునే • పాటించెదన్; మాతకున్
మనవిం జేసిన రీతి, యీమె హితమే • మన్నింతు సత్యార్థినై. 435

ఉ. కోరను రాజ్యమున్ సుఖముఁ • గోరను, మైథిలినైనఁ గోర, నేఁ
గోరను కామ్య మేదియునుఁ, • గోరను స్వర్గము నేని, ప్రాణమున్
గోరను, నిన్ను సత్యమునె • గోరెద, నంచిదె బాసఁ జేసెదన్
మారదు నా ప్రతిజ్ఞ క్షణ • మైనను, నిల్వఁ దలంప, నిచ్చటన్. 436

తే. శాంతి గను మింక, దుఃఖంబు • సమసి పోవ,
నీదు సత్య వ్రతంబు, నే • నిల్పువాఁడ
ప్రకృతి సౌందర్య సీమలోఁ • బరఁగు వాఁడ
బరగి పదు నాలుగేండ్లును • మఱలు వాఁడ. 437

తే. అనెడి రాముని మాటల • నాలకించి
పుత్రకుని గౌరవించుచు • మూర్ఛ నొందెఁ
బరమ వాత్సల్య రతుఁడగు • దశరథుండు
ధర్మ సత్య రతుండగు • దశరథుండు. 438

తే. అంతి పురమునఁ గల కాంత • లంద అపుడు
గొల్లుమని యేడ్వ సాగిరి • గొంతు లెత్తి
అచటి పరివార జనములు • నార్తిఁ బడిరి
రోదన మయంబు జేని పే • రోలగంబు. 439

తే. వృద్ధుఁడు సుమంత్రుఁడుం గూడ • వెతకుఁ జిక్కి
మూర్ఛ వోయెను నెల్లరు • మూర్ఛఁ గనిరి
రోష భీషణ రోదన • భాషణములఁ
గైక మాత్రము ధీరయై • గ్రాలు చుండె.. 440

తే. కొంత వడి సుమంత్రుఁడు మహా • కుపితుఁ డగుచుఁ
గఠిన వాక్కులఁ బల్కెను • గైకఁ గాంచి
ఆమెయును ఆమె తల్లియు • ననుచితముగ
భర్తృ మరణ కారణములౌ • భార్య లనుచు. 441

తే. భరతుఁ డేలెడి గాక యీ • పట్టణంబు
రాముఁ డుండని పరిసర • ప్రాంత భూమి
బ్రాహ్మణుం డొక్కఁ డేనియు • వరలఁడు సుమ
నేనునుం గూడఁ బోయెదఁ • గాన కిపుడె. 442

తే. పరుల మాటల నిటు సేయఁ • బాడి యగునె
రామ పట్టాభిషేకంబు • గ్రాలఁ జేసి
యశము గనుమమ్మ; యపయశ • మంద కమ్మ!
రాణి; రారాజు భార్యవై • గ్రాలు చుండి. 443

తే. జ్యేష్ఠ పుత్రుండు ధర్మ వి • శిష్ట మూర్తి
శ్రీశ్రీ సర్వ జీవైక రక్షణ • సకల విదుఁడు
రాఘవుఁడు రాజుగా • నుంట ప్రజల హితము
కానియెడ యోగ్యు నెవ్వనిఁ • గాన మిచట. 444

## సుమంత్రుని మాటలు

ద్వి. అనెడి సుమంత్రుని • హాకార వాక్కు
విని కైక మనసేమి • వెతనొందదాయె. 445

తే. మంచి మాటల కైకమ్మ • యెంచఁ బోదు
కఠిన వాక్కుల హృది క్షోభ • కలుఁగ లేదు
వాడ లేదామె మొగమైన • వర్ణ ముడిగి
అచటఁ గల యెల్ల జనతతి • యామెఁ గాంచు. 446

ఉ. మానవ నాథుఁ డంతట సు • మంత్రునిఁ గాంచి పదార్థ సంతతుల్
సైనిక బృందముల్ భటులు • సర్వసుఖాస్పదమౌ గతిన్ వనిన్;
బూనికఁ జేసి పంపు రఘు • పుంగవు వెంబడినంచుఁ బల్కఁగాఁ,
గానసీమ కేగుట సు • ఖంబునకా యనె కైక క్రుద్ధయై. 447

## కైక క్రుద్ధ యగుట

ఆ. సగర చక్రవర్తి • జాలి బొందెనొ మున్ను
జ్యేష్ఠపుత్రు వని వ • సింపఁ బంపఁ
ద్రవ్యగోల మాత్ర • తనయున కిడలేదె
ఫల సంఘర్ష వని • నేల సేన? 448

తే. సగరుఁ డెంచగ మీదు వం • శంబు వాఁడె
ఆతఁ డెటుగ నసమంజు • నడవి కంపె
నటుగ శ్రీరాముఁ బంపుమీ • అడవి కిపుడె
సత్యసంధుండ నను కీర్తి • సత్య మగుత. 449

ఆ. వరము లిచ్చినట్లు; • భాసిల్ల నెంతువు
ఫలిత రహితమైన • వరము లేల ?
భరతుఁ డెట్లు శాంతిఁ • బాలించు రాజ్యంబు
ధనము సేన రాఘు • వుని కొసంగ. 450

ఆ. రాముఁ డూరకున్నె • రాజ్యంబుఁ జేకొను
సైన్య బలముఁ బూని • సంగరమున
అదియ నీ యభీష్ట • మరయంగ దశరథ !
సత్యసంధుని కగు • సరణి యిదియ ! 451

చ. అడవి నయోధ్య సేయ జను • లందఱుఁ బంపఁ దలంచితొక్కొ యి
క్కడఁ బురి పాడొనర్చుచు వి • కావికలై చనురీతి సైన్య మి
విడఁ దలపోయనేల? రఘు • వీరుఁడు సైన్య బలంబుతోఁ బురిన్
విడిచియు స్వేచ్ఛమై మరల • వీడు జయింపగఁ గోరుచుంటివా ? 452

ఆ. జన విహీనమైన • సాకేత నగరంబు
భరతుఁ డేలఁబోడు • పార్థివేంద్ర
వరము లిచ్చి వాని • ఫలితంబు నశియింపఁ
జేయఁ దలఁపొ? యైనఁ • జెప్పు మట్లు. 453

ద్వి. అను కైక మాట కా • అవనీశుఁ డంత
విని దుఃఖభరితుఁడై • వేసారి పలుకు. 454

మును కోర వీరీతి • వని కేగు వానిఁ
బనిఁబూని దుష్టవై • బాధింపనేల. 455

చనువాఁడ శ్రీరాము • వెనువెంట నేనుఁ
గనుమింక మోదంబు • కాంతరో యిటను. 456

భరతుండు నీవునుఁ • బాలింపవచ్చు
ధర నేల నడ్డేమి • దగులకుండంగ 457

తే. భరతుఁ డేలెడి గాక యీ • పట్టణంబు
రాముఁ డుండని పరిసర • ప్రాంత భూమి
బ్రాహ్మణుం డొక్కఁ డేనియు • వరలఁడు సుమ
నేనునుం గూడఁ బోయెదఁ • గాన కిపుడె. 442

తే. పరుల మాటల నిటు సేయఁ • బాడి యగునె
రామ పట్టాభిషేకంబు • గ్రాలఁ జేసి
యశము గనుమమ్మ; యపయశ • మంద కమ్మ!
రాణి; రారాజు భార్యవై • గ్రాలు చుండి. 443

తే. జ్యేష్ఠ పుత్రుండు ధర్మ వి • శిష్ట మూర్తి
338 సర్వ జీవైక రక్షణ • సకల విదుఁడు
రాఘవుఁడు రాజుగా • నుంట ప్రజల హితము
కానియెడ యోగ్యు నెవ్వనిఁ • గాన మిచట. 444

## సుమంత్రుని మాటలు

ద్వి. అనెడి సుమంత్రుని • హాకార వాక్కు
విని కైక మనసేమి • వెతనొందదాయె. 445

తే. మంచి మాటల కైకమ్మ • యెంచఁ బోదు
కఠిన వాక్కుల హృది క్షోభ • కలుఁగ లేదు
వాడ లేదామె మొగమైన • వర్ణ ముడిగి
అచటఁ గల యెల్ల జనతతి • యామెఁ గాంచు. 446

ఉ. మానవ నాథుఁ డంతట సు • మంత్రునిఁ గాంచి పదార్థ సంతతుల్
సైనిక బృందముల్ భటులు • సర్వసుఖాస్పదమౌ గతిన్ వనిన్;
బూనికఁ జేసి పంపు రఘు • పుంగవు వెంబడినంచుఁ బల్కఁగాఁ,
గాననసీమ కేగుట సు • ఖంబునకా యనె కైక క్రుద్ధయై. 447

## కైక క్రుద్ధ యగుట

ఆ. సగర చక్రవర్తి • జాలి బొందెనో మున్ను
జ్యేష్ఠపుత్రు వని వ • సింపఁ బంపఁ
ద్రవ్యగోల మాత్ర • తనయున కిడలేదె
ఫల సంపద వని • నేల సేన? 448

తే. సగరుఁ డెంచగ మీదు వం • శంబు వాఁడె
ఆతఁ డెటుగ నసమంజు • నడవి కంపె
నటుగ శ్రీరాముఁ బంపుమీ • అడవి కిపుడె
సత్యసంధుండ నను కీర్తి • సత్య మగుత. 449

ఆ. వరము లిచ్చినట్లు; • భాసిల్ల నెంతువు
ఫలిత రహితమైన • వరము లేల?
భరతుఁ డెట్లు శాంతిఁ • బాలించు రాజ్యంబు
ధనము సేన రాఘ • వుని కొసంగ. 450

ఆ. రాముఁ డూరకున్నె • రాజ్యంబుఁ జేకొను
సైన్య బలముఁ బూని • సంగరమున
అదియ నీ యభీష్ట • మరయంగ దశరథ!
సత్యసంధుని కగు • సరణి యిదియ! 451

చ. అడవి నయోధ్య సేయ జను • లందఱుఁ బంపఁ దలంచితొక్కొ యి
క్కడఁ బురి పాడొనర్చుచు వి • కావికలై చనురీతి సైన్య మీ
విడఁ దలపోయనేల? రఘు • వీరుఁడు సైన్య బలంబుతోఁ బురిన్
విడిచియు స్వేచ్ఛమై మరల • వీడు జయింపగఁ గోరుచుంటివా? 452

ఆ. జన విహీనమైన • సాకేత నగరంబు
భరతుఁ డేలఁబోడు • పార్థివేంద్ర
వరము లిచ్చి వాని • ఫలితంబు నశియింపఁ
జేయఁ దలఁపొ? రైనఁ • జెప్పు మట్లు. 453

ద్వి. అను కైక మాట కా • అవనీశుఁ డంత
విని దుఃఖభరితుఁడై • వేసారి పలుకు. 454

మును కోర వీరీతి • వని కేగు వానిఁ
బనిఁబూని దుష్టవై • బాధింపనేల. 455

చనువాఁడ శ్రీరాము • వెనువెంట నేనుఁ
గనుమింక మోదంబు • కాంతరో యిటను. 456

భరతుండు నీవునుఁ • బాలింపవచ్చు
ధర నేల నడ్డేమి • దగులకుండంగ 457

ద్వి. మాటలు దడబడ • మౌనంబు దాల్చె
మేటియౌ రారాజు • మేదినీ విభుఁడు. 458

అటనున్న సిద్ధార్థుఁ • డను వృద్ధ మంత్రి
కటువైన మాటల • కైకమ్మ పలుక 459

నెలుగెత్తి కోపించి • పలుకాడఁ దొడఁగె
కులవంశ విఖ్యాతి • కూలఁద్రోసెదవా ! 460

తే. రాము నెడ; కైక! క్రోధ కా • రణ మదేమొ
అడవినిం గూడ సౌఖ్యంబుఁ • బడయరాదొ
రాజ్యమును బాసి వని కేగు • రామునిఁ గనఁ
గనులు చల్లగ లేవొ! కై • కమ్మ యింక ? 461

తే. పురుష పుంగవు మన రాముఁ • బోల్చె దొక్కొ
బాల ఘాతుకు నసమంజ • పాపి తోడ
రాముఁ డొనరించె నే తప్పు • రాణి చెపుమ !
సత్య పరిపాలనార్థమై • చనఁడొ వనికి. 462

ఉ. రాముఁడు లేని చో టడవి, • రాఘవుఁ డుండెడి తా వయోధ్యయౌ,
ప్రేమయె చిందులాడు రఘు • వీరుఁ డహో ! చరియించు చోట శ్రీ
రామునిఁ జూడ నోచెడి చ • రాచర జీవచయంబు ధన్యమౌ,
మేమును రాము వెంటఁ జన • మే యిట సజ్జను లుండ నెంతురే. 463

## రాముఁడు భూషణ సైన్యాదుల నిరాకరించుట

క. తనకై విలపించెడి ఆ
జనకునిఁ గని రాఘవుండు • చయ్యనఁ బలుకున్
వినఁగా కైకయు మాతలు
జనమును, సచివుల్; వెతఁ గొన • సర్వ జనంబుల్. 464

ఉ. భోగము లన్నియున్ విడిచి • పోయెడి నాకు, వనీ నివాసమున్
రాగ విహీనమై గడుప • రామను దొడ్కొని పోవు నాకు, సం
యోగ మదేల యైహిక సు • ఖోద్భవ వస్తు చయంబుతోడ ? నే
భోగ పరాయణత్వమునఁ • బోయెద నొక్కొ వనీ నివాసిఁగా. 465

చ. భరతున కిమ్ము సర్వము, వి • భాసుర రాజ్య రమా ప్రదీప్తుఁడై
ధర నిఁక నేలగాఁ దగిన • తమ్మున కిమ్ము సమస్త భోగముల్
వరద! మదీయ వాంఛితముఁ • బల్కెద, నిమ్మిక నారచీరలన్
ధరఁ బెకలించి మూలములఁ • ద్రవ్వెడి గుద్దలిఁ జేటికన్ నృపా. 466

తే. కంద మూలంబులం దినఁ • గాననమున
నివ్విధమె జాలు వేరేల • నీయ వలయు
సైన్య నివహంబు నాకేల • వన్య భూమి
వివిధ వస్తువు లెల్ల న • ప్రియమె నాకు. 467

తే. దుఃఖముఁ ద్యజింపుమీ తండ్రి • దుఃఖ మేల
కర్మ వీరుండ! సత్య వా • గ్భరిత ధీర
సత్యమునుఁ బాలనం జేయు • సమయ మందు
వెతకుఁ దావుండఁ దగునె? పృ • థ్వీశ! తండ్రి! 468

ఉ. కొండలఁ గుట్టలన్ దరు ని • కుంజ లతా సుమ సుందరాంగి, కొ
ల్వుండ, విహంగ సంతతి మ • హోద్ధతిఁ జారుబుతంబు సల్ప, ను
ద్దండ మృగ ప్రకాండము, స • తంబుఁ జరింపఁగ నాట్య రీతి, నే
నుండఁ దలంతుఁ గానన మ • హోజ్జ్వల సుందరిఁ బూజ సేయుచున్.

ద్వి. అని రాముఁ డను నంత • నచ్చటి వారు
వినలేక పోయిరి • వీరుని మాట. 470

హోరామ హోరామ • యనుచు దుఃఖించు
హోరామ హోరామ • యనుచు శోకించు 471

హోరామ నామమే • యచట వ్యాపించె
శ్రీరామ నాదమే • యందెల్ల నిండె. 472

## కైక శ్రీరామాదులకు నారచీర లిచ్చుట

తే. కాని నారచీరలఁ దెచ్చి • కైక యంత
రామ లక్ష్మణ జానకీ • రాముల కిడె
ఎంచ కేమియు వాని ధ • రించినారు
సోదరులు మౌను లైనారు • చూచు నంత. 473

తే. కట్టఁ దలపెట్టి యత్నించి • కట్టలేక
నారచీరను సీతమ్మ • తేరి చూచుఁ
బతిని, రాముండు తాఁ గట్టెఁ • బత్ని కంత
నచటఁ గలవార లెల్లరు • నార్తిఁ గుంద. 474

తే. కైక యిడ నారచీరను • గట్టునంతఁ
దశరథ నరేశు కోడలు • ధాత్రి జాత
జనకు పుత్రిక కోమలి • సాధ్వి సీతఁ
జూచి సహియింపఁ • జాలరు చూచువారు. 475

ఆ. అంతిపురము వార • లాత్మాభి రాముని
రాముఁ గాంచి; వనికి • రాదు సీత
వరములందు లేదు • భార్యతో వని కేగ
విడుము సీత ననిరి • వెతకుఁ జిక్కి. 476

## *వసిష్ఠుని హితోపదేశము

తే. దశరథు గురుండు వృద్ధుండు • తాపసియును
నగు వసిష్ఠుండు కైకమ్మ • నంతఁ గాంచి
కఠిన వాక్కులఁ బలుకాడఁ • గడఁగె నృపుఁడు,
నమ్రులై యెల్లవారు వి • నంగ వెతను. 477

తే. అధికముగ మాటలాడఁగా • నగునె కైక
ఏల దుర్బుద్ధి? యిఁక వీడ • వే? నృపాలు
వంచన మొనర్చి వరములఁ • బడసినావు
అంతతోఁ దృప్తిఁ గనవొకో, • అవనిజాత 478

తే. కేల నారచీరల నిడి • తీవు చెపుమ
రాఘవున కెంచ వారసు • రాలు సీత

*వసిష్ఠుఁడు: శబ్దార్థము:—"వసుమంతుల యందు నేను శ్రేష్ఠుఁడను గావున వసిష్ఠుఁడను. గృహస్థాశ్రమ మందుండు వారిలో నెల్ల నేను శ్రేష్ఠుఁడను గావున వసిష్ఠుఁడను"— అని వసిష్ఠుఁడే వసిష్ఠ శబ్దార్థము నిర్వచించెను. భారతము: అను., 147 అధ్యా :- వాయువు పృథివి మొదలగునవి స్వాధీనమందు గలవాఁడు వసుమంతుఁడు.

రాముఁ డడవికి నేగిన • రాజ్యమూని
పాలనము సేయఁగా దగు • ప్రభ్వి యీమె
వనికిఁ జనరాదు సీతమ్మ • వనికి రాదు. 479

చ. విను మిదె చెప్పుచుంటి రఘు • వీరుఁడు సీతయు లేని యీ పురిన్
జనము వసింపఁ బోదు సుమ • సైనిక యోధులుఁ గూడఁ బోవు రా
ముని వెను వెంట; నీ ప్రియత • ముండగు, పుత్రుఁడు గూడఁ, బోవఁడే
వనికి, నయోధ్య వీడి తన • భ్రాతను వీడి చరింపఁ డాతఁడున్. 480

తే. దశరథుఁడుఁ గూడ వని కేగఁ • దలఁచుచుండె
దాస దాసీ జనంబులు తరలి • రాగ
ఏనునుం గూడఁ బోయెదఁ • గాన కిపుడె
యిట నయోధ్య వసింపఁ బో • రెవరు గాని. 481

ఆ. పాడువడు నయోధ్యఁ • బాలింపుమీ కైక
చెట్లు చేమల జతఁ • జేరి నీవ
వన మయోధ్య యగు కా • నన సీమగా త్రుటి
మారదో యయోధ్య విను నా • మాట నిజము. 482

తే. దశరథ సుతుండు భరతుండు, • తండ్రి ప్రీతి
తో నొసంగని రాజ్యంబుఁ • బూను నొక్కొ
తల్లి మాటల హిత మెంచి • ధర్మ గతిని
మీఱు వాఁడొకో భరతుండు • మీఱఁ డెపుడు. 483

తే. వంశ విఖ్యాతిఁ గనువాఁడు • భరతుఁ డీవు
గగన సీమకు నెగిరిన • గంతు లిడిన
మాత్ర తల్లినిఁ బాటించి • మహినిఁ గొనఁడు
నిన్నె యరిఁగాఁగఁ దలపోయ • కున్నె సుతుఁడు. 484

చ. కను మిఁక ఆల మందలు మృ • గంబులు పశులు పాదపంబులున్
జనము చరాచరంబులు వ • నంబున కేగెడి రాము వెంట నే;
చనియెడు నా యయోనిజకు • జానకి కిత్తువె నారచీరలన్
బనుపఁ దగున్ దుకూలముల • స్వర్ణ విభూషణ లిచ్చి మైథిలిన్. 485

తే. భర్త వెనువెంటఁ జననున్న • భార్య యీమె
జానకి చలింప దిసుమంత • మౌని నుడిని
ఈర్ష్య బూనిన కైక యో • యింత యేని
జాటి సేయదు కులగురు • పరమ హితము. 486

## రాముఁడు తల్లిని ఒప్పగించుట

తే. ఎవరు చెప్పిన నేమి ? సుం • తేని వినదు
విడువ దా కైక తన పట్టు; • ప్రియ సుతుండు
అడవి కేగుట తథ్యంబ • యనుచు నెంచి
దశరథుండు దుఃఖితుఁ డయి • ధాత్రిఁ బడియె. 487

తే. భూమిపైఁ బడి తలవంచి • పుత్ర శోక
మనుభవించెడి తండ్రికి • నప్పగించెఁ
దనదు తల్లినిఁ, బ్రియపుత్రు • వనికిఁ బంపు
భర్త, నొకమాట నన నట్టి • భార్య యనుచు. 488

తే. ముసలి సతి, యీమె పుత్రుండు • పోవ వనికి
పరమ దుఃఖితయౌ సుమ • పార్థివేంద్ర
ఎటుగ మన్నించి కాపాడు • దీవొ రాజ !
మరలి వచ్చెడి దాక నా • మాత నిచట. 489

## దశరథ శోకము

ద్వి. అనెడి పల్కులు విని • యా రాజరాజు 490
కనులెత్తి కాంచుచు • ముని వేషధారి
పెనగొను కూర్మినిఁ • బెద్దగా నేడ్చి
కనె మూర్ఛ; స్మృతిఁ గాంచి; • కన్నీటఁ బలుకు. 491

ఉ. ఎంతటి ఘోరకృత్యముల • నే నొనరించితి ! నేరి పాపలన్
సుంతయుఁ జాలిలేక మును • స్రుక్కఁగఁ జేసితినో కదా! రమా
కాంతునిఁ బోలు నీ సుతునిఁ • గానకుఁ బంపుచు దుఃఖితాత్మతో
వంతల పాలు కావలసి • వచ్చెనుగా ! విధిదాఁట శక్యమే. 492

ఉ. కాయముఁ బాసి చచ్చుటకుఁ • గాంతు జనించిన నేమి ? ప్రాణమున్
బాయఁగనౌనె కాల మని • వార్యము; నయ్యది రాకమున్నె ? యీ

కాయ మికేల ! సత్య మహా ! ◆ కారణమై వని కంపుచుంటి లే
బ్రాయపు వారలన్ సుగుణ ◆ వర్గమె వంతకు దారిఁ దీసెఁగా. 493

చ. వరదుఁడనై వరంబులనె ◆ ప్రాపిల దుఃఖముఁ గుందుచుంటి నా
వరములుఁ గైకయుం గలిసి ◆ జాములఁ గూర్చెఁ బ్రజాళి కెల్ల, దా
శరథిఁ దలంచి వీరలు వి ◆ చారమునం బడియున్న వార లే
కరణిఁ ద్యజింపనౌ విధి వి ◆ కావికలౌ పురుష ప్రయత్నముల్. 494

తే. అనుచుఁ దనలోన దా నార్తి ◆ నదుము కొనుచుఁ
దన ధనాధ్యక్షునకుఁ జెప్పెఁ ◆ దగిన రీతి
వస్త్రములు స్వర్ణ భూషణ ◆ ప్రతతిఁ దెచ్చి
జానకి కొసంగ నా రీతి ◆ సలిపె నతఁడు. 495

## సీత నగలను ధరించుట

ద్వి. వనజాక్షి సీతకు ◆ పదునాలు గేండ్లు
సనఁ జాలు భూషణ ◆ సంచయం బొసఁగె. 496

తే. వాని ధరియించి వెలుగొందెఁ ◆ బ్రథిత దీప్తి
చంద్రికాభాతి శ్రీరామ ◆ చంద్రు భార్య
కర్మయోగ పరాయణ ◆ ధర్మమూర్తి
సుందర తనూద్యుతిఁ బ్రిపుర ◆ సుందరి యన. 497

తే. అత్త కౌసల్యఁ దరిఁ జేర ◆ ఆమె యపుడు
తెలుప సాగె సతీ ధర్మ ◆ ముల తెఱంగు
జానకియు వాని విని యట్లె ◆ సలుప నెంచి
న త్తకుఁ బ్రణామ మొనరించె ◆ నమిత భక్తి. 498

## రాముఁడు తల్లుల సెలవుఁ గొనుట

తే. ధీరయై తన్ను వని కంపు ◆ వీర మాత
పాద పద్మము లంటుచుఁ ◆ బరమ భక్తి
సలుపుచుఁ బ్రదక్షిణంబును ◆ సకల విదుఁడు
రాఘవుఁడు పల్కెఁ దల్లికి ◆ రాజ్ఞి కంత. 499

చ. పదియును నాలుగేండ్లు క్షణ ◆ భంగురమై చన, నే నయోధ్యకున్
సుదతినిఁ గూడి వచ్చెద వ ◆ సుంధర నేలెడివానిఁ జూడ నో

చెదవు, ప్రశాంతమై నిదురఁ • జెంది తటాలున లేచునంతలో
బదియను నాలుగేండ్లు వన • వాసము తీరెడిఁ జుమ్ము తల్లిరో. 500

తే. అనుచు నోదార్చు మాటల • నంబల కని
ఎల్లరకు మ్రొక్కు; వీడ్కోలు • నీయ వేడు
వినయ మొప్పంగ నిజ ధర్మ • వీరుఁ డపుడు
తల్లు లందఱు శోక సం • తప్త లైరి. 501

తే. పుత్ర విశ్లేష దుఃఖంబుఁ • బొంది యుండు
తండ్రి, సేవించుచుండు మీ • తల్లి, సతము
వెడలి వచ్చెద వనికిఁ దీ • వింపు మమ్మ
అనుచు రాముండు సెల • వొందె అంబల కడ. 502

## లక్ష్మణునకు సుమిత్ర సెలవిచ్చుట

తే. లక్ష్మణుండుఁ గూడ • లక్షణ యుక్తుండు
తల్లిఁ జేరి మ్రొక్కెఁ • దన్నుఁ బంప
నన్నతోడ వనికి, • నంత సుమిత్రయుఁ
గొమరు నెంచి పలికెఁ • గూర్మి మీఱ. 503

చ. పటుతర బాహు విక్రమ వి • భాసుర రాఘవ రాముఁ గొల్వఁగా
9/40 నటవికిఁ బోయి రమ్ము సుత, • అన్ననుఁ గొల్చుట సర్వధర్మమౌ
నటవి నయోధ్యగా; దశర • థా వని పాలునిగాఁగ రాము, ని
చ్చటఁగల నన్నుఁగా, సతము • జానకినిన్, గనుమీ, కుమారకా. 504

చ. *దశరథుఁడౌ గురుం డనుచు • దాశరథిన్ గనుమీ, వనీస్థలిన్,
యశముఁ దలంచి యెంచుము సు • మా, ననుఁ బోలిన మాత సీతఁగా

శ్లో. 9:– స.40– రామం దశరథం విద్ధి మాం విద్ధి జన కాత్మజామ్।
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథా సుఖమ్॥

503మొ॥ 520వఱకుఁగల పద్యములు పై శ్లోకమునకుఁగల వివిధార్థసంపుటి.

*దశరథుఁడు = కన్న తండ్రియగు దశరథుఁడు.

దశరథుఁడు : దశ = పక్షి; (దశః "పక్షివిహంగమ" అని నిఘంటువు) రథుఁడు = వాహనముగా గలవాఁడు–విష్ణువు; పదియవతారముల నెత్తిన వాఁడు; దశ = పది; రథ = దేహము. ["రథో దేహోపి" (నానా.) "దాశార్హో దశరూప భృత్" అని అమరుఁడు.] దశరథుఁడు = పది యవతారముల నెత్తిన విష్ణువు.

నళన నివాస సౌఖ్యములఁ • గానన మెంచు మయోధ్యగా, సదా
భృశ తప ముండి గొల్వఁ దగుఁ • జ్యేష్ఠుని లక్ష్మణ పోయి రాదగున్.

ఉ. రాముని పక్షివాహన వి • రాజిత విష్ణువుగా నెఱుంగుమీ
ఆ మహిజన్ రమా సతిగ • నాత్మ నెఱుంగు, *మయోధ్యయే పరం
ధామముఁగా నెఱుంగుము, వ • నస్థలి; రాఘవ దంపతుల్, వనీ
భూమిఁ జరింప వారి బహు • పూజలఁ దన్పి తరింపుమీ సుతా. 506

సీ. దశరథు స్మరియించి • తమిఁ జూచి రాముని;
ఘనుఁ డెంచ రాముఁడే • యనెద వీవు
జననిని నన్నెంచి • జానకి సేవించి
అర్చింపఁ దగు సీత • ననెద వీవు
ఈ అయోధ్యను వీడి • ఆ అటవిఁ జరించి
అడవియే సుఖమని • యనెద వీవు
పరిపాలనము కంటె • పురికంటె వన భూమి
అర్హమౌ శాంతి కం • చనెద వీవు

తే. స్వీయ బుద్ధిని రాముని • చెంత వనిని
కాపురము సేయఁ బుట్టితో • కమల సేవ
జన్మ తరియింపఁ బుట్టితో • సకల మూర్తి
పోయిరా! లక్ష్మణా! సుత • పోయి రమ్ము. 507

శా. "శ్రీరామ శ్శరణ మ్మ"టంచు బలుకన్ • జెల్వొందు నష్టాక్షరిన్
నోరారన్ జపియించుచున్; హృదిని ముఁన్ను న్నేఁడు, శ్రీ రాఘవున్
ధీరోదాత్తుఁడ వౌచు నిల్చిన నినున్ • దివ్యాత్మునిన్ గంటి నో
శ్రీరామానుజ! పోయి రమ్ము వనికిన్ • సేవించుచున్ రాఘవున్.

శా. తల్లిన్ భార్యను దండ్రినిన్ బురిని మి • త్ర శ్రేణినిన్, వీడఁగా
జెల్లున్; రాఘవ పాద పద్మయుగళిన్ • సేవింపఁగా నెంచి; నీ
యుల్లం బొల్లదు రామునిన్ విడువ, సం • క్షోభింపదే, వీడుచో;
దెల్లం బెల్లయుఁ బోయి రాఁదగు సుతా • దీవించెదన్ బేర్మిమై. 509

ఉ. ఏమఱపాటు లేక త్రుటి • యేనియు, రాముఁడు వన్య సుందరీ
కాముకుఁ డైనచోఁ, బ్రకృతిఁ • గాంచుచు నందు విలీనుఁ డైనచో,

---

*"దేవానాం పూరయోధ్యా" — ఈ శ్రుతి అయోధ్యయే వైకుంఠ మనుచున్నది.

రాముని జానకీ సహితు • రక్షణ సేయఁగ వారి సన్నిధిన్
నీమముతోడ వీడక, వ • నిన్, వసియించెడి దీక్ష నుండుమీ. 510

తే. దశరథుండు †సోపాధిక • తాత యయ్యు
బుత్రులకుఁ గష్టములఁ గూర్చె • పుత్ర; రామ
చంద్రుఁడు *నిరుపాధికుఁడైన • జనకుఁ డయ్యుఁ
బ్రేమమై బ్రోచు నతని సే • వింపు మయ్య. 511

తే. నే జననిని సోపాధిక • మైన దాన
నిన్ను రక్షింపఁగాఁ గల • తెన్నుఁ గనను
జానకియొ స్వభావముననే • జనని నీకు
సల్పు నంతనె ప్రణతిఁ • బ్రసన్న యగును. 512

తే. అరయ వైకుంఠ ధామమే • యగు నయోధ్య;
వని యయోధ్యయా రాముని • యునికి నచట
తల్లి దండ్రులఁ బురిఁ బాసి • తరలి పొమ్ము
జానకీ రాఘవుల సేవ • సలుప వనిని. 513

తే. జానకీ రాఘవులఁ జూచు • చందముననె
నన్ను దశరథుఁ గనుమయ్య • నందనుండ
రాఘవుని వోలె *గురుని మ • ర్యాదఁ గనుము
తండ్రి యెడ దోష మెంచుట • తగదు తనయ. 514

తే. సకల భువనైక మోహన • చక్రవర్తి
పార్థివాత్మజుఁ డిప్పుడు • పాదచారి
మరల రాజాధి రాజుగ • మరలు వాఁడు
వివిధ వాహనారూఢుఁడై • వెలయు వాఁడు. 515

చ. స్థిరమగు భాగ్య భోగములు • చెందని వాఁడని యెంచ బోకు, దా
శరథిని; వీటికిన్ మరలి • శశ్వ దనంత సుఖానుభూతులన్
వరలెడి వాఁడు, వీడె రఘు • వర్యుఁడు, కావటి కుండలో యనం
బరఁగెడి కల్మిలేముల ప్ర • మాణము నెంచకు రాము సేవలో. 516

---

†సోపాధిక తాత = అతనికి జన్మించుట వలన తండ్రి
*నిరుపాధికము = అతనికి జన్మించక పోయినను స్వాభావికమైన తండ్రి
*గురుఁడు = తండ్రి

తే. ఎచట కరిగిన రాఘవుఁ • డెచట నున్న
నెట్టి త్రోవను జనుచున్న • నట్టిత్రోవఁ
దోడు నీడగఁ బోమ్ము సం • తుష్టి తోడ
వీడకుము నీదు కైంకర్య • వృత్తి నెపుడు. 517

తే. కూర్చుమీ యథా సుఖమ్ము న • కుంఠితముగ
భావమునఁ గర్మమున నీదు • పలుకు లందు
ఏగతి వహింప సుఖము ల • భింపఁ గలదో
రామునకు, నాగతిఁ జరించి • రమ్ము తనయ. 518

తే. కైక పుత్రేచ్ఛ నపకీర్తిఁ • గాంచెను గద
పుత్ర ! నేనట్టి యపకీర్తిఁ • బొందఁ దలఁప
భాగవతునకుఁ దల్లినౌ • భాగ్య మబ్బె
తాత ! నీ గతి వర్తించి • ధన్య నౌదు. 519

తే. †దశరథాంశను బుట్టిన • ధర్మమూర్తి
రాఘవుని సఖ్య భావ పు • ర స్సరముగ
దాస్య భావ సంబంధ వి • ధంబు నొంది
నిరత మడవిని సేవించి • మరలి రమ్ము. 520

తే. కంటఁ దడిఁ బెట్ట దా తల్లి • కాన కరుగు
సుతుని దీవించుఁ బోయి రా • సుత యటంచు
రాఘవ పరాత్ముఁడౌ పుత్రు • రామ భక్తుఁ
గాంచి తరియించితి నటంచు • నెంచు హృదిని. 521

ఉ. ఎంతటి పుణ్య మూర్తి యొకో • యీ పరిపూత సుమిత్ర? పల్కదొ
క్కింతయుఁ బెద్ద మాట, హృది • నెంచదు భర్తనుఁ గైకఁ గూర్చి, కా
సంతయు వైర భావము, ప్రి•యంవద యౌచుఁ బ్రసన్నయయ్యె లో
కాంతమునన్ వెలింగెడి మ•హా మహుఁగాఁ గ్రహియించి రాఘవున్.

తే. వనికిఁ బోవు మాట • విని నంత రాముండు
జననిఁ గాంచి, కాంచె • సతినిఁ గూడ
నీ సుమిత్ర సుతుఁడో • ఏగ డేడకుఁ గాని
అన్న యాన లేని • తెన్నుఁ గనఁడు. 523

---

†దశరథాంశ = పదియవతారముల నెత్తినవాని యంశ

ఆ. హితులఁ జూచి రాగ • నేగుమీ యని పల్కి
జనని సతినిఁ జూడఁ • బనుపఁ దలఁప
డన్న రాముఁ డనుజు • నది యేమి హేతువో
అన్న సర్వ మతని • కరయ జగతి. 524

## రాముఁడు అడవికి రథము నెక్కుట

తే. మహిపుఁ డాన నిడుట నా సు • మంత్రుఁ డపుడు
రథము నాయత్త పరచె నా • రాఘవునకు
జానకీ రామ లక్ష్మణుల్ • చయ్యన రథ
మెక్కి రంత ప్రజాఘోష • దిక్కులఁ గన 525

ద్వి. ఎటనున్న జనవార • మట నిల్చియుండె
నటవికిఁ జనుచున్న • యా రాముఁ గనుచు. 526

## ఆశ్వాసాంత పద్యములు

క. నీవే సత్యము శివమును
నీవే సుందరము నీవె • నిఖిలుం డవునున్
నీవే ఆర్యుఁడ వమలుఁడ
వీవే మూలంబ సృష్టి • కెల్లను రామా! 527

క. సత్య పరాక్రమ రామా
సత్య పరుండవును, సత్య • సంధానమునన్
నిత్య పరాక్రముఁ • డవు గద
సత్యమె, నీ విక్రమంబు • జగతి నియంతా! 528

ఉ. మాయ సృజించి నీ విటుగ • మానవులన్ బడఁద్రోసి దాన, దా
దా యను భేదమూర్తులగు • దాసుల బాముల వేడ్కఁ జూతువే
న్యాయమ? యైన వారి కిటు • నాకులఁ, గంచము కాని వారి కీ
వీయఁ దలంతువే, అదియ • యెంచుట నా పని గాదు రాఘవా. 529

తే. బండబారిన హృదయ, ము • ద్దండ గతిని
గష్ట సుఖములఁ బెనఁగొనఁ • గలుగఁ గాదె
మానవుఁడు చేయఁగల దెద్ది? • మహితు నెంచి
కరముఁ జోడించి కాలమ్ముఁ • గడుప వలయు. 530

ఉ. *"శ్రీయుతమైన దివ్యమణి • చేతికిఁ జిక్కఁగఁ బారవైచి, త
చ్ఛాయ యొకింత యున్కిఁ గని• చాలఁ" గ్రహింతురు గాజు పూసకై
ధీయుతులైన వారును వి • ధిం జవదాటఁగ లేరు, సృష్టిలో
మాయకుఁ జిక్కుచున్ మమత • భ్రమగ్గెడి జీవులఁ గావ నీవె కా. 531

ఆ. సత్యసంధుఁడయ్యు • చక్రవర్తి యొకండు
కాటి కాపరి యగు • కర్మగతిని
గరిటఁ జేతఁ బూనె • ఙ్మాతలీంద్రుఁ డొకండు
సతిని వీడి కర్మ • గతినిఁ బట్టి. 532

తే. ధర్మమూర్తియయ్యుఁ • దమ్ములఁ దన్విని
గూడి యడవి కేగె • ఱేఁడొకండు
కర్మ గతిని మీఱ • గలుగునె యెవఁడైన
కాలమెుక్కరీతిఁ • గడువఁబోదు. 533

తే. నీకు అవ్యాజకరుణయే • లేకయున్న
సంచితాగామి ప్రారబ్ధ • సర్వకర్మ
లేనికిలఁ బోవు ? కర్మార్థ • మెటుల సమయు
అనుభవింపక తప్పునే • హరి ! రమేశ ! 534

ఉ. అన్యుల మాటయేల ! జల • జాక్ష ? భవాబ్ధినిఁ దాటఁ జేయు సౌ
జన్యుఁడ వయ్యుఁ గర్మగతి • సాంద్ర మహాటవి సంచరింపవే
వన్య మృగాళిఁగూడి సతి • భార్య చరింపఁగ వెంటనంటి సా
మాన్యుల మాటయేల? అన • మాన్య కృపన్ హరి ! బ్రోవఁగా వలెన్.

గోవింద రామాయణము—పాదుకా పట్టాభిషేకము అను కావ్యమున-
తృతీయాశ్వాసమగు సత్యాశ్వాసము — సమాప్తము.

---

*కళాపూర్ణోదయం.

# గోవింద రామాయణము

## పాదుకా పట్టాభిషేకము

### భక్తాశ్వాసము

క. నీవే నారాయణుఁడవు
నీవే శ్రీకుండ వరయ • నీవే హరివిన్
నీవే గురుఁడవు హితుఁడవు
నీవే మా తోడు నీడ • నిజముగ రామా. 1

### శ్రీరామ వన ప్రస్థానము - పౌరులు వెంటాడుట

ఆ. తేరు పార సాగెఁ • దెల్ల పోవుచుఁ బ్రజ
చేతు లెత్తి ప్రణతి • చేయు చుండి
స్యందనమ్ము వెంటఁ • జనుచున్న వారహా
తల్లి వెంటఁ బడెడి • పిల్లలట్లు. 2

ఆ. గోవు లేగ వెంటఁ • బోవు విధంబున
పరువు లెత్తు రథముఁ • బట్టి జనము
పైకి లేచి ధూళి • యాకసం బంటెడి
త్రోవఁ గనక రథము • తొట్రు వడఁగ. 3

తే. వృద్ధులు తలలు నెరసిన • బ్రాహ్మణ తతి
తలలు కంపింప, వణఁకెడి • తనువు తోడ
తేరు వెంబడి పరువెత్తు • వార లెట్లొ
కరములు మొగిడ్చి శిరములఁ, • గనఁగ రాము. 4

చ. ఏ యపకారముస్ సలిపె • నీ రఘురాముఁడు మీ కహో, వడిన్
బోయెడి; కాన మార్గమునఁ • బోవఁగ నింక తిరస్కరింపరే!
యీాయన సర్వ భూత హితుఁ • డే, యనుకంపఁ గలాడు మీపయిన్
బాయఁ దలంతురే, ప్రభుని • వాసము, గుట్టము లార మీఱలున్. 5

క. అనుచున్ బరువిడి వచ్చెడి
జనతతిఁ గని రాఘవుండు • సంప్రీతి ననున్
చనుడీ మీర లయోధ్యకు
మనఁగా నిజ ధర్మ సత్య • మార్గము నందున్. 6

ఉ. వీడుచు నగ్నిహోత్రముల • వీడఁగ నౌ నొకో తల్లి దండ్రులన్
వీడుట న్యాయమా సతుల • వీడఁగఁజెల్లునె పుత్ర పౌత్రులన్
వీడుట ధర్మమా హితుల • వీడుచు స్వీయ గృహాంగణంబులన్
బాడియె నన్నుఁ బట్టి వనిఁ • బట్టుట మీరలు బ్రాహ్మణోత్తముల్. 7

చ. భరతుఁడు ధర్మ తత్పరుఁడు • పాలన జేసెడి మిమ్ము మీ కికన్
బరఁగు విభుండుఁగా, సుజన • వర్గము భీతిల నేల? పౌరు లా
దరమున వానిఁ గొల్వఁ దగు • ధర్మము మీ కది, చేరు డింట్ల కం
చరమర లేక రాముఁడు ద•యామయుఁ డయ్యెను బల్కె వారికిన్. 8

తే. దాశరథి పల్కు పల్కులఁ • దాము వినియు
మరలి వెడల రయోధ్యకు, • మానరైరి
పరువు లెత్తుచుఁ దేరు వెం • బడినిఁ బోవ,
పౌర సంతతి బ్రాహ్మణ • వర్గ మెలమి. 9

తే. తమకు సర్వస్వ మా రామ • ధరణి విభుఁడె
యనుచు శరణార్థులై యున్న • జనము వారు
వీడఁగా లేక రామునిఁ • బ్రేమ మీఱ
పలుకరింపంగ రథము వెం • బడినిఁ బడిరి. 10

క. వడి వడి పోయెడి తేరును
పుడమి యొడయఁ డరసి యరసి • పొక్కుచు మదిలోన్
వెడలకు నిలు నిలు మని పో
యెడి త్వరితంబుగ రథంబు • నేగెడి రథ్యన్. 11

శా. ఓ రామా! రఘు నందనా! ప్రియతమా! • ఓ సత్యవాక్పాలకా!
ధీరోదాత్త! సమస్త లోక విభవా! • దివ్య స్వరూపా! మమున్
వీరా! యీ గతి వీడిపోదువె యిటన్ • వేరెవ్వ రొక్కో? కృపా
పారీణా! యిక దిక్కు మాకు ప్రజలన్ • బాటింపవా? రాఘవా! 12

ఉ. అను ఘోషన్ వెను వెంటనే చనిరి, లో • కారాధ్యునిన్ జూడఁగా
జనముల్ కొందఱు, కొందఱల్లె భువి మూ•ర్ఛంగూలి రా_ర్తిన్ వ్యథన్
వనికిన్ బోకుము రామచంద్ర యనుచున్ • వారించుచున్ గొంద ఱా
ననముల్ పైకెగయంగఁ జూచెదరు సం•తాపంబునన్ గ్రుంగుచున్. 13

ఉ. ఆపుము సారథీ ! రథము • నాపుము వాజులఁ దోలకుండ, మా
ప్రాపగు రామచంద్రుఁడు ని • వాస మొనర్చునో వన్య భూమిలో
ఆపుము చూచి పోదు మిపు • డా_ర్త శరణ్యు మరొక్క మారు, సం
తాప మహాగ్ని దగ్ధులము • దాశరథీ కృపఁ జూడవో మమున్. 14

క. అటు పలుకాడెడి తండ్రిని
నిటు వెంబడి వచ్చు జనుల • నీక్షించుచునే,
దిటవరియై చను వని కహ
కటకట! రాముండు ధర్మ • కర్మమె తలఁచున్. 15

ఉ. సారథియౌ సుమంత్రుఁడు వి • శాంపతి కోర్కెను దీర్ప నెంచియున్
దేరు వడిం జనంగ నగు • తీరున వాజులఁ దోలు, రాముఁడే
కోరిన రీతి, నెల్ల ప్రజ • కుయ్యిడి కుందుచుఁ జూపు మేరగా
దూరము నుండి కాంచెఁ గడుఁ•దొందరగాఁ జను, స్యందనంబునున్. 16

తే. తేరు కనుమేర దాఁటె పృ • థ్వీశుఁ డంతఁ
జేష్టలను దక్కి రాముపై • దృష్టి నిలిపె
రాఘవుం డోర కంటను • రాజుఁ గాంచుఁ
దన్ను వెంటాడు తండ్రినిఁ • దాల్మి తోడ. 17

తే. తేరు సాగఁగ వెడలుచు • నోర గంట
తల్లి దండ్రులఁ గాంచెడి • దాశరథియు
వత్స రాముండు వాత్సల్య • వంతుఁ డగుచుఁ
గాంచి జననీ జనకుల క • గమ్యుఁ డయ్యె. 18

తే. తన్ను వెంటాడు చుండు నా • పన్నులఁ గని
ప్రజను మాతా పితల స్త్రీల • బాంధవులను
నెల్లరను బాసి రాఘవుం • డేగు వనికిఁ
దనను గొండాడు మాటల • వినియు వినక. 19

తే. ఆ రథోద్ధూతమౌ దుమ్ము • నల్లె చూచుఁ
జూచు చున్నంత నంతలో • జూపు మేర
నదియుఁ గనిపించ లేదు శూ • న్యమ్ము గాగ
జగతి సర్వమ్ముఁ దోచె భూ • జాని కపుడు. 20

తే. తనకుఁ దా నాత్మ శంకించుఁ • దన యకృతికిఁ
బ్రకృతి కోపించి దారుణ • రక్త వర్ణ
యయ్యెనా యన దుమ్ముచే • నలము కొనిన
అతల కుతలంబులే చూడ • నాయె ఱేఁడు. 21

ఉ. కన్నుల నీరుఁ గార్చెడిని, • కాల్వలుగాఁ జెలరేగు ధూళి యా
తెన్నును గూడఁ గప్పెను, స • తీమణు లెల్లరు సేయు ఘోష, హృ
ద్భిన్నము గాదె, కోపమునఁ • దేజముఁ బాసి చనంగ నుండెనా
యన్న తెఱంగుఁ దోచు రవి, • యంత నృపాలున కేమి కన్పడున్. 22

తే. రాముని రథంబు వోయిన • రథ్య వైపుఁ
గాంచి రారాజు రజమైనఁ • గాన రాక
నిస్పృహుండయి క్రుంగెను • నేల కంతఁ
గాల్వలై కారఁ గన్నీరు • కడవ వోత. 23

తే. నేలఁబడి యేడ్చు రారాజు, • కాల మహిమ!
అంత కౌసల్యయును గైక • నతని ముట్టి
పట్టి యెత్తుచుఁ జేర్పఁగాఁ • బ్రభుఁ గృహంబు
పూని నంతనె కోపించి • పుడమి ఱేఁడు. 24

తే. కైక తను ముట్ట నొల్లక • కసరి భర్త;
ఇహ పరంబుల రెండింట • నేను నిన్ను
విడిచి పుచ్చితి నాత్మీయు • వీడ హేతు
వైన నిన్నింక నొల్ల న • టంచుఁ బలికె. 25

తే. కేవలార్థమ్మె కోరు కై • కేయి నిన్ను
ధర్మమును వీడి యుండిన • దాన నిన్ను
వీడుచున్నాఁడ నిన్నిదే • వీడువాఁడ
కైక! దుస్సహమాయె నీ • కరము నాకు. 26

ఉ. ఎంచవు ధర్మ మార్గము, వ • రింతువు స్వార్థము, దుష్టచిత్త! నిన్
గాంచఁ దలంచఁ బోను, దరిఁ • గానఁగ నొల్లను, ముట్టఁ బోను, నిన్
వంచనఁ జేసి ఆత్మ విభు • బాలుని వీడఁగఁ జేసినావు, నీ
పంచ క్షణంబ యేని నిలు • వన్ హృది యొప్పదు ప్రాణ ఘాతుకీ. 27

తే. రాజ్య మేలు మింక విధవ • రాలి వగుచు
జానకీ రామ లక్ష్మణుల్ • గాన రారు
బ్రతుకఁ జాలను క్షణమేని • బ్రతుకఁ జాల
నిలువఁ జాలను నీ చెంత • నిముసమేని. 28

తే. నీదు కోరిక నెరవేరె • నేల నేల,
భరతుఁడే సంతసంబున • బాలనంబు
సేయఁ బూనిన, నాతఁడు • సేయు నపర
కర్మ, చెంద కుండెడి గాత • కైక నాకు. 29

తే. అనుచు మంత్రుల హితమెంచి • యవని విభుఁడు
మరలె శూన్యమ్ముగాఁ దోఁచు • పురికి, సతులు
తోడుగా రాగఁ బుత్రులు • వీడి చనిన
వీటి కేగెను నిర్జన • వాటి కపుడు. 30

## అయోధ్య వివర్ణత

శా. హాహాకార విజృంభమాణ భయ శో • కార్తుల్ దివంబంట, వ్యా
మోహాత్ముల్ రఘు నందనున్ దలఁచుచున్ • మూర్ఛిల్లి రెల్లన్ దిశల్
స్వాహా నాదము లెల్ల మాటు మడగెన్ • సంక్షోభ సంకీర్ణమై
దేహంబుల్ దిరుగాడు దత్పురములో • దేజో విహీనంబుగన్. 31

ఉ. రాముఁ డయోధ్య వీడి చన • రథ్యల రామలు బాల బాలికా
స్తోమము వృద్ధులున్ హయ త • తుల్ గజముల్ తిరుగాడు చుండె వే
రేమి తలంపు లేక పృథి • వీశుఁడు రాముఁ దలంచు చుండె ఆ
రామము లన్ని పాడు వడె • రమ్యత వోయె, నయోధ్య కత్తరిన్. 32

సీ. పాపలు పాలకై • ప్రాకులాడఁగఁ బోరు
తల్లులు పాలీయ • నొల్లరైరి
పోరు వెట్టిన భంగి • పొర్లాడు పొత్తిళ్ల
పసి కూనలును • శాంతిఁ బడయరైరి

చరియింపఁ జాలని • ధరణిజములుఁ గూడ
ఉరవడి పోవగా • నూగులాడు
హృదిఁ గల తలఁపుల • నెఱుక సేయఁగ లేక
పతులు రొద సేయుఁ • బాటి పాటి

తే. మోర లెత్తుచు గోవులు • పారి పోవు
తల్లులను వీడి లేగలు • తరలు నెటకొ
కలగుచుఁ జరాచరావళి • గతులఁ బాసె
జానకీ రామ విశ్లేష • జలధి మునిగి. 33

ఉ. మాయలమారి కుబ్జ తన • మాయకు లోఁబడఁ జేసి, మార్చె కై
కేయిని దుష్ట చిత్తగఁ, బ్ర • కీర్ణ తమోమయ మూర్తిగా, మమున్
బాయఁగఁ జేసె రాఘవుని • భక్త జనావను భక్త భక్తునిన్
ధ్యేయుని, నీదు సన్నిధి వి • ధిన్ విడ నాడఁగ వచ్చె రాఘవా. 34

ఉ. హీన గతిన్ జరింపనగు • నే, రఘు రాముని పట్ల రాజ్యముం
బూనఁ దలంచి కైక, తన • పుత్రుఁడు రాముని కంటె మేటియా?
ధైన రమా విభూతిఁ బడ • యం దలపోయఁగ వచ్చు, నంతతో
మానక, కాన కంపుటొకొ • మాన్యుని మా రఘురామ సద్విభున్. 35

ఉ. రామ! ప్రియంవదా! సుజన • రామ! త్వదీయ మనోహరాకృతిన్
నీమము తోడఁ గాంచుచు, బు • నీతులమై చరియించుచున్న, మ
మ్మో మహితాత్మ! వీడి చను • దో! మరి యెన్నడు నిన్ను జూతు
మో మమకార మూర్తి యిట • నుందుము ప్రాణము బట్టి యెట్టులో

తే. సీత కృత కృత్య రామునిఁ • జెట్టఁ బట్టి
$\frac{40}{24}$ వనికి నేగెడు విశ్లేష • భయము లేక
పూర్వ సంధ్యను విస్మృతిఁ • బొంద లేదొ
మాయకుం జిక్కి యుండి మా • మాత సీత. 37

తే. లక్ష్మణుం డెంత సుగుణ వి • లక్షణుండు
దాశరథి పరిచర్య ని • తాంత మూను
నతఁడె సిద్ధార్థి తాపసి • యతఁడె యతఁడె
స్వర్గమని యెంచు రాఘవు • సన్నిధి నెద.

తే. సఖ్య భక్తిని రాఘవు • సహచరుండు
దాస్య భక్తిని శ్రీరాము • దాస వరుఁడు
ప్రథిత రాఘవ సేవా ప్ర • పన్నుఁ డతఁడు
లక్ష్మణుండు తరించు వి • లక్షణుండు. 39

తే. కఠిన హృదయురాలు • కౌసల్య; కొమరుండు
కానకేగ హృదయ • గహ్వరమ్ము
భిన్న భిన్న మౌచు • ప్రీగదొ; అటు కాదు
ఆమె సుప్రసన్న • అనఘు, మాత. 40

తే. కాముకుని దుర్గతినిఁ బొంది • కంట నీట
మూర్ఛిలుచు దేలుచున్నాఁడు • భూ విభుండు
రాహు నోటను బడియున్న • రవి విధంబుఁ
బ్రభల గోల్పోయి జీవశ్చ • వంబు వోలె. 41

ఉ. రామ ! జయంబు నీ కగుఁ; బ • రాత్పర! మౌని మనో విహార! శ్రీ
రామ ! జయంబు; దుర్జన వి • రామ జయంబు; సుధర్మ పాలనా
రామ జయంబు; భక్త జన • రంజిత సర్వ గుణాభిరామ, మా
రామ జయంబు; మంగళక•రా! జయ మంగళ మౌత; రాఘవా. 42

క. అనుచున్ బలు రీతుల రా
మునిఁ దలపోయుచు నయోధ్య • పురజన మెల్లన్
మనముల శ్రీరామార్పణ
మొనరించిరి వానిఁ; గన న • యోధ్యన్ మరలన్. 43

తే. గ్రహణమున నున్న శశివోలె • రవియు వోలె
యోగమును వీడి యొప్పు న • యోధ్య యెల్ల
నడవి యందలి జంతు వి • హార సరణి
యోజ విడనాడి యొప్పు న • యోధ్య జనము. 44

తే. తన్వి తొలి చూలు నందు బు • త్రకునిఁ గాంచి
సంతసింపదు రాఘవు • సరణి నెంచి
గృహిణులుం గూడ వంటల • నెంచఁ బోరు
రాము నెడబాటు సహియింప • రానిదగుట. 45

తే. లోక బాంధవుఁ డస్తాద్రి • లో మునింగె
చీకటులు గ్రమ్మెఁ బురి వీడ • శ్రీ కరుండు
కాంతి విడనాడి చుక్కల • గమియు నుండె
భూ-నభోంతర మెల్ల వా • పోవఁ గడఁగె. 46

## స్త్రీల విలాపము

తే. అంతిపుర మెల్ల రోదనా • క్రాంత మయ్యె
స్వీయ పుత్రకుఁ బాసిన • విధము గాగ
నేడ్వ సాగిరి దశరథు • నింతు లపుడు
భూధవుఁడు వించు నా ఘోషఁ • బొక్కి పొక్కి. 47

ఉ. వ్రతముల సల్పి సల్పి హరిఁ • బ్రార్థనఁ జేసియుఁ జేసి చేసి స
ద్వ్రతు రఘురామ చంద్రుఁ గని• భక్తిని, బ్రేమను బెంచి పెంచి యీ
గతి నెడబాటుఁ బొంది కడుఁ • గాసిల దొక్కొ సతీలలామ, ఏ
గతి యొనఁగూడునో సుతుని • గాంచితి నేనని తల్లి యెంచెడిన్. 48

తే. చిఱుతఁడగు రామచంద్రుని • జేర్చి యొడిని
ముద్దు లాడితిఁ దల్లిఁగా • మున్ను ప్రేమ
వీడు విడనాడి వనికేగి • నాడె నేఁడు
ఉద్ధరించునె యీ పాపఁ • డుర్వి నన్ను. 49

ఉ. ఎచ్చటి కేగెదో రఘుప • తీ! పర దుఃఖమె నీకు దుఃఖమౌ
హెచ్చుగఁ, గోపమూనక స • హింతువు నిందల మోపువారలన్
బొచ్చెము లేక కోపమును • బొందిన వారల నూఱడింపవో
సచ్చరితా! మహాత్మ!, మము•సంతత మెంతువు స్వీయ మాతగా. 50

ఉ. రాముఁ డనాథ నాథుఁడు శ • రణ్యుఁడు దుర్బల కోటి కెల్ల; మా
రాముఁడె తాపసాళికి శ • రణ్యుఁడు గూడ జన ప్రకాండమే
రాము సతమ్ము నెమ్మది వి • రామము లేక తలంచుఁ బ్రాప్య సం
ధామము గాఁగ సద్గతికి, • దాశరథీ యెట కేగ నుంటివో. 51

తే. సర్వ జనులకు జగతికి • సత మెవం డ
హో పరిత్రాత అవ్వాఁ డ • యోధ్య వీడి
అడవి కేగెడు కైకమ్మ • యభిమతమ్ము
తలను దాల్చిన జేని హి • తంబు నెంచి. 52

తే. అనుచు నెలుగెత్తి యేడ్చిరా • అవని నాథు
భార్య లెల్లరు శ్రీరాము • వత్స నెంచి
వారి రోదనమ్మును విని • వల్లభుండు
కనులు చిల్లులు వోయెడి • కరణి నేడ్చె. 53

## దశరథ విలాపము

ఉ. నా సుకుమార పుత్ర! సుమ • న స్థలి నిత్య విహార! వన్య భూ
వాసము సేయు దొక్కొ పరి • వార జనావృత సేవ్య మూర్తివై
భాసిలు నీవు, ఘోర మృగ • వార పరివృత కాన నంబునన్
గాసిలు చుందు వొక్కొ, రఘు • కాంతుఁ డహో వనవాసి యయ్యెనా.

సీ. సౌధ రాజ విహార • సామ్రాజ్య నాథుఁడే
వనవాసియై నేఁడు • పరఁగు నొక్కొ
మృష్టాన్న సంతృప్తి • మెలఁగు భూమీశుఁడే
కంద మూలంబులఁ • గ్రహించుఁ డొక్కొ
సుకుమార పర్యంక • శోభిత లలితుఁడే
ఇల నింతితో పవ • ళించు నొక్కొ
మద గజాశ్వ రథాఢ్య • మహనీయ మహితుఁడే
ఘోరాట విని బాద • చారి యొక్కొ

తే. సుఖము దుఃఖమ్ము • సమముగాఁ • జూచు వాఁడు
4 1/9 ధర్మ సత్య పరాక్రమ • కర్మ పరుఁడు
సతము భార్యా సమేతుండు • సానుజుండు
జీవలోక ప్రియుండు వ • సించునె వని. 55

తే. చందన మలందికొని సువా • సనలఁ గూర్చు
సుందరాంగన లెందఱో • సురటి వీవ
హాయిగాఁ బవ్వళించు లో • కాధినేత
ఎట్లు తరుమూలమున నిదు • రించు వాఁడొ. 56

తే. కరమొ రాయియొ రప్పయో • శిరముఁ జేర్చి
4 1/8 దిండుగాఁ బవ్వళించెడి • దీనుఁ డగుచు
లోక నాథుం డనాథుఁడై • లోకముఁగన
నేటి రేయిని నతఁ డేడ • నిద్రపోవు. 57

తే. అనుచు గద్గద స్వరమున • నవని విభుఁడు
తనదు పరివారమునుఁ జేరి • తన్నుఁ జేర్పు
మనియెఁ గౌసల్య చెంతకు, • నంత వారు
మహిపుఁ జేర్చి నారలు రాము • మాత కడకు. 58

తే. కనులు గానరావు • కౌసల్య విభునకు
కనులు మూసి రాముఁ • గాంచు నెదుటఁ
గనగఁ నొల్లఁడేరిఁ; • గాంతించు రామునే
యింద్రియంబు లైదు • నేకగతిని. 59

తే. కాంచుఁ గాంచు నెదుటఁ • గమలాతు రూపంబు
దశరథుండు రామ • తత్పరుండు
కనగఁ జాలఁడంత • గౌసల్య సతిఁ గూడ
గనఁ డనన్య పరాయణ • గాంచు నొరుల. 60

మ. నిదురం జెందఁడు రాజ రాజు మది సుం • తేనిన్ బ్రశాంతంబుగా
కుదురుం జెందదు రామ రామ యని సం• క్షోభించు హా రామ యం
చెదురన్ రామునిఁ గాంచుచున్న గతి నెం • తే బిట్టుగా నేడ్చెడిన్
హృదయాంతర్గత శోక వహ్ని వశుఁడై • యే రీతి నిద్రించెడిన్. 61

ఉ. కన్నులు కానరావు రఘు • కాంతుఁడు రాముని వెంబడించె నా
కన్నులఁ జూపు నిన్నయినఁ • గానఁగఁ జాలవు; నీ స్వరంబు రా
మన్నకుఁ దల్లి వంచు గుఱు • తయ్యెడి; రాదిక నాదు దృష్టి ఓ
సన్నుత శీల నాదరికిఁ • జయ్యన రమ్మిక మేను దట్టఁగా. 62

తే. రమ్ము దరి రమ్ము పరిపూత • రాము మాత
సర్వ లోకైక రంజితు • జనని వీవు
నీదు చల్లని కరమున • నాదు మేను
దట్టుమీ తాప మంతటఁ • దగ్గునేమొ. 63

చ. సతతము రామచంద్రుఁ గని • శాంతి మెయిన్ రహిఁ జెందు దృష్టి నేఁ
డతనిని వీడి యుండఁ గల • దా! పరుగెత్తెను దేరు వెంట సం
తత గుణరామ సింధువునఁ • దన్మయమైన మదీయ దృష్టి ప
కతమున వేరు గాఁగలదు! • కన్నుల చూపిక రాదు వెన్కకున్. 64

తే. కోటి చంద్రులు సరిరాని • కోమలుండు
సుందరాంగుండు నభిరాముఁ • జొచ్చె దృష్టి
నాదు చూడ్కులు మఱి రావు • నాకు, రాఘ
వుని మనోహర రూపమే • పొందె వాని. 65

తే. సురతతికి మానవాళికిఁ • జూడ్కియైన
రాముఁ డేగఁగ వెను వెంటఁ • బోమె మేము
అనెడి గతి దృష్టి యేగె రా • మయ్య వెంట
సుందరాకృతి మఱిగిన • చోటు విడదు. 66

తే. ఆరు వే లేండ్లు పుత్రార్థి • యైన దృష్టి
నిత్యమును రాముఁ గాంచెడి • నియత దృష్టి
చూచి నంతనె యుప్పొంగు • చుండు దృష్టి
స్థిరముగాఁ బొందె రాముని • స్నేహ మిపుడు. 67

తే. పృథివి నధిపులు నూతన • ప్రియులు గారె
క్షణము క్షణమునఁ గ్రొత్తయై • క్రాలు రాము
దివ్య సౌందర్య లహరిలోఁ • దేలి యాడు
దృక్కు లిక రావు మరలి నా • దిక్కు రావు. 68

తే. నా యదియె దృష్టి యని, తల • పోయ రాదు
నాది నాకడ నుండుఁగా, • నాది కాదు
రాఘవుని దైన దృష్టి యా • రాముఁ జేరె
దాని మమకారమునఁ జేసి • తలఁచు చుంటి. 69

తే. దుష్ట, ధర్మ విహీన, ని • కృష్ట జీవ,
కైక, నికఁ జూడ నొల్లక • కదలి పోయె
మరలి రాదింక నా దృష్టి • మరలి రాదు
జన్మ రహితంబుఁగా రాము • సంక్రమించె. 70

తే. దానఁ జేసియె నిన్నైనఁ • గాన కుంటి
లోక భర్తను గనినట్టి • నీకు నేనె
దుఃఖ మొనఁ గూర్చి యుంటిని • దోషి నౌట
నన్ను ముట్టఁగ రాదని • యెన్న వలదు. 71

తే. రాముఁడే వచ్చి తాఁకినఁ • బ్రాణ ముండు
రాడుగా వాఁడు నిలువదు • ప్రాణ మింక
కొంత తడవైన నిలచెడి, • కూర్మి నీవు
రాము మాతరో తను వంట, • రమ్ము రమ్ము. 72

తే. భాగవతులు స్పృశించిన • భార ముడుగు
ననుచు నడిరేయి విలపించు • నతివఁ బిలుచు
కాళ రాత్రిగ నుండిన • కాల గతిని
దశరథ నృపుండు శ్రీరామ • తత్పరుండు. 73

తే. అంత కౌసల్య భర్త ప • ర్యంక మూని
రాము నెడఁ బాటు సహియింప • రానిదయ్యు
విభుని సంతాప మగ్ను సే • వించు చుండి
తగిన యుపచర్య నొనరించుఁ • దాప ముడుగ. 74

తే. ఆమె యిల్లాలు తన మృదు • హస్త యుగళి
భర్తను స్పృశించుఁ • బరితాప భారముడుపఁ
దానుఁగూడ విలాపించు • తరుణ మందు
భర్త దరిఁజేరి నడిరేయి • భార్య యగుట. 75

కౌసల్య విలాపము

తే. పుత్ర శోకార్త కౌసల్య • పుడమి ఱేని
దుఃఖితునిఁ గాంచి పలుకాడఁ దొడఁగె నంత
రాజ! కైక చేసెను జేయ • రాని కీడు
పురుష సింహంబు శ్రీరామ • నర వరునకు. 76

తే. కుబుసమును వీడి పన్నగి • కూడె నింట
ఎట్టి యిక్కట్టులను నన్నుఁ • బెట్టునో కద!
వనికిఁ బంపుట కంటె నా • వత్స రాము
భరతునకు సేవ సేయుచుఁ • బురము నందె 77

తే. బిచ్చ మెత్తుచు బ్రతుకంగ • నిచ్చ గించి
యుండ నిచ్చిన నాముందె • యుండు వాఁడు
కైక వర మట్టిదే యైనఁ • గన్న బిడ్డ
కనులు కెడఁబాటు గాకుండ • మనెడి వాఁడు. 78

ఉ. *సవ్వడి లేదు యౌవనులు • జానకియున్ రఘురామ లక్ష్మణుల్
జవ్వన మందుఁ బొందు సుఖ • సంపదలన్ విడనాడి యెట్లుపో
అవ్వని కంద మూలము, ల • హర్నిశలున్ భుజియించి యుందురో
నొవ్వక; దండ్రి చేతకుఁ ద • నూ విభవంబులఁ గోలి పోదురో. 79

ఉ. ఎన్నడు చూతునో రఘు వ • రేశుని మోము, మనోజ్ఞ కాంతి సం
పన్నము, నంబుజాతుని, శు • భ ప్రద బింబము, సుప్రసన్న భా
వోన్నతి సంప్రయుక్తము, ప • యోధర నీల విలాస వంతమున్
సన్నుతమున్ శివంకరము • స్వర్ణ విభూషణ దీప్య మానమున్. 80

శా. రారా! నా సుకుమార సుందర తనూ • లావణ్య విభ్రాజితా
ఈ రాజుం గనుమోయి; విహ్వలుఁడు, పో • నీ నన్ను జూడంగ రా;
నీ రాజ్యంబున నున్న నీ ప్రజల నే • నిం, జూడఁగా, రమ్మి; వీ
రా! రాముండవు; పేరు సార్థకముగా•రారా కృపా మూర్తివై. 81

ఉ. నిన్నెడఁబాసి రామ! జన • నీ జనకుల్ కడుఁ గుందుచుండి రా
పన్న శరణ్యా! జీవతతి • పాయఁగ నొల్లదు నీదు పొందు; నీ
వెన్నఁడు వచ్చి నా యొడి ర • హించెదొ! బాలకు రీతి నుండెదో
మన్నన ముద్దు లిచ్చెదవొ • మాతకు? మా పతి వీవ రాఘవా. 82

ఉ. రాముఁడు లక్ష్మణుండును ధ • రాసుతయున్ దన వెంట రా వనీ
సీమకుఁ బోవుచుండె ననుఁ • జేర నయోధ్యకు వచ్చు టెన్నఁడో
సామజ యానుఁడై ; సతత • సర్వ శుభంకర మూర్తిగాఁగ రా
రాములు రామ రాయల, శి • రంబున సేసలఁ జల్లు టెన్నఁడో. 83

ఉ. ధీరుఁడు వీరుఁడయ్యుఁ గడ • తేరఁడు రాజ్య రమా విభూతి, గం
భీరుఁడు లక్ష్మణాన్వితుఁడుఁ • వీడెను రాజ్యము సర్వమున్; ధను
ర్ధారి! సతీ సమేతుఁడయి • తాత నుడిన్ వని కేగుచుండె; నా
మార సమాన కాంతి సుకు•మారుఁడు రాముఁడు పాదచారియా. 84

తే. సర్వ శాస్త్ర విశారద • సద్గుణుండు
దీర్ఘ బాహుండు, వీరుండు • ధీయుతుండు
రాముఁ, డేనాఁడు వచ్చునో • రాముని, గన
బ్రతికి యుందున యీ దుఃఖ • భార గరిమ. 85

* సవ్వడి = జాడ

తే. ఏక పుత్రుని విశ్లేష • శోక వహ్ని;
మండు వేసవి సూర్యుని • యెండ వలన
దగ్ధమౌ భూమి వోలె హృ • దంతరమ్ము
కాల్చి వేసెడి భరియింపఁ • గలిగి బ్రతుక. 86

ఉ. అంకమునన్ మెలంగి తమ • యమ్మల పాలను ద్రావు పాపలన్
గొంకక వేఱు చేసితి నొ • కో! క్షుధ బాధను వార లేడ్చినన్
జంకక పాలగుబ్బలనె • శస్త్రమునన్ బెకలించి యుంటినో
యింక మఱేమి చేసితినొ • యే భవమందునఁ, బుత్రుఁ బాయగన్. 87

ఉ. వారలు పుణ్యవంతులు శు • భ ప్రద రాఘవ రాముఁ డీ పురిన్
జేరి, వనాంతరంబు విడి, • శ్రీకర రాజ్యరమా కరంబుఁ, జేఁ
జాఁచిన దానిఁ గైకొనఁగఁ • జాలిన, పర్వ దినంబుఁ జూచు, న
వ్వారలు; నేను జీవములఁ•బాయక యుందునె యంత కాలమున్. 88

ఉ. మంగళమో శుభాకర! సు • మంగళ మో యఖిలావనీ విభూ!
మంగళమో మునీంద్ర నుత • మంగళమో సుకుమార రాఘవా!
మంగళమో మహాత్మ జన • మాన్య, సుమంగళమో నృపాల యన్
మంగళ వాక్యముల్ బలుకు•మాతగ నెన్నఁ డయోధ్య నుందునో. 89

మ. అనుచున్ ధారణ సేయ సాగె రమణున్; • ధ్యానించు గౌసల్య రా
ముని, ఛత్రాన్వితు, రాజ రాజు సుతునిన్, • పుత్రున్, సతీయుక్తునిన్
వనవాసం బొక రేయి యందుఁ గలయై • ప్రాణేశ్వరిన్ లక్ష్మణున్
గొని రాముం డరుదెంచు దృశ్యము గనున్ • ఘోషన్ విలాపించుచున్.

## సుమిత్ర యోదార్పు

తే. అనుచు విలపించు కౌసల్య • కా సుమిత్ర
పలుకఁ దొడఁగెను మధుర సం • భాషణములఁ
పూర్వ జన్మ సుకృతమెు! యే • పుణ్య ఫలమొ
రామ తత్త్వం బెఱింగిన • రామ యామె. 91

ఉ. ఏల? విలాప మీ పగిది, • నే నెడఁ బాయనె లక్ష్మణున్ సుతున్
బాలురు రామ లక్ష్మణులు • పాయని కూర్మి వనీ నివాసులై
లీలఁ జరించి వత్తు రవ • లీల నయోధ్యకు, రాజ మాత కాఁ
జాలుదు వమ్మ నీవు, రఘు • చంద్రుఁడు క్షేమముగాఁగ వచ్చెడిన్.

తే. దోర్బలుండయ్యుఁ దాను ని • ర్దోషి యయ్యు
దశరథుని బాస సత్యమై • తనర, వనికి
ధర్మ మార్గ చరుండు నీ • తనయుఁ డేగె
నతని వెంటాడె లక్ష్మణుం • డనఘ మతిని. 93

తే. స్వీయ ధర్మంబు నెఱవేర్చు • శ్రేష్ఠుఁ డతఁడు
అతని వెంటాడి నిజ ధర్మ •.మాచరించు
లోకులకు మార్గ దర్శియై • నా కుమారుఁ
డనఘుఁ డదె, లాభమౌ వాని • కనవరతము. 94

ఉ. కానన సీమ యందుఁ గడ • గండ్లఁ దలంపక పోదు సీతయున్,
గాని స్వకీయ ధర్మమె సు • ఖంబుగ నెంచిన దౌట భర్తతో
దానుఁ జరింపఁగా వనికి • ధర్మ గతిం జనె, వీరు ముప్వురున్
బూనిన వారు ధర్మమునె • పొక్కఁగఁ జెల్లునె వారి నెంచుచున్. 95

ఉ. ఎంతటి వాఁడొ రాఘవు డ • హీన గుణుం డపరాజితుండు నీ
4/2 వింతగ నేడ్చెదేల? యతఁ • డే పురుషోత్తముఁడైన వాఁడు, లో
కాంతము ధర్మ సత్యములె • యాతనికిన్ ధనమైన వాఁడు, సృ
ష్ట్యంతమునన్ వెలుంగు పర•మాత్ముఁడు రాముఁ డనంతుఁ డాద్యుఁడున్.

సీ. తన తీవ్ర కిరణాలఁ • దపియింపఁ జేయఁడు
రవి యెన్నఁడేని శ్రీ • రామ విభుని
శశి శీత కిరణాల • శైత్యోపచారియై
రహిఁ గౌఁగిలించు శ్రీ • రామ విభుని
యుక్త శీతోష్ణ సం • యుక్తుఁడౌ ననిలుండు
నోమెడి వాఁడు శ్రీ • రామ విభుని
ధర్మ రక్షణ దీక్ష • ధర్మంబు తోడయి
రక్షించు చుండు శ్రీ • రామ విభుని

తే. అడవిఁ బెరిగిన వృక్షంబు • లాకుల గమి
తరుణ కిసలయ మిశ్రిత శీ • తాంశు తతియు
గంధ వాహాను మందమౌ • గతియు సతము
రంజితునిఁ జేయు ధార్మికు • రామ విభుని. 97

మ. పురుష వ్యాఘ్రము,స్వీయ బాహు బల ద•ర్పోపేతుఁడున్, శూరుఁడున్
వరదుఁడున్, రిపు సూదనుండు, బహు ది • వ్యాస్త్రాన్వితుండున్, వనీ
చరుఁడౌచున్ బదు నాలుగేండ్లు గడుపున్ • సంపత్కరుండౌచు నీ
ధర శాసించెడి వాఁడు రాఘవుఁడు స • త్యంబిద్ది కౌసల్యరో. 98

తే. పంచ భూతాత్మకుండైన • ప్రభు వరుండు
సకల లోకైక దైవంబు • సర్వ విదుఁడు
నఖిలుఁడు ననంతుఁ డాది నా • రాయణుండు
రాఘవునిఁ గంటి వీవు శ్రీ • రామ జనని. 99

తే. వనికి వెంటాడి జానకి • చనిన యట్లు
$\frac{44}{15\text{-}16}$ రాజ్య లక్ష్మియు వెంటాడె • రామ విభుని
దుర్లభం బేమి లేని యీ • దోర్బలుండు
మా విభుం డయోధ్యా పతి, • మరలి వచ్చు. 100

చ. *రవికిఁ బ్రభాకరుండు, సుర • రాజునకున్, సురరాజు, భూమికిన్
$\frac{44}{15\text{-}16}$ భువి, యనలుండు వహ్నికిఁ, బ్ర•భుండు నియంతకుఁ, గీర్తి కీర్తికిన్,
దివికి దివంబు, శ్రీకి సిరి, • దివ్యుఁడు, దైవత దైవతంబు, రా
ఘవుఁ డపరాజితుండు కడ•గండ్లను గాంచునె? యెప్పుఁడేనియున్.

ఉ. వచ్చెడి వాఁడయోనిజయు • భ్రాతయు వెంబడి రా, నయోధ్యకున్,
సచ్చరితుండు, నీదు పద • సన్నిధి, గేల్ మొగిడించు వాఁడు; రా
లచ్చి, ధరా, ధరాత్మజలు, • లాలన చేయఁగ నేలువాఁడు, నీ
మెచ్చిన కూర్మి పుత్రకు, న • మేయునిఁ, గాంతువు రాము మాతరో.

తే. కనుల పండువుగాఁ, గనఁ • గలుగు దీవు
రామ నరపాలు రాజ్య వి • భ్రాజమాను
సర్వ లోకైక రంజిత • సార్వభౌము
వగవఁ దగు నొక్కొ నీ విటు • పరమ శీల. 103

చ. అనుచు సుమిత్ర పల్కిన, మ • హా వచనంబుల నాలకించి, నె
మ్మనమున శాంతిఁ బొంది, వ్యధ•మానుచుఁ గంటను నీరు, గార్చ దా

*"తస్య నామ మహద్యశా", "తం దైవతానాం పరమం చ దైవతం"
"యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షంచ" "ఏకోవిష్ణు ర్మహాభూతం పృథగ్భూ తాన్యనేకశః" అను శ్రుత్యర్థము లిట సుమిత్ర నోటి నుండి వాల్మీకి చెప్పించెను.

జననుత రాము మాత, అల • శంబర మీయని శారదాభ్రమో
యను గతి దుఃఖవర్జిత, ము • ఖాబ్జమునన్, హృది నిల్పు రాఘవున్.

## బ్రాహ్మణుల అనుభూతి - శ్రీరామ వన ప్రస్థానము

తే. తల్లి దండ్రులు తనయునిఁ • దలఁచి తలఁచి
యిటుగ విలపించుట సహజ • మెంచఁ బ్రకృతిఁ
గాని యా అయోధ్యను వ్యథఁ • గననివార
లెవ్వరును లేరు రాఘవు • హృదిఁ దలంచి. 105

చ. పుర జను లెందఱో విమలుఁ • బూజ్యుని వీడఁగ లేరు, వెంబడిన్
బరు విడుచున్న వారు కని • బ్రాహ్మణ వృద్ధుల సాగు మాగు మం
చఱచుచు వచ్చువారి రథ • మంతట డిగ్గియు వారు ముప్వురున్
మరలరు వెన్కకున్ వనము • మార్గమునం జను పాదచారులై. 106

తే. సత్త్వగుణ మూర్తులా ద్విజ • సత్తమాళి
పరుపు లెత్తుచుఁ దన వెంటఁ • బడుచు రాగ
రథముపై నుంట తప్పని • రాముఁ డెంచెఁ
గాని వ్రత భంగ మనుచు వె • న్కకుఁ జనండు. 107

తే. దూర మందున్న బ్రాహ్మణ • వార మెల్ల
తన్నుఁ జేరంగ మెల్లఁగాఁ • దరలు చుండె
వృద్ధులును జ్ఞాన మూర్తులుఁ • బెద్దలు నగు
వారు కలిసెడి గతి భక్త • వత్సలుండు. 108

తే. రాముఁ జేరంగ గబ గబ • బ్రాహ్మణ తతి
నడువ నుంకించి పదముల • నిడుచు వేగ
దాశరథి సద్గుణంబుల • దలఁచి తలఁచి
పొందు నాత్మానుభూతినిఁ • బొక్కు మిగుల. 109

ఆ. *నిన్నుఁ బాయ మాకు • తెన్నేది రాఘవ
కన్న తండ్రి మమ్ము • కరుణఁ జూడు

---

*80-85 $\frac{45}{15-17}$ (నాయమాత్మా ప్రవచనేన లభ్యః నమేధయాన బహు నాశ్రుతేన "యమే నైషవృణుతే తేనలభ్యః." ఇతి శ్రుతి వాక్యము–ఆత్మ వేదాధ్యయనమున లభింపదు. బుద్ధి బలమునను, విశేషశ్రుతి వలనను లభించునదికాదు. ఎవరు తన్ను వరింతురో వారికే లభ్యము.)

మరలి రాగదయ్య • మమ్మేల రామయ్య
నీవు లేని చోట • నిలువలేము. 110

ఆ. బ్రాహ్మణులము మేము • బ్రహ్మణ్యుఁడవు నీవు
జీవితాశయంబు • చేడ్పడంగ
నిన్ను వీడఁ గలమె • నీవుండు వని మాకు
సౌఖ్యధామము గద • సత్యశీల. 111

ఉ. ఎవ్వని నామ సంస్మరణ • మెప్పుడు జ్ఞానులు సేయు చుందురో
ఎవ్వని పాద పూజలఁ ద • రింప భవాబ్ధిని భక్తులెంతురో
ఎవ్వని సేవకై సత మ • హీన తపంబున మౌనులుందురో
అవ్వనజాతు వీడఁ గల • మా ? నిను వీడఁగలేము రాఘవా ! 112

ఆ. అఖిల కర్మ తతియు • యజ్ఞంబు యాగంబు
అగ్నిహోత్రములును • నా యనంతుఁ
గనఁగ గాదె, నిన్నుఁ • గాంచి యీ జన్మనె
పూర్వ సుకృతి; వీడి • పోవఁ గలమె ? 113

తే. వాజపేయంబు సల్పిన • పరమ ఛత్ర
ము లివె, తగుల కుండఁగ నెండ • పూజ్య మేము
పట్టఁగా వెంట నున్నవి; • పరమ పురుష
నీదు సంశ్లేషమును వీడ • రాదు రామ. 114

తే. వృద్ధులము మాదు మాటల • వినుము రామ
మరలి రమ్మయోధ్యకు రామ • మరలు మింక
బ్రాహ్మణుల, మమ్మ, నీ యను • రక్తుల మము,
పౌర జనముల వీడుట • పాడి యగునె ? 115

చ. నిగమము లన్నియున్ బలుకు • నిత్యు డనంతుఁడు సృష్టిమూలమౌ
సగుణుఁడ వీవ నిన్ వలచి • సంతసమున్ నినుఁ బాయకుంటయే
సుగతిగనెంచు భక్తులము • చూపుము నీ యనురాగ మింక, మా
కగు గతి వీవ కర్మముల • కందవుగా శరణన్నఁ జాలుఁగా. 116

చ. భువిజము లేడ్చుచున్న యవి • బోరున, ఘోషవినంగ నెంచవో
యవి చరియింపఁ జాలక, త్వ • దాశ్రయముం గొని వెంట నుండ అ

వ్వొ విహఁగముల్ చరింప వహ ♦ వీటికి రమ్మని పిల్చుచున్న వా
రవము వినంగ నౌఁగద చ ♦ రాచర రక్షక దీనరక్షకా ! 117

తే. సర్వ భూతానుకంప య ♦ శః ప్రకాశ !
వత్స ! విను, మా విలాపంబు, ♦ వనికిఁ బోవ
వలదు వలదింక రమ్మింక ♦ పట్టణమున
కనుచు రాఘవు వెంటాడి ♦ రా, జనమ్ము. 118

తే. బ్రాహ్మణుల నూరడింపకఁ ♦ బరగనౌనె
ఆగు మాగుము రామన్న ♦ యన్న తెఱఁగు
నంత తమసా నదీ తీర ♦ మడ్డు వచ్చె
రవియు రాఘవు గతి నెంచి ♦ భువిని వీడె. 119

ఆ. తనదు విధులఁ దీర్చి ♦ తమసా నదీతటి
విశ్రమించె రామ ♦ విభుఁడు నాఁడు
రథము దారిఁ బట్టి ♦ బ్రాహ్మణ వర్గము
పౌర తతియుఁ జేరి ♦ నారు రాము. 120

## రాముఁడు - తమసా తీరము

ద్వి. వనవాస దీక్షకుఁ ♦ బ్రారంభ దినము
జన రాముఁ డా రేయి ♦ జలకంబె త్రావి 121
తన తమ్మునిం గాంచి ♦ తగు రీతిఁ బల్కెఁ
బెనగొను వాత్సల్య ♦ మును బొంది యంత 122

చ. వనమున కేగి యుంటి నని ♦ వార్ధక మందున తండ్రి దుఃఖమున్
గను, మితిమీరు శోకమునఁ ♦ గన్నులు చిల్లులు పోయి దృష్టిఁ బా
యును గద ! తల్లి ఖేదమున ♦ కుందునె యంతు; తలంప వారి, నీ
కును వ్యథ గల్గు; నా భరతు ♦ కూర్మి శమింపగఁ జేయు వారలన్.

ఉ. ఇంటిఁ దలంపఁ బోకు మిక ♦ నీ పదునాలుగు వత్సరంబులున్
జంటగ నుండఁగాఁ గలుగు ♦ సౌఖ్యము నీ వొనఁగూర్చి నావు నే
నొంటరినై చరింపఁగల ♦ నొక్కొ ! ధరాత్మజ రక్షణార్థ మీ
వుంటివి తోడు రాగ వని ♦ నుంటిని ధైర్యముఁ బూని లక్ష్మణా.

చ. అని నయ వాక్యముల్ పలుకు • నా రఘురాముని కంత లక్ష్మణుం
డనుపమ భక్తి గూర్చె నపు • డాకుల ప్రక్కలు మంత్రిఁ గూడి పా
వన *తమసా నదీ తటిని • భద్రగతిన్ జనకాత్మజాయుతుం
డినకుల వంశజుండు పవ • ళించె సుఖాస్పద నిద్ర పొందుచున్. 125

తే. లక్ష్మణుండు సుమంత్రి వి • లక్షణముగ
ధాత్రి నిదురించు శ్రీరామ • దంపతులను
కలవు దీరంగఁ గనులార • గాంచి రాము
శయన సీమ విభూతిఁ బ్ర • శాంతిఁ గనిరి. 126

తే. తనివి దీరక యొక మారు • దాశరథిని
జానకీదేవి నొక మారు • సంభ్రమమునఁ
గాంచి, నిర్వర నొక్కటఁ • గనెడి వారు
పూర్ణ సౌందర్య విభవాను • భూతిఁ బొంద. 127

ఉ. శ్యామల దేహకాంతులు ది • గంతములన్ ప్రతిబింబితంబుఁగా
వ్యోమతలానఁ జుక్కలకు • నుజ్జ్వల కీర్తినిఁ జక్కచేయుచున్
రామను గూడియున్న రఘు • రాముని దివ్యతనూ విలాసినిన్
భూమిని పవ్వళించిన వి • భున్ గని కాంతు రలౌక్య సద్రతిన్. 128

ఉ. సీత పదాబ్జ మంజుల రు • చిన్ గనుచున్, హృదయానుభూతిమై
చేతము పల్లవింపగ, ని • శన్ దిరుగాడుచు గస్తి, రాము వి
ఖ్యాత గుణానుభూతియును • గాంచెడి లక్ష్మణుఁ డా సుమంత్రుతో
పూత చరిత్రు రాఘవు న • పూర్వ గుణంబులఁ జెప్పి చెప్పుచున్.

## రాముఁడు పౌరులను వీడుట

ఆ. తెల్లవారు జాము • తెలివొంది రాముండు
చెట్ల క్రింద నిదుర • చెందు ప్రజలఁ
దన్ను వీడలేక • వెన్నంటి వచ్చిన
పౌర తతినిఁ గాంచి • పల్కె నంత. 130

*తమసానది గంగ కుపనది. ఇపుడది Toas అని పిలువఁబడు చున్నది.

చ. మనలఁద్యజింప లేక యిటు ♦ మానక వచ్చిరి, నాదు మాటలన్
వినక, వనీ నివాసమునఁ ♦ బెద్దయుఁ గాలము పెక్కు చిక్కులన్
గనుట సమంజసంబె మన ♦ కర్మము వెంబడి వచ్చి వీరలున్;
గను మదె వృక్ష మూలములఁ ♦ గాంచిరి నిద్దుర, వీడి వాడలన్. 131

ఉ. బత్తిని వచ్చువారి విడి ♦ పాఱుట ధర్మమె! వీరి రక్షణా
యత్తుల మౌచు నిత్యము వ ♦ నాంతర సీమఁ జరించు టెట్లు? వీ
రిత్తరి వారి పట్టు విడ ♦ నెంచ రయోధ్యకు రమ్ము రమ్మటం
చొత్తిడి సేయు వార లహా ♦ హా, నిరపేక్షులు వీర లెల్లరున్. 132

ఉ. తల్లులఁ దండ్రులున్ సతులు ♦ తమ్ములు నిండ్లును మిత్ర వర్గమున్
గల్ల యటంచు నన్ను విడఁ ♦ గా మది నొల్లక వెంట నంటు వీ
రెల్లరు, స్వీయ గేహముల ♦ కేగుట కేయది మార్గ మెంచ? నే
నొల్ల, నయోధ్య కేగుట క ♦ హా! మరలించుట యెట్లు వీరలన్. 133

ఉ. వారలు గాంచకుండ జన ♦ వాసము లన్నియు దాఁటిపోఁ దగున్
దారి గ్రహింప లేని గతిఁ ♦ దాఁటఁగ నౌను నదీ నదంబులన్
వేరగు రథ్య తేరు నడి ♦ పించుచుఁ జూపుచు నన్య మార్గమున్
జౌరుల వెంటఁ గొంట తగు ♦ నా! యది ధర్మముగాదు లక్ష్మణా.

ఉ. పుర జను లెల్ల సౌఖ్యమును ♦ బొందెడి రీతిఁ జరింపఁగాఁ దగున్
ధరణి విభుండు, వీర లెటు ♦ ధారుణిపై శయనించి నారహో
శిరముల క్రిందఁ జేతు లిడి, ♦ చెచ్చెర నిండ్లకు వీరి బంపుటే
పరమ పవిత్ర ధర్మము, శు ♦ భ ప్రదమౌ, మనకున్, జనాళికిన్. 135

ఆ. నిదుర లేవకుండ ♦ నిదురించు వారలు
గానకుండ, మనము ♦ గడఁగ వలయు,
ననిన వెంటఁ దేరుఁ ♦ బనిచె సుమంత్రుండు
నుత్తర దిశ కరిగి ♦ యున్న తెఱఁగు. 136

తే. అడవి కేగిన ధర్మంబు ♦ విడువ లేక
భక్త తతి మోహనార్థంబు ♦ భక్త భక్తుఁ
డయ్యు దక్షిణ దిశఁ బట్టి ♦ యరుగఁ బూనె
రాఘవుఁడు తేరుపై వెల్గ ♦ రాక మున్నె. 137

తే. భక్త కోటి సురలు • వడసిన వరమును
జన్మ కారణమును • సఫల పరుప
రాముఁ డరిగె వనికి • రాకుండ వెలుతురు
పౌర జనుల కాంతు • భంగ పఱచి. 138

## పౌరుల విశ్లేషాక్రందనము

ఆ. తెల్లవారె నంతఁ • దెలి వొందె దిక్కులు
పౌర జనము గూడఁ • బాసె నిదుర
రాత్రి యందుఁ గనిన • రాఘవు నిప్పుడు
గాన లేక జనులు • దీనులైరి. 139

మ. అకటా! నిద్రను జోగియున్న మము భ • క్తాళిన్ విసర్జించి పో
సుకరం బయ్యెన రామ! మా నిదురయే • శుద్ధాత్ము సంశ్లేషమున్
నికటంబున్ విడఁ జేసె, దుర్గతిని సుం • తేనిన్ గనఁ జాలమే
యికఁ జూడం గల మొక్కొ! చూడక క్షణం • బే యైన జీవింతుమా.

ఉ. కానగ రాదు నీదు రథ • గమ్యము ధూళియుఁ గానరాదుగా
కానన సీమ నిన్నెటుగ • గాంతుమొ? ఎచ్చటఁ గాంతుమయ్య! నీ
యానన సుందరామృత మ • హాబ్ధి మునుంగుచుఁ దేలు మా కికన్
దీనుల మోములన్ గన, ని • దే చననౌ గద! నీ యయోధ్యకున్.

ఉ. ఏటికి పాడు నిద్దుర? అ • రే! మము నిట్టుగఁ బాడుసేసె, ఏ
నాటికి దీర్ఘ బాహు, రఘు • నాథుని మే మికఁ గాంచ నోతుమో
మాటలు వేయు నేల, రఘు • మాన్యునిఁ గానక, యింటి కేగుటా?
నీటనొ మంటనో దుముక • నేరమొ ఎట్టులొ చచ్చుటే తగున్. 142

ఉ. భూజములార! మీ దరి వి • భుం డొరిగెన్ గద రాత్రి నిద్రకై,
వ్యాజము లేక మమ్ము విడి, • భక్త జనావన రక్షకుండు, న
వ్యాజ కృపాంతరంగుఁడు, ప్ర • భాకర తేజుఁడు, రామచంద్రుఁ డా
రాజ కులావతంసుఁడు ప • రారిగ పోయిన దారిఁ దెల్పరే. 143

శా. మోమున్ జూడక పోయినన్ సరె, సరే • పూజార్హ పాద ద్వయీ,
ధామంబందున నిల్వకున్నను, సరే • త్వద్భక్త బృందమ్ములన్
స్వామీ ప్రోవ దలంప వేనియును, నీ • పాదాబ్జ చిహ్నంబులేన్
రామా చూడఁగ నోచమైతిమి కదా • రామయ్య చూపింపుమా. 144

తే. గగన మందున్న ఓ విహం ♦ గమ్ములార
దాశరథి పోవుచున్నట్టి ♦ దారిఁ గనరొ
చూపుడీ మాకు మా రామ ♦ భూపు నెలవు
పోయి వత్తుము కొనిపోవఁ ♦ బురికి వాని. 145

ఉ. పూత నదీ నదంబు లవి, ♦ పుణ్యము నెంతఁగఁ జేసి యున్నవో
స్నాతుఁడు కాగలండు రఘు ♦ నాథుఁడు వాని జలంబులందు, వి
ఖ్యాత నగాగ్రముల్ పసిడి ♦ కాంతుల నీనుచు నాశ్రయంబులౌ
సీతకు, రామ భద్రునకుఁ, ♦ జేసినవో యవియుం దపంబులన్. 146

తే. అడుగు నడుగున వేయుచు ♦ నడవి నెంత
దూర మేగితివో యంత ♦ మేర పుడమి
పూతమై ధన్యతను గాంచు ♦ హో! పురాణ
పురుష! నీవె మమ్ముల వీడి ♦ పోవఁ దగునె! 147

ఉ. మోస మెఱుంగ నేరపు న ♦ మో యను వారల బ్రోవువాఁడ, వ్యా
ద్వాసము సేయు వాఁడ, యిటుఁ ♦ బాయఁగ నీకెటులాయె మమ్ము నీ
దాసుల; నీ గుణంబులు, స ♦ దా యనుభుక్తములే స్వరూపమున్
వాసము దూర మాయె పుర ♦ వాసుల కేమని పల్కఁగాఁ దగున్.

తే. నిర్వికల్ప సమాధి, ని ♦ ర్నిద్రుఁ గాంచు
యోగి; యేమరి నిద్రలో ♦ జోగి చెడును
నీదు సాన్నిధ్య మందుండి ♦ నిన్నుఁ గనక
నిదురఁ జెందిన మాగతి ♦ యదియ కాదె. 149

తే. దీర్ఘకాల సంశ్లేష సం ♦ తృప్తి పెచ్చు
పెరిగి, నిర్లక్ష్యమున నిద్ర ♦ మరగి నారు
భక్తులంచని నీమోహ ♦ వశులుగాఁ బ్ర
వృత్తి స్థిరముగా విశ్లేష ♦ బాధ నిడితో! 150

తే. నిన్ను నిర్లక్ష్య మొనరించి ♦ నిదురఁ బోవ!
వారి నిర్లక్ష్య మొనరించి ♦ పాఱి నావు
భక్తులము క్షమార్హులమును ♦ భక్త భక్త
పడనున్నావు? క్షమియించి ♦ జాడఁ జెపుమ. 151

ఉ. మాయలమారి వై తివొకొ • మత్తునకున్ గురిసేసి మమ్ము వే
   ఘాయఁ దలంచితో నిదురఁ • బాయడు పొరు డొకండుగూడ మా
   దాయల వీడి వీడి ధన • ధాన్యములన్ బురి నిండ్ల సర్వ మీ
   వేయని మేము రా వనికి • నీ విటు మమ్ము బరిత్యజించెదే ! 152

తే. లేదు మోసంబు, నీ యెడ • లేదు లేదు
   నిన్నుఁ గనకుండ నిదురించి, • నిన్ను మేమె
   వీడి నారము, మము నీవు • వీడలేదు
   ఏమరిన దోషమునఁ గల్గె • నీ యవస్థ. 153

ఉ. ఏడి రఘూద్వహుం డనుచు • నేద్చెడి ఆంధ్రకుఁ బిల్లవాంధ్రకున్
   వీడితి మాతనిన్ వనిలొ • వేడుకతో జనినాము వెంట, నం
   చాడగ నోరు రాదు, నిజ • మాడిన వారు సహింతురే మమున్
   వీ డెటఁ బోవు?, రాము వని•వీడుచు వచ్చిరె యంచు దెప్పరే. 154

తే. రామ విశ్లేష దుఃఖంబు • రాముల కహ
   ఇంతయని చెప్పఁ గల వార • లెవరు లేరు
   ఏడి రాముం డనంగ మే • మేమి యనుట
   ఎటుగ నోదార్చఁగాఁ గల • మేము వారి. 155

తే. మున్ను విరజా నదిని దాఁటి • పుడమిఁ బుట్టి,
   యిపుడు తమసా నదిని దాఁటి • యేగి నావొ
   ఘోర కానన సీమ వై • కుంఠ మనఁగ
   మా సతీ నాథ? జానకీ • మాతఁ గూడి. 156

మ. అనుచున్ బౌరులు భక్తి తత్పరులు స • ఖ్య స్ఫూర్తి భావింత్రు రా
   ముని, విశ్లేషము నోర్వ లేక యపుడే • మూర్ఛిల్లుచున్ లేచుచున్
   గనలేమిం దమ రాము సత్పురుషునిన్ • గాంతాయుతున్ రాఘవున్
   వనజాతున్ భువనైక సుందరుని ది • వ్యానంద సంధాయినిన్. 157

ఉ. దైవము దూరి కొంత వడి • దైవ విధిం తలపోసి పోసి, వా
   పోవుచుఁ, దేరు జాడల న • పూర్వగతిన్ గమనింప లేక, స
   ర్వావయ పీడకున్, దగిలి • అంతకు మించి చరింపలేక, "దే
   వా! వరదా! కృపా పర! ద•యన్ గనుమీ కరుణాపయోనిధీ" 158

ద్వి. అని యిట్లు దుఃఖించి • యా పౌరు లెల్ల
చనినారు మరలుచు • సాకేత పురికి. 159

చ. వెల వెల లాడుచున్న పుర • వీథులు, నిర్జన రథ్య లెల్ల వ్యా
కులతను జాటు చుండెఁ దమ • కొంపల కేగఁ దలంపరైరి పౌ
రులు కడు వాడి పోయిన స • రోరుహమా; శశి లేని రాత్రియా?
జల రహితాబ్ధియా? యనఁగ • జాలు నయోధ్యను జూచి యేడ్చుచున్.

చ. ధనమున కాట పట్టులు, ని • తాంత సుఖాస్పద స్వీయ వేశ్మముల్
కని కని యెట్టులో తుదకుఁ • గాంతలఁ బుత్రులఁ జేరిరా ప్రజల్
మనముల కెక్కు రాఘవుని • మాన్య గుణంబులు, సంస్మరించుచున్
గనులకుఁ గట్టు రామ నర • కాంతుని బింబము నందు లగ్నులై. 161

సీ. వనమును విడనాడి • భవనంబులం జొచ్చి
ప్రమదంబు నొంద రీ • పౌర జనులు
ఇండ్ల కేగియుఁ దమ • యిల్లాండ్ర గురుతించి
పలుకాడఁ జాల రీ • పౌర జనులు
బంధు మిత్రుల తోడఁ • బరిచయ వాక్యముల్
నోరార పలుక రీ • పౌర జనులు
$\frac{47}{19}$ ధన ధాన్యములు సంప • దలు గల్గినను వాని
భరియింప నెంచ రీ • పౌర జనులు

తే. దాశరథి లేని పురము, సీ • తమ్మ లేని
యిల్లు, సౌమిత్రి లేనట్టి • యీ పురాన
రాఘవుఁడె సర్వముగ నెంచు • ప్రజకు నీ ప్ర
పన్నుల కెటుగ శాంతి సం • ప్రాప్త మగును? 162

ఉ. రామ పదాబ్జ మంజుల ప • రాగ పరీవృత చిత్త బంభర
$\frac{47}{19}$ స్తోమము లీ పురీ జనులు, • చూడరు, చూచియు గుర్తు పట్ట రా
భామల స్వీయ పత్నులను, • బంధువులన్, సుత మిత్ర వర్గమున్
ప్రేమను, బిల్వ రెవ్వరిని, బెన్నిధి ముట్టరుగా విరక్తులై. 163

తే. ఎటుగ రాఘవేతర మాత్మ • కెక్కు నొక్కొ
$\frac{48}{1\cdot4\cdot5}$ ఆత్మ నాథుని విశ్లేష • మతిశయించె

4/ కి. అంతకును మించి భార్యలు • నార్తి గుందు
చుండిరి రఘు రాముఁ దలఁచి • చూడ లేమి. 164

## పురస్త్రీల ఆక్రందనము

ఉ. వంటలు లేవు భార్య లహా • వండరు పెట్టరు భోజనమ్ము, వెన్
వెంటను బోయి రాఘవుని • వీటికిఁ దోడ్కొని రాక ఊరకే
ఒంటరిగా నిటుల్ మరలు • టొప్పునె? ఓ మగవారలార! ఎ
ట్లింటికి వచ్చినారు? తగు • నే? యెటు వీడిరి రామచంద్రునిన్. 165

తే. ఇల్లు నిల్లాండ్రు సిరియు వే • రెటకుఁ బోవు?
మరలి నారొకో రాముండు • మరల కుండ?
నెట్టి దురదృష్ట మని పల్కి • యేడ్చు సతుల
మాటలు ములుకు లైనవి • మానసముల. 166

ఉ. రాముని వెంట భర్తలు స • రాసరి వెళ్ళిన వారలౌట నా (శ్రీ)
రాముని వెంటఁ దోడ్కొనుచు • రాఁగల రంచని వేచియున్న ఆ
రామ లయోనిజాపతి ప • రాయణ చిత్తలు, నిస్పృహాత్మలై,
వేమరు, ప్రశ్న *వేతు రెటు • వీడిరి రాఘవు నంచు భర్తలన్. 167

తే. అన్న వెనువెంట వనికేగి • యచట సతము
జానకీరాము పదసేవ • సలుపఁ గలుగు
ఆతఁ డొండె సత్పురుషుఁ డీ • యవని యందు
ధన్యుఁ డా లక్ష్మణుం డిల • ధన్యతముఁడు. 168

ఉ. కానన సీమ యందు తరు • కాండములున్ గడు పుణ్యవంతముల్
జానగు మోము రాముఁ దమ • ఛాయల ఛత్రము పట్టు పూలతో
వాని పదార్చనన్ సలుపుఁ • బండ్ల నివేదన మూను, దావి సం
ధాన మొనర్చు ధూపమును, • దాల్మి వసించుచు జానకీశుతో. 169

తే. పద్మినీ కన్య యెంతటి • ప్రమద వతియొ
జానకీ రాఘవులఁ గూడి • జలక మాడు
ఆ వనీ నదీ నదముల • యందపూర్వ
గతిని, ముసు జన్మనాటి స • త్కర్మ ఫలమొ. 170

---

(* ఉ. ఆంధ్ర భాషానుశాసనము. పే. 297)

ఉ. రాముఁడు స్నాన మాడెడి పు ♦ రాణ నదీ నద వారి పూరముల్
నోముల నెన్ని నోచిన, వ ♦ నూన గతిన్ భువనైక సుందరీ
రాముఁ డరణ్య వాసుఁ డయి ♦ రాఁ దమ చెంతకు, జన్మమూలమౌ
ఆ మహనీయ రాఘవ ప ♦ దాబ్జము లంటదె గంగ నేఁడిటుల్ ? 171

ఉ. కొండలు లోయలున్ గుహలు ♦ కొండకొనల్ ఫల పుష్ప శోభితా
ఖండల సుందరాకృతులఁ ♦ గానన మందున, విందుసేయు, వే
దండ చయంబులున్ నెమలి ♦ తండములున్ విహగంబు లెల్ల రా
ముండు లభించె నంచు ముద ♦ మొందుచు, వానికిఁ, గూర్చు మోదమున్.

ఆ. ఇవియు నవియు ననఁగ ♦ నేల ప్రకృతి యెల్ల
'రామ! రామ! రమ్ము ♦ రామ! రామ!'
$\frac{4}{1}\frac{8}{1}$ యనుచుఁ బిలిచి కెరలి ♦ అర్చన సల్పెడి
అతిథి గాగ నెంచి ♦ యమలు రాము. 173

తే. ఎచట రాముండు వసియించు ♦ నచట భయము
$\frac{4}{1}\frac{8}{5}$ లేదు, లేదు పరాభవ ♦ మేది గాని
అతఁడు వీరుండు శూరుండు ♦ నతుల మూర్తి
అతని చెంతనె నివసింప ♦ నగును మనకు. 174

తే. జాగు సేసిన బహు దూర ♦ మేగు నతఁడు
$\frac{4}{1}\frac{8}{8}$ శీఘ్ర గతిఁ బోయి రామునిఁ ♦ జేర వలయు
ఆ మహాత్ముని పదసేవ ♦ అఖిల సుఖ క
రమ్ము నాతండె నాథుండు ♦ సుమ్ము ప్రజకు. 175

తే. అతఁడె గతి, పరమగతియు, ♦ నతఁ[illegible] సుమ్ము
$\frac{4}{1}\frac{8}{8}$ జనకజా సేవ సేయుచు ♦ మన[illegible] మేము
జనకజా పతి సేవించి ♦ మనుడు మీరు
జనకజా రాఘవులఁ గాంచ ♦ జనఁగ నౌను. 176

తే. అడవియం దుండియును, రాముఁ ♦ డనవరతము
$\frac{4}{1}\frac{8}{9}$ మిమ్ము దీవించు మీక్షేమ ♦ మే తలంచు
సీతయును మమ్ము దీవించి ♦ క్షేమ మెంచు
భక్త భక్తుండు మరచునే ♦ భక[illegible] తతుల. 177

ఉ. రాముఁడు లేని రాజ్యమున • రా దిక సౌఖ్యము, పోదు దుఃఖమున్,
రాముని బంపెఁ గైక వన • రాజ్యము నేలఁగ దుష్ట బుద్ధియై
మేమిక నుండ జాల మిట • మీరును మేమును బోవఁగాఁదగున్
సోమ నిభాననున్ గలియ,•స్రుక్కఁగ నౌనె యయోధ్య నీగతిన్. 178

తే. రాము లక్ష్మణు సీతను • రాజు వనికి
నక్రమంబుగఁ బంపించి • వక్రగతిని
అవును గసాయి వానికి • నప్పగించి
నటుగ భరతుని చేఁ బెట్టె • నిటుగ మనల. 179

## స్త్రీల అనుభూతి

తే. పూర్ణ చంద్ర నిభాస్యుఁడు • పూజ్యతముఁడు
శ్యామ వర్ణుండు శత్రు సం • హారకుండు
పద్మ పత్రాక్షుఁ డాజాను • బాహు బలుఁడు
సత్య సంధుఁడు మధుర సు • భాషణుండు 180

తే. విమల పూర్వాభిభాషియు • విక్రముండు
సౌమ్యుఁడును సర్వజనులకు • చంద్ర సముఁడు
పురుష సింహుండు లోకైక • పురుష మూర్తి
ఆ మహా రథుఁ డటవీ వి • హారుఁ డగుట
నెంతో కాంతార సీమ శో • భించుఁ గాదె! 181

తే. ననుచు రాముని వనవాస • మాత్మ నెంచి
కొంత వడిఁ గుందు చుందురు • కొమ్మ లెల్ల
సఖ్య వాత్సల్య భావ సం • స్మరణ మూని
పరితపింతురు విశ్లేష • భావ గరిమ. 182

తే. రాఘవు గుణానుసంధాన • రంజితాత్మ
లగుచు నుందురు కొంద రా • యతివ లపుడు
రామ సంశ్లేషమునె కోరు • రామ లతని
మోము సౌందర్య మాత్మాను • భూతి బొంది. 183

తే. కైక దుర్బుద్ధిఁ దలపోసి • కైకఁ దిట్టి
దశరథునిఁ దూలి నిరసించి • తమ్ముఁ దాము

రామ విశ్లేషమున దుఃఖ • రాశులైరి
రాఘవుఁ దలంచి వా రను • రాగమయులు. 184

తే. రామ విశ్లేష వహ్నియే • రాజి రాజి
దిక్కులకుఁ బ్రాకె, దివి, రక్త • దీప్తిఁ గాంచె
ననఁగ, సాంధ్య రాగంబు సు • వ్యాప్త మాయె
దినకరుం డంతలోఁ జనె • తేజుఁ బాసి. 185

చ. తన కుల గౌరవంబు సత • తంబు వహించిన రాఘువాన్వయం
బున కిపు డెట్టి చే టొదవె • పో యని, సర్వ గుణాభి రామునిన్
జనకజ నెంచి వారిఁ గనఁ • జయ్యనఁ గానన సీమ కేగెనా
యన రవియుం, జనెన్, విడిచి•యంత, నయోధ్యను, నుగ్రమూర్తియై.

ఉ. పొంగిన శోక వాహిని, న • పూర్వముగాఁ దలమున్క వేయుచున్
భంగ హృదంతరంగ బహు • భారమునన్ విలపించు చుండె నె
బ్బంగిని, రామచంద్రు దవ • వాసమునన్ విడియుంట యంచు వే
భంగుల, నాయయోధ్యఁ గల•ప్రాణి సమూహము దుఃఖరూపమై. 187

తే. దినకరునిఁ గాంచనట్టి దు • ర్దిన మనంగ
శశియు నక్షత్రములు లేని, • నిశ యనంగ
చివరవర కెండిపోయిన • చెట్టనంగ
పాడు గుడివోలె నుండె నా • పట్టణంబు. 188

తే. రెండవ దినంబు వని కేగి • ఱేని సుతుఁడు
కాని విశ్లేష దుఃఖమ్ము, • పోను పోను
వృద్ధి యగుచుండెఁ బ్రజలకు • వెనుక కింక
రాఁడుగా, రాముఁడని తోఁచెఁ • బ్రజకు నేఁడె. 189

## అయోధ్య రూపఱుట

తే. రాము జగతీ పతినిఁ బాసి • రా, యయోధ్య
పౌరులు, హృదయ వేదనఁ • బాయఁగలరె
మరలఁడా రాముఁ డని విని, • మరులు గొన్న
ప్రజలు తిరుగాడు చుండిరా • రథ్యలందు. 190

చ. వెలవెల లాడు నల్దిశలు, • వేడి వెలుంగును దీప్తిఁ బాసె, చు
క్కలు గ్రహముల్, త్యజించినవి • కాంతిని, చీఁకటియే ప్రకోపమై
కలకల లాడుచుండు పురి • కాంతునిఁ బాయుట, శోక సాగరం
బిలను, నయోధ్యయే యనఁగఁ • బెంపఱి రూపఱియుండె నెంతయో.

తే. శశ్వ దిక్ష్వాకు వంశ త్రి • శంకుతార
బుధుఁడు గురుఁడు కుజుండును • మొదలుగాగ
గ్రహము లన్నియుఁ జంద్ర సం • గతిని బొందె
గలసియో దృష్టినో వక్ర • గతినో యిపుడు. 192

తే. సకల కోసల తార వి • శాఖ, దివిని
ఉండెగా, విధి నటుగ, న • యోధ్య కరయ;
దశరథుండైన గ్రహ గతి • దాఁటఁ గలఁడె
రాజరాజైనఁ గాకున్నె • గ్రహ వశుండు ? 193

తే. అటవికిం జనె రఘు రాము • నంటి వెంట
ఆ అయోధ్య యందుండెడి • యతుల శోభ
వనినిఁ గల, వృక్ష, మృగ పక్షి • వర్గ మెల్ల
సలిపెనా తపమును బూర్వ • జన్మలందు ? 194

## జాన పదులు

ఆ. కోడి కూఁత వేళ • వీడుచుఁ బ్రజలను
వెడలి నారు వార • లడవి త్రోవ
జనపదంబు లెన్నొ • చర చర దాఁటిరి
ఆల మంద ధూళి • యలము చుండ. 195

ఉ. కోమలుఁ డీ ధరాధిపుని • కూరిమి పుత్రుఁ డతుల్యుఁ డెంచఁ దా
నీమము నీతియుంగల పు • నీతుఁడు, ధార్మికుఁడున్ జితేంద్రియుం
డీ మహి కెల్లఁ బ్రాజ్ఞుఁడు, న • హీన పరాక్రమశాలి రామునిన్
గామ వశుండు, తండ్రి యిటు • కానన సీమకుఁ బంపు టొప్పునే. 196

మ. అనుచున్ నీల తనూ విలాసు, గుణ రూ • పానంద మూర్తిన్ మహా
ఘనునిన్ వీరుని జానకీ యుతుని లో • క త్రాణ దక్షున్ మహా
త్ముని సంసర్గము గోరు జానపదు లెం • తో కూర్మిమై రామునిన్
గనుచున్ బోవుచు నున్న వారు, రథ మా • ర్గంబందు, వెంటాడుచున్.

ఆ. దుష్ట చిత్త కైక • దుర్బుద్ధిఁ గోరెఁ బో;
యిటు ప్రవాస మంప • నేల నృపుఁడు
ఎవఁడు వీడుఁ బుత్త్రి • నీ దృశుఁ బుడమిపై
దశరథుండు కామ • వశుఁడు కాక ! 198

చ. జనక తనూజ, సాధ్వి, సతి, • సౌధనివాసిని, సుందరాంగి హో
వనమున కేగు చుండె, సుఖ • వంతముగా మను సీత కష్ట జీ
వన మిక నే విధిన్ గడుపు ? • భర్తను వీడక వెంటనంటె; పూ
తను వని కీగతిన్ బనుప • ధర్మమె, కైక కతాన భూపుఁడేన్. 199

## జనపదులను మరలించుట

ద్వి. అని జనపదముల • జనులాడు చుండ
వినుచుండి రథముపై • వెడలు రాముండు 200
పల్లె పట్టుల నెన్నొ • పట్టణంబులను
మెల్ల మెల్లగ దాఁటు • మేదినీశుండు. 201
ఆకు మళ్ళను దాఁటు • నందందు జనము
రా కుమారుని గాంచి • రథము వెంటాడు. 202
రాముండు ప్రజలట్లు • రాకుండ వెంట
పలుకాడు సత్ప్రేమ • చిలుకరించుచును. 203

చ. నా యెడ నాదు రాజ్యమున • నా ప్రజ చూపు మహానురాగమున్
బాయఁగఁ జాల ! నే తలఁతు • పాలిత లోక సుఖంబె సర్వదా
నా యటవీ, ప్రవాసము చ • నన్, మిము నేల నయోధ్య జేరెదన్
ఖాయము మీర లిండ్ల కరు • గందగు నింక సుఖాభిలాషులై. 204

## రాముఁడు జన్మభూమినిఁ బాయుట

ఉ. పౌరుల వీడి జానపద • వర్గములన్ మరలింపఁ జేయుచున్
తేరునఁ బోవు కానన గ • తిన్, వడి, దాఁటు నదీ నదంబులన్
వీరవరుండు రాఘవుఁడు • పేర్మి దలంచుచుఁ దండ్రి యానమన్
భూరమణీశు నాజ్ఞఁ దన • పూర్వుల నెల్లర, సత్యసంధులన్. 205

ఉ. కోసలరాజ్యమున్ సుమ ని • కుంజ, లతా రమణీయదేశమున్
భూసురకోటియుక్తము ప్ర • పూతము గోకులసేవితంబునున్
దాసజన, ప్రకీర్ణ ధన • ధాన్య సుమంచిత దానపూర్ణమున్
వాసిని గన్న స్వీయధరఁ • జూసెను, రాముఁడు దాఁటి యెల్లలన్.

ఉ. పాయుచు జన్మభూమి హృది, • భారమునొంద, నయోధ్యవంక కా
ప్యాయముగాగఁ జూచు, సుమ • వాటికలన్ దలపోయు, ప్రేముడిన్
రాయలనెంచు, భక్తి; హిత • రాజిఁ దలంచు మైత్రి; కానకున్
బోయెద వచ్చెదన్ మరల•మ్రొక్కెద నీకిదె నా యయోధ్యరో. 207

తే. అని అయోధ్యకు మ్రొక్కుచు • నట వసించు
దేవతతిఁ దలంచుచు మ్రొక్కు • ధీరవృత్తి
మానవాకార మూనిన • మహితమూర్తి
లోకవిధి గాఁగ, మానవ • లోకసరణి. 208

ఆ. జనని జన్మభూమి • స్వర్గతుల్యము గద
ఎంతవారికైన • నీ ధరిత్రి
వాని వీడ నెవఁడు • వంతకు గుఱికాఁడు
తనువు దాల్చువాఁడు • ప్రాజ్ఞుఁడైన. 209

తే. పసిఁడి వన్నె చీరను దాల్చి • భక్తిఁ దూర్పు
కన్నెపట్టిన హారతి • గాగ నుదయ
కాంతి చూపట్టు పొలములఁ • గాంచి కాంచి
పల్లెపట్టుల దాఁటెను • ప్రభువరుండు. 210

## గంగా నదీతీరము

తే. దాఁటి, తమస, వేదశ్రుతిని • దాఁటి, దాఁటి
గోమతిని, స్యందికను దాఁటి • కూర్మిఁ గనిరి
పూత గంగానదీతీర • పుణ్యభూమి
శృంగిబేర పుర సమీప • గంగవాటి. 211

మ. హరి పాదోద్భవమై మహాశివుని మూ • ర్ధాలంకృతంబై సదా
సుర సంసేవితమై మునిప్రకర సం • స్తుత్యంబునై శుద్ధమై
పరమానందకరమ్మునై ధవళమై • పాపఘ్నమై పారు శ్రీ
కర గంగాతటి విశ్రమింపఁ దలఁచెన్ • జ్ఞానాధుఁ డారేయికిన్. 212

తే. గంగ ఒడ్డున విపులమై • క్రాలుదాని
ఇంగుదీ వృక్షమూలంబు • నెంచినారు
అలపులను వాయ విశ్రమ • స్థలముగాగ
తేరు దిగి చెట్టు క్రిందకుఁ • జేరినారు. 213

## రాముఁడు - గుహుని భక్తి

ఉ. ఆ వనరాజు, రాఘవుని • యాత్మసఖుండు, గుహుండు, వించు స్వీ
50/33 యావని గంగయొడ్డునఁ బ్రి • యాన్వితుఁడై రఘురాముఁడుంట, వే
త్రోవనుబట్టె మంత్రితతి • తోడ సబాంధవ సేవకుండునై
పావన జానకీశు, భవ • బంధ విమోచను, రాముఁ గాంచఁగన్. 214

చ. కరములఁ జేర్చి యాౌదల నె • కాయకి వచ్చెడి పాదచారినిన్
చిరసఖు నా నిషాదకుల • సేవితుఁ గాంచుచు, దూరమందు, సో
దర సహితుండు రాఘవుఁడు • తా నెదురేగుచు, భక్తభక్తుఁడై
యరమర వీడి వేగఁ జని • యా గుహుసన్నిధి నిల్చు నంతటన్. 215

మ. తన ముందుం గల రామచంద్రుఁ గని చిం • తం జిక్కి వెన్వెంటనే
*మనసారన్ దమిఁ గౌఁగిలించి పలుకున్, • మా పట్టణం బేను నా
జనముల్ సర్వము నీ యధీనమె చుమా • సాగింప నీయాజ్ఞలన్
వినుమీ భక్తుఁడ కింకరుండ నిను నే • ప్రేమింతు రామప్రభూ! 216

మ. అకళంకా! భవదీయమూర్తి కిట దా • సోహమ్మనన్ గల్గి నీ
నికటం బందున నిల్పి ని న్నతిథిగా • నేఁ గొల్వఁ గానైన, నా
సుకృతం బెట్టిదొ! పూర్వజన్మమున దా • నుం డెంతొ పుణ్యంబు చే
యక, లభ్యంబగునే మదీయ వని ని • న్నర్చింపఁగా రాఘవా! 217

ఉ. స్వాగత మో రఘూత్తమ, వి • శాంపతి సత్తమ! లోకనేత! సు
స్వాగత మయ్య, మా విభుఁడ • వై, మము నేలగదయ్య రామ నా
స్వాగతమున్ గ్రహింపు మిదె • సర్వము నాయది నీదికాదె, అ
భ్యాగతి వోలెనైన గొను • మయ్య, మదీయ సపర్యలన్ బ్రభూ! 218

* "స్నేహపూర్వ మనుధ్యానం భక్తి రిత్యభిధీయతే." స్నేహపూర్వక ధ్యానమునకే భక్తి యని పేరు,

తే. ఆరయు మయోధ్యఁగా శృంగి • బేరపురము
నేనొ నీ కింకరుండను • స్నేహితుండ
అర్ఘ్య మిదె గొమ్ము షడ్రసా • హారము లివె
రాజ రాజేంద్ర ! కొనుమయ్య • రామచంద్ర ! 219

తే. ఆరగింపుము దేవరా • ఆరగింపు
హృదయ నైవేద్యమున వీని • నిచ్చుచుంటిఁ
దెచ్చియుంటిని సుఖశయ్య, • దెచ్చినాఁడ
వాజులకు మేఁతయునుఁగూడ • భక్తితోడ. 220

ఉ. భక్తుఁడ, కింకరుండ, భవ • బంధ విమోచక రామ, త్వత్పదా
సక్తుఁడ, నాదు రాజ్య రమ • సర్వము నీకిదె యిచ్చినాఁడ సం
సక్తుఁడ రామనామమున, • జానకినిన్, గనఁబోవునాఁడు, నిన్
రక్తిని నాదు నావను స • రాసరి గంగను దాఁటఁ జేయనే. 221

ఉ. నాఁటికి నేఁటికిన్; నిను మ • నంబున నిచ్చలు నిల్పుచుంటి, నే
పూటఁ ద్వదీయ పాదముల • మోపితివో, దయ నాదు నావలోఁ
దాఁటఁగ గంగ, నేను వన • ధాత్రికి రాజుగనైతి నంత, నీ
పాటి యెవండహో భువి కృ • పాపర ! ప్రాణసఖుండు బంధువున్.

ఉ. నావికుఁడన్ నిషాదుఁడ, వ • నంబున, గంగదరిన్, వసించుచున్
నావ యుపాధిగాఁగ మని • నాఁడను మున్నొక కాలమందు, నా
నావలొ గంగ దాఁటితివి • నాఁడు మునీశ్వరుఁ గూడి సీతకై
యీవు, తదాది గాఁగ నిట • నీ వన రాజుగ నైతి నీ కృపన్. 223

ఉ. నీదు కృపా విశేషమున • నే, లభియించిన రాజ్య సర్వమున్
నాదగునే ? త్వ దర్చనము • నన్ మనుచుండిన నాకదేల ! నీ
పాద సమాశ్రితుండ, నిదె • భారము వీడితి, భోజనార్థమై
నీదగు సంపదే యిపుడు • నే గొని దెచ్చితి నారగింపుమా ! 224

ద్వి. అని యా గుహుండు దన • నానంద మొంది
జనకజా ప్రియుఁ డంత • సరసోక్తిఁ బలుకు. 225

ఉ. ఓ వనరాజ! నీ పలుకు • లొల్లమి సేతునె! పాదచారివై
నీ విటు మమ్ముఁ జూడఁగ వ • నిన్ దయ చేసిన వాఁడ వౌట, సం
భావన సేతు నీ హితము; • పార్థివ ముఖ్యుఁడు తండ్రి యానచే
నే, వని కంద మూలముల • నే తిని యుండఁగనౌ తపస్విగన్. 226

తే. వాజు లవి, దశరథ రాజ • రాజ వరుని
ప్రేమ పాత్రంబు లెంచగా, • వేయఁదగును
మేఁత; వచ్చిన వెంతయో • మేర యిటకు
నిదియ నినుఁ గోరువాఁడ నా • కిదియ చాలు. 227

తే. తురగములు మేయు నంతనే • తుష్టిఁ గందు
అంతియే చాలు వేఱు నే • నఖిలమింప
దాన నే సుపూజితుఁడ న • ద్దాన నర్చి
తుండ నౌదు నిజముగ, హి • తుండ వినుము. 228

ఉ. నీదు సపర్య లన్నియును • నే గ్రహియించితి నంచు నెంచుమీ
50/41 మోద మొసంగె నీ పలుకు • ముఖ్య సఖా! భవదీయ పాలితుల్
ఖేదము నొందరంచు విని • క్లేశము లేని నినున్ ద్వదాప్తులన్
నీ ధర గాంచి తృప్తి గని•నాడ, నివే కడుఁ దృప్తి హేతువుల్. 229

ఉ. నిన్ను మదీయ ప్రాణ సఖు • నే వన రాజుఁగ గాంచఁ గల్గుటే
సన్నుతి నాకు, నీ ధరయు • సంపద, కోశము, సైన్యముల్, సదా
తిన్నగ నుంచి కొమ్ము విను • తిం గనుమీ పరిపాలనంబునన్
మన్ననఁ జూచు వాఁడ, నిటు • మామక రాజ్యముగాఁ, ద్వదీయమున్.

మ. అనుచున్ గౌఁగిటఁ జేర్చు నా గుహు నలౌ • క్యా నందునిన్ భక్తునిన్
50/42 ఘనుఁడా రాజ కులీనుఁడా సుగుణుఁడా • కంజాక్షుఁడా రాఘవుం
డిన వంశోద్భవ రామచంద్రుఁడు నిషా • దేశుండౌ భక్తిన్ బ్రప
త్తిని ధన్యోస్మి యనున్ విభున్ గనుచుఁ దృ• ప్తిన్ రాము సేవించుచున్.

ఉ. పావన మైత్రిమో పతిత • పావన, నేను, మదీయ, వంశమున్
భూవలయంబు నందొరులు • పొందని రీతిఁ ద్వదీయ సత్కృపన్
నీ విటు చిక్కినావు, నను • నెయ్యమునన్ గని; కౌఁగిలించి, రా
జీవ దళాక్ష! కింకరుఁడఁ, • జేయఁ గలట్టిది, యానతీగదే. 232

తే. అనుచు గుఱ్ఱములకు మేఁత • నపుడె వెట్ట
గుహుఁడు తెల్పుట పరిచార • కులు తుణాన
మేఁత నిడి పాలు పోసిరి • మిగులఁ బ్రీతి
భక్తవత్సల రాముండు • ప్రమద మొంద. 233

## లక్ష్మణుని సపర్యలు

ద్వి. సౌమిత్రి జాహ్నవీ • జలకంబు దెచ్చి
రాముని పదములఁ • బ్రేమతో కడిగి 234

తడి యొత్తె నంతట • ధర్మ తత్పరుఁడు
వడి వడిఁ జనుచున్న • భాస్కరున్ గనుచు 235

సౌమిత్రి దెచ్చిన • జలకంబుఁ బూని
రాముండు నెఱవేర్చె • సాంధ్య సద్విధుల 236

దివి జాప్తుఁడా గంగ • తీర్థంబుఁ ద్రావి
రవి యస్తమింపంగ • రాత్రి, తా రాఁగ 237

భూజా సమేతుఁడై • భూ తల్పమందు
పవళించి సుఖ నిద్ర • పడయ యత్నించు. 238

తే. దివ్య మంగళ విగ్రహ • దీప్తి తోడ
పవ్వళించిరి రామ దం • పతు లయోధ్య
స్వీయ సౌధ రాజంబుగా • వృత్తు మెంచి
సుఖము దుఃఖమ్ము • నొకటియా చొప్పు దోప. 239

ఉ. ఎంత మహాత్ముఁడైన నిదు • రింపఁ గలాడె తృణాళిశయ్య, గో
రంత శరీర కష్టము ధ • రం గనఁజాలని రాచబిడ్డ! భూ
కాతుఁడు కార్య తత్పరుఁడు • కర్మ మెఱింగిన వాఁడు గాన, ముం
దెంతయొ, కార్య భారము వ • హింపఁగ నుండుట, నిద్రపట్టునా! 240

తే. నాఁట నుండియు వని గమ • నంబు గాన
జన్మ కారణ మాత్మ సం • స్మరణ గలుగు
నా మహాత్మునకు దశర • థాత్మజునకు
నిశ వెడలె చాల నని తోచు • నిదుర లేక. 241

ఉ. ధర్మముఁ బూని లక్ష్మణుఁడు • తా నిదురింపక రేయి యెల్ల, స
త్కర్మఁ జరింపనున్న రఘు • కాంతునకున్ జనకాత్మ జాతకున్
దుర్మతు లౌచు నెవ్వరును • దుష్కృతి సేయఁగ రాని రీతిగా
సర్వ జగత్ప్రితన్ మమత • సారెకు సారెకుఁ గాంచు గస్తుగా. 242

తే. గస్తు తిరిగెడి లక్ష్మణుఁ • గాంచి కాంచి
వికలతను బొంది గుహుఁ • డంత విన్న వించె
లక్ష్మణా ! సుఖనిద్ర వి • లక్షణముగఁ
బొందఁ దగు నయ్య యిదె, శయ్య • పొందుమయ్య. 243

తే. నిదురఁ జెందుము లక్ష్మణా ! • నేనె రాము
5 1/4 కాచి యుండెద, మేల్కొని • కాచువాఁడ
పరి సైనను నెదిరించి • పోరఁ గలను
కలదు నా సైన్య మీవనిఁ • గాపుకాయ. 244

తే. నమ్ముమీ నమ్ముమీ లక్ష్మ • ణా ! నిజంబు
దాశరథి కంటె వేలుగాఁ • దలపఁ బోను
అతని కంటెను బ్రియతముం • డవని లేఁడు
బాస సల్పెద సత్యమే • బాస సుమ్ము. 245

తే. ఆతని ప్రసాద మొక యింత • అబ్బె నేని
51/4·5·6 యశము నర్థంబు ధర్మమ్ము • లలము కొనును
ఆ ప్రియ సఖుని ఆ రాము • నమిత నియతి
ఆ స్తతతిఁ గూడి కాపాడ • నగును నాకె. 246

తే. జానకీ రాఘవుల ధను • ష్పాణి నగుచు
నేనె సేవించి రక్షింపఁ • బూను వాఁడ
వన నివాసిని, నే వన • పాలకుండ
నిట రహస్యంబు లన్నియు • నెఱుక నాకు. 247

ద్వి. నాస్వామి రక్షింప • నాదు ధర్మంబు
ఆ స్వామి రక్షించు • నర్చించు; జనుల. 248

## శ్రీరాముని పవళింపు సేవ

ఉ. ఎవ్వరు నోచి యుండిరి, ర ♦ మేశుని రామునిఁ గౌఁగిలింపఁగా!,
నెవ్వరు దేవ దేవుని మ ♦ హేశ్వరు కౌఁగిట నుండ నోచ, నౌ
అ వ్వనజాక్షి జానకియె ♦ అట్టి మహా మహితాత్మ; అన్యు లిం
కెవ్వరు కాని యీ సుకృతి ♦ నీగతిఁ బొందిరె ? నేనె పొందితిన్.

చ. అతులిత రామచంద్రుని, మ ♦ హాత్ముని కోసల పుత్రి పొత్తిటన్
సతి, తన కౌఁగిటన్ బడయఁ ♦ జాలె, మదీయ మదెట్టి పుణ్యమో
అతనిని కౌఁగిలించితిని ♦ నాతఁడు నన్నును గౌఁగిలించె, శా
శ్వత సుఖదాయకం బిదియ ♦ సర్వ సుఖంబులు నిర్వికల్పమై. 250

ఉ. ఈ పవళింపు సేవఁ గన ♦ నేరికి లభ్యమగున్ గృతార్థుఁడన్
నాపయిఁ గూర్మి నా సఖుఁడు ♦ నా వని, నిట్టుగఁ బవ్వళించె, నా
పాపము వోయి నా సుకృతి ♦ పండిన దిప్పుడు, ధర్మమూనుచున్
గాపరి నౌచు రక్షకునిఁ ♦ గా జరియింపగ నిమ్ము లక్ష్మణా. 251

తే. అని ప్రపన్నుండు గుహుఁ డాడి ♦ యమిత భక్తి
లక్ష్మణుని గూడి విల్లూని, ♦ సూక్ష్మ దృష్టి
నతులితానందకర సుంద ♦ రాకృతులను
జానకీ రాఘవులఁ గావఁ ♦ బూను భక్తి. 252

తే. దివ్య సుందర విగ్రహ ♦ దీప్తిఁ గనుచు
తనివిఁ దీరక సౌమిత్రి ♦ వినఁగఁ బలుకు
జానకీ పతి సద్గుణ ♦ సరణి గుహుఁడు
రాఘవ గుణాను సంధాన ♦ రంజితుండు. 253

తే. లక్ష్మణుండు విని వి ♦ లక్షణ గుణములఁ
బరితపించు, నేలఁ ♦ బాన్పుఁ గొనిన
కర్మవీరు రాముఁ ♦ గాంచుచుఁ గాంచుచు
మాఱు పలికె గుహుని ♦ మాట కంత. 254

తే. అనఘ! ధార్మిక మూర్తి వీ ♦ యటవి మమ్ము
రక్షణము సేయఁ బూనుదె ♦ రాదు భయము
లేదు భీతి యొకింతయు ♦ నీదు చెంతఁ
బరమ పావన మా కిటఁ ♦ బరగు సుఖమె. 255

ఉ. సంతస మందినాడ సుఖ ♦ శయ్యా నమర్చితి వెంతో కూర్మి, భూ
కాంతుఁ డజేయ వీరుఁ డిటు ♦ కానన వృక్షము చెంత నేలపై
నింతినిఁ గూడి పండుకొన ♦ నేనెటు జీవిత సౌఖ్య నిద్రలన్
గాంతు నహో! సపర్యలకుఁ ♦ గా నొక కింకరుఁడన్ తదీయుఁడన్. 256

తే. సంతత పరార్థ రతులకు ♦ సత్య వాక్కె
యబ్బు; వారలే చుమ సుమ్మ. ♦ హాత్ము లరయ
ఆత్మ సంబోధనము సేయ ♦ ననవరతము
కాల విజ్ఞానముం బొందఁ ♦ గలరు వారు. 257

మ. ఒక వంకన్, రఘు రామ దంపతుల, నెం ♦ తో ఖేదముం బొందుచున్
వికలాత్మన్ గను; భూమి తల్పమున; బృ ♦ థ్వీనాథుఁడౌ తండ్రి జ్యే
ష్ఠ కుమారున్, సుకుమార రాము విడుటన్ ♦ సంక్షోభితాత్ముండుఁగా
సకలంబున్ త్యజియించినాఁడొ యనుచున్ ♦ సౌమిత్రి దుఃఖాత్ముఁడౌ.

ఉ. ఎంతటి దుర్దశన్ బడె న ♦ రే, నృపుఁడెంచ ! నయోధ్య పట్టణం
బెంత కృశించి పోయెనో ! న ♦ రేశుఁడు ప్రాణము వీడకుండునే
వంతల పాలు చేసి రఘు ♦ వర్యుని రాముని జానకీ సతిన్;
సుంతయు నోచ లేదు, దివిఁ ♦ జొచ్చెడి తండ్రికి చెంతనుండఁగన్. 259

తే. తండ్రి గతియింప, బ్రతుకునా ♦ తల్లు లరయ ?
వర పతివ్రత కౌసల్య ♦ బ్రతుకఁ గలదె ?
వదలి పుత్త్రుని భర్తను ♦ బాసి పుడమి
ప్రాణములు వీడకుండునా ♦ పరమ సాధ్వి ? 260

తే. తనదు కడ వేరు సుతుఁడొండు ♦ దనరు చుంట
నాదు జనని సుమిత్ర వి ♦ నాశ మొంద
దేమొ! రామ లక్ష్మణులకై ♦ యెద ప్రశాంత
మూని యున్నను బతిఁ బాసి ♦ యుండ గలదె? 261

తే. విభుని దశరథుఁ గోల్పోయి ♦ విధవ యగును
గాదె, యీ భువి సతులెల్ల ♦ కాంతుఁ బాసి
విధవలై దుఃఖితలు గారె ♦ వేడ్క దొలఁగి
మా, యయోధ్యా పురము మాటు ♦ మడఁగి పోవు. 262

తే. తండ్రి కపర కర్మలఁ జేయు • ధర్మ గతికి
నోచి యుండమొ! ఏమొ! మా • నోము లింతె
దూరమున నుండి విలపించు • దుఃస్థితి యిది
ఎట్టి వారికి లభియించు • నట్టి సుకృతి ? 263

తే. వనిని పదు నాలు గేండ్లు ని • వాసముండి
మఱలి అయోధ్యకు వెడలుట • జరుగు నొక్కొ
తండ్రిఁ గని భక్తి మ్రొక్కెడి • ధన్యులమొకొ!
కన్న తల్లుల సంప్రీతిఁ • గాంచఁ గలమె ! 264

## శ్రీరాముఁడు గంగను దాఁటుట

ద్వి. అని యిట్లు సౌమిత్రి • అమిత దుఃఖమ్ము
గనుచుండు నంతలో • గడిచె నారేయి 265

కానన ప్రస్థానఁ • గతుని శ్రీరాము
గానంగ వచ్చిన • కరణిగా నినుఁడు 266

పూర్వ దిక్కున కాంతి • మొదలిడునంత
పూర్వ సంధ్యను గర్మ • మున్ నెర వేర్ప 267

మొదలిడు సమయమే • యుదయించె నపుడు
అదె కోకిలా రావ • మధుర గానమ్ము 268

అదె బర్హి నిర్ఘోష • మది యెంత యింపొ
హృదయంబు రంజించు • నీ దృశ్యమునను 269

వడి వడి జాహ్నవి • పాఱెడి గనఁగ
తడయక దీనిని • దాఁటఁగ వలయు 270

అని పల్క శ్రీరాముఁ • డనుజున కపుడు
విని దాని గుహునకు • విశదంబు సేసి 271

వినుచుండ సూతుండు; • వేవేగ మరలి
గనె లక్ష్మణుం డంత • కాకుస్థ వరుని. 272

తే. దేవ నీయాజ్ఞ నెరవేర్చి, • తీర్చి దిద్ది
నావ సమకూర్చినాడ జా • హ్నవిని దాఁట

దృఢతమంబగు నందంపు • పడవ యిదిగొ
సెల వొసంగుము మరియేమి • సేయ వలయు. 273

ద్వి. అని కోరు గుహునకు • వన జాతుఁడంత
పని దెల్పె నావలో • పని ముట్లుఁ బెట్ట. 274

తే. బిగియఁ గట్టిన సీతమ్మ • నగల మూట
దిట్టమగు నాయుధమ్ముల • కట్ట నంత
నావ కెక్కించి గుహుఁ డంత • దేవ దేవు
సన్నిధిని నిల్చె దాసుఁడై • సఖ్య భక్తి. 275

తే. నావ రప్పించి దీర్చితి • వీవు కోర్కె
నైతి కృతకృత్యుఁడను నింక • అవలి కేగు
వాఁడనని, రాజ్య పాలన • గూఢ విధుల
దెలిపె రాముండు గుహునకు • లలిత రీతి. 276

చ. స్ఫటిక నిభాంబు గంగ దరి • చారు తరాంగులు దివ్య సుందరుల్
పటుతర బాహు విక్రమ వి • భాసుర మూర్తులు రామ లక్ష్మణుల్
కటువగు నార చీరలను • గ్రాలుచుఁ బూనిరి మట్టి పాలతో
జటల, వనిన్ జరింప; ముని • చందము రూపముఁ బొంది రంతటన్.

తే. రాజ్యమును, వీడి సామంత • రాజ్య తతిని
దాఁటి వన రాజధానిని • దాఁటనుండెఁ
గింకరుఁడు గాగ వనరాజు • కెరలి కెరలి;
రాఘవుఁడు నిల్పె రామ సా • మ్రాజ్యము వని. 278

## సుమంత్రుఁడు-భక్తి తత్పరత

తే. జాహ్నవిని దాఁటి యి • క పాదచారి యగుచు
విజనమగు చోట నడవిలో • విశ్రమింపఁ
దలఁచు రాము, సుమంత్రుండు • ప్రేమ తోడఁ
జేరి, సెలవేమి, యనుచు కైఁ • జేర్చి మ్రొక్కు. 279

ఉ. మాన్యతముండు సారథి సు • మంత్రుఁడు వృద్ధుఁడు బద్ధ హస్తుఁడై
అన్యుల గొల్వ లేని హృద • యంబున సన్నిధి నిల్చు నంతనే,

వన్యా తలంబునన్ విజన • వాటిక నుండెద నింక, నీవు సా
మాన్యుఁడ వయ్యె పెద్దవగు•మంత్రి, వయోధ్యకుఁ బోయి రాఁదగున్.

తే. తేరుతో బని లేదు నా • తీరున కిఁక
పాదచారిగ నుందు నే • వనము నందు
రాజు గడు మెచ్చు వాఁడవు • రాజ హితమె
కోరు వాఁడవు పురి కింక • జేరఁదగును. 281

## తల్లి దండ్రులకు రామ లక్ష్మణుల సందేశము

తే. అనుచు దక్షిణ పాణితో • నతని భుజముఁ
దట్టి సఖ్య భావానంద • ముట్టి పడఁగ
భక్త వరు ముట్టి రాముండు • భక్త భక్తుఁ
డౌచుఁ, దన నిశ్చితార్థంబు • నన గడంగె. 282

మ. తొలిగాఁ బుట్టిన నన్నువీడి యెటుగన్ • దుఃఖించునో తండ్రి, మం
త్రులలో వృద్ధుఁడవున్ హితుండవును సం • తుష్టిన్ నృపుండుండు రీ
తుల, నోదార్చుము జేని, నీ పలుకు లెం•తో మోదముంగూర్చు, భూ
తలనాథాగ్రణి కందజేయుము సు•మంత్రా! నా ప్రణామంబులన్. 283

చ. అమ్మల కీవు మా, వినతు • లందఁగఁ జేయుము; భక్తి తోడఁ గై
కమ్మకు మ్రొక్కి యుంటిమని•యామెకుఁ దెల్పుము, దెల్పుమయ్య షే
మమ్మని యా సుమిత్రకును • నంబకు; జెప్పుము పౌర ధర్మముల్
వమ్మొనరింప రాదనుచుఁ • బౌరులకున్ హిత మందజేయుచున్. 284

చ. అడవికిఁ బంపెఁ దండ్రి యని • యారట బొందుట లేదు, రాజ్యమున్
విడువగ నాయెనంచు విల • పించుట లేదు, పగన్ వహింప బోన్,
గడిపెద మీవనిన్ సుఖము • గా త్రుటిఁగాఁ బదునాలుగేండ్లు, పైఁ
దడయ కయోధ్యలో గురుని•దల్లులఁ జూతుమటంచుఁ దెల్పుమీ! 285

చ. భరతునిఁ బిల్చి కూర్మి మెయిఁ • బట్టముఁ గట్టుట నాదు కోర్కెగా
గురునకుఁ దెల్పుమీ, కినుక • కున్ బని లేదని యంటినంచు నీ
వెఱుక యొనర్పుమీ, సుఖము • నే, వనిఁ బొందఁగలారమంచు, నా
కొఱకు హృదిన్ వెతన్ గనుట • కున్, ఫలముండ దటంచుఁ జెప్పుమీ.

ఉ. కైక నిమిత్తమై యెటుగ • ఇక్ష్వాకు పతి యాజ్ఞలో సంగినన్ సరే
నీ కహితంబులైన నవి • నేర్పునఁ జేయుచు జేనికిన్ హితం
బే కలిగింపుమీ సఖుఁడ • వీవు నృపాలుని కెప్పు డెంచ, ని
క్ష్వాకుల క్షేమమే తలఁచు • స్వామి పరుండవు నీవ, యాటచే. 287

ఉ. తమ్ముఁడు కైక సూనుఁడు స • ధర్ముఁడు ప్రాజ్ఞుఁడు సత్యసంధుఁడై
యిమ్మహి నేలు వాని కను • మీ జనకున్ గనురీతి భక్తితో
నమ్ముల నందటిన్ సమత • నాదరణమ్మునఁ జూడు మంచు, మో
దమ్మున రాజ్య మేలఁదగు • దంచు సుమంత్ర మదీయ వాక్కుగా.

## సుమంత్రుని ప్రార్థన

చ. అని పలుకాడు రాఘవుని • నంచిత మూర్తిని గాంచి కాంచుచున్
గనుగవ నీరు నిల్వ యను • కంపయు దుఃఖము పొంగి పొర్ల, భ
క్తుని నుడి యాలకింపుము, ర • ఘూత్తమ! నిన్నెదిరించి పల్కు వాఁ
డన? అని యా సుమంత్రుఁడు వి•డన్ దలపోయఁడు రామచంద్రునిన్.

మ. వనవాసంబె సుధర్మ మంచనెడి, నీ • భావంబు మార్పంగఁ జా
లను, నిన్ని వని వీడి నే మరలఁ జా • లన్, బ్రహ్మ చర్యాది స
ద్గుణ జాలంబు వృథా ప్రయోజనము • గాఁ దోచున్ గదా! నీకె పో
వనవాసంబు ఘటిల్ల సద్గుణచయ • ప్రాప్యంబులా కష్టముల్. 290

ఉ. నిన్నెటు వీడి నట్టడవి, • నే పురికిన్ జనువాఁడ, నీవు లే
కున్న నయోధ్యలో మనుట • యొప్పునె, కైకను గొల్చు వాఁడనై
తిన్నగ నీ హయంబు లికఁ • దేరు, నయోధ్యకుఁ జేర్చు నొక్కొ! రా
మన్నను వీడి! వానిఁ గను • మా యెటులున్నవొ భక్తవత్సలా! 291

ఉ. నీవు రథంబు నెక్క నవి • నిన్నెడబాయఁగ లేక ప్రేముడిన్
ద్రోవను దెచ్చె నిన్నిటకుఁ, • ద్రోసి వనిన్ నిను; నీవు లేకయే
పోవునె తేరు నీడ్చుకొని; • పొమ్మని నన్ దయమాలి మమ్ము, నీ
త్రోవఁ జరించుమన్ బరగ • తుల్ గన నున్నవి భక్తవత్సలా! 292

ఉ. నేను హయంబులున్ రథము • నిన్నెడ బాయక వన్య వాసమున్
బూనఁగ నాజ్ఞ నిమ్ము, రథ • మున్ నడిపించుచు నీదు వెంట నీ
కానన సీమ, దుష్టులు, మృ • గంబులు, దుష్కృతి సేయకుండ వి
ల్లూని, యయోధ్య కేగఁ దుది; • నుందును వెంబడి భక్తవత్సలా! 293

ఉ. పౌరులఁ జూడనో, రథము • పారుచు నుండగఁ బర్వులెత్తుచున్
జేరిరి నిన్ను దుఃఖమునఁ, • జేరిన వారల వీడి యెట్టు లీ
తీరముఁ జేరి యుంటి మహా! • తేరున నిన్నుఁ గనంగ లేక నీ
వారలు దుఃఖ మగ్నులయి • బాధనుఁ బొందరె భక్తవత్సలా! 294

ఉ. రాముఁడు లేక యుండిన, పు • రం బిక నుండదొ భీకరాకృతిన్
సోమునిఁ జుక్కలన్ గనక • సొంపటి యుండెడి కాల రాత్రిగా
నేమని పోవుదున్ బురికి • నేనెటుఁ జూడఁగలాఁడ దాని, నే
నేమను వాఁడ నిన్ను విడి • యేడ్చెడి వారికి భక్త వత్సలా! 295

చ. బ్రతికితి నిన్నినాళ్ళు బహు • వత్సరముల్ భవదీయ సేవకై
పతితులఁ గావఁగాఁ బతిత • పావన నీ విలఁ బుట్టుదంచు, స
ద్గతులఁ దలంచి తావక ప • దాంబుజ పూజ లొనర్చు చుండి నీ
జత మెలఁగన్ దలంచు నొక • సఖ్యుఁడ భక్తుఁడ భక్తవత్సలా! 296

ఉ. నీ సహవాస మొందితిని • నిన్ను రథంబునఁ దెచ్చి కానకున్;
నీ సరి వారు లేరనఁగ • నెయ్యముఁ జూపితి వింతదాఁక, నిన్
బాసి మనంగ జాలుదునె! • భక్తుఁడ నన్ విడనాడఁ జెల్లునే
దాసుఁడ నీ వియోగ మెటు • తాళగఁ జాలుదు భక్తవత్సలా! 297

శా. రామున్ బుత్త్రుని వెంటఁ గొంటివి కదా • రాజీవ నేత్రుండు నా
రాముం డేడని నీదు తల్లి యడుగన్ • రాగంబునన్, మారుగా
నేమందున్, నిను మేనమామ గృహ మం • దేడించినా నందునా?
స్వామీ! నిన్ వనమందు వీడి యటులన్ • సత్యేతరం బందునా? 298

తే. కానఁగ, నగోచరుండవై • కాననమున
దూర మందున్న నినుఁ గాంచు • వారు జనులు
ధ్యేయ మూర్తివి భ్రూకుటి • తేజమందు
నిన్నుఁ గాంచుచు విలపించు • చుంద్రు వారు. 299

తే. నిన్ను విడనాడి పోవ వా • రెవ్వొ గతుల
మన్ను మిన్నును ముట్టెడి • మహిత రీతి
శోక తప్తులు గారొ; య • శో విశాల?
భక్తవత్సల సత్పురి • పాలకుండ. 300

ఆ. ఇంద్ర లోకమైన • నే నుండఁ దలపెట్ట
నీవు లేని చోట • దేవ దేవ
నీదు సేవ దప్ప • నే నేదియుం గోర
బ్రతికియుంటి • దానిఁ బడయు కొఱకె. 301

శా. ఆర్తత్రాణ పరాయణా! అఘ విదూ • రా! రామచంద్ర ప్రభూ!
52 ఆర్తుండన్ భవదీయ పాదముల సే • వా సక్తుఁడన్ భృత్యుఁడన్
గీర్తింతున్ భవదీయ నామమె సదా • క్లేశంబు వోవన్ దయా
మూర్తీ నన్ను రథంబు గుఱ్ఱముల గొం•పొమ్మిచ్చి సంశ్లేషమున్. 302

ఆ. పదియు నాలుగేండ్లు • వనవాస కాలంబు
క్షణము గాగ దేవ • సమసి పోవు
కాక వేయి యేండ్లు • గానైన గణియింప
నీదు సేవ కంటె • లేదు సుఖము. 303

## రాముని సమాధానము

చ. అనుచుఁ గరద్వయిన్ గలిపి • యార్తిని సత్కృపఁ గోరు భక్తునిన్
దన కడ సేవ సేయఁగ స • దా నృపు నాజ్ఞను గోరు భృత్యునిన్
జన పతి సఖ్యునిన్ హితుని • సత్యవచోనిరతున్ సుమంత్రునిన్
గని యనుకంప పూని రఘు • కాంతుఁడు దెల్పు సుధామృదూక్తులన్.

తే. పరమ భక్తుండవున్ భృత్య • వరుఁడ వంచు
నెఱుకయే నాకు నిన్నీడ • నెంచఁబోను
కాని నాకును దశరథ • క్ష్మా విభునకు
హితము నొక దానిఁ దలఁచి ని • న్నెగ మంటి. 305

ఉ. అంతయు వింటి, నీ వనిన • దంతయు హృద్యమె, కాని యెట్లు భూ
52 కాంతుని కైక నమ్మ నొకొ • కానకు వచ్చితి నంచు, సర్వ వృ
త్తాంతము నీ వయోధ్య విశ • దం బొనరింపనిచో, సుమంత్రుఁడా
వంతఁ ద్యజించి పొమ్మిక నృ • పాలునిఁ గొల్వఁగ భర్తృవత్సలా. 306

ఆ. కడచి పోవు త్రుటిని • కానన వాసంబు
మరలి వచ్చి మిమ్ము • పురము నందె
కలసి మెలసి యుందుఁ • గైకొని రాజ్యంబు

ఆ. అనుచుఁ గవచ మూని • అంబుల పొదిఁ దాల్చి
దాల్చి వింటి, ఖడ్గ • ధారు లగుచు
గంగఁ జేరినారు • కాకుస్థవరు లంత
ధాత్రిజాతఁగూడి • దాఁట నదిని. 308

తే. సీతఁ దొలు దొ_త్త నావ నా • సీనఁ జేసి
లక్ష్మణుం డెక్కె నావ, వి • లక్షణుండు
గుహునకు, సుమంత్రునకు వీడి • కోలు సలిపి
నావలోఁ జేరె రాముఁడా • నదిని దాఁట. 309

తే. తెడ్డు వేయుట తడవుగా • నొడ్డు వీడి
పొంగి పొరలుచుఁ బ్రవహించు • గంగ యందు
చెలగి చెలగాట లాడెడి • లలిత రీతి
కెరటముల మీదఁ బోవ సా • గించె నావ. 310

ద్వి. వనవాస కాలంబు • జనఁగ క్షేమముగ
జనకజ పూజించె • జాహ్నవీ నదిని 311

గంగకు ముగ్గురు • కై_మోడ్చి రంత
భంగమ్ము కాకుండ • వనవాస దీక్ష. 312

తే. భద్ర గతి నావ దిగి నారు • పయనమైరి
జనకజకు ముందు సౌమిత్రి • వెనుక భ_ర్త
నడువ సాగిరి సీతమ్మ • అడలకుండ
భాస్కరుఁడు దీ_ప్తి విడనాడు • వనుకు వనిని. 313

తే. రాత్రి వచ్చు నంత • రాచ బిడ్డలు వారు
వృక్ష మూల మందు • విడిసి నారు
విజన భూమి యందు • విపిన మధ్యంబున
తోడు గాన నట్టి • తొలి దినంబు. 314

## భ_క్త వత్సలుండు భక్తుని పరీక్షించుట

ఆ. లక్ష్మణుండు వినఁగ • రాముండు పలుకాడు
మానవుండు వోలె • మాయ నేమొ!

భక్త తతిని దలచు • వరదుని గతినేమొ
యైహిక గతిఁ దలఁచు • నతఁ డదేమొ! 315

తే. మనల రక్షించు వారేరు • గనఁగ లేరు
మనకు మనమే గదా రక్ష • మనఁగ వలయు
తనకుఁదా సీత రక్షించు • కొనఁగ లేదు
కనుక రేల మన మిఁక మే • ల్కొనఁగఁ దగును. 316

తే. పర్ణశయ్యలఁ గూర్పంగఁ • బవలు కాదు
పండుటాకుల పవళింప • వలయు మనము
ఎట్లొ యీ రాత్రి యిట నుండి • యేగ వలయు
నంచు రాముండు సౌమిత్రి • కపుడు పలుకు. 317

చ. జనకుఁడు దుఃఖ మగ్నుఁడయి • చక్కఁగ నిద్దురఁ జెందు వాఁడొకో
మన గతి నిద్రఁ బొందఁడు సుమా! యిఁక కైకయె యొక్కతే కడుం
గను సుఖ నిద్రఁ బుత్త్రకుఁడు • గాంచెడి రాజ్యము నంచుఁ, దృప్తిమై
తన పతి ప్రాణ సంకట వి • ధానము మాను నటంచు నెంచెదన్. 318

చ. గురుఁడు దివంగతుం డగుట • కున్ మన మీ గతి వన్య భూమిలో
దిరుగుటకున్ బురీ జనులు • తీరని యార్తిని మ్రగ్గుచుంటకున్
భరతుఁడు రాజ్య మేలుటకుఁ • బార్థివ పత్నులు శోక వార్నిధిన్
బరగుటకున్ గతంబు; గురు • పత్నిగఁ గైక యయోధ్యఁ జేరుటే. 319

ఆ. కనక కనక సుతులఁ • గాంచి వృద్ధుఁడు ఱేఁడు
పంపె మనల నిటులు • వనికి నేఁడు
దాన కామ మొండె • ధర్మార్థముల కంటె
దృఢతరమ్మగుటయె • తెల్లము గద! 320

తే. తండ్రి మాటనుఁ దలఁదాల్చు • తనయు నెవఁడు
మూర్ఖుఁడైనను వనికంపఁ • బూను నొక్కొ
మతి, భ్రమించినదని యెంతు • మనుజ పతికి
కాక మన కిట్టి కష్టముల్ • గలుగు నొక్కొ. 321

ఉ. కైకకు చిక్కి యుండె గద • క్ష్మాతల నాథుఁడు; భూతలేశుఁడై
చేకొనుటన్ సుతుండు ధరఁ; • జెడ్డ తలంపు వహించు నేమొ! ఆ

కైకయె, నాదు తల్లి యెడ ! • కీ డొనరించునొ నీదు తల్లికిన్
నాకును నీకు మేలుగఁ జ • నందగు వెన్కకు నీ వయోధ్యకున్. 322

ఉ. కాముక వృద్ధ రాజు సతి • కైకకు లోఁబడి యుంట వింతయే
రాముఁడు లక్ష్మణుండు మఱి • రారిక నం, చధికార దుష్టయై
యేమి యొనర్చునో సవతు • లిర్వురకున్ భరతాంబ, మాతలన్
క్షేమము గాఁగఁ జూడ నతి • శీఘ్రగతిన్ బురిఁ జేరు లక్ష్మణా. 323

చ. భరతుఁడు ధర్మ వర్తనుఁడు • ప్రాజ్ఞుఁడు చూచు మదీయ మాతనున్
కరమనురక్తి నా జననిఁ • గైక సుతుం గని యొప్పగింపుమీ
పరమ సుఖంబుగా భువికిఁ • బాలకుఁ డౌచు సతీ సమేతుఁడై
స్థిర యశముం గడింపుమని • చెప్పుము లక్ష్మణ ! నాదు మాటగా. 324

తే. ఎంత కష్టించి కని పెంచు • నింతి సుతుల
ముసలితనమున వారలు • పుత్రు లగుచు
సౌఖ్య మొనగూర్తురని కాదె • జనని తలఁచు
ఏనొ, తల్లిని విడనాడి • యిటుగ నుంటి. 325

తే. పండిన ఫలంబు చేతిలోఁ • బడెడి వేళ
కాకులో గద్దలో దానిఁ • గైకొను గతి
తల్లి కౌసల్య సుఖమునఁ • దనర నుండ
నడవి ప్రాప్తించె నాకిటు • లామె కుంద. 326

తే. గొడ్డురాలికిఁ గలిగెడు • దొడ్డ బాధ
పుత్రు లుదయించ లేదను • బుద్ధి యొకటె
జనని నను గాంచి పొందిన • సౌఖ్య మేమి ?
సతము నన్నెంచి దుఃఖించు • సరణిఁ దప్ప. 327

చ. విడిచి భయమ్ము నన్ను వని • వీడుము లక్ష్మణ; నాదు రక్షకై
యడవిని నీవు గూడ కడు • నార్తినిఁ బొంద నగత్య మేమి? నే
నెడద నొకింత భీతిఁ గన • నెప్పుడు, క్రుద్ధుఁడనైతినా, త్రుటిన్
బుడమి సమస్తమున్ గెలుతుఁ•బో యొకరుండ; నయోధ్య లెక్కయా.

ఉ. కాని యధర్మ మార్గమునఁ • గాలిడ నొల్లక వీడి శౌర్యమున్
గానకు వచ్చి నాఁడ మనఁ • గల్గియు రాజ్య రమా విభూతిమై
లోనఁ దలంచుచున్ బరము, • లోకము సాటిఁ జరింప లేదు, నే
బూనఁగ లేదు కోసలకు • భూపతిగా నభిషేక మొందఁగన్. 329

ద్వి. వని నుండఁగా నేల • ననుఁ బట్టి నీవు !
జననికి దుఃఖంబు • సమకూర్ప నేల? 330

జనకజతోఁ గూడి • మనువాఁడ వనిని
జను మయోధ్యకు నీవు • జనకు సేవింప. 331

## లక్ష్మణ ప్రపత్తి

ఉ. అన్న తలం పెఱింగి కడు • నార్తినిఁ గుందుచు లక్ష్మణుండు; రా
మన్న, క్షణంబు వీడము, సు • మా; నిను నేను ధరాత్మ జాత, నీ
సన్నిధి వీడి నీదు పద • సారస సేవ త్యజించి పోవుచో
తెన్నిక నేది యీా, వసుమఃతిన్ మనఁ జాలమటంచుఁ బల్కెఁడిన్. 332

ఉ. కాలము దేశ మేల! కల • కాలము నిన్నెడఁ బాయకుంటయే
చాలును మాకు, నీదు పద • సంస్మృతి, సేవలె చాలు మాకు, నీ
లీల లవెట్టి వైన, నెట • లీలఁగ నీవు వసించి యుండినన్
మేలగు మాకు నీదరి, న • మేయ ముదంబున నుంట రాఘవా! 333

మ. వనమైనన్ బురియైనఁ జిచ్చయిన, దే • వా ! వార్ధియేయైనఁ గా
ని, నినున్ వీడము, స్వర్గమే అయిన కా • నీ పాప లోకంబె కా
ని, నినున్ బాయగలారమే యెట నహో • నీ వుందు వచ్చోటనే
మనఁగా నెంతుము, నీ పదార్చనమునన్ • మా కయ్యెదే సౌఖ్యమౌ.

తే. జలము విడనాడి మత్స్యంబు • చచ్చెడి గతి
రాఘవుని వీడి మేమును • బ్రతుక లేము
తల్లి దండ్రులఁ జూడఁగా • దలఁపు లేదు
భ్రాంతిఁ గనఁ, జూడ శత్రుఘ్ను • స్వర్గమైన. 335

ఆ. నీవు లేని తావు ♦ నిజముగు శర్వరి
యిపు డయోధ్య నిశయె ♦ యెటుల పోదు
శశి విహీనమైన ♦ నిశయందు వసియింప,
నిపు డయోధ్య మాట ♦ యేల నాకు. 336

తే. నీదు అర్ధాంగి వైదేహి ♦ నిన్ను విడునె
53/37-34 జనకజకు వోలె ననుఁ గూడఁ ♦ గనుము రామ
వేడు చున్నాఁడ విశ్లేష ♦ *భీరువనయి
యిడుము సంశ్లేష సౌఖ్యంబె ♦ యెపుడు నాకు. 337

తే. "అన్యథా శరణం నాస్తి" ♦ యని సుమిత్ర
పుత్త్రుఁడు ప్రపత్తి సిద్ధుఁడు ♦ పూత చరితుఁ
డనుట తడవుగ మోదంబు ♦ నందె నంత
భక్త భక్తుండు మఱి యేమి ♦ పలుకఁ గలఁడు? 338

తే. రాఘవు పరీక్ష నిల్చిన ♦ రామదాసు
మర్కట కిశోర రీతిగా ♦ మసలు వానిఁ
దనదు విశ్లేష దుఃఖమ్ముఁ ♦ గనెడు వాని
రహిఁ జెలంగుచుఁ గాంచె †ప ♦ రంతపుండు. 339

ఉ. (శ్రీ) రఘురామ! ఓ పురుష ♦ సింహ! మహాత్మ! పరంతపా! విడన్
దీరునె నాకు ప్రాకృతుని ♦ తీరున, కించ సహింప, నంచు నో
దారుపు మాటలన్ బలుకు ♦ తమ్ముని రాముఁడు మెచ్చునంత సాం
ద్రారుణ దీప్తి వైభవము ♦ నం గనఁగల్గిరి వారు సూర్యునిన్. 340

*"పునర్విశ్లేష భీరుత్వం పరమా భక్తి రుచ్యతే"– పరమేశ్వర విశ్లేష భీరుత్వమే పరమభక్తి. "భక్త్యా పరమయావాపి, ప్రపత్త్యా వా మహామునే ప్రాప్యోహం, నాన్యథా ప్రాప్యః మమ కైంకర్య లిప్సుభః"–పరమభక్తిచే గాని, ప్రపత్తిచే గాని, నా కైంకర్యపరులకు నేను ప్రాప్యుఁడను. ఇతరమార్గముల నేను లభింపను.

†పరంతపుఁడు = పరులనుఁ దపింపఁ జేయువాఁడు- శత్రువులను జయించువాఁడు- భక్తులను దఱచువాఁడు.

తే. అరుణ కిరణుండు దీపించు • నంత వార
లడవి మార్గాన పయనమై • యరిగి యరిగి
యమున గంగను గూడు ప్ర • యాగఁ జేరి
యట *భరద్వాజ ఋషి వాటి • కఱిగి నారు. 341

## భరద్వాజాశ్రమము

తే. బ్రహ్మచర్య వ్రతావలం • బకుని మౌని
పక్షి మృగ శిష్య ముని యుత • పరమ ఋషిని
రాగలుఁగు కాల మెఱిఁగిన • యోగి వరునిఁ
గనుచు రాచ బిడ్డలు వారు • కై మొగిడ్చి 342

ఉ. కోసల రాజ పుత్రులము • కూరిమి తండ్రి, యనుజ్ఞఁ గానలో
వాసము సేయ వచ్చితిమి • బ్రహ్మమునీశ్వర! రామ లక్ష్మణుల్
దాసులు వీరు యోగులకు, • ధాత్రిజ యీమె మదీయ భార్య! మీ
వాసము మిమ్ముఁ జూడ నిటు • వచ్చిన వార మివే ప్రణామముల్.

చ. జనకజ, పూత, సీత, విడఁ • జాలమి నా వెనువెంట వచ్చె, ని
వ్వని విజన ప్రదేశమె ని • వాస మటంచు నెఱింగి యుండి, ల
క్ష్మణుఁ డనుజ ప్రియుండు దృఢ • సద్వ్రతుఁ డీతఁడు సోదరుండు తో
డనఁ జనుదెంచె, ధర్మము ని • రంతర మూనుచు నుండ నీవనిన్. 344

---

* భరద్వాజుఁడు :—జనన కారణంబగు రేతస్సును బదిలముగా భరించిన వాఁడగుట భరద్వాజుఁ డన బడుచున్నాఁడు.

వాజము = వీర్యము. భరద్వాజుఁడు— అస్ఖలిత బ్రహ్మచారి. "భరద్వాజోహ వై త్రిభిరా యుర్భి ర్బ్రహ్మచర్య మువాస". శ్రుతి— ఋగ్వేదారణ్యకము.

శ్లో॥ భరేసుతాన్, భరే షోష్యా, న్భరే దేవాన్, భరే ద్విజాన్, భరే భార్యా
మహాం వ్యాజా, ద్భారద్వాజోస్మి శోభనే. (అను. 142వ అధ్యా.)

నా పుత్రులు గానివారిని— మదాసీనులను— దీనులను— ద్విజులను— భార్యను— భరింతును; దాన నా పేరు భరద్వాజుఁడు అని ఆయనయే తన నామార్థ నిర్వచన— మొనరించినాడు.

## భరద్వాజుని స్వాగతము

తే. అనఁగ రాముండు వారలఁ • గనుచు మౌని
ఉచిత మర్యాదలం జేసి • యొప్పిదముగ
నర్ఘ్య మిడి యర్చనం జేసి • యతుల గతిని
కంద మూల ఫలాదుల • విం దొనర్చె. 345

తే. నిదురకై వారి కొక చోటు • నిర్ణయించి
అతిథుల సుఖోపవిష్టుల • నంతఁ గాంచి
పక్షి మృగ శిష్య ముని బృంద • పరివృతుండు
స్వాగతము పల్కె రాఘవ • స్వామి కపుడు. 346

ఉ. వింటిని, రామచంద్రుఁడు ప • విత్రుఁడు, జానకి, లక్ష్మణుండు, రా
వెంటఁ, జరించు నంచు నట • విన్, గురు నాజ్ఞ నకారణమ్ముగన్
గంటిని దానఁ జేసి చిర • కాలము నాఁటికి నేఁటి కిచ్చటన్
జంటగ మీ సతీపతులఁ • జాలఁగ వేచితి మిమ్ముఁ జూడగన్. 347

ఉ. రోజును జ్ఞాన చక్షువు ప • రుంగను, మాంసపు కన్నుదోయి, వి
భ్రాజిత దివ్య సుందరుని • రామునిఁ గాంచగ నోచె నేఁడె, అ
వ్యాజ కృపాపరుండవయి • వచ్చుట నిచ్చటి కీవు రామ, శ్రీ
రాజిల వెంట నిన్ను, గన • రాఘవ, వేచితి, నింత కాలమున్. 348

మ. యమునా గంగల సంగమ స్థలము పు • ణ్యంబున్ మహా రమ్యమున్
గమనీయంబును, గాన నావృతము, సౌ • ఖ్యం బొందఁగా, మీ ప్రవా
సము, నిచ్చోటనె, వెళ్ళఁ బుచ్చనగు, వి • శ్రాంతిన్ సదా, నా మహా
శ్రమమే వాసము గాగ, రాఘవ వరా • సన్మానులం గూడుచున్.

## రాముని సంతోషము - కోరిక

ద్వి. ఈ మాట లాలించి • యిన వంశజుండు
తా మాట మారాడెఁ • దపసి మెచ్చంగ 350

ఉ. పొందితి నీ సపర్యల సు • పూజల స్వాగతమున్ మునీంద్ర! ఆ
నందముఁ బొందితిన్, సతము • నన్గన పౌరులు గ్రామ వాసులున్
వందలు గాఁగ రాఁగలుగు • పట్టున నుండెఁ ద్వదాశ్రమంబు నే
బొందఁగఁ జాల శాంతి నిటఁ • బోయెద దూరము గాఁగ నేడకో. 351

చ. మునివర తెల్పుమీ యెచట ♦ ముప్పురమున్ వన మందు శాంతిమై
మనఁగల వారమో; విజన ♦ మై ముని వాడగ నుండు తావు, నీ
జనక నృపాత్మజాత రహి ♦ సౌఖ్యము సంతసమున్ గనంగ నే
యునికి, రహస్యమౌ నెలవు, ♦నొప్పిదమున్, గడు వాస యోగ్యమున్.

## భరద్వాజుఁడు రామునకు నివాస స్థానముఁ దెల్పుట

ద్వి. సర్వ కాలజ్ఞుఁడౌ ♦ సంయమీంద్రుండు
$\frac{5}{2}\frac{4}{3}$ సర్వ హితరతుండు ♦ జానకీ విభుఁడు 353

ఒండొరు గ్రహియించి ♦ యుండుటం జేసి
నిండు మనంబుల ♦ నెమ్మి మీఱంగ 354

ముని భరద్వాజుండు ♦ మోదంబు తోడ
ఉనికి గాఁదగు తావు ♦ మనసారఁ జెప్పె. 355

తే. గంధమాదన సన్నిభ ♦ ఖ్యాతిఁ గనిన
చిత్రకూటం బనే కొండఁ ♦ జేరు మయ్య
ఇటకు పది కోసులు సుమ నీ ♦ వేగ వలయు
దాని గను నంత నఘ చింత ♦ తరలి పోవు. 356

తే. చిత్రకూటమ్ము సౌందర్య ♦ చిత్రితమ్ము
పక్షి మృగ వృక్ష ఫల పుష్ప ♦ వర్ధనమ్ము
సిద్ధ యోగీంద్ర ముని బృంద ♦ సేవితమ్ము
వాన రావళి నివసించు ♦ పర్వతమ్ము. 357

తే. అందు మును మౌను లెందఱో ♦ అమిత తపము
పూని శీర్షాసనంబుల ♦ మేని తోడ
స్వర్గమున కేగి యుండిరి ♦ సకల గతుల
వాస యోగ్యంబు నీకుఁ బ్ర ♦ వాస మందు. 358

## చిత్రకూట పర్వతమునకు ప్రయాణము

తే. అనుచు సర్వోపచారంబు ♦ లన్ని చేయ
ధర్మ విదుఁడు భరద్వాజ ♦ తపసి; వార
లాశ్రమంబున నారేయి ♦ యంతఁ బుచ్చి
ప్రొద్దు పొడుచుట తడవుగా ♦ మునికి మ్రొక్కి 359

తే. సెలవుఁ గైకొని పయనంబుఁ • జేసి రంత
తనయులను వీడఁ జాలని • తండ్రి వోలె
వారి వెన్నాడి యా మౌని • దారి వెంటఁ
జిత్రకూటంబునకు దారిఁ • జెప్పి మరలె. 360

తే. మౌని నుడి నెంచి వారలు • కాననమున
పడమరగఁ బోయి యమునా స్ర • వంతిఁ బట్టి,
కొంత దవ్వున నొక తెప్పఁ • గూర్చి కొనిరి
యమున దాఁటిరి వట వృక్ష • మచటఁ గనిరి. 361

తే. చెట్టు చుట్టుఁ బ్రదక్షిణఁ • జేసి సీత
వనిఁ బ్రవాసమ్ము సుఖముగాఁ • బరగు రీతి
చెట్టు నాశీర్వదింపఁగాఁ • జే మొగిడ్చె
అమల యమునా నదీ మాత • నడిగి నటుగ. 362

మ. వట వృక్షంబును వీడి వారు చను త్రో • వన్ ముందు సౌమిత్రిఁ బి
మ్మట సీతమ్మను నామె వెన్క రఘు రా • మయ్యాన్ గనన్ దోచు నా
తటి వెంటన్; నిజ భక్త తత్పరుఁడు భ • క్త త్రాణ సంసిద్ధుఁడై
యటవిన్ వారల వెంబడించె నన, ర • క్షా యత్త చిత్తంబునన్. 363

ద్వి. యమునా నదీ తటి • నా రేయిఁ గడిపి
సుమనో మనోహారుల్ • సూర్యుండు రాఁగ 364

వడి వడి నడచుచు • వాసమ్ముఁ జేర
నడవి సౌందర్యమ్ము • నంత చూచుదురు. 365

పూల గుత్తుల సొంపు • పొదరిండ్ల సొబగు
వ్రేలాడు ఫలముల • ప్రియమైన తీరు 366

కొండతో ఢీకొనఁ • గొండెక్కు చెట్లు
మెండుగాఁ దరు లెక్కు • మేలైన లతలు 367

మత్త గజంబుల • మంద యానములు
పుత్తెంచి పరుగెత్తు • మురిపెంపు లేళ్ళు 368

శారికా శుక పిక • శ్రావ్య సుస్వనము
కేరించు చుండు మ • యూర నృత్యములు 369

కొమ్మ కొమ్మకు దూఁకు • కోఁతుల గములు
అమ్మెయిఁ గనుచు వా • రా వనంబునను 370

చిత్రకూటాద్రిని • జేరిరి వారు
చిత్ర విచిత్రమౌ • సిరి కల దాని. 371

## వాల్మీకి - రాముఁడు

తే. చిత్రకూట సమీపంబుఁ • జేరు నంత
రామ శబ్దంబు విన వచ్చె • రాఘువునకు
ఏరొ, తన్ను రమ్మని నట్టి • తీరు వినుచుఁ
గనఁగ నుంకించు నవ్వారిఁ • గాననమున. 372

తే. అడు గిడఁగఁ జుట్టు శ్రీరామ • యనెడి రవమె
చెట్టు పుట్టలఁ గుట్టలఁ • జెవికి సోఁకు
మంద మారుత తుందిల • మధుర రామ
రవమె విన నయ్యె నతఁడె, నా • రాయణుఁ డన.  373

ఉ. ఏడ జనించె, నీ రవ మ • దే, నలు మూలలు నిండి యుండె, ఎ
వ్వారు జపించుఁ దారకము • వ్యాప్తముగాఁగఁ జరాచరంబులన్
నేఁడు మదర్థమై, యొక, ము • నీశ్వరుఁ డుండవలెన్ దపస్వియై
చూడఁగ వచ్చు నంచుఁ దలఁ • చున్ మది రాఘువుఁ డాతనిన్ వనిన్.

క. తన భావం బౌరు లేరును
గనఁ జాలని రీతిఁ జనుచుఁ • గాంచెన్ జెంతన్
ముని వాల్మీకుని యాశ్రమ
మును భక్త పరాయణుండు • మోదము తోడన్. 375

తే. ఆ వసంత సాయం సమ • యమ్ము నందు
ప్రకృతి సౌందర్య, మనుభూతిఁ • బడసి వారు
చనిరి వాల్మీకి యాశ్రమ • స్థలికి; నచట
ముని పదములకు మ్రొక్కిరి • మోద మలర. 376

తే. కనుచు వాల్మీకి రఘు రాము • కమల విభుని
సుందర తనూ విలాసు వి • శుద్ధ చరితు
జానకీ లక్ష్మణాన్వితు • జటలధారిఁ
నాత్మఁ దలపోయు "ధన్యోస్మి" • యనుచు నంత. 377

## వాల్మీకి స్వాగతము

చ. అతిథుల పూజఁ జేసి ముని • హర్షముఁ దెల్పుచు వారి కంత స్వా
గత మిడుచున్ ముదంబుఁ గనెఁ • గానకు వచ్చిన గాథ, జానకీ
పతి వివరించి తెల్పి సుఖ • వంతముఁగా వని వాస యోగ్యమౌ
గతిఁ గల వాడఁ దెల్పుమనఁ • గా, ముని వల్కెడి మందహాసుఁడై.

చ. సకల జనావనుండ హరి! • సర్వ జగత్పిత! రామచంద్ర! నీ
కొక నిలయంబు గావలయు • నోయి! విచిత్రము నీదు మాట! నే
నొకొ! భువనత్రయీ మయున•కొక్కొ! నివాసముఁ దెల్పువాఁడ, సృ
ష్టికిఁ గతివైన నీవహా! వ • సింపవె సర్వ చరాచరంబులన్. (అ) 379

ఉ. ఎవ్వఁడు రామ నామము ర • హిన్ జపియించుచు వీత రాగియౌ
ఎవ్వఁడు నీవె దిక్కనునొ • ఎవ్వఁడు ద్వంద్వము దాఁటి యుండునో
అవ్వరణీయు సద్హృది, ని • రంతరమున్ భవదీయ వాసమౌ
నివ్వనిఁ గూడ నుండఁ దగు • దీవు ముని ప్రకరాత్మ వాసివై. (ఆ)
(అ. ఆ. అధ్యా. రా. సర్గ 6)

ఉ. రామ జపంబు సేయుచు వి • రామము లేక మహర్షినైతిఁ, ద
అధ్యా. రా. స. 2-6 న్నామ మహత్త్వ మెట్టిదొ, వి • ధాతకునైన వచింపనౌనె! శ్రీ
రామ, కిరాత వృత్తి మెయి • రాత్రుల దారులఁ గొట్టు దొంగనై
నీ మహిమన్ గ్రహింప నయి • నేఁ డిట నిగ్గన వేచి యుంటిఁగా. 381

ద్వి. ముని మాటలన్ విని • వినసల్లె యుండి
జనకజా ప్రియుఁ డంత • చల్లగఁ బలుకు. 382

చ. జల ఫల జంతు సంతతుల • సర్వ సమృద్ధిగఁ గూడి యుండి, మౌ
నుల కిరవైన వాడగ, వ • నూన లతా సుమ శోభితంబునై
చెలఁగెడి చిత్రకూటము, వ • సించెడి తావుగ స్వీకరింపఁగా
వలదొ! ప్రశాంతిమై నిటఁ బ్ర • వాసముఁ బుచ్చగనౌనె సన్మునీ.

## చిత్రకూటము - శ్రీరామాశ్రమము

ద్వి. అనెడి రాముని కంత • నా, నాకుజుండు
వనిఁ జూపె నొక చోటు • భద్రమౌ దాని. (అధ్యా. సర్గ 6) 384

ఆ. సకల శాస్త్ర విదుఁడు • సౌమిత్రి యంతట
నన్న యానఁ జేసి • అమరిచె నొక
పర్ణశాల రామ • భద్రుండు సతిఁ గూడి
సలిపె వాస్తు పూజ • శాస్త్ర రీతి. 385

ద్వి. మాల్యవతీ తటి • మహనీయ వనము
మాల్యవతీ తీర • మహదాశ్రమంబు. 386

ఉ. కోసలరాజ పుత్త్రకుఁ డ • కుంఠిత తేజుఁడు రాఘవుండు, స
న్న్యాసి యనంగ నుండిన మ • హాత్ముఁడు కారణ జన్ముఁ డౌటచే
వాసము సేయ నీ వనికి • వచ్చినవాఁడు, స్వరాజ్య సౌఖ్యముల్,
దాసుల, భక్తులన్ విడిచి • దాస జనావనుఁ డుండె నేఁ డిటన్. 387

తే. జనన మరణంబు లెన్నియో • గనుచుఁ గనుచు
యోగ మూనియొ, తప మూని • యో, కనంగ
నైన రాఘవుం డిచటనే • గాన నయ్యె
నంచుఁ గెరలుచు మునివరు • లతనిఁ గాంత్రు. 388

తే. చిత్రకూటమ్ము ముని జన • సేవితమ్ము
సహజ వాసంబుగా రామ • చంద్రుఁ డెంచి
వీడియు నయోధ్య, యీ క్రొత్త • వీటి యందు
దివ్య సంతుష్టిఁ గనెడి నై • దేహిఁ గూడి. 389

తే. కష్ట సుఖములు రెండు నొ • క్కటిగ నెంచి
ధర్మపరు లౌచు మన రెవే • దాంతు లెపుడు
కష్ట సుఖములు మఱచుచు • కార్య పరులు
సర్వమును శివంకరమ్మని • శాంతిఁ గనరె. 390

## సుమంత్రుఁడు ఇంటికి మరలుట

చ. బిర బిర నావ సాగినది • బిక్కమొగంబుల నైచి యొడ్డునన్
బరఁగు నిషాదరాట్ గుహుఁడు, • భక్తజనాళి, సుమంత్ర సూతుఁడున్
కర మనురక్తి గాంచెదరు • గంగను దాఁటెడి నావ, వే, యగో
చర మగుదాఁక నొండొరులఁ • జయ్యనఁ బాయఁగలారె సత్ప్రియుల్.

తే. జన్మకారణ దీక్షమై • చనెడి విభుని
గాంచలేమిని కన్నీరుఁ • గార్చుచుండి
మరల రండను, నేమొ, యన్ • మమతఁ దగిలి
మరలి పోలేరు, గుహుఁడు సు • మంత్రుఁ డపుడు. 392

ఆ. అవ్వలి దరి నావ • నవ్వారు దిగుదాఁక
చూపు మేర గాంచి • చూడలేక
మరలి చని గుహుఁడు సు • మంత్రియు నిర్వురు
వేచియుండిరి గుహు • వీటియందు. 393

ఉ. మూఁడుదినంబు లేగ వన • భూపుని చారులు వచ్చి రాముఁడున్
దోడును సీతయున్ జనిన • ద్రోవయు, వారలు మౌనివర్యులం
గూడి సపర్య లందుటయుఁ • గోమలమూర్తులు చిత్రకూటమున్
వీడుగఁ గొంచు నచ్చటనె • ప్రీతిగ నుండి రటంచుఁ దెల్పఁగన్. 394

ద్వి. ఆ మాట లాలించి • యా సుమంత్రుండు
రాముండు తన్నింక • రమ్మను ననెడి 395

ఆశల విడనాడి • ఆ గుహు వీడి
దేశంబునకుఁ బోవఁ • దేరు సాగించె. 396

పల్లెపట్టుల నెన్నొ • పట్టణంబులను
మెల్లగా దాఁటుచుఁ • గల్లోలహృదిని 397

జేరె నయోధ్యకుఁ • దేరుతోఁ గూడ
మారాము సేయుచు • మరల గుఱ్ఱములు. 398

ఉ. చొప్పఱియున్న పట్టణముఁ • జూచియుఁ జూడఁగలేక మంత్రి పెన్
ముప్పు ఘటిల్లె నే నెటుగ • భూపతిఁ గాంచి, యుదంత మెల్లనున్,
జెప్పెద! దుఃఖితాత్ముఁడ, న • శేష జగత్పిత, రామచంద్రుఁ, మా
యప్పను వీడితిన్ వని న • టం చని పల్కఁగ, నోరు వచ్చునే. 399

## సుమంత్రుఁడు దశరథునకు రామ వృత్తాంతముఁ దెల్పుట

మ. అని దుఃఖించుచు నా సుమంత్రుఁడును సా • యంవేళ భూపాలునిన్
గని "రాముండు వనీ నివాసుఁడు గదా • కాంతారసీమన్ మహా

మును లాతిథ్య మొసంగి కొల్చిరి సుమా • పూజించి సేవించె నా
వన పాలుండును, జిత్రకూటము వసిం • పన్ దావనెన్ ఖిన్నుఁడై.

ఉ. సూతుని మాటలన్ వినుచు • స్రుక్కుచు మూర్ఛిలె ఱేఁడు, తోడనే
చేతుల లేవనెత్తి రటఁ • జెంతనె నిల్చిన పత్ను లిర్వురున్
జేతము గూడఁదీసికొని • శీఘ్రముగా, నరనాథుఁ డేడ్చెడిన్,
పూతచరిత్రుఁడే యడవిఁ • బొందె నటంచుఁ దలంచి మాటికిన్. 401-

ఉ. ఎగ్గొనరించి రాఘవున • కీవిటు గుందఁగ నేల, కైక నీ
దగ్గరలేదు పుత్త్రుని యు • దంతము సర్వము నాలకింపుమీ
సిగ్గిల నేల! చేత మిటు • చేడ్వడ నేల! భయమ్ము వీడుమీ
మొగ్గగు సత్య సత్ఫలము • పుత్త్రుని పీడిన నేమి భూవరా! 402

తే. అనుచు కౌసల్యయును గాంచు • నంత మూర్ఛ
అంతిపురమందు స్త్రీలెల్ల • నయ్యొ అయ్యొ
అని విలాపింప, నారావ • మలముకొనియె
పురము పుర మెల్ల శోక సం • ప్లుతముగాఁగ. 403

ద్వి. సూతు సుమంత్రునిఁ • జూచుచు నేడ్చు
భూతలనాథుండు • పొక్కుచు హృదిని. 404

ఉ. హా! రఘురామ! హా! జనక • జా! అబలామణి! లక్ష్మణా వనిన్
జేరుచు చిత్రకూటగిరిఁ • జెట్టుల గుట్టల నుండ నెంతురో
చారుతర ప్రశాంత సుఖ • సౌధము లాయెనె వన్యభూములే
కారడవిన్ వసింతువొకొ • కాంతను లక్ష్మణుఁ గూడి పుత్త్రకా. 405

మ. జనశూన్యంబగు నా వనాంతరము శే • ష ప్రాత సంచార కా
నన భూమిన్ బహుఘోర జంతుమయ కాం • తారంబునన్ నేలపై
తనువున్ మోపుచు నిద్రఁ జెందెనొకొ, నా•ధర్మాత్ముఁ, డే మూలముల్
దినుచుండెన్ సుకుమారుఁ డే యడవిలో • దీక్షించి యున్నాఁడహో.

ఉ. మా రఘురాముఁ డేమనియె? • మా జనకాత్మజ యేమి చెప్పె? ఏ
తీరునఁ బల్కె లక్ష్మణుఁడు • తెల్లముగా వివరింపుమీ, వినన్
గోరుదు నో సుమంత్ర, రఘు • కుంజరుఁ జూచినరీతి నుండు న
వ్వారల మాటలన్ వినినఁ • బ్రాణము నిల్చెడి కొంతకాలమేన్. 407

ఉ. చేతము దుఃఖభాజన వి • శీర్ణముగాఁ దలపోయుచున్ సుతున్
బూతచరిత్రునిన్ బురుష • పుంగవు సుందరమూర్తి రాఘవున్
సూతుని దెల్పఁ గోరెడి, వ • సుంధరనాథుఁడు, పుత్త్రవార్త సా
కేత పురంబువీడి వని • కిన్ జనియుండిన రీతు లన్నియున్. 408

శా. పద విన్యాస పవిత్రతాఖిల జగ • త్పాలుండు రాముండు స
త్పథముంబట్టి వనీ తలంబునకుఁ బో • దారిన్ జనానీకముల్
ప్రథితున్, శ్యామవపు ర్విలాస విభవున్ • భార్యాయుతున్, సానుజున్
గని "ధన్యాస్స్మ" యటంచు వారని, రతౌ•క్యానందముం బొందుచున్.

ఉ. వేనకువేలు పౌరు లహా • వెంబడి రా, రఘురామచంద్రునిన్
గానకు, వారుఁగూడ నటఁ • గాలముఁ బుచ్చఁగ, వారి నెల్లరన్
మానధనుండు తప్పికొని • మారుత వేగముతో రథమ్ము గం
గానదిఁ జేర నచ్చట సు • ఖంబుగ నుండిరి మువ్వు రా నిశన్. 410

ఆ. వీరి రాక వినుచు • విపిన భూనాథుండు
గుహుఁడు బంధు మిత్ర • కోటితోడ
వచ్చి దాశరథికిఁ • బ్రణమిల్లి భక్తిమై
విందు సేయనెంచె • విహితరీతి. 411

ఆ. విందుఁ గుడువలేదు • వీరుండు రాముండు
గంగ జలము ద్రావి • గడిపె రేయి
తెల్లవార గుహుఁడు • తెప్ప నమర్పంగ
గంగదాఁటి చనుచుఁ • గాంచి నన్ను 412

## రామ లక్ష్మణ సందేశములను దెల్పుట

ద్వి. నీ సుతు లాడిరి • నీతోడఁ జెప్ప
బాసల కొన్నింటి • పార్థివా వినుము. 413

క. జననీ జనకుల కెఱఁగితి
ననుమీ కుశలంబె యంచు • నటవిన్ మేమున్
మనవి యొనర్పుము మఱి మఱి
వినతు లొనర్చితి నటంచు • వివరింపఁ దగున్. 414

ఉ. అమ్మలకెల్ల నా వినతు • లందఁగఁ జేయుము వారికెల్ల శ్రే
యమ్ముగ నుంటి మంచు వన • మందున దెల్పుము భర్తృ సేవయే
చుమ్ము మహా సుధర్మమని • స్రుక్కెడి తల్లికిఁ జెప్పు, కైకతో
నిమ్ముగ నుండఁ గోరితిని • నే నని యామె కెఱుంగఁ జెప్పుమీ. 415

చ. భరతు కుమారకున్ సతము • భద్రముఁగాఁ గని పెట్టి యుండుమీ
వరలఁగఁ గీర్తి మంతుఁడయి • పట్టపు చేలికగా సతమ్ము, నా
కొఱకు దిగుల్ పడం దగదు, • కూరిమిమై కను సాటి వారి, నే
యఱమర లేక నెల్లయెడ • నంచని, నా నుడి, దెల్పు మమ్మకున్.

చ. భరతుని తోడ నా నుడిగఁ • బల్కుము, రాజ్యము నూని, ధర్మమున్
నెరపుచు నెప్డు తాత నుడి • నే పరిపాలన సేయఁగాఁ దగున్
బరమ హితంబు నా కదియ, • భద్రముగా మువురమ్మలన్, సదా
గురుతర భక్తిఁ జూడుమను • కోరికఁ గోరితి నంచుఁ దెల్పుమీ. 417

తే. పుత్త్రవిశ్లేష దుఃఖమ్ము • పొందు జననిఁ
జూడుమీ నీదు తల్లినిఁ • జూచురీతి
ననెను రాముండు భరతున • కశ్రుధార,
విన్నవించితి నీ రాముఁ • డన్న నుడుల. 418

తే. ఇంక సౌమిత్రి మాటల • నెల్ల వినుము
వేడి నిట్టూర్పులన్ వీడి • విడుచుచుండి
అమిత సంక్రుద్ధుఁ డౌచు తా • ననఁ, గడంగె
నెఱ్ఱవాఱఁగఁ గను గవ • యెల్లరు విన. 419

ఉ. రాముఁ డొనర్చినట్టి యప • రాధ మదేమి? ప్రవాస శిక్షకున్!
భూమిధవుండు పుత్త్రు నిటు • పొమ్మను కారణమేమి? కైకయా
రామ యనుజ్ఞమై నిటుగ • రాజె యొనర్చె నకృత్యమున్ మమున్
బాముల పాలు సేయుచు నృ • పాలుఁడు దుష్కృత మాచరింపఁడే.

చ. దశరథు నింక నేఁ దలఁపఁ • దండ్రిగ బుద్ధి విహీనుఁ డౌటయే
విశదము, యోజనన్ విడిచి • వీరునిఁ గానకుఁ బంపి, పిమ్మటన్
యశము నశించు నంచు నన • యంబు కృశించుచు నున్నవాఁడు, దు
ర్దశ నధికార గర్వమునఁ • దప్పొనరించిన వాఁడు ఈఁడె పో! 421

తే. రాజ్య లోభమ్మె హేతువు, • రాజు, సుతుని
అడవి కంపుట కందుమూ • అదియుఁ దప్పు
కైక కిడి నట్టి వరములే • కారణ మన
అంతకంటెను దుష్కృత • మసలె లేదు. 422

ఉ. అన్నయు, భర్తయున్, గురుఁడు, • నాప్తుఁడు, సర్వము నాకు రాముఁడే
అన్ని జగంబులన్ బ్రియుఁడు • నందఱకున్ హిత మూనువాఁడు, నా
పన్న శరణ్యుఁడున్ బ్రజల • బాంధవుఁడున్ రఘురాము వీడి, ఏ
తెన్నున రాజ్య మేలెదు, ప • దే పదె లోకము దిట్టి పోయదే! 423

ఉ. మాట యొకింతఁ బల్కదు సు • మా జనకాత్మజ సీత, దుఃఖమే
మూటగఁ గట్టి బ్రహ్మ భువిఁ • బుట్టగఁ జేసెనో! ఆ తపస్వినిన్,
గాటుక కంటి నీరు కడుఁ • గార్చుచు దయ్యము సోఁకెనా యనన్
మాటయు మంతి లేక యస • మానముగాఁ బతి చెంత నుండెఁగా.

చ. జటల ధరించి రాఘవులు • చయ్యన నావనుఁ జేరి జాహ్నవీ
తటమును వీడి దివ్యనది • దాఁటిరి, పోయిరి పాదచారులై
యటవినిఁ బోయి పోవుచుఁ బ్ర • యాగను జేరిరి ప్రొద్దుగ్రుంక నే
నట గుహుఁ జేరి యాతని గృ • హంబున నుంటిని మూఁడునాళ్ళుగా.

ఉ. ముందుగ లక్ష్మణుండు విలు • పూనుచుఁ బోవగ దారిఁదీయుచున్
సుందరి జానకీ తనయ • శుద్ధ యశస్విని - వెన్కఁ బోవు, సా
నందుఁడు రామచంద్రుఁడు వ • నంబున నిర్వురఁ గాచు రీతిఁ గన్
విందుగ వెంటనుండ ముని • వీటికిఁ జేరిరి మువ్వు రా నిశన్. 426

## ఇంటికి మరలు వృత్తాంతము - దారిలోఁ గల దృశ్యములు సుమంత్రుఁడు దెల్పుట

తే. రామచంద్రుండు కానన • సీమలోన
అడుగిడుటఁ జూచుచుండియు • నతని తోడ
వెడలఁ జాలక వచ్చితి • వీటి కిటుఁగ
నే పరాధీనుఁడున్ గాదె • భూపవర్య. 427

తే. రాముఁ డేమైన, మరల రా • రమ్మను నని
కబురు పంపునా యను నాశఁ • గలిగియుంటి

బహు దినంబులు గుహు నింటఁ • బామరుఁ గతి
ఆశ లడుగంట మరలితి • అవనినాథ. 428

ద్వి. అదలించినను, లాగ • వశ్వముల్ రథము
బెదరవు పాఱవు • విడుచు కన్నీరు 429

సీతమ్మఁ దలపోసి • శ్రీరాము నెంచి
చేతమ్మునన్ ద్రొక్కి • చేరితి నిటకు. 430

తే. రామ విశ్లేష వహ్ని, లో • రాజుచుండ,
నెంత అదలించుచున్నను • సుంతయైన
బెదరలే దా, హయమ్ములు • వేచి వేచి
వేడి కన్నీరు గార్చెను • వీడుఁ జేర. 431

తే. దశరథ నృపాల! తెల్పెద • దారియందు
గనిన దంతయు, రామునిఁ • గాన లేక
నీదు రాజ్యంబు సర్వంబు • నెగడుచుండెఁ
బాసి సౌందర్య మంత వి • వర్ణతఁ గని. 432

తే. రామ విశ్లేష దుఃఖ ప • రమ్మొ యగుట
వృక్షములుఁ గూడ మొదలంట • నెండుచుండె
మొలకలును మొగ్గలును నెండి • పుష్పచయము
గానఁగా, రాదు, నీ మహో • ద్యాన వనుల. 433

తే. ఇఁక నదీ నదంబుల నీర • మింకె నకట
వేడి నీరంబె యెటనైనఁ • జూడనగును
ఎండి చెల్లెల్ల మోడులై • యుండె రాజ
ప్రకృతి త్యజియించె సౌందర్య • పరిధవమ్ము. 434

చ. వనతతులందు క్రూరమృగ • వర్గముకూడ త్యజించె హారమున్
దన కెదురొచు వచ్చినను • దాఁకదు వేరు మృగంబు నేదియున్,
ధ్వని వినిపించ దింతయు, ని • తాంతము కాననసీమయందు, రా
ముని విడనాడుటన్ విపిన • ముల్ కృశియించెడి శోభ వీడుచున్.

ఉ. చూడు మయోధ్య యెల్లెడల • సొంపఱియున్నది, ఒక్కఁడేనియున్
జూడఁగరాఁడు సంతసముఁ • జూపెడివాఁడు, రఘూత్తముం డహో

పడఁ జరించువాఁ డనచు • నేడ్చెడి వారలె తేరుఁ జూచుచున్
మేడల మిద్దెలన్ నిలిచి • మిక్కిలి యేడ్చె రహో వధూతతుల్. 436

తే. సకలజీవులు సంతాప • జలధియందు
మునిగి తేలుచునున్నారు • జనవిభుండ!
పట్టణంబెల్లఁ గాంచుమీ • ప్రమదము విడి
పుత్త్రుఁ బాసిన కౌసల్య • పోల్కె నుండె. 437

క. వినుచున్ సూతుని మాటల
జననాథుఁడు దీనుఁ డౌచు • సరసిజ నయనున్
వనచారిని రామునిఁ బు
త్త్రుని లోఁ దలపోసి సూతు • తోడన్ బలుకున్. 438

## దశరథ పశ్చాత్తాపము

ఉ. యోజన సేయనైతి, నవ • యోగమునన్ సుతు నంపువేళ, వి
భ్రాజిత ధర్మతత్పరత వి • రాగులు మౌనులతోడ, మిత్రులౌ
రాజుల పౌరులన్, సచివ • రాజినిఁ బిల్చియు, రామచంద్రు న
వ్యాజ కృపాంతరంగు వనిఁ • బట్టగఁ జేసితి బుద్ధిహీనతన్. 439

ఉ. కామినికిన్ వశం వదుఁడఁ, • గాముకుఁడన్ వని కంపియుంటి శ్రీ
రాముని స్త్రీ నిమిత్తముగ • రక్కసి కైక కతమ్మునన్, బరం
ధాముఁడె స్వేచ్ఛతోడ, భవి • తవ్యము నెంచియె, యిట్లు చేసెనా?
నా మహనీయవంశము వి • నాశన మొందునో కర్మ మెట్టిదో! 440

ఉ. నీ కుపకార మేదయిన • నే నొనరించినవాఁడ నేని మున్,
నా కిపు డొండు సత్కృతి నొ • నర్పఁగఁ గోరెడివాఁడ, రాఘవుం
డే కడనుండెనో యటకె • యీ కడువృద్ధునిఁగూడ జేర్పుమీ
నే కనులార నాదు సుతు • నిన్ గనకుండిన ప్రాణముండునే. 441

ఉ. శ్యామల దివ్యదేహు, రుచి • రాస్పదు, పద్మదళాయతాక్షునిన్
59/24 గోమలు వృత్త దంష్ట్రి మణి • కుండల మండిత మోహనాననున్
22-23 ప్రేమమయున్ గృపాపరు, న • భీతమహోబల దీర్ఘబాహు, కాం
24-26 తామణి జానకీ సహితు • దాశరథిన్ గన నోచనా యిఁకన్. 442

చ. బ్రతుకఁగఁజాల నొక్క త్రుటి • రాముని, *రాఘువుఁ జూడకున్నచో
59/25-26 బ్రతుకు లయింపఁ, జూడకయె • రాముని నేను, యమక్షయంబునన్
బతితుఁడ నౌదు; రాఘవ! శు • భాకర! తావక దర్శనార్థినిన్
స్మతి చెడినట్టి వృద్ధుఁ గరు • ణామతిఁ గానఁగ రావదేలకో! 443

ద్వి. హో రామ; రామాను • జా! ధాత్రిజాత!
ఘోరాటవీవాస • కారకుండ నొకొ 444

పొమ్మని వని కంపి • పొక్కుచు నుంటి
మిమ్మెట్లుఁ గన నెంతు • మేనితో నింక. 445

తే. "ఏ ననాథునివోలె దుః • ఖించుచుంటి
చచ్చుచున్నాఁడ నయ్యో! యీ • చావువార్త
మీ రెఱుంగరుగద" అని • మితిఁ దొలంగి
పరమ శోకాబ్ధి మునిఁగెడి • పార్థివుండు. 446

తే. రామ విశ్లేష శోక నీ • రధిని బడితి
సీత విరహంబె పారమౌ • సింధు విదియ
సతము శ్వసితోర్మి కావర్త • సంకులంబు
బాష్ప ఫేన జలావిల • ప్రకటితమ్ము. 447

తే. బాహువిక్షేప మీనౌఘ • వర్థితమ్ము
దుర్భరాక్రందన స్వన • తుందిలమ్ము
ఆ ప్రకీర్ణ కైశిక శైవ • లాన్వితమ్ము
కేకయీ బడబాముఖ • కీలితమ్ము. 448

తే. కుబ్జవాక్య మహో గ్రహ • కూటయుతము
కైక యీ వరద్వయ జలా • కరము కరము
రామ వనవాస భీతి దై • ర్ఘ్యంబు వనధి
మాను కీయాత్రు వేగ సం • భవ మహాబ్ధిఁ
బడితి తరియించి నే నింకఁ • బ్రతుకఁ గలనె. 449

తే. ఈ మహా శోక సాగర • మెవరితరము
తరణముం గాంచ దిక్కొక్క • దాశరథియె

*రాఘవుఁడు = సర్వజ్ఞుఁడు. (యది రామం న పశ్యేయం.)

ఆతనిం గాంచ కుండిన • నంత మొంద
దొక్కొ నా బ్రతుకింతతో • దిక్కు లేక. 450

తే. రాము నిఁకఁ జూడకున్నచో • బ్రాణము లివె
పోక నిలుచుట దుస్తర • ము గద! దేవి
రామ లక్ష్మణులనుఁ జూడ • రాని బ్రతుకు
ఇంతకంటె, నశోభన • మేమిగలదు! 451

## సుమంత్రుఁడు కౌసల్య నోదార్చుట

తే. అనుచు విలపించి విలపించి • యా నృపుండు
మూర్ఛితుండాయె; కౌసల్య • పుత్త్రు నెంచి
ఖేద మొందుటయే కాక • మోదముడిగి
భర్త కేమి గల్గునో యను • బాధ నొంది 452

తే. మూర్ఛకుం జిక్కి తెలివొంది • మోమునెత్తి
కాంచుచు, సుమంత్రుఁ గన్నీరు • గార్చుచుండి
రామ లక్ష్మణ జానకీ • రామ లున్న
వనకి ననుఁ గూడఁ జేర్పుమీ • యనుచుఁ బలికె. 453

తే. వారి విడనాడి క్షణమేని • బ్రతుకఁ జాల
రథము మరలించి దండకా • పథముఁ బట్టి
రాముకడఁ జేర్పుమీ నన్ను • రయము తోడ
అతనిఁ గనకున్నఁ జనెద, య • మాలయంబు. 454

చ. కనుగవ నీరు గ్రమ్మఁ గడు • గద్గదికంబున, సూతుఁడంత, రా
ణిని గని కైమొగుడ్చుచు, వ • నీస్థలి క్షేమము గాఁగ నుండె నీ
తనయుఁడు, వీడు మోహమునుఁ • దల్లిరో దుఃఖము సంభ్రమంబును
గనఁ బనిలేదు, రాఘవుఁడు • గాంచెడి సౌఖ్యమె వన్యభూములన్.

మ. అనుగుం దమ్ముఁడు లక్ష్మణుం డెపుడు ధ • ర్మాయత్త చిత్తుండు రా
ముని పాదంబులఁ గొల్చుచుండు సతమున్ • మోక్షంబు కాంక్షించి యా
వనమే యిల్లుగ నెంచి, సీత విజనం • బైనన్ భయంబొందకే
మను రామున్ హృది నిల్పి, నిల్పి హృదయం • బా రాము పాదద్వయిన్.

మ. వనవాసం బొక యింతయేని గణియిం • పం బోదు వై దేహి, లో,
మనమందేనియు దుఃఖమొంద దహా! రా • మా ధీన చిత్తంబునన్
వని యుద్యాన వనంబు భాతి విహరిం • పం జాలి సీతమ్మ తు
ష్టినిఁ గాంచున్ సతతంబు బాలిక గతిన్ • సేవించుచున్ రామునిన్.

తే. రాము విడిచి, యయోధ్య నా • రామ యున్న
అడవి పాలైన రీతిగా • నార్తిఁ గనదొ
రాముఁడే, హృది ప్రాణ మా • రామ కెపుడు
రాఘవుని వీడి యుండ దా • రమణి యెపుడు. 458

తే. అనుచు నేమేమొ సీత వా • క్యాను సరణిఁ
జెప్పఁ బోవుచు మానుచుఁ • జెప్పకుండ
మధుర వచనంబులం బల్కి • మంత్రి యపుడు
వారి నోదార్చి యూఱడిం • పంగఁ దలఁచు. 459

చ. పులుగులు వచ్చుఁ గాక గజ • ముల్ కనిపించెడి గాక సింహముల్
పలుమరు డాయుఁ గాక పెను • బాములు దారుల నుండుఁ గాక, ఆ
అలికులవేణి మోమున, భ • యం బొక యింతయుఁ దోఁపదెప్డు, కాం
తిని, లవమైన వీడదు ప • తివ్రత రాఘవ సంశ్రితాత్మయై. 460

చ. తగదు విచారముం గనఁగ • దాశరథిన్ దలపోసి, లక్ష్మణున్,
సుగుణవతీ లలామఁ గడు • సుందరినిన్ మదినెంచి, యీ, కథా
నిగమము శాశ్వతం బగుచు • నిల్చెడి ధాత్రిని, దండ్రి యానకున్
వగవక పుత్త్రు లిట్లు వనిఁ • బట్టుట వింటిమె యెన్నఁ డేనియున్.

తే. జానకీ రామ లక్ష్మణుల్ • కాననమునఁ
బ్రకృతి సౌందర్య సీమలోఁ • బరఁగు వారు
దుఃఖ వర్జితులై వారు • తుష్టిఁ గనుచు
ధర్మ తత్పరులై యున్న • ధర్మ యుతులు. 462

## కౌసల్య అనుభూతి

తే. అను సుమంత్రుని మాట లా • యమ్మ వినుచుఁ
గొంత తనివొందియును గూడ • వంత విడదు
పుత్త్ర విశ్లేష శోకార్తి • పోవు నొక్కొ
సకల గుణధాముఁ గనియుఁ • గౌసల్య యేడ్చు. 463

తే. రామ! రఘురామ! ధర్మ ప • రా! సుపుత్ర!
వనము నందుంటివోయి నా • వరకుమార!
చిన్ననాఁటను సుఖములఁ • గన్న నీవు
అనుచు నేడ్చుచుఁ బతిఁ గని • యబల పలుకు. 464

ఉ. ఎంతయొ కీర్తి బొందిన, మ • హీపతివై, యపకీర్తిఁ బొందినా
వెంతయొ, అంతెగాక వెత • కీ గతిఁ జిక్కితి వీవు, జానకీ
కాంతయు లక్ష్మణుండు రఘు • కాంతుఁడు ఘోర వనిన్ వసింపఁగా
వంతల పాలుచేసి యప • వాదము నొందవె? శాశ్వతంబుగన్. 465

ఉ. శ్యామల కోమలాంగి, జన • కాత్మజ, ఆ తరుణీ లలామ, ఆ
రామ విహారమున్ సలుపు • రామ, సుఖోచిత, సీతయే, వనీ
భూమిఁ జరించుచున్న దొకో! • భూపుని కోడలు, భూపు పుత్రియున్
భూమిజ, కందమూలముల • భోగ్యతతో, మనుచుండెనా వనిన్! 466

ఉ. వీనుల విందుగా విమల • విశ్రుత గీతము లాలకించుచున్
జానగు మోమునన్ గులుకు • జానకి పద్మదళాయతాక్షియే
కాననసీమ భీకర మృ • గంబుల ఘోర నినాదమే వినున్
దీనగ, సౌధరాజమె స • తీ తిలకంబునకా, వనం బహో. 467

తే. పద్మ వర్ణంబు పద్మాక్షి • బంధురమ్ము
పద్మ నిశ్వాస సహితంబు • పద్మ ముఖము
ఆ సుకేశాంతముల గ్రాలు • నట్టి రాము
మోము నేనాఁడు చూచెడి • భాగ్య మబ్బు. 468

ఉ. కరుణ యొకింత లేక కడ • గండ్లకుఁ బాలొనరించి తీవు దా
శరథిని లక్ష్మణున్ జనక • జన్, బదునాలుగు వత్సరంబులున్
జరిగిన, వారు, రా, మరలి • చయ్యన రాజ్యము నిచ్చువాఁడె, యీ
భరతుఁడు రామచంద్రునకుఁ! • బాయునె రాజ్యము కోశ మెవ్వఁడేన్.

ఉ. ఇచ్చెదుఁ గాక రాజ్య రమ • నిచ్చిన యంతనె రాఘవుం డహో
మెచ్చి, పరిగ్రహించునొకొ • మేదిని? బెబ్బులివంటి వాఁడు, తా
స్వేచ్ఛ మృగంబుఁ జంపి తిను • బెబ్బులి యొందు మృగావశిష్టమున్
మెచ్చునె! ముట్టునే! దరికిఁ • బోవునె! యెంగిలి నారగించునే!

ఉ. కోపము రాదు రాఘవున • కున్ మరి వచ్చినయేని తోడనే
భూప కులంబె కాదహా! న • భోమణి చంద్రుఁడు తారకావళుల్
భూపతనంబు నొందు, భువి • భోరునఁ గ్రుంగదె వార్నిధిన్, మహా
తాపము నొంది స్వర్గమును • దప్పక కూలెడి భిన్నభిన్నమై. 471

ఉ. ఏ యవమాన మేనియు స • హింపఁడు రాముఁడు కాని సత్య వా
క్యాయిత ధర్మమున్ గురుని • యాజ్ఞను మన్ననఁ జేసి భూమిపై
న్యాయము ధర్మమున్ నిలుప • నాత్మఁ దలంచిన వాఁడు, దాననే
పోయె వనీ స్థలంబునకుఁ • బుత్త్రుని నెంతటి వాని వీడితో! 472

ఉ. మానవనాథ! స్త్రీకిఁ బ్రథ • మంబగు భర్తయె, రెండు పుత్త్రుఁడౌ
మానక మూఁడు జ్ఞాతులగు • మూరొక నాల్గవదేది లే దిలన్
గానఁగ మూఁడిటన్ సవతి • కైక పరం బయినావు నీవు నా
కే, నొక దానినే మిగిలి • యీ గతి నుంటిని రాము వీడుటన్. 473

ఆ. నిన్ను వీడి వనికి • నేఁ జన ధర్మంబె
పుత్త్రు విడిచి భర్త • పొంత లేక
62/14-25 జ్ఞాతి యింటనుంట • సరియగు పని యొక్కొ
సర్వగతుల నన్నుఁ • జంప వొక్కొ! 474

చ. హత మొనరించినావు సక • లావని రాజ్యము రాష్ట్రి యుక్తమున్,
హత మొనరించినావుగద! • అందఱి మంత్రులఁ నాత్మహత్యమై,
హత మొనరించినా వహా ని • జాత్మజు పుత్త్రుని, పౌర సంతతిన్
హత మొనరించి కైకకుఁ బ్ర • హృష్టమతిన్; విలపింతు వేలకో!

తే. అనెడి కౌసల్య మాటల • కవని విభుఁడు
నమిత దుఃఖార్తిఁ గుందుచు • నతివఁ జూచి
పలికెడి పతివ్రతా ధర్మ • ములను సతికిఁ,
దనకుఁ దానాత్మఁ గ్రుంగుచు • ధర్మ విధిని. 476

ఉ. సూటిగ పోటు గాఁగ సతి • సూక్తులు నాటుటచే హృదిన్ గడున్
మాటలఁ బల్క లేక యవ • మానితుఁడో యనఁ, గై మొగుడ్చుచున్
పాటవ మెల్ల వీడిన నృ • పాలుఁడు పల్కెడి యంత, లోపమున్
బాటి యొనర్ప రాదనుచు • భార్యకు కన్నుల నీరు నింపుచున్. 477

తే. భర్త కై మోడ్పుఁ గనుచు నా • పరమ సాధ్వి
కోపమును బాసి క్షమియింపఁ • గోరె పతిని
పుత్ర శోకార్తి నంటి, న • పూర్వ గతిని
ధైర్యము నశించె దుఃఖాన • దశరథ నృప. 478

తే. విద్యయును ధైర్యమును గూడ • వీగి పోవు
సర్వ సద్గుణ రాశియు • సమసి పోవు
శోక సమమగు నది లేదు • చూడ భువిని
ఇంతయే, యైన నార్తి స • హింప లేము. 479

తే. శత్రు వొక దెబ్బఁ గొట్టిన • సాహసమున
గొంత వడి బాధ పెట్టెడి • నంత పోవు
దుఃఖ మొనఁగూడ, నయ్యది • తొలగు టరిది
మునియు దుఃఖాన మూఢుఁడై • మనుట నిజము. 480

తే. రాము నెడఁ బాసి పంచ రా • త్రంబులైన
పంచ వర్షంబులుగ నెడ • బాటు దోఁచెఁ
దలఁచినంతనె దుఃఖమ్ము • తరగల గతి
నెడతెరిపి లేక నను సోఁకి • యేచుచుండె. 481

తే. అనుచు కౌసల్య పలికెడి • యంతలోన
రాత్రి యరుదెంచె దశరథ • రాజరాజు
ఆర్తి నలయుట నిద్రించె, • నపుడె మరల
మేలుకొని పూర్వ సంస్మృతి • పాలఁ బడెను. 482

తే. ఆఱవ దినంబు నడిరేయి • నా నృపుండు
తా నొనర్చిన దుష్కృతిఁ • దలఁచి తలఁచి
పుత్ర శోకంబునం జొక్కి • పొక్కుచుండి
దుఃఖమయ యగు కౌసల్య • తోడఁ బలుకు. 483

ఉ. మంచియొ, చెడ్డయో యెటుగ • మానవుఁ డీ భువి కర్మ సేయునో
యెంచగ నట్టిదే ఫలిత • మెప్పుడొ పొందెడి వాఁడు, కర్మ, గా[illegible]
వించెడి పట్ల నేరు తల • పెట్టరొ సద్గుణ దుర్గుణమ్ములన్ [illegible]
గొంచెముఁ గాని వారలనె • [illegible]

ఆ. పూవు చిన్నదయ్యు • భూరి ఫలంబుల
నీయదొక్కొ మామి • డెంచ మనకు!
పూవు పెద్దదయ్యు • మోదుగ యొసగునే
తినగ నొప్పు పెద్ద • తీపి పండు. 485

తే. సుందరాకృతి పుష్పంబుఁ • జూచునంతఁ
ఫలముఁ నాశించి మామిడిఁ • బగులఁ గొట్టి
మోదుగును పెంచి ఫల మెంచు • మూర్ఖుని గతి
కర్మల విచక్షణము లేకఁ • గడఁగు వాఁడు, 486

తే. కర్మ ఫలములఁ దుదిని దుః • ఖమ్ము నొందు
ఆమ్రములఁ గొట్టి మోదుగు • నమిత శ్రద్ధ
పెంచి యుండిన మూర్ఖుని • విధమె నేను
వేఁటకుం జని మృగముల • వేఁటఁ గొనక, 487

తే. వాని శబ్దంబు గురి గాగ • వేఁటఁ జనితి
ఫలిత కాలాన దుఃఖమ్మె • ప్రాప్తమాయె
రాముని త్యజించి శోకించు • బ్రతుకు వచ్చె
ఆ ధనుష్మంతుఁ డను పేరె • ఆపద లిడె. 488

తే. పిన్నతనమైనఁ దెలియక • విషము త్రావ
చంపకుండునె! బాలుండుఁ • జచ్చెడి గతి
బాల్యమునఁ జేసి యుండిన • పాప మిదియ
కట్టి కుడుపదొ కర్మ భూ • కాంతునైన! 489

## దశరథుఁడు ముని బాలుని వృత్తాంతముఁ జెప్పుట

ఉ. పాపుఁడఁ జంపినాఁడ ముని • బాలకునిన్ సరయూ నదీ తటిన్
మాపటివేళ దుర్భ్రమను • మత్తగజ ధ్వని యంచు, నీటికిన్
బ్రాపగు రేవునందు జల • భాండము ముంచెడి ఘోషవించు నే
తూపును వీడినాడ నటు, • తూలె భువిన్ ముని బాలుఁ డంతతో. 490

తే. అయ్యయో అయ్యొ అన ముని • యాత్మజుండు
వినుచు నా కుయ్యి నట కేగి • కనితిఁ, బాలు
దేహమున గుచ్చఁబడి తూపు • తీవ్ర బాధఁ
బొందుచును నేల కొరిగిన • కందు నతని. 914

ఉ. ఆ ముని సూతుఁ డంతట భ • యంబగు చూపులఁ జూచి పల్కె నీ
కేమి, యసత్కృతిన్ సలుప • నెప్పుడు నీటినిఁ బట్టు నన్ వనీ
సీమ తపస్వినైన నను • జెడ్డ తలంపొక యింతలేని న
న్నేమని చంపినావు ఫల • మేమి లభించు దయావిహీనుఁడా. 492

ఉ. కన్నులు గానరావు గద • కాటికి కాళ్ళను జాచియున్న మా
నాన్నకు నమ్మకున్ హితులు • నందనులున్ మఱి యేరు లేరు, నన్
గన్న ఋణంబుఁ దీర్పఁ దగు • కాలమునన్ మరణించుచుంటి, నా
పన్నులు వారి కెవ్వరు స • పర్యలఁ జేతురు! దిక్కులేదుగా! 493

తే. నన్నుఁ జంపిన కతమున • నన్నుఁ గన్న
కన్నుఁ గనరాని వార లే • తెన్ను లేని
వారు మాతా పితలుఁ జంపఁ • బడిన యట్లె
ఎట్టి దుష్కృతి కీ వొడి • గట్టినావు! 494

ఉ. తల్లియుఁ దండ్రి వృద్ధులు, వె • తన్ గడుఁ గుందెడివారు, నా గతిన్
దెల్లము గాఁగ వారలకుఁ • దెల్పుము, దాహముఁ దీర నీటికై
అల్లదె వేచియుందు రహ • అంతయు సత్యముఁ జెప్పి వారలన్
మెల్లగ వేడికొమ్ము నిను • మేదిని నాథ క్షమింత్రు సత్కృపన్. 495

ఆ. శరము నూడఁ బెఱికి • శాశ్వత శాంతిని
గాంచనిమ్ము వెత స • హించలేను
ఎంత విద్యయున్న • నేమి ఫలంబగు
కర్మ తెఱఁగుఁ బట్టు • కాల గతులు. 496

క. అని పల్కెడి ముని బాలుని
గనుచున్ మారాడలేక • క్షమియింపంగా
మనవి యొనర్చితి, గజమని
ధ్వని నెంచితిఁ జుమ యటంచు • పల్కితి నంతన్. 497

తే. జాలిఁ బుట్టించె నొక వంక • బాలుని గతి
భీతిఁ గలిగించె దుష్కృతి • చేత మిగుల
సాయకము నూడఁ బెఱికిన • సమయు నతఁడు
ఉంచి యుండిన బాధకు • నోర్వ లేఁడు. 498

తే. చేయఁగల దేమియును లేక • చేష్ట లుడిగి
కొంత తడవుండి సాయక • మంతఁ దీసి
ముదుసలుల నెంచి యాశ్రమ • భూమి కేగి
ప్రణతి సల్పుచు వారి కె • ల్లయునుఁ జెప్ప 499

తే. కదలలేని వారు • కనలేని వారలు
సుతుని చావు వినుచు • సొలినారు
వారి దుఃఖ మెంతొ • వారికే తెలియును
జెప్ప నలవి యగునె • చెప్పఁ గలనె. 500

ఉ. కానని వారి కూత నిడి • కానన సీమ శవంబు చెంతకున్
దీనులఁ దెచ్చితిన్, సుతుని • దేహము చేతులఁ దాఁకి తాఁకి సం
తానము గల్గ నేమి ఫలి • తంబని యేడ్చుచు నేడ్చి యేడ్చి ధ
ర్మాను గుణమ్ముగాఁ దుదకు • నగ్నికి నర్పణఁ జేసి రా సుతున్. 501

తే. దిక్కు లేనట్టి మాకింక • దిక్కెవండు
సుతుఁడు మరణింప మేమింక • బ్రతుకఁ గలమె
యనుచు నుభయులు నొక చితి • నగ్నిఁ బడిరి
నాటి పాపమ్మె యీ గతి • నాకుఁ దెచ్చె. 502

శా. ఆనాఁడే శపియించి రా, ముసలి, వా • రార్తిన్ ననున్, బుత్త్ర శో
కానన్ నేననుఁ జచ్చువాఁడ ననుచున్, • గాంతా నిజంబయ్యెడిన్
గానంజాలను నిన్ను గూడ గనులన్ • గానం గదా రాఘవున్
సూనుం జూడమి, నేఁడె శాప విధిమై • క్షోభించుచున్ జచ్చెదన్. 503

తే. ముపుర జీవంబు లానాఁడు • పుచ్చికొంటి
ముపుర కొఱ కేను నేఁడిట్లు • పొక్కుచుంటి
బుద్ధి కర్మానుసారంబె • పుట్టుచుండు
కట్టి కుడుపదె కర్మ భూ • కాంతునైన. 504

దశరథ విలాపము - అనుసంధానము

ఆ. తండ్రి యాన నెవఁడు • తలదాల్చి వని కేగు
రాఘవుండె తక్క, • రాముఁడె తగు
నిట్లొనర్ప పుత్త్రు • నీ గతి వని కంపఁ
దగదె నాకె పాపి • నగుట వలన. 505

తే. కొడుకు దుష్టుండె యైనను • క్రూరకర్మ
నతని వని కంపు తండ్రి యీ • యవని లేఁడు
పూజ్యుఁడగు పుత్త్రు ధార్మిక • పురుషసింహు
వనికి నెట్టిన పాపిష్టి • జనకుఁ డితఁడె. 506

తే. వనికిఁ బొమ్మని చెప్పిన • వాని తండ్రి,
గౌరవించెడి పుత్త్రుండు • కలఁడె భువిని
కోపగించక యటు సేయు • కొడుకుఁ గలఁడె
రాఘవుఁ డొకండె యిటుఁ బుట్టె • ప్రకృతి యందు. 507

ఉ. కంటికి దృష్టి పోయినది • కాలుని దూతలు వచ్చినారు, వెన్
$\frac{6\,5}{7\,6}$ వెంటనె రమ్మటం చదిగొ • పిల్చుచు నుండిరి, శక్తి యార్తి యన్
మంటను గాలె, విస్మృతుఁడ • నాథుని, సత్య పరాక్రమున్ సుతున్
గంటినిఁ గాంచఁజాల నిఁక • కాంతరొ కాలముఁ దీరె నా కిఁకన్.

చ. సురుచిర శారదేందు సమ • సుందరమున్ వికసాబ్జతుల్యమున్
$\frac{6\,4}{7\,5}$ వర మణికుండ లాన్వితము • భాసుర సుందర నాసికా ప్రభా
కర కమనీయ దివ్య ముఖ • కంజము వానిని నాదు నాథునిన్
మరల నయోధ్యలోఁ గనెడి • మానవు లెంతటి పుణ్యవంతులో. 509

తే. ఈ అనాథుఁ డచేతనుఁ • డమిత దుఃఖ
$\frac{6\,4}{7\,5}$ వశమున నశించు చుండెఁ బ్ర • వాహ గతినిఁ
గట్టు చెడి కూలు రీతిగా, • గాలి వలన
వృక్షమును నేలఁ గూలెడి • విధముఁ గాఁగ. 510

తే. ఓయి! రామ! మహో భుజ! • ఓయి నాథ!
$\frac{6\,5}{7\,6}$ ఓ పితృ ప్రియ! రాఘవ! • ఓయి పుత్త్ర
ఓయి! ఆయాస నాశన! • ఓ మహాత్మ
ఎచట నుంటివి? నీ వెట • కేగినావు? 511

## దశరథ మరణము

తే. అయ్యో! కౌసల్యా, అయ్యోయో! • హా సుమిత్ర
ఓసి కుల పాంసనీ కైక! • ఓ అమిత్ర
ఓ నృశంస యిదె నశించు • చుంటి నిపుడె
అనుచుఁ జనిపోయె దశరథుఁ • డంతలోన. 512

తే. రామ సంస్మరణాబ్ధిలో • లయముఁ గాంచె
పుత్ర శోకార్తిఁ గృశియించి • పుడమి ఱేఁడు
రాఘవుఁ దలంచి యా యర్ధ • రాత్ర మందు
కాల ధర్మముఁ గనె రాముఁ • గనని వ్యథను. 513

తే. పుత్ర విశ్లేష దుఃఖాబ్ధి • పొంగి పొరల
నేడ్చి యేడ్చుచు నిదురించి • రింతు లపుడె
సతులు కౌసల్యయు సుమిత్ర • పతి గతించె
నంచెఱుంగరు రవి యుద • యించు వఱకు. 514

ఉ. దాసజనమ్ము ప్రొద్దుట, య • థావిధి వచ్చిరి మేలుకొల్పులన్
భాసిలె రాజమందిరము • పల్మరుఁ బాడిరి వందిమాగధుల్
కోసలరాజు మేల్కొనఁడు • కూరిమిఁ బౌరులఁ గానరాఁడు వ్యా
త్యాసము దోఁచె నిత్యవిధి • నందఱు విభ్రమ మందునట్లుగన్. 515

తే. అంత పరివార జనతతి • యంతిపురముఁ
జొచ్చి నృపుఁ జూచి యాతండు • చచ్చె ననుచు
వివిధరీతుల గ్రహియించి • పేర్మి సతుల
నిదుర లేపిరి, తెల్పిరి • నృపుని చావు. 516

తే. అంత కౌసల్యయు సుమిత్ర • అవనినాథు
తాఁకి మృతి నొందె నంచెంచి • ధరణిఁ బడిరి
కైకయును వచ్చి దుఃఖింప • గడఁగె, నంతి
పురము దుఃఖమయమ్ముగాఁ • బొడమె నపుడు. 517

తే. అగ్ని చెలరేగి పరిసర • మలము రీతి
నంతిపురపు జనుల దుఃఖ • మలమె పురము
స్వీయవంశజు మరణమ్ము • వినుట గనఁగ
నరుగుదెంచెన యన రవి • యపుడె దోఁచె. 518

ఉ. పౌరులు మంత్రులున్ మునులు • బ్రాహ్మణులున్ బరివార వర్గమున్
వారని దుఃఖముఁ గనిరి • పట్టణమంతయు శోకతప్తమే
బారులు దీర్చుచున్ బ్రజలు • ప్రాణము వీడిన రాజుఁ జూడగన్
జేరిరి రాజమందిరము • శీఘ్రగతిన్ విలపించుచున్ గడున్. 519

తే. కొంతతటి లేచి కౌసల్య • కోసలేశు
శిరము నొడి నుంచుకొని యేడ్చు • పరమగతిని
కైకఁ గని, యింతకు న్నీవె • గా, కతంబ
వనుచు విలపించుఁ బతినిఁ బు • త్త్రునిఁ దలంచి. 520

చ. నలుగురు పుత్త్రులుండియును • నందనుఁ డొక్కఁడుఁగూడఁ దండ్రికిన్
దలకడలేదు చావుదరి • తన్వులు పత్నులు మువ్వు రుండియున్
గులసతి యొక్కతేని రఘు • కుంజరు పజ్జను చావువేళకున్
నిలువఁగ నోచలేదు కడు • నిద్దురలోఁబడి రాఘ్రుడు నేడ్పుమై. 521

చ. కొమరులు లేరటంచుఁ గడుఁ • గుందుదు రేల గృహస్థు లెందఱో
కొమరుల నల్వురన్ గనియుఁ, • గోసలరా జవసానవేళ తా
మమత నశించె, నెవ్వరు కు • మారకు లెవ్వఁడు తండ్రి; జీవుఁ డే
సమయమునన్ శరీరము వి • సర్జన సేయునొ? ఏడ కేగునో! 522

తే. ఎల్లరును శోకతప్తులై • యేడ్చి యేడ్చి
తుదకు నృపుని శరీరమ్ము • పదిల పరుపఁ
దైలమందుంచి రంతట • దశరథుండు
కాలగతి శాంతిఁ బొందెను • తైలమందు. 523

తే. అపరకర్మల నొనరింప • నపుడు సుతులు
లేరు, జ్యేష్ఠులు వని నున్న • వారు, కాక
భరత శత్రుఘ్నులా, లేరు • పట్టణమున
వార లరుదెంచియే పూన • వలయు కర్మ. 524

తే. కైక కతమున నృపునకుఁ • గర్మ సేయ
గూడ జ్యేష్ఠుండు రాముండు • లేఁడు నేఁడు
భరతుఁడును గూడ లేఁడని • పౌరు లెల్ల
దూర సాగిరి కైకను • దోష మెంచి. 525

చ. భరతుఁ డయోధ్య వీడక, నృ • పాలుని కైకను, వీడకున్నచో
బరగునె కైక యీ గతిని, • బాడువరంబులఁ గోరి యుండునే
వరములఁ గోరియుండినను • పార్థివుఁ డిచ్చెడివాఁడె? యిచ్చినన్
భరతుఁడు రామతత్పరుఁడు • వల్లె యటంచని పల్కియుండునా ! 526

చ. భరతుని యందపోహ మ్మొదిఁ • బట్టె, యయోధ్య నృపాలుఁ డాతనిన్
బురమును వీడఁజేసె రఘు • పుంగవు రాజుగఁ జేయ నెంచుచున్,
శిరమునఁ దెచ్చి పెట్టికొని • చిక్కనుఁ దాన నశించెఁ, గర్మకున్
భరతుఁడు గూడ లేని గతిఁ • బట్టుట, స్వీయకృతాపరాధమే. 527

తే. అనుచు నేమేమొ తలపోసి • జనము పలుకు
మృతుని మది నెంచి రాముని • గతిఁ దలంచి
ఏడదీ కుబ్జ! యెటు దాపు • రించె మనకు
అగ్నిఁ బుట్టించె నిక్ష్వాకు • నన్వయమున. 528

తే. రామచంద్రుండు వనిఁ బట్టె • రాజు మృతుఁడు
కోసలావని విధవయై • క్రుంగుచుండె
ఈ అరాజక రాజ్యంబు • నేలుదురొకో!
కైకయి సుతుండు వీడి లో • కైక విభుని. 529

## భ ర తు ని రా క

చ. మరుసటినాఁడు మౌనులు, స • మాహిత చిత్తులు, గూడి, నిర్ణయిం
చిరి, త్వరితంబుగా భరతుఁ • జీరఁగ, రాజ్యముఁ బూని తండ్రికిన్
జరుప ననంతర క్రియలు; • చయ్యన దూతల మంత్రులంత బం
పిరి, మృత వార్తఁ దెల్పకయె, • వేగమ, తోడ్కొని రాగ, నాతనిన్.

చ. చని చని దూత పంచకము, • సాంద్రవనీ, నద, వాహినీ, గిరుల్
గనుచు,గజేంద్ర సింహములఁ•గాంచుచు,వ్యాఘ్ర చయంబుఁ జూచుచున్
జనిరి, గిరివ్రజంబు పురి, • సాధు హయంబుల నెక్కి రివ్వనన్;
దినకరుఁ డేగి యర్ధనిశఁ • దెల్పెను కాలము భీకరమ్ముగన్. 531

## భరతుని కల - దూతలను క్షేమ మడుగుట

చ. చని యట మేనమామ కడ • సౌఖ్యముగా మను కైక సూనునిన్
గనుచు, వసిష్ఠ మౌని, నినుఁ • గర్మ మొకం, డొనరింప, వెంటఁ, దో
డ్కొని, యరుదేర, పంచె నిట•కున్, మము; రమ్మిక రాకుమార! యం
చని పలుకాడి దూతలు న • యంబునఁ దెల్పిరి మౌని వాక్కులన్.

ఉ. దూతలు త న్నయోధ్య కటుఁ • దోడ్కొని వచ్చిన రాత్రి వేళనే,
తాత, నగంబునుండి, పడి • ధాత్రిని గోమయమందుఁ, బొర్లుచున్
జేతుల నూనెఁ బూసికొని • చేద్పడు చందము, తైల మగ్నుఁడై
ఖీతిలియున్న, దృశ్యమును • బెన్వేతమై, కలఁ గాంచె, నాతఁడున్.

చ. జలనిధు లింకినట్లు, కుల • శైలము లన్నియుఁ గూలినట్లు, భూ
స్థలి, చలియించినట్లు, శశి • తారలు, నేలకు డుల్లినట్లు, వ్యా
కులమున, సర్వ సృష్టియును • గుందగఁ, జీకటి గ్రమ్మినట్లు, కో
సలపతి తేరు, దక్షిణ ది • శన్, ఖరముల్ గడు, లాగినట్లుగాఁ
గలఁ గని కైకనందనుఁడు • గందరగోళముఁ బొందె, నాత్మలోన్.

ఉ. ఈ కల వేకువన్ గనుట • నింటను మృత్యువు దాపరించు నం
చాకుల పాటునన్ భరతుఁ • డ త్తరి దూతలఁ బ్రశ్నఁ జేయు సౌ
ఖ్యాకరమౌ అయోధ్య పురి • నందఱి క్షేమము, లో దలంచుచున్
లోకము తోడి సాటిగ గ • డున్ భయ మొందుచు దుష్టమౌ కలన్.

ఉ. రాముఁడు క్షేమమే కద! అ • రాజక మేమియు లేదుగా! సుధా
ధాముని బోలు లక్ష్మణుఁడుఁ • దల్లులుఁ దండ్రియు, క్షేమమే కదా!
క్షేమమె ఆత్మకామి యగు • కేకయ పుత్త్రి మదంబ చన్ది యం
చా మహనీయుఁ డా భరతుఁ • డప్పుడు దెల్పఁగఁ గోరు దూతలన్.

క. ఎల్లర క్షేమముఁ గననగు
నుల్లము రంజిల్ల, లక్ష్మి • నొందుచుఁ ద్వరలో
సల్లలితాత్మ! అయోధ్యకుఁ
జల్లగఁ జనుదేర నీవె • సంశయమేలా! 537

క. అను దూతల పల్కులు విని
కనకుండియు మోద మంత • కాదనకుండన్
మనవి యొనర్చెను తాతకుఁ
జన నెంచి యయోధ్య కపుడె • శాంతిన్ గనగన్. 538

## భరతుని అయోధ్యా ప్రయాణము

ఉ. తాతయు మేనమామయును • దాశరథిం గని ప్రేమ మీర సం
ప్రీతినిఁ గాన్కలిచ్చి జను • మీ యని యాజ్ఞ నొసంగు నంత, నా

దూతల వెంట నంటి, భర • తుండు, సహోదర సంయుతుండు సా
కేత పురోన్ముఖుండు, పరి • కించెడి దుశ్శకునంబు లెన్నియో. 539

ఉ. పంపెను వెంట, కేకయ నృ•పాలుఁడు గో, గజముల్ శునుల్ కడున్
సొంపగు సొమ్ములున్ ధనము • చొక్కపు, టశ్వములున్, ఖరమ్ములున్
బెంపగు సైన్య వాహినులుఁ • బేర్మి, నయోధ్యను గైక సూనునిన్
దింప, నమాత్య యుక్తముగ, • దేరు లొసంగి, హుటాహుటిన్ జనన్.

ఉ. తాతయు, మేనమామ ప్రమ • దంబున నిచ్చిన కాన్క లేవియున్
బ్రీతినిఁ గొల్పవాయెఁ, గల • భీతిని స్వీయ గృహమ్మునందె ఏ
ఘాతుకమో ఘటిల్లునని, • కారణ మేమియుఁ గానలేక, ఆ
పూత చరిత్రుఁ డా, సుజన • పుంగవుఁ డేగు, నయోధ్య కత్తఱిన్.

చ. కల నొక దాని దుష్టముగఁ • గాంచుట, వెంటనె రమ్మటంచు, దూ
తలు పిలువంగ వచ్చుటయుఁ • దానె యొనర్చెడి కర్మ మేదియో
కలదను మౌని మాటయును • గైక స్వభావ మెఱింగి యుంటయున్
కలవర పెట్టు నా భరతుఁ • గంఠము నిండ, నశాంతి భావముల్. 542

చ. త్వరిత గతిన్ రథంబు జన • దాశరథుల్ గనినా రయోధ్యకున్
పరిసర సీమ, రాత్రులుఁ బ • వల్ పయనం బొనరించి, వారు వ
చ్చిరి, రవి దోఁచువేళకు, ని • శీథము లేదు చనంగఁ గాంచుచున్
బురిని, విషాదముం గనిరి • పొల్పరియుంట నయోధ్య మిక్కిలిన్.

చ. జలచరముల్ విహంగములు • జంతు చయమ్ము, లతా నికుంజముల్
వెలవెల లాడుచున్న యవి • వీథుల వెంబడి రాకపోకలున్
కలకల, లేదు, ముంగిళుల • కన్యల ముగ్గులు లేవు; వేదఘో
షలు గుడిఁ గూడ లేవు జన • సంతతి స్తబ్ధత గాంచె నెల్లెడన్. 544

మ. ప్రమదం బేమియుఁ బొందఁ డాతఁడు, పురిన్ • రాజ్యంబు వీక్షించియున్
సుమనః పల్లవ శోభితంబులు వనుల్ • చూపట్టెడిన్ బాడుగా,
రమణీయంబగు, పక్షిసంతతుల ఆ • రావమ్ము శూన్యమ్మునై
సుమనోహార మృదూక్తులున్ మధురముల్ • శ్రోతవ్యముల్ లేవుగా.

ఉ. మున్ను తెలుంగునన్ గనక • మోదముఁ గూర్చు విలాసముల్, మహో
పన్నతఁ దెల్పు దృశ్యములు • పార్థివు చావునుఁ జెప్పు సూచనల్

కన్నులఁ గట్టుచుండఁ గని • కైక సుతుండు విషణ్ణచిత్తుఁడై
తిన్నగ రాజమందిరముఁ • దేరునఁ జేరి కనందు తండ్రినిన్. 546

## భరతుఁడు తల్లినిఁ జూచుట

ఉ. అంతటఁ దల్లి మందిరము • నందున దండ్రినిఁ జూడవచ్చునం
చెంతయొ యెంచి తల్లిఁ గని • చే మొగిడించి, నమస్కరించి, యా
పొంతను, దండ్రినిన్, గనక • ముద్దులు చిల్కెడి తల్లిఁగాంచి, భూ
కాంతునిఁ జూచి మ్రొక్క తమ • కంబున వచ్చితి, ఱేఁడు లేఁడహో.

ఉ. ఏడఁ గలాఁడు కోసల న • రేశుఁడు జ్యేష్ఠసతీ గృహంబునన్
జూడఁ గలాడనా ? జనని • సొంపఱియుండిన హేతువేమి? నీ
వాడ నయోధ్యలో జనులు • వాలిన మోముల నుండిరేల? నా
తోడుల కెల్ల సౌఖ్యమొకొ? • తొందరగా వచియింపు మమ్మరో.

శా. నీ వారల్ సుఖు లెల్లవారు జననీ • నే, ముట్టఁ గట్నంబు లే
వేవో పంపిరి తాత మామయును నే • నిట్లొచ్చితిన్ వీటికిన్
మా వంశోన్నతి నెంచు మౌని పిలువన్ • మారాడకే వెంటనే
ఏ వైరుధ్యమొ దాపరిల్లె, జనకుం • డెచ్చోట నున్నాఁ డహో ! 549

ద్వి. చెప్పుము సూటిగా • నప్పు గుటించి
ఇప్పుడే అమ్మరో • యే విందు నంత 550
అనుచున్న పుత్త్రి నా • యంబ కైకేయి
కని విని యాహ్లాద • కరముగా నంత. 551

## తండ్రికై భరతుని విలాపము

చ. తనయునిఁ జేర్చి తా నొడిని • తాల్మిని మూర్కొనుచున్ శిరంబు, వా
కొనఁ గడఁగెన్ సుపుత్త్రికున • కున్; భవదీయ గురుండు జీవు లే
మనుగడఁ బొంది తుట్టతుద • మానక చెందెడి కాలధర్మమున్
గనె, సహజంబుగాదె యిది, • కాలము వీడునె యేని నేనియేన్. 552

మ. అను మాటన్ వినునంతనే భరతుఁ డా • త్మాక్రందనన్ గూలె, నే
లను, హా హా యని రోదనంబు సలుపున్ • లావంతయున్, వీడుచున్
జననీ! యే రుజఁ, దండ్రి చేరె దివి? నే • సంస్కారముల్ సేయ, నో
చను, రామాదులు ధన్యులైరి, గురు సం • స్కారక్రియాదక్షులై.

ద్వి. ఆ వసిష్ఠు వార్త • నాలించు నంత
నే వచ్చియుంటిని • నెంచుచున్ శుభము. 554

శ్రీరాము పట్టాభి • షేకమే తలఁచి
మా రాముఁ గననెంచి • మరలితి నిపుడు 555

కాని దైవము వేరు • గాఁ దలపోసె
ఏ నెట్లు భరియింతు • నీ దుఃఖవార్త. 556

క. అనుచున్ నేలను బొరలెడి
తనయునిఁ గని కైక లెమ్ము • తనయా లెమ్మీ
వనటను బొందరు విబుధులు
గన నెంతురు గాదె సుఖము • కష్టము సమతన్. 557

ఆ. అనుచు లేవనెత్తి • ఆత్మజుఁ జూచుచు
నూరడించ గలుగు • సూక్తులనును
కాని, కైక మాటఁ • గాంచక శాంతిని
భరతుఁ డంత మారు • పలుకఁసాగె 558

చ. జనకుఁడు లేఁడు, తండ్రియగు • జానకినాథుఁడు జ్యేష్ఠుఁ డెంచ, వే
చని, కని రాముపాదముల • సాగిలి మ్రొక్కి తరించువాఁడ, నా
యనఁ గనినట్లె, యుండు రఘు • నందనుఁ జూచిన, యంతఁ గొంత శాం
తినిఁ, గన నెంతు, రామునకుఁ • దెల్పుము వచ్చితినంచు నంబరో.

ఉ. ఎవ్వఁడు భ్రాతయో, పితరుఁ • డెవ్వఁడొ బాంధవుఁ డెవ్వఁడో హితుం
డెవ్వఁడొ, ధీయుతుం డెవఁడొ • యెవ్వఁడు ధర్మవిదుండొ, సువ్రతుం
72/32-33 డెవ్వఁడొ, సత్యసంధుఁడు న • హీన పరాక్రమ సత్యనిశ్చితుం
డెవ్వఁడొ, వాని దాసుఁడ, మ • హిన్ గతి నా కిక రాఘవేంద్రుఁడే.

తే. సత్యసంధుండు తండ్రి య • శస్వి యతఁడు
తపము దానములన్ గని • తనయులఁ గనె
మరణ కాలానఁ బరిచర్యఁ • జరుపనైతి
ఎంత దురదృష్టవంతుఁడ • నేను జనని. 561

## భరతుఁడు రాముఁడు లేని వార్త విని విలపించుట

తే. తండ్రి యేమి చెప్పె • తనయుని నన్నెంచి
దివికి నేగు వేళ • దేవి చెపుమ
అనెడి పుత్త్రుఁ గాంచి • యాయమ, పలుకాడె
నున్న దున్నరీతి • నొప్పు గాఁగ. 562

శా. హా! రామా యని,హా! ధరాసుతా యనుచు హా•హాలక్ష్మణా యంచు రా
మా రావంబున బ్రాణముల్ విడిచె, స • త్యారాధన ప్రాజ్ఞుఁడై
ప రీ యూరునఁ జూతురో, మరల, సీ • తేశున్ ధరా పుత్త్రినిన్
ధీరున్ లక్ష్మణు వారె, ధన్యులని, ధా • త్రీ నాథుఁ డాడెన్ దుదిన్.

ద్వి. నీ మాటఁ దలపెట్ట • నే లేదు పుత్త్రి
రామా యటంచునే • ప్రాణముల్ విడిచె. 564

శా. తల్లీ ! లేరొకో ! ఏడ కేగిరొకో, సీ • తా రామ సౌమిత్రులున్,
గల్లో లాత్ముఁడ, దండ్రి చావు వినుటే • కాకుండ, ఈ వార్త నే
*నెల్లా విందు ?, భరింతు దుఃఖ మహా ! ఏ • మే మాయనో దెల్పుమీ
తెల్లంబౌ నటు లెవ్వ రీ విధముగాఁ • దేఁ గల్గిరో కష్టముల్. 565

చ. జనకుని యంత్య కాలమున • సర్వ గుణాఢ్యులు రామ లక్ష్మణుల్
తనయులు లేరె! పుత్త్రికుల • ధర్మముఁ దీర్ప నయోధ్య యందుఁ, దా
మనమున నెంత గుందెనొకొ • మాన్యుఁడు భూపుఁడు, లేకలేక, గాం
చిన సుతుఁ డొక్కఁడేనియు, వ • సింపమి చెంత సపర్య సల్పఁగా.

## కైక భరతునకు సత్యముఁ జెప్పుట

క. అను నా భరతుని మాటలు
వినుచున్ రాము నెడలఁ గలఁ • ప్రేమన్ గనుచున్.
వెనుకాడదు కైకయి తా
నొనరించిన పని సుతునకు • నొప్పుగఁ జెప్పన్. 567

---

*పూర్వకవి ప్రయోగములున్నవి. దశా. 295 పే॥, ఆంధ్రభాషాను
శాసనము పే॥ 292

ఉ. ఓయి కుమార ! రాఘవుఁ డ • యోధ్యను వీడి సతీ సమేతుఁడై
పోయె సలక్ష్మణుం డగుచుఁ • బూనుచు నారల చీరెలన్, వనిన్
గాయలఁ గూరలన్ దినుచుఁ • గాలముఁ బుచ్చగ, దండకాటవిన్
†రాయలు రాముఁడుండె, నిఁక • రాజ్ఞిణి వీవె కదా యిటన్ సుతా.

## భరతుని విలాపము

మ. అను మాటన్ వినునంత నా భరతుఁ డా • హ్లాదంబు చెందండు, మా
తను గాంచున్, గడు దీనుఁడై యడుగు, సీ • తానాథుఁ డే దోషియై
చనె, నా కానన సీమకున్? గన సదా • చారుండు, భూదేవతా
ధనముం గోరఁడుగా; పరాంగనల చిం • తన్ బొందెనా యెప్పుడేన్.

తే. పాప మొనరింప నట్టి యె • వ్వానినైన
హింసకుం బాలు సేసెనా ! • యేల వనికిఁ
బంపఁ బడె ఘాతుకునివోలెఁ • బర హితుండు
దోష రహితుండు జేసిన • దోష మేమి ? 570

ద్వి. అనునంత భరతుండు • తన తల్లి నెంచి,
వినిపించె కైకమ్మ • వృత్తాంత మెల్ల. 571

## కైక తన వాంఛితముఁ దెల్పుట

చ. పరుల ధనంబుఁ గాని పర • భామలఁ గాని హరింపఁ బోడు, భూ
వరుని కుమారుఁ డెంచఁ బెర • వారల హింసయుఁ జేయఁ బూనఁ డె
వ్వరి కృతినేని, రాముఁడు నృ • పాలుని శిశుకుఁ బాలుగాడు, నేఁ
బరచితి రామునిన్ వనికిఁ • బట్టిని నిన్ నృపు సేయు దీక్షతో. 572

చ. జనక సుతాభి రాముఁడు ప్ర • జాహిత దక్షుఁడు, రామచంద్రునిన్
బనుపఁగ దండకాటవికిఁ బట్టముఁ • గట్టఁగ నీకుఁ గోరితిన్
జనపతి, దాని కియ్యకొనె • సత్యవచో నిరతుండు గాన, ము
న్ననిన వర ప్రకారముగ • నంతయుఁ జేసితి నీ, నిమిత్తమై. 573

చ. దశరథ రాజ శేఖరుఁడు • దాశరథిన్ ప్రియ పుత్త్రి, నా నుడిన్
యశము దలంచి దండక వ • నాంతర సీమ వసింపఁ బంపె నా

---

†రాయలు = రాజు.

వశుఁడయి పిమ్మటన్ వెతకుఁ • జాల్పడె, రాముని౯ గానలేమిచే
భృశ పరితాప దగ్ధుఁడయి • వే పరలోక నివాసిగాఁ జనెన్. 574

చ. భరతుఁడు నా సుతుండు జన • పాలకుఁడై మన, నిట్లొనర్చితిన్
స్థిరముగ రాజ్య మేలు మిఁక • చింతను ద్రోయుచు సంతసంబునన్
వెఱపు మనంతర క్రియల • నిశ్చిత బుద్ధిని దండ్రి కింక ఏ
యరమరఁ గాని పొందక, మ • దాత్మజ, సౌఖ్యమునన్, మనంగనౌ.

## భరతుఁడు తల్లిని దూరుట

చ. కులుకుచునుండి పుత్త్రకున • కున్, భువి చిక్కినదంచు బ్రేమయే
తొలుకఁగఁ బల్క, తల్లి, భర • తుం డను దుఃఖమహాగ్ని దగ్ధుఁడై
విలపనఁ జేయుచున్ హతుఁడ • పీడితి, దండ్రిని, దండ్రివోలె నా
కిలఁగల యగ్రసోదరు ని • కేల మహా విభవంబు రాజ్యమున్. 576

ఉ. రాజును జంపినావు రఘు • రాముని కాననసీమ, కంపి, కృ
ష్ణాజినమిచ్చినా వహో ! నృ • పాంతమె దుఃఖకర వ్రణమ్ము, న
వ్యాజముఁగా, వనంబునకుఁ • బంపి, రఘూత్తముఁ ద్వద్వ్రణమ్మువై
యోజన లేక ఱారమిడి • తో యిటు చి చ్చొడిఁగట్టి నట్లుగాన్. 577

చ. కుల మపకీర్తిఁ గాంచ, నిటు • గోత్రము నాశము సెంద, నిన్ను, గొఁ
గిలిఁగొనె, నాదు తండ్రి, యట • కేకయభూపు యశంబు మాయు, నీ
వలన, మహాఘువర్తినివి • భర్తను జంపినదాన వీవ, నే
నిలఁ గొని, రాజ్య మేలుదునె ? • ఎంతటి దారుణ మాచరించితే. 578

ఉ. పుట్టిన మెట్టినట్టి కుల • ముల్, కడు శోక దవాగ్నిఁ గాల్పఁగా
నిట్టుగఁ జేసినావ! అర • రే! కులపాంసని! పాప దర్శినీ!
బిట్టుగఁ నేడ్చి యేడ్చి నృప • వీరుఁడు మృత్యు ముఖంబుఁ జొచ్చెనా
దిట్టరివై తి మోహమున, • దేశము రాజ్యము స్వీకరింతునే. 579

చ. జనకుని ధర్మ వత్సలుని • జంపితి వేల ? జనాభి రామునిన్
వనమున కంపనేల ? రఘు • వర్యుఁడు నిన్ను సతంబు చూడఁడే
తన జననీ విధంబు, నిర • తం బొనరింపఁడె సీదుసేవ, ఆ
తనయుని నారచీరలను • దాల్చఁగఁ జేసితి వెట్టి పాపమే. 580

ఉ. పాప మెఱుంగనట్టి, జన • వందితుఁ గానకుఁ బొమ్మటంచు, నో
పాపి వచింప నోరెటుగ • వచ్చె, సుమిత్రయు, రాము మాతయున్
నీ పనికెంత దుఃఖ మది • నింగిని ముట్టగ నేడ్చుచుండిరో
భూపుని వీడి, పుత్త్రికులు • పో వని, నేడ్వరె మిన్ను ముట్టగన్.

ఉ. ఏ నెటు రాజ్యఁ మేలఁగల • నే! వని నుండగ రామలక్ష్మణుల్
ఏ నెటు రాజ్య మానఁగల • నే! రఘురాముని యండలేక, ఏ
బూనిన బూనవచ్చు, నృప • పుత్త్రిఁడ నౌట, స్వకీయ బుద్ధిమై
కాని, త్వదీయ కామ్యము వి • కా వికలం బొనరింపఁ గాఁదగున్. 582

ఉ. చేసి వ్రతంబు లెన్నియొ యి • సీ! తుదకున్ గనినాడు బిడ్డలన్
వాసికి వన్నె కెక్కెఁడి, వి • భాసురులన్ ఫలమేమి? పుత్త్రిలన్
గాసిలఁజేసి తానుఁ గడు • గాసిలి చచ్చె నృపుండె! యింతకున్
దోస మదేదో సుకృత • దుష్కృతముల్ వెనుఁదట్టి యుండవే. 583

ఉ. రాముని యందు నాకుఁ గల • రాగము భక్తియు, నీ వెఱుంగవే
ఏమిటు సేసినావు? సుతుఁ • డే యిలనేల దలంచియే, మహా
కామినివై యనర్థకము • గాఁ జరియించిన నీదు కోర్కె, యీ
భూమి, ఫలింపదిక నినుఁ • బోలిన, పుత్త్రిఁడఁ గాను దుర్మతీ. 584

ఉ. రాముఁడు నిన్నుఁగూడ నను • రాగమునన్ గను, స్వీయమాతఁగా
ఏమను వాఁడ రాఘవుఁడె, • ఏఁ ద్యజియించిన నిన్నుఁ గోపియా,
మా మహనీయ వంశమున • మాన్యుఁడు జ్యేష్ఠుఁడె, ఆతఁడే నృపుం
డౌ మరి తమ్ము లెల్లరు, ని • రంతర మాతనిఁ, గొల్చు వారెగా. 585

ఉ. నీ కిదె చెల్లు; ధర్మగతి • నీ వెపుడున్ గణియింపవైతి, వి
ఙ్వాకుల ధర్మ గర్వము నృ • శంస, నశింపఁగఁ జేసి, నీవు నా
కాకులపాటుఁ దెచ్చితి వ • హో, నెరవేరదు నీదుకోర్కె దుః
ఖాకరమైతి వంతె, యిదె • అన్నను రాముని దోడి తెచ్చెదన్. 586

ఉ. ఒల్లను, కైక! రాజ్య రమ, • నొల్లను, పీడఁగ రామచంద్రునిన్
75 సల్లలితాంగు నాత్మ విభు • సత్య పరాక్రము నా, మహాత్మునిన్
ఫుల్ల నవాంబుజానన వి • భూతి, మహోద్యుతినిన్ సుదర్శనున్
జల్లని రాఘవున్ బురికిఁ • జక్కగఁ దోడ్కొని వత్తు రాజుగా. 587

చ. వరగుణ రామచంద్రుఁడు వన • వాసము నుండిదె తోడి తెచ్చి, నే
74/27 బరఁగుదు దాన భూతుఁడుగ • బంధు జనప్రియు దీప్త తేజసున్
కర మనురక్తి గొల్చెద నృ • కాండము మెచ్చఁగ నాత్మశుద్ధితో
బరమ దయాళుఁడైన రఘు • వర్యుఁడు మన్ననసేయుఁగా ననున్. 588

ఉ. పాసితి వీవు ధర్మవిధిఁ • బాయవె కీర్తిని, రాజ్యకాంక్షచే,
బాసెద వీవు రాజ్యమును • బాసెద వింక మదీయ ప్రాణముల్
గాసిలు చుందువీ భువినిఁ • గైక ! సుతున్ దలపోసి, పోసి రా
కాసి ! త్వదీయ జన్మమునఁ • గాల్చవె కేకయ రాజవంశమున్. 589

ఉ. కైకరో! భ్రూణహత్య నర • కంబు లభింపఁగఁ జేయు, నీకొ, ఆ
లోకమె వచ్చు, భర్త చను • లోకము రాదు, కులంబె త్రెంచుటన్
నీ కొమరుండనై యశము • నేనును గోల్పడినాడ నెట్టిదో
లోకము, నాకుఁ గల్గు! సక • లున్ వని కంపవె నా నిమిత్తమై. 590

ఉ. తల్లివి కావు నీవు గుణ • ధర్మ విహీనవు, భర్తృఘాతినీ
తల్లివె? తల్లి రూపమున • దయ్యమ వీవహ దుష్టచారిణీ
ఎల్ల జనమ్ములున్ సతము • నెవ్వని సత్య పరాయణుం డనన్
జెల్లునొ వాని నట్టడివిఁ • జేర్చవె రాజ్యముఁ గోరి దుర్మతీ. 591

ఉ. కన్నుల నీరుఁగార ననుఁ • గాంచెడి పౌరులఁ, జూడలేను నీ
తెన్నుఁ, దలంచి, శోక నిధిఁ • దేలఁగఁజాల, మహాపరాధినీ
ఎన్న, మహాగ్నిలోఁ బడియొ? • ఏ యురిత్రాడునఁ గంఠ ముంచి
యో తిన్నగఁ, జచ్చుటే సుగతిఁ • తేలికగా వనికైనఁ బొమ్మికన్.

ఉ. ఏ, వని కేగువాఁడ నిపు • డే, రఘురాముని, దోడ్కొనంగ, వే
భూవరుఁ జేసి రాఘవుఁ బ్ర • పూతుఁడ నయ్యెదఁ బిమ్మటన్ వనీ
స్థావర మేనె పొందెద గ • దా మునివాడల సంచరించుచున్,
నా విభుఁడైన రాముఁడు వ • నంబున నుండఁగ, జెల్లునే యిఁకన్.

మ. అనుచున్ రోషకషాయ నేత్రుఁడయి దుః • ఖాక్రాంతుఁడై నేలవ్రా
లెను, వస్త్రంబును భూషలున్ జెదర, వే • లీనంబుఁగా రామ భా
వన లోనన్ భరతుండు, కొంతవడి భా • వస్ఫూర్తిమై లేచి చెం
తనుఁ గాంచెన్, నృప మంత్రిశేఖరుల, నం • తన్ వారితో నిట్లనున్,

ఉ. తల్లిని దిట్టి దిట్టి, తన • తండ్రిఁ దలంచుచు దుఃఖితాత్ముఁడై
సల్లలితాంగు రాము మన • సార స్మరించుచు, ధన్యమూర్తియై
యెల్లరు నాలకింప నని • యెన్ భరతుం "డిటు నేను దోషిగా
నొల్ల వసించి కేకయుని • యూరను, మీ పిలుపంది, వచ్చితిన్." 595

ఉ. కోరినవాఁడఁ గాను జన • కున్ మరి మాతనుఁగాని, రాజ్య మే
తీరుననైన, నెప్పుడు, హృ • దిన్ దలఁపైనఁ జనింపలేదు, నే
గోరను నేఁడుఁగూడ రఘు • కుంజరుఁడున్ సతి లక్ష్మణుండు నె
వ్వారి కతంబునన్ వనిఁ బ్ర • వాసము పోయిరొ? సత్య మేమియో ?

చ. నృపుఁ డభిషేకమున్ సలుప • నెంచెను రాముని కంచెఱుంగఁ, దా
నెపుడు గురుండు; యోజనము • నింతగఁ గైకనుగూడి చేసెనో
రిపుకుల సూదనుం డెటు వ • రించెనొ మృత్యువు దుఃఖితాత్ముఁడై
యిపుడు మదంబ దుష్ట వచి • యించిన వట్టుకు వింటి నంతియే. 597

తే. అనుచు నెలుగెత్తి భరతుండు • తనదు హృదిని
విప్పి చెప్పంగ నెల్లరు • వినెడి రీతి
వినుచుఁ గౌసల్యయు సుమిత్రఁ • గనుచుఁ బలుకు
భరతు స్వరమును గుర్తించి • బట్ట మహిషి. 598

భరతుఁడు కౌసల్యనుఁ జూచుట

తే. భరతుఁడు రాజ్యకాంక్ష మెయి • భద్రముగా జనుదెంచినా డదే
స్వరము నిజాంబగేహమున • సవ్వడియున్ గడుదీర్ఘదర్శి యి
ర్వుర మిఁక, నెట్టికష్టములఁ • బొందగ నుంటిమొ రాజమాతయై
వరలెడి కైకఁ బట్టనికఁ • బగ్గము లుండునె యేరి శక్యమౌ. 599

క. అనుచున్ వెడలిరి భరతునిఁ
గనఁ గౌసల్యయు, సుమిత్ర, • కాంచుచు భరతున్
దన కొమరున్ దలఁచుచు బ్ర
థ్వనిఁ బడి కౌసల్య యేడ్చు • బిట్టుగ నంతన్. 600

తే. ఆమె రామానుజులఁ గాంచి • యల్లె క్రుంగ
భరత శత్రుఘ్ను లంతటఁ • బరమ భక్తి
ఆమె వెన్కాడి యామె గృ • హంబుఁ జేరి
యశ్రుధారలఁ గడిగిరి • యామె కాళ్ళు. 601

తే. మలిన వస్త్రంబుఁ దాల్చిన • మాతఁ గనుచు
పరమ దుఃఖార్తి రూపటి • పరగు తల్లిఁ
గౌఁగిలించిరి, కౌసల్య • కౌఁగిలించి
పట్టఁజాలని శోకాన • పలుక దొడఁగె. 602

మ. కృతకృత్యుల్ గద తల్లి బిడ్డఁడును శో • కింపంగనేలా సుతా?
పితరుండో, దివిఁ జేరె, రాముఁడో వనీ • బీభత్సరాజ్యంబునన్
సతితో లక్ష్మణుతో వసించెడిగదా • సంప్రీతి నీ తల్లి దు
ర్మతి నార్జించెనుగా విరోధి రహితం • బౌ రామ సామ్రాజ్యమున్.

ఉ. నారల చీర లిచ్చి రఘు • నందనుఁ గానకుఁ బంప నేల ? నీ
కారయ రాజ్యమున్ గుమతి • నార్జనఁ జేసినఁ జేయుఁగాక, యె
వ్వారలు సేయు వార లిటు • పాపమునైనఁ దలంపకుండ వే
సారి దివంబుఁ జేరెను వి • శాంపతి, చిచ్చొడిఁ గట్టి నా కిటుల్. 604

ఉ. కానకుఁ బంప నేల రఘు • కాంతునిఁ, బంపిన నార చీరలన్
బూనఁగఁ జేయ నేల ? యిఁక • బొమ్మనకుండునె, నన్నుఁ గూడ, నీ
వే ననుఁ, జేర్చుమీ కలిసి • యే, మనియుండు *హిరణ్య నాభునిన్
దీనినె కోరుదాన సుమ • తిన్ దయఁ బూనుచు నింత సేయవే. 605

తే. ఆది మధ్యాంతములు లేని • యతనిఁ గాంచి
$\frac{7\ 5}{1\ 3}$ యతని విడిపోయి యిట మన • నగునె నాకు
సుందరాకారు నా ముద్దు • సుతునిఁ గూడి
విపిన తల మందె సుఖయింతు • వేగ పంపు. 606

తే. సవితృ మండల మధ్యస్థు • స్వర్ణదేహు
$\frac{7\ 5}{1\ 3}$ శంఖ చక్రాన్వితు మహా య • శంబు వాని
హరిని నారాయణునిఁ బుత్త్రి • నతని వీడి
బ్రతుకలే నిటఁ జేర్చుమీ • రాము కడకు. 607

---

* హిరణ్యనాభుఁడు = విష్ణువు. ("హిరణ్యనాభో యత్రాస్తే సుతోమే సుమహాయశాః") $\frac{7\ 5}{1\ 3}$ వాల్మీకి యీ శ్లోకమున హిరణ్యనాభుఁడని తలపెట్టి, "హిరణ్మయ వపుః ధృత శంఖచక్రః", "హిరణ్య కేశ హిరణ్య శ్మశ్రు" అను వాక్యముల స్మరింపఁ జేసెను. 606, 607 పద్యము లీశ్రుతి వాక్యముల వ్యాఖ్య.

తే. పురుషసింహుండు పుత్త్రుండు • వరలు చోటఁ
దపసుఁ గావించు చుండిన • విపిన మందె
చేర్చుమీ నన్ను భరతుఁడా • చేర్చు మింక
ఈ వియోగంబు సహియింప • నిట్లు బ్రతికి. 608

ఉ. దోస మెఱుంగనట్టి భర • తుండు మహార్తిని మాతృ వాక్కులన్
గాసిలి, సూది పుండుపయిఁ • గట్టిగ గ్రుచ్చిన రీతి ఖిన్నుఁడై
దోసిలిఁ బట్టి నిష్ఠురము • తోఁచగ తోఁచగఁ బల్కు పిమ్మటన్
"దాసుఁడ, రామ దాసుఁడ స • దా" యనె నామె పదంబు లంటుచున్.

## భరతుని ఖేదము - శపథములు

చ. నిరతము రాఘవున్ మిగుల • నిశ్చల భక్తినిఁ గొల్చువాఁడ నం
$\frac{75}{20}$ బరో! యిది నీ వెఱుంగ వొకొ! • పాపుఁడఁ గానహా ! కాను గర్వ్యాఁడన్
వరగుణ సత్య సంధు, వన • వాసము సేయఁగఁ బంపి యున్నచో
గురుఁ డుపదేశ మిచ్చిన య • కుంఠిత విద్య నశించి పోవదే. 610

సీసమాలిక :

ఇల యందు రవి ముందు • మలమూత్రముల వీడఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
నిదురించు గోమాత • నెత్తినిఁ దన్నుచోఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
గురుఁ డొసంగిన విద్య • గుప్తంబు సేయమి
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
ప్రేష్యుల దరిఁ జేరి • ప్రీతిమై కొల్వంగఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
పనిఁ గొని భృత్యుని • ధన మీయకయె పంపఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
శాస్త్రోపదేశ సూ • త్రార్థంబు మఱిచినఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
క్రొవ్వెక్కి పాదాన • గోవును స్పృశియింపఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
తామస వృత్తిఁ బె • ద్దల నిరసించుచోఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత

గురువర్యు స్వయముగాఁ • బరివాద మొనరింపఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
స్నేహిత కోటికి • ద్రోహ మొనర్పంగఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
హితుని రహస్యమ్ము • నెఱిఁగి వెల్లడి సేయఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
మేలు చేసిన వాని • మేలు నే మఱచినఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
ఉపకార మొనరింప • నపకారముం జేయఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
చెడు పనిఁ జేసియు • సిగ్గెనఁ బొందమిఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
ప్రజలు ద్వేషింపఁగాఁ • బరిగణింపక యుంటఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
సతినిఁ గైకొనకుండ • సంతాన మొందమి
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
ధర్మకార్యంబులఁ • దగ జేయకుండుటఁ
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
భృత్యులఁ ద్యజియించి • వెడలెడి కతమున
ప్రాప్తించు పాపంబె • ప్రాప్త మగుత
పాపల వృద్ధులఁ • బడతుల వధియింప
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
సతి తోడఁ గూడియు • సంతాన మొందమి
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
ప్రొద్దు; పొడుపు, గ్రుంకు, • పొద్దుల నిదురింపఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
గృహములఁ గాల్చుట • గురుభార్యఁ బొందుటఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
తల్లి దండ్రుల సేవఁ • దమిఁ జేయకుండుట
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత

మిత్ర విద్రోహియై • మెలగుచు నుండుటఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
జలములలోఁ జొచ్చి • మలమూత్రముల విడఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
భార్యను విడనాడి • పరభార్యలం గూడఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
వీడఁగా ప్రాణముల్ • విషదాయకుం డౌట
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
దప్పిఁ దేలఁగ నీరుఁ • ద్రావంగనీయమి
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత
బ్రాహ్మణ సత్కృతి, • వల దన్న వారికిఁ
ప్రాప్తించు పాపమే • ప్రాప్త మగుత

తే. రాఘవుని సత్యసంధు, వి • రాగిఁ జేసి
కాన కేగఁగఁ జేసిన • కారకులకు
వారి కెప్పుడు నఘమె సం • ప్రాప్త మగుత
వారు నరకమ్మె పొందఁ గ • లారు సాధ్వి. 611

తే. పన్ను విధియించి యాఱవ • పాలు రాజు
ప్రజల ఆదాయమున నుండి • పడయుచుండి
వారి రక్షింపఁ జాలని • వాని యఘమె
గలుగు రఘురాము వనవాస • కారకులకు. 612

తే. సమర రంగంబునందుండి, • సమయు భీతి
భీరుఁడై యుద్ధమును వీడి • పాఱుచుండఁ
జంపఁ బడినట్టి పంద; య • శంబు వీడి
యెట్టి యఘమును బొందునో • యట్టి యఘమె
గలుగు రఘురాము వనవాస • కారకులకు. 613

తే. చింపి గుడ్డల ధరియించి • చేత నొక క
పాలముం బూని యున్మత్తుఁ • బోలి పృథివి
బిచ్చమెత్తుచుఁ దిరుగాడు • వెంగలి గతి
గలుగు రఘురాము వనవాస • కారకులకు. 614

తే. కామమును గ్రోధమును గల్గి ♦ కామినులకు
వశుఁ డగుచు మద్యపానంబు ♦ వదల కెపుడు
సొమ్ము సర్వమ్ము గోల్పోవు ♦ జూదరి గతి
గలుగు రఘురాము వనవాస ♦ కారకులకు. 615

తే. కష్టముల కోర్చి గడియింపఁ ♦ గలుగు ధనము
తస్కరుల పాలె యగుగాత, ♦ ధర్మ బుద్ధి
నాశనము పొందుగాత, వి ♦ నాశనమ్ము
గలుగు రఘురాము వనవాస ♦ కారకులకు. 616

తే. సంతతియు సతియు భృత్యులు ♦ స్వగృహమందు
నరయుచుండఁ దా నొండె మృ ♦ ష్టాన్నము దిను
నతఁడు మానక పొందెడి ♦ యట్టి యఘమె
గలుగు రఘురాము వనవాస ♦ కారకులకు. 617

తే. ధర్మము తొలంగు, నపవిత్ర ♦ దాన మొసఁగి
పాత్రులగు వారిచే నొక ♦ పైసఁగాని
యిడెడి సద్బుద్ధి పుట్టని ♦ జడుని చింత
గలుగు రఘురాము వనవాస ♦ కారకులకు. 618

తే. సజ్జనులు వీడుగావుత, ♦ సద్యశంబు
తొలఁగి పోయెడిగాత, వి ♦ కల మనమున
భ్రష్టతను బొంది సత్కర్మ ♦ భ్రష్టమగుత
ఘనుని రఘురాము వనవాస ♦ కారకులకు. 619

తే. పెక్కు సంతానముండిన ♦ పేదవాఁడు,
సతము జ్వరరోగయుతుఁడు, క్లే ♦ శమ్ము నెపుడు
నెటుగఁ బొందుచు నుండునో ♦ అటుగ బాధ
గలుగు రఘురాము వనవాస ♦ కారకులకు. 620

తే. మాతృ శుశ్రూషఁ జేయని ♦ మానవుండు
యాచకుల యాశ సతము ని ♦ రాశ సేయు
నధికుఁడగు వాఁడు పొందెడి ♦ యట్టి యఘమె
గలుగు రఘురాము వనవాస ♦ కారకులకు. 621

తే. మాయయే నిత్యజీవన • మై చెలంగఁ
గఠినుఁడై పాపియై శుచిఁ • గనని వాని
కెట్టి పాపంబు గల్గునో • యట్టి యఘమె
గలుగు రఘురాము వనవాస • కారకులకు. 622

తే. తగవరుల మధ్యఁ దాఁ జేరి • తగవుఁ దీర్ప
వారిలో నొండె హితుఁడను • భావమూని
వాఁడు జయమొందు గతి జూచు • వాని యఘము
గలుగు రఘురాము వనవాస • కారకులకు. 623

తే. దివ్యమంగళ విగ్రహ • దీప్తి తోడ
ఛత్ర చామర పరివార • సహితుఁ డగుచు
జానకీజాని సాకేత • జనుల మధ్య
రాజ మార్తాండుఁడై తన • రారఁ జూడఁ
దలఁచు వారలె ధన్యులు • ధన్యతములు. 624

క. అనుచున్ శపథము శాపము
వినయంబునఁ బల్కుచున్న • వీరున్ భరతున్
గనుచున్ శాంతిని బొందుచుఁ
ననువుగ నొడిఁ జేర్చు, కోస • లాత్మజ యంతన్. 625

ఉ. పూని యొనర్చు నీ శపథ • ముల్ పెకలించెడి నాదు ప్రాణముల్
నీ నుడి సత్య ధర్మముల • నిశ్చల చిత్తము చాటుచుండె, ఆ
జానకి నాథు లక్ష్మణుఁడు • సన్నిహితుండయి యున్నరీతి, నీ
మానసముం జెలంగెడి, కు • మార, లభించెడి, నీకు సద్గతుల్. 626

## కౌసల్య భరతుని విశ్వాసించుట

తే. భ్రాతృ వత్సలు భృశ దుఃఖ • భరితు భరతుఁ
గౌఁగిటనుఁ జేర్చి యోదార్పఁ • గడఁగి యామె
మరల మరల దుఃఖాత్మయౌ • మమతఁ జిక్కి
భరతుఁడును నామెతో పాటు • మరల నేడ్చు. 627

తే. రామ సంస్మృతి, రగులుచు • రాము మాత
భరతుఁడును, మోహవశు లౌచుఁ • బడుచు ధాత్రి

నేడ్చుచున్నంతలో రాత్రి • యేగె నంతఁ,
బ్రకృతి జవదాఁటఁ గలరె యె • వ్వార లైన. 628

చ. భరతుని రాక, కైకయికిఁ • బల్కిన పల్కులు, కోసలాత్మజన్
గరమనురక్తిఁ గాంచుటయు, • గాఢమతిన్ శపథంబు లెన్నియో
నెరవుగ నంతఁ జేయుటయు, • నెమ్మి మెయిన్ వినినారు పౌరు లె
ల్లరును, వసిష్ఠుఁడో సచివు • లంగొని యా భరతున్ గనెన్ వెసన్.

ఉ. రోదన సేయు రాట్సుతుఁ బు • రోహితుఁ డా గురుఁ డా వసిష్ఠుఁ డ
త్యాదరణోక్తిఁ బల్కుచు, నృ • పాత్మజ! తండ్రికిఁ బ్రేత కర్మలన్
మోదముతోడఁ జేయఁ దగు; • బుత్త్రుఁడ వీవని చెప్పఁ, గర్మకున్
ఖేదము వీడి పూని కడు • కించ మెయిన్ భరతుండు పల్కెడిన్. 630

ఉ. ఏమని యెంచినావు ధర • ణీశ్వర? నే నిట లేక, ధార్మికున్
రాముని లక్ష్మణున్ మృగ వి • రాజితమౌ వని కంపి తేల? శ్రీ
రాముని, లోక రాముని ప • రాత్మలఁ, గుండెడి మమ్ము వీడి, యే
ధామముఁ జేరితే దశర • థా! జనకా! రఘువంశ దీపకా! 631

చ. నృప, దివిఁ జేరితే! పుడమి • నేలఁగ, రాముఁడు లేఁడిటన్! మహా
కృప జన సంతతిన్ గనెడి • యేలిక లేఁడిట, హా! అనాథయై
అపరతి నున్నది వసుధ • ఆ, శశిలేని నిశాగతిన్, బురం
బిపుడు, కళావిహీన యని • ప్రేతఁ గనున్ భరతుండు రోదనన్. 632

ఆ. ఒప్పు గాఁగ నీవె • అప్పగింపఁగ నగు
నన్నుఁ గూడ లేఁడె • యెన్న, నెవరు
దిక్కు నాకు, నేఁడు? • దిక్కుమాలిన వానిఁ
జేసి నన్ను దివికిఁ • జేరి నావె! 633

ఆ. ఏక పుత్త్రు వనికి • నేగఁగాఁ జేసియు
భర్త వయ్యు భార్యఁ • బాసి యిటుగ
గడఁగ నౌనె యెటకొ! • కౌసల్య విడనాడి
జనక, ధర్మవేత్త • సత్య సంధ. 634

తే. అస్థి సంచయనంబున • నమిత దుఃఖ
మొందిరి భరత శత్రుఘ్ను • లందఱు విన,

మూర్ఛలోఁ బడి నేలపైఁ • బొరలినారు
తండ్రి సద్గుణ రాశినిఁ • దలఁచి వారు. 635

## శత్రుఘ్నుని విలాపము

తే. కనెను మంథర, మొసలినిఁ • గైకయందు
జలము వరదానమౌ, దుఃఖ • జలధి మునిఁగి
మునిఁగి క్షోభించుచుంటిమి • మొదలు తుదలుఁ
గానరాదాయె యీ, వెత • కడలిఁ దేల. 636

తే. భరతుఁ బుత్త్రిని సుకుమారు • బాలు విడిచి
తాత! ఎట కేగినావహో! • తండ్రిఁ దలఁచి
ఏడ్చుచున్నాఁడు భరతుం, డ • దే వినవొకో!
రావ! లాలింపవా? సుతు • రాజరాజ ! 637

ఉ. రాముని, తండ్రివంటి గుణ • రామునిఁ గానకుఁ బంపినావు, నీ
వో, మము వీడిపోయితి వ • హో! యిఁక నెవ్వరు దిక్కు మా కిలన్
మే మెటు జీవముల్ విడక • మేదిని నుండఁగలార మొక్కొ, యీ
భూమి, నయోధ్యఁ, గాలిడఁగఁ • బోదుమె రాముఁడు నీవు లేకయే.

చ. తపమునకై వనంబునకుఁ • దాపసిగాఁ జనుటో, హుతాశనున్
గృపఁ గనుమంచుఁ జొచ్చుటయొ! • కృత్యము నాకని లక్ష్మణానుజుం
డపుడు కృశించి యేడ్చుతరి • నచ్చట నుండినవార లెల్లరున్
అపగతి నేడ్చి రా దశర • థావనిపాలు గుణంబు లెంచుచున్.

ఉ. తైలమునుండి తీసి, చితిఁ • దండ్రినిఁ బెట్టెఁడివేళ, అస్థులన్
గాలినవాని సంచయన • కాలమునందు, దశాహ్నికంబునన్
బేల లనంగ నెంతొ విల • పించిరి దాశరథుల్ వసిష్ఠుఁ డీ
కాలమునందు వారలకుఁ • గర్మల ధైర్యము సెప్పుచుండినన్. 640

తే. శాస్త్ర విహితంబుగాఁ గర్మ • సలిపి భక్తిఁ
తండ్రికిఁ దిలోదకంబుల • ధారవోసి,
భరత శత్రుఘ్నులు, శుచిగఁ • బురికిఁ జనిరి
జనుట తడవుగ నగ్రజుఁ • గనఁగ నెంత్రు. 641

## శత్రుఘ్నుఁడు - కుబ్జ

తే. సర్వ భూతాళి దుఃఖమ్ము • సమయఁజేసి
7-8/2 యుర్వి సుఖదాయకుండుఁగా • నొప్పఁ గలుగు
సత్య సంపన్నుఁడౌ రామ • చంద్రుఁడె యిటు
లడవి కేగెనొ! స్త్రీ బుద్ధి • ననుసరించి. 642

ఉ. శ్రీరఘురామ మూర్తి వనిఁ • జేరుట; ధర్మముగాఁ దలంచినన్
వీరుఁడు లక్ష్మణుండు గుణ • విశ్రుత ధీరుఁడు సోదరుండు లేఁ
డే, రిపుసూదనమ్ము నొన • రింపఁగ దండ్రిని నిగ్రహింపఁగా
దారుణమైన కైక నుడి • ధారుణి భర్త సహింపఁ జెల్లునే. 643

క. అనుచున్ గర్మానంతర
మున సౌమిత్రి పలికి కైక • పుత్త్రుని కంతన్,
గని యెన్ ప్రాగ్ద్వారము కడ
కనక విభూషణ విలసిత • కాంతన్ గుబ్జన్. 644

చ. కులుకుచు వచ్చు కుబ్జ కడు • గోటున, నెన్నొ విభూషణంబులన్
సలలిత రాజవస్త్రముల • జక్కఁగఁ దాల్చి సుగంధ లిప్తయై
వెలవెల రజ్జు బద్ధ కపి • వేషమునన్; భటు లామెఁ దెచ్చి, లో
పలికి సుమిత్ర నందనుని, • ప్రక్కన నిల్పిరి శిక్ష సేయఁగన్. 645

చ. ఇదియ, మహాత్ము రాము వని • కేగఁగఁ జేసిన పాప, క్రూరయై
యిదియ నృపాలు చావునకు • నెంతయొ కారకురాలు; దుష్టురా
లిదియ మహాఘమున్ సలిపె, • నీమె యథామతి శిక్షఁ జేయుమీ
వదలఁగ రాదటంచు భట • వర్గము దెల్పఁగ నాతఁ డంతటన్. 646

తే. ద్వారపాలకుఁ డాడిన • వచనములను
వినుచు శత్రుఘ్నుఁ డా కుబ్జ • వేగఁ బట్టి
నేలఁ బడవైచి యీడ్చెడి, • నేలఁ బడఁగ
నామె భూషణంబులు, చెలు • లడలి పాఱ. 647

తే. ఈడ్వఁ బడుచున్న కుబ్జను • నేడ్చుచున్న
దాని, విడిపింప కైకయి • పూనె నంత
నడ్డురాకుండ విదలించి • యామెఁ గసరి
పరుషముగఁ బల్కె శత్రుఘ్నుఁ • డురిమినట్లు. 648

ఉ. అన్నను( గాన కంపి గురుఁ • డార్తినిఁ గుంది లయించు రీతిగాఁ
బన్నిన దీమె కుట్ర, యిఁక • పాపఫలం బిదె పొందు నిప్పుడే
మన్ననసేయఁగాఁ దగిన • మానిని కాదిది యంచుఁ గ్రుద్ధుఁడై
మిన్ను గలంగఁ బల్కెఁగ సు • మిత్ర తనూజుఁడు కైక భీతిలెన్. 649

క. వడివడి పరువిడి భయపడి
తడయక శరణంబు చొచ్చు • తల్లినిఁ గనుచున్
జడియుచు, వణకుచు ధరపైఁ
బడియుండిన కుబ్జఁ గాంచు • భరతుం డంతన్. 650

ఉ. ఓయి, సుమిత్ర పుత్త్ర తగు • నోయి వధింపఁగ నాఁడువాండ్ర, 'రా
మాయ నమో' యటంచు రఘు • మాన్యుఁ దలంచుచు నెట్టి కీడునేన్
జేయఁగ రాదు, వీరలకుఁ • జేసినచో, నను, నిన్ను, నిర్వురన్
బాయును, రామమూర్తి, నర • పాలుఁడు క్రోధము వీడుటే తగున్.

ఉ. చంపెద, నేనె కైకను నృ • శంసను గ్రూరను దుష్టచారిణిన్
జంపిన మాతృ ఘాతుకుని • చందముగా నను నిందసేయఁడే
తెంపు వహింపలేదని మ • దిన్ దలపెట్టకు, రామచంద్రుఁ డే
పంపునఁ గాని స్త్రీ వధకుఁ • బాల్పడ నొల్లఁడు లక్ష్మణానుజా. 652

తే. అనెడి భరతుని హిత మాత్మ • నంత నెంచి
విడిచె శత్రుఘ్నుఁ డా కుబ్జ; • విడుచు నంతఁ
బ్రాణములు పోవునంచును • భయము వీడి
కరము లెత్తుచు మ్రొక్కుచు • కైకఁ జేరు. 653

తే. బ్రతికి బట్టఁ గట్టితిమని • వార లిర్వు
రపుడు భీతిని విడనాడి • రంతె కాని
ఆత్మగతముగనైన వా • రార్తిఁ గనరు
ఘాటివారలు, వారల • సాటి వారె. 654

## ఆశ్వాసాంత పద్యములు

క. మాయల మారివి నీవని
ధ్యేయుండవు నయ్యుఁ బేరుఁ • దెచ్చికొనంగా
మాయాతీతపరా, రా
మాయణమే హేతువొక్కొ • మా హృదయేశా! 655

తే. అర్థ మారోగ్యముల నిచ్చి • యమలశాంతి
నిచ్చి నను బ్రోచి యీకావ్య • మింతవట్టు
వ్రాయఁగాఁ జేయవే రామ! • భక్తవరద!
నిన్నె శరణన్న భక్తుఁడు • తెన్నుఁ గనును. 656

ఉ. కోరిక యేల నాకు, నినుఁ • గోరుట దోసమె, అమ్మయేని, యా
హార మిడంగఁ జాలునొకొ • ఆకలిబాధను జెప్పుకున్న, కా
నీ, రఘురామ నీ కెఱుక • యేగద సర్వము, దేని నిచ్చినన్
నే, శిరసావహింతుఁ బద • నీరజముల్ కృపసేయఁ గోరెదన్. 657

సీ. దీపంబు ముట్టించి • దీపించు నిన్ గందుఁ
గందోయి కెదుట సా • క్షాత్కరింప
అర్ఘ్య మర్పింతురా • ఆగామిఁ దరుమఁగ
నిన్ జేరి తరియించు • నియతిఁగాంచ
పాద్యమ్మిదే కొమ్ము • భక్త సంరక్షకా
సంచితాఘచయమ్ము • సమసిపోవ
కుంకుమబొట్టిదే • కొంకక పెట్టెద
నీ తత్పరత్వమ్ము • నిలిచియుండ
వికసిత పుష్పంబు • విలసిల్ల శిరముపై
నర్పింతు సకల మీ • వనుచుఁ దలఁచి
చందన మలఁదెద • చల్లని నీ చూడ్కి
భవతాపబాధలు • పరుగు లెత్త
ధూపంబు వేయుదుఁ • దొలగంగ నా మేని
సంచితవాసన • సంచయమ్ము

ఇడుదు నైవేద్యమ్ము • హృద యార్పణమ్ముగా
నన్యులఁ దరిఁ బోవ • ననుచుఁ బలికి
పట్టుపుట్టము నిచ్చి • ప్రమదంబుఁ గాంచెద,
సర్వార్థ మిచ్చిన • సరణిఁ గాఁగ
ఘమఘమల్ ప్రసరింపఁ • గమ్మని తాంబూల
మిది సుమా చేఁబూను • మీ హృదీశ

తే. రామ! జానకీరామ! నీ • రాజనమ్ము
గొనుము, సతతమ్ము నిన్నిట్లు • గొలుచువాఁడ
సలిపి పట్టాభిషేకంబు • లలితమూర్తి
నిన్నుఁ గాంచుచు • బొందుదుఁ దెరవు సరిగ. 658

ద్వి. అఘ వినాశక రామ! • ఆనందరామ
రఘురామ! వనచరా • రామ! రామ యని 659
పాడుచుఁ గెరలుచు • నాడుదునోయి
జోడించి కరములఁ • గ్రీడింతునోయి 660
వేడుచు నే నిను • వెదకుదు నోయి !
పడకుఁ బోయిన • వీడను రామా. 661

గోవింద రామాయణము—పాదుకా పట్టాభిషేకము అను కావ్యమున-
చతుర్థాశ్వాసమగు భక్త్యాశ్వాసము సమాప్తము.

---

# గోవింద రామాయణము

## పాదుకా పట్టాభిషేకము

### ప్రపన్నాశ్వాసము

క. ఏ మిడఁ గొందువు రామ
స్వామీ, హృదయమ్ము దప్ప • వరదుఁడవై, శ్రీ
"రామ శ్శరణం, మమ" యని
నీ మాటనె పల్క; రావ • నెమ్మిన్ బ్రోవన్. 1

### రాజ్యకర్తలు - భరతుఁడు

ఉ. రాముఁడు దండకావని వి • రాగిగ నుండినవాఁడు, రాజు లేఁ
డే, మము నేల? క్ష్మాపతి ల • యించె, వసుంధర నేలు మింక, ని
ట్లీ మహియుండ రాదు, ధర • ణీశుఁడు లేక యరాజకంబుగన్
స్వామి! గ్రహింపు మీవ నిజ • సత్త్వము, రాజ్యము తండ్రి నీ కిడెన్. 2

తే. కర్మ ముగియించి పురిఁ జేరఁ • గాంచి భరతుఁ
బదియు నాల్గవనాఁటి ప్ర • భాతవేళ
గనుము, పట్టాభిషేక మీ • దినమె యనుచు
రాజ్యకర్తలుఁ గోరిరి • రాజ్య మేల. 3

ద్వి. సకల పదార్థముల్ • సమకూర్పఁ బడియె
సుకరంబుగా రాజ్య • మిఁకఁ బూను మీవ 4
అను రాజ్యకర్తల • కను భరతుండు
వినయంబు ఘటియిల్ల • విశదంబుఁ గాఁగ. 5

### భరతుఁడు రాజ్యము నిరాకరించుట

ఉ. రాముఁడుఁ దప్ప కోసలకు • రాజగు వారసు లేరు లేరు, మా
యీ మహనీయవంశమున • నెప్పుడు జ్యేష్ఠుఁడె రాజరాజుగా

నీ మహి నేలఁగా వలయు, ♦ నింతకు మించిన ధర్మ మేదియున్
నా మది కెక్క దింక, రఘు ♦ నందను నా మహితాత్మ్మ నెంచెదన్.

ఉ. రాముని తోడి తేవలయు ♦ రాజ్యమునం దభిషిక్తుఁ జేసి, మా
రాముని దివ్యమంగళ క ♦ రంబగు దేహముఁ జూచి చూచి సీ
తా మహితాత్ముఁ గొల్చుచు స ♦ తంబు మనంగఁ దలంచువాఁడ ఆ
రాముఁడె, రాజ్య మేలఁ దగు ♦ రాముని, రాజ్యము, నే హరింపఁబోన్.

ఉ. వెంటనె పోవువాఁడ, నడ ♦ విన్ సుకరంబుగ రాముఁ జేర, నా
వెంట పదాతిసైన్యతతి ♦ విప్రులు మంత్రులు పౌరు లెల్లరున్
బంటులు నశ్వ దంతి రథ ♦ వాహనముల్ చను రీతిగా, వనిన్
గుంటలు మెట్టలున్ సరిగఁ ♦ గూర్పఁ దగున్ గద మంచిదారులన్.

చ. రయమునఁ బోయి యా వనినె ♦ రాము నయోధ్యకు రాజు సేతు, సీ
తయు రఘురాముఁడున్, మరల, ♦ దారుణ కాననసీమ వీడ, ఆ
రయ నొనరించెఁ దల్లి కన ♦ రాని మహోఘము, గాన, నే వనిన్
స్వయముగ నుందు నా యఘముఁ ♦ బాపికొనన్ బదునాలుగబ్దముల్

మ. అనుచున్ దెల్పఁగ రాజ్యకర్తలకు వా ♦ రామోదముం దెల్పి, తో
డన పంపించిరి శిల్పులన్ బలువురన్ ♦ రాముం గనం బోవఁగా
వనమార్గంబులఁ జక్కఁజేయఁగల స ♦ ద్భక్తావళిన్ గైక పు
త్రుని సద్భావము మెచ్చి రాఘవుని సం ♦ తుష్టిన్ వనిన్ గాంచగన్.

చ. పురజను లెల్లరున్ భరతుఁ ♦ బుణ్యతముండని యెంచి యెంచి, యా
భరతునిఁ గూడి పోయి నిజ ♦ బాంధవు నాత్మవిభున్ గనంగ నా
తురమున నున్నవారు; భర ♦ తుండు, సుమిత్ర తనూభవుండు సు
స్థిరమతి గాఢభక్తి వనిఁ ♦ జేరఁగనుండిరి రాముఁ జూడఁగన్.

## ప్రజాపరిషత్తు - భరతుఁడు

చ. కులగురుఁడౌ వసిష్ఠముని ♦ కోవిదుఁ డంత, నృపార్థమై వెసన్
గొలువును, గూర్చె, మంత్రులు న ♦ కుంఠితతేజులు రాజపుత్రులున్
బలువురు పౌరముఖ్యులు వి ♦ భాసుర మౌనులు రాజ్య కర్తలున్
బిలువగ వచ్చి రా సభకుఁ ♦ బేర్మినిఁ గోసలరాజు నెంచఁగన్.

చ. భరతుఁడు లక్ష్మణానుజుఁడు • వంశ గురూత్తము నాన నా సభన్
వరలిరి పూర్వ రాజసభ • భాతి వెలింగెడి యా సభన్ జనుల్
భరతుని వంకఁ బాలకుని • భంగిని జూతురు, చూతు రా, మునిన్
బరమ మునీంద్రుఁ డత్తరి స•భన్ భరతున్ గని పల్కె సూక్తులన్. 13

ఉ. తాత గతించె, నా దశర • థ క్షితినాథుఁడు ధర్మవేత్త, నీ
భ్రాతయు, జ్యేష్ఠుఁడున్ సుగుణ • వంతుఁడు, సత్యవచోరతుండు సం
ప్రీతినిఁ దండ్రియాన నట • విన్ వసియించెడి రాజపుత్ర ! యీ
భూతలి సర్వసంపదల • మూలము నీయది, రాజ్య మేలుమీ. 14

ఉ. అన్నయుఁ దండ్రి నీ కిడరె • అంతయు రాజ్య మకంటకమ్ము నే
తెన్నున నైనఁగాని సుమ • తిన్ గన రాజ్యము నీదె, వారసుం
డెన్నఁగ నీవె, ధర్మమతి • నేలుము కోసలరాజ్య మింక, నో
సన్నుతశీల ! ధాన్య ధన • సంపదకున్ దులలేని రాజ్యమున్. 15

ఆ. నాల్గు దిశలనుండి • నలుమూల లందుండి
ద్వీపతతులనుండి • దివ్యమణులఁ
గాన్కలెన్నొ తెచ్చు • గావుత నృపరాజి,
మెచ్చి నిన్ను, వాని • నిచ్చుగాత. 16

మ. అను నా శిష్ట వసిష్ఠ మౌని నుడు లా • హ్లాదంబుఁ జేకూర్చునే
82/9 తన రామున్ తన జ్యేష్ఠునిన్ దలఁచి సం • తాపంబు నందున్న భ
క్తునకున్ ధర్మ మెఱుంగు వానికి, సభన్•దుఃఖాత్ముఁడై యెంతొ రో
దనముం జేసెను గైక సూనుఁడు కడున్•దప్పించుచున్ మౌనిపై. 17

శా. ఒల్లన్ రాజ్యము; రాఘవుం డడవిలో • నున్నంతకాలంబు, నే
కల్లోలాబ్ధిని మున్గియుందుఁగద లో • కం బెట్లు హర్షించు నన్
ముల్లోకంబుల నేలగాఁ గలుగు రా • మున్ వీడి ధర్మంబు నే
నుల్లంఘింతునె ! రాముఁడే తగుగదా • యుర్విన్ గొనన్ సన్మనీ ! 18

ఉ. రాముని, బ్రహ్మచర్యమున • రాజిలి విద్యల నేర్చియున్న శ్రీ
రాముని, ధార్మికోత్తముని • రాజ్యము, నేనొ హరించువాఁడ వి
ద్యామహిమం బెఱుంగఁ గల • దాసుఁడ నంతటి దుష్టబుద్ధి నీ
వేమని చెప్పుచుంటివొకో • యెట్లది యొప్పిదమౌ మునీశ్వరా! 19

చ. *దశరథ నందనుండనయి ♦ దాశరథిన్ విడనాడి రాజ్యమున్
$\frac{8\,2}{1\,2}$ వశ మొనరించుకొందునె? భ ♦ వాదృశులే యపహర్త యంచనన్,
యశముఁ దలంచి ధర్మ మిది ♦ యందువె, రాజ్యముతోడి పాటుగా
విశదము సేయుచుంటి రఘు ♦ వీరుని వాఁడనె నేను సన్మనీ. 20

ఉ. రాముఁడు జ్యేష్ఠుఁడే! సుగుణ ♦ రాజిత ధర్మవిదుండు శ్రేష్ఠుఁడే!
ఏమని వాని రాజ్యము హ ♦ రింతును! పాపముగాదె! సత్కులం
బీమెయిఁ బాడుసేయుదునె! ♦ ఏగతి స్వర్గము నాకు లభ్యమౌ
కామిని తల్లి, ఆమె గతిఁ ♦ గాదనువాఁడ సునిశ్చితం బిదే. 21

చ. నృపవరుఁడై త్రిలోకముల ♦ నేలఁగఁ జాలెడి రాఘవుండు, స
$\frac{8\,2}{2\,6}$ త్కృపఁ గనఁ జాలువాఁ డతని ♦ కి బ్రణమిల్లుచు నున్నవాఁడ, నే
నెపుడును రాముమార్గమున ♦ నే, చరియించుచు నున్నవాఁడ, నే
నపకృతి నెంతునొక్కొ? విభు ♦ డాతఁడు నాకహా; సర్వమాతఁడే. 22

చ. ప్రియతముఁడైన రాముఁ డడ ♦ విన్ వసియింపఁగ రమ్యహర్మ్య సం
శ్రయమున నే వసింతు నొకొ ♦ సాధుజనావృతమౌ నివృత్తితోఁ
బ్రియసతిఁ గూడి రాముఁడుఁ జ ♦ రింప, భుజించుచు, కందమూలముల్
హయ రథ దంతి వాహన వి ♦ హారిఁగ నౌదునె రాజ్య మూనుచున్.

ఉ. నే నిదె పోయి రాఘవు, వ ♦ నీగతు వెంటనె తోడితెచ్చి, యీ
జానపదుల్ పురీజనులు ♦ సంభ్రమ మొందగ రాజు సేతు, నా
పూనిక నొల్లఁడేని, రఘు ♦ పుంగవు చెంతనె, నే వసింతు, నా
జానకినాథు, లక్ష్మణుని ♦ చందమునన్ దగ సేవ సేయుచున్. 24

ఉ. కోసల వాసులున్ ముని ల ♦ కుంఠితతేజులుఁ బండితుల్ వినన్
బాస నిదే గ్రహించితి స ♦ భాస్థలి, సర్వవిధాల వేఁడి సిం
హాసన మూనఁ జేసెద మ ♦ దాత్మవిభున్ రఘురామచంద్రునిన్
దాసుఁడనై చరించెద స ♦ దా తిరుపాదము లాశ్రయించుచున్. 25

ఉ. ఎల్లరు రాఁదగున్ గన, న ♦ రేశ్వరు రాముని, శిల్పు లప్పుడే
కొల్లలు గాఁగఁ గార్మికుల ♦ గుంపులతోఁ జనినారు, మార్గ మం
దెల్ల జనుల్ సుఖంబుఁ గనఁ, ♦ దేరులు సైన్యము జంతువుల్ చనన్
బల్లము మెట్ట గుట్టలును ♦ బాగొనరింపఁగ బాటలన్ వెసన్. 26

---

*(రాజ్యం చాహం చ రామస్య).

ద్వి. అని పల్కి తన చెంత • నచటనే యున్న
తన సుమంత్రునిఁ గని • పని కేగు కొఱకు 27
శ్రీరాముఁ గన నెంచు • వారి, నెల్లరను
పౌర ముఖ్యులఁ బిల్వ • భరతుండు కోరె. 28
రథ మొండు సమకూర్చ • సారథిం గోరె
పథ మెల్ల సరిచూచు • బాధ్యతన్ జెప్పె 29
శ్రీరాము సుముఖునిం • జేయఁగాఁ గోరె
సారథిన్ మంత్రిని • సర్వజ్ఞు భక్తు. 30

చ. భరతుని సూక్తు లన్నియు స • భాసదు లాలనఁ జేసి మోద సం
భరిత హృదంతరంగములఁ • బావన రాముని సంస్మరించుచున్
స్థిరతర భక్తుఁ డీతఁడు ప్ర • సిద్ధుఁడు కైక విధంబు వాఁడు గా
డరయఁగ నంచుఁ బల్కిరి మ • హాత్ముని రామునిఁ జూడ నెంచుచున్.

## ప్రజల విమర్శ

తే. కొంద రట కైక పక్షము • నందు వార
లయ్యయో కైక యత్నంబు • హత మటంచు
భ్రష్టుఁ డైనాడు తన యంత • భరతుఁ డంచుఁ
దలఁచి దిగులొందు చుండిరి • తమకమునను. 32

తే. 'మాతృ దేవో భవ' యనెడి • మహిత సూక్తి
వీడి భరతుండు తల్లిని • వివిధ గతుల
బిట్టు దిట్టుచు రాముని • పట్టుఁ జేరె
మాతృదేవిని గర్హించి • మనఁగ నౌనె! 33

తే. 'దుష్ట చారిణి' భర్తృ ఘా • తుక యటంచు
'వంశ పాంసన'వు 'నృశంస' • 'పాప' యనుచు
నురినో, అగ్నినో, పడి చచ్చు • టొప్పటంచు
అని వినఁగ రాని మాటల • జననిఁ దూఱె. 34

తే. అకట, 'పితృ దేవోభవ' • అనెడి సూక్తిఁ
గూడ విడనాడి రామునిఁ • గూడ నుండె

పురికి రావించి రాజ్యంబు • పొందు మనఁగ
జనకు నాజ్ఞనుఁ దలఁ దన్ను • తనయుఁ డితఁడు. 35

తే. ఇపుడెగా గురు నానతి • నీసడించె
నిండు సభ నా వసిష్ఠుని • నెమ్మిఁ గనఁడు
పానె 'నాచార్య దేవోభ • వ' యను తలఁపు
గురుని హితమును నిరసించి • పరఁగు వాఁడు. 36

ఉ. అచ్చపు భక్తి మూర్ఖతయు • నన్యుల కొక్క తెఱంగుఁ దోఁపఁగా
వచ్చు సహోదరున్ గనఁగ • వచ్చునుఁ బెచ్చగు కూర్మి, కాని, రా
లచ్చిని కాలఁదన్న గల • రాకొమరుం డితఁ డొక్కరుండె, ఏ
మచ్చికఁ జేసినాఁడొ రఘు•మాన్యుఁడు, మంత్రమొ యంత్ర తంత్రమో!

గీతమాలిక :

మాట మాటకు రాముని • మాటఁ దలఁచు
అడవి కేగెడి వాఁడ నే • ననుచుఁ బలుకు
రామ దాసుండ నేనని • రాగ మూను
అతఁడు రాముండు నా వాఁడె • యనునుఁ గూడ

నేనుఁ గూడ నాతని వాఁడ • నే యనుఁ గద
వనమునం దుందునను, రాము • బదులె తాను
సర్వ భూతాళి దుఃఖంబు • సమయఁ జేయు
వాఁడు రాముండె యను, సుఖ • ప్రదుఁడుఁ గూడ

రాముఁడే యనును, త్రిలోక • రాముఁ డతఁడు
నా మహా నాథుఁ డతఁ డను, • ఆ మహాత్ము
పాదముల చెంత వసియింతు • భక్తి నను,
భరతుఁ డున్మత్తుఁడా యనఁ • బరఁగుచుండె

ననుచు నెవ్వరైనఁ దన్నెంతు • రనెడి భీతిఁ
గాంచఁడు, భరతుఁ డా రామ • కాంతుఁ జేసి
ధర్మ మని మాట మాటకు • ధర్మ చింతఁ
బలుకు, సర్వ ధర్మములనుఁ • బాసి యతఁడు
రాజు లేనట్టి రాజ్యంబు • రాజ సుతుఁడు
పూనకుండుట, కుల ధర్మ • మౌనె భరత ! 38

## భరతుఁడు - ప్రపన్నుఁడు

తే. అనుచుఁ బలురీతులం దమ ♦ యాత్మ లందు
ధర్మ గతిని శంకింతు ర ♦ ధర్మ వృత్తి
నైహిక సుఖాభిలాషులౌ ♦ మోహపరులు
కైకకై జాలిఁ గనెడి దు ♦ ష్కర్మ రతులు. 39

ఉ. కాముకుఁడై గురుండు నిజ ♦ కాంక్షితు రాఘవుఁ గానకంపఁ దా
నేమని తండ్రియానఁ జరి ♦ యించఁ దలంచు, నకారణమ్ముగా
సోమ నిభాననుండు వని ♦ స్రుక్కఁగఁ గారకురాలు, మాతకున్
ధీమహితుండు చూపునె, వి ♦ ధేయత! ధర్మవిదుండు వాఁడెగా. 40

తే. సర్వ ధర్మమ్ములను వీడి ♦ శరణు చొచ్చె
రాము రఘురాము శ్రీరాము ♦ లలితరాము
'అన్యథా శరణం నాస్తి', ♦ యనుచు రాము
చరణములఁ గొల్వ వనికేగు ♦ భరతుఁ డపుడు. 41

తే. పరమ ధర్మమ్మునే యెంచు ♦ భరతుఁ డపుడు
రాము పదసేవ సేయు ధ ♦ ర్మమ్ము నొకటె
తలఁపఁ గలవాఁడు వేఱొండు ♦ ధర్మమేది
పరగు నా భక్తునకు, నా ప్ర ♦ పన్ననకును. 42

తే. దాస భూతుండ నని పల్కు ♦ దాస్య భక్తి
సహాచరించెదనని యను ♦ సఖ్య భక్తి
రాముఁడే సర్వమని తెల్పు ♦ రాగ భక్తి
రామవిశ్లేష, మోర్వఁడు ♦ ప్రేమ భక్తి
వరలు శ్రీరామ భక్తి, ప్ర ♦ పన్నుఁ డతఁడు. 43

తే. సర్వ జీవరాశి ♦ సంరక్షకుండును
సకలమయుఁడు రామ ♦ చంద్రుఁ డనుచు
అచలభక్తి భరతుఁ ♦ డాత్మార్పణము సేయ
వనికి నేగుచుండెఁ ♦ బరమభక్తి. 44

తే. మధురభావ తన్మయుఁ డగు ♦ మహితుఁ డతఁడు
తమిని మన్మథ మన్మథ ♦ దర్శనాభి

లాష వని కేగుచున్న వి • లక్షణుండు
అన్యభావాశ్రితుండుగా • నగుట యెట్లు? 45

తే. సతము శ్రీరామ నామ సం • స్మరణఁ దగులు
చిత్త మేరీతి నితరమ్ముఁ • జేరఁగలదు
పరుల విననెంచునే రామ • భక్తుఁ డతఁడు
రాజ్య మఖిలమింపండు వి • రాగి యతఁడు. 46

క. ప్రేమ తన స్థాయి భావము
గా, మది భరతుండు రామ • కాంక్షితుఁ డెపుడున్
'రామాయ నమో' యనియెడి
ధీమహితుం డెట్లు వినును • దేశికు హితమున్. 47

మ. అనుచున్ బండిత పామరుల్ భరతు నా • హ్లాదంబునన్ మెచ్చి, యా
తని వెంటన్ జని భక్త భక్తులగుచున్ • ధర్మాత్ము శ్రీరామునిన్
గనఁగాఁ జూతురు వారి వారి సతులున్ • గంజాక్షునిన్ రాఘవున్
గొని రమ్మందు రయోధ్యకున్ బ్రజల సం • క్షోభాగ్ని చల్లారగన్. 48

ఉ. పావన జాహ్నవీ తటికి • బాటలు వేసిరి శిల్పులంచు, నా
త్రోవలు కోసలేశ్వరు సు • తుల్ చను రీతిగ నున్నవంచు, వేఁ
బోవఁగవచ్చు సైనిక • సమూహములన్ గొని, యంచనన్ భటుల్
భూవరనందనుండు విని • ప్రొద్దుననే చనె రామ యాత్రకున్. 49

## భరతుని రామసందర్శన యాత్ర

తే. దాశరథి నాత్మలో మ్రొక్కి • దాశరథులు
భరతశత్రుఘ్ను లంతటఁ • బయనమైరి
బ్రాహ్మణులు క్షత్త్రియులు వైశ్య • పాదజులును
వేలకొలఁదిగఁ బౌరులు • వెంటరాగ. 50

తే. సచివవర్గము మాతలు • సైనికతతి
ఆ వసిష్ఠాదులు పురోహి • తాళి మరియు
స్వర్ణ రజత మృణ్మయ కర్మ • పరులు శస్త్ర
శాస్త్రజీవులు సాలెలు • చనిరి వెంట. 51

తే. నాగతతులు తొమ్మిదివేలు • నడుచుచుండె
ఆఱువేల రథమ్ములు • నరుగుచుండె
లక్ష తురగంబులును బోవు • లక్షణముగ
వివిధ శస్త్రాస్త్రయుక్తంబు • వీరి సేన. 52

తే. రామ, రఘురామ శ్రీరామ • రామ రవమె
కలకల ధ్వనిఁగూడి యా • కాశమంట
రాఘవుని లోఁ దలంచుచు • రాజపుత్త్రు
లా సుమంత్రుని రథ మెక్కి • యరిగినారు. 53

చ. చెలియలికట్ట దాఁటి వడి • సింధువు దేశము ముంచినట్లుగా
నిలసతి యీనినట్లుగ, మ • హేశ్వర రాముని జూడఁబోవు నా
బలములు తోఁచుచున్నవి, నృ • పాలు డెవండొ విభీతయుద్ధమున్
సలుపఁగ బోవుచున్న గతి • సైనికసాగరమో యనన్ వనిన్. 54

ఇంద్రవజ్రావృత్తము :
ఏనాఁడు మా రాము మ • హీతలేశున్
మానాథుఁ గంజాతు క్ష • మాంతరంగున్
దీనావనున్ రాఘవు • దీప్తతేజున్
కానంగనౌ మా కహ • కర్మవీరున్. 55

ఇంద్రవజ్రావృత్తము :
నీలాంబుజ శ్యామల • నిర్మలాంగున్
లీలా నరాకార వి • లీలరామున్
హేలావిలోలాత్మ మ • హీసుతాప్తున్
జ్వాలా మహోదీపిత • సత్యసంధున్. 56

తే. సర్వజగముల తిమిరమ్ము • సమయ దొక్క
భాస్కరుఁడు; నింగి బహుదూర • వర్తియయ్యె
పాడమునంతనె అటు లార్తి • పోవు మనకు
గనిన, దూరాననేని, రా • ఘవుని, రాము, 57

తే. జగతి శోకమ్ము హరియింపఁ • జాలు రాము
స్థిర దృఢవ్రతు, శుభములఁ • జేయువాని
భక్తవత్సలు జానకీ • వరుని రాము
నేడ, నెప్పుడు మనమింకఁ • జూడఁ గలమొ. 58

క. అనుచున్ బలుకుచుఁ గులుకుచు
జన మెల్లయుఁ బోవు రాము • సకలున్ గనఁగన్
వినుతి యొనర్చుచు మ్రొక్కుచు
జననాథుని లోకనాథు • సర్వజ్ఞుసమున్. 59

ద్వి. భరతుని వెనువెంటఁ • బరఁగు పాలితులు
భరతుండు పాలిత • బాంధవుం డగుట. 60

దినకరుఁ డస్తాబ్ధి • మునిఁగెడి వేళఁ
గనినాఁడు భరతుండు • గంగాతటంబు 61

తన సైన్యముల గూడి • తా రేయి గడుప
మును రాముఁడుండిన • వనమందు విడిసె. 62

తే. రాముని సఖుఁడైన నిషాద • రాజు గుహుఁడు
వీరుఁడు వసించు నా శృంగి • బేరపురము
దరిని, విడిసియుండెను రాత్రి • భరతమూర్తి
వాని చతురంగబలమును • బౌరతతియు. 63

ఉ. పావన జాహ్నవీ మహిత • వాహినిఁ దర్పణమిచ్చి తండ్రి, కెం
తో, వనటన్ గనెన్ రఘువ • రోత్తము, రాము, మహాత్ము నెంచి ఎ
ట్లీ వని వీడఁ జేసి, పురి • కేగతిఁ, దోడ్కొని పోగలాఁడ, నే
నా విభునంచుఁ గైక సుతుఁ • డాత్మఁ దలంచెడి సద్విధానముల్. 64

## భరతుఁడు - గుహుఁడు

ఉ. వచ్చెను గైక యాత్మజుఁ డ • పారముఁగాఁ దనవెంట సైన్యముం
దెచ్చెను, జాహ్నవీ విమల • తీరమునం దిట నాదు రాజ్యముం
జొచ్చెను శృంగిబేర కను • చూపున నున్నది నా నివాసమై
యిచ్చటి కేల రాక యితఁ • డీగతి? ముందుగఁ దెల్పఁ డేలకో. 65

తే. అదిగో కోవిదార ధ్వజ • మ్మదియ గుర్తు
భరతుఁడే వచ్చినట్లు, దా • శరథి తప్ప
అన్యు లెవ్వరు పూనుదు • రా ధ్వజమ్ము
జనకుఁ డిల వీడె, అన్నయో • వనగతుండు. 66

మ. తన రాజ్యంబు త్యజించి యీ వనమునన్ • ధర్మార్థమై యున్న, రా
మునిఁ జంపన్ సమకట్టెనో మరల చేఁ • బూనున్ బ్రవాసాంతమం
దున రాజ్యంబని; కాక యిట్లు బలసం • దోహంబు దేనేల? నా
వని, సాయంసమయాన జొచ్చుటయు స • ద్భావంబుఁగా జెల్లునే.

చ. పరమహితుండ నౌట రఘు • వర్యునకున్ ననుఁగూడఁ జంపునో
చెరఁ బడవేయునో! యెటుగఁ • జేసిన చేసెడుగాక, నన్ను; దా
శరథి మదీయభర్త, రఘు • చంద్రుఁడు నా సఖుఁ డెంచ; వాని కె
వ్వరు నపకారమున్ సలుప • వచ్చిన, నొడ్డెద నాదు ప్రాణముల్. 68

ఉ. వేచెద, గాక, యీ భరతు • వీర్యముఁ జూడఁగ గంగఁ దాఁటగా
నోచునె! రామ కింకరు న • నున్ దొలుదొల్తగఁ గెల్వకుండఁగాఁ,
జూచెద నాదు భర్త నెటు • గ్రుక్కగఁ జేయునో! నా బలంబుతోఁ
గాచెద, గంగ తీరములఁ, • గాలిడఁ గల్గునె గంగ కావలన్. 69

ఉ. ప్రోచెడి వాఁడు రాఘవుఁడె • పో, మన నెల్లర, నావ లందునన్
దాఁచుడు తిండికై తగు ప • దార్థములన్ బలునాళ్ళు చాలఁగా
నీచుని భ్రాతృ హత్య మది • నిన్ దలపెట్టిన, వీని డీకొనన్
జూచుట యొండె ధర్మ మగుఁ, • జూడ జయాప జయంబు లిత్తరిన్.

ఉ. లాయఖు రీతిఁ గైక సుతుఁ • డాసి, సుధర్మము సెప్పి వచ్చెదన్
బోయెద నిప్పుడే యతని • పొంతకు, వాని తలం పెఱుంగ, మీ
రో, యిఁక గంగ యొడ్డునను • యుండుఁడు, నా బలమెల్లఁ గూర్చి, వే
రేయది, యెంచరాదు, మన • మిప్పుడె కావవలెన్ రఘు ప్రభున్. 71

తే. భరతుఁడే రాము హితుఁ డౌచు • వచ్చియున్న
సంతసంబున నాతని • జహ్నుసుతను
మనమె దాఁటింపఁ గలము, రా • మునిఁ గనంగ
రేపటి దినంబె; యంతటి • రీతి యగునె! 72

చ. అని తలపోసి పంపెఁ దన • యాప్తుల స్వీయ బలంబుతోడ, రా
త్రిని, దన యానలేక నదిఁ • దెప్పల నేనిని దాఁటనీయ రా
దని, రఘునందనుండు, నది • కావల నుండుటఁ జేసి, తాను రా
ముని, నిజ నాథు రక్షణముఁ • బూనఁగ నప్పుడె నిశ్చితాత్ముఁడై. 73

తే. సంశయాత్ముండు గుహుఁ డంత • సత్య మరయఁ
జనియె రాజ లాంఛనములఁ • గనఁగ భరతు
ఆ సుమంత్రుండు దూరాన • నరసి గుహుని
భరతునకుఁ జెప్పె, గుహుఁ గూర్చి • పరమ రక్తి. 74

తే. లక్ష కోలఁదిగ బాంధవ • రాజిఁ గలిగి
వృద్ధుఁడై బహు కాలంబు • నెఱిఁగి యున్న
మాననీయుఁడు నీ యన్న • మహిత సఖుఁడు
దండకారణ్య కుశలుఁడు • ధర్మవేత్త. 75

తే. ఆ నిషాదనృపాలుఁడే • కానఁజేఁడు
రామ లక్ష్మణు లిప్పుఁ డ • రణ్యమందు
సంచరించెడి తావు ని • స్సంశయముగఁ
జెప్పఁ గలవాఁడు గుహుఁ • డిప్పుఁ డొప్పుగాను. 76

తే. అనుచు భరతునకుఁ దెలిపి • యాజ్ఞఁ బొందె
రాఘవుని వనిఁ డించిన • రథమె, ఆ సు
మంత్రుఁడే రథసారథి • మరల భరతు
వనికిఁ గొనివచ్చియుండె, నీ • వన నృపుండు
నా సుమంత్రుండు, మును హితు • లగుటఁ జేసి. 77

తే. భరతు నాజ్ఞను వనరాజు • బంధుయుతుఁడు
కానుకల నిచ్చి భరతుని • గాంచె నంత
రాజనీతిని మదినుంచి • రాచబిడ్డ
తోడ గౌరవమొప్ప మా • టాడఁ గడఁగె. 78

తే. కైకయీ సూనునెడఁ బ్రేమ • గాంచఁ బోడు
గుహుఁడు సంశయాత్ముఁడు హిత • కోటిఁ గూడి
భరతుఁ గనఁ బోయెఁ దా భయఁ • భ్రాంతినేమొ!
దాన హృది విప్పి చెప్పనే • కానఁజేఁడు. 79

తే. కబురు సేయకుండఁ • గాంతార నృపునకు
తాము వచ్చియుంటఁ • దమకుఁ దగిన
మంచి స్వాగతమ్ము • మర్యాద లన్నియుఁ
జేయఁ జాలనైతి • శీఘ్రగతిని. 80

శా. ఈ రాజ్యంబు త్వదీయ నిష్కుటముఁ గా • దే! ముందుగా నేర్చినన్
ధీరుం డీ భరతుండు వచ్చునని, యెం • తే గొప్పగా స్వాగతం
బౌరా యీయఁగఁ జాలువాఁడనుఁ గదా! • అర్థింతు దాసుండ, మీ
వా రీనాఁ డిటనుండ, నా యతిథులై; • వాంఛింతు నింతే నృపా. 81

శా. మీ సేనన్ బరితుష్టిఁగాఁ దనిపెదన్ • మి మ్మర్చనం జేసి; యీ
దాసుం డిచ్చెడి విందు గొంచు నిట ని • ద్రం బొందఁగా వచ్చు, నెం
తో సంతుష్టుఁడ నౌదు, రేపు సనఁగా • నొప్పున్, జమూవారముల్
భాసిల్లన్ దమ వెంట, మీ హితగతిన్ • బ్రార్థింతు నే నింతయే. 82

ద్వి. పలుకాడ, గుహుఁ డట్లు • భరతుఁ డాలించి
వెలిబుచ్చె మోదంబు • వినఁగ గుహుండు. 83

ఉ. సంతసమాయె నీ నుడుల • సాదరణమ్మునఁ బల్కితీవు మా
కంతియ చాలు, నీ వొకఁడ • వర్చనఁ జేయఁగ సిద్ధమైతివే
యింతటి సైన్య సంతతి న • దే కడుఁ దృప్తిని, మా కొసంగె, ర
వ్వంతయులేదు ఖేదము క • దా! యెటులుండు సఖుండ వన్నకున్.

ద్వి. అల భరద్వాజుని • యాశ్రమంబునకుఁ
గల, దారి దెల్పుమీ • గహనాంతరమున 85
గంగానదిన్ దాఁటఁ • గడు దుర్లభంబు
భంగమ్ము కాకుండఁ • బయనమ్ము గుహుఁడ. 86

తే. భరతుఁడు విశుద్ధహృది నన్న • పలుకు వినుచు
భయము విడనాడఁడు గుహుండు • ప్రభునిఁ గూర్చి
తనదు తలఁపులు మదిలోన • దాఁచి దాఁచి
వినతి సల్పుచు భరతున • కనును గుహుఁడు. 87

చ. భరత! మహాయశా! యటవి • న్బాట తలంపిక యేల నీకు, కిం
కరులు వనీ నివేశనులు • కార్ముకవీరులు, ధర్మపాణులై
పరఁగరొ, నీదు వెంట వని • బంధుయుతంబుగ నేను వచ్చెదన్
స్థిరమగు భక్తి నాశ్రమముఁ • జేర్పఁగ నిన్నుఁ జమూ సమేతునిన్.

ఉ. నా కొక శంకఁ దీర్పు సుజ • నా! చతురంగ బలంబుతోడ నీ
రాకకుఁ గారణం బెఱుగ • రామి, భయాస్పద చిత్తవృత్తిమై
వ్యాకులితుండ నైతిని, మ • హాత్ముఁడు రాముని కెగ్గు సేయఁగా
నీకగు నొక్కొ? నీ వటు వ • నిన్ దలపెట్టెదో? యేమి చేయుదో!

## భరతుఁడు - భక్తియోగము

చ. వనపతి సూటిగాఁ బిడుగు • పైఁ బడినట్లుగఁ బల్క కైకయీ
తనయుఁడు దుఃఖితాత్ముఁ డయి • తా నిఁకముం దిటువంటి మాటలన్
వినెడి దురంత పాపమును • వీనులు పొందక నుండుగాక యం
చని గుహుఁ గోరె నమ్మ మని • సత్యమె తా వచియించి నట్లుగాన్.

ఉ. ఎంతటి మాట వింటిని హ • రీ! యిటు తండ్రి సమానుఁ డా ధరా
కాంతుఁడు రాఘవుం డతనిఁ • గాన గతున్ మరలింపఁ జేసి, భూ
కాంతునిఁ జేయఁ బూని యిటు • కాననకు వచ్చితిఁ దోడ్కొనంగ; ఆ
వంత, అసత్కృతిన్ సలుపు • నజ్ఞుఁడఁ గానని నమ్మమీ గుహా. 91

చ. భరతుఁడు సత్య వాక్య పరి • పాలకుఁ డా గుహు శంకఁ దీర్పఁగా
సరసముగా యథార్థ గతి • సత్యముఁ దెల్పిన యంత నా గుహుం
డరమర వీడి సంతసము • నందుచు నా భరతున్ స్తుతించి, యీ
ధరణిని నిన్నుఁ బోలఁ గల • ధార్మిక వర్యుఁడు లేఁడు లేఁ డనెన్. 92

ఉ. ధన్యతముండ వీవు భర • తా! జననాథ సుతా! యనన్య సా
మాన్యము గాదె! చేఁబడిన • మానిత రాజ్య రమా విభూతి సౌ
జన్యమునం ద్యజించి, రఘు • చంద్రున కిచ్చుట; నిన్నుఁ బోలు, వా
రన్యులు లేరు లేరు భువి • నాత్మ సమర్పణ యోగ సిద్ధిలోన్. 93

తే. ధర్మ ముపదేశ మొనరించు • తరుణ మందు
నెల్ల వారలు పండితు • లీ ధరిత్రి
ధర్మ మాచరింపఁగఁ దగు • తరుణ మందు
మౌనులు నపండితులు గారె • మహిని భరత! 94

తే. మేలు మాణిక్యమే యైన • మేలిమి జత
నభిలషింపదె! భక్తున • కల్లె భరత!
పరమ పావన శ్రీరామ • పాద భక్తి
లేని భక్తుని భక్తి, ఫ • లించు నొక్కొ! 95

తే. ధర్మ నీరధిఁ ద్రచ్చఁగాఁ • దలఁచు నిన్నుఁ
బోలు వారలఁ గనలేము • భూమి యందుఁ
నెవఁడు చేఁ జిక్కు రమ వీడ • నెంచువాఁ డ
దియునుఁ దన దాన వచ్చిన • వదలు నెవఁడు! 96

ఆ. భరతుఁడు గుహుఁ డట్లు • పలుకాడు చుండఁగా
రాత్రి వచ్చెఁ గప్పె • ధాత్రి నెల్ల
వార లంత నిదుర • వాంఛించి నారలు
తనిసి గుహుని వలన • దాశరథులు. 97

తే. కాని నిద్రింపఁ జాలఁడు • కైక బిడ్డ
85/16 రాఘవుఁ దలంపు శోకాగ్ని • రగుల హృదిని
భక్తవర్యుండు శ్రీరామ • భావమయుఁడు
మేను తపియింప నిద్దురఁ • బూను టెట్లు? 98

తే. ఆ హిమాచల మందు సూ • ర్యాంశు తతుల
86/18 మంచు, కరఁగి వేసవిఁ, బ్రవ • హించు రీతి
రామ విశ్లేష శోకాగ్ని • రగిలి లోనఁ
గైక సుతు మేనఁ *చెమటలు • కారఁ దొడఁగె. 99

(*స్వేదము- భక్త్యావేశ లక్షణము)

సీ. శ్రీనాథు నిజ నాథు • శ్రీరాముఁ గను దీక్ష
"దాస భూతోస్మి" యన్ • ధ్యాన మయుఁడు
86/19 వచ్చునో రాడో భూ • పాలనంబున కని
నిట్టూర్పులం గడు • నెగడు వాఁడు
కళ్యాణ గుణఖని • కానన గతుఁ డాయెఁ
దన తల్లి వలననన్ • దైన్య పరుఁడు
యశము వాయుట గాక • అన్నకుఁ గష్టంబు
సోఁకెగా యని కుందు • శోక యుతుఁడు

తన కోర్కె మన్నించి • ధాత్రినిఁ బాలింప
వచ్చునో రాడో యన్ • శ్వశిత గతుఁడు
ప్రియునిఁ బాయఁగ లేక • వే చూచి సంశ్లేష
ముఁ గనంగఁ దపియించు • మోహపరుఁడు
ఈ దుర్భ రావస్థ • యెన్నఁడు చను నని
ధర్మార్థ మెంచు సం • తాప తనుఁడు
త్రైలోక నాథుఁడే • దాశరథి, వనీ గ
తుండను సంతత • దుఃఖ మయుఁడు

తే. భక్తవర్యుండు శ్రీరామ • భావమూర్తి
కైక సుతుఁడు కొండంత దుః • ఖంబు నొందు
పొందు పరమాపదఁ బరుని • పొందు లేక
వ్యథనుఁ బొందుచు మూర్ఛ నా • యాస మొందు. 100

తే. భరతుఁ డటు హృదయ జ్వర • బాధితుండు
గుహుఁడు దరి నుండ మిక్కిలి • కుందుచుండె
భరతునిం గని గుహుఁడునుఁ • బట్టలేని
యార్తిలోఁబడు నిరువురు • నార్తిమయులు. 101

తే. రాము గాథలఁ దనివారఁ • బ్రేమ మీరఁ
నొండొరులతోడఁ జెప్పుచు • నున్నవారు
గుహుఁడు రామ లక్ష్మణులను • గూర్చి పలుకు
భరతు నాశ్వాసనము సేయుఁ • బరమభక్తి. 102

## సౌమిత్రి సంగతి గుహుఁడు చెప్పుట

చ. అనుజుఁడు సద్గుణాన్విత మ • హాత్ముఁడు లక్ష్మణుఁ డెల్లవేళ భ్రా
తను దన జ్యేష్ఠునిన్ గొలుచు • ధార్మికుఁడై శరచాప యుక్తుఁడై
వనమున రెప్పపాటునకుఁ • బాల్పడకుండగ నప్రమత్తుఁడై
జనకసుతన్ రఘూద్వహు, ని • శన్ గడుఁ గాయఁగఁ బూనె భక్తుఁడై.

శా. అన్నా ! లక్ష్మణ నిద్రఁబొంద సుఖశ • య్యన్ దెచ్చితిన్ నీకు, నీ
వెన్నన్ డస్సితి వీ ప్రయాణమున నే • నే బంధుయుక్తుండ, రా
మన్నన్ రక్షణసేతు మేల్కొనియె, రా•మాన్యుండు ధ్యేయుండు లేఁ
డన్నన్ నా కిల, నమ్ముమీ యనఘ ! స•త్యంబేను భాషించితిన్. 104

ఉ. రాముఁడు సర్వలోకనుత • రాముఁడు వాని ప్రసాద మబ్బుచో
నీ మహి సద్యశంబు లభి • యించుచునే సిరి యబ్బుఁగా, పరం
ధామముఁ జేర్చఁగాఁ గలుగు • ధర్మము గూడ లభించు, నా
రాముని జానకీయుతు వి • రామము లేకయె కాతు నీ నిశన్. 105

ఉ. ఊనెదవిల్లు, రాముఁడు ప్రి • యుండు సఖుండు సతీసమేతునిన్
గాననమందు గస్తుమెయిఁ • గాచెద రేల, వనీ రహస్యముల్
నేన యెఱుంగుదున్ రిపుల • నెట్టుదు, గిట్టగఁ జేతు శాత్రవున్
సైనికబృంద యుక్తముగ; • స్వామికి, కీ డెవఁడొప్పుఁ జేయఁగన్.106

ద్వి. అను నాదు మాటను • వినఁడు లక్ష్మణుఁడు
తన ధర్మముం గొని • తాఁ బూనె గస్తు. 107

చ. దశరథ నందనుం డిటుగ • ధాత్రిజఁగూడి పవిత్ర శయ్యపై
నిశి నిలఁ బవ్వళింపఁ, గని • నే బ్రతుకన్ భువి శక్యమొక్కొ ! నా
వశమె సుఖింప, దైత్య సుర • వారముఁ దానె జయింపఁగల్గి దు
ర్దశ నెటుపొందెనో రఘు వ • తంసుఁడు సత్యపరాక్రముం డహో. 108

చ. పదియును నాలుగేండ్లు వన • వాస మొనర్చెడి మేము క్రమ్మఱన్
సదమల వృత్తి మా పురికి • సవ్యముగా నరుదెంచు వారమే;
సుదతినిఁ గూడి రాముఁడు వ • సుంధర నేలునె! దానిఁ జూచి నా
హృదయము శాంతి నొందునె మ•ఱెప్పుఁ డయోధ్యను జూడనోతుమో!

ఉ. మించెను మించె కాల మిక • మేరు సమాన సుధీరమూర్తియే
వంచితుఁడాయె, రామునకుఁ • బట్టముఁగట్టక వ్యర్థుఁడై, నశిం
పెంచుచు నున్నవాఁడు పిత • ప్రేతవిధుల్ నెరవేర్చి ధన్యులౌ
అంచిత పుణ్యకర్ములు సు • మా భరతుండును వాని తమ్ముఁడున్. 110

మ. అనుచున్ విహ్వలుఁడౌచు లక్ష్మణుఁడు శ•య్యన్ గూర్కఁగాఁ బోడు,రా
ముని కైంకర్యము వీడనొల్లఁడు, సదా • పూజ్యున్ గురున్ దల్లులన్
మనమం దెంచుచు దుఃఖితుండగుచుఁ బ్రే • మ ప్రేరణన్ గస్తుగా
మనె రేలన్ గనురెప్పవేయకయె రా • మస్వామి నీక్షించుచున్. 111

ఉ. నేనును బంధుయుక్తముగ • నిల్చితి, లక్ష్మణు వెన్కఁ గస్తునన్
బూనుచు విల్లు, నాత్మ రఘు • పుంగవునిన్ గడు నిల్పి నిల్పి, రా

మానుజుఁడున్ రఘూద్వహు గు • ణానుభవ మ్మొనరించు నంతలో
భానుఁడు దోఁచెఁ దూర్పుదెస•భ్రాతలు దీర్చిరి సాంధ్య సద్విధుల్. 112

ఆ. జటలఁ దాల్చి చనిరి • జాహ్నవీ నదిఁ దాఁటి
వల్కలాజినముల • వార లంత
రాచబిడ్డ లయ్యు • రామ లక్ష్మణు లప్డు
యతులునాగఁదోఁచి • రనఘ భరత ! 113

చ. జటల ధరించి మౌని జన • సన్నిభ రూపములన్ వహించి వా
రటవికి నేగిరంచు విని • యా భరతుండు, నిజార్థ మెంచి, తా
నెటుగఁ గృతార్థతన్ గనఁగ • నేర్తునో యంచు విషణ్ణ చిత్తుఁడై
దిటవరి యయ్యుఁ గూలె నిల, • దీరని దుఃఖము నోర్వజాలమిన్. 114

తే. మూర్ఛపోయిన భరతుని • మోముఁ గాంచి
మూవురమ్మలు సౌమిత్రి • ఘోరు మనుచు
నేడ్వసాగిరి బిట్టుగా • హేతు వేమొ
ఎఱుగఁజాలరు కోసల • నృపుని సతులు. 115

తే. పరమదుఃఖిత కౌసల్య • భరతుఁ జేరి
కౌఁగిలించుచు నొడిఁ జేర్చి • కన్నతండ్రి
నిన్నె గాంచుచు, నే మని • యున్నదాన
వత్స! మూర్ఛఁదేలుము భ్రాతృ • వత్సలుండ. 116

చ. భరత! కుమార! మూర్ఛ కిటు • బాల్పడఁ గారణ మేమి? రాఘవుం
డరయ సుఖుండె? లక్ష్మణున కా • జనకాత్మజకున్ సుఖంబె, ఎ
వ్వరు చెవివేసి, రే చెడుగు • వార్తను, లేక, రుజార్తిఁ బొందితో
వరగుణ? మాకు దిక్కు, రఘు • వంశపు కీర్తికి, దిక్కు నీవెగా. 117

తే. అనుచు నోదార్చు చుండిన • అమ్మ గనుచు
తెప్పరిలి కొంత తడవునఁ • దేరి చూచి
గుహుని మరలఁ బ్రశ్నించె నా • కోమలుండు
హృద్విదారక రామ వి • శ్లేషబాధ. 118

చ. భరతుఁడు శుద్ధమానసుఁడు • ప్రాజ్ఞుఁడు, కోవిదుఁ డా గుహుండు సా
దరమునఁ బల్కియుండిన యు • దంతము సర్వము నాలకించి, సో

దరుఁడు సతీ సమేతుఁ డెట • ధాత్రిని సుప్తినిఁ బొందియుండె, నే
కరణి భుజించినారొ వినఁ • గా వలతున్ గుహ! చెప్పుమీ యనన్.

ఉ. సాంతము కైక యాత్మజుని • స్వాంతమునన్ గడు విశ్వసించియున్
సుంత అపార్థముం గనని • చొప్పున నా గుహుఁడున్ స్వశక్తి లా
వంతయుఁ జెప్పె లక్ష్మణుని • భక్తియుఁ జెప్పి, యదే విధంబుగాఁ
జెంత వసింపు మన్న కని • చెప్పక చెప్పినరీతిఁ బల్కుచున్. 120

ఉ. సంతస మొందు నా గుహుఁడు • సర్వజనావనదక్షుఁడైన శ్రీ
కాంతుఁడు రామచంద్రు కథ • కర్ణపుటంబుల విందుగాఁగఁ దా
నంతయుఁ బల్కు భాగ్య మిటు • లబ్బె నటంచు, యథాగతిన్ గడున్
సుంతయు వీడకుండ నను • చుండె వినన్ భరతుండు భక్తిమై. 121

## గుహుఁడు - సీతారాముల శయన వృత్తాంతము

తే. విడిద, సేసె, నా జాహ్నవీ • విపులతటిని!
ఆ మహాతరుచ్ఛాయనే • రామ విభుఁడు
జానకీసతిఁ గూడి, వి • శ్రాంతిఁ బొందె
నటనె మరునాఁటి సూర్యోద • యమ్ము వఱకు. 122

తే. అతిథియుఁ బ్రియుండు హితుఁడును • నైన వాని
నెటుగఁ బూజించియుండెనో • అటుగ, వాని;
రాఘవుం డెట్లు త న్నను • రాగమూని
చూచెనో దాని వినిపింపఁ • జొచ్చె గుహుఁడు. 123

ఉ. పావన జాహ్నవీ సలిల • పానమె చేసిరి వారు రేయి, సీ
తావిభుఁ డొల్ల లేదు వివి • ధమ్మగు భక్ష్యము లే నొసంగినన్
భూవరు ధర్మ మిచ్చుటయె; • పొందుట ధర్మవిరుద్ధమంచుఁ, దా
నీ వని కందమూలముల • నే కుడువన్ దన సువ్రతం బనెన్. 124

తే. ఆ సుమిత్ర తనూభవుఁ • డమిత భక్తిఁ
దెచ్చి గంగోదకము నన్న • కిచ్చెఁ ద్రావ
అన్న ద్రావిన జలశేష • మా సుమిత్ర
పుత్త్రకుఁడుఁ ద్రావె, నానంద • మూర్తి యగుచు. 125

తే. మూఁడు రేవిధి నుపవాస • ముండినారు
త్వరితగతి లక్ష్మణుం డేగి • దర్భ లేరి
ధాత్రి శయనంబుఁ గూర్చ నా • దంపతులకు
జానకీ రాము లా దర్భ • శయనులైరి. 126

తే. లక్ష్మణుం డంత, గంగజ • లమ్ముఁ దెచ్చి
జానకీ రాఘవుల యంఘ్రు • లూని, రజము
కడిగి తలఁదాల్చె భక్తిమై • కంకణముల
నహాహా 'ధన్యోస్మి' యంచు "దా • సోహ" మంచు. 127

ఉ. ఎంతటి ధన్యుఁడో! భరత! • యీ సుగుణుండు విలక్షణుండు శ్రీ
కాంతను గూడియున్న రఘు • కాంతుని పావన పాదతీర్థ మం
తంతఁగ నబ్బె, రాఘవుఁడు • త్రావి, విడన్ జలశేషమబ్బె జ
న్మాంతర కర్మ సత్ఫలిత • మా? యిటులేరు పవిత్రు లీ ధరన్. 128

తోవక వృత్తము :
సీతయు రాముఁడుఁ • జేరిరి శయ్యన్
భూతల మందునఁ • బొందిరి నిద్రన్
పూత చరిత్రుఁడు • పూనుచు విల్లున్
రాతిరిఁ గాచును • రాముని సీతన్. 129

శా. సీతా రాములు దివ్య మంగళ తనూ • సేవన్ గటాక్షించుచున్
భూతల్పంబున పవ్వళించు తఱి, నే • పుణ్యంబునన్ జేసియో
చేతో మోదముతోఁ బ్రదక్షిణముగా • సేవించితిన్ గస్తునన్;
చేతన్ వింటిని బూని బంధువులు రా • శ్రీరాముఁ బాలింపఁగా. 130

## భరతుఁడు - సీతా రామ శయన ప్రదేశము

చ. ఎట నెట నున్నదోయి గుహ! • యింగుది వృక్షము పుణ్యవంతమై
పటుతర బాహు విక్రముఁడు • భాస్కర తేజుఁడు సత్కులీనుఁ డ
చ్చట నిదురించెనా ? పరమ • సత్కృతిఁ దా విడి చేసె భూజమే!
యట కొక మాఱు పోయి, కన • నౌ గద, నా స్థలమున్ మహీజమున్.

ద్వి. అని కోరి భరతుండు • వన రాజు వెంటఁ
జనెఁ జూడ రాఘవు • శయన స్థలంబు. 132

తన వెంట సచివులు • తల్లులున్ రాఁగఁ
గనుచుండెఁ గన్నీరుఁ • గార్చుచున్ దాని. 133

ఉ. యియ్యదె! యింగుదీ విటపి • యియ్యదె! రాముఁడు సార్వభౌముఁడే
ఒయ్యన పవ్వళించిన మ • హో త్తమ సౌధ సమాన భూతలం
బియ్యదె, సర్వలోక పతి • యే శయినించిన దర్భ శయ్య! అ
య్యయొ! మహా కులీనుఁడు మ•హాత్ముఁడు నేల పరుండు వాఁడొకో!

మ. కలయో! విభ్రమమో! రఘూద్వహుఁడె యీ•కాంతార గంగా తటీ
తల పర్యంకమునన్ బరుండె నొకో! స • త్యంబె? మహాత్ముండు, కో
మలుఁడున్ వీరుఁడు ధీరుఁడున్ సుజన సం • భావ్యుండు లోకేశుఁ డే
లలి భూమిన్ బవళించె నంట! అహ కా • లం బెంత దుర్వారమో.

ఉ. చారుతర ప్రమోదకర • సౌధ విహార విరాజితుండు, ఘో
రారి సమూహ దండన మ • హా విధి వర్తన ధార్మికుండు, రా
గారుణ నేత్ర సంభవ ద • యామయ వీక్షణ శోభితుండు, స
త్పౌరుషవంతుఁ డాతఁ డొకొ • పండుట ధాత్రినిఁ గాల దుర్విధిన్.

తే. జనక పుత్రిక దశరథ • చక్రవర్తి
పెద్ద కోడలు రాఘవు • ప్రేయసియును
దివ్య సౌధ నివాసిని • భవ్య చరిత
కర్కశావని శయనింపఁ • గలిగె నొక్కొ. 137

ఉ. ఇయ్యదె జానకీ సతి ధ • రించిన చీర జరీ, తృణాళిపై
ప్రయ్యలు గాఁగఁ జిందినది • బంగరు భూషల మేనఁ దాల్చి, యీ
శయ్యఁ బరుండెనా! యిదిగొ • స్వర్ణ రజంబు తృణాళి నంటె రా
మయ్యకు సీత కెట్టి గతి • హా యిల వారలు పవ్వళించుటా! 138

చ. సకల వినోద సంభరిత • సౌధ విహార విలాస శూన్యమై
సకల కళా ప్రమోదకర • సారస నేత్రల సేవ లేకయే
శుక పిక శారికా మధుర • సుస్వన గీతము లాలకింపకే
వికలము గాఁగ సర్వ, మట • వీస్థలి, మైథిలి యెట్లు పండితో. 139

క. పుట్టినది రాజ వంశము
మెట్టినదో రాజ గృహము • మేదిని సుత, చే
పట్టిన దా రఘు రాముని
మట్టిని, శయనించె కాల • మహిమం బెంతో ! 140

తే. భ్రాతృ తృణ శయ్య మర్దింపఁ • బడియె నదిగో
శయ్య నిటు నటు దొర్లిన • చంద మొప్పఁ
గాంచునే సుఖ నిద్ర నీ • కర్కశతలి
లలిత సుందరమూర్తి శ్రీ • రామ రాజు. 141

తే. కూర్కు నెటు పొందఁ గల దహో • కోమలాంగి
సీతయునుఁ గూడ సుఖ నిద్రఁ • జెంద లేదు
శయ్య యొరపిడి రాలిన • స్వర్ణ శకల
ము లవె, తెల్పెడి సుఖ నిద్రఁ • బొంద నట్లు. 142

చ. అతఁ డతి కోమలాంగుఁడు సు • ఖార్హుఁడు దుఃఖముఁ బొంద నర్హుఁడే
అతఁడు ప్రియంవదుండుఁ గడు • నంచిత కర్ముఁడు సర్వలోక స
మ్మతుఁడుఁ బ్రియుండునున్ సుజన•మాన్యుఁడు, క్ష్మాపతినందనుండు నా
కతమున రాజ్యమున్ విడిచి • కానఁ జరించు సతీ సమేతుఁడై. 143

ఉ. ఎంతటి ఘోరపాపమున • కే నొడిఁ గట్టితిఁ దల్లిమూలమై,
కాంతనుఁగూడి రాఘవుఁడు • కాననమందు వసించుచుండ నే
నెంతునె రాజ్యమేల! సుఖ • యింపఁదలంప నయోధ్యయందు, తా
మెంతయొ ధన్యులై రహ సు • మిత్ర సుతుండు ధరాతనూజయున్.

ఉ. సీతయె ధన్యురాలు పతి • చెంత వసించెడి మాన్య కానలో
రాతిరి, నాథు పొంత నిదు • రన్ గననోచిన సువ్రతాఢ్య సం
ప్రీతిగ భర్తృ ధర్మ మొన • రించి పతివ్రతయై చరించు, మా
సీతయె పూజ్యురాలు పతి • చెంత వసించుట సర్వ మామెకున్. 145

ఉ. ఆపద నేహమందు తన • యన్నను వీడక లక్ష్మణుండు, సీ
తాపతి వెంటనంటె, సతి • ధాత్రిజ భర్తను వెంబడించె, నే
నో పతితుండ రాఘవు న • హో యెడఁబాసితి, నాదు కోర్కెమై
భూపకులాగ్ర గణ్యుఁ డిలఁ • బొందునొ! పొందఁడొ సంశయార్తుఁడన్.

చ. జనకుఁడు స్వర్గమేగె, సతి ◆ జానకితో రఘురామచంద్రుఁడో
వనగతుఁడాయె, రాజ్యము న్ప ◆ పాలకు వీడి యనాథయయ్యె, నై
నను నరిలేఁ డయోధ్యఁ గొన ◆ నాథుని రాముని వీర్యమెంచుచున్
బనివడి యే రయోధ్యఁ గొన ◆ వత్తురు, రూపఱియున్న దానికై.

చ. ఇదె యిక నేను గూడ ధరి ◆ యింతు జటల్ ఫలమూలముల్ భుజిం
చెదఁ దృణశయ్యఁ బండెద వ ◆ సించెద నన్నకు మారుగా వనిన్
బృథివి సలక్ష్మణుం డగుచు ◆ నేలెడు గాక రఘూద్వహుండు, స
ద్విధిగ, నయోధ్య రామునకు ◆ విప్రులు పట్టముగట్టు వారికన్. 148

తే. ఇతఁడు కడగొట్టు సోదరుఁ ◆ డెపుడు నన్ను
వీడఁ డరయఁగ వనిలోనఁ ◆ దోడునుండు
దైవ మాశీస్సు లిడుగాత ◆ తప్పకుండ
వినఁగ రాముండు నా కోర్కె ◆ వీటి కరుగ. 149

ఉ. పావన రామచంద్రు పద ◆ పద్మములన్ బ్రణమిల్లి వేఁడెదన్
దీవనలిచ్చి నా హితముఁ ◆ దీర్చ, వనిన్ విడి, మా యయోధ్యకున్
బోవ ననుగ్రహించి భువిఁ ◆ బూనుచుఁ బాలన సేయుమంచు, నా
భూవరుఁ డొల్లఁడేని రఘు ◆ పుంగవువెంట వనిన్ వసించెదన్. 150

మ. తన వెంటన్ మనుచుంటకైన వనిలోఁ ◆ దమ్మున్ గృపన్ జూడఁడే
నను దాసుండని వెంటనుంచికొన, నిం ◆ తైనన్ దయన్ జూపఁడే
అనుచున్ శోకపరీతుఁడైన భరతుం ◆ డాత్మన్ విచారించుచున్
గనె సూర్యున్ నిశయెల్ల నిద్రఁ గనఁడా ◆ గంగాతటీ వాసియై. 151

## భరతుఁడు - భరద్వాజాశ్రమము

ఆ. తెల్లవారు నంతఁ ◆ దెలివొందె దిక్కులు
అన్న పిలుపు వినిన ◆ యంత లేచె
రామ నామమె హృది ◆ రా పాడుచుండిన
ఆ సుమిత్ర పుత్త్రుఁ ◆ డమిత భక్తి. 152

తే. అన్నదమ్ములు మాటాడు ◆ చున్న యపుడె
గుహుఁడు భరతునిఁ గనవచ్చెఁ ◆ గూర్మిమీర
గుహుని రామానుజుం డంతఁ ◆ గోరెఁ బనుప
గంగ దాఁటించి యవలికిఁ ◆ గనఁగ మునిని. 153

తే. త్వరితగతి నైదునూళ్ల నా • వలను గూర్చె
గహన విభుఁడంత, భరతుఁడు • గంగఁ దాఁటి
వెడలి యా ప్రయాగ వనిని • విడిదిసేసె
స్వీయ చతురంగబలము వె • న్వెంటరాగ. 154

చ. భరతుఁడు, తల్లులన్ మునుల • బాంధవులన్ సచివాళిఁగూడి, సం
తరణ మొనర్చె జాహ్నవిని • నావల నెక్కి, మృగాళి సైన్యముల్
వరలఁగ, వెంటఁ బౌరులు, న • పార ముదంబునఁ గొంద ఱెంచ, నీ
దరి పలురీతులన్ సుర న • దిన్ రఘురాముని జూచు వేడ్కమై. 155

తే. ముప్వు రమ్మల మంత్రుల • ముని వసిష్ఠు
ననుజుఁ గొని వెంట భరతుండు • చనియె, మౌని
నా భరద్వాజుఁ గని మ్రొక్క • నాశ్రమమున
సేన విడి క్రోసు దూరాన • కాననమున. 156

## భరతుఁడు - భరద్వాజుఁడు

తే. ఆ *భరద్వాజ మౌని మ • హర్షి, కాంచి
యా వసిష్ఠు, నిలబడె న • ర్ఘ్యం బొసంగ
వినతి సల్పెడి భరతునిఁ • గనుచు నతఁడు
కోసలేశ్వరు సుతుఁ డని • గుఱుతు వట్టె. 157

తే. అర్ఘ్య పాద్యంబు లొసఁగి మ • ర్యాద సలిపి
ఫలము లిడి యిర్వురకు భర • ద్వాజుఁ డంత
కుశలమా! మంత్రులకు సైన్య • కోశములకు
మీకు నెల్లర కంచన • వార లపుడు. 158

ఉ. క్షేమమె; ఓ తపస్వి! ప్రియ • శిష్యుల కాశ్రమ వృక్ష పంక్తికిన్
క్షేమమె! పావకత్రయికి • క్షేమమె! పక్షి మృగాళికిన్! సదా
క్షేమమె! యెల్ల వారలకు • క్షేమముగా మనుచున్న వారలే
ఓ ముని యంచుఁ గైక సుతుఁ • డొప్పుగఁ బల్కె నమస్కరించుచున్.

---

*భరద్వాజుఁడు = అస్ఖలిత బ్రహ్మచారి — రేతస్సును బదిలముగా భరించిన వాఁడు.

చ. ముదుసలి, యా మహా తపసి • పుట్టిన దాదిగ బ్రహ్మచర్యమున్
వదలక యోగ నిష్ఠ భగ • వంతునితోఁ గనె స్నేహ బంధ, మ
య్యది, హృదిఁ బొంగ రాఘవుని • నాత్మఁ దలంచుచుఁ గైక సూనునిన్
విదితము సేయఁ గోరె నట • వీస్థలి కాయన వచ్చు హేతువున్. 160

చ. భువికి నధీశ్వరుండ వయి • భూప సుతా యిటు వచ్చి తేల! రా
ఘవు వెను వెంటనే వనికిఁ • గాఁదగు కార్య మదేమి! తెల్పెదో
వివరముఁగా మహా యశుఁడు • ప్రేమ మయుండు సలక్ష్మణుండు మా
ధవి సుత తోడ రా, వనికిఁ • దండ్రియె పంపఁ బ్రవాసి యయ్యెఁగా.

ఉ. ఆతని కెగ్గు సేయు కొఱ • కా వన మార్గముఁ బట్టినావు? నీ
మాత యకంటకం బయిన • క్ష్మాతలి నీ కిడెఁ గాదె, అంతతోఁ
జేతము తృప్తిఁ బొంద దొకో! • చేయఁ దలంచితొ కీడు నీవు, నీ
భ్రాతల కీ మహా వనిని • పాప మెఱుంగరు రామ లక్ష్మణుల్. 162

చ. అను ముని వాక్యముల్ వినుచు • నా భరతుండు 'హతోస్మి' యంచు స
న్మునివిఁ, త్రికాల విన్మణివి • భూరి యశుండవు నీ వెరుంగవే
వని కిపు డేల వచ్చితినో! • పావన రాఘవ రామ చంద్రునిన్
గని ప్రణమిల్లి రాజ్యరమఁ • గైకొన వేడఁ దలంచినా ననెన్. 163

ఉ. ఎక్కడ నున్నవాఁ డొకొ? మ • హీపతి రాముఁడు, నా విభుండు, నే
నక్కడ కేగి యాతని ప • దాంబుజయుగ్మము నాశ్రయింతు నా
దిక్కయి రాజ్య మేలుమని, • దేవర రాఘవు జూడఁ జెప్పుమీ
అక్కట సంశయింప దగ • వా నను? నే నపరాధిఁ గా నహో. 164

ఉ. తల్లి యొనర్చె ఘోరమగు • తప్పిదమున్ నను నింద సేతువే
కల్ల యొనర్తు నా జనని • కాంక్ష, మదీప్సిత మద్దికాదు, నే
నొల్లను రాజ్య మేలఁగ, ర • ఘూత్తము రామునిఁ ద్రోసిపుచ్చి, సం
ఫుల్ల ముఖారవిందు రఘు • పుంగవుఁ జూడ ననుగ్రహింపుమీ. 165

ద్వి. భరతుండు భక్తిమై • పలుకంగ నటుగ
దరినున్న మౌనులు • దశరథహితులు 166

వర వసిష్ఠుండును • వామదేవుండు
భరతునిఁ గృపఁజూడఁ • బ్రార్థించునంత 167

భగవంతుఁ డా భరత ♦ ద్వాజుండు పేర్మి
నగు మోముతోఁ గైక ♦ నందనుఁ జూచి. 168

ఉ. మీ రఘువంశ సంభవు ల ♦ మేయ గుణాఢ్యులు, నగ్రజున్ మహో
దారతఁ గొల్చువారలు స ♦ దా, దమమున్ గనువారు, పెద్దలా
వారల దారినే మెలఁగు ♦ వారలు నీవునుఁ బూర్వ సద్గతిన్
గోరుచు నుంటివంచు హృది ♦ గోచర మే యదె వింటి నీ వనన్. 169

చ. ఎరుగుదు నీ మనంబు, భర ♦ ణీశ్వరుఁగా రఘురాము సేయఁగా
బరగితివంచు, నీ వటుగఁ ♦ బల్కఁ వినన్, విని, సుస్థిరంబుఁగా
వరలఁగ జేయ నీ మతము ♦ పల్కితి, నే నిను సంశయింప, నీ
ధరణిఁ ద్వదీయ కీర్తి భర ♦ తా! కలకాలము నిల్చి యుండెడిన్. 170

చ. వరగుణ రామమూర్తి వన ♦ వాసము సల్పెడి చిత్రకూట భూ
ధరమున; లక్ష్మణుండు సతి ♦ ధాత్రిజ గొల్చుచు వెంటనుంట; నే
నెఱుగుదు, రేపు నీ వచటి ♦ కేగఁ దలంపుము, నేఁటి రేయి, దత్
పరమతి విందుసేతుఁ గుడు ♦ వందగు సైన్య యుతంబుగా నిటన్. 171

తే. సేన నటు దూరమందుంచఁ ♦ బూనితేల
దాని రావించు మాశ్రమ ♦ స్థలికి నిపుడె
సైన్యమున కెల్ల విందు నే ♦ సలుపువాఁడ
ఈఁడ యీనాఁటి రేయి నీ ♦ వాడయండె. 172

చ. జలనిధివోలె పెద్దదగు ♦ సైన్యము మత్త గజాశ్వయూథముల్
గల బలగంబు వచ్చినది ♦ కాననమందె చరింపఁగా దగున్
ఫల సుమ, శోభితంబయిన ♦ వాడ త్వదాశ్రమ మిందు, సేన, నే
నిలిపిన, సర్వముండెడు, ము ♦ నీ భగవంతుఁడ వీ వెఱుంగవే ? 173

తే. రాజులును రాజపుత్త్రులు ♦ రాజధాని
వీడి సైన్యయుతంబుగా ♦ వెడలునపుడు
మునుల యాశ్రమముల దారిఁ ♦ బోవఁదగునె
దాన నుంచితి సేన దూ ♦ రాన మౌని. 174

ద్వి. అను భరతునిమాట ♦ లాలించి మౌని
తన విందు సల్పంగఁ బనిఁ బూనెనంత. 175

శా. ఆనాఁడుండిన నవ్యరీతుల, మహో • హ్లాదంబు సంధిల్ల నా
మౌనీంద్రుండు తపోబలంబుమెయి స • న్మానింపఁగా కైకయీ
సూనున్, వేదవిధిన్ సమంత్రకముగా • శుద్ధ స్వరంబూని, ఆ
హ్వానించెన్ వరుణాది దేవతల నా • యా కార్యముల్ తీర్పగన్. 176

ఉ. వృద్ధుఁడు పెద్దకాలము భు • విన్ మను నాతఁడు, జ్ఞానమందునన్
వృద్ధుఁడు, దీర్ఘ కాలము త • పించిన యోగవరిష్ఠుఁడున్ మహా
సిద్ధుఁడు, బ్రహ్మచర్య వివ • శీకృత యోగ సమాధి సిద్ధుఁడున్
సిద్ధుఁడు సర్వమంత్రముల • సిద్ధుఁడు వాఁ డణిమాది ధూతులన్. 177

## భరద్వాజుని విందు

తే. కంద మూలాదులే యటఁ • గలవు గాని
సర్వ మితరమ్ము శూన్య మా • శ్రమము నందు
కాని క్షణమాత్ర సేయఁగా • బూనె విందు
పిలిచి నంతనె విచ్చేసె • విశ్వకర్మ. 178

చ. వరుణ యముల్ కుబేరుఁడును • వచ్చిరి, వచ్చెను స్వర్గనాథుఁడున్
తరుణులు గాయకుల్ నటులు • తామరతంపరగాగ వచ్చి ర
త్తరుణమునన్ మహానదులు • తక్షణమే ప్రవహింపసాగె నె
వ్వరు *కొఱలేరు మౌని భగ • వంతుని పిల్పున వచ్చి రెల్లరున్. 179

సీ. పచ్చిక బయలాయె • పరిసర ప్రాంతముల్
మెట్టపల్లము లన్ని • మట్టుగాగ
మట్టగు తావుల • మహనీయగతి నప్డె
చూడఁగాఁ బుట్టెను • మేడ లెన్నొ
మేడలం దెల్లెడ • వాడుక పనిముట్లు
స్నాన భోజన వస్త్ర • శయ్య లమరె
స్నానాది సౌఖ్యముల్ • సమకూర్ప, సుందరాం
గన లుండి రెందఱో • వినయ మొప్ప

తే. సుందరాంగన లా విందు • నందు నాడి
పాడి వీణ వాయించుచు • వరలువారు

*కొఱ = కొఱఁత.

మద్య మొసగుచు నతిథుల • మమతఁ దేల్చు
వారు సమ్మోహనాంగులై • ప్రబలినారు. 180

తే. పాయసపు వాహినులు కొన్ని, • ఫలరసమ్ము
వాహినులు కొన్ని, మధువుల • వాహినులును,
పొంగి ప్రవహించుచుండె ను • ప్పొంగ సేన
అన్నియు సమృద్ధిమెయి విందు • నందు గలవు. 181

తే. పత్ర ఫల పుష్ప భూజముల్ • ప్రభవ మొంద
ఆ నదీ నదంబుల తటి • నంతలోన
శారికా పిక శుక పక్షి • సంతతులును
అప్డె పుట్టుచుఁ గూయుచు • నలరుచుండె. 182

చ. లలిత లతా నికుంజ తరు • లాలితుఁడై సుమన స్సుగంధ తుం
దిలుఁడయి గంధవాహకుఁ డు • దీర్ఘముగా మెయిఁ దాఁకుచుండ నా
అలికుల వేణు లందముగ • నాడుచు వీణల మీటి పాడ, సే
నలు కడు ద్రావుచున్, సుర వ • నంబుల ద్రిమ్మరు మైక మొందుచున్.

తే. క్షణిక మాత్రాన విందెల్ల • సాగుచుంట
దేవతలె వచ్చి సర్వమ్ము • తీర్చి దిద్దు
చుంట, పిలిచి నంతనె సర్వ • ముద్భవించు
చుంట, భరతుండు గనుచుండె • చోద్యముగను. 184

తే. రామ హిత కాంక్షి యగు మౌని • రాజుఁ గాంచి
కైకే యతని *కల్పిత సర్వాన్న • మంతఁ జూచి
సౌధముల జూచి వృక్ష • సంతతులఁ గాంచి
ఆ నటీ నటులను గాంచు • నబ్బురమున. 185

తే. రావి చెట్టులు గొప్ప న • ర్తకులు గాఁగ
తాండ్ర చెట్లూనె సరి యగు • తాళ గతుల
మద్దెలలఁ బూనె మారేళ్ళు, • మహిత మౌని
యాన తిచ్చుట తడవుగ • నబ్బురముగ. 186

---

*ఉప కల్పిత సర్వాన్నం.

తే. ఆ భరద్వాజుఁ డెంతటి • యతులుఁ డొక్క
క్షణిక మాత్రాన సృష్టించు • శక్తి వాఁడు
అచరములుఁ గూడఁ జరియించి • యాడి పాడె
సకల కళలను నేర్చిన • సరణి నపుడు. 187

## భరతుని ప్రపత్తి

తే. సచివ పరివేష్టితుండు దా • శరథి యంత
మౌని కోరుట, గనఁ బోయె, • మహిత రీతిఁ
జూచు చున్నంతఁ, గనుకట్టు • చొప్పుఁ దోప
తమకుఁ దాఁ బుట్టినట్టి • సౌ • ధముల సౌరు. 188

ఉ. అందొక సౌధ రాజము మ • హా రమణీయము సౌఖ్యదాయి యా
నందమయమ్ము, దివ్య శయ • నమ్ముల నాసన భోజనాదులన్
బొందగు దాని, రాజు కొలు • వుండగ నొప్పు సభా గృహంబుతో
నందము చిందు దానిఁ గని • యందునఁ జొచ్చెఁ బురోహితాళితోన్.

ఉ. భాసుర సౌధమందున స • భా సదనంబునుఁ జొచ్చి ఛత్ర సిం
హాసన చామర ద్వయము • నాతఁడు గన్గొని మంత్రి యుక్తుఁడై
యాసన మొంటనుండె సచి • వాళి సమేతముగాఁగ; గాని సిం
హాసన మెక్క లేదు హృద•యంబున నిల్పుచు రామచంద్రునిన్. 190

ఆ. రాచఠీవి దనర • రాజ్యాధికారులు
చేరి రెల్ల, సభను • శీఘ్రగతిని
రాజొకండె లేదు • రత్న పీఠంబున
విందు వేడ్క లన్ని • వెలయుచుండె. 191

తే. భరతుఁ డుపవిష్టుఁడై యుండ • వరలఁ జేసె
రత్న సింహాసనము, మౌని • రాజు, కాని
సచివులు పురోహితాళియు • సైన్యపతియు
భరతుఁడును నొక్క వరుసనే • వరలినారు. 192

తే. మౌని యంతట రావించె • మహిత, గాయ
కులను, నారద తుంబుర • గోపవరుల
రాల గరగించు గానాన • రహిఁ జెలంగు
నృత్యముల మన్ను మిన్నును • నేకమయ్యె. 193

చ. భరతుఁడొ విందు నందుఁగల • భక్ష్యము లంటడు, గాన నృత్య సం
భరిత వినోదముల్ గనఁడు • ప్రాంజలి రాముఁ దలంచి ఛత్ర చా
మర మహితాసనంబులకు • మాన్యతఁ జూపి, ప్రదక్షిణించి, చా
మరమును బూని కేల, నృప • మంత్రులతో నుపవిష్టుఁడై సభన్. 194

తే. "దాస భూతోస్మి" యనుచు లోఁ • దలఁచువాఁడు
రామ కింకరు గతి చామ • రంబుఁ బూని
రాఘవుఁడు పెద్ద గద్దియ • రాజిలు నటు
లాత్మ భావించి కైంకర్య • మంతఁ బూనె. 195

తే. భరతుని బలంబో, సంతుష్టిఁ • బరఁగుచుండి
త్రావి, త్రావుచు మత్తిలి • దనరుచుండి
ఆశ్రమమె స్వర్గ మనుచు లో • నలరుచుండి,
రేయి రెయెల్ల గడిపె నా • రీతి గాగ. 196

తే. స్వస్తి 'ఆ రామునకు, స్వస్తి' • భరతునకును
యిటనె యుందుము మేమను • నెల్ల సేన
తెప్పరిలకుండె సైన్యము • తప్ప త్రావి
మౌని పరికల్పితాతిథ్య • మహిమ వలన. 197

ఆ. దిక్కు లెట్టుబారెడి తఱి • నొక్క త్రుటిని
సర్వమును స్వప్న దృశ్యమై • సమసిపోయె
యక్షిణీరీతి, గారుడి • యనెడి మాడ్కి
యాశ్రమము యథాస్థితి నొప్పి • యమల మయ్యె. 198

తే. భరతుఁడు చమూ సమేతుఁడై • వచ్చియుంట
రాఘవ స్నేహ బంధన • రాజితుండు
మౌని, తన శక్తి కై కేయి • సూనున కొక
లీలఁగాఁ జూప విందు క • ల్పించె నేమొ! 199

చ. హయ రథ దంతి పంక్తి చతు • రంగ బలంబుల శక్తికంటె, న
వ్యయము తపోబలంబు, వివి • ధాస్త్ర చయంబుకంటె మిన్న, కై
కయిసుతుఁడా! తపోబలము • కాంతువె చూపెదనన్న మాడ్కి, నా
భయద మహాచమూపతికిఁ • బల్కెనో! మౌనియు విందు రూపునన్.

తే. భరతుఁ డెప్పుడు శ్రీరామ • భక్తుఁ డనుచు
యోగదృష్టి నెఱింగియు • యోగివరుఁడు
కన్నులారఁ దద్భక్తినిఁ • గాంచ నెంచి
విందు కల్పించెనా కను • విందుగాఁగ. 201

తే. ఆ వసిష్ఠునిఁ గూడి తా • నతిథి పూజ
పొంది గైకొనె ఫలముల • విందు ముందు
అంతియే కాని మఱి యేమి • యంటకుంట
విందు నందునఁ గనిఁ ముని • ప్రేమఁ గనెనొ! 202

ఉ. ఆ సభ మంత్రులున్ మునులు • నాశ్రమవాసులుఁ జూచుచుండ, సిం
హాసన ఛత్ర చామరము • లారసి పూజ లొనర్చియుంట, సిం
హాసన మూనకుంట, కర • మందున చామరమూని యుంటయున్
దోసము లేనివాఁడు భర • తుం డని, మౌని దలంపకుండునే. 203

తే. విందు సర్వంబుఁ గాంచి క • న్విందుగాఁగ
ఆ భరద్వాజఁ యోగీంద్రుఁ • డమిత శక్తి
భరితుఁడు మహామోన్నతుఁ డని • భరతుఁ డెఱిఁగి
తుష్టిఁ గనె, మౌని, రామ హి • తుండె యగుట. 204

తే. గంగ కవల గుహునిఁ • గనె రామ భక్తుని
92/17 శక్తిమంతుని వన • సార్వ భౌము,
ప్రథిత యోగి, నివల • భగవంతుఁ డనఁ దగు
వాని రామ హితుని • భరతుఁడు గనె. 205

ఉ. ఎంతటి వారు రాఘవున • కెందఱొ మిత్రులు భక్తులై రహో
యింతగఁ, జూచునంతటనె, • యెవ్వరు రామున కీ డయోధ్య, భూ
కాంతుఁడు, సర్వ లోకనుత • కర్మఁడు, సర్వ జగన్నియంత, నా
వంత, దొలంగ దాశరథి • పాద సమాశ్రయ మెప్డు చిక్కునో! 206

చ. అని తలపోయు రాఘవ ప • దాశ్రితుఁ డా భరతుండు, సూ
ర్యుని గను నంత భక్తి మెయి • యోగివరున్ గని, మ్రొక్కి, సంతసం
బును వెలిబుచ్చె విందునకు, • ముందున కేగ నను‌జ్ఞఁ గోరి, రా
మునిఁ గను త్రోవఁ దెల్ప ముని • పుంగవుఁ గోరెను బద్ధహస్తుడై.

ఉ. శంక యొకింత లేని ముని • చంద్రుఁడు కైక తనూజుఁ గాంచి, యే
జంకును లేక దెల్పె రఘు • చంద్రు నివాసముఁ జేరు మార్గమున్
గొంకు త్యజించి పల్కు, ముని • కోవిదు వాక్యము లాలకించి యా
వంక నె నిల్చియున్న నృప • పత్నులు ముప్వురు మ్రొక్కి రమ్మునిన్.

తే. ముని పదంబుల నంటుచు • మ్రొక్కి నార
లతుల కౌసల్యయు సుమిత్ర • యమిత భక్తి
కైకయో మ్రొక్కి మునికి, మొ • గంబు వాల్చి
సుతుని ప్రక్కగ నిలఁబడి • చూచు భువిని. 209

తే. సవతులకుఁ బోలె కైకమ్మ • సరణి లేదు
మౌని దరి నిల్వ నోపదు • పూని సిగ్గు
విఫలమయ్యెను గాదె, య • భీప్సితంబు
అపశయమె దక్కె కైకమ్మ • కవని యందు. 210

తే. వారిఁ గని భరద్వాజుండు • భరతు నడిగె
మూవు రమ్మల వివరమ్ము; • బుద్ధిమంతుఁ
$\frac{92}{19}$ డంత భరతుండు భగవంతుఁ • డైన మునికి
పలుక సాగెను కై మోడ్చి • పరమ భక్తి. 211

ఉ. రామునిఁ గన్న తల్లి రఘు • రాముని బెంచిన మాత, ధన్య, శ్రీ
రామునికై తపించుచు వి • రామము లేక కృశించుచున్న, యా
రామయె కోసలాత్మజ, ధ • రాపతి రాణి, సుశీల, పూత, గా
రామునఁ గాంచి పెంచిన, ప • రాక్రమ రామునిఁ జూడఁ గోరెడిన్.

తే. ఆమె వామ హస్తముఁ బూని • నట్టి యామె
యే, సుమిత్ర, పతివ్రత • యిర్వురఁ గనె
వారె లక్ష్మణ శత్రుఘ్న • వీరవరులు
అశ్వినీ దేవతలఁ బోలి • యలరు వారు. 213

ఉ. ఈమెయె నాదు తల్లి, యశ • మెల్లఁ ద్యజించిన దుష్టురాలు, శ్రీ
రాముని కాన కంపిన దు • రాగత కారకురాలు, భూధవుం
డీమె కతాన, స్వర్గమున • కేగె, నృశంస, యనార్య, దుఃఖమున్
బాముల గూర్చె నా కిటుగఁ • బాప, యనున్ భరతుండు క్రుద్ధుఁడై.

చ. భరతుని గ్రుద్ధునిన్ జననిఁ • బల్మరు దిట్టుచు నున్న వాని, నా
1 దరమునఁ గాంచి పల్కె ముని, • తప్పిదమున్ గనఁబోకు కైకలో;
వరగుణ రామమూర్తి వన • వాస గతార్థము, భావి కాలమం
దరయగ సౌఖ్య హేతువగు • నయ్యది సత్యము కైక పుత్త్రకా. 215

చ. మునులును దేవ దానవులు • ముందు గతిన్ గనఁజాలు వారలు
2 న్మనముల సంతసింతురు వ • నంబున కీ గతి రాము రాకకున్
బనివడి *రాఘవుండె వన • వాసముఁ బూనిన వాఁడు, కైక, నీ
జనని తదర్థమై యిటుగ • సల్పిన దంతె, విధి ప్రయుక్తయై. 216

తే. లక్ష్మణున కంతె భక్తి వి • లక్షణుండ
వనుచు నే యోగ దృష్టిమై • నరసినాడ
దాశరథి దైవ కార్యార్థి; • తగదు వంత
వత్స! జానకీ పతి, భక్త • వత్సలుండు. 217

తే. కైక దోషిణి కాదు చీ • కాకు పడకు
సర్వము శుభప్రదంబు వి • శ్వము సుఖించు
భరత! రాఘవుఁడు, వన ప్ర • వాసి యగుట
ననుచు గుప్తార్థ యుక్తిని • ముని వచింప 218

తే. విని ప్రశాంతుఁడై కైకేయి • తనయుఁ డపుడు
మౌనికిఁ బ్రదక్షిణించి, న • మస్కరించి
చిత్రకూటాద్రి రాఘవుఁ • జేరఁ జనియె
సపరివారంబుగాఁ గడు • సంతసమున. 219

ద్వి. పల్లకీ యెక్కెను, • భరతుండు త్రోవ
నల్లంబు చల్లగా • నుర్వీశుఁ గనఁగ 220
హయములు గజములు • అబ్బబ్బ యెన్నొ!
పయనంబు సాగించె • వనమార్గమందు 221

---

1. న దోషేణా వ గన్తవ్యా కైకేయీ భరత! త్వయా।
రామ ప్రవ్రాజనం, హ్యేత త్సుఖోదర్కం భవిష్యతి॥
2. దేవానాం దానవానాంచ ఋషీణాం భావితాత్మనామ్।
హితమేవ భవిష్యద్ధి ప్రవ్రాజనాదిహ॥

* రాఘవుఁడు = సర్వజ్ఞుఁడు.

ఆ సేన భయదమౌ • అట్టహాసముల
పోసాగె వన మార్గ • ముం బట్టి యంత 222
శ్రీరాము దర్శింప • శీఘ్రమే చనెడి
వారాశిఁ బోలెడి • బలగంబు వనిని 223
జేరె సరాసరి • చిత్రకూటాద్రి
ధీరుండు భరతుండు • పారఁజూచుచును 224
ముని భరద్వాజుండు • చనుమన్న రీతిఁ
గనె, తాను వినియున్న • గతియునుఁ గాంచి 225

మ. ఇదె మందాకిని పుణ్య తీర్థతటి, మౌ • నీంద్రుండు వాకొన్న చో
టదియే, శ్యామల వర్ణకాననమదే • ఆ చిత్రకూటాద్రి అ
య్యదియే పుష్ప లతా వితా, నిత వనం • బందుండు రాముండు వే
వెదుకం జెల్లు వనాంతరం బనుచుఁ బం• పెన్ సైనిక వ్రాతమున్. 226

ఆ. వెదకఁ జనిన వారు • విపిన మందొక చోట
ధూమ చిహ్న లరసి • తోడ మరలి
వచ్చి చెప్పునంత • భరతుండు, పొగ తావె
మనుజ వాసమంచు • మదిఁ దలంచి. 227

తే. సేన నట నిల్వగా నాన • సేసి, తానె
ఆ వసిష్ఠ సుమంత్రుల • నండఁ గొనుచుఁ
బొగను జూపట్టు చోటకుఁ • బోవ నెంచి
అల్లె జూచెడి ధూమ శి • ఖాగ్రములను. 228

తే. రాఘవుం డుండినట్టి యా • రామ సీమఁ
జేరి యుంటిమి శ్రీరాము • శీఘ్రగతిని
గాంచ నోచితిమని సేన • యెంచు చుండి
ధూమ శిఖలనుఁ జూచు సం • తుష్టిఁ గనుచు. 229

తే. ఆ భరద్వాజముని వీడి • అడవి దారిఁ
బట్టి చతురంగ బలములు • వచ్చియుంట
వనినిఁ గల జీవరాశి దు • ర్భర భయమ్ము
పొందుట నశాంతి భువి దివిఁ • బొంగి పొర్లు. 230

సీ. మృగరాజ నికరంబు • మేనుల విదళించి
గంభీరముగ సల్పు • గర్జనములు
అవనీతలంబెల్ల • నద్రువంగఁ బరువెత్తు
వేదండ సంతతి • బృంహితములు
వ్యాఘ్ర భల్లూకాది • బహు జంతు సంతాన
హాహాకృతి విజృంభ • ణార్భటులును
వృక్షాగ్రముల నుండు • విహగ వ్రజంబులు
గగన వీధికిఁ బారు • కలవరములు

తే. ఖర ఖుర వ్రజ పాద సం • ఘట్టనములు
సైన్యతతి గతి జనియించి • చదల నంటె
ప్రబల సైన్య పదోద్భూత • పాంసు పటలి
గగనమును గప్పె నరుణ మే • ఘంబు పగిది. 231

## సీతా రామ విహారము-చిత్రకూటము

చ. భరతుఁడు చిత్రకూట నగ • పార్శ్వమునన్ దన సేన నిల్పెఁ ద
ద్గిరి రఘు రాముఁడున్ వసుమ • తీసుతఁ గూడి చరించుచుండె, సుం
దర నగరాజమున్ గనుచుఁ • దానఁ గలట్టి విచిత్ర దృశ్యముల్
ధరణిజ కెల్లఁ జూపుచు ము • దంబున క్లేశము విస్మరించుచున్. 232

చ. లలిత లతా నికుంజ తరు • లాలితమై సుమనోమనోజ్ఞమై
అలరుల వింటిజోదు సిరి • కాస్పదమై, తలిరాకు గుంపులన్
గలయఁ జరించుచున్ మధుర • గానమునన్ లలి, గాలితో శ్రుతిన్
గలిపి విహారమూను విహ • గంబుల నొప్పెడి కొండఁ జూడుమీ. 233

ఉ. చూచితివే సతీ! శిలల • సొంపు, సితారుణ పీత నీల వ
ర్ణోచిత కాంతిమంతములు, • జూడుము చిత్ర విచిత్ర వర్ణముల్
దాచెనొ, ధాతుసంచయము • ధాత్రి, పునాదులయందు నీ గిరిన్
బూచెనొ సర్వ వర్ణము, ల • పూర్వముగాఁగ శిలల్ మనోజ్ఞముల్.

చ. మలయ సమీర, సత్ఫల సు • మంబులు, కోయిల కూతలున్ నను
న్వల గొనకుండునే, త్రికర • ణంబుల నేక మొనర్పకుండునే
యిలఁ గల స్వర్గమో యిదియ- • ఏ నిటనుండి సుఖింప నెంతు, సా
వలె సఖ నీవునున్ దలఁతు • వా? గిరినుండ సుఖప్రదంబుగా. 235

ఉ. చూడు మవే మృగంబు లవి • శుద్ధ హృదిఁ జరియించుచున్న, వే
కీడును సేయకొం డొకటి • కిన్ గడు దుష్టము లయ్యు, మౌను లీ
వాడ వసించుటన్, వివిధ • పక్షి సమూహము లున్న గొండ, నే
జాడను లేదు పెన్రుతము • శ్రావ్య మనోహరముల్ స్వనమ్ములున్.

ఉ. చూడుము కోమలీ ! యెటుగఁ • గ్రూర మృగంబులు, సేదఁ దేరఁగా
గూడునో ఒక్క చోట గిరి • గుంపుగఁ, బోవు బరస్పరంబు నే
కీడుఁ దలంపకే, నదికిఁ • గ్రీడగ దప్పికి నీరుఁ ద్రావ; నీ
వాడ, మునీంద్ర సంతతుల • వాడ, రవంత, యశాంతి లే దిటన్. 237

శా. కాలాంభోధర కాంతి కాంతము వనిన్ • గంజాక్షి వీక్షించితే!
హేలన్ బారెడి దివ్య గంగ యదె యం • దే హంసలన్ జూడుమీ
లీలన్ గిన్నర దంపతుల్ మెలఁగు గే • శిన్, బ్రస్థముల్ గాంచుమీ
శైలం బియ్యది చిత్రకూట మిడదే • సౌఖ్యంబు సీతా సతీ. 238

చ. సరసిజముల్ మరాళములు • చక్కని యీ పులిన ప్రదేశముల్
పరమపవిత్ర యోగి ముని • వర్యులు స్నానము లాడు రేవులున్
పరువడి పిల్ల తెమ్మెరల • పాటునఁ బోయెడి యా తరంగముల్
మురిపెముఁ గొల్పవో, మగువ? • ముచ్చట గావొ, నదీ విలాసముల్!

ఉ. సీతరొ చిత్రకూటము వ • సింప, నయోధ్యగ నెంచు మింక సా
కేత జనంబువోలె తిల • కింపుము వన్య మృగాళి నెల్ల నీ
పూత నభో నదీ సలిల • మున్ సరయూ నదిగాఁ దలంపుమీ
ప్రీతి మదాజ్ఞ నీవును సు • మిత్ర సుతుండును దీర్చు వారెగా. 240

తే. స్నాన మొనరించి యీ నదీ • జలము లందు
మూఁడు కాలంబులను మధు • మూల ఫలము
లారగించుచు నిను గూడి • అతివయుంట
మఱవ నొకొ రాజ్యము, నయోధ్య • పురముఁ గూడ ? 241

మ. అనుచున్ రాఘవుఁ డా సతీమణికి నా • హ్లాదంబునన్ జూపు నా
వని, మందాకినిఁ, జిత్రకూటమును, న • వ్వానిన్ మనోజ్ఞంబుగా
గననౌ చిత్ర విచిత్రమ్మున్, విహగ లో • కంబున్, మృగ వ్రాతమున్
మిను దాకం గల వృక్ష రాజముల సం • ప్రీతిన్ సదానందుఁడై. 242

ఉ. రాము విభుండు సీత కను • రాగముతో వచియించు నంతలో
భూమియు నింగి యేకముగ • భోయనె, భీకర దుర్భరార్భటిన్
సామజ సింహముల్ పులులు • సల్పుచు నున్నవి చుట్టుపట్ల, నా
వ్యోమము ధూళికిన్ నిలయ • మో యనఁ దోఁచెడి యంత కంతకున్.

తే. చిత్రకూటంబు దరి సేన • చేరి యుంట
వెడలు నా ధ్వని మృగ తతి • భీతిఁ జెందె
పైకి రేగిన యా మహా • పాంసు పటలి
గగనమును గప్పె రాముండు • గాంచి దాని. 244

## భరతుని సేన-లక్ష్మణుఁడు

ఉ. ఏమి సుమిత్ర పుత్ర ? యిటు • లీ వనమెల్ల భయంకరమ్ముగా
భూమి వడంక జంతుతతి • పొందె మహార్తిని, వేఁటఁ బూనెనో
భూమిధవుండు, భూపతి స • ముండెవఁ డేని ! మహోద్భుతంబుగా
నే మృగమైన వచ్చె నొకో ! • యీ వని భీతిల నెల్ల జంతువుల్. 245

తే. అనఁగ రాముండు, రామాజ్ఞ • ననుసరించి
లక్ష్మణుం డెక్కె నొక వృక్ష • రాజ మపుడు
కలయఁ జూచుచు దిశలెల్లఁ • గాంచెఁ గొండ
చేరువ, చతురంగ, బలము • సింధు సమము. 246

తే. *కోవిదార ధ్వజంబును • గుర్తు పట్టి
భరతుఁడే సైన్య యుతుఁడయి • వచ్చె నంచు
సకల రాజ్యంబు గొనియు, ని • ష్కంటకముగ
దాని నొనరింప భరతుఁడే • దాడి వెడలె. 247

శా. కొమ్మి రాఘవ! నీ ధనుస్సు నిక, ఆ • క్రూరుండు రాజ్యంబు స
ర్వమ్ముం జేకొని దండయాత్ర మనపై • వచ్చెన్ జయాయుక్తుఁడై
తమ్ముం డంచుఁ దలంతువా! వలదు నీ • తమ్మున్ గుహున్ జేర్చి యు
ద్ధమ్మోనందగుఁ గైకయీ సుతునితో • ధర్మార్థ మాత్మార్థమున్.

---

*కోవిదార ధ్వజము=ఎఱ్ఱకాంచనము గుర్తుగాఁ గల భరతుని జెండా.

శా. వీరా! సత్య పరాక్రమా! రఘువరా! • విచ్చేసె సైన్యంబు, తే,
ధీరోదాత్త! ధరింపుమీ కవచమున్ • దీయందగున్ బాణమున్
శూరుం డా భరతుండు రాజ్య రమచే • శోభింప నిష్కంటకం
బౌ రీతిన్, నిను నన్నుఁ జంప నిటకున్ • వచ్చెన్ జమూయుక్తుఁడై.

తే. దశరథుండె మనల చూడఁ • దరలె నంచుఁ
దలఁతువా, రామ? లేదు శ్వే • త ధ్వజమ్ము;
కోవిదార ధ్వజమ్మదె • గుర్తు కాదె
భరతుఁడే యుద్ధమును సల్ప • వచ్చినట్లు. 250

ఉ. చిక్కెను గైకయీ సుతుఁడు • చేతికి నేఁ డిట, వీడ నింక, నే
స్రుక్కఁగఁ జేతు; రాముఁడు వ • సుంధర పాలన వీడ పేతువా
రక్కసి వాఁడు, వీని రణ • రంగమునన్ దునుమాడు వాఁడ, న
ల్దిక్కుల నేలుమీ పిదప • ధీయుత రాజ్య రమా విభూతులన్. 251

తే. ఇతఁడు పూర్వాపకారి, నే • నితనిఁ జంప
పాప మొదవదు, మఱి ధర్మ • వర్జితుండు
నితనిని సబాంధవమ్ముగ • నిపుడె దునిమి
రాజ్య రమఁ బూనఁ దగు దీవు • రామచంద్ర. 252

తే. కైక రూపాఘ భరము భూ • కాంత విడిచి
సౌఖ్య మొందెడి గాత నే • సహనమూని
యుంటి నెన్నియో నాళ్ళు నే • నూని విల్లు
శత్రు వధ మాచరించి ప్ర • శాంతిఁ గనుదు. 253

తే. పాడు గడ్డివాామి • మండెడి గతి నగ్ని
శత్రుసేన నాదు • శరమువలన
దహనమౌను గాదె • దాశరథీ? యిక
విపిన మెల్ల పీన్గు • వెంట గాఁగ. 254

తే. క్రూరమృగముల యాఁకలి • దీరుఁ గాక,
అస్మదీయ శరాళి మ • హా ఋణమ్ముఁ
దీరెడిని గాక, ధను వింక • తృప్తిఁ గనెడి
గాక, రాముండు రాజ్యంబుఁ • గాంచుఁ గాక, 255

## రాముఁడు లక్ష్మణుని శాంతింపఁ జేయుట

తే. అనెడి క్రోధాత్ము లక్ష్మణుఁ • గనుచుఁ బలుకు
నూరడింపంగ రాముండు • "వీరవరుఁడు
ప్రాజ్ఞుఁడు మహాబలుండును • భరతుఁ డెంచ
తనకుఁ దా నిటు వచ్చుట • తప్పు గాదు. 256

ఆ. తండ్రి యాన భక్తిఁ • దలఁ దాల్చి వచ్చెను
భరతుని యెడ నీర్ష్య • వలదు వలదు
కత్తి విల్లుఁ బూనఁ • గాఁ గల పనియేమి?
ధర్మచింత వలదె • తమ్ముఁ జంప. 257

తే. తమ్మునకుఁ దండ్రి యిడినట్టి • ధాత్రిఁ గొనఁగ
అతనిఁ బరిమార్చె రాఘవుం • డనరె ప్రజలు
సోదరుని జంపి యవ్వాని • సొత్తుఁ గొనఁగ
చేయి వచ్చునె? యద్దానిఁ • జేయఁజాల. 258

ఆ. సఖులు బంధువులును • క్షయమయి లభియించు
ధనము, గొనుట విషముఁ • గొనుటకాదె!
ద్రవ్య మెవరికొఱకు ? • తమ్ములకై కాదె
మీ నిమిత్త మరయ • మేదినియును. 259

ఉ. నమ్ముము లక్ష్మణా నిజము • నమ్ముము చెప్పుచునుంటి గాదె, నే
తమ్ముల సౌఖ్యమే తలఁచి • ధర్మము నర్థము కామమున్ సదా
యిమ్మహిఁ గోరువాఁడ, నిత • రేచ్ఛ రవంతయులేదు, రాజ్య స
ర్వమ్మును మీ నిమిత్త మిదె • బాణముపై శపథంబు సేసెదన్. 260

చ. ఎరుగుదు నే సమర్థుఁడ, మ • హీస్థలి సర్వము నొక్కపెట్టునన్
గరమునఁ గైకొనం గలను • గాని, యధర్మము సేయఁబూన, నా
భరతుఁడు మీ సహోదరులు • భద్రముగాఁ, గననట్టి సౌఖ్య మే
నరసి గ్రహింప, నట్టి సుఖ • మగ్ని దహించెడి గాత పొంద బోన్.

## భరతుని సుహృద్భావము రాముఁడు తలంచుట

చ. భరతుఁడు భ్రాతృవత్సలుఁడు, • వైరముఁ బూనఁడు, నిత్య ధర్మ
తత్పరుఁడు, కులానువర్తనుఁడు,• ప్రాణముకంటెఁ బ్రియుండు నాకు, లో

గురునిఁ దలంచి మామ యిడు • కూరిమి వీడి యయోధ్యఁ జేరె నం
చరయగఁ దోఁచు, వచ్చి యట•నంతయుఁ గాంచుచు, దుఃఖితాత్ముఁడై.

చ. విని, మన మీగతిన్ గృహము • వీడి ప్రవాసము సల్ప వచ్చుటన్
వనికి, జటాజినంబులను • వల్కలముల్ ధరియించి యుంటయున్
మనలనుఁ జూడవచ్చె, నను • మానము పొందఁగ రాదు, కైకయీ
తనయుఁడు స్నేహ తత్పరుఁడు • తా నిటు వచ్చెను దుఃఖితాత్ముఁడై.

ఉ. తల్లినిఁ దిట్టి, కోపమునఁ • దండ్రిని మంచిగఁ జేసి కొంచుఁ దా
నొల్లక రాజ్యమున్, వని, క • యోధ్యను వీడుచు వచ్చె, రాజ్యమున్
జల్లగ నా కిడంగనని • స్వాంతము దెల్పెడి, నప్రియంబులన్
గల్లల నాడి యుండె నొకొ • కైక సుతుం డెపుడేని మున్నహో. 264

ఉ. ఏ యపకారమున్ సలుపఁ • డే మనకున్ భరతుండు మున్ను, నేఁ
డే, యపకార మూనె నని • యే గతిఁ జెప్పగ నౌను లక్ష్మణా?
ఈ యశుభంబు చింత మది • కెట్టుగఁ దోఁచె, నొకప్పుడేని, అ
న్యాయము నెంచఁబోడు, మది • యందున శంకకు హేతు వేమగున్.

చ. భరతునిఁ గాంచి, యే పరుష • వాక్యము గాని వచింపరాదు, సో
దరుఁగని యప్రియంబు లన • ధర్మము గాదు, వంచించితేని, నే
నెదఁ గనువాఁడ నన్నెయని • తీవని లక్ష్మణ! తండ్రియున్ సహో
దరు లొకవేళఁ జేసినను • దప్పును, వారలఁ జంపు టొప్పునే! 266

ద్వి. అను మాట లాలించి • యా లక్ష్మణుండు
మనమున లజ్జించి • మహిజంబు డిగ్గి 267
శ్రీరాము పార్శ్వానఁ • జే మొగిడించి
చేరెను నమ్రుఁడై • సిగ్గుతో నంత 268
భరతుని సైన్యంబు • గిరి చుట్టు విడిసె
భరతుఁడో రాఘవు • నరయంగ వెడలె. 269

## భరతుని రామాన్వేషణము

ఆ. పాదచారి యౌచు • భరతుండు వెడలెను
బంధు యుతుఁడు గుహుఁడు • వనినిఁ దిరుగు

బోయవాండ్ర గూడి • పోయి శత్రుఘ్నుండు
కలయ వెదకు రాము • గహన మందు. 270

తే. వెదకఁ జనుచుండి శత్రుఘ్ను • వీరుఁ గనుచు
వేడి నిట్టూర్పు భరతుండు • విడిచి విడిచి
ఆత్మ సంక్షోభమును దెల్పు • నతని కపుడు
భక్త వర్యుండు విశ్లేష • భారవహుఁడు. 271

చ. కలుగదు దుఃఖ శాంతి రఘు • కాంతునిఁ గాంచెడి దాఁక, ఆ మహా
బలుఁడు సుమిత్ర నందనుఁడు • వానిని నేనియుఁ జూచు దాఁక, ఆ
యిలసుత సీత నేనిఁ, గన • నేనిఁ బ్రశాంతినిఁ బొందఁ జాల, నా
కలవర మెప్డు పాయు నొకొ • కాంచుట నా రఘు రామచంద్రునిన్.

చ. కలుగునె నాకు శాంతి, రఘు • కాంతునిఁ బద్మ దళాయతాక్షునిన్
నెలసరి మోము వానిని, పు • నీత శుభానన దివ్య సుందరున్,
సలలిత దేహునిన్, జనక • జా హృదయేశు, మదాత్మ నాథునిన్,
గలిసెడి దాఁక, వానిఁ గని • కై మొగిడించెడి దాఁక, సోదరా. 273

## భరతుని యభిమతము

తే. తాత తండ్రుల సొత్తగు • ధరణి నేల
నర్హుఁడగు రామరాజు ప • ట్టాభిషేక
జలములఁ దడియు, నందాక • శాంతి లేదు
వీడునే యార్తి శ్రీరాముఁ • జూడకుండ 274

తే. *భ్రాతృ మహనీయ పూజిత • పాద యుగము
98 పార్థివ వ్యంజ నాన్వీత • పాదయుగము
8 శిరసునం దాల్చు నందాక • స్థిరము గాఁగ
శాంతి లభ్యంబె సోదరా • శాంతి లేదు. 275

తే. లక్ష్మణుఁడు కృతార్థుండు స • లక్షణమగు
దాశరథి ముఖచంద్ర సం • దర్శనమున;
రాము రాజీవనేత్రు ని • రంతరమ్ము
చూచు సిద్ధార్థ సౌమిత్రి • శుద్ధుఁ డరయ. 276

---

*(యావన్న చరణౌ భ్రాతుః పార్థివ వ్యఞ్జనాన్వితౌ శిరసా ధారయిష్యామి నమే శాంతి ర్భవిష్యతి. — అ. – 98 స. 8. శ్లో.)

తె. జానకి దెవి వైదెహి • సతము భర్త
వెంట నంటెడి వనిఁగూడ • వీడ కుండ;
సాగరాంత మహా పృథ్వి • సకల నాథు
ననుసరించుచుఁ గృతకృత్య • అవని జాత. 277

చ. అరయ హిమాద్రి, నందన వ • నాంతరమందుఁ గుబేరుఁ డుంటఁ ద
ద్గిరి ఘనమాయెఁగా; వసుమ • తీతల నాథుఁడు రామచంద్రుఁ డీ
గిరి వసియించు చుంటఁ గడుఁ • గీర్తి వహించు హిమాద్రికంటె, నీ
ధర గిరి రాజ మంచు వసు • ధాపతి పాదరజమ్ము సోఁకుటన్. 278

క. అనుచున్ శత్రుఘ్నున కని
తన దారినిఁ దాను బట్టి • తరలెన్ వెదకన్
జనుచుండెనుఁ బుష్పితవనిఁ
గనఁగా రఘు రామచంద్రుఁ • గానన సీమన్. 279

## ఆశ్రమపు గుర్తులను గాంచుట

తే. గురువులును, బ్రాహ్మణులు, మంత్రి • వరులు, ప్రజలు
వెంటరా భరతుఁడు వని • వెదకి వెదకి
గిరివరంబెక్కి పుష్పిత • తరువుఁ జేరి
కలయఁ జూచుచు నొక చోటఁ • గాంచె బొగను. 280

ఆ. పొగను జూచి చూచి • పొంగుచు భరతుండు
అదియె ఆశ్రమమని • యనిన యంత
జలధి నడుమ నుండి • వెలికి వచ్చిన యట్లు
భరత బృందమెల్ల • ప్రమదమొందె. 281

తే. సాధకుఁడు గురుని యుపదే • శము గ్రహించి
ఆచరించెడి రీతిగా • ననుసరించె
భరతుఁడును నా భరద్వాజ • గురుని నుడిని;
దాన రామాశ్రమపు దారిఁ • గానఁ గలిగె. 282

తే. ఆ సుమంత్రుండు గుహుఁడును • ననుసరింప
ఆశ్రమపు గుర్తు లెన్నియో • అడవిఁ గనుచు
వెడలు చున్నాడు భరతుండు, • వెనుక కంపె
గురు వసిష్ఠునిఁ దల్లులఁ • గూడి రాగ. 283

సీ. కొంత దవ్వున కేగి • గుర్తించె తపసుల
వాసమా యన • నొప్పు • పర్ణశాల
అటఁ గాంచె నంతట • నతిథి సత్కారార్థ
మైయున్న నొక పర్ణ • మంటపమ్ము
ఆ శాల దరిఁ గనె • యర్చనార్థంబుఁగా
గుట్టగాఁ బెట్టిన • కుసుమచయము
వాని పొంతనె చూచు • వాలాయముగ రాత్రి
కాల్చుటకై యున్న • కట్టెల గమి
తే. వీతి హోత్రార్థమై యున్న • పిడకలఁ గను
ఆశ్రమపు దారి గుర్తుగా • నందు నందుఁ
గొమ్మలకుఁ గట్టి నటువంటి • కుశల వల్క
లమ్ములనుఁ జూచి చూపించు • తమ్మునకును. 284

## భరతుఁడు రామాశ్రమము చేరుట

ఉ. వాకిటనున్న వానిఁ గని, • వచ్చెడి మార్గముఁ జూచి చూచి, మం
దాకినిఁ గాంచి ధూమము, య • థావిధి నుండిన యాశ్రమంబునున్
గైక సుతుండు పోల్చికొని • గంతునఁ జేరి తదాశ్రమంబు; లో
కైకవిభున్ మహామహునిఁ • గాంచుచు దుఃఖపరీత చిత్తుఁడౌ. 285

తే. అడుగొఁ! గూర్చుండె భువిని, వీ • రాసనమున
విజనవనిలోన నీ జగ • ద్విభుఁడు నేఁడు
వానిఁ గని యిట్లు నేనింక • బ్రతుకనేల
జన్మ మిఁక నేల? యేల యీ • జన్మ మింక. 286

తే. లోకనాథుండు మహితుండు • నా కతమున
వ్యసన మొందంగ వచ్చె నీ • వనమునందు
సర్వకామములను వీడి • జగతి విభుఁడు
రాఘవుఁడు ఘోరవనిలోనఁ • బ్రతుకుచుండె 287

తే. అనెడి నిందకుఁ బాత్రుండ • నవనిలోన
రాఘవ పదాబ్జముల కేను • ప్రణతిసల్పి
జనకజ పదంబులకు లక్ష్మ • ణునకు మ్రొక్కి
రాముఁ గోరెద రమ్మని • రాజ్య మేల. 288

తే. ఆశ్రమ ద్వారముం జేరి • అందు దెసల
ఖడ్గ తూణీర శర చయ • కవచములను
నగ్నిహోత్రంబు నొకచోట • నతఁడు చూచి
చూచుచు, జటాపటలధారి • నోయగంబు. 289

తే. కాంచి పొగఁ దొత్త యాశ్రమ • గతిఁ దలంచి
దూరమునఁ బర్ణశాలను • పార చూచి
దారి నాశ్రమ చిహ్నల • తీరు నెంచి
దవ్వు దవ్వున చని యందు • దాశరథిని 290

తే. పావకుం డన దీప్తిమై • బరఁగు వాని
ధ్యాన పరతంత్రు బ్రహ్మగా • నలరువాని
విమల పద్మాసనాసీను • వీరవరుని
ఆ జటావల్కలమ్ముల • నలరువాని 291

తే. వేషమున మారి దీప్తిమై • వెల్గు వానిఁ
గనుచు గనుచుండి నొక త్రుటిఁ • జనుచు దరికి
అన్న యే యని గురుతించి • యంత కంత
దుఃఖవార్నిధిలోఁ బడుఁ • దోడుఁ జూచి. 292

## భరతుఁడు - శ్రీరామ దర్శనము

ఉ. అందము చిందులాడు వద • నాబ్జముపై ముడిగా జటల్, సదా
నందమయుండు దాల్చియు; వ • నంబున వల్కలధారి యయ్యునున్
బొందియు జింక చర్మమును • మూఁపునఁ బావకుఁ బోలియున్న, ఆ
సుందరు, రామచంద్రుఁ గను • చున్, భరతుండు, ప్రహృష్టచిత్తుఁడా.

ఉ. అన్నను జూచి, సంతసము • నార్తియు రెండునుఁ బొందుచుండె, నా
సన్నుతశీలుఁ డప్పుడు వి • శాంపతి సోదరుఁ జూడఁ గల్గి, యా
పన్నత వీడి సంతసిలెఁ, • బార్థివరాము వనీస్థలీ స్థితిన్
గన్నులఁ జూడఁ జాలమి, వి • కావికలై హృది శోకతప్తుఁడా. 294

తే. సాగరాంత పర్యంత వి • శాల భువికి
భర్తయును ధర్మవర్తియు • బ్రహ్మవోలె
దర్భపీఠి నాసీనుని • దాశరథిని
జనకజా లక్ష్మణాన్వితుఁ • గనుచు నంత. 295

తే. దుఃఖశోక ప్లుతుఁడు భర • తుండు దుఃఖ
మణచుకొనలేక యెలుగెత్తి • అల్లె యేడ్చి
ఆత్మ సంక్షోభ మొందుచు • నంతకంత
కరములను మోడ్చుఁ గన్నీరు • గప్పుచుండ. 296

సీ. పరిషదంతర మహో • పండితోపాసితుం
డా మృగోపాసితుం • డాయె నేఁడు
దివ్య వస్త్రాంచిత • దేహుఁడా ధర్మార్ధ
మై పూనె జింక చ • ర్మంబు నేఁడు
సుమ సమర్చిత దివ్య • సుకుమార రాముఁడా
వహియించె నీ జటా • భరము నేఁడు
క్రతుతతి ధర్మంబుఁ • గాంచెడి భూపుఁడా
మై కృశింపఁ గను ధ • ర్మంబు నేఁడు

తే. చందన సుగంధమున నొప్పు • చారు తనువు
ధూళి పాలాయె నేఁడిట్టి • దుర్గతిఁ గనఁ
గారకుఁడనైతి, ననుచు, దుః • ఖ మలముఁ గొన
నరయఁగాలేదు రాఘవ • చరణ యుగము. 297

భరతుఁడు - రామునకు సాష్టాంగ ప్రణామము

తే. రామపాదాబ్జముల ముట్ట • భూమిఁబడియు
భరతుఁ డా రాము పదములఁ • బట్టఁజాలఁ
డాయె సాష్టాంగముగ భూమి • నంటఁ బడియు
'నార్య' 'పూజ్య' యనుచు మాత్ర • మనఁగఁ జాలె. 298

ఆ. ధర్మబుద్ధి రామ • తత్పరత్వమ్మును
కైక సుతుని యందుఁ • గ్రాలు, కాని
తల్లిఁగూడి రాముఁ • దరలించె, వని కను
నింద భీతి, యాత్మ • యందు నిలిచె. 299

ఆ. రాము నాశ్రయించి • రాజుఁగా నొనరింపఁ
దనదు నింద పోవు • ననెడి లక్ష్య
మొందు భరతు మదిని • నుండుటఁ గాబోలు
రామ పాదరజము • నోమలేదు. 300

తే. అన్నఁ గనుచు శత్రుఘ్నుండు • నమిత భక్తి
గరములను మోడ్చి ఆ రాము • చరణయుగళి,
దిక్కు నీవే యనెడి రీతి • మ్రొక్కు వారిఁ
దమ్ములను గౌఁగిలించును • దాశరథియు. 301

తే. రామ లక్ష్మణు లంతట • రాగమొప్ప
గుహుని, నా సుమంత్రునిఁ గని • కూడినారు
పరమ దుఃఖితులై యున్న • వారిఁ గనుచు
మౌనితతి స్మరి యించెడి • మాయగతిని. 302

తే. శేషి శేషుండు చక్రమ్ము • శంఖము, రమ
చిత్రకూటంబునందునఁ • జేరిన గతి
దశరథుని సూనులను, సీతఁ • దమినిఁగాంచు
నచటి మౌని బృందమ్ము ల • త్యంత భక్తి. 303

చ. భరతుని, సోదరున్, జటల • వల్కలముల్ ధరియించి దుఃఖియై
కరములఁ జోడుసేసి పద • కంజములన్ బడి మ్రొక్కు వాని, నా
దరమున లేవనెత్తుచు, ము • దంబున మూర్కొనుచున్ శిరంబుపై
ధరణిజ భర్త అంకమునఁ • దమ్మునిఁ జేర్చె సమాహితాత్ముఁడై. 304

## రాముఁడు భరతుని కుశల ప్రశ్నలు వేయుట - రాజనీతి ధర్మము

చ. వనమున కేలవచ్చితివి ? • భ్రాతరొ తండ్రి సజీవుఁడే కదా ?
నినుఁ గని చాలకాలము జ • నెన్, ముదమాయెను నిన్నుఁ జూడ, నీ
తను విటుమారుటన్ గుఱుతుఁ • దక్షణమే కననైతిఁ దండ్రియే
వనికిటు నిన్నుఁ బంపెనొకొ! • భద్రముగాఁ జనుదెంచి నాడవో. 305

చ. వనమున కేలవచ్చితివి? • పార్థివుఁ డుండిన నిన్ను వీడునే
మనమునఁ గుందుచున్ మరణ • మందకయుండిన వాఁడె ? రాజ్య మె
వ్వని వశమాయె? బాలకుఁడ • వై చెయిఁజారితె? భ్రష్టమయ్యెనా?
జనకుని సత్యవిక్రముని • సంతతమున్ దగు సేవసేయుదే? 306

చ. మునివరు నా వసిష్ఠు సత • మున్ గడుఁ బూజలఁ దన్పుచుందువే?
మన కెపుడాతఁడే గురుఁడు•మాన్యుఁడు బ్రాహ్మణుఁడున్,బుధుండు,నా
జనని, సుమిత్రయున్ సుఖులె • సాధ్వియు, రాణియు నీదు తల్లియున్
మను నొకొ సంతసంబున, న • మాయికులౌ ప్రజ కెల్ల క్షేమమే. 307

చ. గురు సుతుఁడౌ సుయజ్ఞుఁడు న • కుంఠిత తేజుఁడు నీ పురోహితుం
డరయ, సకాలమందు విధు • లన్నియుఁ జెప్పుచు నున్నవాఁడుగా
గురుసమ వృద్ధులన్ ద్విజుల • కోవిదులన్, బహు ధార్మికుండు, సం
గర వివిధాస్త్ర శస్త్ర శర • కార్ముక వేత్త సుధన్వు నెంతువే? 308

ఉ. శూరులు, నీ సమానులు, వి • శుద్ధ చరిత్రులు, సత్కులీనులున్
ధీరులు, రాజభక్తులు, త్వ • దీయ హితైషులు నైన వారలున్
వైరి మనోగతంబుఁ ద్రుటి • వట్టు నెఱింగెడి శక్తి మంతులున్
గౌరవయోగ్యులున్ విబుధ • గణ్యులు గారె యమాత్యశేఖరుల్!

చ. పదుగురఁ గూడి యోజనకుఁ • బాల్పడకుందువె! నీ వొకండవే
అది యిది సర్వమున్ దెలిసి • నట్టుగ యోజనఁ బూనకుందువే?
మది గల యట్టి మంత్రము సు • మంత్రులఁ గూడుచుఁ జర్చ చేయుదే!
అదియు రహస్యమౌ గతి హృ • దంతర మందున దాచియుంతువే?

చ. నిదురకు లోనుగావు కద? • నేర్పున వేళకు మేలుకొందువే?
విదితఫలంబు గల్గునది • వీడక, శీఘ్రముగాఁగఁ జేతువే?
హృదయ గతార్థమున్ విశద • మేరికి నెన్నడు సేయకుందువే ?
ముదమునఁ బండితున్ గనుదొ • మూర్ఖ సహస్రముకంటె మేలుగా?

ఉ. వేనకువేలు మూర్ఖతతి • వెంటఁ జరింపగ నే ప్రయోజనం
బౌను? బుధుండు దక్షుఁడు సు • మంత్రి యొకండు విచక్షణాయుతుఁ
బూనినఁ జాలు, శ్రేయ మొద • వుంగద జేనికి వానివల్లనే;
జానపదుల్ పురీజనులు • సౌఖ్యముగా మనువారె యెల్లెడన్? 312

ఉ. వృత్తులపట్ల వర్తతల • నెంచుచు భృత్యుల నిర్ణయించెదో!
యెత్తఱిఁగాని హెచ్చు కర • మీయఁగఁ గోరవుగా ప్రజావళిన్!
చిత్తమునన్ బ్రజల్ నృపు ని • సీ యను రీతిగ బాధఁ బెట్టుదే
నెత్తిని రుద్దుచున్ గరము • నీతి విహీనముగాఁగ? సోదరా! 313

ఉ. లేడుగదోయి కొండె మవ • లీలగ నేర్పునఁ జెప్పువాఁడు నీ
దోడుగ? మంచివారియెడ • దోషము లెంచి వచించువాఁడు? నే
కీడుఁ దలంపకే నృపుని • కిన్, జరియించుచు భక్తి, శూరుఁడై
నీదరి నుండగా దగిన • నేర్పరి సైనికముఖ్యుఁ డుండెగా! 314

ఉ. సైనిక యోధు లెల్లరు వి • శాంపతినిన్ గురుభక్తిఁ జూతురే?
మానక వారి కెప్డు బహు • మానము లిచ్చుచుఁ దృప్తిఁ గూర్తువే?
సేనకు భృత్యకోటికిని • జీతము బత్తెములన్ సకాలమం
దే, నియమానుసారముగ • నిచ్చుచు నుంటివిగా? సహోదరా! 315

ఉ. దూత యొకండె యేని పరి • తుష్టుఁడు, బుద్ధిబలంబువాఁడు, నీ
చేత మెటింగి వర్తిలుచుఁ • జెప్పిన దానిన చెప్పువాఁడు, నీ
భూతలి జన్మమున్ గనిన • పూజ్యుఁడు దక్షుఁడు లభ్యమాయెనా?
యూతగ నుండువారు విధి • యుక్తులునౌ; ప్రతిహారులుందురా? 316

తే. *పదియు నెనిమిది శాఖల • పాలకులను
చారు లెప్పుడు వెనుకాడు • వారలుగద?
స్వీయ పరివారమందునఁ • జేరు వారి
గుఱుతు పట్టుదురే చారు • లరయ సతము. 317

---

* 18 గురు తీర్థులు = అనగా పరిపాలనాశాఖాధికారులు.

1. మంత్రి. (Minister).
2. పురోహితుఁడు. (Private Secretary).
3. యువరాజు. (Prince).
4. సేనాధిపతి. (Commander-in-Chief).
5. దౌవారికుఁడు = ద్వారపాలకుఁడు (Gate keeper).
6. అంతర్వంశికుఁడు = అంతఃపుర కార్యనిర్వాహకుఁడు.
7. కారాగారాధిపతి = చెఱసాలల కధిపతి. (Inspector General of Prisons).
8. అర్థసంచయకరుఁడు = పన్నులు వసూలు చేయువాఁడు (Revenew Officer; Collector.)
9. కార్యనియోజకుఁడు = రాజాజ్ఞలను వెల్లడించువాఁడు. (Publicity Officer).
10. ప్రాడ్వివాకుఁడు = న్యాయస్థాన విచారణకర్త. (Judge).
11. సేనా నాయకుఁడు = సైన్యమున కధిపతి.
12. నగరాధ్యక్షుఁడు = గస్తీ తిరుగు రక్షకుల అధిపతి.
13. కర్మాంతికుఁడు = లెక్కల తణికీ అధికారి. (Accountant General).
14. సభ్యుఁడు = సభా సంరక్షకుఁడు.
15. ధర్మాధ్యక్షుఁడు = సివిలు విచారణాధికారి. (Munisiff)
16. దండపాలుఁడు = నేరములను విచారించు అధికారి. (Magistrate).
17. దుర్గపాలుఁడు = దుర్గ సంరక్షణోన్నతాధికారి.
18. రాష్ట్రాంతపాలకుఁడు = రాష్ట్ర సరిహద్దులను కాపాడువాఁడు.

రామాయణ కాలమున పరిపాలనా సౌష్ఠవమును పై విషయములు సుబోధక మొనరించుచున్నవి.

తే. తరిమి పంపిన శాత్రవ • తతులు మరలి
కొంత కాలంబునకు రాగ • నెంతు వోక్కొ
దుర్బలు లనుచు, లత్యంబుఁ • ద్రోచి పుచ్చి
వారి యెడల నలత్యంబు • పనికిరాదు. 318

తే. నాస్తికుఁడు బ్రాహ్మణుం డైన • నతని పొత్తు
ధర్మ లోపంబుఁ గలిగించ • దా? అనర్థ
మెంతయో తెచ్చి పెట్టు దా • యిద్ధ శాస్త్ర
మున కపార్థంబె కల్పించు • ననవరతము. 319

ఉ. తాతలు తండ్రులున్ విమల • ధర్మపథంబున నేలియున్న సా
కేతము, వైరు లేరుఁ బురి • కిన్ జొరలేని యయోధ్య, సార్థకం
బై తనరారుచున్న యదె? • పాయరుగా, నిజధర్మమున్ జనుల్?
ప్రీతిగ రక్షసేయుచు య • శంబు గడింప నయోధ్య నేలుదే? 320

ఉ. అంతిపురంబు వారు, సుగు • ణాకర రక్షణ మొందు చుండిరే?
$\frac{100}{49}$ ఇంతులతో రహస్య మెపు • డేనియు చెప్పెదొ? వారిమాట లా
వంతయుఁ బాటి సేయవు గ • దా? సతతంబుఁ బ్రియంవదుండవై
సుంతయు నిష్ఠురోక్తులకుఁ • జో టిడకుందువుగా? సహోదరా. 321

చ. అనుదినమున్ ప్రభాతముల • నందముగాఁగ, విభూషితుండవై
కననగు నార్యులన్ సభను; • గార్మిక వర్గముఁ బ్రీతిఁ గాంచునే
నినుఁ గన, వారి కీయఁదగు • నే యవకాశము సంతతంబు ? ద
ర్శన మిడుదే సకృత్తుగ ? ప్ర • జల్ భయభక్తులతోఁ జరింతురే ? 322

మ. ధన ధాన్యాయుధ యంత్ర శిల్పి భట సం • తానంబుతో నీటితో
దనరారుంగద సర్వ దుర్గములు ని • త్యంబున్ బ్రపూర్ణాంబులై ?
ధన మాదాయము నెంచి వెచ్చ పెడుదే • ధాత్రీవరా? కోశము
న్గనుచున్ బాత్రత నెంచుచున్ వ్యయముఁ బా • నం జెల్లు నంచెంతువా?

తే. దొంగ దొరికిన ధూర్తుండు • దొరికినయెడ
దగిన శిక్షకు • బాత్రులా? ధర్మవిధిని

బీద సాదుల నొకరీతిఁ • బ్రీతి గనెదొ?
పక్షపాతంబు బూనుదే • పాలనమున? 324

తే. వృద్ధ బాల వైద్యతతుల • నెపుడు నీవు
దానమున స్నేహమునఁ • దమిని బలికి
వారి వశ్యులఁ జేయుదో • భరత సతము?
సజ్జనులఁ జూచునెడ నమ • స్కార మిడుదొ? 325

తే. ధర్మము పరిత్యజించి య • ర్థమ్ము గనుదొ?
అర్థ మార్జించుచు సుధర్మ • మసలె కనవొ?
కామ లోభ వశుండవై • కడకు రెంటి
ధర్మ మర్థంబులను, వీడఁ • దలఁచవుగద! 326

తే. ఉదయకాలంబు ధర్మార్థ • మొప్పుఁ గాదె
అవల నపరాహ్ణకాల మ • ర్థార్థముగను
రేయి కామార్థమై యెంతు • వోయి భరత?
కాల విజ్ఞాని! కనుదీవు • కాల మిటుగ? 327

తే. బ్రాహ్మణులు, పౌరులును జాన • పదులు సతము
నీదు క్షేమంబుఁ గోరరే • నెమ్మి మీర?
భరత *రాజ దోషంబులఁ • బాటి గనవొ?
వాని పదునాలిగింటిని • బాసి నావె? 328

---

*రాజదోషములు 14— వివరములు :—

1. నాస్తికత; 2. అబద్ధమాడుట; 3. మహాకోపము; 4. ఏమఱియుండుట; 5. ఆలస్యముగాఁ బని జేయుట; 6. జ్ఞానవంతులను లక్ష్యము సేయకుండుట; 7. మత్తత; 8. ఇంద్రియ పరవశత; 9. మంత్రులతో యోజింపకుండ తానొక్కడే ఆలోచన జేయుట; 10. నిశ్చయింపఁబడిన కార్యములను కొనసాగింపకుండ నుండుట; 11 ఏమియు తెలియని వారితో యోజించుచుండుట; 12. ఆలోచితాంశమును వెల్లడి చేయుచుండుట; 13. మంగళప్రద కార్యములయెడ నిర్లక్ష్యము; 14. ఏకకాలమున శత్రువర్గము లన్నింటితోను యుద్ధమునకు డీకొనుట. ఇవి 14 రాజదోషములు.

ఆ. *పదియు, నైదు, నాల్గు • పదపడి యెనిమిది
మూఁడు వీని నెరుఁగు • వాఁడ వీవు
విడువ దగినవాని • వీడుచు నున్నావె
పట్టఁ దగినవానిఁ • బట్టుచుంటె. 329

ఆ. అమల సంధి విగ్ర • హంబులు యానంబు
దండనీతి నెపుడుఁ • దలఁచు చుంటె
రాజ్యపాలనమున • రాజున కివి ముఖ్య
మంచు నెంతువోయి • యమల చరిత ? 330

చ. చదివిన సర్వశాస్త్రముల • సారము నీ మది కెక్కియుండె గా
విదితమె పెద్దవారు విని • పించిన ధర్మములెల్ల మున్ను, నీ
వ్వాది గొని నావె నానుడుల • నిప్పుడు సెప్పినచొప్పు, శర్మ మి
య్యది, పరిశుద్ధ భావమున • నాచరణీయముగాఁ దలంతువే. 331

---

*పది వర్గములు :-

1. వేఁట; 2. జూదము; 3. పగటి నిద్ర; 4. అపవాదము; 5. స్త్రీలు; 6. మదము; 7. నృత్తము; 8. గీతము; 9. మద్యములు; 10. వ్యర్థముగాఁ దిరుగుట.

అయిదు దుర్గములు :-

1. జలదుర్గము; 2. పర్వతదుర్గము; 3. వృక్షదుర్గము; 4. ఎడారిదుర్గము; 5. ధాన్వనదుర్గము.

అయిదు వైరములు :-

1. జ్ఞాతివైరము; 2. ఏకవస్తువునకై పోరాడుట; 3. స్త్రీ నిమిత్తము; 4. వాక్పారుష్యము; 5. అపరాధము.

నాలుగు ధర్మములు :-

సామ దాన భేద దండోపాయములు.

ఎనిమిది వృత్తులు :-

1. కృషి; 2. వాణిజ్యము; 3. దుర్గములు; 4. ఆనకట్టలు; 5. ఏనుగుల కట్టుట; 6. గనులు; 7. పన్ను రాబట్టుట; 8. శూన్య నివేశనము.

మూఁడు వర్గములు:-

1. ధర్మార్థ కామములు; 2. ఉత్సాహ శక్తి, ప్రభుత్వ శక్తి, మంత్ర శక్తి; 3. ఇతరుల క్షయము, స్థానము, వృద్ధి.

చ. దశరథ చక్రవర్తి మన • తండ్రియుఁ, దాతయు, దాత, తాతలున్
యశము గడించి, రేకతమ • యట్టి సువృత్తియె నీవు గొంటివే
దిశలకు కీర్తి వ్యాప్తమగు • దివ్య పదంబది సత్పథంబునున్
వశ మొనరించు స్వర్గము నృ • పాలునకున్, సకలార్థ దాతయై. 332

చ. సకలజన ప్రమోదముగ • సర్వశుభంకర రాజ్యమేలు నే
లిక యిహమున్ బరంబు గను • లీనముగా హ్యాది ధర్మ సంగతిన్
వికలముగాని సత్య గతి • విజ్ఞుఁడు న్యాయ పథానువర్తి ఱే
నికి నెవ రీడు? ముక్తి కవ • నీస్థలియే, తనరున్ వికుంఠమై. 333

భరతుని సమాధానము — దశరథ మరణవార్తఁ దెల్పుట

తే. మర్కట కిశోర గతినున్న • మహిత భరతుఁ
డపుడు ధర్మ తర్క నిమగ్నుఁ • డగునె! రాఘ
వాంఘ్రుల నెద నిల్పి పలికె • నమితభక్తి
సూటిగా నొక్క మాట వి • శుద్ధమతిని. 334

తే. తావకీన సేవారూప • ధర్మహీనుఁ
డ, మఱి నేను వేరొండు ధ • ర్మముఁ దలంప
రాజ్య ధర్మంబు నాకేల • రామవిభుఁడు
రాజ్య మేలంగ నుండగా • రామరాజ. 335

మ. వనమున్ వీడి యయోధ్య కింకఁ జనుమా • భ్రాతా! నృపాలోత్తమా
మన వంశంబున జ్యేష్ఠుఁడే నృపుఁడు, ధ • ర్మంబిద్ది నీ వెంచవే?
అనుజుం డెట్లు నృపుండు కాగలఁడు? రా • జ్యంబూనగా, రమ్ము వెం
టనె ధాత్రీ సుతఁ గూడి; పాలితులు గూ • డన్ నిన్నె వాంఛింపరే.

చ. తపమును వీడి రమ్మనుట • ధర్మము కాదని యందువేమొ, భూ
మిపతిగ రాజ్యమూనిన, న • మేయ సుఖాస్పద మార్గగామివై
తపమున బొందు సత్ఫలము • తప్పక పొందెద వీవు, క్లేశమున్
దపనముఁ బొందు మార్గము క • దా యిది దాశరథీ త్యజింపుమా.

తే. తపసు, దేవత్వ సిద్ధికి • దారి, రాజ్య
మెంచి తపసు విడువఁగ శం • కించె దేమొ!
తపసు క్లేశ గతియె కాదె • ధాత్రి నేలు
నృపుఁడు సౌఖ్య గతినిఁ బొందు • తపము ఫలము. 338

చ. జనకుఁడు సత్యసంధుఁడు వి • శాంపతిగా, ధరనేలుచుండ నా
పని యిపుడేమి యందువో; నృ • పాలక, రామ సలక్ష్మణుండవై
జనకజఁగూడి నీవిటుగ • సాంద్ర వనీస్థలిఁ జేరియుంటఁ దా
విని భువి నస్తమించె పిత • వీర! అయోధ్య అనాథ అయ్యెగా. 339

సీ. కమనీయ సుకుమార • కళ్యాణ తనుకాంతి
102/9 సతము మున్ముందు సా • క్షాత్కరింప
మహనీయ పావన • మంజుల చరణ ద్వ
యాసక్త బుద్ధి మా • రెంచలేమి
పాపౌఘ సంహార • భవదీయ మాధుర్య
నామైక సంస్మర • ణమునఁ దగిలి
చిరకాల తపమూని • వరనందనుం గాంచి
సంశ్లేష సౌఖ్యంబు • సతత మొంది

ఆ. కనక, తలపక, వినకుండఁ • గాంచకుండ
రాఘ వేతర మేమియు, • "రామచంద్ర
రామ, శ్రీరామ, రఘురామ • రామ రామ"
యనుచు దివికేగె తండ్రి రా • మన్న తండ్రి. 340

తే. కేకయుని వీడు వీడి, నే • రాక మున్నె
పుత్త్రుఁ డొక్కఁడైనను తన • పొంతలేక
నీదు విశ్లేష దుఃఖాబ్ధి • నీదలేక
నీవు వనిఁ బట్ట దివిఁబట్టె • నీదు తండ్రి. 341

క. జనకుని మరణము విని నం
తనె శోకంబున భువిఁబడె • ధరణీశుండున్
జనకజయును సౌమిత్రియు
విని నారలు రాఘవుండు • వినిపింపంగన్. 342

ద్వి. విలపించి రెల్లరు • బిట్టుగా నంత
చలియింప వనిలోని • జంతువు లెల్ల. 343

తే. కొంతది కాల మేడ్చి • కోల్కొని రాముండు
రాను రా నయోధ్య • కేను రాను
విగత శోభమైన • పీటి నయోధ్యను
తండ్రిలేని రాజ • ధానిఁ జూడ. 344

తే. రాజరాజగు నా దశ • రథుఁడు తండ్రి
ఏలిన సురాజ్య మెవఁ డహో • యేలఁ గలఁడు
ధన్యు లహా నీవు మన చిన్ని • తమ్ముఁ డరయ
జనకు కర్మనుఁ జేసితి • రనుచుఁ బలికె. 345

చ. పదియును నాలుగేండ్ల వన • వాసము దీరిన పిమ్మటైన నా
హృది యిక నిచ్చగింపదు సు • మీ చనుదేర నయోధ్యకున్ ననున్
ముదమునఁ బిల్చుచున్ శిరము•మూర్కొనుచున్ విధు లప్పగించుచున్
సదమల వృత్తి ధర్మముల • సర్వముఁ దెల్పెడివాఁడు లేడుగా. 346

తే. అనుచు విలపించు రాము రా • మానుజులను
నా సుమంత్రుఁ డోదార్చుచు • నపర విధులఁ
బూన మందాకినీ తటిఁ • బ్రోత్సహించి
వెంటఁ గొనిపోయె నదికిఁ • బృథ్వీజ తోడ. 347

తే. చేరి మందాకినీ నదీ • తీరమునకు
సలిల తర్పణ మిడె రామ • చంద్రుఁ డపుడు
పిండములు చేసి కానుగు • పిండితోడ
పితను బూజించె శ్రాద్ధంబుఁ • బెట్టి భక్తి. 348

ఉ. కానుగు పిండియున్ బదరి • కా ఫలముల్ గలగల్పి పిండమున్
నే నిడ గల్గితిన్ నృపమ • ణీ త్రిజగత్ప్రితమైన నీకు; నీ
సూనున కేది హారమొ, వి • శుద్ధముగా నదె యిచ్చినాడ, నే
నీ నడికానఁ జేయఁగలఁదేమి? • విధిన్ జవదాఁట నౌనొకో. 349

తే. అనుచు విలపించి రాఘవుం • డనుజ యుతుఁడు
చిత్రకూటాశ్రమముఁ జేరి • చేరునంత
పెద్దపెట్టుగ నేడ్చిరి • బిట్టుగాగ
నడవి యదియెల్ల మాఱ్మోగ • నలజడిగను. 350

తే. కైకయీ సూను సైన్యంబు • కానయందు
ధ్వనిని గుఱుతించి రాముని • భరతుఁడు గనె
నంచు ననతికాలంబులో • నతనిఁ గాంతు
మనుచు నిశ్చయాత్ములు, ముదమును • గనుచుఁ గనుచు 351

ఎల్లరు రామునిఁ జూచుట - ఎల్లరకు రాముఁడు వాత్సల్యముఁ జూపుట

తే. రామ విశ్లేష మొందిన • ప్రేమ మయులు
స్త్రీలు పురుషులు శ్రీరాముఁ • జేరినారు
రాణులను వెంటఁగొని ముని • రాజరాజు
కులగురుఁడు వసిష్ఠుండును • గూడె రాము. 352

ఉ. ఎల్లరఁ గాంచి రాఘవుఁ డ • హీన ముదావహుఁడౌచు మ్రొక్కుచున్
దల్లులకున్ వసిష్ఠునకు • దక్కిన పెద్దల కెల్లవారికిన్;
సల్లలితాననుండు జన • సంతతులన్ గడు గౌరవించుచున్
జల్లని జూడ్కులన్ దనుపు • సంతస మొందఁగ వార లెల్లరున్. 353

సీ. తనుఁ జూడవచ్చిన • వనితలన్ గొందఱఁ
142/47 దమిఁ గౌఁగిలించెడిఁ • దల్లివోలె
తన్నుఁ డాయఁగవచ్చు • పిన్నలఁ గొందఱ
నాలింగన మొనర్చు • నన్నవోలె
తను నవిరళ దృష్టిఁ • గనుచున్న కొందఱ
తన కౌఁగిలింజేర్చుఁ • దండ్రివోలె
గుండెపై నిడి గుండెఁ • గూర్మిమై కొందఱఁ
జనువుగా బిగిఁబట్టు • సఖునివోలె

తే. పాదముల వ్రాలు వారలఁ • బైకి నెత్తు
మ్రొక్కుచుండెడి వారల • భుజము ముట్టు
విహితులైనట్టివారల • వెన్నుఁ దట్టు
భక్తభక్తుండు తిరుగాడి • ప్రజల మధ్య. 354

ఉ. కొందఱు రాముఁ గాంచెదరు • కూర్మిని చచ్చిన రాజు దూరుచున్
గొందఱు రాఘవున్ గనుచు • గుందుచు దిట్టెడివారు కైకయిన్
కొందఱు రామ లక్ష్మణులఁ • గొందల మందుచుఁ జూచి ధారుణీ
నందన నెంచి మంథరను • నష్ట చరిత్రను దిట్టు వారలున్. 355

ఉ. అందము చిందు రాఘవ ము • ఖాబ్జముఁ గాంచి జటాజినంబు లు
న్నందునఁ గుంది కైకఁ గని • యంతట గోసలపుత్రిఁ గాంచి ము
న్ముందున మౌని వేషమును • బూనిన కైక తనూజుఁ గాంచి, యా
నందమునన్ జనంబు క్షితి • నాథునిగా, రఘునాథు నెంచెడున్. 356

సీ. లభియించెగా నేఁడె • లలిత సుందర రాము
కరుణార్ద్రి దృష్టియం • చరయువారు
మంచి మాటాడెగా • మాతోడ మాపతి
యంచు మిక్కిలి సంత • సించువారు
నా మ్రొక్కుఁ గైకొనె • నా తండ్రి నేఁడని
పరమ సంతుష్టితోఁ • బరఁగువారు
శ్రీపాద సంస్పర్శ • సిద్ధించెగా నేఁడె
'ధన్యాస్స్మ' యనుచు లోఁ • దలఁచువారు

తే. పౌర తతులను రాముఁడు • వారి వారి
అర్హతలఁబట్టి ఆనంద • మందు నిలిపె
నటకు వచ్చిన ప్రజ యెల్ల • నమిత భక్తిఁ
గనుచు రఘురాము శ్రీరాముఁ, • గాంచె ముదము. 357

## తల్లులు - రాముఁడు

తే. అవని సాష్టాంగముగ వ్రాలి • యవని విభుఁడు
అంబలకు మ్రొక్క వీపుపై • నంటియున్న
దుమ్ముఁ దుడిచిరి తల్లులు • మువ్వు రంత
అదియెగా మాతృదేవి ప్రే • మాతిశయము. 358

తే. తమకు మ్రొక్కెడి లక్ష్మణు • ధాత్రిజాతఁ
గాంచి తల్లులు కన్నీరు • గార్చినారు
కొడుకులకుఁ జూపు రీతినిఁ • గోడలికిని
ఆదరంబును జూపిరా • అత్త లపుడు. 359

## ఆశ్రమము - దర్బారు

ఉ. అంతటఁ, గోడలిన్ గనుచు • నార్తినిఁ గుందెడి తల్లిఁ జూచి, భూ
కాంతుని జ్యేష్ఠ పుత్త్రికుఁడు • కై మొగిడించి, వసిష్ఠ మౌనికిన్

జెంతగఁ గూరుచుండ, నటఁ • జేరిరి కైక సుతుండు మంత్రి, సా
మంతులు సైన్యనాయకులు, • మాన్యులు, పౌరులు, నెల్లవారలున్.

తే. చిత్రకూటం బయోధ్యగా • చెలఁగెనపుడు
రాజు కొలువున్న రీతిగా • రాముఁడుండె
ఆ అయోధ్యలోఁగల పెద్ద • లంద అచటఁ
గూడియుండిరి, మౌనులుఁ • గూడఁ గలరు. 361

తే. తపసి వేషంబునం గాంతిఁ • దనరు రాము,
103/30 శ్రీసమేతుని హరితేజు • చెలఁగు రాము
పరమ రూపంబుఁ గనుచుండి • భరతుఁ డపుడు
కేలు మొగిడించుచు *నినీషఁ • గ్రాలుచుండె. 362

## భరతుని పిల్పు - రాముఁడు

చ. భరతుని పిల్పు రామ రఘు • వర్యుని మాట వినం గుతూహలుల్
పరమ మునీంద్రులున్ బ్రజ స • భాస్థలినుండిన యెల్లవారలున్
గరమనురక్తిఁ జూచుచును • గైకసుతున్ గనుచుండి రామునిన్
స్థిరమగు భక్తిమై నఖిల • మెంతురు, శ్రీరఘురామ రాజ్యమున్. 363

చ. భరతుఁడు రాజ్య మొల్లఁడని • పాలన మూన నిరాకరించి, ధీ
వరుఁడు జటాజినంబులును • వల్కలముల్ ధరియించి యన్నకున్
గురుతర భక్తిఁ జూపఁగ న • కుంఠితమైత్రి, వనంబు జేరె నం
చెరిగియు, రాఘవుండు విన • నెంచె సలక్ష్మణుఁడై సభాస్థలిన్. 364

తే. భరతుని తలంపు సౌమిత్రి • కెఱుక పరుపఁ
104/32 దలఁపో కైకమ్మ పుత్త్రుని • ధర్మబుద్ధి
లోక మెరుగంగఁ జేసెడి • పోకడగనో
కౌఁగిలించుచు భరతు, రా • ఘవుఁడు పలుకు. 365

చ. భరత! వచింపు మీవె నుడు • వన్ విన నెంతు, జటాజినంబులన్
బరఁగు నిమిత్త మేమిటుగ • వల్కలముల్ ధరియించితేల? నీ
ధరఁ, బురమున్, ద్యజించి వన • ధాత్రికి, వచ్చితివేల? తోడుగా
పురజనమేల? మంత్రులు చ • మూతతియేల? వచింపు సర్వమున్. 366

---

*నినీష = తీసికొని పోవలెనని ఇచ్ఛ.

ద్వి. అను నన్న కను కైక • తనయుండు భక్తి
వినతి సల్పుచుఁ బ్రేమ • వినయంబు లొప్ప. 367

ఉ. చేయఁగ రాని దుష్కృతము • చేసి గురుం డొక స్త్రీ నియంత్రణన్
బాయుచు పుత్త్రికున్ యశము, • పాప ఫలంబుగఁ బుత్త్రిదుఃఖియై
యీ యిల వీడె, కైకకు వ • రించిన రాజ్యము దక్కకుండఁ బ్రా
పాయె వితంతువౌ బ్రతుకు • నార్తియునున్, నరకంబె కేకుజన్. 368

ఉ. వచ్చినవారు పాలితులు • పౌరులు మంత్రులు సైన్య సంతతుల్
హెచ్చగు కూర్మి నీయెడ వ • హించిన వారలు, రాజ్య మేలఁగాఁ
బొచ్చెము లేక రమ్మనుచుఁ • బూజ్యు నినున్ బిలువంగ, నమ్మలున్
వచ్చిరిగా, వసిష్ఠముని • వచ్చెను, బట్టముఁ గట్ట నీ కిటన్. 369

ఆ. నీకు లేని సుఖము • నాకేల రాఘవ ?
నిన్నుఁబోలి మనఁగ • నెంచినాఁడ
నీవు లేని వాఁడ • నిశ్చయమ్ముగ వని,
స్వర్గమె యగు నీవు • వరలు వాడ. 370

ఉ. దాసుఁడఁ గోరుచుంటి నిదె • ధాత్రిని నీవె పరిగ్రహింపుమీ
కోసల రాట్సుతాగ్రజ య • కుంఠిత సత్య పరాక్రమాన్వితా !
వాసియు వన్నె కెక్క రఘు • వంశము, దాని యశంబు నిల్పుమీ
భూసుత గూడి రాజ్యరమఁ • బొందఁగ నర్హుఁడ వీవె రాఘవా. 371

తే. పిత్ర్యమును శాశ్వతంబును • వీడఁ దగునె ?
సచివులును నేనుఁ బ్రజ, శిర • సా నమస్క
రించి యాచింపఁగఁ దిరస్క • రింపఁ దగునె ?
మమ్ము మన్నించి రాజ్యమ్ముఁ • గొమ్ము రామ. 372

క. తమ్ముఁడ శిష్యుఁడ, దాసుఁడ
రమ్మి రాజ్యమ్ము గొనఁగ • రామా! యని ని
న్ని మ్మెయి వేడుచు నుంటిని
వమ్మొనరింతువె మదీయ • వాంఛిత మీవే. 373

చ. అని భరతుండు రాఘవ ప • దాబ్జములం బ్రణమిల్లి యశ్రుధా
$\frac{104}{14}$ రను గడిగెన్ బదంబుల, ని • రంతర భక్తుని శిష్యు దాసునిన్
C గని, రఘురామ భూవిభుఁడు • కౌఁగిటఁ జేర్చి ముదంబుగూర్చి అ
అనుజున కంత, ధర్మవిధ • మంతయుఁ జెప్పఁ గడంగె నా సభన్. 374

ఉ. నీకు, మహాత్మ! లబ్ధము వ • నీతలవాసమహో! అపాపినౌ
నా కపకీర్తి ప్రాప్తమయె, • నాయనకా మరణంబు మూఁడె, ఆ
కైకయె ముండమోపి కద • కైక కతాన జనించినట్టి, యీ
వ్యాకులతన్ దొలంచఁగల • వాఁడవు, రాజ్యముఁ బూని రాఘవా.

ఉ. తల్లినిఁ దిట్టగాఁ వలదు • తమ్ముఁడ! పిన్నతనాన సేసి, నీ
D వల్ల దురాగ్రహమ్ము నప • పాడియుఁ గల్గమి యే నెఱుంగుదున్
గల్ల వచింప వీవు, ఘన • కార్యము లెన్నియొ చేసినాడ వీ
వొల్లవు, రాజ్యమూన, నఘ • మూనినవాఁడవు గావు తెల్ల మే. 376

చ. జనకుఁడు ధర్మశీలుఁడు వి • శాంపతి, భార్యల పుత్త్రవర్గమున్
దన మది కిచ్చవచ్చిన, వి • ధానము నన్ విధియింప నర్హుఁ డా
యన, వనవాస మిచ్చెను జ • టాజిన వల్కల ధారణమ్ము నా
కనువగునంచు, నీకిడె సు • మా, ధరణీ పరిపాలన క్రియన్. 377

తే. కొడుకులకు స్వత్వమును బంచి • యిడఁగఁ దండ్రి
సకల విధముల నర్హుండు, • జనని యట్లె
తల్లి తండ్రు లొసంగిన • దాని విడువ
రాజ్య మీవును వీడఁగా • రాదు భరత! 378

చ. జనకుని యాన పాలనమె • సర్వ శుభంకరమౌను నాకు, నే
వనమున నుందు, రాజ్య పరి • పాలన మూనఁగ నీకె యొప్పు, నే
గొనగద సర్వలోకముల • కున్ బరిపాలన మబ్బె నేనియున్
వని పదునాలుగేండ్లుఁ గడు • పన్ దగు నాకిదె సర్వ ధర్మమౌ. 379

తే. అంత రవి లోకబాంధవుం • డస్తమించెఁ
గడచె నారేయి, రాముని • కడకు మరలఁ
దెల్లవారుట తడవుగా • నెల్లవారు
భరతునిం గూడి వచ్చిరి • పరమ భక్తి. 380

తే. ధర్మ తర్కంబుఁ బూనిరి • దాశరథులు
జ్ఞాన యోగంబు భరతుఁడు • పూని, తనదు
వాద బలమున నన్న యా • మోద మొందఁ
బ్రాంజలిగఁ బల్కె దాసుఁడై • పరమ భక్తి. 381

ఉ. పాప మొనర్చి తల్లి నినుఁ • బంపె వనంబునకున్ రఘూత్తమా
కోపముఁ బూనవైతి కడు • కూర్మిని నామెను జూచుచుంటివే
ఈ పృథివిన్, సమస్తమును • నేలెడి దక్షుఁడవయ్యు; బుత్త్రులన్
భూపున కీవు పెద్దవయి • పొందక రాజ్యము నా కొసంగెదే. 382

తే. సకల సాకేతరాజ్యంబు • సంక్రమించె
జ్యేష్ఠుఁడవు, నాకు దత్తత • సేయు కతన
కంటకము లేని రాజ్యంబు • గాన; రామ!
ఏను నీ కిడువాఁడ గ్ర • హింపు మయ్య. 383

తే. అశ్వగతి గాడిదకు, లక్ష్య • మగునె రామ!
ఆ గరుత్మంతునకు సాటి • యగునె కాకి?
నీదుగతి నాకు వచ్చునే • మేదినీశ?
రాఘవుం డేల! నేనేల! • రాజ్య మేల? 384

చ. వరగుణ రామచంద్ర! రఘు • వంశ మహాత్మ! త్వదర్థమై కదా
గురుఁడు దివంబుచేరె, నినుఁ • గోసలకున్ విభుఁ జేయనెంచడే
చిఱుత తనమ్మునుండి, నృపు • చే మహి నేలెడి శిక్షఁ బొందవే
పరమనృపాల ధర్మ పరి • పాటియు నేర్పడె నుగ్గుబాలతో. 385

చ. అతఁడు దివంగతుండు ముద • మందెడి, విత్తిన చెట్టు పెద్దదై
హితకరమై ఫలింపఁ గని, • యీ భువి జ్యేష్ఠుఁడు వారసుండుఁ, దా
సతము హృదిన్ దలంచిన ప్ర • శస్తుఁడుఁ, జేకొని రాజ్య మేలినన్
పితృహితమెంచు వాఁడ! పృథి • విన్ గొను శాంతి లభింప తండ్రికిన్.

చ. భరతుని సాధు వాక్కులకు • భక్తికి, రాముఁ డచంచలుండుగా
స్థిర మతినుండెఁ, బౌరులు హృ • దిన్ గడుమెచ్చిరి కైకయీసుతున్
వరదుఁడు గాక రాఘవుఁడు • పట్టిన పట్టును వీడఁడాయె, నం
చరసి, సభా సదుల్ మిగుల • నార్తిని గుందుచు నుండి రత్తరిన్. 387

తే. భక్తవత్సలుం డనుజుని • భక్తిఁ గనుచు
సారెసారెకు వేదాంత • సారమపుడు
మునులును వినంగ, నుపదేశ • ము నిడె సభికు
లచటఁ గలవార లెల్ల వి • హ్వలులు గాఁగ. 388

ఉ. పౌరతతుల్ కులాంగనలు • పట్టపు టేనుగ నెక్కి నీవు రా
వారని దుఃఖమున్ విడుచు • వారలు, తుష్టిని గాంతు రెల్లరున్
ధీర! త్వదీయ భృత్యులము • దేవర, భర్తవు! మమ్ముఁ గావగా
నీ రమ, నీవుఁ గొన్న ధర • ణీ పతి తండ్రి కృతార్థుఁడౌ సుమా. 389

చ. పురుషుఁడు కర్తయంచు దల • పోసెదొ తల్లియుఁ దండ్రిగాని, ఎ
వ్వరు వనవాస మీయఁగల • వారలు, కారకు లెన్న వారు గా
రరయ, స్వతంత్రుఁ డెవ్వఁ డిల? • ఆ పర దేవత నిన్ను నన్నిటుల్
బరగగఁ జేయు సృష్టి విధి • బాధితులే గద సర్వ జీవులున్. 390

తే. జనన మరణంబు లొండొండు • వెనుకఁ జనవె
యుచ్చనీచలు మారుచు • నుండ వొక్కొ
కలియుటయు వీడుటయు సృష్టి • గతియ కాదె
సర్వమును నాశమైపోవు • సరణిఁ గనవొ. 391

తే. పండిన ఫలంబు భూమిపైఁ • బడక యున్నె
పుట్టినటు వంటి జీవుఁడు • గిట్టకున్నె
కాలగతి సౌధమైనను • గూలిపోదె
జరకు మృతికిని వశులెగా • జనులు పుడమి. 392

ఉ. కాలగతిన్ గణింపు, గత • కాలము వెన్కకురాదు, సింధువున్
గూలిన వాహినుల్ వెనక • కున్ బ్రవహించునె; నిన్న నేఁడు, కా
జాలదు రోజురోజునకు • జారును నాయువు కొంత గొంత యం
చేల; తలంపరో జనులు • మృత్యువు వెంబడి వచ్చుచుండగన్. 393

ఉ. ఏడకుఁ బోయినన్ విడువ • కెప్పుడు మృత్యువు వెంటనుండు, నె
వ్వాఁడును దాని ద్రోచికొని • పారఁగఁ జాలఁడు, వంగి లేచినన్
గూడ గతించు నాయు వహా • కొంత యటంచు స్వకీయ దుర్గతిన్
జూడక, అన్యులం గనుచు • స్రుక్కుచు నుందురు కొంద ఱీభువిన్.

చ. రవి యుదయించు నంతట, వి • రామము లేక ధనార్జనమ్మునన్
భువి విడి భాస్కరుండు చన • భోగమునన్ బడువాఁడు, లోకబాం
ధవుఁ డుదయించి పోవుతరి • తగ్గిన యాయువు నెంచ డెన్నఁడున్
జవము నశించుచున్ జరనుఁ • జావకమున్నె హరిం దలంపనౌ. 395

చ. తనువు కృశించి మేను ముడ • తల్ బడి వెండ్రుక లెల్ల తెల్లనై
మనుటకు ముందుగానె, పర • మార్థ మెఱుంగగఁ బూనఁగా వలెన్
గనులకుఁ జూపు పోయి కడ • గండ్లకు తావలమైన వృద్ధుఁడౌ
మనుజున కే యుపాయము, స • మంజసమౌ పరతత్త్వ మెంచగాన్.

తే. కడలిలో రెండు కట్టెలు • కలియు రీతి
కలసినవి విడివడుచుండు • కరణి గాదె
తల్లి బిడ్డల సంగతి • ధరణియందు!
అది యనిత్య సంబంధమం • చరయలేరు. 397

తే. జీవుఁ డెవ్వఁడు స్వేచ్ఛమై • జెలగఁ గలఁడు
మరణ మొందినవానికై • మమతఁ బడుచు
వగవఁ దగునొక్కొ వారలు • వత్తురొక్కొ
మనల మన మెంచి యోజింప • మంచి దగును. 398

తే. తాత తండ్రుల మార్గమే • తర తరముల
యోగ్యమగు నాచరింపఁగ • నొరుల గతులు
వర్జనీయంబులే యగుఁ, • బరమ ధర్మ
మాచరింపంగ, దుఃఖంబు • నార్తి యేల ? 399

చ. నదివలె ముందు కేగెడి న • నారత వాహినియౌ వయస్సునన్
దుది, గనకుండ ముందుగ, య • థోచిత ధర్మము లౌక్య సౌఖ్యమున్
బదిలము సేయు కర్మ, నెర • పం గలవాఁడె మనుష్యుఁ డెంచ న
వ్విధి, గనలేని వాఁడు పశు • వేగద! వాఁడొక వ్యర్థ జీవియే. 400

చ. జనకుఁడు యజ్ఞ యాగముల • సల్పిన ధర్మరతుండు, పాలితుల్
ధనము సుఖమ్ముఁ గాంచ, ధరఁ • దాల్చిన సత్యపరుండు, దాత, స
జ్జన వినుతుండు సర్వ విధ • సౌఖ్య యుతుండు యశస్వి వృద్ధుఁడై
చని దివినుండె నాతఁడు, వి • చారము నొందఁగ నేల తండ్రికై. 401

ఉ. నీవొ సమస్త శాస్త్రముల • నేర్చినవాఁడవు, పండితుండవున్
ధీ విభవుండవున్ వర • విధిన్ గను ప్రాజ్ఞుఁడవయ్యుఁ దండ్రికై
యీ విధి శోక మొంద దగు • నే! గురుఁ డిచ్చిన యాన చొప్పునన్
బోవు మయోధ్యకున్ సుగతిఁ • బూనుము, నేలుము రాజ్య మీ వికన్.

చ. జనకుఁడు పంచి యిచ్చె నిజ • సత్త్వము నీకును నాకుఁ బ్రేముడిన్
వన ధర రాజ్య మేలఁదగు • భాగము నాది, అయోధ్య భాగమున్
గొనుమని నీ కిడెన్ గురుని • కోరికఁ దీర్చుటయే సుధర్మమౌ
తనయుల కెంచ, నేలు మిక • ధాత్రిని, నే వన ధాత్రి నేలెదన్. 403

## భరతుని వేడికోలు

తే. సుఖము దుఃఖమ్ము సమతమై • చూడఁ గలవు
ఎవరు నీ గతిఁ గ్రియలలో • నెంచఁ గలఁడు
లేక, రాజ్యంబు వనియు నొ • క్కటిగ నెంతె,
సకల సద్గుణ సర్వజ్ఞ • సార్వభౌమ. 404

తే. రాఘవుఁ డయోధ్యఁ జేఁబట్టి • రాజ్యమేల
నెంత చెప్పిన వినకుంటఁ • బంత మట్లు
వేడి నిట్టూర్పు భరతుఁడు • విడిచి విడిచి
వేడికొనసాగె రాముని • వివిధరీతి. 405

ఉ. నీవు మహాత్మ! రాఘవ! పునీతుఁ • డవున్ బరతత్త్వవేత్తవున్
దేవసమాన సత్త్వ గుణ • ధీరుఁడవున్ వర సర్వదర్శివి
న్ధీవిభవుండవున్ నిరత • నిర్మల సత్యవచోవిదుండవున్
నీవ; వనీ నివాసమె గ • ణించి వరించెదొ! దుస్సహం బహో! 406

ఉ. సైరణ సల్పుమీ జనని • సల్పె మహాఘము నా నిమిత్తమె
కోరిన వాఁడఁగా నటుగఁ • గొంపకు నామెయె చిచ్చుఁ బెట్టె; నే
నూరను లేనివేళ, నది • యుం గమనింపవె! ధర్మ మెంచి, యా
క్రూర వధింపనైతిఁ గృపఁ•గూర్పవె! నాయెడ భ్రాతృవత్సలా. 407

తే. తండ్రి వృద్ధుండు, భూపుండు • దైవసముఁడు
గురుఁడు మరణంబు గనుట నేఁ • బరమభక్తి
నుంటి, సభయందు దూరక • యుంటి, నంతె
కాని యాతండు ధర్మంబుఁ • బూనె నొక్కొ! 408

తే. ధర్మపరుఁ డెవ్వఁ డిట్టి య • ధర్మమూను
స్త్రీ వశుండయి చేయఁడే • చెడుగు పని, న
రే! "వినాశకాలే విప • రీత బుద్ధి"
యనుట రుజువాయె మన తండ్రి • జనుట దివికి. 409

తే. విషము దిని, చత్తునని కైక • వ్రేలు నంత
నింత సేయునె రాజరా • జిదియు ధర్మ
మంచు, ధర్మజ్ఞ? నీ వన • నౌనె! తండ్రి
తప్పె ధర్మంబు, సరిఁజేయఁ • దగుదు వీవు. 410

తే. కైక నుడిఁజేసి, వసియించి • కాననమున
రాజ్యమును వీడి వర్ణ ధ • ర్మంబు వీడి
మునిగ గార్హస్థ్య ధర్మంబుఁ • బోవఁ జేతె
తగదు వర్ణాశ్రమ ద్వయీ • ధర్మ లయము. 411

తే. ఆశ్రమ చతుష్టయమున, గా • ర్హాస్థ్య మరయ
శ్రేష్ఠమని మున్ను బెద్దలు • చెప్ప రొక్కొ
అట్టి గార్హస్థ్యమును వీడి • యడవి నుండె
వదలి వర్ణాశ్రమ సుధర్మ • పథము రామ! 412

ఉ. ఇట్టి యకృత్య నిర్వహణ • మే, తగు ధర్మ మటంచుఁ బల్కెదో!
106/15-16 గట్టిగ తండ్రి యాన యనఁ • గాఁ దగునే యిది? ధర్మమార్గముం
బట్టుచుఁ దప్పు దిద్దఁగల • వాఁడె సుపుత్రకుఁ డౌను తండ్రికిన్,
నెట్టుచు తండ్రి దుష్కృతి, వనిన్ విడి రాజ్యము నేలుమీ ప్రభూ. 413

చ. జననిని, నన్నుఁ గైకను ప్రజా • సముదాయము బంధు మిత్రులన్
గనుము, త్వదీయ సత్కృతికిఁ • గానిట వేచిన వారినెల్ల ర
క్షణ మొనరింపఁ బూనుము, య • శంబుఁ గడింపుము ధర్మ రక్షణం
జనుము స్వకీయ రాజ్య రమ • సర్వము నేలుము, భక్తవత్సలా. 414

చ. వని నివసించు టేడ? యవ • నీ పరిపాలన మేడ? క్షాత్రమం
చని యిది చెప్పు టేడ? వని • నార్తికిఁ జిక్కి జటాజినంబులన్
ముని వలె దాల్చు టేడ? రఘు • పుత్ర! పరస్పరమున్ విరుద్ధ క
ర్మను గొను టేడ? దన్పఁ బ్రజ • రాజ్యము నేలుట క్షత్ర ధర్మమా.

తే. భువికిఁ బట్టాభిషేకంబుఁ • బొందు టొండె;
ప్రజల హిత మెంచి పాలించి • వరలు టొండె
త్యాగ భోగ ప్రదంబు ప్ర • త్యక్ష ఫలము
ప్రథమ ధర్మంబు క్షత్త్రియ • వంశజునకు. 416

తే. సంశయాస్పదము పరోక్ష • సంభవంబు
తపసు ఫలితమ్ము; మరి నిశ్చి • తమ్ము గాదు
అస్థిరముగూడ, లక్షణ • మరయ లేదు
ఏ ప్రమాణమ్ము లేని క్ష • యించు తెరువు. 417

ఉ. తాలిమి కష్ట సాధ్యమగు • ధర్మమె పూనఁ దలంచు చున్నచో
నాలుగు వర్ణ ధర్మము ల • నారత సద్గతి నుండ నేలుమీ
పాలన సేయు మాశ్రమ వి • భాగము కాననసీమ వీడి, నీ
వేల పరిత్యజించెదొ? మ • హీస్థలి, నాశ్రమ వర్ణ ధర్మముల్. 418

ఉ. బాలుఁడ జన్మమందు; గడు • బాలుఁడ విద్యల, స్థాయి యందునన్
బాలుఁడ, నన్నిటన్ మిగుల • బాలుఁడ; జ్యేష్ఠుఁడ వుండ నీవు, భూ
పాలనఁ బూనువాఁడనొకొ! • బాలుఁడ మాత్రమె కాను, హీనుఁడన్
జాలఁగ బుద్ధియందు నను; • సైరణ సేయుచు రాజ్యమేలుమీ. 419

శా. నన్నున్ రాజ్యము బంధు సంతతుల న • న్నా యేలుమీ; యేలుమీ
తెన్నుంగాంచ *ఋణత్రయం బుడుగ; ధా • త్రిం బట్టముం గట్టఁగా
నున్నాఁ డిచ్చటనే వసిష్ఠ గురుఁ డెం • తో ప్రీతిమై నేఁడె, రా
జ్యోన్నత్యంబు ఘటిల్లు పొందు మిఁక దే • వా! చిల్కుమీ సత్కృపన్.

మ. అనఘా! భాను కుల ప్రదీప! శిరసా • యాచింతు, మత్ప్రార్థనన్
వినుమీ రాజ్యము నేలుమీ, యిఁక కృపన్ • వీక్షింపుమీ మమ్ము, సృ
ష్టినిఁ బోషించెడి యా మహేశ్వరు గతిన్! • సేవా పరాయత్తతన్
వన మందుండెద నీదు వెంటనె! ధరన్ • బాలింప రాకున్నచో. 421

తే. "అన్యథా శరణం నాస్తి" • అని పలికి "త్వ
మేవ శరణం మమ" యటంచు • నెంచి యెంచి

* ఋణత్రయము: 1. దేవఋణము. 2. పితృఋణము. 3. ఋషిఋణము.

యని, యనన్య శరణ్యుఁడై • అతుల భక్తి
దాశరథి సన్నిధిని నిల్చెఁ • దమ్ముఁ డంత. 422

## రాముని హితోపదేశము

చ. భరతుని రామ భక్తికిని • భాను కులోత్తమ రామ చంద్రు సు
స్థిరతరమౌ ప్రతిజ్ఞ కట • చేరిన వారలు సంతసించుచున్
ధరఁ గొన నొల్ల కుండుటకు • దాశరథిం గని పొందరే వ్యథన్
పురజనముల్ సదస్యులును • బొక్కిరి మిక్కిలి కర్మ నెంచుచున్. 423

చ. శిరసు పదంబులం దునిచి • చేతుల మోడ్చుచు మ్రొక్కువాని ని
ద్దరఁ గొని యేలు మంచనెడి • దాసుని, భక్తుని, నీవుగాక ఎ
వ్వరు మరి దిక్కులేరను ప్ర • పన్నుని, సోదరుఁ గాంచుచున్ గృపన్
బరగఁడు రాఘవుండు; తన • పట్టిన పట్టును వీడకుండెడిన్. 424

తే. పౌరులును జానపదులును • ప్రముఖు లెల్ల
కైకసుతుఁ గూడి రాఘవు • కాళ్లఁ బడిరి
రాముఁ బూజించి కోరిరి • రాజ్య మేల
భరతునిం గని రాముండు • పలుకు మరల. 425

ఉ. కూఁతురి నిచ్చు కాలమునఁ • గూఁతు కుమారుని రాజు సేయ నీ
తాతయె కేకయుండు మన • తండ్రినిఁ గోరఁడె; అట్లె నేఁడు సా
కేత విభుండు సల్పె; యిక • కేకయ పుత్రిది దోస మేమి? యీ
భూతలి నీది, నీ కిడక • పోయినఁ దండ్రి, యసత్యవాదియే. 426

చ. మఱియు, సురాసురాళి రణ • మధ్యమునన్, మన తల్లి తండ్రికిన్
గురుతర సేవ సల్ప, సతి • కోరకయే జనకుండు ప్రీతుఁడై,
వరము లొసంగడే, యవియ • పార్థివుఁ డిప్పుడు దీర్చె, దత్ఫలం
బరయుచు, దోషియం చనఁగ • వచ్చునె, సత్యపథానువర్తనున్. 427

చ. జనకుఁడు సత్య సంధుఁడయి • సల్పిన చేతకు, దుఃఖ మొందుచో
మనము కృతార్థతన్ గనము • మానక తండ్రి యనుజ్ఞఁ దీర్చుచే
తనయుల ధర్మమౌగద వ్య • థన్ విడి, రాజ్యముఁ బూని యేలుమీ
వనమున నే వసింతు పితృ • పాదుల మాటను దప్పు టొప్పునే. 428

తే. ముప్పు రమ్మలు చిన్నత • మ్ముండు నీకు,
ధాత్రిజయు లక్ష్మణుఁడు సహో • దరుఁడు నాకు
భాగముగ వచ్చిరంచని • భరత! తలఁచి
సత్యసంధునిగాఁ దండ్రి, • సలుప వలయు. 429

తే. సత్య సంధుండు దశరథ • చక్రవర్తి
గాఁగ, వని కేగ వచ్చితిఁ • గైక నుడిని
సీతతోఁగూడి సౌమిత్రి • చెంతనుండ
ఎవ్వ రేమన్న వినకుండ • నిచట నుంటి. 430

తే. కైక వరముల ఋణమున • క్ష్మావిభుండు
దశరథుఁడు మన తండ్రి తాఁ • దగిలియుండెఁ
దండ్రి ఋణ విముక్తునిఁ జేయఁ • దలఁతువేని
అతఁడు శాసించినట్లు రా • జ్యంబుఁ గొనుము. 431

చ. భరత! అయోధ్య కేగు మిఁక • పట్టముఁ గట్టుకొనంగ, రాజుఁగా
నరతతి నేల; దండక వ • నంబున కేగెడివాఁడ, నే, వనీ
చరముల జంతు సంతతుల • సాఁకెద వానికి రాజునై వనిన్,
నరకముఁ బొందకుండు మన • నాయన దానన, సత్యసంధుఁడై. 432

తే. సితము ఛత్రమ్ము శిరముపైఁ • జెలఁగు చుండ
ఆతపంబును బాయుమీ • అనఘ చరిత?
చల్లగానుండు వన్య వృ • క్షముల నీడ
హాయిగా నుందు నేనును • నడవి యందు. 433

## రాముఁడు - జాబాలి ముని

చ. విని విని రాము వాద గతి • వేసరి రెల్ల సదస్యు లచ్చటన్
మునితతి యాత్మలందు కడు • మోదముఁ బొందియు భావితాత్ములై;
కని సహియింపఁజాల రహ • కార్ముక వీరుని రామ చంద్రునిన్
వనమున జంతు సంతతుల • పాలన మూనిన వాని రాఘవున్. 434

ద్వి. విని విని రాముని • వేదాంత వాక్కు
మునియైన జాబాలి, • మోమోట విడిచి 435

ద్వి. పలుకాడె వేదాంత • పరిణతిఁ గూర్చి
విలుకాడు రాముండు • వినఁగ నా సభను 436

సీతా సతీ రామ • స్వీకరింప వొకొ
భూతలిఁ బ్రాకృత • పురుషుండు వోలె 437

ఎవని కెవ్వఁడు బంధు • వెంచంగ రామ?
ఎవని కెవ్వఁడు తండ్రి • యెవ్వతె తల్లి? 438

పుట్టిన మనవెంటఁ • బుట్ట రెవ్వరును
గిట్టిన వెనువెంట • గిట్ట రెవ్వరును 439

నా తండ్రి నా తల్లి • నా వార లంచు
ప్రీతిమై మనుచుంట • పిచ్చి లక్షణము. 440

విడిది సేయఁగఁ దగు • విశ్రాంతి గృహము
విడువరో పాంథులు • వేళ వేళకును. 441

ధనమును గృహమును • దల్లియు తండ్రి
క్షణగతి వసియించు • స్థలములే జుమ్మ. 442

ఒకనాఁటి చోటు వే • రొకనాఁడు లేదు
ఒకనాఁటి పోక వే • రొకనాఁడు రాదు 443

ఉన్నంత వఱకుండు • నున్నట్టి మమత
వెన్నంటి రాదేమి • వెడలిన పిదప. 444

ప్రాజ్ఞుండ వైనావు • వదలవే మమత
విజ్ఞుండ రాజ్యంబు • వేవేగఁ గొనుము. 445

దశరథుం డొక తండ్రి! • తనయుండ వీవ!
విశదంబు గాదొకో • విపరీత మిద్ది. 446

అతఁడేడ? నీవేడ? • ఆ బంధ మేడ?
జతయేడ ? మీ కింక • సర్వజ్ఞ రామ. 447

ధనము నార్జింపఁగా • బనిఁ బూను వారు
మన ధర్మ మంచని • మన సూను వారు 448

సుఖముల విడు వారు • సుఖియింప రెపుడు
నఖిలంబు కన నెద్ది ? • అంతయు ఖలమె. 449

ద్వి. చచ్చిన వారికై • శ్రాద్ధంబు లిడిన
వత్తురే తిండికై • వార లిచ్చటకు. 450

మరియొక్క డెవ్వఁడో • మనసార మెక్క
గురిగాఁగ మృతునకుఁ • గూడునే యదియ? 451

కనువాఁడు నిడువాఁడుఁ • గనఁగ లేడెందు
కనలేని పదమొండు • కనఁగ లే దెందు. 452

పితృ దేవత లెవరు? • పితృలోక మేది?
పితరుల యాశలు • పీడించు నెవరి? 453

భరతుఁడు భక్తిమై • ప్రార్థించు చుండె
కరమనురక్తిని • గైకొమ్ము భువిని. 454

మ. ధన మార్జించు తలంపునన్ గుశలురై • దానంబు ధర్మంబటం
చని శ్రాద్ధంబులు యాగముల్ తపసులున్ • జొప్పించి శాస్త్రంబులన్
మును ధీమంతులు వ్రాసియున్న రచనల్ • మూర్ఖుల్ ప్రమాణంబుగా
గొనుచున్నా రహా! నీవుఁ గూడఁ దలఁతే • గోరంత గొండంతగా. 455

మ. పరలోకంబు హుళక్కి యంచెఱుఁగవే • ప్రత్యక్షమౌ దానినే
స్థిర బుద్ధింగని సౌఖ్య మొందఁదగు గా • సీతాపతీ, రాజ్యమే
తెరవౌ సౌఖ్యముఁ బొందఁ గైకొనుము ధాత్రిన్ దానిఁ బాలింపుమీ
సరి వారెవ్వరు లేక సర్వ సుఖముల్ • సంతోషముం బొందుమీ. 456

తే. రక్త శుక్ల సంయోగమై • ప్రాణి పుట్టు
బీజ మాత్రుండె జనకుండు • వేరు లేదు
స్వర్గ నరకమ్ములును లేవు • వట్టి భ్రమయె
బ్రతికి పొందెడి సౌఖ్యమ్మె • రామ నిజము. 457

తే. రాజ్యము త్యజించెదో దుఃఖ • రాశి కొఱకు
కాపథమ్మును విషమును • కంటకమ్ము
నైన త్రోవఁ గైకొందువే? • పూను మింక
రాజ్యభోగ మయోధ్యలో • రాజ రాజ. 458

తే. అనెడి నాస్తికవాదంబు • వినఁడు ప్రీతి
వినియు నంగీకరింపఁడు • వేదవిదుఁడు

సాత్త్వికపు ఱేఁడు జాబాలి • తత్త్వ మెల్ల
తృణము రీతిగ గణియించి • త్రోసిపుచ్చె. 459

## రాఘవుని సమాధానము

చ. హిత మని పల్కితో, యహిత • మెంచఁగ నాకది, యద్ది యుక్తమౌ
గతి యని యెంచి యుంటివొకో? • కాని, అయుక్తము, నీవుఁగూడ నీ
మతిఁ దలపోయ వట్లు, ముని • మాన్య, ననున్ నృపుఁగాఁగఁ జూడ, నీ
మత మని యే నెఱుంగుదు జు•మా! యదె హేతువు, నీదు మాటకున్.

తే. బ్రాహ్మణుఁడ వీవు నాస్తిక • వాది వౌదె
నమ్మఁగాఁ జాల కోసల • నాటునందు
నాస్తికులు లేరు, నేఁ గాను • నాస్తికుండ
అనఘుఁ డగు రాజు మా తండ్రి • ఆస్తికుండు. 461

తే. నాస్తికులఁ జేరఁ దీయునే • ఆస్తికుండు
నిన్ను మా తండ్రి దరిఁ జేర్చి • యున్న కతన
ఆస్తికుండవె, నన్ను రా • జ్యాభిషిక్తుఁ
జేయు తలఁపునఁ బలికితే • చెడుగు మాట! 462

ఆ. ఎవ్వఁ డెట్టివాఁడొ • యెఱుగంగ నగుఁగాదె
వాని నడతఁబట్టి, • ఱేని నడత
చెడుగుదైన ప్రజలు • చెడరొక్కొ ధర్మంబు,
విడువఁ దగునె రాజు • విహిత విధుల. 463

తే. దయయె మూలంబుగాఁ గల • ధర్మపథము
రాజ వృత్తంబె సత్యంబు, • రాజ్య మరయ
దాన సత్యంబు, లోకముల్ • దాని యందె
సుప్రతిష్ఠిత మగు నదె • శుభము సతము. 464

ఉ. సత్యము వీడి రాజ్యరమ • సాఁకుట దుర్గతికాదె యేరికేన్
సత్యమె సర్వ మూలమగు • సత్యమె సర్వము శాశ్వతంబునున్
సత్యమె యీశ్వరుండు, రమ; • సత్యమునే సత మాశ్రయించెడిన్
సత్యము కంటె యన్యము ప్ర • శస్తము దివ్యపదంబు లేదుగా. 465

ఉ. దానము యజ్ఞ యాగములు • ధర్మము వేదములున్ దపంబునున్
బూనఁగ సత్య మొక్కటియె • మూలము, సత్యమె ఆత్మరూపమున్
దానఁ జేసి సత్పురుష • ధర్మము సత్యమె, తండ్రితోడనే
గానన మందు నుందునని • కష్టమొ నష్టమొ చెప్పియుంటిఁగా. 466

ఉ. ఆడిన మాటఁ దప్పి, యిపు • డాయన రాజ్యము స్వీకరింతునే!
తో డడుగన్ సరే యనుచుఁ, • దుష్టినిఁ బుష్టినిఁ గాంచె కైకయున్
నాఁడు, మదీయ నిశ్చయము • నన్ వనవాసముఁ జేతునంచు, నే
దానిని వీడి, సత్యమును • ధర్మము వీడు మటంచు దెల్పెదో. 467

తే. క్షాత్ర ధర్మంబు పాప సం • కలిత మెంచ
క్షుద్రులును, గ్రూరులును దానిఁ • గొనఁగ నెంత్రు
నేను త్యజియింపనెంతు న • ద్దాని నెల్ల
కర్మమునఁ గర్మ సూక్ష్మముల్ • గాంచఁ గలను. 468

తే. సత్యదూరుండఁ గాఁబోను • సత్యనిష్ఠ
విడువఁగాఁ బోను వనమును • విడువఁ బోను
తల్లి దండ్రుల కిడిన వా • గ్దాన మేను
కాదనఁగఁ బోను నేఁడు లో • కంబు నెంచి. 469

తే. నాస్తికుండవు నిన్నెట్లు • నాదు తండ్రి
చేరఁ దీసెనో! వింతగా • నౌర? యెఱుఁగ
డేలనో? త్వదీయ మతము • నింతవఱకు?
మరుగు పుచ్చితో మౌని యీ • మాట లేల? 470

తే. అనుచు జాబాలి కా రాముఁ • డనిన మాట
మునివరులు విని లోలోన • మురిసి మురిసి
నాస్తికత్వంబు వినుటచే • ఆస్తికుండు
కోపగించె నటం చను • కొనిరి యంత. 471

ద్వి. అని యను శ్రీరాము • నాత్మలో మెచ్చి
మునియైన జాబాలి • యనెడి రామునకు. 472

శా. ఆపద్ధర్మముగా వచించితిని రా • మా నాస్తికత్వంబు, నీ
వో పాలింపఁ దలంపవైతి; భరతుం • డో నిన్నె ప్రార్థించెడిన్

భూపుం డెవ్వఁ డయోధ్య కింక నని నిన్ • బ్రోత్సాహముం జేసితిన్
గోపం బూనెదొ నన్ను నీ వెఱుఁగ వొ • క్కొ ఆస్తికుండన్ గదా!

## వసిష్ఠుఁడు - రాముఁడు

ద్వి. అనునంత జాబాలి, • యా వసిష్ఠుండు
జనకజా భర్తకు • శాంతిఁ జేఁగూర్ప 474

తే. నాస్తికుఁడు గాడు జాబాలి • 'స్వస్తి' రామ
ఆస్తికుఁ డయోధ్య నేలఁగా • నంప నిన్ను
పలికె నీరీతి కోపంబు • వలదటంచు
మహిత రఘురామ వంశ క్ర • మంబుఁ దెలిపె. 475

శా. రామా! మీ మహనీయ వంశమున సా • మ్రాజ్యంబు, జ్యేష్ఠుండెగా
భూమీశుండుగ నేలు నీ అనుజుఁడా • భూపాలనం బూనుటా!
ధీమంతుల్ రఘువంశజుల్ నృప వరా • ధీశుల్ యశోవంతులున్
మీ మర్యాదను నిల్ప రాజ్య మిఁకఁ గొ • మ్మి మీదు ధర్మంబదే. 476

తే. గురువు లగువారు మువ్వురు • పురుషున కిలఁ
దనువు కారకులై యొప్పు • తల్లి దండ్రి
జ్ఞాన కారకుఁడైన యా • చార్యుఁ డరయ
నీకు నీ తండ్రికిం గూడ • నే గురుండ. 477

తే. నీకుఁ బరమ గురుండను • నేనె కాన
నాదు మాటల గుఱియుంచి • నడిచితేని
ప్రథిత సన్మార్గమున్ వీడు • వాఁడ వగుదె?
రామ సద్గుణధామ! ధ • రాభిరామ! 478

తే. బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్య • పౌరజనులు
నిన్ను సేవించుచుండిన • నీ జనమ్ము
వారిఁ బాలించు ధర్మంబుఁ • బట్టుదేని
ప్రథిత సన్మార్గమున్ వీడు • వాఁడ వగుదె? 479

తే. ధర్మశీలయు వృద్ధయుఁ • దల్లి; యిటుగ
నామె శుశ్రూష వదలుట • యర్హ మొక్కొ

మాతృవచన ప్రకారంబు • మసలితేని
ప్రథిత సన్మార్గమున్ వీడు • వాఁడ వొక్కొ? 480

తే. యాచకులఁ దృప్తిఁ జేసెడి • యన్వయంబు
సత్య ధర్మ పరాక్రమా! • సతము మీది
మాన్య! యాచించు భరతుని • మాట విన్న
ప్రథిత సన్మార్గమున్ వీడు • వాఁడ వగుదె! 481

తే. మధురవాక్కులఁ బల్కిన • మహిత గురునిఁ
గాంచి రాముండు చిరునవ్వు • గ్రాల, నుడివె
కనియుఁ బెంచిన వారలు • కన్నవార
లెన్న నాచార్యకంబెను • మిన్నగారె? 482

తే. కన్నవాఁడైన జనకుని • కన్నమాటఁ
గల్లఁ గావింప ధర్మంబె; • కన్న తల్లి
కెప్పుడు ప్రతిజ్ఞ సేయనే • యేను, దాన
మాత మాటకు జవదాఁటు • మాట లేదు. 483

ద్వి. అను రాఘవుం గని • యంత భరతుండు
మనమున దుఃఖించు • మనలేని యటుగ. 484

## భరతుఁడు - రాముఁడు

ఉ. పౌరులు మౌనులున్ గురుఁడు • బాంధవులున్ గడు వేడుచున్న నా
ధీరమణుండు రాఘవుఁడు • పూనఁ డొకింతయు సత్కృపామతిన్
ధారుణి నేల నొల్లఁడు స • దా తన ధర్మమె పల్కువాని నా
ధీరుని కైక పుత్త్రికుఁ డ • దే తిలకించుచు నెంచు సద్గతిన్. 485

ఉ. వీడి సమస్త కార్యముల • వీడుచు రాజ్యము కర్మయోగియై
తోడును జేరినాఁడు భర • తుండు, జటాజిన వల్కలంబులన్
గూడి, విరాగియై తన య • కుంఠిత భక్తినిఁ జూపి మ్రొక్కుచున్
వేడెను జ్ఞాన యోగమున • వేయి విధంబుల నిష్ఫలంబుగాన్. 486

చ. భరతుఁడు నిశ్చయించె రఘు • వర్యుని పట్టముఁ గట్ట; రాముఁడో
పరమ కృపాళువయ్యును, ర • వంతయు నొప్పఁడు రాజ్య మేల, సో

దరుని హితమ్ముఁ గైకొనఁడు • దాన, రఘూత్తము పర్ణశాల ముం
దర, నిల, రాముఁ డియ్యకొను • దాఁక పరుండఁగ నిశ్చితాత్ముఁడై.

తే. పూనె సత్యాగ్రహము కైక • పుత్త్రుఁ డపుడు
పండుకొనె దర్భశయ్యను • బఱచి భువిని
అప్పు నెగబెట్టువాని గృ • హమ్ము ముందు
అప్పొసంగిన ద్విజుఁడుండు • చొప్పు దోఁప. 488

ఉ. అప్పు నొసంగు బ్రాహ్మణుఁడె • అప్పును దీర్చనివాని వాకిటన్
దప్పక నడ్డు పండుకొను • ధాత్రిని, నీ కపకార మేమియున్
జెప్పను, జేయలేదు మును, • జేసిన రీతిగ తృప్తియుండవై
యిప్పగిదిన్ పరుండ నగునే • తగునా యిది? లెమ్ము సోదరా. 489

తే. అనుచు రాముండు రాజర్షి • యనిన యంతఁ
బండియుండియె భరతుండు • పౌరుల కను
తనదు విజ్ఞానయోగంబు • తర్క మింక
నిరుపయోగంబుగా నాత్మ • స్థిరము గాఁగ. 490

తే. కంటిరే రాఘవుని మీరు • కన్నులార
వింటిరే రామ ధర్మంబు • వీనులార
పట్టుఁ బట్టరె మీరైన • పౌరులార
రాజ్య మేలంగ రమ్మని • రామచంద్రు. 491

చ. భరతుఁడు రామచంద్రుఁడును • బట్టిన పట్టును వీడరైరి, వీ
రిరువురు ధర్మతత్పరులె • ఱేని కుమారులె, సత్యవాదు, లె
వ్వరి నుడి వారు వీడ రహా! • పాలన మొల్ల రరణ్యవాసులై
బరఁగఁ దలంచు వారలని • పౌరులు నిస్పృహులైరి తోడనే. 492

ఉ. రాముని వాకిటన్ భరఁ బ • రాగ మయమ్మగు దర్భశయ్యపై
నీమముతోడఁ బండిన పు • నీతుని కైక తనూజుఁ గాంచి శ్రీ
రాముఁ, బ్రతిజ్ఞమై వరలు • రాఘవరామునిఁ గాంచి, కాంచి మే
మా మహనీయు మార్చఁ గల • మా యని పౌరులు నిస్పృహాత్ములై

చ. భరత త్వదీయ ధర్మపథ • వర్తన మెంతయు శ్లాఘనీయమై
వరలు, ప్రతిజ్ఞనే, తలచి • పాలనమూన, నిరాకరించు శ్రీ

వరు పరమార్థమున్ మిగులఁ • భావ్యము, రాముఁడు రాఁ డయోధ్యకున్
మఱలడు రాజు గాఁగ, నన • మానుని, మార్చఁగ, మా తరం బొకో.

చ. పుర జను లిట్లు పల్కు విని • మోదముఁ గాంచుచు రామచంద్రుఁ డా
భరతునిఁ గాంచి నా నుడిని • పౌరుల పల్కుల రెంటిఁ గూడ నీ
వరయఁ దగున్ మదిన్ బుధవ • రా, యిఁక లెమ్ము, శరింప దోషిపై
బరగుట; యాచమించి, యిఁక • వర్తిల నిట్లని, నన్ను తాఁకుమీ. 495

చ. భరతుఁడు ధర్మ తత్పరుఁడు • భ్రాత వచించిన రీతిఁ జేసియున్
గరముల మోడ్చి తత్సభను • గాంచుచు దుఃఖ పరీత చిత్తుఁడై
పరిహృత కర్ముఁడై హృదయ • భారమునన్ బలుకాడు సభ్యు లె
ల్లరు సచివుల్ మునుల్ నృపకు • లాన్వయులున్ రఘురాముఁడున్ వినన్.

ఉ. కోరినవాఁడఁ గాను జన • కున్ దన రాజ్య మొసంగ నాకు, నే
గోరనుఁ దల్లినేని ధరఁ • గొమ్మని పన్నక మూని యెప్పుడేన్,
దారుణ వన్య సీమ నిటు • తాత యనుజ్ఞ నెపమ్ముఁ జూపి, యా
శ్రీరఘురామచంద్రుఁడ వ • సించుట ! నే గురు నాజ్ఞఁ దీర్చెదన్.

చ. పదియును నాలుగేండ్లు వన • వాసము భ్రాతకు మారు నేనె జే
సెద, గురు నాజ్ఞఁ దీర్చెద, వ • సించెడి రాముఁ డయోధ్యలో ధరన్
పదముల వృత్తిఁ బాలనము • సల్పుచు, మారుగ నాకు, రాముఁడా
సుదతినిఁ గూడి యుంట వని! • జూచి సహించి మనంగ నేర్తునే. 498

ఉ. అచ్చెరు వొందె రాముఁడు ప్రి • యానుజు వాక్కుల నాలకించి, లో
మెచ్చుచుఁ గైక యాత్మజు, న • మేయగుణాన్వితు, దాస భక్తునిన్
హెచ్చిన కూర్మి నా సభ న • దే పరికించుచు రాజ్య మేలఁగా
నిచ్ఛ జనింప దంచు వచి • యించె, దృఢాభిమతమ్ము నంతటన్. 499

మ. జనకుం డిచ్చిన దాయభాగముల మా • ర్చన్ శక్యమా ! తండ్రి య
మ్మిన, వానిన్ గొని యున్న వాని; దనయుల్ • మిథ్యాపవాదంబు చే
తను భేదం బొనరింపఁ జాలరు కదా • ధర్మంబుఁ బోనాడినన్;
జన వాక్యం బది కాదు, మార నటుగా • సామ్రాజ్య సంసిద్ధికై. 500

శా. రాజ్యంబేలుట దోషి గాక మనునే • రాజాధి రాజైన, ఆ
రాజ్యంబూనఁ, బ్రతిజ్ఞ వీడ మొదలే • ప్రాప్తించు పాపం బహో !

'రాజ్యాంతే నరకం ధ్రువ'మ్మనుట సా • ర్థంబౌను నా పట్టునన్
రాజ్యంబూనఁ బ్రతిజ్ఞ వీడ, భరతా! • రాజ్యంబె నీవేలుమా. 501

మ. వనవాసం బొనరింతు వేని భరతా? • ప్రాజ్ఞుండవై తండ్రి యా
నను మీరం దలపోయు దేని, యఘమే • నన్నున్ నినున్ జేరెడిన్
జన నాథుండొ, యసత్య వాదియగు, వం • శం బెల్లఁ గోల్పోవు కీ
ర్తినిఁ బొ మ్మింపిఁక రాజ్యమేల, వనధా • త్రిన్ నేనె పాలించెదన్. 502

చ. పదియును నాలు గేండ్లు వన • వాసిగనై, తదనంతరంబ, యీ
సుదతిని లక్ష్మణుం గొనుచుఁ • జొచ్చెద నే పురి, నిన్ను గూడెదన్,
బృథివిని నాఁడు గైకొనెద • నేలెద, నీవిక, శాంతిఁ బొందుమీ
యిది తుదిమాట నా నుడి స • హించి వహింపు మయోధ్య రాజ్యమున్.

తే. కైక యాచించుటం జేసి • కాదె తండ్రి
రాజ్య దానంబుఁ జేసె, నా • రాజ్య మిపుడు
దానమును రద్దు సేసి నేఁ • దాల్చ నగునె
తండ్రి మాటను దక్కించు • ధర్మము గను. 504

లాక్ష్మణీ వృత్తము :

రాముఁడు సభకును భరతునకును మధు • రంబుగ నిజ నియతిని దెలుపన్
శ్యామలు రఘువరు గనుదురు ముదమున • సభ్యులు మరచి యిహమ్ము, మమతన్
రాముని భరతుని గని మునివరు లెద • లన్ ముదమును భృశముగ గని రా
ధీమహితుఁడు దశరథనృపుఁడు దివినిఁ • దృప్తుఁడు సుతులిరువురగనుచున్.

తే. ధర్మ తత్పరులగు నన్న • దమ్ములఁ గని
వారి ధర్మ తర్కము విని • మేర లేని
సంతసంబున మునులు ప్ర • శంసఁ జేసి
నారు వారల ఋజువర్త • నమ్ము మెంచి. 506

చ. మునివరు లంతటన్ గనిరి • మోదము రావణుఁ జంపు దీక్షమై
$\frac{112}{4}$ జననముఁ గన్న రాఘవుఁడు • జన్మ విధమ్ము, స్మరించుచుండె, నం
చని కృత కృత్యుఁడౌ దనుక • ఆర్యుల రక్షణ మూను దాఁక, గా
ననమును వీడ డంచు, నయి • నన్ వచియించిరి ధర్మ సూక్తులన్. 507

చ. భరతుఁడ ! పండితోత్తముఁడ • బాహు బలాన్విత సత్కులీనుఁడా
అరయఁగఁ జాలు వాఁడవు మ • హాత్ముల ధర్మవిధంబు, జ్యేష్ఠ సో
దరుని మహార్థ వాక్యముల • ధర్మ పరత్వము సంగ్రహించి, నీ
వరుగఁగఁ జెల్లయోధ్య కిఁక • అన్న నుడిన్ శిరసావహించుచున్. 508

తే. కైక, ఋణ విముక్తుండు స్వ • ర్గంబుఁ గాంచె
నీదు జనకుండు, రాముండు • నీవుఁ గూడఁ
దండ్రి ఋణ విముక్తులు గందు • తాత నుడిని
సత్య మొనరింపుఁ డాతండు • స్వర్గమె గన. 509

ద్వి. భరతున కా రీతిఁ • బలుకాడు మునుల
పరమార్థ మెంచుచు • భాను వంశజుఁడు 510

వారలఁ బూజించి • పంపించె నంత
ధీరుండు భరతుండు • తీరమి కోర్కె 511

కరములఁ జోడించి • కాంచి రాఘవుని
మఱియొక్క మాటను • మాటాడె నంత 512

మ. కుల ధర్మంబును రాజ ధర్మము సహా • గుర్తించి నాతల్లి ని
న్నిలఁ గొమ్మ్మయని యాచనన్ సలిపెడిన్ • నీ వింక, జ్యేష్ఠుండ, భూ
తలిఁ జేఁబూని క్షమింపుమీ జననిఁ, బ • త్రాయంచు నిన్గోరు, నా
పలుకైనన్ విని పౌర జానపదులన్ • భద్రంబుఁగా నేలుమీ. 513

తే. ఈ మహారాజ్య రక్షణ • మే నొకండఁ
జేయఁ జాలను పాలిత • క్షేమ మరసి
వారి రంజింపఁ జేయ నా • వశము గాదు
రాముఁడవు నీవె గాఁదగు • రాజ్యమేల. 514

తే. ఇదిగొ రాజ్యంబుఁ గైకొను • మినకులేంద్ర
$\frac{112}{13}$ లోకముల నెల్లఁ బాలించు • నీకు లెక్క
యొక్కొ కోసలఁ బాలింప, • దిక్కు నీవె
గాదె యని ప్రణమిల్లెఁ గై • కమ్మ సుతుఁడు. 515

తే. రాము పాదము లంట శి • రంబు మోపి
పలు విధంబులఁ బ్రార్థించె • భరతుఁ డంత

రాఘవుని పాద యుగ్మంబె • రక్ష యనెడి
రీతి, నన్యాశ్రయము లేని • రీతి గాఁగ. 516

## రాముని కడపటి మాట

ఉ. పాదము లంటు వాని, పద • పద్మములం బ్రణమిల్లు వాని, సూ
ర్యోదయ కాంతి వాని, మహి • తోజ్జ్వల ధర్మము వాని, శుక్ల ప
క్షాది దినంబు నాఁటి శశి • యా యన నొప్పు ప్రవర్ధమాను, నా
సోదరుఁ జేర్చె నంకమున • సొంపుగ రాముఁడు భక్త భక్తుఁడై. 517

ఉ. శ్యామల నీలదేహు నశి • నాతు, మనోహర మాధురీ ప్రసం
గాములు కైకయీ సుతున • కంతటఁ బ్రేముడి జూపి, చూపుచున్
రాముఁడు పల్కెఁగాఁ దొడఁగె • రాజ్యము నేలు మటంచు మంత్రుల
స్థీ మహితాత్మలౌ హితుల • నిచ్చలుఁ గూడుచు సల్పి యోజనన్.

తే. సహజ విజ్ఞాన మయమైన • శక్తి నీది
చదివి నేర్చిన విద్యయుఁ • జాలఁ గలదు
బాహు బల దర్ప ధార్మిక • ప్రథిత వీర
శక్తిమంతుండ వీవు రా • జ్యంబు నేల. 519

తే. వినుము, లక్ష్మి సుధాకరు • వీడుఁ గాక
హిమనగంబును మంచు • త్యజించుఁ గాక
కడలి, కట్టను దాఁటెడిఁ • గాక, నేను
తండ్రి కిడిన ప్రతిజ్ఞను • దాఁట లేను. 520

తే. ప్రేమ మీరంగఁ జెప్పు నా • ప్రియము వినుము
శుభమె యగు గాఁత నిత్యంబు • శుభమె నీకు
మంగళంబు సంతత శుభ • మంగళమ్ము
పొ మ్మయోధ్యకు రాజ్యంబు • పొందు మింక. 521

## భరతుఁడు-పాదుకలు

తే. అన్న, తుది మాట వినుచుఁ బ్ర • పన్నుఁ డౌచు
భరతుఁడు స్వయం కృషిని వీడి • పారతంత్ర్య
మూని గురు వసిష్ఠుని వైపుఁ • బూని దృష్టి
నాత్మ దలపోయ సాగె ధ • ర్మార్థ మపుడు. 522

తే. తనదు విజ్ఞాన యోగంబు • ధర్మ విధము
మధుర మంజుల గాత్ర సం • ప్రార్థనమ్ము
కర్మయోగ సత్యాగ్రహ • కార్య దీక్ష
భక్తి యోగమ్ముఁ గూడ ని • ష్ఫలము లగుట. 523

ఉ. పౌరులు కోరినన్ వినఁడు • భక్తుని యాచనఁ బాటి సేయఁ డే
తీరున సుప్రసన్నుఁడగు? • తెల్పి సమస్తముఁ జూపి ధర్మపుం
బోరొనరించితిన్ గృహము • ముంగలఁ బండితి, మువ్వురమ్మలున్
గోరిరి కాని యొప్పుకొన•కుండె నటం చెద నెంచుచున్ ధృతిన్. 524

మ. కనుచున్ రాఘవునిన్, సఖున్, బ్రియుని, భ • క్తత్రాణ దీక్షాపరున్
తన సర్వస్వము రాఘవుం డతని పా • ద ద్వంద్వమేఁండే, యుపా
యనమం చాత్మ, ననన్య భక్తి శరణం • బంచున్ విశుద్ధాత్ముఁడై
వినతిన్ సల్పి పదంబులన్, విమలుఁడై • పృథ్వీశు నర్థించెడిన్. 525

మ. వరదా! దివ్య సువర్ణ పాదుకలపైఁ • బాదంబులన్ మోపుమీ
భరియించున్ ధర నీకు మాఱుగను • భూపా! పార్థివవ్యంజనం
బరయన్ దాల్చిన నీదు పాదుకలె; ని • త్యానందముం బొందుచున్
శిరసా దాల్చెద, వాని యాజ్ఞ లవి, శా•సింపన్ ననున్ రాజ్యమున్. 526

తే. వరద నే నల్పుఁడను నిన్ను • శరణ మంటి
పాద పద్మమ్ము లంటి, నీ • పాద యుగళిఁ
గోరుచుంటి నౌదలఁ దాల్చ • గోరుచుంటి
"అన్యథా శరణం నాస్తి" • యంటి రామ. 527

మ. వరణీయుండు గురుండు చెప్ప నిట నీ • పట్టాభిషేకార్థమై
గురుభక్తిం గొని దెచ్చినాడ నివిగో • కూర్మిన్ ద్వదంఘ్రి ద్వయిన్
బరగం జేయుము స్వర్ణ పాదుకల, నే • ప్రార్థించు చున్నాఁడ నీ
వరమైనన్ గృపసేయుమీ రఘు వరా! • భక్తున్ ననున్ బ్రోవుమీ.

శా. ఈ మాటన్ వినుచున్ వసిష్ఠ ముని యెం • తే సంతసం బంది, యో
రామా! పాదుక లీయఁగాఁ దగు సుమా • రాజ్యంబు నేలంగ, నీ
భూమిన్ పాలన సేయ నీ ప్రతినిధిన్ • బుత్తెంచుటే ధర్మమౌ
స్వామీ! పాదుక లిమ్ము టంచనె, బ్రియున్•భక్తున్ గృపన్ జూచుచున్.

చ. దరహసితాననుం డగుచు • ధర్మవిదుండు, రఘూద్వహుండు, వే
చరణ యుగమ్ము మోపుచును • స్వర్ణ విభూషిత పాదుకా ద్వయిన్
గరముల ముట్టుచున్ విడిచి, • కాంచ సభా సదు లెల్లవారలున్
భరతుని కిచ్చె హృష్టుఁడయి, • పాదుకలన్ గొని యాతఁ డంతటన్.

తే. పార్థివ వ్యంజనాన్విత • పాదుకలకు
పరము పదధూళి దాఁకిన • పాదుకలకు
పావన కరంబు లంటిన • పాదుకలకు
పతితులనుఁ బావనులఁ జేయు • పాదుకలకు 531

తే. సర్వలోక యోగక్షేమ • సద్గతి గను
బ్రహ్మ సుర మౌను లాశించు • పాదుకలకు
పరమ పావన రఘురాము • పాదుకలకు
భక్తిఁ బ్రణమిల్లె భరతుండు • పావనుండు. 532

చ. పదియును నాలుగేండ్లు వన • వాసము తీరిన తోడనే పురిన్
బదిలము గాఁగఁ జొత్తువని • భార్యను కూడి సలక్ష్మణుండవై,
హృదిఁ బిగఁబట్టి పాదుకల • కే నెఱగించుచు రాజ్య తంత్రమున్
ఎదురయి తెన్నులన్ గనుదు • నేలఁగ రాజ్యము నీదు పాదుకల్. 533

చ. విదితము సేయుచుంటి నిదె • వీడెదఁ బ్రాణము లగ్నిఁ జొచ్చి ఆ
పదియును నాలుగేండ్ల వన • వాసముదీర, మఱొక్కనాఁడె యేన్
సదమల రామచంద్ర! గనఁ • జాలక పోయిన నిన్నయోధ్య, అం
త దనుక నిన్నుఁ బోలి మనె • దన్ సుమ, హార విహార రీతులన్. 534

ఉ. వీడి యయోధ్య నీ పురిని, • వేరొకచోట మదాశ్రమంబునన్
గూడి సుమిత్ర పుత్త్రకుని • కూర్మిని వీడక నారచీరలన్
బాడుచు నీదు కీర్తనము, • పాదుకలన్ దమిఁ బూజసేయుచున్
వేడుచు నాజ్ఞలన్, గడిపి • వేయుదు కాలము నీదు రాకకై. 535

తే. అనెడి భరతుని గౌఁగిట • నపుడు చేర్చి
భక్త పరతంత్రుఁడై భక్త • భక్తుఁ డగుచు
పరమ భక్తుని తమ్ముని • పలుకు లెల్ల
వినుచు నంగీకరించుచు • ననుజున కను 536

ఉ. కామమొ లోభమో కలిగి • కైక, త్వదర్థము జేసె, దానినే
నీ మది నెంచరాదు; జన • నిన్ దలపోయుము రక్ష సేయుమీ
అమెను, గోపమున్ విడిచి, • యా, జనకాత్మజపైన నా పయిన్
బ్రేమను చూపు రీతిఁ, గను • మీ, యిదె మాపయి నానఁ బెట్టెదన్.

తే. అనుచుఁ జేర్చుచుఁ గౌఁగిట • నములుఁ దమ్ముఁ
గంటఁ దడిఁబెట్టు, వీడుచుఁ • గౌఁగిలించి
ఆశిషంబుల నిడెఁ బురి • కరుగు మనుచు
దాస విశ్లేష దుఃఖ సం • తప్తుఁ డగుచు. 538

తే. పతికి సతికిని విశ్లేష • బాధ సమమె
జగతి, పతికిని సద్భక్త • సతుల కల్లె
రాఘవుని, కైక పుత్త్రుని, • రాజ సుతుల;
గాంచు వారలు, కన్నీరు • గార్చినారు. 539

ఉ. ధన్యుఁడు కోసలేశుఁడు సు • త ద్వయముం గనె ధర్మమూర్తులన్
ధన్యుఁడు రాఘవుండు నవ • తార సుధర్మము వీడకుండుటన్
ధన్యుఁడు కైక పుత్త్రుఁడు స • దా కను రాఘవ పాదుకా ద్వయిన్
ధన్యులు, పౌరులున్, మునులు • దాశరథిన్ గని ముచ్చటించుటన్.

తే. అనుచు దివి నుండి సురతతి • యమిత భక్తి
సుమ సువర్షంబునన్ ముంచె • సుసుమ రాము
రావణ వధార్థుఁ డగు వీర • రాముఁ గాంచి
సురలు మునులును, తమలోన • మురిసి నారు. 541

## భరతుఁడు పాదుకలను శిరసావహించుట

చ. భరతుఁడు పాదుకల్ గొనుచు • భక్తిని మ్రొక్కి ప్రదక్షిణంబుగన్
దిరిగి, సపర్యలన్ సలిపి • తేజున గ్రాలెడి వానిఁ, దాల్చుచున్
శిరమున, వే ప్రదక్షిణము • సేసి, రఘూద్వహు, లోక నాథునిన్,
పుర కరి మూర్ధ మందునిచె • పొందుగఁ బట్టముఁగట్టు రీతిగన్. 542

ఉ. రాముఁడు రామ రాజు జన • రాముఁ డయోధ్య నృపాలుఁడో సభన్
సోముని తీరునన్ గల విశు • ద్ధ చరిత్రు వసిష్ఠు మ్రొక్కుచున్
ధీ మహితాత్ములైన, రణ • ధీరుల మంత్రుల పౌర భక్తులన్
బ్రేమను గాంచి మీర లిక • వే చనవొ గద యిండ్ల కంచనెన్. 543

ఉ. అమ్మల డాసి వీడ్కొలుప, • నశ్రులు గన్నుల నిండ, వారి పా
దమ్ముల వ్రాలి మ్రొక్కులిడి • తల్లుల రాముఁడు గాంచ లేడు, ఖే
దమ్మున, వారలున్ సుతు ము • దంబునఁ జూడగఁ జాలరైరి; స
ర్వమ్ము నగోచరంబగుట • రాముఁడుఁ జేరెఁ గుటీర మంతటన్. 544

## *వసిష్ఠుఁడు సాముద్రిక లక్షణములఁ జెప్పుట

తే. *తల్లులం గని దుఃఖించు • తనయునిఁ గని
తనయునిం గని శోకించు • తల్లులఁ గని
కుల గురుండు వసిష్ఠుండు • కూర్మి మీర
వారి నూఱడించెడి రీతిఁ • బలుకఁ గడఁగె. 545

తే. అమ్మ కౌసల్య! నీకు శు • భమ్మె గలుఁగు
కంటి వీవు నారాయణు • కమల నాభు
లోక సంరక్షణార్థమై • నీకుఁ బుట్టె
వాసుదేవుండె, యెఱుఁగవే • వంత యేల! 546

తే. కర్మ గతిని తప్పింపఁ గా • గలమె మనము
అడవి వాసంబు సేయఁడే • ఎడ మెడముగ
దంతములు గల్గియున్న నీ • తనయుఁ డరయ;
పాదముల గంటలుండిన • పగిది, నడుచు 547

తే. చిటుకు చిటుకను సౌమిత్రి, • సీత కేశ
భంగము వలన, ముప్వురు • వనము నందు
దీక్షనుంట సాముద్రిక • లక్షణంబు
దాన ప్రాప్తించె వీరికిఁ • గాననంబు. 548

ద్వి. అనెడి వసిష్ఠుని • వెను వెంటఁ గైక
జని రాము నేకాంత • మునఁ జూచి పలుకు 549

## *కైక రాముని శరణు చొచ్చుట

చ. మన గురుఁడౌ వసిష్ఠముని • మాన్యుఁడు నేఁడె వచింప వింటి, నీ
జనన విధమ్ము, నాదిపురు • షా! యవివేకముఁ జేసి నిన్నిటుల్

*శివ రామాయణము నుండి

వనమున కంపితిన్, బతిత • పావన! దుష్టను గ్రూరురాల నన్
గనవొ కృపన్, దయా పర? య • కార్యముఁ జేసిన దానఁ బాపనై.

శా. మాయా మోహిత చేతనన్ పతితనున్ • మా నాథ! నారాయణా!
మాయా మానుషు రూపమూని జగతిన్ • మాయం బడం ద్రోయుదే
నీ యీ మోహ జలాబ్ధి నీదుటకు ని • న్నే దిక్కుఁగాఁ జూతు నీ
మాయన్ దాఁటగ నాకు శక్యమొకొ రా • మా! ఆపదుద్ధారకా. 551

క. పొందితి పశ్చాత్తాపము
వందన మిదె కొమ్మనంత • పాపిష్ఠను, బ్రో
వందగు, నన్ను క్షమింపుము
మంథర నుడి వింటిఁ జెడితి • మాధవ! రామా! 552

తే. అచ్యుతా! జగన్నాథ! యా • ద్యంత రహిత!
విశ్వమయ! భక్తవత్సల • ప్రేమమూర్తి!
అమల! నారాయణా! సత్కృ • పార్ద్ర హృదయ!
పాహిమాం పాహి పాహి తు • భ్యం నమోస్తు. 553

## రాముఁడు-భక్త వత్సలుఁడు

తే. అనెడి కైకమ్మ నా రాముఁ • డమిత భక్తిఁ
గాంచి బిడ్డ వోలెనుఁ బల్కెఁ • గనికరమున
అమ్మ! నీ తప్పు లేదమ్మ • అంత విష్ణు
మాయ సుమ్మ! నే నెఱుఁగనే • మాత నిన్ను! 554

తే. వాణి నీ నోటఁ జేరి ప్ర • వాస గాథ
సురల ప్రేరేపణము వల్ల • జరిపె నిటుగ
రావణ వధార్థమై వని • రాముఁ డుంట
వారి సంకల్ప మౌటయే • కారణంబు. 555

తే. తప్పుననొ ఒప్పుననొ హరిఁ • దలఁచువారు
సర్వ సముఁడగు హరి సేవ • సలుపు వారు
కల్ప వృక్షంబు దరిఁ జేరఁ • గల్గు వారి
పగిది నీప్సితార్థంబులఁ • బడయఁ గలరు. 556

తే. అమ్మ మోక్షంబు నీ వెంచ • నందఁ గలవు
సాధు రక్షణ కార్యంబె • సలిపి తీవు
దుష్ట రక్షణ దీక్షకుఁ • దోడ్పడితివి
సర్వ మీ గతి హరి సేవఁ • జేసినావు. 557

ఉ. నీ వొనరించితే యిటుగ ! • నీ వెపుడున్ నను గూర్మిఁ జూడవో !
నీవు, కులీనవున్ సతివి • నే నయికొంటి నరణ్య వాసమున్
దైవ విధంబునన్ బృథివి • ధర్మము శ్రేయము నెంచి, యింతకున్
నీవ నిమిత్తమై జగతి • నింద భరించుచు నుంటి వమ్మరో. 558

తే. అనెడి యా రాము రఘు రాము • నాబిడ గని
రక్కసులఁ జంపి నా తండ్రి • రమ్ము మరల
క్షేమముగ రాజ్య మేలంగ • రామచంద్ర
యంచు; 'పాహిమాం పాహిమాం' • అనుచు మరలె. 559

## భరతుని గృహ ప్రయాణము

ద్వి. ఎల్ల రయోధ్యకు • నేగఁగాఁ దలఁతు
రుల్లముల్ చల్లఁగ • నుర్వీశు నాజ్ఞ 560
ముని తతి, మంత్రులు • ముందుగా నడువ
తన సైన్య నివహంబు • వెను వెంట రాఁగ 561

చ. కరి తలపైనఁ దా నిడిన • కాంచన భూషిత పాదుకా ద్వయిన్
శిరమున దాల్చి సోదరునిఁ • జేరి రథంబున; జిత్రకూట, భూ
ధరమునకున్ బ్రదక్షిణ వి • ధానముఁ బోయి యయోధ్య కేగెడిన్
భరతుఁడు పాదుకా మహిత • భాగ్య యుతుండు ప్రపత్తి సిద్ధుఁడై.

చ. సలలిత రామచంద్రుఁ గని • సంతస మందుచుఁ తృప్తులైన వా
రలు; తమ పీటి కేగు, చతు • రంగ బలంబులు రామ కీర్తనన్
సలుపుచుఁ బోవుచుండఁగ ది • శల్ గుహలున్ దరు గుల్మ వల్లికల్
చిలుకలు మాఱు వల్క వన • సీమ వినంబడు రామ శబ్దమే. 563

ఉ. రామ! సురాభిరామ! రఘు • రామ! నృపాత్మజ రామ! జానకీ
రామ! మనోజ్ఞ రామ! ముని • రాజి మనోహర రామ! ధర్మ సం

(550 నుండి 559 వరకు- అధ్యాత్మ- భరద్వాజ రామాయణముల నుండి)

ధామ! మహాత్మ రామ! పతి • త ద్రుత పావన రామ రామ "ఓం
రామ నమో నమో" యనెడి • రావము ప్రాకె నభోంతరాళముల్.

## ఆశ్వాసాంత పద్యములు

క. కగములు రెండై, రెండై
మృగములు, నరపట్క మౌచుఁ • బృథ్వీతలిలో
సుగతిన్ బుట్టిన హరి నీ
వెగ, రామా నినుఁ గొలువఁగఁ • బ్రేమన్ రావా. 565

మ. కలికాలం బిది రాఘవుం గనఁగ నా • కాంక్షించినన్ భక్తిమై
ఫలితంబుండునె యంచు మూఢ మతిమై • భావింపఁగా రాదహో
కలియున్ రాఘవు లీలయే యగుట సా • క్షాత్కారముం బొందనౌ
లలితున్ భక్తిని నిత్యముం బిలువ రా • డా వాఁడు సేవింపఁగన్. 566

ఉ. పూర్వ యుగమ్ములందు ముని • పుంగవులై తపమూని గాని నిన్
సర్వమయున్ విలోకనము • సల్ప గలారలె యెవ్వరేని, నేఁ
డుర్విఁ బ్రపత్తి మాత్రమున • రూప గుణాన్వితు నిన్నిలన్ గనన్
సర్వ జనాళికిన్ సులభ • సాధ్యము గా దొకో? రామ! రాఘవా! 567

ఉ. ఓరిమి గల్గువాఁడు హర • యోగముఁ బూనెడి వాఁడు మున్ను సం
సారము వీడి సర్వ సుఖ • సంచయముల్ విడి యేండ్లు పూండ్లుగా
వారని యోగ దృష్టి నినుఁ • బట్టఁగఁ జూచెడి వాఁడు, నేఁ డహో
కూరిమి తోడఁ బిల్వఁగనె • కోయని వెంటనె రావె! రాఘవా? 568

శా. నీ వాఁడన్ సుమ, కావుమీ యనుచు ని • న్నే పిల్తు ముమ్మాటికిన్
నీవే దప్ప నితఃపరం బెఱుఁగ, ని • న్నే గొల్తు ముమ్మాటికిన్
దేవా! రావ? కృపామయుండవయి, యం • తే వాసిఁ జూడంగ! నే
నీ వాత్సల్యముఁ గూడఁ గోర నిఁక దేఁనిం గూర్తువో గూర్పుమీ. 569

ద్వి. సకలంబు నా కీవె • సంరక్షకుఁడవు
యిక నాదు యత్నం బ • దేలరా రామ. 570

గోవింద రామాయణము—పాదుకా పట్టాభిషేకము అను కావ్యమున -
అయిదవ ఆశ్వాసమగు ప్రపన్నాశ్వాసము — సమాప్తము.

# గోవింద రామాయణము

## పాదుకా పట్టాభిషేకము

### పాదుకాశ్వాసము

క. త్రికరణ శుద్ధిగ, నీకే
సకలంబు నొసంగఁ, గలుగు • సకలుండే, నీ
నికటముఁ జేరుచు; బొందునె
వికలము గాకుండు దివ్య • విహిత పదంబున్! 1

### భరతుఁడు-భరద్వాజ ముని

సీ. వామ దేవుండు జా • బాలి వసిష్ఠుండు
ముందు ధ్యానాత్ములై • పోవు చుండ
రాజ్యాంగ వేత్తలు • రాజ భక్తులు మంత్రు
లెల్ల రా, వెన్కఁగ • నేగు చుండ
'స్వస్తి' వాచకములఁ • జదువుచు బ్రాహ్మణుల్
తేరు మున్ముందుగాఁ • దీర్చి యుండ
"జయ రామ 'శ్రీరామ' • జయ జయ" యను చుండి
తేరు వెన్ వెన్కనె • పౌరులుండ
వీరి నెల్లరఁ జుట్టి • వీర సైనికులుండ
నడచు కోటగఁ దేరు • నడుచు చుండ

తే. గుహాలు మృగ పక్షి వృక్ష ని • కుంజతతియు
మారు పల్కఁగ రామ నా • మమ్మె వనిని,
రామ నారాయణుఁడు వన • స్తోమ మందు
తాండవం బాడుచుండ ర • థమ్ము వోవు. 2

తే. తేరు నడుమ భరద్వాజు • దారి యందుఁ
గనఁగ దలపోసి భరతుండు • గాంచె మౌనిఁ,
గాంచి ప్రణమిల్లె, ముని యంత • గైక సూను
నడిగెఁ "గృత కృత్యుఁడవ తాత" • యనుచుఁ బేర్మి. 3

ఉ. నేను వసిష్ఠ మౌని యవ • నీతల మేలఁగఁ గోరినాము, శ్రీ
జానకి నాథు రాఘవుని, • సత్యవచో నిరతుండు, తండ్రికై
బూనిన సుప్రతిజ్ఞ విడఁ • బూన నటంచు వచించె, నంత నీ
మౌని, మహోర్ధయుక్త మగు • మాటలఁ బల్కె ధరాధినేతతో. 4

చ. పదియును నాలుగేండ్ల వన • వాసము సల్పు ప్రతిజ్ఞ నిల్పు లే
$\frac{113}{12}$ ముదమగునేని, చేయుమటె, • మోపుచు బంగరు పాదుకాద్వయిన్
బదముల, వాని బంపు, పరి • పాలనమూనఁగ నీకు మాఱుగా;
విదితముగా స్వరాజ్యము, ని • వే యిఁక నేలు, శుభంకరమ్ముగా. 5

చ. అనెడి వసిష్ఠ మౌని హిత • మారసి రాముఁడు సంతసించి కాం
చనమయ పాదుకాద్వయిని • సత్వరమే పదయుగ్మ ముంచి, యి
చ్చె నివియ, ప్రాఙ్ముఖుండగుచుఁ • జెచ్చెర నే గొని, వే, యయోధ్యకున్
జనుచుఁ ద్వదీయ దర్శనము • సల్పఁగ వచ్చితి మౌని చంద్రమా. 6

ద్వి. అను మాట విని మౌని • యానంద మొంది
కని పాదుకల రాముఁ • గని నల్లె తలఁచు. 7

## భరద్వాజ వాక్యము

మ. భరతా! ధన్యుఁడ వీవు ధన్యుఁడవు నీ • పట్టే జయం బొందె, ని
ద్ధర రాముండు గ్రహించె జ్యేష్ఠుఁ డగుటన్ • ధర్మ ప్రకారంబు, ని
క్కరణిన్ సల్పితె భ్రాతృవత్సలుఁడవై • కళ్యాణముం గూర్పవే
ధరకున్, నీకును మేలె రాఘవుని పా • ద ద్వంద్వముం బొందవే. 8

ఉ. వంశ పరంపరానుగత • భాగ్యము, రాజ్యము చేయి జాఱియున్
సంశయ మేమి లేక పరి • పత్తున దానినిఁ బొందెఁ, బాదుకా
పాంశువు లేల రాజ్యము, ప్ర • వాసముఁ దా వరియింపఁగా, విశే
షాంశ సమన్వయం బిపుడు • సల్పె వసిష్ఠుఁడు మీ గురుం డహో. 9

తే. ప్రతినఁ బాలించుఁ, బాలించు, • రాజ్యరమయు
తండ్రి యానను మీరఁడు • ధాత్రి విడఁడు
ధర్మమును వీడకుండెడి • మర్మగతిని
శరణు చొచ్చిన నిర్వైర • సాఁకు నిపుడు. 10

తే. రావణ వధార్థమై మున్ను • దేవతలకు
వర మొసంగిన ధర్మంబు • వదలలేదు
కానన నివాసియై తీర్చఁ • గలఁడు దాని
అవతరించిన ధర్మంబు • నడవిఁ జేయు. 11

తే. నేఁడు శరణార్థి వగు నిన్ను • వీడలేదు
వాంఛితార్థంబు నీకిచ్చె • పాదుకలను
నీదు కోర్కెను గైకొనె • వాదు విడిచి
ఒల్ల నటువంటి రాజ్యంబు • నెల్ల మరల. 12

తే. ధర్మమును భక్తులను గూడఁ • దన్పె, నిప్పు
డిహ పరంబుల రెండింటి • నేక గతినిఁ
బూనె, సత్యంబు నెలకొల్పె • పుడమి యందు
నెల్లరకుఁ బ్రేమమూర్తి ర • మేశుఁ డిపుడు. 13

ఉ. పూనినవాఁడు కోసలను • బూనెడి వాఁడిక వన్యరాజ్యమున్
పూనెను రాజధర్మమును • బూనెడి వాఁడిక దైవ ధర్మమున్
పూనినవాఁడు భక్తులను, • పూనెడి వాఁడిక వైరి భక్తులన్
బూనఁగలాడు రాఘవుఁడ • పూర్వముగా భువి ధర్మమంతయున్. 14

తే. భక్త భక్తుండు నీ యెడ • వరదుఁడయ్యె
యుగయుగంబులుఁ జూచెడి • యోగులైన
గాంచ నేరని పాదుకల్ • గాంచి తీవు
అవ్వె నీ శిరస్త్రాణమై • యలరుఁ గాక. 15

తే. భరత! రాజప్రతినిధిగా • వరలు మింక
పాదుకలఁ దాల్చి శిరమునఁ • బ్రజల నేలు
రాఘవుఁడు దీర్చెఁ గోర్కె న • మోఘముగను
సుప్రసన్నుండు నీకు వి • శుద్ధ చరిత
భక్తులకు రాఘవుం డొక • బంటు గాఁడె. 16

ఉ. శిష్ట వసిష్ఠమౌని యభి • షేక ముహూర్తము వెట్ట, నద్దియున్
నష్టమె యౌనె? కోసలకు • నాయకుఁ డాయెఁగదా! యిఁకన్ మహో
కష్ట లతా నికుంజ తరు • కాండము లన్నియు నేలఁగూల్చి సం
తుష్టుఁడు జానకీవిభుఁడు • దోర్బలవంతుఁడు లోకనాథుఁడౌ. 17

తే. ధర్మ విదుఁడునుఁ బ్రత్యక్ష • ధర్మమూర్తి
మీ గురుండు వసిష్ఠుఁ డ • మేయగుణుఁడు
అతని తుదిమాట ధర్మంబు • నమలమె యగు
నఖిలము, శుభంకరమ్ము స • త్యమ్ము నగును. 18

తే. రాముఁడే వచ్చి స్వయముగా • రాజ్యమూన
నాఁడు కోరెడి దేమి? యా • నాఁడుఁ గూడ
జానకీనాథు పదసేవఁ • బూను దీవు
అదియ సిద్ధించెఁ గాదె పూ • తాత్మ! నీకు ! 19

తే. ధర్మరతిఁ బ్రజ నేలెడి • ద్రఢిమ యబ్బె
శ్రీశు పదముల ఏకాంత • సేవ యబ్బె
ధన్యతముఁడవు నీవెకా • ధర్మ మూర్తి
దశరథుఁడు నేఁడు మృత జీవి • ధర్మ జీవి. 20

తే. భరత! కాలజ్ఞుఁడవు, కాక • పాదుకలను
వెంటఁ గొని పోదువే! రమ్ము • వీటి కనుచుఁ
బిలువఁ బోవుచుఁ, గాక నీ • ప్రియుని కంటెఁ
బ్రియుని పాద యుగ్మంబె కో • రితవ యేమి? 21

తే. ప్రియుఁడు వని నుండి రాడని • ప్రియుని పాద
సేవ లభ్యంబు కాదని • స్థిరుఁడ వగుచు
రాఘవ వ్యంజనాన్విత • రమ్య పాదు
కల వరించి తరింపఁగాఁ • దలఁచి నావో!
కోర్కె సిద్ధించె భరత! నీ • కోర్కె దీరె. 22

తే. ఆదినారాయణుని శంఖ • మనఁగ నీవు
చక్రమన నొప్పు శత్రుఘ్ను • సహితుఁడవయి
శిష్ట రక్షణమును, దుష్ట • శిక్షఁ బూని
రామునకు మారుఁగా నేలు • రాజ్య మింక. 23

తే. అను భరద్వాజు, భగవంతు • నాశిషంబు
లందికొని మ్రొక్కి మునికి రా • మానుజుండు
పయనమాయె నయోధ్యకుఁ • బాదుకలను
శిరమునం దాల్చి రథమున • శీఘ్రగతిని. 24

తే. దాఁటి మందాకినీ నది • దాఁటి యమున
దాఁటి భాగీరథి, గుహుని • వీటిఁ జేరి;
శృంగిబేరము విడి తన • సేనఁ గూడి
సచివ సహితుండు భరతుండు • సాగెఁ బురికి. 25

ఉ. తల్లులు మంత్రులున్ ప్రజలు • తమ్ముఁడు సైన్యము బంధువుల్ గురుం
డెల్లరు వెంట రా; భరతుఁ • డేగి యయోధ్యకు, భక్త భక్తు సం
ఫుల్ల సరోరుహాక్షు రఘు • పుంగవు పాదుకలన్ వహించి, తా
నొల్లఁ డయోధ్యనుండఁ బురి• యొప్పిదముం జెడియుండఁ జూచుచున్.

## అయోధ్య దుస్థితి

తే. పతిని గోల్పోయి, తపియించు • సతి యనంగ
నిండు చంద్రునిఁ గన లేని • నిశ యనంగ
వినుఁడు పొడ చూపనట్టి దు • ర్దిన మనంగ
పాడు వడి రూపు చెడిన, దే • వళమనంగ, 27

తే. జలము లింకి వేసంగిన • కొల ననంగ
ఆకు రాలిన పాదప • మా యనంగ
రత్న పతక విహీన హా • రం బనంగ
కాంతి నశియించి పడిన న • క్షత్ర మనఁగ
రామ విశ్లేష దుఃఖ సం • ప్రాప్తి వలన
దీనయై యయోధ్యాపురి • కాననయ్యె. 28

తే. అతుల సుస్వన గీత నృ • త్యాదు లేవి?
చంద నాగరు ధూప వా • సన లవేవి?
యాన ఘోషంబు హయ నిస్వ • నాదు లేవి?
మత్త గజ బృంహితమ్ములు • మాయమాయె! 29

తే. మనుజ సంచార హీనమై • మలిన మాయె
గుడ్లగూబల కిరవయ్యెఁ • గోటలన్ని
పగలె దిరుగాడు చున్నవి • పట్టణమున
అవియె గుడ్లగూబలు పిల్లు • లవిగొ మంత్రి. 30

తే. రామ విశ్లేష దుఃఖాగ్ని • ధూమ పటలి
అలముకొనె నొక్కొ మా యీ య • యోధ్యా పురమ్ము
సహజ సౌందర్య హీనమ్ము • చాటు చుండె
ప్రియుని నెడబాసి యుండిన • ప్రేయసి వలె. 31

తే. ఎదురు రాదేల యొక కన్య • యేని నేఁడు!
పుష్పదామ మండితయైన • పూవుఁబోఁడి
సతి యొకర్తెయు నెదురౌచు • సాగి పోదు
మంగళస్వరూపము మాసె • మాదు పురిని. 32

తే. రామ విశ్లేష దుఃఖ సం • ప్రాప్తివలన
ననుచు, భరతుండు సారథి • కపుడు; సొచ్చె
పాడువడి కాంతిహీనమై • వీడఁ బడిన
దశరథుని సౌధ రాజంబుఁ • దండ్రిఁ దలఁచి. 33

## భరతుఁడు - నంది గ్రామము

తే. తండ్రి సౌధంబుఁ గాంచుచుఁ • దనయుఁ డంత
పరమ దుఃఖితుఁడై నృప • పత్నుల నట
విడిచి, కాంచి వసిష్ఠాది • విప్రవరుల
సచివులఁ దన యభీష్టాను • సరణిఁ దెలిపె. 34

క. భరతుఁడు నంది గ్రామం
బరుగఁగ నెల్లర హితంబుఁ • బడయుచు వెడలెన్
వరగుణ శత్రుఘ్నునితో
ధర నేల వసించుచు నటఁ • దమ్మునితోడన్. 35

ఉ. ఎన్నఁడు రాఘవుండు భువి • నేలఁగ వచ్చెడివాఁడు, వాని నే
నెన్నఁడు చూచువాఁడఁ బురి • యెన్నఁ డయోధ్య, అయోధ్యయౌచు ముం
దున్న తెఱంగునన్ వర ల • హో యిట వాసముఁ జేయఁజాల, ఆ
పన్నుఁడ సర్వలోక విభు • పాదుకలే శరణంబు నా కిఁకన్. 36

తే. స్వర్ణ పాదుకాద్వయి శిర • సా వహించి
భరతుఁ డనుజునితో గూడ • పయనమాయెఁ
తేరి పై నెక్కి; మిగిలిన • వార లెల్ల
దమకుఁ దాఁ దేరు ముందుగఁ • దరలినారు. 37

తే. భరతు నుడిలేకయే సైన్య • వర్గములును
పౌరు లెల్లరు వెనువెంటఁ • బడుచుఁ జనిరి
సచివులు పురోహితుల్ గూడఁ • జనిరి యపుడె
వీడుచు నయోధ్య నెల్లరు • వెడలి రంత. 38

చ. జనకుఁడు స్వర్గ మేగె, మన • జానకినాథుఁ డరణ్యసీమకున్
జనె, నివె రాచగుర్తు గల • స్వర్ణవిభూషిత పాదుకాద్వయిన్
జనముల నేలఁ బంపె రఘు • చంద్రుఁడు, నేఁ గొని తెచ్చినాఁడ, పా
లన మొనరించుఁ బాదుకలె • రాముఁడు వచ్చెడిదాఁక రాజ్యమున్.

ఉ. రాముఁడు పాదుకల్ శుభప • రంపర గూర్పఁగ నిచ్చె *యోగమున్
క్షేమ మవశ్యమున్ గలుగఁ • జేసెడి వియ్యావి వీని కాచి శ్రీ
రాముని పాదపద్మమున • రాజిలఁ జేసి తరింతు, జానకీ
రామున కిచ్చి కోసల ధ • రన్, మనువాఁడను దాస భక్తితో. 40

తే. వంశ గురుఁడవు, రాఘవు • పాదుక లివె
చేయఁగాఁ దగు బట్టాభి • షేక మిపుడె
రామునకు మారుగా నివె • రాజ్య మేలు,
నేలు ననుఁగూడ నీ దాసు • నేలు నింక. 41

ఉ. పౌరులు మౌనులున్ సచివ • వర్యులు సర్వ చమూపతుల్ వినన్
ధీరుఁడు కైక నందనుఁడు • దెల్పఁ వసిష్ఠుఁడు సంతసించి, సం
భారము లెల్లఁ గూర్చి త్రుటి • మాత్ర సుమంత్ర పురస్సరంబుగన్
శ్రీ రఘురాము పాదుకలఁ • జేర్చెను భక్తిని సింహా పీఠమున్. 42

## పాదుకా పట్టాభిషేకము

ఉ. శ్రీయుత రామ నామము వ • చించెద రెల్లరుఁ 'పాహి, పాహి' రా
మాయ, నమో యటంచుఁ బలు • మారుగ మ్రొక్కుచుఁ బాదుకాద్వయిన్

*"యోగ క్షేమ కరే తవ."—వాల్మీకము 113. స. 12 శ్లో.

జాయని భక్తి గొల్చి రహ • పౌరులు పట్టముఁ గట్టుచుండ, నా
ప్యాయముఁగా మహోత్సవము • నందఱు గాంచిరి హృష్టచిత్తులై.

తే. జయ జయ నినాద కీర్తన • సంచయములు
స్వస్తి శ్రీరామ యను 'స్వస్తి' • వాచనములు
మంగళము రామ యని పాడు • మంగళములు
దివిజతతిఁగూడ జని నవి • దివ్యపథము. 44

శా. నందిగ్రామము కైకపుత్త్రునకు నూ•త్నా యోధ్య యయ్యెన్, జమూ
సందోహంబులు మంత్రులున్ బ్రజలు న • శ్రాంతంబు కొల్వన్ సదా
నంద ప్రాపకమై మహాశుభద పు • ణ్యక్షేత్రమై పాదుకా
మంద ప్రాభవరాజ్య మాతఁడు, వహిం • పం బూనె ధర్మార్థమై. 45

శా. ప్రాతఃకాలము నందె లేచి విధులన్ • బ్రారంభముం జేయు, సు
స్నాతుండై వర పాదుకాద్వయికిఁ బూ • జల్ సల్పి రాజ్యార్థమౌ
చేతల్ విన్నప మాచరించెడి, సదా • చేదోయిఁ గీలించుచున్
బూతాంతఃకరణ ప్రవృత్తి విను రా • ముం డిచ్చు సందేశముల్. 46

ఆ. ఎట్టి రాజకార్య • మెవరేమి చెప్పిన
పాదుకలకుఁ జెప్పు • వాఁడతండు
ఎవ్వ రెట్టి కాన్క • లెప్పు డిచ్చినఁ గాని
పాదుకల కొసంగు • భక్తితోడ. 47

తే. నిండు పేరోలగంబుండు • మండపమున
రత్న సింహాసనంబున • రాజిలంగ
పార్థివ వ్యంజనాన్విత • పాదుకలను
భద్రముగ నుంచి కొలువుండు • భరతుఁ డెపుడు. 48

తే. స్వర్ణ భూషిత పాదుకా • ద్వయికి భక్తి
సలిపి తిరుమంజనమ్ము రాత్రి • సంధ్య లందు
మూఁడు సంధ్యల ముమ్మారు • పూజ సలిపి
రామ శరణార్థి భరతుండు • రాజ్య మూను. 49

సీ. దీపంబు వెలిగించి • దివ్య పాదుకలందు
ధారణన్ శ్యామ సుం • దరునిఁ గాంచు
పావుకోళ్ళకుఁ బట్టి • పరిమళ ధూపంబు
పాపౌఘ వాసనన్ • బాయ నెంచు
గంధంబుఁ బూయుచుఁ • గనక పాదుకలకు
తొలినాఁటి అచ్యుతు • లలితుఁ జూచు
తిలకంబుఁ దిద్ది పూ • వుల నిడి పాదుక
లకు జన్మ కర్మ తె • ఱంగుఁ దలఁచు

తే. ఆత్మ నైవేద్య మర్పించి • హారతి నిడి
రామ భావ తన్మయత శి • రంబు నందు
పాదుకలఁ దాల్చి 'ధన్యోస్మి' • 'పాహి పాహి'
యనుచు భరతుండు ప్రణమిల్లు • ననుదినంబు. 50

సీ. పండిత పామరుల్ • పరమ భక్తినిఁ బాడు
రామ గీతావళీ • శ్రవణ మూను
మూఁడు సంధ్యల యందు • పొంగు చుండెడి భక్తి
శ్రీరామ చంద్రుఁ గీ • ర్తించు చుండు
ఆబాల్య వృత్తమో • అన్న చరిత్రంబు
హృదిఁ గల దాని స్మ • రించు చుండు
అభిషేక మొనరించి • అర్ఘ్య పాద్యము లిచ్చి
పాదుకార్చన సల్పుఁ • బ్రత్యహంబు
అర్పించి నిరతంబు • నాత్మార్పణముఁ జేసి
ప్రణమిల్లు శ్రీరాము • పాదుకలకు
తప్పొనరించితి • దాసుండ క్షమియించి
ప్రోవుమీ రాఘవా • ప్రోవు మనును
సఖ్య భావము వీడి • సంచరింపఁగ లేదు
సఖునిఁగా నన్నెంచి • సాఁకు మనును

అడవిలోఁ దిరుగాడి • యలసితివా యని
విసురు చామరములఁ • బ్రేమ తోడ
భక్తుండ శిష్యుండ • పరమ పావన యంచు
ఛత్రంబుఁ బట్టుచు • సంతసించు

తే. "అన్యథా శరణం నాస్తి" • యంచుఁ బలుకు
పరమ పరతంత్రుఁడౌచుఁ బ్ర • పత్తిఁ బూను
సుఖము దుఃఖమ్ము రెంటిని • జూచి సమత
రాజ్య మూనెడి భరతుండు • రాము కొఱకు. 51

తే. ప్రియుని విశ్లేష మోర్వని • ప్రేయసి వలె
నాథు రాకకుఁ జూచు న • నాథ వోలె
మధుర భావ మయుండగు • మహిత మూర్తి
రాఘవుని రాకకై వేచి • రాజ్య మూను. 52

సీ. పాదుకాద్వయి పైని • పతిత పావన రామ
పాద ద్వయముఁ గాంచు • భరతుఁ డొకట
పాదుకాద్వయి పైని • భక్త వత్సల రామ
వక్షః స్థలముఁ గాంచు • భరతుఁ డొకట
పాదుకాద్వయి పైని • ప్రకటితోజ్జ్వల రామ
వర కిరీటముఁ గాంచు • భరతుఁ డొకట
పాదుకాద్వయి పైని • బరమ సుందరరామ
వపు రుదగ్రతఁ గాంచు • భరతుఁ డొకట

తే. సకల కల్యాణ గుణమయు • జగదధీశు
త్రిభువనాధిపు నిఖిలాది • దివ్యమూర్తిఁ
బాదుకాద్వయి రూపానఁ • బరఁగఁ గనుచు
కెరలి తన్మయుఁ డగుచుండు • భరతయోగి. 53

తే. రామ తారక మంత్రంబు • రాత్రిఁ బవలు
ఆత్మ మననంబు సేయు రా • మానుజుండు
ఎదుటఁ గనుచుండు శ్రీరాము • నెపుడు, మధుర
పరమ భక్తి నతండు ప్ర • పన్నుఁ డగుచు. 54

ఆ. *కాది, హాది, సాది • వేద విద్యల రూపు
రామమూర్తి గాగ • రాత్రి పవలు
పాదుకాద్వయి పయి • భరతుండు గనుచుండు
శాంతమూర్తిగ నౌచు ని • శ్చలుఁడు నౌచు. 55

## భరతుఁడు - ప్రపత్తి సిద్ధుఁడు

జయము జయము రామా! సత్య సౌందర్య ధామా
జయము జయము రాజా • సర్వ లోకైకనాథా
జయము జయము దేవా • శాశ్వతానందసీమా
జయము జయ మనంతా • సార్వభౌమా నమస్తే. 56

ద్వి. అనుచును గెరలుచు • నాడుచుఁ బాడు
తన నాథు నెదురుగఁ • గనుచుండి సతము 57

మంగళంబో రామ • మంగళం బనును
మంగళంబో సీత • మంగళం బనును 58

భరతుండు సతత ప్ర • పత్తితో నుండు
స్థిర బుద్ధి రాముండు • చెంత నున్నటుగ. 59

## పాదుకా రాజ్యము - ప్రజలు

సీ. వేద మతస్థులై • విలసిల్లు ప్రజ యెప్డు
విహిత కర్మల సల్పు • వేదవిధిని
శ్రీరామచంద్రుఁడే • శ్రీశుండు ప్రజ కెల్ల
నిరతంబు శ్రీరాము • నే తలంత్రు

---

కాది విద్య :- శ్రీం, హ్రీం, క్లీం, ఐం, సౌః, ఓం, హ్రీం, శ్రీం, కఏలహ్రీం, ఓం, హసకలహ్రీం, సకలహ్రీం, సౌః, ఐం, క్లీం, హ్రీం, శ్రీం.
ఇది రాజరాజేశ్వరి + త్రిపుర విద్య; పల్లవములతో శ్రీనివాస విద్య = పంచాయుధములు, ఓంకారము వైకుంఠ చిహ్నము.

హాది విద్య :- శ్రీం, ఐం, క్లీం, హ్రీం, సౌః, ఓం, హ్రీం, సకహల శ్రీం, హసకలహ్రీం, ఓం సకలహ్రీం, సౌః, హ్రీం, క్లీం, ఐం.

సాది విద్య :- శ్రీం, క్లీం, ఐం, హ్రీం, సౌః, ఓం, హ్రీం, శ్రీం సకలహ్రీం, కఏఈలహ్రీం, ఓం హసకలహ్రీం, సౌః, హ్రీం, ఐం, క్లీం, శ్రీం.

"అన్నమో రామ చం • ద్రా" యన రెవ్వారు
పొట్ట కూటికి నెప్డు • పొక్క రెవరు
పాడి పంటలఁ దృప్తిఁ • బరగు చుండిరి ప్రజ
స్వీయ రాజ్యము స్వర్గ • సీమ గాఁగ

తే. ఐహిక సుఖానువర్తులై • యలరు ప్రజకు
లేదు, కొఱతేమియును, గాని • నాథుఁడైన
రాముఁ డడవి నుండుటయె కొ • అంత సతము
పాదుకా రామ, రాజ్యాన • పాలితులకు. 60

సీ. పరిపాలనోద్యోగ • వారంబులో నేరు
లంచగొండులు లేరు • రాజ్యమందు
పరిపాలనావర్గ • ప్రథమ కర్తవ్యంబు
పాలిత క్షేమంబె • పాలనమున
సత్యంబు ధర్మంబు • సంసర్గ మందెడి
పాలక పాలిత • ద్వయము నందు
అట నిరీశ్వర వాదు • లెటలేరు, భక్తిమై
సర్వేశుఁ గొల్చెడి • సకల జనము

తే. ధాత్రిజా రాఘవులె దేవ • దంపతులని
సతము వారల స్మరియించు • జనము ప్రీతి
భక్తిమై పూజలన్ సల్పి • పాదుకలకు
పాదుకా రామ రాజ్యాన • ప్రజ చరించు. 61

తే. పాదుకా రామ రాజ్యాన • ప్రభుని, విభుని,
పరము, రాఘవు, సతతంబు • భావమందు
నిలిపి, మననంబు సేయుచు • నెల్ల ప్రజలు
పరిణతిని గాంచు చున్నారు • ప్రతి దినంబు. 62

తే. అహా, చరచరావళి సర్వ • మచట, రామ
శబ్దము ధ్వని, ప్రతి ధ్వనుల్ • సల్పు చుంట
సర్వ కర్మ ఫలంబులు • సమసి పోయి
పరిణతిని గాంచు చున్నది • ప్రతి దినంబు. 63

ద్వి. మంగళంబగు గాత • మా రామునకును
మంగళంబగు గాత • మా ధాత్రిజకును 64

మంగళంబగు గాత • మా లక్ష్మణునకు
మంగళంబగు గాత • మా నాథునకును 65

శ్రీరామ జయరామ • శ్రీరస్తు రామ
మా రామ శుభమస్తు • మా రామ యనుచు 66

జయ జయ నాదాల • జనము నిత్యమ్ము
జయ గీతములఁ బాడి • శాంతి వర్ధిల్లు. 67

## ఫల శ్రుతి

ఉ. శ్రీ రఘురామ మూర్తి వనిఁ • జేరిన గాథఁ దలంచునంతనే
దీరును కష్ట సంతతులు • తేలికయౌ గృహ జీవనమ్ము, సం
సార భయమ్ము వాయు, హరి • సన్నిధికిన్ దుదిఁ జేరు వార లె
వ్వారు పఠించినన్ వినినఁ • బాయని భక్తి నయోధ్య కాండమున్.

## ఆశ్వాసాంత పద్యములు

మ. భవ బంధచ్యుత కారణంబగు మహా • భక్తి ప్రసూనాటవిన్
వివిధానేక సువాసన ప్రథితమౌ • వృత్త ప్రసూనంబులన్
భవదీయార్థము గూర్చి కావ్య గతి సం • భావించి, పూజించితిన్
భవదీయాంఘ్రుల; వాడ వీ కుసుమముల్ • భద్రాద్రి రామ ప్రభూ.

చ. భరతుని వోలె రాజ్య మిడఁ, • బ్రాపిల లే దహ రాజ్య మేమియున్
కరమనురక్తి నీ కిడితిఁ • గా హృదయాంతర సీమ యెల్ల, నీ
పర మొనరించినాడ హృది • వాక్కును గర్మయు, సంతతంబు నీ
వరగుణ సంస్తవంబు నెడఁ • బాయను నిర్మల బుద్ధి రాఘవా. 70

మ. జనకుం డిచ్చిన భాగ్యమెల్ల నిజ దే • శ క్షేమ సంరంభినై
ఘనుఁ డా గాంధి మహాత్ము శిష్యుఁడుగఁ గైంకర్యంబుఁ గావించితిన్
జననీ దత్తము దివ్య విద్య యొకచే • స్వాధీన మందుండె, దా
నిని నీ యంఘ్రుల చెంత నుంచితి కదా • నేనింక నే మిచ్చెదన్. 71

తే. చంప కోత్పల మాలల • సరస గతిని
నీదు మెడవైచి కొల్చితి • నిర్మలాంగ

గీతముల నీదు నామంబుఁ • గీర్తిఁ జేసి
కందముల నారగింపుగా • విందు నిడితి. 72

తే. క్రూర శార్దూల మత్తేభ • వారములను
జనువుఁ జేసితి నీ పద • సన్నిధి నిడి
ఆ సుగంధి మయూరాళి • నాటవెలఁది
గాగ నృత్యంబుఁ జేయింపఁ • గలిగి నాఁడ. 73

తే. సలిపితి సహస్ర నామార్చ • నల వినూత్న
1 పద్య పుష్పాల నినుమారు • పరమ భక్తి
నీ మహా కావ్య మందున • నీరజాక్ష
తృప్తిఁ గనినావొ లేదొ సం • తృప్తిఁ గనుము. 74

తే. తొంబదియు నాల్గు నిమ్నాలు • తోడఁ గలిపి
2 పద్య, సుమ దక్షిణయుఁ గూడ • వరలు నిందు
యింత కంటెను వేరేమి • యీయఁ గలను ?
ఏను నీ వాఁడ, నా వాఁడ • వీవు రామ. 75

తే. రామ తారక మంత్రాక్ష • రంబు లారు
3 అన్ని పద్యాల కూడిక • యైన సంఖ్య
నమరె, నాశ్వాసములు గూడ • నారు గాగ
నే షడక్షరి శిరసావ • హించి నాఁడ. 76

క. తలఁచుమనె సుఖ దుఃఖంబులఁ
గలనైన జయాపజయము • కలిమిన్ లేమిన్
వలగొను భక్తిఁ బ్రపన్నుఁడు
తల పోయును నీదు చెయ్దిఁ • దాల్మిన్ గర్మన్. 77

సీ. పాదుకా ద్వయి నిచ్చి • భక్తునిఁ దమ్ముని
భరతుని సంతృప్తి • పరచి నావు
సత్యసంధాతవై • జనకుని భక్తుని
సేవించి తరియింపఁ • జేసి నావు

---

1 ఇనుమారు సహస్రనామార్చనలు = 2016 } పద్యముల దక్షిణ
2 తొంబదియు నాల్గు నిమ్నాలు గలిపి = 294 }
3 మొత్తము పద్యముల సంఖ్య 2310 = 6-తారక సంఖ్య

ఏకాంత సేవఁ బ్రా • ప్తింపఁగాఁ జేయుచు
సౌమిత్రి భక్తుని • సాఁకి నావు
నిత్య సపర్యల • నెమ్మిమై గైకొని
జనకజా దేవిని • దనిపి నావు

తే. గుహు, భరద్వాజుని, సుమంత్రుఁ • గూడి కూడి
భక్త వర్యుల సంతుష్టి • పఱచి నావు
నీకె చేమోడ్చి శిరమున • నీ పద ద్వ
యమ్ము వహియించు నన్నెటు • లనునయింతు ? 78

శా. దివియో భూమియొ లేక ఆ నరకమో • దేనిం బ్రసాదించినన్
భవదీయేచ్ఛమెయిన్ వసించెద నటన్, • "భద్రాద్రి రామా" యటం
చవరోధం బిసుమంత లేకయె. సతం • బాత్మాను సంధానమున్
స్తవమున్ సల్పెడి దీక్ష మాత్ర మిడుమా • దాసుండ నే రాఘవా. 79

తే. అర్థ మారోగ్యమును నిచ్చి • అతుల శాంతి
నిచ్చి నను బ్రోచి యీ కావ్య • మింత వఱకు
వ్రాయఁగాఁ జేయవే రామ • భక్త వరద
నిన్నె శరణన్న భక్తుఁడు • నెన్నఁ గనఁడొ ! 80

సీ. దీపంబు ముట్టించి • దీపించు నిన్ గందుఁ
గందోయి కెదుట సా • క్షాత్కరింప
అర్ఘ్య మర్పించెద • ఆగామిఁ దరుమఁగ
నిన్ జేరి తరియించు • నియతిఁ గాంచ
పాద్యమ్మిదే కొమ్ము • భక్త సంరక్షకా
సంచి తాఘచయమ్ము • సమసి పోవ
కుంకుమ బొట్టిదే • కొంకక బెట్టెద
నీ తత్పరత్వమ్ము • నిలిచి యుండ
వికసిత పుష్పంబు • ప్రేమతో మూర్ధాన
నర్పింతు సకల మీ • వనుచుఁ దలఁచి
చందన మలఁదుదు • జల్లని చూడ్కుల
భవతాప బాధలు • పారి పోవ

ధూపంబు వేయుదుఁ • దొలగంగ నా మేని
సంచిత వాసనా • సంచయమ్ము
ఇడుదు నై వేద్యమ్ము • హృదయార్పణమ్ముగా
నన్యుల దరిఁబోవ • ననుచుఁ బలికి
ఘమ ఘమల్ ప్రసరింపఁ • గమ్మని తాంబూల
మిదె నీకు కొమ్మింక • హృదయ నాథ

తే. రామ, జానకీ రామ, నీ • రాజనమ్ము
గొనుము నిరతమ్ము నిన్నిట్లుఁ • గొలుచు వాఁడ
సతత పావన పాదుకా • ద్వయికి మ్రొక్కి
వాని శిరసావహింతు స • ద్భక్తి తోడ. 81

తే. స్వర్ణ భూషిత పాదుకా • స్వర్ణ రజము
మూర్ధమునఁ జిందఁ దలఁ దాల్చఁ • బోను వాని
పరమ పావన రాఘవ • పాదరజము
కొఱకు నవ్వానిఁ దలఁదాల్చఁ • గోరు వాఁడ. 82

ద్వి. శ్రీ పాద తీర్థంబు • సేవించుచుంటి
ఏ పాప మెఱుఁగక • యినవంశ జాత. 83

సీ. ఆది మహాలక్ష్మి • అనురాగ ముదయింప
బత్తిమై నొత్తెడి • పాదయుగము
మౌని బృందము లెల్ల • మహనీయ, తప మెల్ల
ఫలియింప నర్చించు • పాదయుగము
భక్తరక్షణ దీక్షఁ • బ్రభవించి, యిలనున్న
పతితపావన మృదు • పాదయుగము
పామరుల్ పండితుల్ • పాలితుల్ పాలకుల్
సోదరుల్ తలఁదాల్చు • పాదయుగము

తే. మైథిలీ కన్య హృది నిల్పు • పాదయుగము
పాదుకా న్యాస మూనిన • పాదయుగము
ప్రమదమున నున్న రాము, శ్రీ • పాద యుగముఁ
గడిగి తలదాల్తు నిరతమ్ముఁ • గంకణముల. 84

శా. వేదోద్యాన వనీ విలాస సుమనో • విద్యా ప్రపూర్ణంబులై
వేదంబుల్ శిరసావహించిన మహో • విద్యా ప్రదీప్తంబులై
పాదన్యాస మహోప్రభా విభవముల్ • పాదద్వయీ పాదుకల్
మోదం బీయవె! యీయవే కొలువఁగా • మోక్షంబునున్ రాఘవా.

సీ. సర్వోపనిషదర్థ • సకల స్వరూపంబు
శ్రీనివాసంబుఁగాఁ • జెలఁగు దీవ
భక్త శిరస్త్రాణ • పరిధవ శ్రీరాజ
రాజేశ్వరీ మంత్ర • రాజ మీవ
భువనైక మోహన • మూర్తి శివంకర
త్రిపురసుందరి దివ్య • తేజ మీవ
మొదలు తుదయు లేక • చదల కతీతమై
నిత్యమై యఖిలమౌ • సత్య మీవ

తే. పాదుకా రామ భక్త సం • ప్రాప్య రామ
పాదుకా రామ మౌని హృ • ద్ధ్యాస రామ
పాదుకా రామ శ్రీరామ • పరమ రామ
పాహి మాం పాహి, పాహి, తు • భ్యం నమోస్తు. 86

ఉ. ఇంతలు కన్నులుండ ఫల • మేమి? కృపార్ద్రవిశేష దృష్టి ర
వ్వంతయు నా పయిన్ బరుప • వాయె సరోజ దళాయ తాక్ష! వ
క్షోంతర సీమ నన్ మనుప • జూడ వదేల మహా స్సువక్ష! కా
సంత ప్రయోజనమ్ము కల • దా? యుర మింతటి పెద్దదయ్యునన్.

ఉ. జానువు లంటు బాహువులు • చాల బలిష్ఠములే, అరిక్షయం
బూనఁగఁ జాలు; వాని ఫల • మున్న దె? నా సహజారిషట్కమే
మేను దహించుచున్నది సు • మీ! చలియింపవు నీ సుబాహువుల్
కానని యట్లు; చేతులిక • కాయము దాల్చిన సుందరాంగముల్. 88

ఉ. మురియుదు గాక నీదు నగు • మోముఁ దలంచుచు నీకె నీవు నీ
సరసిజ జైత్ర నేత్రము ల • సామ్యము లీ భువి నంచు, సీత లో
మురిసెడు గాక, ఏరి కవి • పూజ్యము లౌ? పతితాపనమ్ములై
వరలెడి పాదముల్ పరమ • పావనముల్ స్తవనీయముల్ గదా. 89

చ. సిరి కిటు ప్రక్క నున్న తుల • సీ దళ దామముఁ జూచి చూచి, నే
మురియుచు నుందుఁ, గాని పెడ•మోమును బెట్టెద దానిఁ జూచి, ఏ
మరను, త్వదీయ పాదయుగ • మంజుల సుందర దివ్య సేవకున్
సరియగు నెద్ది! నీ తనువు • చక్కని యంగము లందు రాఘవా. 90

చ. పరమ మరీచి పుంజము ల • పారముగా బ్రసరించుచున్ దివా
కరునకు పూర్ణచంద్రునకు • కాంతి నొసంగుచు, దీప్తి మంతమై
యురమున వెల్గు నీ మణి న • యోచితరీతిగఁ జూచి చూచుచున్
మఱవఁగఁ జాల నీ మహిత • మానిత సుందర దివ్య పాదముల్. 91

చ. కరముల, శిష్ట రక్షణకుఁ • గ్రాలు మహో గుణ శంఖ చక్రముల్
వరలుచు నుండ, ముందు, కను • పండువుగా గనకుండ నుంట, నా
తరమె? కనుంగవల్ కనియు • దక్షణమే శిర మల్లె వంచి, నీ
చరణము లంటి నిల్చి, పద • సారస భృంగము లౌ మదీక్షికల్. 92

మ. పరమున్, వ్యూహము, వైభవంబు వళులన్ • బ్రత్యక్షమౌ చుండె నీ
చిరు బొజ్జన్ త్రిపురంబు లుండెనొకొ? ఆ • చిహ్నంబుగా నుండె నా
సరిగా మూఁడు వళుల్ కడున్ మురిపెముల్•సాయించు సేవన్ విడన్
దరమా? కాని, సమంబె నీదు పద సౌం• దర్యంబుతో రాఘవా. 93

ఉ. ఇంతటి తీపి 'రామ' యన • నెవ్వరు చెప్పగలారు, దేహ మిం
తింతగ సుందరం బనుచు • నెవ్వరు వర్ణనఁ జేయఁ జాలు, వా
రంతకు నంత కెచ్చు చర • ణాబ్జ సుధామధుర స్రవంతి నే
నెంతటివాఁడఁ దెల్పఁగఁ ద • దేకమతిన్ రుచిజూతు నంతియే. 94

ఉ. సోయగ మింత యింత యని • సుందర నీల తనూ విలాసమున్
వ్రాయఁ గలాడనా? పరమ • పావన పాద విలగ్నదృష్టి నే
బాయకయుంట, నవ్వి, విభ • వ ప్రతిభాతిశయంబులంచు నే
మో యనఁజాలువాఁడ గృపఁ • బూనుము నాయెడ భక్తవత్సలా.

ఉ. సొమ్ముల నీయ వేడ, మరి • సొత్తుల నేమియు గోరలేదు నా
కి మ్మిది యంచుఁ గోరను సు • మీ, మరి దేనిని; ఆయు విచ్చినన్
కమ్మని నీ కథా విమల • కాండలఁ దక్కినవానిఁ గూడ, లో
కమ్మున కీయనెంతు మృదు • కావ్యగతిన్ భవ దిచ్ఛయైనచో. 96

ఉ. మెల్లఁగ నీ తనూ విభవ • మే కనుమూసియు విప్పి గాంచుచున్
గొల్లఁగ నీ కటాక్షమునె • కోరుచు నీ పదసన్నిధానమం
దుల్లము నుంచి, జీవిత మె • టో కొనసాఁగఁగఁ జేయుచుంటి నో
సల్లలితాంగ! నన్నెటుగ • సాఁకెదొ, సాఁకు, త్వదిచ్ఛ చొప్పునన్. 97

చ. స్థిరమతి నీదు పాద సర • సీరుహ సన్నిధి దృష్టి నిల్పి, నే
నరయుదు దివ్యమంగళ మ • హోగుణ పూర్ణ విరాట్స్వరూపమున్
బరమ పదంబు ముక్తజన • వాసము త్వత్పదసీమ, రాఘవా!
వరగుణ జానకీపతి! కృ • పామతి నిమ్ము త్వదంఘ్రి దృష్టినే. 98

క. నీ పాదాంబుజ సేవయు
నీ పాదార్చన సుకృతియు • నెమ్మిన్ సతమున్
భూపకులాగ్రణి పాదుక
ప్రాప్తింపఁగఁ జేయుఁగాక • భక్తుల కెలమిన్. 99

మ. పరమ ప్రేమము రూఢియై దనరు నా • భక్తుండు, తద్రూఢుఁడై
పురుషుం గాంచఁ గలాడు సిద్ధుఁ డమృతంబుం బొంది తృప్తుండునై
వరముల్ గోరఁడు ద్వేష దైన్యముల సం • భావింపఁ డెప్పట్టునన్
బరమేశార్థము దప్ప స్వార్థము లయంబౌ వానిలో రాఘవా. 100

చ. తన తను వా పరాత్పరు ప • దాబ్జ సమీపమునందు నుంచి ఆ
తని పరమార్థ శాసన వి • ధానము నెప్పుడు దాఁటకుండ ఆ
త్మను సత మా పరేశ్వరుని • ధారణ సేయు చనన్య వృత్తి నుం
డిన మనుజుండె భక్తుఁడు చలింపని సిద్ధుఁడు వాఁడె రాఘవా. 101

చ. పనివడ వాగమోక్తము లు • ప్రాకృత వృత్తులు కావె యవ్వి ని
త్యునిఁ దలపోయు భక్తునకుఁ, • దుష్టియుఁ బుష్టియు నిచ్చి దేవ చిం
తన మమృతంబుగాఁ దనరు, • దైన్యము ద్వేషము దూరమౌచు భ
క్తుని కిల సిద్ధి గల్గుచు న • కుంఠిత వాంఛలు వోవు రాఘవా. 102

ఉ. భక్తి జనించునే పరమ • పావన నీ దయ గల్గకుండ? స
ద్భక్తి సుసాధమా? విమల • భక్తియె సాధన మెంచ భక్తికిన్
భక్తి వినా మఱేదియును • భక్తికి మూలముగాదు, భక్తి సం
సక్త మనంబు గాంచెడి, ని • సర్గముగాఁ దుదకున్ బ్రపత్తినిన్. 103

చ. అతులిత భక్తి గల్గునె మ • హాత్ముల సత్కృపయైన లేక యే
పతితుఁడు వీడునే విషయ • వాంఛల, వీడి ముముక్షువౌనె, యీ స
ద్గతి యతఁ డెంచునే? భజన • తత్పరుఁడౌనె? హరి ప్రకీర్తనన్
మతి రహి నొందఁ జేయునె? వి • నం దలపెట్టునె దివ్యనామముల్?

ఉ. ఆరయఁ జేరు టెట్లు సుమ • హాత్ముల సన్నిధి? చేరునంతనే
వారి ప్రసాద మబ్బునొకొ • వారి దయామయ సాధు సంగతిన్
గోరిన మాత్ర లభ్యమొకొ • కూర్మిని నీవ యనుగ్రహింపకే
వారల పొందు ప్రాప్తమయి • భక్తి లభించునె, భక్తవత్సలా! 105

తే. ఎపుడొ అవ్యాజ కృపఁబూని • యీవె రామ
భక్తిబీజంబు నాఁటగా • వలయు హృదిని
అదియ వృక్షంబుగా పెంపు • నందు నట్లు
నీవ యాశీస్సు లిడి జీవిఁ • బ్రోవవలయు. 106

ఉ. నాయన రామచంద్ర! రఘు • నాయక! నిన్నిక! వేడి వేడగా
నాయువు చాలదేమొ! కరు • ణాకర? వేరొక జన్మ మెత్తి, నిన్
బాయఁ దలంచ, నీ పుటుక • *వద్దిక నీదు విరోధి నైనచో
సాయుధపాణి వౌచు నను • సాఁకెదవా? తుదముట్ట పుట్టుకల్. 107

శా. నా మాటన్ మర పొందినన్ సరె! రమా • నాథా! త్వదీ యాశ్రిత
క్షేమంబైన దలంపవా? మునుల ని • క్షేపాద్రి శీతాద్రి నీ
ధామంబే! భవదీయ జన్మ మిట గా • దా? దుష్టచైనీయు లో
రామా దాడి యొనర్చినారలుగదా? • రక్షింపుమీ భారతిన్. 108

## మ ం గ ళ ము

చ. గురుని యనుజ్ఞ సాఁకు గొని • కొండల గుట్టలఁ బట్టియున్న శ్రీ
వరునకు, జానకీ రమకు, • భక్తి సహోదరు వెంటనున్న సో
దరుఁడు సుమిత్రనందనుఁ డు • దారుఁ డనంతునకున్ సదా శుభం
కరమగు గాత సాధు జన • కల్పకమై వనవాస మెల్లడన్. 109

*వద్దు. పూర్వకవి ప్రయోగములు. చూ. పే. 301. ఆ. భా.

ఉ. మానవ మాత్రుఁ డీతఁడని • మానవకోటి తలంచు రీతిగా
జానకిఁ గూడి, తండ్రి నుడి • సత్య పరాక్రముఁ డౌచుఁ దీర్పగా
మౌని జనాశ్రయుం డగుచు • మౌని జనాశ్రితుఁ డౌచు ధ్యేయుఁడై
కానన సీమనుండు రఘు • కాంతున కెప్పుడు మంగళం బగున్. 110

ఉ. మంగళమౌ అనంతునకు • మంగళమౌ వర దాతకున్ సదా
మంగళమౌ నరాధిప కు • మారులకున్ జనకాత్మ జాతకున్
మంగళ మౌత భద్రగిరి • మా కృతి భర్తకు రామమూర్తికిన్
మంగళ మౌత శ్రోతలకు • మంగళ మయ్యెడి భక్తకోటికిన్. 111

ఇది శ్రీ వసిష్ఠ శక్తి పరాశర త్ర్యార్షేయ పరాశరగోత్ర పవిత్ర సుభద్రా వేంకట
కృష్ణమాచార్య పుత్త్రిందును; మహాత్మాగాంధీ చరిత్ర – భారతదేశ ఆర్థిక
చరిత్ర – భారతీయ రాజ్యాంగ చరిత్ర – శ్రీ గోవింద రామాయణము –
ఉత్తర రామ చరితము, శ్రీ గోవింద రామాయణము – సీతా
రామము యిత్యాది కావ్యకర్త ఆత్మకూరి గోవిందాచార్య
విరచిత గోవింద రామాయణ మహాకావ్యమునందు,
గోవిందరామాయణము – పాదుకా పట్టాభిషేకము
అను మూఁడవ కావ్య మయోధ్యా
కాండము సర్వము సమాప్తము.
శ్రీ సీతా రామార్పణమస్తు
శ్రీ శ్రీ శ్రీ

# తప్పొప్పుల పట్టిక

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 14 | : : | foot note | త్వదిపయక | త్వద్విషయక |
| 16 | 97 | 1 | కట్టి | ఇట్టి |
| 16 | 103 | 1 | భక | భక్త |
| 18 | 111 | 3 | బ్రదతుణించి | బ్రదకుణించి |
| 24 | 21 | 1 | పుటుక | పుట్టుక |
| 24 | 21 | 2 | డెచ్చొటు | డెచ్చోటు |
| 27 | 48 | 4 | తుణమే | యీ తుణమే |
| 28 | 50 | 1 | మొదగ | మొందగ |
| 28 | 55 | 4 | రాజ్య | రాజ్యమే |
| 29 | 58 | 3 | దలపోయుటో | దలపోయుటో |
| 31 | 73 | 1 | వస్త్రమున | వస్త్రము |
| 31 | 78 | 2 | విడవకుము | విడువకుము |
| 32 | 79 | 1 | సహింపప | సహింప |
| 33 | 88 | 3 | రాజహంస | రాజహంసి |
| 35 | 101 | 3 | చారుల | చారుని |
| 35 | 101 | 3 | వారె వీరలా | వాడె వీడగున్ |
| 36 | 105 | 3 | రజిత | రజత |
| 37 | 116 | 1 | పద్మహస్త | హస్త పద్మ |
| 38 | 121 | 2 | పదేశమంత | ప్రదేశమంత |
| 43 | 153 | 3 | ? | అతని |
| 43 | 154 | 4 | దబ్బరమాడ | దబ్బరయాడ |
| 44 | 161 | 1 | వో | నో |
| 44 | 164 | 4 | ధీశ్వరు | దీశ్వరు |
| 45 | 166 | 4 | కైకరో | కైకరో |
| 47 | 179 | 4 | చలింప | త్యజింప |
| 47 | 180 | 4 | నా బిడ్డకున్ | నా పట్టికిన్ |
| 51 | 205 | 3 | డందునా | డందున |
| 52 | 214 | 2 | నోరెట్లాడెనో | నోరెట్లాడెనో |
| 53 | 224 | 2 | కృష్ణాజనమున్ | కృష్ణాజినమున్ |
| 55 | 234 | 1 | న్మము | నమ్ము |
| 56 | 239 | 3 | చైదు | చెద్దయు |
| 58 | 253 | 1 | హృది | హృద్వి |
| 59 | 261 | 2 | కాముకుండు | కాముకుండును |
| 59 | 265 | 4 | వరద | వరద నీ |
| 61 | 3 | 3 | నయోధ్య | యయోధ్య |
| 62 | 11 | 3 | నెమ్మోము నుంచ జింతించువారు | నెమ్మోముపై నెగడువారు |
| 64 | 19 | 1 | వసిషు | వసిష్ఠు |
| 65 | 29 | 3 | యతడె | నతడె |
| 67 | 42 | 1 | స్వర్ణ | హేమ |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 67 | 42 | 2 | వర్ణపు | వర్ణ |
| 67 | 43 | 4 | గేకయీ | గైకయీ |
| 68 | 45 | 3 | నుడి | నుడిని |
| 69 | 52 | 3 | ద్యుతునిన్ | ద్యుతినిన్ |
| 73 | 79 | 2 | వాడ వెనుక | వాడను వెను |
| 73 | 82 | 4 | నపుడే | యపుడే |
| 74 | 90 | 4 | వాక్యను | వాక్పరి |
| 75 | 94 | 3 | యేగ | యేగు |
| 80 | 127 | 2 | బడ | బడు |
| 80 | 127 | 3 | నటుగ | యటుగ |
| 83 | 156 | 4 | సుమిత్రాంబయున్ | సుమిత్రాంబలున్ |
| 84 | 165 | 2 | నడు | యడు |
| 84 | 166 | | ధర్మవేద్యుండు | ధర్మవీరుండు |
| 86 | 175 | | బూనఁడు నిస్పృహ లేనివాఁడు | బూనఁగ లేనివాఁడు |
| 87 | 186 | 2 | నాతఁడు | యీతఁడె |
| 88 | 195 | 4 | రుచిరవిహీనుఁడై | రుచిపరిహీణుఁడై |
| 90 | 207 | 3 | పూన్క | పూన్కి |
| 91 | 210 | 2 | బొనరింతురు నట్టి | బొనరించెద రట్టి |
| 91 | 214 | 4 | నెదురంచు | యెదురంచు |
| 91 | 216 | 1 | సక్తుడున్ | సక్తుడన్ |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 93 | 228 | 2 | నాశీస్సు | యాశీస్సు |
| 95 | 239 | 1 | చాములున్ | చేమలున్ |
| 96 | 241 | 1 | శిశ్రూష | శుశ్రూష |
| 100 | 264 | 2 | పదకరమౌ | పదకిరవౌ |
| 100 | 267 | 1 | కైక యీ | కైక తా |
| 101 | 271 | 4 | దెప్పట్టునన్ | దప్పట్టునన్ |
| 102 | 281 | 2 | వశవర్తినై | వశవర్తితన్ |
| 105 | 295 | 3 | పంకిలమగ్నమౌ | పంకిలానిలమైన |
| 114 | 360 | 4 | విమలవృత్తి | నిర్మలమతి |
| 115 | 362 | 4 | వనికి | వనికి నే |
| 116 | 371 | 4 | స్వరూప! | స్వరూప! యో |
| 121 | 412 | 4 | ప్రజలు | ప్రజయు |
| 122 | 416 | 1 | ఁబెట్టి | నిడిన |
| 123 | 426 | 1 | మహా | మహో |
| 123 | 427 | 1 | పోయదో | పోయెదో |
| 124 | 428 | 1 | పోయదో | పోయెదో |
| 124 | 429 | 1 | నేర్వ | నేర |
| 124 | 430 | 2 | ఎప్పుడో | ఎప్పుడో |
| 124 | 431 | 1 | మది | విధి |
| 124 | 431 | 1 | కైవశుండ | కాలవశుఁడ |
| 124 | 431 | 4 | నాశిని | నాశని |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 127 | 449 | 4 | నను | వను |
| 129 | 469 | 2 | ఋతంబు | రుతంబు |
| 129 | 472 | 2 | యంచెల్లనిండె | చెలగెనం దెల్ల |
| 131 | 480 | 2 | ఁగూడఁబోవు | ఁబోవు వారు |
| 131 | 482 | 3 | కాననసీమగా | వనసీమగా |
| 131 | 482 | 4 | విను నాఁమాట | మారు |
| 133 | 498 | 4 | నత్తకు | యత్తకు |
| 134 | 500 | 1 | శాంతమై | శాంతిమై |
| 138 | 530 | 4 | కరము | కేలు |
| 138 | 530 | 4 | గడుప | గెంట |
| 139 | 535 | 2 | జన్యుఁడవయ్యుఁ గర్మ | జన్మము గల్గి కర్మ |
| 139 | 535 | 4 | అసమాన్య | అసమాన |
| 145 | 36 | 3 | జూతు | జూతుమే |
| 146 | 40 | 4 | ప్రసన్న | ప్రపన్న |
| 146 | 41 | 4 | జీవశ్చ | జీవచ్చ |
| 146 | 43 | 2 | పురజన | ఁబురజన |
| 149 | 63 | 2 | రంజితు | రంజకు |
| 150 | 67 | 3 | దృపి | దృష్టి |
| 151 | 78 | 4 | కనులు | కనుల |
| 152 | 79 | 4 | గోలి | గోలు |
| 157 | 116 | 2 | సంతసము | సంతతము |
| 158 | 123 | 3 | కుంమనె | కుండునె |
| 159 | 125 | 4 | వంశజుండు | సంభవుండు |
| 159 | 127 | 3 | నిగ్వర | యిర్వుర |
| 159 | 129 | 2 | నిశన్ | నిశిన్ |
| 159 | 130 | 1 | జాము | జోము |
| 160 | 132 | 4 | హా | హా |
| 160 | 133 | 4 | హా | హా |
| 160 | 134 | 3 | తేరు | ఁదేరు |
| 161 | 143 | 2 | రతుకుండు | దీక్షితుండు |
| 163 | 154 | 2 | వనిలో | వనిని |
| 164 | 161 | 1 | సుఖాస్పద | సుఖంబులు |
| 165 | 167 | 1 | నా (శ్రీ) | నా |
| 166 | 172 | 2 | ఖండలసుంద | ఖండమనోహ |
| 167 | 180 | 4 | సు | సం |
| 167 | 182 | 1 | ననుచు | అనుచు |
| 167 | 184 | 2 | దూలి | దూటి |
| 168 | 184 | 4 | రాగమయులు | రాగమయులు |
| 170 | 205 | 3 | యాననున్ | యానతిన్ |
| 175 | 240 | 3 | కాతుంఁడు | కాంతుఁడు |
| 178 | 260 | 1 | బ్రతుకునా | మనుదురే |
| 178 | 262 | 4 | మడగి | మణగి |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 179 | 284 | 2 | మఱలి | మఱి |
| 184 | 305 | 4 | స్నేగ | స్నేగు |
| 184 | 305 foot note | | లిప్యథః | లిప్సుభిః |
| 190 | 314 4 వ పంక్తి foot note | | యద్భి | యుర్భి |
| 194 | 375 | 3 | వాల్మీకుని | వాల్మీకిని |
| 196 | 386 | 2 | మహాదా | మహితా |
| 196 | 391 | 2 | రాట్ | రాడ్ |
| 199 | 409 | 1 | పవిత్ర | పవిత్రి |
| 203 | 436 | 3 | డనచు | డనుచు |
| 203 | 439 | 2 | తత్పరత | తత్పర |
| 203 | 440 | 3 | తవ్యము | తవ్యత |
| 203 | 440 | 4 | రుచిరా | సుషమా |
| 204 | 449 | 4 | యా్రశు | నా్రశు |
| 205 | 451 | 2 | దుస్తర | దుర్ఘట |
| 205 | 455 | 1 | గద్గది | గాద్గది |
| 205 | 455 | 3 | సంభ్రమంబును | సంభ్రమంబునున్ |
| 208 | 475 | 2 | అందఱి | అందఱు |
| 213 | 509 | 1 | వికసా | వికచా |
| 216 | 530 | 4 | మృత | మృతి |
| 219 | 552 | 4 | యేనినేనియేన్ | ఎంతవానినేన్ |
| 221 | 565 | 3 | మాయనో | మాయెనో |
| 223 | 576 | 2 | తల్లి | ‹దల్లి |
| 223 | 577 | 2 | వహా | వహా |
| 224 | 582 | 2 | మాన | మూన |
| 224 | 583 | 4 | మదేదో | మదేరిదో |
| 224 | 584 | 4 | దిక | దింక |
| 225 | 588 | 2 | తేజసున్ | తేజునిన్ |
| 225 | 589 | 1 | గాల | గాల్వ |
| 226 | 599 | 1 | తే. | చ. |
| 226 | 601 | 3 | వెన్నాకడి | వెన్నాడి |
| 230 } 232 } | 612 } 623 } | 4 | ము | మ |
| 233 | 635 | 1 | అస్తి | అస్థి |
| 237 | 658 | 7 | వాసన | వాసనా |
| 242 | 22 | 2 | డతనికి | డతనికిం |
| 243 | 34 | 4 | అని | అన |
| 245 | 44 | 4 | బరమ క్తి | బరమభక్తి |
| 246 | 51 | 3 | మృణ్మయ | మృన్మయ |
| 247 | 56 | 2 | విలీల | నిలీన |
| 248 | 60 | 1 | బరఁగు | బడిరి |
| 254 | 100 | 1 | శ్వశిత | శ్వసిత |

# శ్రీ గోవింద రామాయణము

## అచ్చు వేయించిన దాతలు

## శ్రీ గోవింద రామాయణము-ఉత్తర కాండము

ఉత్తర కాండము :—ముడింబి అనహరాచార్యులు గారు, రామానుజపురము, పోలవరం తాలూకా, ప.గో.జిల్లా; కాగితమునకగు వ్యయమునంతయు భరించిరి.

అచ్చు :— కీ॥ శే॥ ఈదర వెంకయ్యగారు, ఏలూరు—తమ రామా అందుకోలో ఉచితముగా అచ్చువేయించి, బైండు చేయించి యిచ్చిరి.

కృతి సమర్పణము : భద్రాచలంలో శ్రీరామునకు కృతి యిచ్చుటకై అయిన వ్యయము నంతయు శ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావు గారు M. L. C. భరించిరి. (పిప్పర, పశ్చిమ గోదావరి జిల్లా).

## గోవింద రామాయణము-సీతారామం (బాలకాండ)

1. డాక్టర్ శ్రీ శ్రీరంగం సుబ్బారావు గారు, సికింద్రాబాద్. రు. 200—0—0
2. శ్రీ శ్రీనివాస సోదరులు, అజంతా ప్రెస్సు, సికింద్రాబాద్. రు. 150—0—0
3. కీ॥ శే॥ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు గారు రు. 116—0—0
4. శ్రీ అక్కినేపల్లి జానకిరామారావు గారు రు. 100—0—0
5. శ్రీ బుర్రా వెంకట సుబ్బారాయుడు గారు M.A.B.L. రు. 100—0—0
6. శ్రీ కుప్పా వేంకట శేషాచలపతి గారు, బెజవాడ. రు. 50—0—0
7. శ్రీ బెల్దె జగదీశ్వరయ్య శ్రేష్ఠిగారు, సికింద్రాబాద్. రు. 50—0—0
8. గోల్కొండ పత్రిక వారు ప్రెస్సు బిల్లును జమ కట్టుటకు సొమ్మును అడ్వాన్సు చేసి తోడ్పడిరి.

## సీతారామం ఆవిష్కరణ

ఆంధ్ర సారస్వత పరిషత్తు (బొగ్గులకుంట, హైదరాబాదు) ఆధ్వర్యమున పరిషత్తునందు ఆవిష్కరణ మహోత్సవము గావించిరి. ఈ సభకు, కీ॥ శే॥ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, అధ్యక్షత వహించిరి. శ్రీయుత ప్రొఫెసరు మామిడిపూడి వెంకట రంగయ్యగారు కావ్యావిష్కరణ మొనరించిరి. శ్రీయుతులు, డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు, డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు, ప్రొఫెసరు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, చెలంచెర్ల రంగాచార్యులుగారు, ముదిగొండ వీరభద్ర మూర్తిగారు, కీ॥ శే॥ మల్లిపూడి పళ్లంరాజు గారు (మంత్రి), కొవ్విడి లింగరాజుగారు, కావ్యమును ప్రశంసించిరి. పలువురు పండితులు విద్యావంతులు సభ నలంకరించిరి. ఆవిష్కరణోత్సవమును, జయప్రదముగా పరిషత్తు కార్యదర్శి దేవులపల్లి రామానుజరావుగారు నిర్వహించిరి. వీరందఱకు కృతజ్ఞుడను.

3—911/1 ఖయిరతాబాదు.
హైదరాబాదు. 4

ఆ. గోవిందాచార్యులు.

నాగేంద్ర ప్రింటింగ్ ప్రెస్, మహంకాళి స్ట్రీట్, సికింద్రాబాదు. ఫోన్ నెం. 72276